బి. ఏ.

సంఘ సంక్షేమ శాస్త్రము

# భారతదేశంలో సంఘ సంక్షేమ సేవలు



తెలుగు అకాడమి ప్రచురణ (బి. ఏ.) - 113



# భారతదేశంలో సంఘ సంక్షేమ సేవలు

రచయితలు

శ్రీమతి కె. సీతారాం, ఎమ్. ఎ.,

సంఘ సంక్షేమ శాస్త్ర శాఖాధిపతి, విశాఖ స్త్రీల కళాశాల, విశాఖపట్నం.

శ్రీ యస్. గోకులదాస్, ఎమ్. ఎ.,

సంఘ సంక్షేమ శాస్త్ర శాఖాధిపతి, మహారాజా కళాశాల, విజయనగరం.

సంపాదకుడు

ఆచార్య ఎమ్. లక్ష్మీపతిరాజు,

ఎమ్. ఎ., ఎమ్. యస్. డబ్ల్యు., పిహెచ్.డి.,

సంఘ సంక్షేమ శాస్త్ర శాఖాధిపతి & సంచాలకులు, స్నాతకోత్తర కేంద్రం,

డి. యన్. ఆర్. కళాశాల, భీమవరం.



తెలుగు అకాడమి

హైదరాబాదు

1986

B.A., bhaarata deeSamloo sangha samksheema seevalu (Social Services in India) Authors; Smt. K. Seetaram, Sri S. Gokuldas, Editor : Prof. M.Lakshmipathi Raju, First Edition — 1986, PP. viii+490



*First Edition, 1986*
*Copies : 1,000*

Published by TELUGU AKADEMI, Hyderabad - 500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



**Price : Rs. 12-75**

Printed in India
at Quality Printers; T. B. Road, Tenali - 522 201.
Andhra Pradesh

# భూమిక

1968 లో స్థాపన జరిగిన నాటినుంచి ఉన్నత స్థాయిలో బోధన భాషగా తెలుగు పరుచుకోవటంలో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికీ విశదమైనదే. ఎన్నో రకాల ఇబ్బందులను అధిగమిస్తూ అత్యల్ప వ్యవధానంలో విస్తృతంగా పాఠ్య పఠనీయ అనువాద, పరామర్శ గ్రంథాలను ప్రచురించి అకాడమి విద్యా రంగానికి సముచితమైన సేవ చేయగల్గింది. అకాడమి ప్రచురణలు ఎన్నో పునర్ముద్రణ కూడా పొందినవి. పునరభ్యసన గోష్ఠుల ద్వారాను, విద్యార్థులు, విద్యాధికులు, ఉపాధ్యాయులు ఆసక్తితో చేస్తున్న సూచనల ద్వారాను ఎప్పటికప్పుడు ఈ గ్రంథాలను మెరుగుపరచటంలో కృషి జరుగుతూనే వచ్చింది. అయినా ఒక క్రమపద్ధతిలో శాస్త్రీయ దృష్టితో ఆ గ్రంథాలను గుణ పరీక్ష చేయించి పరిష్కృత ముద్రణలను వెలువరించడానికి అకాడమి ఒక ప్రణాళికను చేపట్టింది. ఈ కార్యక్రమంలో విశ్వవిద్యాలయ ఆచార్యులు, కళాశాల ఉపాధ్యాయులు మాకు ఎంతగానో సహకరించినారు. ఆ గుణపరీక్ష, మూల్యాంకన విధానాల పర్యవసానమే ఈ పరిష్కృత ముద్రణము.

ఈ విధంగా పరిష్కృత ముద్రణాలను వెలువరించటానికి వెనుక ఉన్న ఆశయాలు రెండు : మొదటిది – అప్పుడప్పుడు పాఠ్యప్రణాళికలో తీసుకొనివచ్చే మార్పులకు అనుగుణంగా పుస్తకాలను తీర్చిదిద్దటం, రెండవది గ్రంథాలలో ఉన్న విషయానికి అవసరమైన మేరకు సరికొత్త విషయాలు చేర్చటం.

పుస్తకంలో ఉపయోగించిన పారిభాషిక పదాల పట్టికలను, సమానార్థకాలను పుస్తకం చివర మునుపు ఇవ్వటం జరిగింది. అయితే పారిభాషిక పదాలను కూడా పరీక్ష చేయించి పరిష్కృత పదకోశాలను ఏ శాస్త్రానికి ఆ శాస్త్రంగా విడివిడిగాకాని, పరస్పర సన్నిహితత్వం ఉన్న శాస్త్రవర్గంగాగాని, వేరుగా ప్రకటిస్తున్నాం. ఆ కారణంచేత ఆ పట్టికలను ఇప్పుడు పుస్తకం చివర ఇవ్వటం లేదు.

ఈ గ్రంథాన్ని ఇంతకంటె సమగ్రంగాను, సుందరంగాను తీర్చిదిద్దటానికి సూచనలిస్తే కృతజ్ఞతతో స్వీకరించగలము.

# ప్రవేశిక

సంఘసంక్షేమ శాస్త్రం, చరిత్ర, తత్త్వం అనే గ్రంథం ఇదివరకు 1972 లో వెలువడినది. ఇటీవల మారుతూ వస్తూన్న పాఠ్యాంశాలు, భారత దేశ ప్రభుత్వం నిర్వహిస్తున్నటువంటి అభివృద్ధి కార్యక్రమాలు, పంచవర్ష ప్రణాళికలలో పొందుపరచిన సంఘసంక్షేమ సేవలు, జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో విద్యావేత్తలు చర్చించిన సంఘసంక్షేమ విద్యకు సంబంధించిన విషయాలను పురస్కరించుకొని, మార్పులు, చేర్పులుతో "భారత దేశంలో సంఘసంక్షేమ సేవలు" అనే పేరుతో ఈ గ్రంథాన్ని రాయటం జరిగింది.

భారత దేశంలో సంఘసంక్షేమ సేవల తీరుతెన్నులు మన దేశ చరిత్రననుసరించి, సామాజిక విలువలు, సంస్కృతిని ఆధారంచేసుకొని రూపొందించబడినవి. ఇటీవల ఆరో, ఏడో పంచవర్ష ప్రణాళికలద్వారా భారత ప్రభుత్వం దేశంలోని బలహీనవర్గాలకు, పేదప్రజానీకానికి, సమస్యలతో బాధపడుతున్న రోగులకు, శిశువులకు, బిక్షుకులకు, వ్యభిచార వృత్తిలో నున్న స్త్రీలకు, నిరక్షరాస్యులకు, ఉపాధిలేని యువజనులకు, వయోజనులకు, అనేక పథకాలను, అభివృద్ధి కార్య క్రమాలను ప్రవేశపెట్టడం జరిగింది. కుటుంబం, స్త్రీ, శిశు సంక్షేమ సేవలు, యువజన సంక్షేమ సేవలు, వికలాంగుల సంక్షేమం, గృహ వసతి, విద్య, ఉద్యోగిత, సాంఘిక భద్రత, ఆరోగ్యం, షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, వెనుకబడినవర్గాల సంక్షేమం, మొదలగు పాఠ్యాంశాలను విపులంగా చర్చించటం జరిగింది. భారత దేశంలో సాంఘికసంక్షేమ నిర్వహణ, సంఘసంక్షేమ కార్యక్రమాలలో స్వచ్ఛంద సేవాసంస్థల పాత్రను ప్రత్యేక ప్రకరణాలలో విపులీకరించడం జరిగింది.

1981 జనాభా లెక్కల ప్రకారం, ఇటీవల అమలుపరచిన ఆరో ప్రణాళిక దృష్ట్యా సమస్యలకు సంబంధించిన గణాంక విషయాలను ఈ పుస్తకంలో పొందుపరచడం జరిగింది.

చరిత్రాత్మకంగా భారత దేశంలో సంఘసంక్షేమ సేవలను సమీక్ష చేయటమేగాకుండా, రచయితలు శ్రమతీసుకొని, సాహిత్యాన్ని విషయాలను సేకరించుకొని, భారత దేశంలోని సంస్కరణలను, సంస్కర్తల జీవిత చరిత్రలను, స్వచ్ఛందసంస్థల పుట్టుపూర్వోత్తరాలను విపులంగా ఈ గ్రంథంలో పొందుపరచారు. రచయితలు సంఘసంక్షేమ శాస్త్ర గ్రంథాలతోపాటు గత ఆరు పంచవర్ష ప్రణాళికలకు సంబంధించిన గ్రంథాలను అధ్యయనం చేసి అనేక విషయాలను పట్టికలను ఈపుస్తకంలో పొందుపరచారు.

పై విధంగా తయారుచేసిన ఈ గ్రంథం, డిగ్రీ స్థాయిలో అధ్యయనం చేస్తున్న సంఘసంక్షేమశాస్త్ర విద్యార్థులకే కాకుండా, సంఘసంక్షేమశాస్త్ర కార్యకర్తలకు, ప్రభుత్వ ఉద్యోగులకు, స్వచ్ఛంద సేవా సంస్థలకు ఉపయుక్తమవుతుంది.

# 1

# భారతదేశంలో సంఘ సంక్షేమ సేవలు
# ( SOCIAL SERVICES IN INDIA )

## పరిచయం

భారతదేశంలో సనాతన కాలంనుంచీ కూడా సంఘసంక్షేమ సేవలు రాజులు, ధనికులు మొదలైన వారిద్వారా జరుపబడుతూ ఉండేవి. ఆధునిక యుగంలో ఈ సంఘసంక్షేమసేవలు పూర్వకాలంలో వలెకాక అధునాతనమైన రూపాన్ని పొంది శాస్త్రీయమైన క్రమపద్ధతిని దాల్చినవి.

సమాజంలోని మానవులలో కొందరు జన్మతఃగాని, ప్రకృతి ప్రభావంవల్లగానీ అనేక విధాలైన అంటే శారీరక, మానసిక, సాంఘిక, మత, నైతిక సంబంధమైన అశక్తతలకు గురి అవుతూ ఉంటారు. వారు తమ అశక్తతలవల్ల జీవనం సాగించలేక, సమాజానికి ఏ విధంగానూ ఉపయోగపడలేక పోవటమేకాక పరాన్నజీవులుగాను, సమాజానికి బరువుగానూ జీవించవలసి వస్తున్నది. కానీ శాస్త్ర విజ్ఞానం పెరగడం వల్ల ప్రస్తుతం ఇట్లాంటి వారికి వివిధ శాస్త్రీయ పద్ధతుల ద్వారా సహాయంచేసి తిరిగి శక్తిమంతులను చేయడం జరుగుతున్నది. అంతేకాక ఇటువంటి అశక్తతలు గలిగిన వ్యక్తులు తమ అశక్తతల వలన మరింత నిస్సహాయులుగా మారకుండా వారిలో అంతర్నిహితంగా ఉన్న శక్తి యుక్తులను వారు గుర్తించేలాగ చేయడం, వాటిని బహిర్గతం చేయడం జరుగుతుంది. తమ కార్యక్రమాలను తాము స్వయంగా నిర్వహించుకో గలరనే ఆత్మ విశ్వాసాన్ని వారిలో కలుగజేయడం మొదలైన మూల సూత్రాలన్నీ ఈ శాస్త్రీయ పద్ధతిలో ఉన్నాయి. తద్వారా సక్రమమైన సంఘ సంక్షేమ సేవల ద్వారా వారిని తిరిగి మామూలు వ్యక్తులుగా తయారుచేయడానికి ప్రయత్నించడం జరుగుతుంది.

ఈ విధంగా వ్యక్తులు తమ అశక్తతలను పోగొట్టుకోవడానికి లేదా అశక్తతలోనే శక్తిని పెంపొందించుకోవడానికి అవసరమైన సహాయాలను వివిధ సంఘ సంక్షేమ సేవల ద్వారా అందజేయడం జరుగుతుంది. ఇటువంటి సంఘ సంక్షేమ సేవలు కుటుంబ సంక్షేమ సేవలు, స్త్రీ సంక్షేమ సేవలు, శిశు సంక్షేమసేవలు, యువజన సంక్షేమసేవలు, మూగ, గుడ్డి, చెముడు, అవిటి మొదలైన శారీరక, మానసిక అశక్తతలు గలవారికి సంక్షేమ సేవలు, వెనుకబడిన తరగతుల వారికి సంక్షేమ సేవలు మొదలైనవి.

ఈ విధంగా సమాజంలో ప్రత్యేక అశక్తతలు గల వ్యక్తులకు ప్రత్యేక సంక్షేమ సేవా పద్ధతుల ద్వారా సహాయం చేసి వారికి పునరావాసాన్ని కల్పించడమే సంఘ సంక్షేమ సేవల ముఖ్యోద్దేశం.

భారతదేశంలో సంఘ సంక్షేమ సేవల ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఎందుకంటే పూర్వం మనదేశంలో పైన పేర్కొన్న అశక్తతలు గల వ్యక్తులు సమష్టి కుటుంబం, కుల వ్యవస్థ, గ్రామ పంచాయితీలు మొదలైన వాటిద్వారా సంరక్షించబడేవారు. కానీ ఆధునిక యుగంలో ఇవి విచ్ఛిన్నం చెందడంవల్ల అశక్తతాపూరితులైన వ్యక్తులందరూ అనాధలుగా మిగిలిపోయినారు. కనుక వీరి బాధ్యతను ప్రభుత్వం వివిధ స్వచ్ఛంద సేవాసంస్థలద్వారా వివిధ సంఘ సంక్షేమ సేవలను ఉపయోగించి వీరికి పునరావాసాన్ని కలుగజేయడం మొదలుపెట్టింది. సంఘ సంక్షేమ సేవల గురించి తెలుసుకొనేముందు సంఘసేవ, సంఘ సంక్షేమ సేవ, సంఘ సంస్కరణ, సంఘ సంక్షేమ కృషి మొదలైన పదాల అర్థాలను, మూలభావాలను తెలుసుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

సంఘసేవ, సంఘ సంక్షేమ సేవ, సంఘ సంస్కరణ, సంఘ సంక్షేమ కృషి మొదలైన పదాలలోని మూలభావం ఒకటిగానే కనిపిస్తుంది. ఈ పదాలన్నీకూడా సంఘాన్ని సమస్యలనుంచి రక్షించి అభివృద్ధిలోకి తేవడం అనే ఒకే అర్థాన్ని తెలియజేస్తాయి. కాని ఈ పదాల అర్థం, ఉద్దేశం ఒకటే అయినా అవి సాంఘికాభివృద్ధిని సాధించే మార్గాలు వేరుగాను, ప్రత్యేకంగాను ఉంటాయి.

సంఘసేవ, సంఘ సంక్షేమ సేవ, సంఘ సంస్కరణ, సంఘ సంక్షేమకృషి ఇవన్నీ ఆచరణలో ఏవిధంగా ఒకదానితో ఒకటి వేరుగా ఉంటాయో తెలుసుకుందాం.

## 1. సంఘ సేవ (Social service)

సంఘ సేవ అనేది వ్యక్తికి స్వతఃస్సిద్ధంగా ఉన్న దయ, జాలి, ప్రేమ మొదలైన మానవతా లక్షణాలనుంచి ఆవిర్భవించిన పదం. తోటి మానవుడు కష్ట సమయాలలో ఉన్నప్పుడు అతడిని తన శాయ శక్తులా ఆదుకుని కష్టాలనుంచి గట్టెక్కించాలనే భావంపైనే సంఘసేవ ఆధారపడి ఉన్నది.

పూర్వం ఈ సంఘ సేవ దైవభీతి, కర్మసిద్ధాంతం, జన్మరాహిత్యం అనే నమ్మకాలపై ఆధారపడి వ్యక్తులు స్వచ్ఛందంగా కొనసాగించే వారు. ధనవంతులు, రాజులు, అనాథలను, పేదలను ఈ పై సిద్ధాంతాల వల్లనే ఆదుకునేవారు. కాని ఆధునిక యుగంలో ఈ స్వచ్ఛంద సంఘ సేవ రూపురేఖలు మారినవి. రాజులు, రాచరికాల వ్యవస్థలు పోవడం వల్ల ప్రజలు వ్యక్తిగతంగాను, స్వచ్ఛందంగాను, సంఘ సేవ చేయడం వల్ల సేవార్థుల అవసరాలు పూర్తిగా నెరవేరడంలేదు. అందువల్ల ఆధునిక యుగంలో సంఘసేవ ప్రభుత్వ సేవా సంస్థలు, స్వచ్ఛంద సేవా సంస్థల ఆధ్వర్యంలో అధికంగా జరుపుతున్నది.

ఆధునిక యుగంలో సర్వతోముఖాభివృద్ధికై ఏర్పరచిన కార్య క్రమాలు అంటే విద్యాభివృద్ధి కార్యక్రమాలు, గృహనిర్మాణ పథ కాలు, వైద్య సౌకర్యాలు, ఆరోగ్యాభివృద్ధి కార్యక్రమాలు సాంఘిక సేవగా పరిగణించబడ్డాయి. అవ్యవస్థత చెందిన సమాజాలలో అంటే సమాజంలో ప్రజల అవసరాలు తమకు లభ్యమయ్యే వనరుల ద్వారా తీర్చుకోలేని పరిస్థితి వచ్చినపుడు సంఘసేవ ఆవశ్యకత అధికంగా కనిపి స్తుంది. సంఘ అవసరాలనుబట్టి సంఘసేవ అభివృద్ధి చెందుతుంది. సమాజంలో వ్యక్తులు తమ అవసరాలను తాము తీర్చుకోలేని పరిస్థితి ఏర్పడినపుడు సంఘసేవ ఉనికి గుర్తించడం జరుగుతోంది.

# 2. సంఘ సంక్షేమ సేవ (Social welfare service)

సంక్షేమం అనే పదం అర్థం స్థలాన్నిబట్టి, కాలాన్నిబట్టి మారుతూ ఉంటుంది. పురాతన కాలంలో సంక్షేమ కార్యక్రమాలు పేదవారికి, అనాథలకు, విధవలకు, శారీరక, మానసిక వికలాంగులకు ఏర్పరచే సహాయ కార్యక్రమాలు మాత్రమే. కాని ఈనాడు పై చెప్పిన తరగతులవారికి ఆరోగ్య, గృహవసతి సౌకర్యాల ఏర్పాటు నిమిత్తమై కూడా కొనసాగించబడుతున్నది.

దీనినిబట్టి సంఘ సంక్షేమ సేవ బలహీనవర్గాల సంక్షేమం, అభివృద్ధికై వినియోగించే కార్యక్రమాలుగా చెప్పవలె. ఆర్థికంగా, సాంఘికంగా వెనుకబడిన తరగతులకు చెందిన ప్రజలు, శారీరక, మానసిక వికలాంగులు, స్త్రీలు, శిశువులు వీరిని బలహీనవర్గాలుగా పరిగణించడం జరుగుతున్నది. అంటే స్త్రీ సంక్షేమం, శిశు సంక్షేమం, బాలబాలికల సంక్షేమం, సాంఘిక సంరక్షణ, సాంఘిక, నైతిక, ఆరోగ్య పథకాలు మొదలైనవన్నీ సాంఘిక సంక్షేమ సేవా కార్యక్రమాలుగా పరిగణించడము జరుగుతున్నది.

భారత దేశంలో సహాయాన్నర్థించే బలహీన వర్గాలకు చెందిన వ్యక్తుల జీవిత ప్రమాణాన్ని అభివృద్ధి పరచడానికి ఉపయోగించే కార్యక్రమాలను సంఘ సంక్షేమ సేవలు అని అంటారు. ఈ విధంగా పునరావాస కార్యక్రమాలు వెనుకబడిన జాతుల, తరగతుల అభివృద్ధి పథకాలు, కార్మిక సంక్షేమ కార్యక్రమాలు మొదలయినవన్నీ సాంఘిక సంక్షేమ సేవా కార్యక్రమాలు.

సాంఘిక సేవకు, సాంఘిక సంక్షేమ సేవకుగల భేధమేమంటే సాంఘిక సేవ సమాజంలోగల మానవాళికందరకూ చేసే సేవా కార్యక్రమం. సాంఘిక సంక్షేమ సేవ సమాజంలోగల వెనుకబడిన, ప్రత్యేక వర్గాలుగా పరిగణించబడిన వారికి మాత్రమే సంబంధించిన కార్యక్రమ పథకాలు.

## 3. సాంఘిక సంక్షేమం (Social welfare)

వ్యక్తిగత, సామూహిక, జీవిత, ఆరోగ్య ప్రమాణాలను సంతృప్తి కరంగా పొందడానికి ప్రయత్నించే సాంఘిక సేవల, సాంఘిక సంస్థల వ్యవస్థితమైన కార్యక్రమాలే సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు అను నిత్యం వ్యక్తిగత, సామాజిక సంబంధాల అభివృద్ధిపై కేంద్రీకృతమై ఉంటాయి. సాంఘిక సంక్షేమ కార్యక్రమాల ద్వారా వ్యక్తుల సంపూర్ణ శక్తి సామర్థ్యాలు అభివృద్ధి పరచి, సాముదాయిక అవసరాలకు అనుగుణంగా వ్యక్తుల సంక్షేమం అభివృద్ధిపరచడానికి కృషి చేయడం జరుగుతుంది. సాంఘిక సంక్షేమం వ్యక్తులందరికీ ఉద్దేశించబడిందికాక ఆర్థికంగా, సాంఘికంగా, మానసికంగా, శారీరకంగా వెనుకబడిన తరగతుల వారికి మాత్రమే ఉద్దేశించబడినదై ఉంటుంది. అంటే స్త్రీ, శిశు సంక్షేమం, శారీరక, మానసిక వికలాంగుల సంక్షేమం, పేదవారి మెరుగు కోసం ఏర్పరచే సంక్షేమ కార్యక్రమాలే సాంఘిక సంక్షేమంగా పేర్కొనవచ్చు.

## 4. సంఘ సంక్షేమ కృషి (Social work)

సంఘసంక్షేమ కృషి వృత్తిపరమైన సేవ, సంఘసంక్షేమ కృషి ఒక క్రమబద్ధమైన శాస్త్రీయపద్ధతి, పరిజ్ఞానం, మానవ సంబంధాల శాస్త్రంలో విజ్ఞానం, నైపుణ్యతలమీద ఆధారపడి ఉంటుంది. సంఘ సంక్షేమకృషి వ్యక్తులకు వ్యక్తిగతంగాను, సామూహికంగాను, సహాయంచేసి వ్యక్తిగత సంతృప్తి, స్వాతంత్ర్యాన్ని కలుగజేస్తుంది. సంఘసంక్షేమ కృషిని సంఘసంక్షేమ సంస్థలద్వారా చేయడం జరుగుతుంది. సంఘసంక్షేమ కృషి కొన్ని ప్రత్యేక శాస్త్రీయ పద్ధతులు, సూత్రాలు, నైతిక విలువలు, ప్రజాస్వామిక విలువలు, మొదలైన వాటిని ఆధారంగా చేసుకుని జరిపే ప్రకార్యం. వైద్యవృత్తి, ఉపాధ్యాయ వృత్తి, న్యాయవాద వృత్తి, మొదలైన సాంకేతిక వృత్తుల వలె సమాజిక శాస్త్ర విజ్ఞానం, శిక్షణఉన్న వ్యక్తులనే సంఘసంక్షేమకృషి చేయడానికి అంగీకరించి నియమించడం జరుగుతుంది. వృత్తిసంబంధమైన

పరిజ్ఞానం, శిక్షణలేని వ్యక్తులు సంఘ సంక్షేమ కృషి చేయడానికి అనర్హులు. సంఘసంక్షేమ కృషి కార్యకర్తలు ఆయా సంస్థలనుంచి వేతనాలను పొందుతారు. ఇది స్వచ్ఛంద సేవ కాదు. సంఘసంక్షేమ కృషి ఒక కళగాను, శాస్త్రంగాను పరిగణించడమైంది.

సంఘసంక్షేమ కృషిద్వారా వ్యక్తుల, సమూహాల, సముదాయాల, సమాజాల సమస్యలను ప్రత్యేకంగా శాస్త్రీయపద్ధతిలో పరిష్కరించడానికి అనేక ప్రత్యేక పద్ధతులున్నాయి. అవి వ్యక్తిసేవా పద్ధతి, సాముదాయికవ్యవస్థాపన, సామాజికచర్య, సంఘసంక్షేమకృషిపరిశోధన మొదలైనవి.

## 1. వ్యక్తిసేవాపద్ధతి

సమస్యలతో బాధపడుతూ అశక్తులైన వ్యక్తులను తిరిగి శక్తిమంతులను చేయడానికి ఉపయోగించే శాస్త్రీయపద్ధతి. వ్యక్తులను శక్తిమంతులనుచేసి వారి సమస్యలను వారే స్వయంగా పరిష్కరించుకొనేందుకు ఉపయోగించే పద్ధతి వ్యక్తిసేవా పద్ధతి. ఈ పద్ధతిలో వ్యక్తులను ప్రత్యేకంగా, వ్యక్తిగతంగా పరిశీలించి, వారి సమస్యలను కనుక్కొని వారికి ప్రత్యేక చికిత్సావిధానం ద్వారా పరిష్కరించుకొనేటట్లు చేస్తారు. ఈ పద్ధతిలో ఎంతదగ్గర పోలికలున్నప్పటికీ ఏ రెండు సమస్యలను కలిపి చూడరు. ఏ ఇద్దరి వ్యక్తులను ఒకేరకమైన చికిత్సావిధానాన్ని నిర్ణయించరు. వ్యక్తుల సమస్యలను బట్టి, వారి శారీరక, మానసిక శక్తిసామర్థ్యాలనుబట్టి సేవార్థులను వ్యక్తిగతంగా పరిశీలిస్తారు.

## 2. సమూహ సేవా పద్ధతి :-

సమస్యలకు గురి అయిన సమూహాలు తమ సమస్యలను తామే పరిష్కరించుకొనేటట్లు సహాయపడటంలో సంఘ సంక్షేమ కార్యకర్తలు ఉపయోగించే పద్ధతి సమూహ సేవా పద్ధతి. సర్దుబాటు శక్తిని కోల్పోయి, ఇతరులతో అవసరమైన సంబంధాలను పెంచుకోలేని స్థితిలో ఉన్న వ్యక్తులకు అవసరమైన సహాయం చేయడానికి కూడా ఈ పద్ధతి

ఉపయోగిస్తారు. ఒకే రకమైన సమస్యలుగల వ్యక్తులను, ఒకే తరహా మూర్తిమత్వంగల అంటే ఒకే రకమైన శారీరక, మానసిక శక్తి సామర్థ్యాలు గల వ్యక్తులందరినీ ఒక సమూహంగా తీసుకొని వ్యక్తుల సమస్యలను వ్యక్తిగతంగానేకాక సామూహికంగాకూడా పరిష్కరించేందుకు తోడ్పడతారు. వ్యక్తులు ఇతరులతో సర్దుబాటు చేసుకొనేటట్లు చేయడానికి ఈ పద్ధతి ఉపయోగపడుతుంది.

## 3. సాముదాయిక వ్యవస్థాపన

ఇది సమస్యలను ఎదుర్కొంటున్న సమాజాలకు సహాయం చేయడానికి, అవ్యవస్థిత సమాజాలను వ్యవస్థితం చేయడానికి సంఘ సంక్షేమ కార్యకర్తలు ఉపయోగించే పద్ధతి. సమాజంలోని వేరు వేరు తరగతుల వారిని వివిధ ప్రాతిపదికలమీద ఒక క్రమ పద్ధతిమీద జీవనం కొనసాగించేటట్లుచేయడానికి ఈ పద్ధతిని ఉపయోగిస్తారు. తద్వారా సమాజం తన సంక్షేమ కార్యక్రమాలను తానే నిర్వహించుకొనేందుకు సహాయపడతారు. ఈ పద్ధతిలో సంఘ సంక్షేమ కార్యకర్త ఒక సమస్యాపూరిత లేదా అవ్యవస్థిత సముదాయాన్ని తీసుకుని తన విజ్ఞానాన్ని, శాస్త్రీయ పద్ధతిని ఉపయోగించి ఆ సముదాయంలోని ప్రజలు తమ అవసరాలను తాము గుర్తించేటట్లు చేస్తారు. తరువాత వారికి లభ్యమయ్యే ప్రాంతీయ వనరులను వారికి తెలియజేస్తాడు. ఆ తరువాత వారి అవసరాలను, వనరులను సమన్వయపరచి ఆ వనరుల ద్వారా తమ అవసరాలను తీర్చుకొనేటట్లు చేస్తాడు.

## 4. సామాజిక చర్య :-

జనబాహుళ్య సమస్యలను జనబాహుళ్యం ద్వారానే పరిష్కరించే పద్ధతిని సాంఘిక చర్య అని అంటారు. దీనిలో కూడా క్రమబద్ధమైన శాస్త్రీయ పద్ధతిని ఉపయోగించాలి. జనబాహుళ్య సమస్యలను పరిష్కరించడానికి సంఘంలో ప్రజాభిప్రాయాన్ని పెంపొందించవలసి ఉంటుంది. వృత్తిరీత్యా సంఘ సంక్షేమ కార్యకర్తలు మొట్టమొదట ప్రజాభిప్రాయాన్ని రూపొందించి, పెంపొందించి తద్వారా అవసరమైన మార్పులను

చట్టాలను ప్రవేశపెట్టడానికి దోహదం చేయడం లేదా చట్టాలను సవరణలను చేయడానికి వాటి ద్వారా జనబాహుళ్య సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నిస్తారు.

## 5. సంఘ సంక్షేమ కృషి, పరిశోధన :-

సంఘ సంక్షేమ కృషి, పరిశోధన అంటే సమస్యల పరిష్కారానికి అవసరమైన వాస్తవాలను శాస్త్రీయంగా పొందుపరచే పద్ధతి. పరిశోధనలవల్ల లభ్యమయ్యే వివరాలనుబట్టి సంఘ సంక్షేమ కార్యకర్తలు సమస్యలను పరిష్కరించడానికి అనుకూలమైన పద్ధతులను, నైపుణ్యాలను అలవరచుకొంటారు.

## విభేదాలు :-

ముఖ్యంగా సంక్షేమం, సేవ మొదలైన పదాలు సాంఘిక అవ్యవస్థల వల్ల ఏర్పడిన పరిస్థితిని సరిదిద్దటానికి చేయవలసిన సేవలకు పెట్టిన పేర్లు. సంక్షేమం అనే పదం సమస్యల పరిష్కరణకు జరపవలసిన ప్రతిక్రియకు పెట్టిన పేరు. సంఘ అవసరాలనుబట్టి సంఘానికి చేయవలసిన సేవను సంఘ సేవ అంటారు. వ్యక్తులకు ఎదురయ్యే సమస్యలు, వారి అవసరాలు వీటి మధ్య ఉన్న భేదాన్ని సంఘ సంక్షేమం, సంఘ సేవ అనేవి తెలుపుతాయి సంక్షేమం శాశ్వత పరిష్కార కార్యం. సేవ తాత్కాలికోపశమనార్ధ సహాయం. ఈ కింది ఉదాహరణల సహాయంతో సంక్షేమానికీ, సేవకుగల భేదాన్ని గుర్తించవచ్చు.

బాలాపరాధులను సక్రమ జీవిత మార్గానికి తీసుకువచ్చి వారికి సంఘ జీవితాన్ని అలవాటుచేసి సంఘ సంక్షేమ కార్యకర్త ఎంతో సహాయ పడతాడు. ఈ విషయంలో సంఘ సంక్షేమ కార్యకర్త బాలాపరాధిని, అతని కుటుంబాన్ని, అతని చుట్టూవున్న పరిసర ప్రభావాన్ని అవగాహన చేసుకొని అవసరమైతే లభ్యమైన వనరులను ఉపయోగించుకుని తన సమస్యలను తానే పరిష్కరించుకొనే శక్తిని ఆ బాలునికి సమకూరుస్తాడు. దీనివల్ల కార్యకర్తకు సేవార్థికి మధ్య ముఖాముఖి చర్చలు జరిగి పరిచయమేర్పడుతుంది. బాలాపరాధులలో ఈ స్వయం సహాయ శక్తిని ప్రసరింపచేసే కార్యాన్నే సంఘ సంక్షేమ కృషి అంటారు.

బాలలకు ప్రభుత్వం ఆటస్థలాలు, పార్కులు, క్లబ్బులు, గ్రంథాలయాలు నెలకొల్పి వారి విరామ సమయాన్ని సద్వినియోగమయ్యేట్లు చేస్తున్నది. ఇవి వారి రక్షణకు, అభివృద్ధికి దోహదం చేస్తాయి. దీనిని సంఘ సేవ అంటారు.

అవాంఛనీయ పరిస్థితులు ఏర్పడడంవల్ల ప్రజలు సామాన్య జీవితాన్ని గడపలేరు. ఏ సమస్యలనైనా సకాలంలో పరిష్కరించకపోతే వ్యక్తితోబాటు అతని కుటుంబం, సమాజం అభిలషణీయమైన సాంఘిక జీవనానికి దూరమవడం జరుగుతుంది. సంఘ సంక్షేమ శాస్త్రం సమస్యా పరిష్కారానికి తోడ్పడుతుంది. సమస్యలకు లోనైన వ్యక్తులు తమకు కల్పించిన అవసరాలను పొంది స్వశక్తితో సమాజానికి సంఘాభివృద్ధికి ప్రయత్నిస్తారు. ఈ విధమైన ఫలితాన్ని ఉద్దేశించే కార్యక్రమాన్ని సంఘ సేవ అంటారు. సంఘ సంక్షేమ కృషిలో ఉండే కార్యకర్త-సేవార్థుల మధ్యగల వృత్తి బంధవ్యం సంఘ సేవలో ఉండదు.

సంఘసేవ అంటే స్వయంశక్తివల్ల ఎవరి సమస్యలు వారు పరిష్కారం చేసుకోలేని వ్యక్తులకు చేసే ఉపకారం వంటిది మాత్రమే. కష్టంలో ఉన్న తోటి మానవులకు చేసే సహాయాన్ని సంఘ సేవ అంటారు. ఇది మానవ సహజ స్వభావం నుంచి ఉద్భవించింది.

సంఘ సేవ ఆధునిక యుగంలో కొత్త రూపును దిద్దుకొని సంఘ సంక్షేమ కృషిగా మారింది. సంఘ సంక్షేమ కృషి వృత్తిగా ఏర్పడి అనేక నూతన పద్ధతులు అమలులోకి రావడంవల్ల ఫలితాలు పూర్వం కంటే వాంఛనీయమైనవిగాను, సర్వతోముఖాభివృద్ధిని సాధించేవిగాను ఏర్పడినవి. పూర్వానికి, ప్రస్తుతానికి సంఘ సేవలో మార్పువచ్చింది. పూర్వం ధర్మాత్ములు, దయాపరులు చేసిన సంఘసేవ సమస్యాపీడితులకు తాత్కాలిక ఉపశమనం మాత్రమే కలిగించేది. సహాయం చేయడంతోనే తమ కర్తవ్యం తీరిపోయినట్లు వారు భావించేవారు. ఈనాడు సంఘ సంక్షేమ కృషి సేవార్థి యొక్క వివిధ జీవితాంశాలను క్షుణ్ణంగా పరిశీలిస్తుంది. సేవార్థి తన సమస్యలను తానే గ్రహించి స్వయంశక్తితో వాటిని పరిష్కరించుకొనే సామర్థ్యం లభిస్తుంది.

ప్రస్తుతం సంఘ సేవను ప్రభుత్వం, దాని వివిధ శాఖలు, స్థానిక పరిపాలనా సంస్థలు, స్వచ్ఛంద సేవా సంస్థలు నడుపుతున్నాయి. వైద్య సౌకర్యాలు, గృహ నిర్మాణ పథకాలు. ఆర్థిక సహాయం మొదలైన సహాయాలు సమాజంలోగల ప్రత్యేక సమూహాలకు చెందిన వ్యక్తులకు లభ్యమయ్యేటట్లు ప్రభుత్వం అవకాశాలను కలిగిస్తున్నది. విరామ సమయాలను సద్వినియోగపరచడానికి కూడా ప్రభుత్వం కొన్ని ప్రణాళికలను ఏర్పరచింది.

సంఘంలో బాలల సంక్షేమం అతి ముఖ్యమైంది. బాలల భావి భారత పౌరులు. కనక వారి భవిష్యత్తు బాగా ఉండాలనే ఉద్దేశ్యంతో వారి ఆరోగ్యానికి, అభివృద్ధికి కావలసిన ఏర్పాట్లను ప్రభుత్వం సంఘ సంక్షేమ సంస్థల ద్వారా కల్పిస్తున్నది. అనాథలకు అనాథ శరణాలయాలను, పొంపుడు గృహాలను స్థాపించి వారిని స్థిరపరచి వారి భవిష్యత్తుకు పథకాలను సిద్ధపరుస్తున్నది. విరామ సమయాలలో వారి శారీరక, మానసిక వికాసానికి సహకరించే విధానాలను రూపొందిస్తున్నది.

## 6. సంఘ సంస్కరణ

సాంఘిక వ్యవస్థలలోను, సాంఘిక ఆచారాలలోనుగల లోపాలను తొలగించి సమాజాన్ని వ్యవస్థితం చేయడాన్ని సంఘ సంస్కరణ అంటారు. సంఘ సంస్కరణ సమాజంలోగల లోపాలకు ప్రతిక్రియ. సంఘంలో ప్రబలిన దురాచారాలను రూపుమాపితేగానీ సంఘం అభివృద్ధి చెందలేదు. ఈ దురాచారాలు చిరకాలం నుంచి సంఘాన్ని పీడించుకు తింటున్న సమస్యలు. ఈ చిరకాల సమస్యలు పరిష్కరించాలంటే ముందుగా సమాజాన్ని సంస్కరించాలి అంటే సాంఘిక విధానాలలోను, పద్ధతులలోను, ఆచార వ్యవహారాలలోను, విలువలలోను మార్పు తీసుకురావాలి. సంఘంలో అనాదిగా వస్తున్న అలవాట్లు, కట్టుబాట్లు, ప్రజల ఆలోచనాసరళి, విలువలు మొదలైనవాటిలో మార్పు రావాలి. సాంఘిక జీవన విధానంలో అవసరమైన మార్పును తేవడానికి ప్రజలు అంత సుముఖతను చూపరు. అంతేగాక అనేక అడ్డంకులను కూడా

కల్పిస్తూ ఉంటారు. ఉదాహరణకు సతీసహగమనం, విధవా పునర్వివాహ నిషేధం, స్త్రీ, పురుషులకు సమాన హోదా లేకపోవడం, బాల్య వివాహాలు, వరకట్నాలు, మొదలైనవన్నీ మన సమాజాన్ని పీడిస్తున్న సమస్యలు.

రాజా రామ్మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, వీరేశలింగం పంతులు మొదలైన మహనీయులు ఈ సమస్యల పరిష్కారానికి కృషి చేశారు. వీరిని సంఘ సంస్కర్తలనీ, ఈ విధంగా సాంఘిక విలువలలో మార్పు తేవడాన్ని "సంఘ సంస్కరణ" అని అంటారు. ఈ దురాచారాలతో కలుషితమైన సాంఘిక విధానం బ్రిటీష్‌వారు మన దేశానికి రాకపూర్వం నుంచీ ఉండేది. ఎందరో సంఘ సంస్కర్తలు సాగించిన పోరాటంవల్ల, కృషివల్ల సంఘ సంస్కరణకు గట్టి పునాదులు పడ్డాయి. సంఘ సంస్కరణలో సంఘ సంస్కర్త స్వచ్ఛంద సేవ చేస్తాడు. మానవతా విలువలు, మత ధర్మాలు అతనికి ప్రేరణ నిస్తాయి. సంఘ సంక్షేమ కార్యకర్త సంఘ సేవ చేయటానికి ప్రత్యేక శిక్షణను పొంది ఈ విధానంలో నైపుణ్యాన్ని సంపాదించుకుని అతని కృషికి వేతనం పొందుతాడు.

## సంఘ సంక్షేమ కృషి - వృత్తి

పూర్వం స్వచ్ఛంద సేవకులు ప్రతిఫలం ఆశించకుండా సంఘసేవ చేసేవారు. కాలక్రమేణా సంఘంలో అనేక మార్పులు రావడంవల్ల సమస్యలు చాలా క్లిష్టమౌతున్నాయి. విదేశీ పరిపాలనా, పారిశ్రామికాభివృద్ధి, నగరీకరణం మొదలైన అనేక కారణాలవల్ల సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ఈ సమస్యలను ఎదుర్కోడానికి పూర్వం స్వచ్ఛంద సేవకులు, ఉపయోగించే సాధారణ పద్ధతులు ఈనాడు ఎంత మాత్రం సరిపోవడం లేదు. ఈనాటి సమస్యలను పరిష్కరించడానికి అధునాతన పద్ధతులు అనుసరించవలసి ఉంది. ఈ పరిస్థితులలో సంఘసేవా పద్ధతి వృత్తిపరమైన సంక్షేమ కృషిగా మారింది. సంఘసంక్షేమ కృషి చేయడానికి కూడా కొన్ని కట్టుబాట్లు, పద్ధతులు అవసరమైనాయి.

వైద్య, న్యాయ, ఉపాధ్యాయ వృత్తులవలెనే సంఘసంక్షేమ కృషికూడా ఒక వృత్తిగా పరిగణించబడింది. సంఘ సంక్షేమ కృషి వృత్తిలోకూడా కొన్ని నిబంధనలు అభివృద్ధిచెందాయి. సంఘసంక్షేమ కృషి వృత్తిలో కార్యకర్తకు సంఘసంక్షేమ శాస్త్రం, మానవశాస్త్రం, మనోవిజ్ఞాన శాస్త్రం, మొదలైన వాటిలో పరిచయం, పరిజ్ఞానం ఉండాలి. సంఘసంక్షేమ కార్యకర్త సంఘ సంక్షేమాన్ని క్రమబద్ధమైన శాస్త్రీయపద్ధతిలో చేస్తాడు.

విదేశాలలో సంఘ సంక్షేమ కృషి అతిముఖ్యమైన వృత్తిగా గుర్తింపబడింది. ఈనాడు భారతదేశంలో కూడా సంఘసంక్షేమ కృషికి వృత్తిగా గుర్తింపు లభించింది. సంఘసంక్షేమ కృషిని వృత్తిగా పరిగణించడానికి దీనికి మిగతా వృత్తులకు గల లక్షణాలన్నీ ఉన్నాయి. సంఘసంక్షేమ కృషిని వృత్తిగా పరిగణించగలమా? లేదా? అనేది నిర్ణయించడానికి ముందు వృత్తికి ఉండవలసిన లక్షణాలను తెలుసుకుందాం. తరువాత ఆ లక్షణాలన్నీ సంఘసంక్షేమ కృషికి వున్నవా? లేదా? అనే విషయం పరిశీలిద్దాం.

## వృత్తి లక్షణాలు

(1) సంపూర్ణ విజ్ఞానం (2) శిక్షణ (3) ప్రత్యేక పరిజ్ఞానం వృత్తిపరమైన వ్యవస్థలు (5) వృత్తిపరమైన నైతిక విలువలు (6) సామాజిక గుర్తింపు

## 1. సంపూర్ణ విజ్ఞానం

50 సంవత్సరాలుగా సంఘ సంక్షేమ కృషి మానవతా భావన, ఆచార్య వ్యవహారాలపైన ఆధారపడి ఉన్నది. పూర్వ కాలం నుంచి వస్తున్న "పేదవారికి దానం చేయడం" అనే భావన ఈనాడు "పేదవారికి పునరావాసం కల్పించడం" అనే భావంగా మారింది. వ్యక్తిగత అశక్తత, అవ్యవస్థత, కారణాలను పరిశీలించగా పేదరికం, వ్యక్తిగత అసమయోజనం మొదలైన వాటికి సమాజం, సమాజంలోని అవ్యవస్థతా పరిస్థితులే కారణమని తెలుస్తున్నది. ఈ పరిస్థితులు ఈనాడు త్వరితగతిని

జరుగుతున్న సామాజిక పరివర్తన, పారిశ్రామికీకరణ, నగరీకరణం మొదలైన వాటివల్ల వ్యక్తిగత, సామాజిక సమస్యలు క్లిష్ట రూపం దాల్చాయి. ఈ క్లిష్ట సమస్యలను పరిష్కరించడానికి తాత్కాలికోపశమనం కాక శాశ్వత పరిష్కారం కలుగజేయడం సాధారణ వ్యక్తుల ద్వారా సాధ్యపడలేదు. దీనికి ప్రత్యేక పరిజ్ఞానం, విజ్ఞానం గల వ్యక్తుల ఆవశ్యకత ఏర్పడింది. సమాజంలో వ్యక్తిని అర్థం చేసుకోగలిగే పరిజ్ఞానం కావాలి. కనుక దీనికి ప్రత్యేక విద్య అవసరమైంది. సంఘ సంక్షేమ కార్యకర్త జైవిక, మానసిక, సాంఘిక దృక్పథాలలో వ్యక్తి అభివృద్ధి గురించి సరియైన విజ్ఞానం కలిగినవాడై ఉండాలి. ఈ విజ్ఞానం సాధారణమైందికాక పరీక్షించబడి, అంగీకరించబడిందిగా ఉండాలి. ఈ విజ్ఞానం పరిశోధనల ద్వారా అభివృద్ధి పరచుకోవడానికి అవకాశం ఉండాలి. ఈ లక్షణాలన్నిటిని సంఘ సంక్షేమ శాస్త్రం కూడా కలిగి ఉన్నది. కనుక సంఘ సంక్షేమ కృషిని వృత్తిగా గ్రహించడం జరిగింది.

## 2 శిక్షణ

మిగతా వృత్తి విద్యలలోవలె సంఘ సంక్షేమ కృషికి కూడా శిక్షణ సంస్థలున్నాయి. 1936 వ సంవత్సరంలో టాటా ఇనిస్టిట్యూట్ ఆఫ్ సోషల్ వర్క్ (Tata Institute of Social Work) సంఘ సంక్షేమ కృషికి వృత్తి శిక్షణ సంస్థ స్థాపించింది. ఇటువంటి సంస్థలు ఇంకా ఆగ్రా, బరోడా, బొంబాయి, కోయంబత్తూరు, ఢిల్లీ, లక్నో, మద్రాసు, వారణాసి, ఉదయపూరు, వాల్తేరు లలో కూడా స్థాపించబడినవి. రెండు సంవత్సరాల కాలపరిమితిలో శిక్షణ పూర్తి చేసి డిగ్రీని ఇవ్వడానికి ఈ సంస్థలు నిర్ణయించాయి. సుశిక్షితులైన సంఘ సంక్షేమ కార్యకర్తలను తయారుచేయడమే ఈ శిక్షణ కేంద్రాల ముఖ్యోద్దేశం. ఈ శిక్షణ కార్యక్రమం మూడుభాగాలుగా విభజించబడింది. 1. బోధనా పద్ధతి 2 క్షేత్రకృషి పర్యవేక్షణ 3. పరిశోధన పద్ధతి.

## 3. ప్రత్యేకత

సంఘసంక్షేమకృషి వృత్తిని స్వీకరించే సంఘసంక్షేమ కార్యకర్త ప్రత్యేక నైపుణ్యతను కలిగి ఉంటాడు. సంఘ సంక్షేమ కృషి శిక్షణ

పొందినవారు ప్రత్యేక విజ్ఞానం, నైపుణ్యత కలిగి, వ్యక్తుల, సమూహాల, సముదాయాల, సమాజాల సమస్యలను వేరువేరుగా పరిశీలించి ప్రత్యేక పద్ధతులలో పరిష్కరించగల ప్రావీణ్యత, నైపుణ్యతను పొందుతారు. అంటే కార్మిక సంక్షేమం, నగర, గ్రామీణ సముదాయాల అభివృద్ధి, వైద్య సాంఘిక సంక్షేమ కృషి, మానసిక వికలాంగుల సంక్షేమ కృషి, సాంఘిక విద్య సాంఘిక రక్షణ, సంఘసంక్షేమ కృషి పరిశోధన, సంఘ సంక్షేమకృషి బోధన మొదలైన రంగాలలో ప్రత్యేక ప్రావీణ్యతను కార్యకర్తలు పొందిఉంటారు. ఈ ప్రత్యేక ప్రావీణ్యతవల్ల సంఘ సంక్షేమ కార్యకర్తలు సంఘ సంక్షేమ కృషిని వృత్తిగా గుర్తించ డానికి కావలసిన ప్రత్యేక నైపుణ్యతను పొందుతున్నారు.

## 4. వృత్తిపరమైన సంస్థలు

భారతదేశంలోని సంఘ సంక్షేమ కార్యకర్తలు ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ సంఘాలుగా ఏర్పడ్డారు. ఇటువంటి సంస్థ మొట్టమొదట భారతదేశంలో "ఇండియన్ కాన్ఫరెన్స్ ఆఫ్ సోషల్ వర్కు" (Indian Conference of Social Work) అనే పేర స్థాపించడం జరిగింది. ఈ సంస్థలో సుశిక్షితులైన సంఘసంక్షేమ కార్యకర్తలు లేరు. 1951వ సంవత్సరంలో సుశిక్షితులైన సంఘసంక్షేమ కార్యకర్తలు సమిష్టిగా కలిసి ఒక సంస్థను ఏర్పరచారు. 1961వ సంవత్సరం అక్టోబరు 8వ తేదీన "ది ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ ది అలమ్ని ఆఫ్ స్కూల్స్ ఆఫ్ సోషల్ వర్క్" అనే సంస్థను స్థాపించడం జరిగింది. భారతదేశంలోగల సంఘసంక్షేమ శాస్త్రంలో శిక్షణ ఇస్తున్న సంస్థల ప్రతినిధులందరు ఇందులో సభ్యులు. ఈ సంస్థ ఉద్దేశాలు—

(1) సంఘ సంక్షేమ కృషి వృత్తి అభివృద్ధికి కృషి చేయడం.

(2) సంఘ సంక్షేమ కార్యకర్తల ఆలోచనా సరళిని నూతన పద్ధతులకు అనుగుణంగా మార్చడం.

(3) సమాజానికి సంఘ సంక్షేమ కృషి వృత్తి గురించి తెలియజేయడం.

(4) సమాజాభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనడం.

(5) వివిధ దశలలో సంఘ సంక్షేమ కృషి వృత్తి శిక్షణా కార్యక్రమాల అభివృద్ధికై సహాయం చేయడం మొదలైనవి.

## 5. వృత్తిపరమైన విలువలు

ఇతర వృత్తులలోవలె సంఘ సంక్షేమ కృషిలో కూడా అనేక వృత్తి విలువలు ఉన్నాయి. ఈ సూత్రాలు విశ్వజనీనమైనవి. దేశం, సంస్కృతి అనే తేడా లేకుండా ప్రతి సంఘ సంక్షేమ కార్యకర్త ఈ విలువలను పాటించడం జరుగుతుంది. సంఘ సంక్షేమ కృషి వృత్తి సూత్రాలు సంఘ సంక్షేమ కార్యకర్త యొక్క సేవార్థులకు, అతని సంస్థకు, అతని సహోద్యోగులకు, అతని సమాజానికి, అతని వృత్తికి సంబంధించినవై ఉంటాయి. అతడు తాను సేవచేస్తున్న వ్యక్తి సమూహ సంక్షేమానికి అత్యంత ప్రాధాన్యత నిస్తాడు. అతని వ్యక్తిగతమైన ప్రాధాన్యతకంటే అతని వృత్తికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తాడు. అతడు సేవార్థి స్వయం నిర్ణయాన్ని గుర్తిస్తాడు. సేవార్థి విషయాలను అతి రహస్యంగా ఉంచుతాడు. ప్రతి సేవార్థిని గౌరవిస్తాడు.

సంఘసంక్షేమ కార్యకర్త ఒక సంస్థలో నియమితుడైన ఉద్యోగి. అతడు తన పై అధికారులపట్ల గౌరవభావంతో ఉంటాడు. అతడు సంస్థ విధానాలను, పద్ధతినీ పరిశీలిస్తూ అతని పై అధికారులకు సరియైన అసలైన విషయాలను తెలియజేస్తాడు. సమాజంలో అతడు పనిచేస్తున్న సంస్థకు మంచి పేరుప్రతిష్టలు వచ్చేరీతిగా కృషిచేస్తాడు.

సంస్థ అభివృద్ధికై అతడు తన సహోద్యోగులకు అన్నివిధాల సహాయ సహకారాలను అందిస్తూ సంఘసంక్షేమ కార్యకర్త అతని సహోద్యోగులపట్ల గౌరవం కలిగి ఉంటాడు.

సముదాయంపట్ల సంఘసంక్షేమ కార్యకర్తకు ఎక్కువ బాధ్యత ఉంటుంది. వృత్తి అభివృద్ధికికూడా అతడు అన్నివిధాల సహాయ సహకారాల నందిస్తాడు. సంఘసంక్షేమ కార్యకర్త వృత్తి విలువలను అశ్రద్ధ చేయడంగానీ సాధారణ వ్యక్తివలె ప్రవర్తించడంగానీ జరగదు.

## 6. సామాజికమైన గుర్తింపు

సంఘసంక్షేమ కృషికి వృత్తిగా గుర్తింపు సమాజంలోకూడా రావాలి. ఈనాడు ప్రజాబాహుళ్యం కూడా సంఘసంక్షేమ కృషిని వృత్తిగా గుర్తిస్తున్నారు. అందువల్లనే కళాశాలలలో సంఘసంక్షేమ శాస్త్ర విభాగంలో విద్యార్థులు డిగ్రీస్థాయిలో చేరడానికి ఉత్సాహం చూపుతున్నారు. విశ్వవిద్యాలయాలలో, కళాశాలలలో సంఘసంక్షేమ శాస్త్ర విభాగాలకు ప్రభుత్వంకూడా అనేక గ్రాంటులను మంజూరు చేస్తున్నది. సంఘసంక్షేమ శాస్త్రం పాఠ్యభాగంగా కలిగి ఉత్తీర్ణులైన పట్టభద్రులను, పోస్టుగ్రాడ్యుయేట్లను, కార్మాగారాలలో కార్మిక సంక్షేమాధికారులుగాను, వైద్యాలయాలలో వైద్య, మానసికసంక్షేమ కార్యకర్తలుగాను, జైలు, బోర్‌స్టల్ పాఠశాలలవంటి సంస్థలలో పర్యవేక్షణాధికారులుగాను, సంక్షేమ కార్యకర్తలుగాను నియమిస్తున్నారు. దీనినిబట్టి మన దేశంలోకూడా సంఘసంక్షేమకృషి ప్రభుత్వం చేత, విశ్వవిద్యాలయాలచేత, ప్రజాభిప్రాయంలో కూడా వృత్తిగా అంగీకరించబడి, స్వీకరించబడిందని తెలుస్తున్నది.

సంఘసంక్షేమకృషి సుశిక్షితులైన సంఘసంక్షేమ కార్యకర్త ద్వారా జరిగినప్పుడే దానిని వృత్తిపరమైన సంఘసంక్షేమకృషి అని అనగలం. అప్పుడే సంఘసంక్షేమకృషి ఒక క్రమబద్ధమైన శాస్త్రీయ పద్ధతిలో జరుగుతోంది.

సంఘసంక్షేమకృషి ఈ కింది లక్షణాలతో ఉండటంవల్ల కూడా వృత్తిగా గ్రహించడమైంది.

1. ఈ వృత్తిని చేపట్టిన కార్యకర్త ఎక్కువస్థాయిలో వ్యక్తిగత బాధ్యతను చేపట్టి ప్రత్యేక నైపుణ్యతను, విజ్ఞానాన్ని వినియోగిస్తాడు.

2. సంఘసంక్షేమ శాస్త్రం విజ్ఞాన సంబంధమైనది. ఇది నేర్చుకోవడానికి అనువుగా ఉంది.

3. ఈ విజ్ఞానాన్ని ప్రత్యేక సంస్థల ద్వారా శిక్షణ ఇవ్వడానికి వీలయ్యే శాస్త్రీయపద్ధతులున్నాయి.

ని పెంపొందించుకుని, లక్ష్యాలను అభివృద్ధి పరచుకోడా
న్నాయి.
క్షేమ కృషి ఉద్దేశాలు, ఫలితాలు, లిఖితపూర్వకంగా
కమే కాకుండా విజ్ఞానాన్ని ప్రయోగాత్మకంగా పరిశీలించి
నికి కూడా వీలవుతుంది.
క్షేమ కృషి జనబాహుళ్య ఉద్దేశాలను, సంక్షేమాన్ని
ర్చుకోవడం జరుగుతుంది.

## క్షేమ కృషి - శాస్త్రీయ పద్ధతి

సంక్షేమ కృషికి బలీయమైన శాస్త్రీయ పద్ధతి పునాది
ప సంక్షేమ కృషి కోసం శాస్త్రీయ పద్ధతి ఆవశ్యకత
ని. సామాజిక సమస్యలను క్షుణ్ణంగాను, సక్రమంగాను పరి
ప్రత్యేక విజ్ఞానం, నైపుణ్యత, సక్రమమైన పద్ధతి ఉండాలి.
యు పద్ధతి అంటారు. ఈ విజ్ఞానం, నైపుణ్యత, పాఠ్యగ్రంథ
ంక వాటిని క్షేత్ర కృషి ద్వారా నిరూపించడానికి కూడా
ది. క్షేత్ర కృషిని శాస్త్రీ పద్ధతిలో చేయడానికి వీలుంది.
ంలో ప్రయోగాత్మకంగా శిక్షణ పొందడానికి ప్రత్యేకంగా
తో నిర్మించిన ప్రయోగ శాలలు ఉంటాయి. కానీ సంఘ
స్త్రాన్ని ప్రయోగాత్మకంగా నిరూపించడానికిగాను పరిమిత
గశాలను నిర్మించడం అసాధ్యం. ఎందుకంటే సమాజమే
రు శాస్త్ర ప్రయోగశాల. ఈ సమాజం ప్రయోగశాలను
ప కార్యకర్త తనకు అనుకూలంగా ఏర్పరచుకోలేదు. అందు
యోగశాలకు అనుకూలంగా తాను సర్దుబాటు చేసుకుని
హాల, సముదాయాల సమస్యలను ప్రయోగాత్మకంగా

త్రీయమైన సంఘ సంక్షేమ కృషివల్ల రెండు విధాలైన
స్తుంది. 1. పరిశోధన ద్వారా నిర్ణయించిన విజ్ఞానం.

2. ఊహాపై పెంపొందించిన విజ్ఞానం. ఈ విజ్ఞానాన్ని ప్రయోగాలద్వారా పరిశీలించి, అనేక పర్యాయాలు పరీక్షించి విజ్ఞానంగా రూపొందించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## ఆధునిక భావన - మౌలిక విశ్వాసాలు

వ్యక్తి సంక్షేమానికి, అభివృద్ధికి కృషి చేయడమే సంఘ సంక్షేమ కృషి ముఖ్యోద్దేశ్యం. వ్యక్తులు, సమూహాలు, సముదాయాలు, సాంఘిక, ఆర్థిక, నైతిక రంగాలలో వీలైనంత మేరకు సంక్షేమాన్ని పొందేలాగ చేయడమే సంఘ సంక్షేమ కృషి ప్రధాన లక్ష్యం. సంఘ సంక్షేమ కృషి లక్ష్యాలను, మానవతాభావన సిద్ధాంత సూత్రాలను పరిశీలించినట్లయితే ఈ శాస్త్రం కొన్ని మౌలిక విశ్వాసాలపై ఆధారపడి ఉన్నట్లు తెలుస్తుంది. సంఘ సంక్షేమ కృషి మౌలిక సూత్రాలను ఈ కింది విధంగా పేర్కొనవచ్చు.

1. ప్రతీ వ్యక్తికి స్వతఃసిద్ధమైన విలువ, ఔన్నత్యం, హుందాతనం ఉంటాయనే విశ్వాసం :-

ప్రతీ సంఘ సంక్షేమ కార్యకర్త ఈ నమ్మకాన్ని మనసులో ఉంచుకోవడం ద్వారా అతడు బలీయమైన, దృఢమైన వృత్తి బాంధవ్యాన్ని ఏర్పరచుకోగలడు. వ్యక్తిని సమస్యగాను, శక్తి సామర్థ్యాలు, గౌరవంలేని వ్యక్తిగాను కాకుండా అతనిని సాటి మానవునిగాను, అతని సమస్యలవలన అతని శక్తి సామర్థ్యాలు, హోదా తాత్కాలికంగా మరుగున పడినవని కార్యకర్త భావించినట్లయితే అతడు సంఘ సంక్షేమ కృషి ఆశయాన్ని సఫలీకృతం చేయగలడు.

2. ప్రతి వ్యక్తి తన అవసరాలేమిటో తెలుసుకుని ఆ అవసరాలను తానే తీర్చుకొనే హక్కును కలిగి ఉన్నాడనే నమ్మకం :-

ఈ నమ్మకం ప్రజాస్వామిక విలువలతో ముడిపడి ఉంది. ప్రతి వ్యక్తి తన అవసరాలను, సమస్యలను అవగాహన చేసుకొని, ఆ అవసరాలను ఏ విధంగా తీర్చుకోవాలి. ఆ సమస్యలను ఏ విధంగా పరిష్కరించుకోవాలి. అనేది నిర్ణయించుకొనే హక్కును కలిగి ఉన్నాడు.

స్వయం నిర్ణయ శక్తి ప్రతి సేవార్థిలోను కలిగించినపుడే సంఘ సంక్షేమ కృషిలో గల ముఖ్య ఉద్దేశమైన "స్వయం సహాయం" అభివృద్ధి చేసుకోగలడు.

3. వ్యక్తుల సహజ సిద్ధమైన శక్తి సామర్థ్యాలనుబట్టి వారికి సమానావకాశాలుంటాయనే విశ్వాసం :-

కుల, మత, వర్గ, రాజకీయ భేదాలు లేకుండా సంఘ సంక్షేమ కృషి కార్యక్రమాలు అందరికీ అందుబాటులో ఉండేలాగ చేయాలి. వ్యక్తులందరికీ సమానావకాశాలు కలిగించే బాధ్యత సంఘ సంక్షేమ కార్యకర్త మీద ఉంది.

4. వ్యక్తి సంక్షేమంతో కుటుంబ సంక్షేమం, సామాజిక సంక్షేమం కూడా ముడిపడి ఉన్నాయనే నమ్మకం :-

వ్యక్తి కుటుంబ సభ్యుడే కాక సమాజంలో కూడా సభ్యుడే అన్న నిజాన్ని సంఘసంక్షేమ కార్యకర్త వ్యక్తి సంక్షేమానికి, అభివృద్ధికి కృషిచేస్తున్నప్పుడు అతని కుటుంబ సంక్షేమం, సామాజిక సంక్షేమాన్ని కూడా దృష్టిలో పెట్టుకుని కృషిచేయాలి.

## సంఘ సంక్షేమ కృషి - విలువలు

సంఘ సంక్షేమ కృషి మానవతా విలువలమీద, తాత్విక విలువలపైనకూడా ఆధారపడి ఉంది. వ్యక్తిని వ్యక్తిగా గౌరవించాలి. అనే సూక్తిమీద సంఘసంక్షేమకృషి ఆధారపడిఉంది. ఏ వ్యక్తికూడా కష్టాలను, బాధలను ఆహ్వానించడు. వ్యక్తి బాధలకు గురిఅయ్యాడంటే పరిస్థితుల ప్రభావంగానీ లేదా అతడి మానసిక, శారీరక బలహీనతలుగానీ కారణంకావచ్చు. కనుక వ్యక్తి బాధలు, సమస్యల మూలంగా వ్యక్తిని అగౌరవపరచకుండా అతనిపైగల పరిసరాల దుష్ప్రభావాన్ని శారీరక మానసిక బలహీనతలను తొలగించడానికి సంఘసంక్షేమ కార్యకర్త ప్రయత్నించాలి. వీటిద్వారా వ్యక్తి బాధలను తగ్గించడంగానీ లేదా శాశ్వతంగా పరిష్కరించడంగానీ చేయాలి.

వ్యక్తిని వ్యక్తిగా గౌరవించాలి. కానీ అతని గౌరవం అతని సాంఘిక, ఆర్థిక, నైతిక పరిస్థితులమీద ఆధారపడి ఉండరాదు అనేది సంఘసంక్షేమ కృషి నైతిక విలువలలో అతిముఖ్యమైన అంశం సంఘ సంక్షేమకృషి జాతి, మత, లింగభేదాల కతీతంగా సర్వమానవ సంక్షేమానికి ఉద్దేశితమైంది. సంఘసంక్షేమ కృషిలో కార్యకర్తకు అనేక తరహా వ్యక్తులు తారసపడతారు. వ్యక్తి ఎటువంటి స్వభావంగలవాడైనప్పటికి అతడికి స్వయంనిర్ణయం చేసుకునే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కార్యకర్త ఇవ్వాలి.

వ్యక్తి, సమాజం వేరుగాదు. సంఘ సంక్షేమ కార్యకర్త వ్యక్తి సంక్షేమమంటే సామాజిక సంక్షేమంగా గుర్తించాలి. సంఘసంక్షేమ కార్యకర్త దృష్టి వ్యక్తి సంపూర్ణ సంక్షేమంపై కేంద్రీకృతమై ఉంటుంది. సేవార్థి సమస్యకు దారితీసిన ప్రతి సూక్ష్మ, స్థూల కారణాలను ఒకేవిధంగా పరిశీలించి, ప్రాముఖ్యతనిచ్చి అతని సమస్యా పరిష్కారణకు సంక్షేమానికి కార్యకర్త కృషిచేస్తాడు.

ఈ విధంగా సంఘ సంక్షేమకృషి కొన్ని పటిష్టమైన విలువలను కలిగి ఉంది. ఈ విలువల నన్నిటిని సంఘసంక్షేమ కార్యకర్త తప్పని సరిగా పాటించాలి. సంఘసంక్షేమకృషి విలువలు ఈ కింద పేర్కొనడం జరిగింది.

1. ప్రతి వ్యక్తి సంఘానికి ఆయువుపట్టు.
2. సంఘంలో ప్రతివ్యక్తి ఎటువంటి హోదాలో ఉన్నప్పటికీ అతడికి ఎప్పుడో ఒకప్పుడు ఇతరుల అవసరం కలుగుతూ ఉంటుంది. కనుక ప్రతివ్యక్తి ఇతరులపై ఆధారపడటం అనేది అనివార్యం.
3. సంఘంలో ప్రతి సభ్యునికి కూడా అతని అభ్యుదయాలతోపాటు సమాజాభ్యుదయ బాధ్యతకూడా ఉంటుంది.
4. కనీసావసరాలు అందరికీ ఒకటే అయినా వాటిని పొందటంలోను, వినియోగించు కోవటంలోను భేదం ఉంటుంది. దీనిమూలంగా సంఘంలో ప్రతిజీవి ప్రత్యేక జీవిగా కనబడతాడు.

5. ప్రజాస్వామ్య సూత్రాలే ప్రతిసంఘానికి ముఖ్యోద్దేశాలు. సంఘ జీవన సమగ్రతకు, అభివృద్ధికి ప్రతివ్యక్తి ఉనికిని, శక్తిని, అవసరాలను గుర్తించి వాటిద్వారా సంఘంలో వ్యక్తులను సంఘ పురోభివృద్ధికి బాధ్యులుగాను, సాధకులుగాను తయారుచేయాలి.
6. ప్రతివ్యక్తి సంఘ శ్రేయస్సే ముఖ్యోద్దేశంగా భావించాలి. ఈ ఉద్దేశాన్ని సాధించడానికి కావలసిన అవకాశాలను కల్పించడానికి సంఘమే బాధ్యత వహించాలి.

సంఘసంక్షేమకృషి, వ్యక్తి సేవాపద్ధతి, సమూహ సేవాపద్ధతి, సాముదాయిక వ్యవస్థాపన, సామాజికచర్య మొదలైన పద్ధతులద్వారా జరుపబడుతోంది.

సంఘసంక్షేమకృషి – మత, మానవతా విలువలకుగల సంబంధం :–

సంఘసేవ అనేది పురాతన కాలంనుంచి కూడా ఆచరణలో ఉంది. సంఘసేవ మతప్రేరితమైనదిగాను, మానవతా ప్రేరితమైనదిగాను ఉండేది. రాజులు, ధనికులు, సంఘంలో పలుకుబడి గలవారు పేదవారిని, అనాధలను ఆదుకుని సహాయం చేయడం తమ ధర్మంగాను, బాధ్యతగాను తలచేవారు. మతోపదేశంవల్ల వీరందరూ దానధర్మాలు చేసి, ధర్మశాలలను స్థాపించి పేదవారిని, అశక్తులను పోషించేవారు. హిందూ ధర్మశాస్త్రాలు, వేదాలు, పురాణాలు, దానధర్మాలు మొదలైనవి పుణ్యకార్యాలుగా చెబుతున్నాయి. అంతేగాక మానవతా దృక్పధంకూడా వ్యక్తులలో సంఘసేవాభిలాషను పెంపొందిస్తున్నది.

"మానవసేవే మాధవసేవ" అనే నానుడిని నమ్ముకొని హిందూ మత ధర్మం ప్రకారం రాజులు, ధనికులు, జమీందారు, సేవా సంస్థలను స్థాపించడం, చెరువులను, బావులను తవ్వించడం, మఠాలు, విద్యాసంస్థలు స్థాపించడం మొదలైన అనేక పుణ్యకార్యాలను చేశారు.

క్రైస్తవ మత ప్రచారకులు, వారి అనుచరులు, తమ మత సూక్తులకు అనుకూలంగా అనేక సంఘ సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొని కేవలం క్రైస్తవులకేకాక ఇతర మతాల వారికి కూడా సేవ

చేయటం జరుగుతోంది. సర్వమానవ సమానత్వం, భ్రాతృత్వం, మానవ సేవ, దయ, జాలి మొదలైన భావాలు వీరిని సంఘ సేవకులుగా చేశాయి.

జాలి, దయ, దానధర్మాలు అన్ని మతాల సిద్ధాంతాలలోను ఇమిడి ఉన్నాయి. ఆధ్యాత్మిక ప్రగతి, దీనులను, పేదవారిని, అనాధలను ఆదరించడం అనేవి మహమ్మదీయ మతంలో ప్రముఖంగా ఉన్నాయి. ప్రతి మహమ్మదీయుడు తన సంపాదనలో ఎంతో కొంత సొమ్మును ప్రజాసేవకై వినియోగించడం తమ బాధ్యత అన్నది - వారి సిద్ధాంతము. మహమ్మదీయుల మత గ్రంథమైన ఖురానులో జకత్, సాదక్, కైరత్ అనే మూడు పద్ధతులు పేర్కొనబడ్డాయి. జకత్ అంటే ప్రతి వ్యక్తి తన ఆస్తిలో కొంత భాగం దానధర్మాలు చేయడానికి వినియోగించడం. సాదక్, కైరత్ అంటే ప్రతి వ్యక్తి సాటి మానవులపట్ల జాలి సానుభూతి కలిగివుండటం, ఇతరులు కష్టకాలంలో ఉన్నప్పుడు వారిపై దాక్షిణ్యంతో, జాలితో చేసే సహాయం లేదా ధర్మం అని అర్థం.

పార్శీమతం కూడా ఇతరుల సుఖ సంతోషాల కోసం పాటుపడిన వారికే సుఖ సంతోషాలు లభిస్తాయనే తాత్విక సిద్ధాంతంపై ఆధారపడి ఉంది. ఈ తాత్విక సిద్ధాంతంవల్ల పార్శీ మతస్థులు సాంఘిక సంక్షేమ భావన కలిగి ఉన్నారు. పార్శీ మతస్తులు అనేక సంక్షేమ నిధులనుకూడా ఏర్పాటు చేసుకున్నారు. పార్శీ మతస్థులు విద్య, వైద్య రంగాలలోనే కాకుండా గృహ నిర్మాణానికి, ఉచిత భోజన, మండప నిర్మాణానికి కృషి చేస్తున్నారు.

సిక్కు మతంలో కూడా సంఘసేవ కనిపిస్తుంది. గురునానక్, అతని తరువాత గురువులు, సిక్కు మతాన్ని అభివృద్ధి పరచడమే కాక మానవ జీవితంలో సేవాగుణ నిరతి, దయార్ద్ర స్వభావం, నిస్వార్థత మొదలైన లక్షణాలు చాలా ముఖ్యమైనవని బోధించినారు, అందరూ కలసి భుజించడానికి విశ్రాంతి తీసుకోవడానికి భోజన శాలలను, విశ్రాంతి శాలలను నిర్మించారు. ఈమతంలో కూడా సేవా తత్పరతవల్లనే జన్మ రాహిత్యం కలుగుతుందని, అదే జీవిత చరమ లక్ష్యమని చెప్పబడింది.

గురుగోవిందసింగు బోధనల ప్రకారం ప్రతి సిక్కు తన రాబడిలో పదవ భాగం సంఘసేవకు ఖర్చుచేయాలని బోధించాడు.

## సంఘ సంక్షేమ కృషి - శాస్త్రీయ భావన

పై చెప్పిన విధంగా భారతదేశంలో వివిధ మతాలవారు, వివిధ పద్ధతులలో సంఘసేవచేసి సంఘాభ్యుదయానికి పాటుపడ్డారు. కానీ ఈ సంఘ సేవ, సంఘ సంస్కరణ, కార్యక్రమాలన్నీ 20 వ శతాబ్దం వరకు మత దృష్టితోను, మానవతా దృక్పథంతోను మాత్రమే కొనసాగాయి ఈ పద్ధతులన్నీ సాటి మానవునికి కష్టాలలో సహాయపడటం తమ కనీస ధర్మంగా భావించి చేసిన కార్యక్రమాలు దీనివల్ల బాధితులకు తాత్కాలిక ఉపశమనం మాత్రమే లభించింది. ఈ తాత్కాలిక ఉపశమనం వల్ల సమస్యలకు శాశ్వత పరిష్కారం లభించడం లేదు. క్రమక్రమంగా సమస్యలు క్లిష్టతరమవడంవల్ల వాటి ఉపశమనానికి మత, మానవతా దృక్పథాలు సరిపోలేదు. సమస్యలను క్షుణ్ణంగా పరిశీలించి శాస్త్రీయ పద్ధతిలో పరిష్కరించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. సమస్యల పుట్టు పూర్వోత్తరాలు, వాటి కారణాలు, క్షుణ్ణంగా పరిశీలించి, ఆ సమస్యల శాశ్వత పరిష్కరణకోసం, బాధితుల పునరావాస సౌకర్యాలకోసం కృషి చేయవలసి ఉంది. వీటన్నిటికి సాధారణ పద్ధతులు సరిపోలేదు. క్రమబద్ధమైన శాస్త్రీయపద్ధతి ఆవశ్యకత ఏర్పడింది. 1936 వ సంవత్సరంలో మనదేశంలో గ్రాడ్యుయేటు స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్ (graduate School of Social work) తాతా వారిచే బొంబాయి నగరంలో స్థాపించబడింది. ఇక్కడ శాస్త్రీయ పద్ధతిలో సంఘసేవ చేయడానికి సంఘసంక్షేమ శాస్త్రాన్ని బోధించడం జరుగుతుంది. సంఘసంక్షేమ కార్యకర్తకు సంఘసంక్షేమ కృషిలో తర్ఫీదునిచ్చి సంఘసంక్షేమ కృషి శాస్త్రపరిజ్ఞానాన్నే గాకుండా మానవ, మనోవిజ్ఞాన, సామాజిక శాస్త్రాలలోకూడా పరిజ్ఞానాన్ని కలుగచేస్తున్నది.

ప్రస్తుత యుగంలో సంఘసంక్షేమ కృషి ఒక శాస్త్రీయ పద్ధతిగాను, ప్రభుత్వంలో ఒక విభాగంగాను, ఉనికిని ఏర్పరచుకొంది. సంఘ

సంక్షేమకృషి శాస్త్రీయపద్ధతిలో మతప్రమేయం లేకపోయినప్పటికీ మానవతా దృక్పథం మాత్రం తప్పనిసరిగా ఉంటుంది. మానవతా దృక్పథంతోపాటు ఒక క్రమబద్ధమైన శాస్త్రీయపద్ధతిని ఉపయోగించి వ్యక్తుల, సమూహాల, సముదాయాల, సమాజాల సమస్యలను పరిష్కరించి, వ్యక్తికి, సమూహానికి, సముదాయానికి, సమాజానికి శాశ్వతమైన ఉపశమనాన్ని కలిగించడమే సంఘ సంక్షేమ కృషి శాస్త్రీయ పద్ధతి ధ్యేయం.

# 2

# భారతదేశంలో సంఘ సంక్షేమ కృషి-పుట్టుపూర్వోత్తరాలు

(Historical and Philosophical back ground of Social Work in India)

## భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వానికి పూర్వం జరిగిన సాంఘిక సేవలు

భారత దేశ సంస్కృతిలో సనాతన కాలం నుంచి ఆర్తులకు సేవ చేయడం, కష్టాలలో ఉన్న తోటి మానవులకు సహాయపడటం, అనే భావాలు చాలా విలువైన స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. భారత దేశంలోగల సమస్త మతాల సూక్తులు అనాథలకు దానంచేయడంలో ప్రాధాన్యత నివ్వాలని తెలుపుతున్నాయి. అన్ని మతాల వారు కూడా "మానవ సేవయే మాధవ సేవ" అనే సూక్తికి అత్యంత ప్రాధాన్యత నిస్తున్నారు.

దేశంలోని ప్రభుత్వాలు, ధనికులు, సమాజంలో గల ఆర్తులకు సహాయం చేసే బాధ్యతను చేపట్టారు. వారు సమాజంలో దేవాలయాలను నిర్మించడం, ధర్మసత్రాలను నిర్మించడం మొదలైన కార్యక్రమాలను చేపట్టడమేకాక వాటిని సక్రమ పద్ధతిలో నిర్వహించడానికి కూడా బాధ్యతను వహించారు. వాటి ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి పరచడానికి నిరాశాలను ఇవ్వడం, చందాలను వసూలు చేయడం మొదలైన కార్యక్రమాలను కూడా చేపట్టారు. అంతేకాక సాధువులకు గృహవసతులను ఏర్పాటు చేయడం, దేవాలయాలలోను, సత్రాలలోను, మఠాలలోను నివసించే సాధువులకు, అనాథలకు అన్నవస్త్రాలను అందచేసే కార్యక్రమాలను నిర్వహించేవారు.

అహ్మద్ ఖాన్ కళాశాల విద్యా విధానంలో కొత్త మార్పులను ప్రవేశపెట్టింది. 1906 లో ముస్లిమ్ ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్స్ సంస్థ స్థాపించబడింది. ఇది ముస్లిమ్ విద్యా విధానంలో గల సమస్యలను చర్చించింది.

లక్నోలోని "ముంతాజ్ ఆర్ఫనేజ్" అనాధలను చేరదీసి వారికి విద్య నేర్పి పరిశ్రమలో శిక్షణ నిస్తున్నది. మసీదుల ద్వారా ఈ సేవలు జరుగుతున్నా ప్రస్తుతావసరాలకు అవి సరిపోవడంలేదని గ్రహించి అవసరమైన మార్పులను ప్రవేశపెట్టడం జరిగింది. అర్హతగల యువకులకు ధన సహాయం చేయడం, అనాధలను కాపాడటం మొదలైన కార్యక్రమాలేకాక పేదలకు ఉచితంగా వైద్య సౌకర్యాలు కల్పించి ధర్మ వైద్యశాలలను కూడా నిర్మించారు. యాత్రాస్థలాలలో ఉచిత భోజన శాలలు, విశ్రాంతి గృహాలు నిర్మించి అనేకమంది యాత్రికులకు ఇప్పటికీ సహాయం చేస్తున్నారు. వివిధ వృత్తులకు చెందినవారు తమతమ వృత్తి సంఘాలలోని అనాధ స్త్రీలకు ఆశ్రయాలను కల్పించడం, యుక్త వయస్కులైన యువతులకు వివాహాలు జరిపించడం, అనాధ మృత దేహాల అంత్యక్రియలకు సహాయం చేయడం మొదలైన సేవా కార్యక్రమాలలో అనేకమంది పాల్గొనేవారు. నిరుద్యోగాన్ని ఒక సమస్యగా గ్రహించి నిరుద్యోగులైన యువకులకు ఉద్యోగావకాశాలను ఏర్పరచే బాధ్యతను కూడా కొందరు స్వీకరించారు.

## క్రైస్తవ మతం - సంఘసేవ

క్రైస్తవ మతంలోకూడా సంఘసేవకు ప్రధానస్థానం ఉంది. క్రైస్తవ మత ప్రచారకులు, వారి అనుచరులు, అనేక సంఘసంక్షేమ కార్యక్రమాలలో పాల్గొని క్రైస్తవ మతానుయాయులకేకాక ఇతర మతాలవారికికూడా సేవను అందజేసున్నారు. వారిమతంలో బోధించిన సర్వమానవ సమానత్వం, సౌభ్రాతృత్వం, మానవసేవ, దయ, జాలి, మొదలైన భావాలు వీరిని సంఘసేవకు ప్రోత్సహించాయి. కనుక నిత్య జీవితావసరాలకు నోచుకోనివారికి సేవచేయడం తమ జీవిత

లక్ష్యంగా భావిస్తారు, అశక్తులైనవారిని, వారికుటుంబాలను ఆదుకుంటూ ఉండేవారు. ప్రతి గృహంలోను రోజుకి ఒకరిద్దరు పేదవారినిగానీ, బాటసారులనుగానీ, ఆదుకుంటూ ఉండేవారు.

16వ శతాబ్దంలో కేథలికులు ఎన్నో సంక్షేమ సంస్థలను స్థాపించారు. 1516 లో పోర్చుగీసువారు అశక్తులు, అనాథలు, ఖైదీలు మొదలైనవారికి సేవచేసే నిమిత్తం ఒక సేవాసంస్థను గోవాలో స్థాపించారు. ఈ సంస్థ అనేక వైద్యశాలలను, సేవాసదనాలను ఏర్పరచి మానసిక రోగులకు, కుష్ఠురోగులకు సేవచేసే బాధ్యతను స్వీకరించింది. సెయింట్ జేవియర్ 1545 లో గోవాను దర్శించి ప్రాథమిక పాఠశాలలను, కళాశాలలను, సేవాసదనాలను నెలకొల్పి ప్రజాసేవ చేశాడు. 1962 లో "కేథలిక్ డైరక్టరీ ఆఫ్ ఇండియా"లో 4,229 ఉన్నట్లు, వాటిలో 9.20,309 విద్యార్థులు ఉన్నట్లు పేర్కొనడం జరిగింది. ఈ సంస్థలు కొంతజాతి బాలుర సంరక్షణ, శిక్షణ బాధ్యతలనుకూడా స్వీకరించినట్లు తెలుస్తుంది. స్త్రీ, పురుషుల శిక్షణా పాఠశాలలను, పారిశ్రామిక, వ్యవసాయిక శిక్షణా పాఠశాలలను కూడా స్థాపించారు.

ప్రొటెస్టెంటు క్రైస్తవులు విద్యావ్యాప్తికోసం అనేక కార్యక్రమాలను చేపట్టారు. అలగ్జాండర్, డాక్టర్ జాన్‌విల్సన్, జాన్ అండర్సన్‌లు కలకత్తా, బొంబాయి మద్రాసులలో వరుసగా విద్యావ్యాప్తికి పాటుపడ్డారు. అనేక పాఠశాలలను, కళాశాలలనుకూడా స్థాపించారు. స్త్రీలకు ప్రత్యేక పాఠశాలలను స్థాపించి స్త్రీ విద్యను ప్రోత్సహించారు. విద్యారంగంలోనేకాక వైద్యరంగంలో కూడా వీరు అనేక కార్యక్రమాలను చేపట్టారు. 1962 నాటికి ఈ సంస్థలు 69 వైద్యశాలలను స్థాపించాయి. అవసరమైన అన్ని పరికరాలతోపాటు శిక్షణపొందిన వైద్యులు, నర్సులు, ఆయాలతో ఆ సంస్థను నడపడం జరిగింది. అంతేకాక క్షయ, కుష్ఠు మొదలైన దీర్ఘకాలిక రోగులకు ప్రత్యేకమైన వైద్యశాలలను నిర్మించారు. మలేరియాను, సుఖరోగాలను ఎదుర్కొనడంలోను, మానసిక అనారోగ్య చికిత్సా శిక్షణలోను, నర్సులకు శిక్షణ ఇవ్వటంలోను వీరుచేసిన కృషి ప్రశంసనీయమైంది.

వైద్య, విద్యా సంస్థలేకాక మానవ అవసరాలను తీర్చటానికి, ఆపదలను ఎదుర్కోటానికి అనేక ధర్మ సంస్థలను స్థాపించడం జరిగింది. అనాథ శరణాలయాలు, శిశు గృహాలు, వికలాంగులను, పేదవారిని ఆదరించే సంస్థలు మొదలైనవాటిని కూడా స్థాపించారు. భారత దేశంలో వివిధ పరిస్థితులలో వచ్చిన శరణార్థులను ఆదుకోటానికి వీరు చాలా సౌకర్యాలను ఏర్పరచారు.

క్రైస్తవ సంస్థలలో వై. ఎమ్. సి. ఎ. (Y.M.C.A.) యువజనుల పురోభివృద్ధికోసం స్థాపితమైన మొట్టమొదటి సంస్థ. ఈ సంస్థ జాతి, మత, రాజకీయ విచక్షణలేకుండా ఆపత్సమయాలలో విపత్తులకు లోనైన వారిని ఆదుకుంటుంది.

## పార్శీమతం - సంఘసేవ

పార్శీమతస్థులు కూడా సంఘ సంక్షేమానికి కొంత కృషి చేసినట్లు తెలుస్తున్నది. ఇతరుల సౌకర్యానికి పాటుపడిన వారికే సుఖ సంతోషాలు లభిస్తాయనే తాత్విక సిద్ధాంతంపై పార్శీల సంక్షేమ భావన ఆధారపడి ఉన్నది. అంజుమన్ అనే సంస్థ పార్శీల సాంఘిక సేవా కార్యక్రమాలకు స్థాపితమైంది. సామాన్యుల అవసరాలను తీర్చడానికి వీరు దేవాలయాలను నిర్మించారు. పార్శీ సమాజం అనేక సంక్షేమ నిధులను ఏర్పరచింది. పార్శీ సమాజం విద్య, వైద్య సౌకర్యాలకు, గృహనిర్మాణ పథకాలకు, భోజనమంటప నిర్మాణానికి వివాహాలకు కూడా అనేక సహాయ కార్యక్రమాలను చేపట్టింది. ప్రసూతిగృహాలు, ధర్మశాలలు, పాఠశాలలు, వైద్యశాలలు, అనాథ శరణాలయాలు మొదలైనవాటిని పార్శీ సమాజం నారు నిర్మించి సాంఘిక సేవచేస్తున్నారు. పాఠశాలలలో మధ్యాహ్న భోజన సదుపాయాలను 25 సంవత్సరాలకు పూర్వమే వీరు నడుపుతున్నట్లు తెలుస్తోంది.

## సిక్కుమతం - సంఘ సేవ

సిక్కు మతస్థులు కూడా సంఘసేవకోసం కృషిచేస్తున్నారు. సిక్కుమత గురువులు సిక్కుమతాన్ని పెంపొందించడమేకాక మానవ

జీవితంలో సేవ, దయ, నిస్వార్థత చాలా ముఖ్యమైనవని బోధించారు. అందరూ కలసి భోజనం చెయ్యడానికి, విశ్రాంతి తీసుకోడానికి భోజన శాలలను, విశ్రాంతి గృహాలను నిర్మింపచేశారు. ఈ మతంలో కూడా సేవా తత్పరత వల్లనే జన్మరాహిత్యం కలుగుతుందనీ, అదే జీవిత చరమలక్ష్యమని చెప్పడం జరిగింది. నిస్వార్థంతో సేవచేసేవారే దేవుని చేరగలరని సిక్కు-మత గురువులు బోధించారు. ఈ మత గురువుల జీవితాలు ఉత్కృష్ట సంఘసేవకు నిదర్శనాలు. వీరి ఉచిత భోజన శాలలను గురుపాకశాల అంటారు. ఈ పాకశాలలోని వంట, వడ్డన, పాత్రలను శుభ్రపరచడం మొదలైన పనులన్నింటిలో పాల్గొనేవారు తమకు ఇది గొప్ప అవకాశమనీ, అదృష్టమనీ, భావిస్తారు.

సిక్కు-మత గురువుల ప్రబోధనల ప్రకారం ప్రతి సిక్కు తన రాబడిలో 10వ భాగం సంఘసేవకు ఖర్చుచేయాలి. దానధర్మాలను ధనరూపేణా స్వీకరించడానికి కొన్ని సంస్థలు అనాథ శరణాలయాలు, వైద్యశాలలు, కుష్ఠురోగులకు, ప్రత్యేక సేవాసదనాలు, అంధులకు ప్రత్యేక పాఠశాలలు మొదలైనవి నడుపుతున్నాయి.

క్రమక్రమంగా భారతదేశంలో రాజులు, రాజ్యాలు అంతరించాయి. ప్రజాసంక్షేమం సాంఘిక సంస్థలలో విలీనమయింది. సమష్టి కుటుంబం కులవ్యవస్థలు, పంచాయతీ సమితులు మొదలైన సాంఘిక సంస్థలలో సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు తమ బాధ్యతలుగా పేర్కొనడం జరిగింది. సమష్టి కుటుంబం, కులవ్యవస్థ వ్యక్తుల సమస్యలను పరిష్కరించి వారి అభివృద్ధికి సహాయపడేవి. సంఘసేవ ఏ సంస్థద్వారా జరిగినా, ఏరూపాన జరిగినా, మతబద్ధమైనదిగా ఉండేది. బుద్ధుని కాలంనాటినుంచి నేటివరకు భారతదేశంలో ఎంతోమంది సంఘ సంక్షేమార్థమై సంఘసేవచేశారు.

## ఆంగ్ల ప్రభుత్వం - భారత సమాజంపై దాని ప్రభావం

కాలక్రమంగా ఆంగ్ల ప్రభుత్వ పరిపాలనా విధానంవల్ల సంఘ సేవా పద్ధతులలో చాలా మార్పులు వచ్చాయి. 18 వ శతాబ్దం చివ

రీలో విద్యావంతులైన భారతీయుల దృక్పథాలలో మార్పులు వచ్చాయి. సాంఘిక జీవన విధానంలోని లోపాలను గుర్తించడం, వాటిని సంస్కరించడం మొదలైన వాటిలో అభిలాష ఏర్పడింది. బెంగాలులో శరంపూరు మిషనరీలు కొంత సంస్కరణను తేవడానికి ప్రయత్నించారు.

బాల్యవివాహాలు, బహుభార్యాత్వం, శిశుబలి, సతీసహగమనం మొదలైన సాంఘిక దురాచారాలను మానిపించడానికి వారు ప్రయత్నించారు.

ఆంగ్ల ప్రభుత్వ ప్రభావంవల్ల గ్రామీణ ప్రాంతాల ఆర్థిక పరిస్థితులు దెబ్బతిన్నాయి. నిరుద్యోగులు, నిరాశ్రయులు పట్టణాలకు వలస పోవడం మొదలుపెట్టారు. నగర జీవితంలోను, ప్రజల సాంఘిక జీవన విధానంలోను ఎన్నో మార్పులు వచ్చాయి. కులమత ప్రభావాలు తగ్గిపోయినాయి. సమష్టికుటుంబాలు విచ్ఛిన్నమైనాయి. ప్రజలలో స్వయం పరిపాలనా, ప్రజాస్వామ్య భావనలు రేకెత్తాయి.

ఈ నూతన దృక్పథంలో రాజారామమోహనరాయ్ సంఘ సంస్కరణకు పూనుకొన్నాడు. అతడు విగ్రహారాధనను నిరసించి ఏకేశ్వరోపాసనకు బ్రహ్మసమాజాన్ని స్థాపించాడు. అతని తరువాత స్వామీ దయానంద సరస్వతి, రామకృష్ణపరమహంస, వివేకానందుడు ప్రార్థనా మందిరాలను ఏర్పరచారు. ఈ సంస్థలన్నిటికీ మతం, మానవతాపరమైన భావనలు మూలాధారాలు. 1905 లో గోపాలకృష్ణగోఖలే సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ స్థాపించి శాస్త్రీయ పద్ధతులలో సేవా విధానాన్ని ప్రవేశపెట్టాడు. దీనినిబట్టి సాంఘిక సంక్షేమం మూడు దశలలో మారినట్లు తెలుస్తోంది.

మొదటి దశ – ఆధ్యాత్మిక పరమైంది.

రెండో దశ – సాంఘిక దురాచారాల నిర్మూలనకు ఏర్పడిన సంఘ సంస్కరణోద్యమం.

**మూడో** దశ - మొదటి రెండు దశల నుండి ఉద్భవించిన సంఘ సంక్షేమ కృషి.

గాంధీమహాత్ముని ప్రవేశంతోను, భారత జాతీయ కాంగ్రెస్ సంస్థాపనతోను, అనేక సాంఘికసమస్యలు ప్రజల దృష్టిని ఆకర్షించాయి. అంటరానితనం, స్త్రీ స్వాతంత్ర్యం, కులవిధానం మొదలైన విషయాలలో కొంత అభ్యుదయాన్ని సాధించడం జరిగింది. మద్యపానం, వ్యభిచారం మొదలైన సాంఘిక సమస్యలను నిర్మూలించడానికి ప్రయత్నాలు జరిగాయి. నిరక్షరాస్యతను రూపుమాపడానికి ప్రయత్నాలు జరిగాయి. 1920 లో బొంబాయిలో "సోషల్ సర్వీస్ లీగ్" స్థాపించబడింది. ఇది క్రమబద్ధమైన సేవారంగం. 1936 లో సర్ దొరాబ్జీ తాతా స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్ సంక్షేమ కృషిలో కార్యకర్తలకు శిక్షణ ఇవ్వడం కోసం ప్రారంభమయింది. ఇక్కడ వృత్తిలో నైపుణ్యాన్ని సంపాదించడానికి సాంకేతిక పాఠశాలలను కూడా ఏర్పాటుచేశారు.

## స్వాతంత్ర్యం తరువాత భారతదేశంలో సంఘసేవ

భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తరువాత రాజ్యపరిపాలన ముఖ్యలక్ష్యం సాంఘిక సంక్షేమమని గుర్తించడం జరిగింది. ఈ లక్ష్యాన్ని సాధించడానికి ప్రభుత్వం ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ సెంట్రల్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డ్, మొదలైన సంస్థలను స్థాపించి సామాజిక భద్రతా పథకాలను చేపట్టింది. సాంఘిక సంక్షేమం, శిశు సంక్షేమం, సేవా సంస్థలు, అనాథ శరణాలయాలు, వృద్ధులకు గృహాలు మొదలైనవి నెలకొల్పబడ్డాయి. ప్రభుత్వ సంస్థలతోబాటు స్వచ్ఛంద సేవాసంస్థలు కూడా ఏర్పడ్డాయి. వాటిమధ్య సామరస్యం కుదిరేటట్లు ప్రభుత్వం సమన్వయ సంస్థలను ఏర్పరచింది. "ఇండియన్ అడల్ట్ ఎడ్యుకేషన్ ఎసోసియేషన్" వయోజన విద్య, సాంఘిక విద్య సంస్థల మధ్య సామరస్యానికి "ఇండియన్ కాన్ఫరెన్స్ ఆఫ్ సోషల్ వర్క్" వేర్వేరు సంఘసంక్షేమ కేంద్రాలమధ్య సామరస్యానికి అవతరించిన

సంస్థలు. గ్రామీణ సంక్షేమ సంస్థల సమన్వయానికి కూడా కొన్ని సంస్థలు ఏర్పడ్డాయి.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రాష్ట్ర ప్రభుత్వాలు సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు చేపట్టాయి. ప్రాథమిక విద్యను ప్రోత్సహించి ఉన్నత పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలు, సాంకేతిక శిక్షణా కేంద్రాలు మొదలైనవాటి సంఖ్యను పెంచాయి.

భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనకు పూర్వం సాంఘిక వ్యవస్థ వర్ణాశ్రమ ధర్మ సిద్ధాంతంపై ఆధారపడి ఉండేది. 18 వ శతాబ్దం మొదటి భాగంలో బ్రిటిష్‌వారు వచ్చిన తరువాత మన దేశ ఆర్థిక విధానం విచ్ఛిన్నమైంది. ఆంగ్లేయ పరిపాలనా కాలంలో క్రైస్తవ మతాచార్యులకు అనేక విధాలైన సౌకర్యాలను కల్పించారు. వారి సంఘ సేవకు మత ప్రచారం కూడా తోడయింది. ఈ సమయంలో ఈశ్వరచంద్రవిద్యాసాగర్, స్వామీ దయానంద సరస్వతి, వీరేశలింగం పంతులు, రామకృష్ణపరమహంస మొదలయిన మహాపురుషులు ఉద్భవించి భారతీయులకు హిందూమతంలోని గొప్పతనాన్ని చాటిచెప్పి సాంఘిక సంక్షేమానికి కృషిచేశారు. ప్రజాస్వామ్య విలువలను, హిందూ మత విలువలను అనుసరించి సేవచేయడమే నేటి సంఘ సంక్షేమ తత్వం. సమస్యాపూరితమైన సాంఘిక పరిస్థితులలో మార్పు తేవడం అంత సులభం కాదు. కానీ సేవార్థి యోచనా విధానంలో మాత్రం సంక్షేమ కార్యకర్త మార్పును తేగలడు.

## భారతదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు

బ్రిటిష్ కాలంలో భారతదేశంలో సంఘ సంక్షేమ కార్యక్రమాలు అనేక దశలలో జరిగాయి. అవి ఏవంటే —

1. 1780 నుంచి 1880 వరకు జరిగిన సంఘ సంక్షేమ కార్యక్రమాలు.
2. 1880 నుంచి 1900 వరకు జరిగిన సంక్షేమ కార్యక్రమాలు.
3. 1900 నుంచి 1920 వరకు ,, ,,
4. 1920 నుంచి 1937 వరకు ,, ,,
5. 1937 నుంచి 1947 వరకు ,, ,,

మొదటి దశలో సాంఘిక సంస్కరణలపై శ్రద్ధ వహించడం, రెండోదశలో సాంఘికంగా వెనుకబడినవారికి సాంఘిక సంక్షేమ సంస్థలను స్థాపించడానికి ప్రాముఖ్యత ఇవ్వడం జరిగింది. మూడో దశలో అంటే 20 వ శతాబ్దం ఆరంభ దశలో హరిజనుల, గిరిజనుల, కార్మికుల సంక్షేమార్థం భారత జాతీయ సంస్థలు స్థాపించబడ్డాయి. నాల్గో దశలో 1920 నుంచి 1930 వరకు సమాజాభివృద్ధి చర్యలపై ప్రాముఖ్యత చూపబడింది. అంటే విద్యా సౌకర్యాలను అభివృద్ధి పరచడం, గ్రామీణాభివృద్ధి, పరిశ్రమల అభివృద్ధి, వినోద సౌకర్య కార్యక్రమాలు, సంరక్షణా చట్టాలు మొదలైన కార్యక్రమాలు చేపట్టారు. ఐదో దశలో అంటే 1937 నుంచి 1947 వరకు గ్రామీణాభివృద్ధి, స్త్రీ సంక్షేమ విభాగాలు స్థాపించారు.

## 1780 నుంచి 1880 వరకు సంక్షేమ కార్యక్రమాలు

ఈ కాలంలో సాంఘిక సంక్షేమ కార్యక్రమాల గురించి తెలుసుకోవాలంటే ఆ కాలంలో దేశంలోగల రాజకీయ, సాంఘిక పరిస్థితుల గురించి తెలుసుకోవలసిఉంది. ఈ పరిస్థితులే ఆ కాలంలో సంఘ సంస్కరణోద్యమాలకు కారణాలని చెప్పవచ్చు. సంఘసంస్కరణోద్యమానికి ముఖ్యమైన కారణాలేవంటే బ్రిటిష్‌వారు భారతదేశాన్ని పరిపాలించిన కాలంలో వారికి వర్తించే చట్టాలు భారతీయులకు వర్తించేవికావు. వారు తమ చట్టాలకు మాత్రమే కట్టుబడి ఉండేవారు. కనుక తమ ఆలోచనలలో వచ్చిన మార్పులు తమ వ్యవస్థలలో తేలేక పోయారు. దీనివల్ల సంఘసంస్కరణోద్యమం ఆరంభమైంది. పాశ్చాత్య విద్య భారతీయుల దృక్పథంలో అనేక మార్పులు తీసుకునివచ్చింది.

1780 లో శెరామ్‌పూర్ మిషన్ స్థాపించబడింది. అప్పటినుంచి ప్రజలలో కొత్తరకం ఆలోచనలు తలఎత్తాయి. భారతదేశ సాంఘిక నిర్మితిలో అనేక సంస్కరణలు రావాలని తలంచారు. భారతదేశంలో గల బాల్యవివాహాలు, బహుభార్యాత్వం, సతీసహగమనం మొదలైన వన్నీ భారతదేశంలోగల సాంఘిక సాంఘిక మూఢాచారాలు, క్రైస్తవ మత బోధనలు పాశ్చాత్య విద్య ఈ మూఢాచారాలను వ్యతిరేకించ

డానికి దారితీశాయి. 1813 లో ప్రవేశపెట్టిన చార్టర్ ఆక్ట్ (Charter Act) పాశ్చాత్య విద్యను ప్రోత్సహించింది. 1829 లో బెంగాల్ లో సతీసహగమనాన్ని వ్యతిరేకిస్తూ చట్టం ప్రవేశపెట్టడం జరిగింది. ఈ చట్టాన్ని ప్రవేశపెట్టటానికి కృషిచేసిన ప్రముఖుడు రాజారామ్‌మోహన రాయ్ అదేవిధంగా మద్రాసు, బొంబాయిలలో కూడా చట్టాలు ప్రవేశ పెట్టబడ్డాయి. ఈ చట్టాల ప్రకారం సతీసహగమనం నేరం. సతిసహ గమనాన్ని పాటించేవారుగాని, దానిని ప్రోత్సహించేవారుగానీ నేరస్తులు శిక్షార్హులు అని నిర్ణయించారు.

1849 లో హిందూ బాలికలకు మొట్టమొదట పాఠశాలను నెలకొల్పారు. 1863 లో శ్రీ కేశబ్ చంద్రసేన్ స్త్రీ విద్యాభివృద్ధికై పాటుపడ్డారు. 1856 లో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ హిందూ వితంతు పునర్వివాహ చట్టాన్ని ప్రవేశపెట్టాడు. 1877 లో స్వామి దయానంద సరస్వతి ఆర్యసమాజాన్ని స్థాపించాడు. ఈ సమాజం కులవ్యవస్థకు బాల్యవివాహాలకు, పరదా పద్ధతి మొదలైనవాటికి వ్యతిరేకంగా పని చేసింది. వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించింది. స్వామివివేకానంద రామకృష్ణా మిషన్‌ను 1897 లో స్థాపించాడు. విద్య, వైద్య సంఘాభి వృద్ధి కార్యక్రమాలను ఈ మిషన్‌వారు నిర్వహించారు. 1875 లో శ్రీ సయ్యద్ అహమ్మద్ ఖాన్ విద్యా సంస్థను స్థాపించాడు. అది ప్రస్తుతం ఆలీఘుర్ యూనివర్శిటీగా రూపొందింది.

## 2. 1880 నుంచి 1900 వరకు

ఆంగ్ల విద్యాధికులు భారతీయులలో కొత్త రకమైన ఆలోచన లను కలుగజేశారు. వీరి ఆలోచనలు ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్య దృక్ప థాలతో ఆరంభమైనాయి. ఈ కాలంలో వ్యక్తుల స్వాతంత్ర్య దృక్ప థాలను సమష్టి కుటుంబాలు, కులవ్యవస్థలు సంతృప్తిపరచలేక పోయాయి. అదే విధంగా ఆర్థిక వ్యవస్థలో కూడా మార్పులు వచ్చాయి.

గ్రామీణులు అధిక సంఖ్యలో పారిశ్రామిక, పట్టణ ప్రాంతాలకు తరలిపోవడం ఆరంభించారు. గ్రామ పంచాయతీలు సక్రమంగా వాటి

కార్యకలాపాలను నిర్వర్తించలేక పోయినవి. జమీందారీ పద్ధతి, చేతి పరిశ్రమలు విచ్ఛిన్నమవడం, యంత్రాలతో తయారైన వస్తువులపై వ్యామోహం పెరగడం, నగరాలలో పరిశ్రమల అభివృద్ధి, పెరుగుతున్న జనాభా మొదలైనవన్నీ వ్యక్తుల సమస్యలకు కారణాలైనాయి. తాగుడు, వ్యభిచారం, మురికివాడలు మొదలైన సమస్యలు అధికమైనవి. ఇటువంటి పరిస్థితులలో క్రైస్తవ మిషనరీలు కొన్ని సాంఘిక సంక్షేమ సంస్థలను స్థాపించి వాటి ద్వారా పేదవారికి సంక్షేమ కార్యక్రమాలను ఏర్పాటుచేసి తద్వార తమ మత వ్యాప్తికి కృషి చేయడం ప్రారంభించారు.

1882 వ సంవత్సరంలో పండిత రమాబాయి ఆర్యమహిళా సమాజాన్ని స్థాపించారు. దీనిద్వారా హిందూ మహిళలను అనేక విధాలైన సంక్షేమసేవలు అందజేయడం జరిగింది. ఆమె అనేక సంక్షేమ కృషి సంస్థలు, అనాధ శరణాలయాలు, బాలికల పాఠశాలలు స్థాపించింది. 1887 లో శ్రీ శశిపాద బెనర్జి బెంగాల్‌లో హిందూ వితంతు గృహాలను స్థాపించాడు. దీని తరువాత ఇటువంటి గృహాలు అనేకం బొంబాయి, మద్రాసులలోకూడా వెలిశాయి. 1896 లో ప్రొఫెసర్ డి. కె. కార్వే పూనాలో వితంతు గృహాలను స్థాపించారు. 1902 నాటికి ఈ గృహంలో 14 మంది వితంతువులు చేరారు. 1898 వీరేశలింగం పంతులు మద్రాసులో వితంతు గృహాలను స్థాపించాడు.

## 3. 1900 నుంచి 1920 వరకు జరిగిన సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు

1905 లో సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఏర్పడింది. ఇది రాజకీయ ప్రాముఖ్యతగల సంస్థ అయినప్పటికీ సాంఘిక, ఆర్థిక, విద్యా రంగాలలో అభివృద్ధి పథకాలు ఏర్పరచడానికి కృషిచేసింది. ముఖ్యంగా వెనుకబడిన తరగతులవారికి సాంఘిక, ఆర్థిక, విద్యారంగాలలో సరి సమానమైన అవకాశాలను కలుగజేయడానికి ఎక్కువ చేసింది. 1908లో బొంబాయిలో సేవాసదన్ స్థాపించబడింది. దీనికి శ్రీమతి రమాబాయి

రానడే అధ్యక్షురాలు. విద్యావ్యాప్తి కలుగజేయడం ఈ సేవాసదన్ ముఖ్యోద్దేశం. 1911 లో సోషల్ సర్వీస్ లీగ్ స్థాపించబడింది. దీని అధ్యక్షుడు చందావర్కర్. ఈ లీగ్ కృషిద్వారా భారతదేశంలో కార్మికుల సాంఘిక హోదా పెంపొందించబడింది.

## 4. 1920 నుంచి 1932 వరకు జరిగిన సంఘ సంక్షేమ కార్యక్రమాలు

ఈ కాలంలో సంఘసంక్షేమకృషిలో భాగంగా ఆస్తులకు పునరావాస కార్యక్రమాలను ఏర్పాటుచేయడ మనేదాని బదులుగా అసలు ఆస్తులు అనేమాట లేకుండా, అందరూ మంచిదశలో ఉండాలనే ఆశయంతో కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. ఈ కార్యక్రమాలలో మొట్టమొదటగా బాలల చట్టాలను ప్రవేశపెట్టారు. 1920, 22, 24 సంవత్సరాలలో వరుసగా మద్రాసు, బెంగాలు, బొంబాయి రాష్ట్రాలలో బాలలకు సంబంధించిన చట్టాలు ప్రవేశపెట్టారు. 1922వ సంవత్సరంలో స్త్రీలలోను, బాలికలలోను అవినీతి ప్రవర్తన నరికట్టేందుకు నిరోధక చట్టం ప్రవేశపెట్టబడింది. 1922 లో బాల్యవివాహ నిషేధచట్టం కూడా ప్రవేశపెట్టబడింది. 1923 వ సంవత్సరంలో స్త్రీ సంక్షేమంకోసం అనేక కార్యక్రమాలు చేపట్టారు. ఈ కాలంలో ప్రభుత్వంకూడా సంక్షేమ కార్యక్రమాలపై దృష్టిని కేంద్రీకరించింది. కార్మిక సంక్షేమానికి చెందిన అనేక చట్టాలు కూడా ప్రవేశపెట్టారు.

## 5. 1937 నుంచి 1947 వరకు జరిగిన సంక్షేమ కృషి

నూతన కాంగ్రెస్ మంత్రివర్గం 1937 లో అనేక సంక్షేమ కార్యక్రమాలను ప్రవేశపెట్టింది. అనేక రాష్ట్రాలలో గ్రామీణ సంక్షేమ విభాగాలు, స్త్రీ సంక్షేమ విభాగాలు స్థాపించబడ్డాయి. అంటరానితనం తొలగించడానికి హరిజన, గిరిజన, వెనుకబడిన తరగతుల సంక్షేమార్థం అనేక కార్యక్రమాలను ప్రారంభించింది.

## 6. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జరిగిన సంఘ సంక్షేమ కార్యక్రమాలు

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారత ప్రభుత్వం మన దేశాన్ని సంక్షేమ రాజ్యంగా ప్రకటించింది. వెనకబడిన తరగతుల సంక్షేమానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. సాంఘిక శాసనాలేకాక వ్యక్తులకు, సమూహాలకు, సముదాయాలకు వేరువేరుగాను, ప్రత్యేకంగాను సహాయం చేయడానికి అనేక సంక్షేమ విభాగాలు స్థాపించారు. కేంద్ర, రాష్ట్ర సాంఘిక సంక్షేమ విభాగాలు, సాముదాయిక అభివృద్ధి పథకాలు, కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు మొదలైనవాటిని స్థాపించడం జరిగింది.

1954 వ సంవత్సరంలో ప్రత్యేక వివాహ చట్టం ప్రవేశ పెట్టారు. ఈ చట్టం ప్రకారం వివాహంనాటికి పెళ్ళికుమారునికి 21 సంవత్సరాలు, పెళ్ళికూతురికి 18 సంవత్సరాలు పూర్తయి ఉండాలి. ఈ చట్టంలో జాతి, మత ప్రసక్తి లేదు. 1955 లో హిందూ వివాహ చట్టం ప్రవేశ పెట్టబడింది. అంతేకాక అనేక కార్మిక సంక్షేమ చట్టాలు ప్రవేశపెట్టడం జరిగింది. స్త్రీ గౌరవాన్ని, హోదాను కాపాడటానికి అనేక శాసనాలు ప్రవేశపెట్టారు. అంటరానితనాన్ని తొలగించడానికి కూడా అనేక శాసనాలు ప్రవేశ పెట్టడం, 1947 లో పునరావాస కార్యక్రమాలు చేపట్టడం కూడా జరిగింది. శారీరక. మానసిక, ఆర్థిక, సాంఘిక పునరావాస కార్యక్రమాలపై శ్రద్ధ వహించారు. ప్రభుత్వం విద్య, ఆరోగ్య అభివృద్ధి పథకాలపై ఎక్కువ శ్రద్ధ వహించింది. మాతా శిశు సంరక్షణ బాధ్యతను వహించింది.

## భారతదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు

సంఘ సంస్కరణ అంటే సమాజంలో అభిలషణీయమైన మార్పును ప్రవేశపెట్టడం. అంటే సమాజంలో పాతుకునిపోయిన దురాచారాలను, మూఢాచారాలను రూపుమాపి సంఘాన్ని అభివృద్ధిపథంలోకి తీసుకురావడం. సంఘంలో అనేక రకాల వర్గాలకు చెందిన వ్యక్తులుంటారు. ఉదాహరణకు పేదలు-ధనికులు, ఉత్తములు-అధములు,

మేధావులు-మాంద్యులు మొదలైనవారు ఉంటారు. కానీ ప్రతీ సమాజంలోను వ్యక్తులు కొన్ని కట్టుబొట్లకు, సాంప్రదాయాలకు కట్టుబడి వాటికి అనుగుణంగా నడచుకుంటారు.

బ్రిటిష్ వారి రాకకు పూర్వం భారత దేశంలో అనేక సాంఘిక దురాచారాలు ప్రబలి ఉండేవి. సతీ సహగమనం, బాల్యవివాహాలు, బాల వితంతువుల పునర్వివాహానికి అడ్డంకులు, పరదాపద్ధతి మొదలైన అనేక మూఢాచారాలు. పద్ధతులు ఉండేవి. సతీ సహగమనం హిందూ మతంలో ఒక భయంకరమైన దురాచారమని గుర్తించి దానిని నిర్మూలించడానికి ఔరంగజేబు, అక్బరు మొదలైన మొగలాయీ చక్రవర్తులు అనేక ప్రయత్నాలు చేశారు. ఫ్రెంచివారు, పోర్చుగీసువారు కూడా అనేక విధాల ప్రయత్నించారు. రాజారామమోహనరాయ్ ఈ సమస్యను నిర్మూలించడానికి అనేక ప్రయత్నాలు చేసి చివరకు సఫలీకృతుడైనాడు. స్త్రీ పునర్వివాహంపట్ల ప్రభుత్వం శ్రద్ధ వహించి కొన్ని కొన్ని సంస్కరణలను అమలులో పెట్టింది. 1856 లో ఈశ్వర చంద్ర విద్యాసాగర్ స్త్రీ పునర్వివాహ విషయమై చట్టాలను ప్రవేశపెట్టడానికి కృషి చేశాడు. కేశవ చంద్రసేన్, శశిపాద బెనర్జీ మొదలైనవారు స్త్రీ విద్యావ్యాప్తికి తోడ్పడ్డారు.

బ్రిటిష్ వారి రాకతో భారతదేశంపైన పాశ్చాత్య నాగరికతా ప్రభావం ఆరంభమైంది. అనేకమంది భారతీయులు అత్యంత కృషిచేసి భారతదేశంలో యుగ యుగాల నుంచి పాతుకొనిపోయిన దురాచారాలను రూపుమాపి సంఘ సంస్కరణకు కృషి చేశారు. వారిలో ముఖ్యులు రాజారామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కందుకూరి వీరేశలింగం పంతులు, గాంధీజీ మొదలైనవారు. కనుక వీరి జీవిత చరిత్రలను తెలుసుకొందాం.

## రాజారామమోహనరాయ్ (1772 - 1833)

రాజారామమోహనరాయ్ హుగ్లీ జిల్లాలో రాధానగర్‌లో 1772 వ సంవత్సరం మే 22 వ తేదీన జన్మించాడు. అతడు అతి గౌరవనీయమైన, సాంప్రదాయసిద్ధమైన బెంగాలు కుటుంబానికి చెందినవాడు.

రాజా రామమోహనరాయ్ బాల్యంనుంచి కూడా ఏకమత సూత్రంపై నమ్మకంకలిగి ఉండేవాడు. అతడు అన్ని మతగ్రంథాలను పఠించి అన్నిటిలోగల సారాంశాన్ని గ్రహించిన మహామేధావి. విగ్రహారాధనపట్ల ఇతడు వ్యతిరేకభావాన్ని వ్యక్తపరచాడు. ఇతని బాల్యదశలో మతవిషయాలపట్ల ఇతనికి, ఇతని తండ్రికి మధ్య భేదాభిప్రాయాలు రావడంవల్ల రాజా రామమోహనరాయ్ ఇల్లు విడచిపెట్టి టిబెట్టు దేశానికి తరలిపోయాడు. చిన్నతనంనుంచే రాజా రామమోహనరాయ్‌కి వంగ, సంస్కృతం, పర్షియన్, అరబ్బీ మొదలైన అనేక భాషలతో పరిచయం ఉంది.

బెంగాల్‌లో క్రైస్తవ మిషనరీలు హిందూమతంలోని దురాచారాలను ఎత్తిచూపి ప్రచారం చేయడం జరిగింది. ఈ ప్రచారాలు రాజా రామమోహనరాయ్‌పై చాలా ప్రభావాన్ని చూపాయి. ఈ ప్రభావ ఫలితంగా రాజా రామమోహన్‌రాయ్ హిందూమతాన్ని ద్వేషించడం మొదలుపెట్టాడు. 1803 వ సంవత్సరంలో ఇతడు ఈస్ట్ ఇండియా కంపెనీలో ఉద్యోగిగా చేరాడు. 1828లో బ్రహ్మసమాజాన్ని స్థాపించి ఏకేశ్వరోపాసన ప్రచారంచేశాడు. 1814 లో డేవిడ్ హేర్ అనే స్కాట్లండు వర్తకుడు భారతదేశానికివచ్చి భారతీయ సంస్కృతికి ముగ్ధుడై భారతదేశంలో స్థిరనివాసమేర్పరచుకొన్నాడు. ఇతని సహాయంతో రాజా రామమోహనరాయ్ మనదేశంలో ఇంగ్లీష్ పాఠశాలలను స్థాపించాడు. 1817 లో కాలేజీ స్క్వేరువద్ద హిందూ కళాశాల స్థాపించాడు.

రాజా రామమోహనరాయ్ సతీసహగమన నిర్మూలనకై చాలా కృషిచేశాడు. 1817 వ సంవత్సరంలో సతీసహగమనాల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. లార్డ్ బెంటింకు పరిపాలనా కాలంనాటికి సతీసహగమన దురాచార నిర్మూలనకై జరిపిన కృషి తారస్థాయికి చేరింది. 1827 వ సంవత్సరం డిసెంబర్ నాల్గవ తేదీన సతీసహగమన నిషేధ చట్టం రూపొందింది.

రాజారామమోహనరాయ్ సమాజంలో స్త్రీ హక్కులకోసం కూడా పోరాటం జరిపాడు. స్త్రీలకు కూడా ఆస్తిహక్కు ఉండాలన్న విషయంపై అతడు తీవ్రమైనకృషి చేశాడు. స్త్రీలకు ఆస్తిహక్కు లేకపోవడంవల్ల అనేక సమస్యలకు గురిఅవుతున్నారు. రాజారామ మోహన్‌రాయ్ తన అభిప్రాయాన్ని తెలియజేశాడు, ఇతడు కన్యాశుల్కమనే దురాచారాన్ని ద్వేషించాడు. ఇతడు బాల్యవివాహాలకు వ్యతిరేకి. రామరామమోహన్‌రాయ్ భారతదేశంలో గల విద్యావిధానాన్ని మార్చడానికి చాలా కృషిచేశాడు. ఇతడికి ఆంగ్ల విద్యద్వారా కలిగే ప్రయోజనంపట్ల నమ్మకం ఎక్కువ. పాశ్చాత్య నాగరికత, సంస్కృతుల కలయికగల విద్యావిధానంపట్ల కూడా నమ్మకం ఉంది. 1826 వ సంవత్సరంలో రాజారామమోహనరాయ్ వేదాంత కళాశాలను స్థాపించాడు. రాజారామమోహనరాయ్‌కి ఆనాటి మనదేశంలోని వ్యవస్థపట్ల తీవ్రమైన వ్యతిరిక్తత ఉండేది.

1830 వ సంవత్సరంలో ఢిల్లీ మొగలాయీ చక్రవర్తి ఆదేశానుసారం హిందూమత ప్రచారానికిగాను రాజా రామమోహనరాయ్ ఇంగ్లండు వెళ్ళాడు. 1833 వ సంవత్సరం సెప్టెంబర్ 27 వ తేదీన రాజరామమోహనరాయ్ ఇంగ్లండులో మరణించాడు.

## కేశవచంద్రసేన్ (1836-1884)

కేశవచంద్రసేన్ 1836 వ సంవత్సరంలో నవంబరు 19 వ తేదీన కలకత్తాలో జన్మించాడు. ఇతడు తన 18 వ సంవత్సరం నాటినుంచి తత్వగ్రంథాలు చదవడం ప్రారంభించాడు. దీనివల్ల ఇతడు మానవజాతి అంతా ఒక్కటే అనీ, మానవులలో భేదం ఉండదని గుర్తించాడు. సమాజంలో పాతుకునిపోయిన సాంఘిక దురాచారాలను తొలగించాలని కేశవచంద్రసేన్ అభిలాష. భారతదేశంలో సంఘ సంస్కరణోద్యమం జరగాలంటే మత సంబంధమైన విషయాలలో మార్పురావాలని ఇతడు గ్రహించాడు. పాఠశాలలు, సాంఘిక వ్యవస్థలు మొదలైన వాటి ద్వారా సమాజంలో సంస్కరణోద్యమం తేవాలని కేశవచంద్రసేన్

కృషి చేశాడు. ఇతడు 1854 లో బ్రిటిష్ ఇండియా సొసైటీలోను, 1855 లో కోల్‌తాల్ సాయంత్ర పాఠశాలలోను సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా సాంఘిక సంస్కరణోద్యమాలను ప్రారంభించాడు.

కేశవ్‌చంద్రసేన్ బ్రహ్మసమాజంతో కలిశాడు. 1859 వ సంవత్సరం మే నెలలో ఇతడు బ్రహ్మ విద్యాలయాన్ని స్థాపించాడు. 1860 వ సంవత్సరంలో కంగల్ సభను స్థాపించాడు. 1861 వ సంవత్సరంలో భారతదేశంలో ఆనాడు అమలులోవున్న అస్పృశ్యతా దురాచారాన్ని కూడా వ్యతిరేకించాడు. 1862 వ సంవత్సరంలో ఇతడు బ్రహ్మ సమాజంనుంచి "ఆచార్య" బిరుదును కూడా పొందాడు. ఇతడు స్త్రీలలో ఘోషా పద్ధతిని తొలగించడానికి అత్యంత కృషి చేశాడు. పూర్వం సాంప్రదాయ కుటుంబంలో జన్మించిన స్త్రీలు వీధులలోకి రాకూడదనీ, వారు సాంఘిక, మత సంబంధమైన పర్వదినాలలో పాల్గొనరాదనీ ఆంక్షలు ఉండేవి. అటువంటి సమయంలో కేశవచంద్రసేన్ తన సతీమణిని కలకత్తా నుంచి జొరాసోంకో వరకు తీసుకుని వెళ్ళి అనేక కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చేశాడు. ఈ కారణంగా ఆయన తన కుల పెద్దలచేత వెలివేయబడ్డారు. అయినా ఇతడు వెనుకాడక తన సతీమణీతోపాటు ఇతర స్త్రీలు కూడా అధిక సంఖ్యలో అనేక సంక్షేమ కార్యక్రమాల్లో పాల్గొనేటట్లు చేశాడు. ఈ విధంగా కేశవచంద్రసేన్ అతి తక్కువ కాలంలో బ్రహ్మసమాజంలో అధిక సంఖ్యలో స్త్రీలు పాల్గొనేటట్లు కృషి చేశాడు.

1863 వ సంవత్సరంలో ఇతడు బ్రహ్మబంధు సమాజాన్ని స్థాపించాడు. దీనిద్వారా అనేక సంఘ సంస్కరణోద్యమ కార్యక్రమాలు ప్రవేశపెట్టడం జరిగింది. 1870 వ సంవత్సరంలో భారతదేశంలోని సంఘ సంస్కరణోద్యమ కార్యక్రమాలను విస్తృతం చేయడానికి ఇంగ్లండ్‌కు కూడా వెళ్ళాడు.

కేశవచంద్రసేన్ 1884 లో తన 45 వ ఏట మరణించాడు.

# ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (1820 - 1891)

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ 1820 వ సంవత్సరం సెప్టెంబరు 20వ తేదీన మిద్నాపూరు జిల్లాలో బర్‌సింగ్ అనే కుగ్రామంలో సనాతన ధర్మపరాయణులైన ఒక నిరుపేద కుటుంబంలో జన్మించాడు. ఇతనికి తన 14 వ ఏట దినమయిదేవి అనే ఒక 8 సంవత్సరాల బాలికతో వివాహం జరిగింది.

ఈస్టిండియా కంపెనీ అధికారులకు హిందూ న్యాయశాస్త్రాలను బోధించడానికి భారతీయ పండితులు నియమించబడేవారు. ఆ పండితులు "హిందూ లా కమిటీ అండర్ ప్రొవిషన్ ఆఫ్ రెగ్యులేషన్ 1821" (Hindu law Committee under Provision of regulation 1821) అనే పరీక్షలో కృతకృత్యులు కావాలి. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఈ పరీక్షలో ఉత్తీర్ణుడై యూరోపియన్లకు హిందూ న్యాయ శాస్త్ర జ్ఞానాన్ని అలవరించుకొనేటట్లు శిక్షణ ఇవ్వడానికి ఫోర్ట్ విలియమ్ కళాశాలలో 1841 వ సంవత్సరం డిసెంబర్ 21 వ తేదీన నియమిత డైనాడు. ఈ కళాశాలలో ఇతనికి "విద్యాసాగర్" అనే బిరుదు లభించింది.

స్త్రీ విద్యను ప్రోత్సహించడంలో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఎంతో కృషిచేశాడు. బెంగాల్ రాష్ట్రంలో బెంగాల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషన్‌కు అధ్యక్షుడైన బెథూన్ సహాయంతో కలకత్తాలో బాలికల పాఠశాలను స్థాపించాడు. ఈ పాఠశాల క్రమక్రమంగా కళాశాలగా రూపొందింది. 1852 వ సంవత్సరంలో అతని స్వగ్రామంలో ఉచిత దిన పాఠశాల, ఉచిత సాయంకాల పాఠశాలలను ఆరంభించి వాటికయ్యే ఖర్చులను అతడే భరించేవాడు.

1854 వ సంవత్సరంలో ఇతడు వితంతు స్త్రీలు పునర్వివాహానికి అర్హులు అనే విషయంపై కృషి ఆరంభించాడు. 1855 అక్టోబరులో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ హిందూ వితంతు స్త్రీల పునర్వివాహాన్ని అంగీకరిస్తూ శాసనాలను ప్రవేశపెట్టాలని ప్రభుత్వానికి ఒక అపీలు

పెట్టాడు. 1856 జూలై 26 వ తేదీన జె. పి. గ్రాంట్ ఈ బిల్లును ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ప్రవేశపెట్టాడు. కలకత్తాలో 1856వ సంవత్సరం డిసెంబర్ 7వ తేదీన మొట్టమొదటి స్త్రీ పునర్వివాహం జరిగింది. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ తన పెద్దకుమారుడైన నారాయణ చంద్రకు ఒక వితంతువును వివాహంచేసి మార్గదర్శకుడుగా నిలచాడు. వితంతు పునర్వివాహాలను ప్రోత్సాహించడమేకాక ఈశ్వరచంద్ర విద్యాసాగర్ తన స్వంత ఖర్చులతో అనేక వితంతు పునర్వివాహాలను జరిపించాడు. అంతేకాక ఆ భార్యాభర్తలకు. వారి కుటుంబాలకు సంక్షేమ సౌకర్యాలనుకూడా ఏర్పాటుచేశాడు.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు ఉండాలని పురుషులలో బహుభార్యాత్వం తొలగిపోవాలనీ ఎంతో తీవ్రంగా కృషి చేశాడు. రాయల్ ఏషియాటిక్ సొసైటీవారు ఇతనిని 1864 లో గౌరవ సభ్యునిగా చేశారు. 1863 నూతన సంవత్సరాది బిరుదు మహోత్సవాలలో ఇతనికి సి. ఐ. ఇ. బిరుదునిచ్చి బ్రిటిష్ ప్రభుత్వం గౌరవించింది.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ తన 52 వ ఏట అస్వస్థతకు గురియై వైద్యుల సలహా ప్రకారం కలకత్తాకు 150 మైళ్ళ దూరంలో విశ్రాంతి గృహాన్ని ఏర్పరచుకొని అక్కడే చికిత్స పొందుతూ ఉండేవాడు. 1891 జూలై 29 వ తేదీన ఈశ్వరచంద్ర విద్యాసాగర్ తన 71 వ ఏట పరమ పదించాడు.

## గోపాలకృష్ణ గోఖలే (1866-1915)

గోపాలకృష్ణ గోఖలే బొంబాయి రాష్ట్రంలో రత్నగిరి జిల్లాలో 1866 వ సంవత్సరంలో జన్మించాడు. ఈయన కోల్హాపూర్ రాష్ట్రంలో కాగిల్‌వద్ద విద్య నభ్యసించాడు. ఇతని విద్య పూర్తి అవగానే ఫర్గూసన్ కళాశాలలో ప్రొఫెసర్‌గా చేరి అక్కడ 20 సంవత్సరాలపాటు పని చేశాడు. ఇతడు గణితం, చరిత్ర, అర్థ శాస్త్రాలలో ప్రొఫెసర్‌గా పని చేశాడు. ఫర్గూసన్ కళాశాల పూనాలో ఉన్నది. గోపాలకృష్ణ గోఖలే

ఎక్కువ ఆసక్తిని రాజకీయ రంగంలో చూపినప్పటికీ సరిసమానమైన ప్రాముఖ్యతను ప్రజా సేవలో కూడా కనబరచాడు. అతడు నిస్వార్థమైన ప్రజా సేవ చేశాడు. అతడికి మత సంబంధమైన విషయాలలో కూడా ఆసక్తి ఉన్నది. హిందూ మతంలోగల లోపాలను రూపుమాపడానికి అత్యధిక కృషి చేశాడు. గోపాలకృష్ణ గోఖలే సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీని స్థాపించాడు. దీనిద్వారా భారతీయ మిషనరీలకు ఐకమత్యం, స్వయం పరిపాలనా విషయాలలో తర్ఫీదునిచ్చాడు. అంతేకాక గోపాల కృష్ణ గోఖలే వెనుకబడిన తరగతుల అభివృద్ధికై కూడా కృషి చేశాడు. ఈయన విద్యాభివృద్ధికై చాలా కృషి చేశాడు. దేశంలో తప్పనిసరిగా ప్రతివ్యక్తి కనీసం ప్రాథమిక విద్య నభ్యసించితీరాలని వాదించాడు. ప్రతి పౌరునికి కనీసం ప్రాథమిక విద్య అయినా అందుబాటులో ఉండాలని, ఉచిత విద్యావకాశాలు ఏర్పాటు చేయాలని ఇతని వాదన. ఈ విషయమై ఈయన ఇంపీరియర్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో బిల్లును ప్రవేశ పెట్టాడు. ఈ బిల్లు ఫలితంగా దేశంలో ప్రాథమిక విద్య అభివృద్ధి చెందింది.

గాంధీజీ దక్షిణాఫ్రికాలో ప్రవేశపెట్టిన అస్పృశ్యతా నివారణోద్యమంపై గోఖలే చాలా శ్రద్ధ కనబరచాడు. గాంధీజీకి గోఖలేపట్ల అమితమైన గౌరవం ఉండేది. గాంధీజీ గోపాలకృష్ణ గోఖలేని గురువుగా పేర్కొనేవాడు.

గోపాలకృష్ణ గోఖలే "ది సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీ"ని 1905వ సంవత్సరం జూన్ 12వ తేదీన పూనాలో స్థాపించాడు. ఇది గోపాలకృష్ణ గోఖలే స్మారక చిహ్నంగా మిగిలిపోయింది. ఈ సొసైటీ రాజకీయ, సాంఘిక రంగాలలో కృషిచేసి ఎన్నో సాంఘిక సేవలను చేసి సంస్కరణలను తీసుకునివచ్చింది. ఈ సొసైటీలో చేరిన సభ్యులు స్వార్థరహితమైన సేవలను చేస్తామని ప్రమాణంచేయాలి. ఈ సొసైటీ సభ్యులు దేశాభివృద్ధికి తమ జీవితాలను సహితం అంకితం చేయగలిగే శక్తిని కలిగి ఉండాలి. భారత రాజ్యాంగంలోగల పద్ధతులన్నిటిని ఉపయోగించి భారత జాతీయాభివృద్ధికి కృషిచేయాలి.

"ది సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీలో ప్రతిసభ్యుడు ఈ కింది విషయాలను పాటించాలి.

1. ప్రతిసభ్యుని మనస్సులో ఎప్పుడూ తనదేశానికి సంబంధించిన ఆలోచనకు ప్రథమస్థానం ఇవ్వాలి. అతడు తనదేశానికి అత్యంత విలువైన సేవలను చేయాలి.
2. దేశానికి సేవచేయడంలో తన వ్యక్తిగత సౌకర్యానికిగాని లాభానికి గానీ ప్రయత్నించరాదు. దేశానికి నిస్స్వార్థసేవ అందించవలసి ఉంది.
3. అతడు పవిత్రమైన వ్యక్తిగత జీవితాన్ని గడపవలసి ఉంది.
4. ఆ సభ్యునికి కుటుంబం ఉన్నట్లైతే ఆ కుటుంబానికి దేశం ఏర్పరచిన సౌకర్యాలతో సంతృప్తిని పొందవలసి ఉంది. దేశసేవలో తన కుటుంబానికి అదనపు సౌకర్యాలను ఏర్పాటు చేయడానికి అతడు ప్రయత్నించరాదు.

ఈ ఆదర్శాలతో ఈ సొసైటీ నిస్స్వార్థ దేశసేవచేసే సమూహంగా రూపొందింది. దేశంలో గల సేవా సంస్థలన్నిటిలోకి ఈ సంస్థ ప్రథమ స్థానాన్ని ఆక్రమించింది.

గోపాలకృష్ణ గోఖలే ఈ విధంగా దేశానికి అత్యున్నత సేవచేసి 1915వ సంవత్సరం ఫిబ్రవరి 19వ తేదీన స్వర్గస్థుడైనాడు.

## స్వామి వివేకానంద (1863 - 1911)

స్వామి వివేకానంద బెంగాల్‌లో గొప్ప పేరు ప్రతిష్టలు గల దత్తుల కుటుంబంలో 1863 వ సంవత్సరంలో జనవరి 13వ తేదీన జన్మించాడు. ఇతని అసలు పేరు నరేంద్రనాథ్. వివేకానందుని జీవితం, అతని ఆదర్శాలు రామకృష్ణ పరమహంస బోధనల ప్రభావఫలితాలు. వివేకానందునికి రామకృష్ణ పరమహంస భగవంతునితో సమానుడు. ఆయన శిష్యునిగా ఆయన సన్నిధిలోనే తన జీవితకాలంలో ఎక్కువ భాగం గడిపాడు. వివేకానందుడు భారతదేశంలో తాత్విక మత ప్రాముఖ్యతను గ్రహించాడు.

వివేకానందుడు ప్రజలకు, వారి సమస్యలకు సన్నిహితంగా ఉండే వాడు. అతడు ఎల్లవేళలా ప్రజలతో కలసి తిరుగుతూ వారిసమస్యలను తానుకూడా వ్యక్తిగతంగా అనుభవిస్తూ ఉండేవాడు. వివేకానందుడు భారత దేశ అత్యున్నత సంస్కృతికి, మతపరమైన వారసత్వానికి గర్వపడి నప్పటికి, భారత దేశ సాంఘిక, ఆర్థిక విచ్ఛిన్నతకు చింతించేవాడు. భారత దేశంలో విద్యాధికులుకూడా గుడ్డిగా పాశ్చాత్య దేశీయులు సంస్కృతిని అనుకరించడం, సాధారణ ప్రజల అమాయకత్వం, పేదరికం మొదలైనవి దేశాభ్యుదయానికి ఆటంకాలని తెలుసుకున్నాడు. ఆయన హేతువాది. కనుక భారతదేశాన్ని కూడా హేతువాదపునాదిపై పునర్నిర్మించాలని నిర్ణయించుకున్నాడు దీనివల్ల మతివ్యవస్థలో అభిలష ణీయమైన మార్పువచ్చి భారత దేశం ఆర్థికంగాను, సాంఘికంగాను ఒకే సమయంలో అభివృద్ధి చెందాలని వివేకానందుని ఆశయం.

వివేకానందుడు సాంఘిక రంగంలో సాధారణజనుల అభివృద్ధి కోసం కృషి చేశాడు. అంతేకాక భారత దేశంలో స్త్రీలు, వెనుకబడిన జాతులవారు బలహీన వర్గాలుగా పరిగణించబడేవారు. వీరు అనేక హక్కులకు, అవకాశాలకు సౌకర్యాలకు దూరమైనారు. ఈ సమస్యను తొలగించాలంటే ప్రజలను విద్యావంతులనుగా చేయడం అవసరం. అల్ప వర్గాలవారి పరిస్థితులను, స్త్రీల పరిస్థితులను మెరుగుపరచడానికి ఈయన కృషి చేశాడు. దేశ సేవకు, ప్రజలలో అభివృద్ధికి తన జీవితాన్ని అంకితం చేయాలంటే తాను వివాహం చేసుకోవడం ఆటంకం కాగలదనే అభి ప్రాయంతో ఈయన వివాహం చేసుకోలేదు. అంతేకాక తన 24 వ ఏటనే ఈయన సన్యసించాడు.

స్వామి వివేకానందుడు 1897 లో రామక్రిష్ణా మిషన్‌ను స్థాపిం చాడు. క్రమక్రమంగా ఈ మిషన్ శాఖలు దేశమంతటా వ్యాపిం చాయి. ఈ మిషన్‌లు వేదాంత పఠనాలను అభివృద్ధి చేశాయి. అంతే కాక అనేక సంఘ సంక్షేమ కృషి కార్యక్రమాలు కూడా చేపట్టడం జరిగింది. ఈ మిషనరీలు విద్యాభివృద్ధికై ఎక్కువ కృషి చేశాయి. ఇవి అనేక పాఠశాలలను, కళాశాలలను నడుపుతున్నాయి. అంతేకాక

అనాథ శరణాలయాలు, వితంతు గృహాలు మొదలైన వాటిని కూడా నడుపుతున్నాయి. ఈ మిషనరీల ద్వారా కుటుంబ సంక్షేమ కృషికూడా జరుగుతున్నది. ఈ మిషనరీలో కొనసాగిస్తున్న ఈ కార్యక్రమాలన్నీ స్వామి వివేకానందుని కృషి ఫలితమేనని చెప్పవలసిఉంది.

స్వామి వివేకానందుడు భారతదేశంలోని మత, సాంస్కృతిక, విద్య, ఆర్థిక, సాంఘిక, రాజకీయరంగాల అభివృద్ధికి విశేషంగా కృషి చేశాడు.

1893 లో చికాగోలో జరిగిన "పార్లమెంట్ ఆఫ్ రెలిజియన్స్" అనే సమావేశంలో స్వామి వివేకానందుడు భారత ప్రజలు, వారి సమస్యలు, మతం, తాత్వికచింతన గురించి తెలియజేశాడు. స్వామి వివేకానందుడు 1911 వ సంవత్సరంలో పరమపదించాడు.

## కందుకూరి వీరేశలింగం పంతులు (1848 - 1919)

వీరేశలింగం పంతులు 1848 వ సంవత్సరంలో ఏప్రియల్ 16వ తేదీన ఆంధ్రరాష్ట్రంలో గల రాజమండ్రిలో జన్మించాడు. 1860 వ సంవత్సరంలో ఆంగ్లవిద్య నభ్యసించడానికి మండల పాఠశాలలో చేరాడు. ఈయన తన 18 వ సంవత్సరంలో 9 సంవత్సరాల బాలికను వివాహంచేసుకొన్నాడు. అయినా ఈయన బాల్యవివాహాలకు వ్యతిరేకంగా కృషిచేసి సంఘసంస్కరణ చేశాడు. అంతేకాక హిందూ సనాతన సాంప్రదాయాలుగా పాటిస్తున్న దురాచారాలను తొలగించడానికి ప్రయత్నించాడు. హిందూ వివాహాలలో నాట్యకత్తెలు నాట్యం చేయడం సాంప్రదాయం. ఈయన వివాహ సందర్భంలోకూడా ఈ సాంప్రదాయాన్ని పాటించడం జరిగింది. ఈయన ఈ సాంప్రదాయాన్ని రూపుమాపడానికి కృషిచేసి కృతకృత్యుడైనాడు. హిందూ స్త్రీల స్థితిగతులను మెరుగుపరచడం, సంఘాభివృద్ధి మొదలైనవి ఈయన ఆశయాలు, మూఢనమ్మకాలను, మూఢాచారాలను, తొలగించడానికి అతడు తీవ్రమైన కృషిచేసి వాటినిర్మూలనకై అనేక గ్రంథాలనుకూడా

రచించాడు. ఇతడు ఆలోచనలలోను, ఆచరణలోనుకూడా హేతువాది. బ్రహ్మసమాజానికి ప్రముఖ నాయకుడైన పండిత విశ్వనాథ్ శాస్త్రి ద్వారా వీరేశలింగం పంతులు మొట్టమొదట ప్రభావితుడైనాడు. ఈయన జాతిభేదాలు ఉండరాదనీ, విగ్రహారాధన నిషేధించాలనీ, సంఘ పవిత్రతను, స్వచ్ఛతను అభివృద్ధపరచాలనీ మొదలైన విషయాలను ఆధారంచేసుకుని వాటిపైన అనేక గ్రంథాలను రాసి ప్రార్థనా సమాజంలో ప్రజలకు తెలియజేశాడు. రాజారామమోహనరాయ్ కనుగొన్న "మోనోథీస్టిక్" చర్యపై అమితమైన విశ్వాసాన్ని కలిగి ఉండేవాడు.

భారతదేశంలో స్త్రీల ప్రతిపత్తి సమాజంలో ఎంతవరకూవున్నదో వారికి సమాజంలో ఎన్ని ఆటంకాలు ఉన్నాయో మొదలైన విషయాలు గ్రహించి వాటిని తొలగించడానికి ప్రయత్నించలేకపోతే సమాజాభివృద్ధి అసంభవమని గుర్తించి అదే విషయాన్ని ప్రజలకు కూడా తెలియజేశాడు. స్త్రీలలో ఈ శక్తిని పెంపొందింపజేయడానికి అనేక విధాలుగా ప్రయత్నించాడు. రాజారామమోహనరాయ్ సతీ సహగమనాన్ని నిర్మూలించడానికి బాధ్యత వహిస్తే, వితంతువులకు పునరావాసాన్ని కల్పించే సంస్థలను నడిపే బాధ్యతను ఈశ్వరచంద్ర విద్యాసాగర్, వీరేశలింగం పంతులు కలసి చేపట్టారు. ఈయన హిందూ బాల వితంతువుల పునర్వివాహాలను ప్రోత్సహించాడు. సంఘ సంస్కరణ కార్యక్రమాలను నిర్వహించడానికిఆనాటి సంఘంలో వ్యతిరేకత ఉన్నప్పటికీ ఆయనకు అనేకమంది నిస్స్వార్థ సేవకులు ముఖ్యంగా విద్యార్థులు, యువకుల సహకారం లభించింది. దీని ద్వారా ఆయన అనేక బాలవితంతు పునర్వివాహాలను జరిపించాడు.

బొంబాయి నుంచి జస్టిస్ రానడే, కలకత్తా నుంచి ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కందుకూరి వీరేశలింగంపంతులు కార్యక్రమాలను ప్రోత్సహిస్తూ, అనేక సలహాలను ఇస్తూ ఉండేవారు. వీరేశలింగం పంతులు కృషి అనేక సంఘ సంస్కరణ కార్యక్రమాలకు దోహదమైంది.

వీరేశలింగం పంతులు తాను రచించిన గ్రంథాలవల్ల ఆర్జించిన ధనాన్ని పాఠశాలలు, టౌన్‌హాల్స్, వితంతు గృహాలు, అనాథ శరణాలయాలు మొదలైన సంస్థలు మద్రాస్, రాజమండ్రి, బెంగుళూర్‌లలో నిర్మించడానికి విరాళాలుగా ఇచ్చాడు. తన స్వంతానికి ఒక్క పైసా కూడా ఉపయోగించుకోనేవాడుకాదని తెలుస్తున్నది. ఇతడు రాజమండ్రిలో ఒక ట్రస్ట్‌ను నెలకొల్పాడు. ఈ ట్రస్ట్ ద్వారా ఈయన ఆరంభించిన వ్యవస్థలన్నీ నిర్వహించడం జరుగుతుంది. వీరేశలింగం పంతులు గారి భార్య రాజ్యలక్ష్మి కూడా ఆయన కృషికి చేదోడువాదోడుగా ఉండి సహకరించేవారు. ఇతడు అనేక రాజకీయ, సాంఘిక సభలకు అధ్యక్షతను వహించేవాడు. ఈ చర్చలలో దేశాభ్యుదయం ప్రధానాంశంగా ఉండేది.

ఈయన ఆంధ్రప్రదేశ్‌లో గల సాంఘిక దురాచారాలను రూపుమాపడానికి పూనుకున్నాడు. వీరేశలింగంపంతులు స్వతహాగా దుర్బల శరీరం గలవాడు. అయినప్పటికి చిన్నతనంలో పరీక్షలలో ఈయనకే మొదటి బహుమతులు లభించేవట. ఆయన ఏకసంథాగ్రాహి. ఆయన అనేక గ్రంథాలను చదివి నిర్హేతుకమైన నమ్మకాలను విడచిపెట్టాడు. ఇతడు దయ, జాలి, మూర్తీభవించిన విశాలహృదయుడు. వీరేశలింగం పంతులు తాను నెరవేర్చదలచిన కార్యక్రమాలన్నీ క్రమపద్ధతిలో అమలు పరచేవాడు. ఇతడు మంచివక్త, కవి, పత్రికా సంపాదకుడు. పైగా ఉపాధ్యాయుడు - కళాశాలలో తెలుగు బోధిస్తూ ఉండేవాడు. తెలుగులో అనేక గ్రంథాలు కూడా వ్రాశాడు. "గోదావరి జిల్లా విద్యా ప్రబోధిని" అనే పత్రికకు 1870 లో ఆయన తెలుగులో వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు. 1874 లో ఇతడు ఒక పత్రికను స్థాపించాడు. దీని పేరు వివేకవర్ధిని. ఈ పత్రిక ద్వారా సులభమైన వచన శైలిలో అనేక నూతన విషయాలను ప్రచురిస్తూ ఉండేవాడు. మద్యపానం, వ్యభిచారం, లంచగొండితనం మొదలైన దురాచారాలను ఈ పత్రిక ద్వారా విమర్శిస్తూ ఉండేవాడు. వివేకం, సత్యం, అహింస మొదలైన విషయాలమీద ఈ పత్రికలో అనేక వ్యాసాలు వెలువడ్డాయి.

వీరేశలింగం పంతులు తన స్వీయచరిత్రలో ఆనాటి సమాజం లోని పౌరుల మనస్తత్వాల గురించి ఈ కింది విధంగా వ్రాశాడు.

లంచాలు తగవన్న రాజకీయోద్యోగులకు కోపం, వేశ్యాంగనా సంగమం నీతికాదన్న శృంగార నాయకులకు కోపం, పూర్వాచారాలు మార్చుకోవలెనన్న పామరజాతులకు కోపం, నీతిమాలిన బాహ్యవేషాలు మతవిరుద్ధాలన్న ఆచార్య పురుషులకు కోపం, మా పత్రికోద్దేశం నిశ్శంకంగా నిర్వహించవలెనన్నచో ఇన్ని కోపాలను సరకుచేయక ఉండవలె.'' దీనినిబట్టి ఇతడెంత స్వతంత్రభావాలు కలవాడో గమనించవచ్చు. 1874 లో ప్రజలనుండి చందాలను వసూలుచేసి స్త్రీ పాఠశాలలను స్థాపించాడు. ఆ కాలంలో వేశ్యలకు నృత్యగీతా విద్యలు నేర్పడానికి ప్రత్యేక పాఠశాలలు ఉండేవి. వాటిలో ఎన్నో అవినీతి కార్యాలు జరుగుతుండేవి. వీరేశలింగం పంతులు తన పత్రికలో వీటిని ఎత్తిచూపి చివరికి అటువంటి పాఠశాలనే ఎత్తివేయించాడు. 1878వ సంవత్సరంలో ఇతడు మిత్రుల సహాయంతో ప్రార్థనా సమాజాన్ని స్థాపించి తద్వారా దైవచింతన, మానవసేవ ప్రచారంచేశాడు. బాల వితంతువుల పునర్వివాహాన్ని బలపరుస్తూ వీరేశలింగం పంతులు అనేక ఉపన్యాసాలు చేయడం కోసం అతడెన్నో ప్రాచీన శాస్త్రాలు, పురాణాలు, మత గ్రంథాలు చదవవలసి వచ్చేది. మనుస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి, మొదలైన స్మృతి గ్రంథాలే కాకుండా ఈశ్వరచంద్ర విద్యాసాగర్ రచనలు సేకరించి, వాటిని చదివి, తమ ఉపద్యాసాలలో వాటినుంచి అనేక ఉదాహరణలను చూపుతూ వితంతువుల దుస్థితి కళ్ళకుకట్టేలాగ 1879వ సంవత్సరంలో ఆగస్టు 3వ తేదీన విజయనగరం రాజావారి బాలికా పాఠశాలలో గంభీరోపన్యాసం ఇచ్చాడు. కానీ ''వితంతు'' అనే శబ్దమే వినబడితే చెవులు మూసుకొనే సనాతనులు చాలామంది వీరికి శత్రువులైనారు. కొన్ని సమావేశాలు రద్దయినవి. కొన్ని సమావేశాలలో రాళ్ళుకూడా రువ్వారు. మరికొన్ని సమావేశాలలో ఈయన గాయపడటంకూడా జరిగింది. అయినా ఈయన వెనుకంజవేయక ప్రజల దృక్పథంలో మార్పు తేవడానికి ప్రయత్నించాడు.

1881 వ సంవత్సరంలో విద్యార్థుల ప్రోద్బలంతో నాటక సమాజాన్ని స్థాపించి అనేక ప్రహసనాలను ఆడించాడు. ఈ ప్రహసనాలు హాస్యభరితంగానే కాకుండా మర్మగర్భితంగా సంఘాన్ని విమర్శిస్తూ ఉండేవి. 1881వ సంవత్సరం డిసెంబర్ 11వ తేదీన ఆయన ప్రథమ వితంతు వివాహాన్ని జరిపించాడు. వితంతు వివాహాలనేకాక శాఖాంతర వివాహాలనుకూడా ప్రోత్సహించాడు. ఎన్నికష్టాలుపడినా, ఎవ్వరెదిరించినా వెనుదీయక సంఘాలలోని దురాచారాలను ఎత్తిచూపి వాటిని నిర్మూలించే విధానాలను ఆచరించి చూపి వీరేశలింగం పంతులు చిరస్మరణీయుడైనాడు.

## ఆర్య సమాజం

19 వ శతాబ్ది ప్రారంభం నాటికి బ్రిటిష్ ప్రభుత్వం దేశమంతటా సుస్థిరమైన ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకుని ఆధునిక భారతదేశంలో రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక మతపునరుద్ధరణకు దారిచూపటం జరిగింది. అప్పటికే భారత దేశంలో ముస్లిమ్, క్రైస్తవ మతాల ప్రాబల్యం అత్యధికమైంది. హిందువులు అత్యధిక సంఖ్యలో ఇతర మతాలు స్వీకరించడం ఎక్కువగా జరుగుతుండేది. ప్రజలలో మూఢాచారాలు, మూఢనమ్మకాలు అధికంగా ప్రబలిఉండేవి.

ఆ పరిస్థితులలో రాజారామమోహనరాయ్, దేవేంద్రనాథ్ ఠాగూర్, కేశవచంద్రసేన్, మహాదేవ గోవిందరానడే మొదలైనవారు బ్రహ్మసమాజం, ప్రార్థనా సమాజాలను కలకత్తా, బొంబాయి నగరాలలో స్థాపించారు. ఆ సమయంలోనే అంటే 1824 వ సంవత్సరంలో గుజరాత్‌లోని కథియవార్ ప్రాంతంలో తంకారా గ్రామంలో శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబంలో మూలశంకరుడనే ఒక బాలుడు జన్మించాడు. అతనిది పండిత కుటుంబం. మూలశంకరుని తల్లిదండ్రులు శైవారాధకులు. ఇతడు తన 14 వ ఏట శివాలయంలో శివరాత్రి రోజు ఒక ఎలుక శివుని విగ్రహంమీద పరుగుత్తుతూ ఆ విగ్రహాన్ని మలిన పరచడం చూశాడు. ఆ సంఘటనను గురించి తండ్రిని ప్రశ్నించగా తండ్రి

తగిన సమాధానం చెప్పలేకపోయినాడు. ఆ కారణంగా మూలశంకరు నకు విగ్రహారాధనపై విశ్వాసం సన్నగిల్లి విరక్తి కలిగింది. తరువాత తన కనిష్టసోదరి, తన గురుతుల్యుడైన పెదతండ్రి చనిపోయినందుకు అతడు చాలా విచారించాడు. అప్పటి నుంచి మానవుల బాధలను ఏ విధంగా తొలగించాలి అనే ఆలోచన అతనిలో తీవ్రంగా కలిగింది. తండ్రి తనకు వివాహంచేసే ప్రయత్నంలో ఉండగా మూలశంకరుడు వివాహ బంధానికి ఇష్టపడక ఇంటినుంచి పారిపోయినాడు. ఇల్లు వదలిపెట్టిన తరువాత 18 సంవత్సరాలపాటు సత్యాన్వేషణలో జీవితాన్ని గడిపాడు. అనేక ప్రదేశాలు సందర్శించాడు. సాధువులను, పండితులను కలుసుకొన్నాడు. చివరకు పరమానంద పరమహంస వద్ద వేదాంతం నేర్చుకున్నాడు. ఆ తరువాత దక్కన్‌లో స్వామి పూర్ణానందుడు ఈ మూలశంకరుడికి దయానంద సరస్వతి అనే పేరు పెట్టాడు. దయానంద సరస్వతి విరజానందుడనే స్వామికి శుశ్రూషలు చేసి సనాతన ధర్మాలను, సంస్కృత గ్రంథాలను పఠించి వాటిలోని సారాంశాన్ని గ్రహించాడు.

దయానంద సరస్వతి 1875 వ సంవత్సరంలో బొంబాయి నగరంలో ఆర్య సమాజాన్ని స్థాపించాడు. మొట్టమొదట బొంబాయిలో స్థాపించినప్పటికీ రానడే ప్రోద్బలంవల్ల దేశమంతటా హిందూ మత ధర్మాలను, ఆర్యసమాజ సూత్రాలను ప్రచారం చేయడం మొదలు పెట్టాడు. ఆర్య సమాజానికి లాహోరు ముఖ్య కేంద్రమై పంజాబు రాష్ట్రంలో పేరు పొందింది. ఆధునిక భారతదేశంలో మత పునరుద్ధరణకు బ్రహ్మ సమాజం, ప్రార్థనా సమాజం, ఆర్య సమాజం ఎక్కువగా దోహదం చేశాయి. ఈ మూడింటిలోను ఆర్య సమాజానికి అగ్రస్థానం లభించింది. ఆర్య సమాజ తత్వాన్ని అత్యధిక ప్రజలు అవలంభించటమే కాక సమాజంలో అట్టడుగున ఉన్న ప్రజలు ఎక్కువగా ఆకర్షితులై ఆర్య సమాజ సూత్రాలను అనుసరిస్తున్నారు. ఆర్య సమాజమనే పేరు ఈ సమాజానికి వర్తించింది. ఎందువలనంటే హిందువులు, బౌద్ధులు, జైనులు మొదలైనవారెందరో "ఆర్య" పదాన్ని చాలా విరివిగా విశా

లార్థం స్ఫురించేటట్లు ఉపయోగించడం జరుగుతున్నది. ఆర్యధర్మం, హిందూధర్మంగా హిందువులు ఆర్యులుగా ప్రసిద్ధికెక్కడం జరిగింది.

స్వామి దయానందుని కాలంలో సమాజం దురాచారాలతోను, సమస్యలతోను నిండిఉండేది. ప్రజలు అత్యధిక సంఖ్యలో పరమత బోధకుల ప్రభావాలకు లోబడి హిందూమతాన్ని వదిలిపెట్టి పరమతాలను స్వీకరించేవారు. ఈ పరమత ప్రాబల్యంతో ప్రజలు అనేక దురాగతాలకు పాల్పడేవారు. అటువంటి క్లిష్టపరిస్థితులలో ఆర్యసమాజాన్ని స్థాపించి హిందూమత పునరుద్ధరణకు భారతీయ ధర్మరక్షణకు స్వామి దయానంద బద్ధకంకణుడై వివిధ స్థాయిలలో కృషిచేసి సంఘాన్ని సంస్కరించాడు. స్వామి దయానంద సరస్వతి అనేక సంస్థలను స్థాపించి అతని అనుచరులకు మార్గదర్శకుడైనాడు. ప్రతిమానవుడు విగ్రహారాధన చేయడం, భక్తిని చూపడమే చాలదని, మానవసేవనే నిజమైన మాధవసేవగా భావించి ప్రజలకు సేవచేయాలని బోధించాడు. దయానందుని బోధనలవల్ల ప్రతిభారతీయుడు తమ వ్యక్తిగత భావాలను వదులుకుని సంఘసంక్షేమానికి ఉపయోగపడే దృక్పథాన్ని అలవరచుకున్నారు. అనేక సాంఘిక సహాయ సంస్థలను, సాంఘిక విద్యాసంస్థలను అనాథ సహాయక సంస్థలను స్థాపించి ప్రజలకు అనేక విధాలుగా సహాయంచేశాడు. ఈ సంస్థలు పనిచేయడానికి అనేకమంది స్వచ్ఛంద సేవాకార్యకర్తలు ఇతనికి సహాయపడ్డారు. అజ్మీర్ పట్టణం మహమ్మదీయ, క్రైస్తవ, సిక్కు, పార్శీ, జైన, బౌద్ధ మతాలకు కేంద్రంవంటిది. ఇటువంటి పట్టణంలో ఆర్యసమాజం ప్రసిద్ధిచెందింది. ఆర్యసమాజం అనాథ శరణాలయాలు, పారిశ్రామిక వర్క్‌షాప్‌లు, ఉపన్యాస భవనాలు, బాలికా పాఠశాలలు, వేదముద్రణాలయం మొదలైనవాటిని నడుపుతున్నది. ఈవిధంగా దయానందుడు అనేక సంస్థలను స్థాపించి వాటిద్వారా సంఘ సంస్కరణోద్యమాన్ని నడిపించి సంఘసంస్కర్తగా సుప్రసిద్ధుడైనాడు.

స్వామి దయానంద సరస్వతి నైతిక, ఆధ్యాత్మిక మతపరమైన సంక్షేమ విద్యమాత్రమే భారతీయ యువక లోకానికి పటిష్టమయినదని

భావించాడు. యువతరం శీలం పటిష్టంగా ఉండి, వారు అన్నివిధాలుగా అభివృద్ధిచెందాలంటే భగవంతునిసేవ చాలదని, మానవసేవకూడా చాలాముఖ్యమనీ తెలియజెప్పాడు. మానవునికి చతుర్విధ ఆశ్రమాలలో బ్రహ్మచర్యాశ్రమం చాలా ముఖ్యమనీ దయానందుడు బోధించాడు. ప్రతిమానవుడు 7 సం॥ నుంచి 25 సంవత్సరాల వరకు తప్పనిసరిగా బ్రహ్మచర్యాన్ని అవలంబించి, విద్యాభ్యాసం చేయాలని తెలియజేశాడు. మానవుడు తన వ్యక్తిగత స్వచ్ఛతకు అధిక ప్రాముఖ్యాన్నిచ్చి ధర్మాన్ని పాటించాలని. సామాన్య సుఖాలను అనుభవించడంలో తప్పులేదుగానీ, విశేషంగా భోగపరాయణులుగా ఉండరాదనీ, ధర్మాన్నీ, సత్యాన్నీ అవలంబించాలేగానీ, ద్వైవత్వాన్ని పాటించరాదనీ, విద్యార్థులకు తరచుగా బోధించేవాడు. దయానందుడు తన విద్యాపథకంలో వ్యక్తిగత ఆరోగ్యానికి ప్రాముఖ్యత ఇవ్వడం జరిగింది. విద్యాబోధన విషయంలో ఉపాధ్యాయునికి విద్యార్థికి సన్నిహిత భావసంబంధాలు అంటే తండ్రికీ, తనయులకూ మధ్యగల సంబంధం వంటిది ఉండి ప్రశాంత వాతావరణములో విద్యాబోధన కొనసాగించాలని చెప్పాడు.

స్వామి దయానంద సరస్వతి అస్పృశ్యతా నివారణకు కూడా చాలా పాటుపడ్డాడు. వేదకాలంలో అస్పృశ్యతా, విగ్రహారాధన లేవని చెప్పాడు. మనిషికి పుట్టుకతో వర్ణవ్యవస్థ నిర్ణయంకాదనీ, వారివారి గుణ, కర్మ, స్వభావాలనుబట్టి నిర్ణయం జరగాలనీ తెలియజెప్పాడు. వ్యక్తి సంస్కారం, శిక్షణ, శీలం, ధర్మం వీటిమీదనే వర్ణం ఆధారపడి ఉంటుందని వ్యక్తపరచాడు. శుభ్రత, సత్యం, త్యాగం, శాస్త్రవిజ్ఞానం, వేదాధ్యయనం మొదలైన సద్గుణాలు కలవారు నిమ్నజాతిలో పుట్టినా అగ్రజాతులలో ప్రవేశించడానికి అర్హులే అని చెప్పాడు. ప్రస్తుత కుల వ్యవస్థ పుట్టుకనుబట్టి ఏర్పడిందిగానీ, వ్యక్తి గుణగణాలనుబట్టి, విజ్ఞాన వివేకాలను బట్టిగానీ ఏర్పడిందికాదని చెప్పాడు. వేదకాలంలో అస్పృశ్యత లేదనీ, దీనిని సమాజమే అవసరాన్నిబట్టి ఏర్పరచిందనీ, వేదాలు, శాస్త్రాలు, ఉపనిషత్తులు, మనుస్మృతి, భగవద్గీత మొదలైన గ్రంథా

లను ఆధారంగా చేసుకుని దయానందుడు పండిత పామరులకు నచ్చ జెప్పి అస్పృశ్యతా నిర్మూలనకై తీవ్రమైన కృషి చేశాడు.

స్వామి దయానందుడు భారత స్త్రీలపట్ల అత్యంత గౌరవ భావాన్ని ప్రదర్శించాడు. ఆర్య సమాజంలో చాలామంది స్త్రీలను చేర్చుకుని వారికి ఉన్నత స్థానాన్ని ఇచ్చి వారిపట్ల పవిత్ర భావాన్ని ప్రకటించాడు. స్త్రీలు పరదా పద్ధతిని వదిలిపెట్టాలని ఆడపిల్లలకుకూడా మగపిల్లలకువలె సరిసమానమైన విద్యావకాశాలను, హక్కులను కలుగ జేయాలని, 16 సంవత్సరాలలోపు వయస్సుగల ఆడపిల్లలకు వివాహం చేయరాదనీ గృహాలలో స్త్రీలకు ఉన్నతస్థానమిచ్చి గౌరవించాలనీ, ఉపన్యాసాల ద్వారా ప్రజలకు బోధిస్తూ ఉండేవాడు. స్త్రీలకు సంపూర్ణ దాస్య విమోచనం కావాలనీ, అన్ని రంగాలలోను వారికి సమానావ కాశాలను కలిగించాలనీ ఎక్కువగా ప్రబోధించాడు. వేదకాలంలో స్త్రీకి ఉన్నత స్థానం ఉండేదనీ, స్త్రీని పవిత్రమూర్తిగా ఆరాధించి గౌర వించేవారనీ, స్త్రీలు పురుషునితో సరి సమానంగా యజ్ఞ యాగాదు లలో పాల్గొనేవారనీ, పురుషులతో సమానంగా విద్య నభ్యసించేవారనీ అందుకు తగిన ఆధారాలు వేదాలలోను, ఉపనిషత్తులలోను, స్మృతుల లోను ఉన్నాయి. నీ ప్రజలకు నచ్చచెప్పి స్త్రీల అభ్యున్నతికి పాటు పడ్డాడు. దయానందుడు ప్రారంభించిన స్త్రీ దాస్య విమోచన సంస్కర ణోద్యమానికి నేటి మహిళా లోకం ఆయన కెంతైనా ఋణపడి ఉంద నడంలో సందేహం లేదు.

దయానందుని మత దృక్పథం అత్యంత అధునాతనమై, సర్వ మానవ జాతికి ఉపయోగకరమైనదిగా విశ్వజనీనతను పొందింది. ఏమత సంస్కర్తగానీ, సంఘసంస్కర్తగానీ సాధించలేని మహత్తర కార్యాలను దయానంద సరస్వతి సాధించగలిగాడు. భారతదేశంలో హిందూమతం పాశ్చాత్యప్రభావంతో క్షీణించిపోయేదశలో ఒక నూతన దృక్పథంతో హిందూ జాతిని, మతాన్ని పరిరక్షించడానికి అహోరాత్రులు పని చేశాడు. వేదాలు, మత, సాంఘిక, ఆర్థిక రంగాలలో హెచ్చుగా ఉప యోగ పడతాయని దేశమంతా తిరిగి ప్రజలలో ప్రచారం సాగించాడు.

హిందూ సంస్కృతికి విశ్వజనీతను సాధించి, దానిని అంతర్జాతీయ మతంగా తయారుచేసిన మేధావిగా దయానందుని పరిగణించడం జరిగింది.

స్వామి దయానంద సరస్వతి ఆర్యసమాజాన్ని ఒక మిషనరీగా నడిపి తన జీవితాంతం మతప్రచారానికి సంఘ సంస్కరణకు కృషి చేశాడు. ఇతడు అంతర్జాతీయ మతబోధకుడు. ఆర్యసమాజ మిషన్ సర్వమానవజాతిని సముద్ధరించడానికి అవతరించింది. వేదాలు ప్రపంచ మానవజాతిని ఉద్ధరించడానికి అవతరించాయనీ, భారతీయ విజ్ఞానమంతా వాటిలోనే ఇమిడిఉందనీ, దయానందుడు వివరించాడు. ఒక్క హిందూ జాతినిగానీ, మతాన్నిగానీ, ఉద్ధరించడం ఆర్యసమాజ ధ్యేయం కాదనీ, ప్రపంచ మానవాళికంతటికీ ప్రబోధించి సౌభాగ్యం చేకూర్చడమే ఆర్య సమాజం లక్ష్యమని చాటాడు. విగ్రహారాధనను పూర్తిగా నిషే ధించాలనీ, కులవ్యవస్థను, అంటరానితనాన్ని నిర్మూలించాలనీ, బాల్య వివాహాలను, బలవంత వైధవ్యాలను అరికట్టాలనీ, మూఢాచారాలను ఎదుర్కోవాలనీ, ఆర్యసమాజ్ మిషన్ ద్వారా దేశం నలుమూలలా ప్రచారం చేశాడు. ఇతడు తన "సత్యార్థ్ ప్రకాష్" అనే గ్రంథంలో సర్వ మానవ జాతి సముద్ధరణ విషయంలో తన దేశ ప్రజలను ఏ దృష్టితో చూస్తాడో పాశ్చాత్య దేశ ప్రజలనుకూడా అదేదృష్టితో చూస్తాడని తెలియజేశాడు. ఇతని మతబోధనలన్నీ హిందూశాస్త్ర సంస్కృతి మీదనే ఆధారపడ్డాయి. ఇతడు ఇంతటి మతప్రవక్త కావడానికి ఇంతటి విశాల దృక్పథం కలిగి ఉండడానికి పాశ్చాత్య నాగరికతా ప్రభావం ఏమాత్రం కారణంకాదు. ఇతడు కనీసం ఇంగ్లీష్ భాషనైనా నేర్చుకోలేదు. స్వామి దయానందుడు ఆర్యసమాజ మిషన్‌ను జాతీయ, అంతర్జాతీయ, స్థాయిలలో నడిపించాడు. హిందూమత ప్రాశస్త్యాన్ని విశ్వవిఖ్యాతికి తెచ్చాడు. అంతర్జాతీయ మతాలలో హిందూమతం అగ్రగణ్యమైనదని నిరూపించాడు.

దయానందుడు సంస్కృత, హిందీ భాషలలో అనేక గ్రంథాలను కూడా రచించాడు. దయానందుడు 1883వ సంవత్సరం అక్టోబర్ 30వ

తేదీన అస్తమించాడు. దయానందుడు పేదలు, అనాథలు, వికలాంగుల పట్ల చూపిన దయ అపారమైనది.

## ప్రార్థనా సమాజం

ఆర్యసమాజం ఆశయాలను ఆధారంగా చేసుకుని ప్రార్థనా సమాజం అవతరించింది. 1849వ సంవత్సరంలో దేశంలోని సాంఘిక సమస్యలను రూపుమాపడానికి పరమహంస సభ స్థాపించబడింది. ఈ పరమహంస సభలో ప్రజలు రహస్యంగా సమావేశమై అతితక్కువ కులంగా పరిగణించబడేవారితో వంటలు చేయించి మిగతా అగ్ర జాతులుగా పరిగణించబడే వారందరూ కలసి విందు ఏర్పరచుకొనేవారు. 1860వ సంవత్సరంలో ఈ సమాజం విచ్ఛిన్నమైపోయింది. తరువాత నాలుగు సంవత్సరాలకు పరమహంస సభలోగల ప్రముఖులందరూ కేశవ్ చంద్రసేన్ నాయకత్వంలో ఒక నూతన సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజం ముఖ్యోద్దేశం విగ్రహారాధనను ఖండించడం, జాతివ్యవస్థను సంస్కరించడం, వితంతు వివాహాలను బలపరచడం మొదలైనవి. అంతే కాక స్త్రీ విద్యనుకూడా ప్రోత్సాహపరచి బాల్యవివాహాలను ఖండించింది. ఈ సమాజం క్రమక్రమంగా ప్రార్థనా సమాజంగా రూపొందింది. రానడే, తెలంగ్, చంద్రావర్కర్ మొదలైనవారు ఆ కాలంలో ఈ ప్రార్థనా సమాజం ముఖ్యనాయకులు. వీరు గొప్ప సాంఘికవాదులు సంఘసంస్కర్తలు. 1861వ సంవత్సరంలో రానడే వితంతు వివాహాల అసోసియేషన్‌ను స్థాపించాడు. 1870 లో ఈ వితంతు వివాహాల అసోసియేషన్ ప్రార్థనా సమాజంలో చేరింది. వితంతు పునర్వివాహాలకు ప్రార్థనా సమాజం అత్యంత ప్రోత్సాహమివ్వడం జరిగింది. గొప్ప సంఘ సంస్కర్త అయిన "కార్సోనదాస్ ముల్జీ" వితంతు పునర్వివాహాలకు ప్రోత్సాహమిచ్చినవారిలో ముఖ్యుడు. ఇతడు భావియాలలో గొప్ప సంఘసంస్కరణ తీసుకునివచ్చాడు. ఇతనిని ప్రార్థనా సమాజం సన్మానం చేసింది. ప్రార్థనా సమాజం నాయకుడైన జ్యోతిభాఫూలే మొట్ట మొదట వెనుకబడిన వర్గాల పాఠశాలను స్థాపించడం జరిగింది. అనేక

పాఠశాలలుకూడా స్థాపించాడు. 1818వ సంవత్సరంలో ప్రార్థనా సమాజం మంగుళూర్‌లో ఒక పాఠశాలను స్థాపించింది. సమాజంలో గల మూఢాచారాలు, వాటి చెడు ప్రభావాలను, ప్రజలందరికీ తెలియ జేయడానికి ప్రార్థనా సమాజం చాలా కృషి చేసింది.

క్రిష్టియన్ మిషనరీల ప్రభావంవల్ల జాతి భేదాలతో హీనపరచ బడిన జాతులవారందరూ క్రిష్టియన్ మతాన్ని స్వీకరించడం మొదలు పెట్టారు. దీనివల్ల హిందూ మత పభావం క్షీణించసాగింది. కనుక హిందూ మతాన్ని పునర్నిర్మించడానికి కొంతమంది సంఘ సంస్కర్తలు పూనుకొన్నారు. హిందూమతంలోగల లోపాలను, మూఢాచారాలను, దురాచారాలను అంటే జాతిమత బేదాలు, విగ్రహారాదన, వితంతు పునర్వివాహాలపై ఆటంకం, బాల్యవివాహాలు, ప్రతిపత్తి మొదలైన విషయాలలో సంస్కరణ తీసుకుని రావడానికి కృషి చేశారు. ఈ కృషిలో సఫలీకృతం చెందడానికి ప్రార్థనా సమాజం స్థాపించారు. మతం, మానవతా భావనలు ఈ సమాజం ముఖ్యోద్దేశాలు.

19 వ శతాబ్దంలో రాజారామమోహనరాయ్ చేసిన తీవ్రమైన కృషి ఫలితంగా దేశంలో ఆర్థిక, సాంఘిక మార్పులు జరిగాయి. ఇతని కృషి మరొక ఫలితం ప్రార్థనాసమాజం. వీరేశలింగం పంతులు శివనాథ్ శాస్త్రివల్ల ప్రభావితుడైనాడు. శివనాథ్ శాస్త్రి ప్రార్థనా సమాజానికి గొప్పనాయకుడు. కందుకూరి వీరేశలింగంపంతులు ప్రార్థనా సమాజంలో చేరి జాతి సంస్కరణ విగ్రహారాధన తొలగింపు, సంఘ స్వచ్ఛతను నిల బెట్టడం మొదలైన అంశాలపై గ్రంథాలను రాసి ప్రార్థనా సమాజానికి అంకితం చేశాడు.

ఈ విధంగా గొప్ప గొప్ప నాయకులు, సంఘ సంస్కర్తలు, మేథావులు, ప్రార్థనా సమాజాన్ని నడిపి దేశంలో విప్లవాత్మకమైన మార్పును తీసుకువచ్చారనడంలో అతిశయోక్తి లేదు. ప్రార్థనా సమాజం అంతర్జాతీయ సమాజంగా కూడా పేరు పొందింది.

## బ్రహ్మ సమాజం

రాజారామమోహనరాయ్ విగ్రహారాధనను నిరసించి ఏకేశ్వరోపాసనకు ప్రోత్సాహమిచ్చాడు. ఇతడు బ్రహ్మసమాజాన్ని స్థాపించి బ్రహ్మసమాజం ద్వారా ప్రజలలో సమానత్వం, సౌభ్రాతృత్వం తేవాలని ప్రయత్నించాడు. ఈయన 1828 వ సంవత్సరంలో బ్రహ్మ సమాజాన్ని స్థాపించి ఏకేశ్వరోపాసనను ప్రచారం చేశాడు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ 1820 వ సంవత్సరంలో జన్మించాడు. ఈయన హిందూ మతంలో అంటరానివారిగా పరిగణించబడినవారినందరినీ బ్రహ్మసమాజంలో చేర్చి, వారు కోల్పోయిన అర్హతలన్నిటినీ పొందేలాగ చేశాడు. ఈయన ఏడవ ఏటనే బ్రహ్మ సమాజ కార్యరంగంలోకి రావడం జరిగింది. అప్పట్లో క్రిష్ణమోహన్ బెనర్జి అనే భారతీయుడు క్రైస్తవమత ప్రచారంచేస్తూ హిందూమతాన్ని నిరసించేవాడు. తనకంటే పెద్దవాడైన దేవేంద్రనాథ్ టాగూర్ ఏకేశ్వరోపాసనకు కృషి చేస్తూ ఉండేవాడు. ఇతడు బ్రహ్మ సమాజంలో సభ్యుడుగా చేరాడు.

18.5 వ సంవత్సరంలో రాజారామమోహన్‌రాయ్ ఆత్మీయ సమాజాన్ని స్థాపించాడు. హిందూమతాన్ని సంస్కరించడానికి అతడు చేసిన ప్రయత్నాలలో ఇది మొట్టమొదటి ప్రయత్నమని చెప్పడం జరిగింది. ఈ సమాజం క్రమక్రమంగా బ్రహ్మసమాజంగా అభివృద్ధి చెందింది. రాజారామమోహన్‌రాయ్ హేతువాది. అయినా హిందూ మతానికి వ్యతిరేకికాదు కానీ హిందూమతంలోగల లోపాలను సంస్కరించడానికి ప్రయత్నించినవారిలో అతిముఖ్యుడు. కనుక హిందూమత సంస్కరణకై బ్రహ్మసమాజాన్ని స్థాపించాడు.

1863 వ సంవత్సరంలో డాక్టర్ భావూభాజీ బ్రహ్మసమాజాన్ని విమర్శించాడు. బ్రహ్మసమాజం సాంఘికసంక్షేమ కృషిపట్ల అశ్రద్ధ కలిగియున్నదని తెలియజేశాడు. బ్రహ్మసమాజం "బెథూన్" పాఠశాల అడుగుజాడలలో నడవాలని సలహా ఇచ్చాడు. ఈ సలహా ప్రకారం కేశవ్‌చంద్రసేన్ బెంగాల్, బీహార్‌లలో స్త్రీ విద్యకోసం తీవ్రమైన కృషిచేసి, స్త్రీ బాలికల విద్యా పాఠశాలలు, బ్రహ్మసమాజం

ఆధ్వర్యంలో నడపసాగాడు. 1865 వ సంవత్సరంలో బ్రహ్మసమాజ సంస్కర్త అయిన శశిపాద బెనర్జి స్త్రీ విద్యా కార్యక్రమం, సంఘ సంక్షేమకృషి కార్యక్రమాలలో ప్రవేశించాడు. బాలికల పాఠశాలతో ఆరంభించి ఉన్నతవిద్యా సంస్థలనుకూడా స్థాపించాడు. స్త్రీలకు వారి వారి గృహాలలోనే విద్యనేర్పే పథకాలనుకూడా ఏర్పాటుచేయడం జరిగింది. బ్రహ్మసమాజంపై ఇతనికిగల అచంచల విశ్వాసం ఫలితంగా ఇతడు తన స్వంత వ్యయంతో ఒక వితంతు గృహాన్నికూడా నడుపు తుండేవాడు. అంతేకాక అవకాశం కలిగినప్పుడల్లా ఈ వితంతువులకు వివాహాలనుకూడా జరిపించేవాడు. వితంతు పునర్వివాహచట్టం ఫలితంగా బ్రహ్మసమాజంలోని సభ్యులందరూ తమ బంధువులలోను, స్నేహితుల లోను గల వితంతువులకు పునర్వివాహాలు చేయడానికి ముందంజవేశారు. అంతేకాక వారిని తమ గృహాలను విడచిపెట్టి బ్రహ్మసమాజంలో చేరడానికి ప్రోత్సాహించారు.

కేశవచంద్రసేన్ ప్రవేశం తరువాత బ్రహ్మసమాజానికి చెందిన యువకులందరూ బ్రహ్మసమాజాన్ని వదలిపెట్టడానికి ప్రయత్నించారు. కానీ ఆయన తరువాత వచ్చిన అనేకమంది సంఘసంస్కర్తలు తిరిగి వారికి ప్రోత్సాహమివ్వడం జరిగింది.

బ్రహ్మ సమాజం లక్ష్యం ప్రకారం ఏ వ్యక్తి చేతగాని, వ్యక్తుల సమూహాల చేతగాని, ఏ వస్తువునుగానీ విగ్రహాన్నిగానీ, పూజా వస్తు వుగా గానీ, పూజా విగ్రహంగాగానీ పరిగణించరాదు. పూజలుచేసి దేవునిగా ఆరాధించరాదు. ప్రతీ వ్యక్తి కూడా మంచి లక్షణాలు కలిగి మానవతాభావం, సమానత్వం, సౌభ్రాతృత్వం కలిగి ఉండాలి. అటువంటి వ్యక్తినే దైవాంశ సంభూతునిగా పరిగణించడం జరుగుతుంది. ఈ మత సంస్కరణకు ప్రభావితం చెందిన స్వామి వివేకానందుడు సన్యాసం స్వీక రించి ప్రజలలో సంస్కరణ కలుగజేయడానికి కృషి చేశాడు. పండిత శివనాథ్ శాస్త్రి కూడా 1847 - 925 సంవత్సరాల మధ్యకాలంలో బ్రహ్మ సమాజంలో చేరాడు. ఇది సారస్వతమైనది. ఇతడు బ్రహ్మ

బాలికల విద్యాలయాన్ని స్థాపించాడు. మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ 1842 లో బ్రహ్మ సమాజంలో చేరాడు. ద్వారకానాథ్ ఠాగూర్, రాజారామమోహనరాయ్ యొక్క బ్రహ్మ సమాజ సూత్రాలను బల పరచాడు.

ఈ విధంగా ఆర్య సమాజం, ప్రార్థనా సమాజం, బ్రహ్మ సమాజం ఒకే లక్ష్య సాధన కోసం వివిధ సంఘ సంస్కర్తలు, నాయకులు, మేధావుల కృషి ఫలితంగా సఫలీకృతమైనాయని చెప్పవచ్చు.

# 3
# కుటుంబం, స్త్రీ, శిశు సంక్షేమ సేవలు

## కుటుంబ సంక్షేమం

సమాజంలో అతి ముఖ్యమైన సమూహం కుటుంబం. వ్యక్తులు తమ శారీరక, మానసిక సంతృప్తిని నూటికి నూరు శాతం కుటుంబంలోనే పొందుతారనడంలో అతిశయోక్తి లేదు. కుటుంబంలోనే శిశువుల మూర్తిమత్వం నిర్మితమై అభివృద్ధి చెందుతున్నది. స్త్రీ పురుషులు తమ లైంగిక సంతృప్తిని కుటుంబంలోనే పొందగలుగుతున్నారు. వ్యక్తులు తమ పోషణ, ఆహారం, వస్త్రాలు, వసతి, విద్య మొదలైన దైనందిన ప్రాథమిక అవసరాలన్నిటినీ కుటుంబం నుంచే పొందడం జరుగుతున్నది. అనారోగ్యం, ప్రసూతి మొదలైన పరిస్థితులలో వ్యక్తులు కుటుంబంనుంచే సంరక్షణ పొందగలుగుతున్నారు. కుటుంబంలో సభ్యులు పరస్పరం ప్రేమాభిమానాలు కలిగి ఉంటారు. దీనివల్ల వ్యక్తులు ప్రపంచంలో మరెక్కడాపొందని మానసిక సంతృప్తిని కుటుంబంనుంచి పొందగలుగుతున్నారు.

ఆధునిక యుగంలో పారిశ్రామికీకరణం, నగరీకరణం, పాశ్చాత్య విద్య మొదలైన అనేక కారణాలవల్ల కుటుంబం తన బాధ్యతలన్నింటినీ సక్రమంగా చేపట్టడం జరగడం లేదు. అందువల్ల కుటుంబం చేపట్టవలసిన కొన్ని కార్యక్రమాలను ప్రభుత్వం, ఇతర స్వచ్ఛంద సేవా సంస్థలు చేపట్టవలసి వచ్చింది. అయినప్పటికీ కొన్ని ప్రత్యేక కార్యక్రమాలు కుటుంబం తప్ప మరియే ఇతర సంస్థలు చేపట్టడం జరుగదు. ఈ విధంగా సమాజంలోగల వ్యక్తులు తమ అత్యవసరాలు అంటే సాంఘిక, ఆర్థిక, నైతిక, లైంగిక అవసరాలు కుటుంబం నుంచే పొందగల్గుతున్నారు. కనుక కుటుంబానికి సమాజంలోగల తదితర సంస్థలకంటే అత్యంత ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. ఇటువంటి ప్రముఖ స్థానాన్ని

ఆక్రమించిన కుటుంబం పరిస్థితుల ప్రభావానికి లొంగిపోయి విచ్ఛిన్నం కాకుండా బలపరచి సంరక్షించవలసిన బాధ్యత ప్రభుత్వం, తదితర స్వచ్ఛంద సేవా సంస్థలు వహించవలసి ఉన్నది. సమాజంలోగల కుటుంబ సంక్షేమ సేవల ద్వారా కుటుంబ జీవితాన్ని సంరక్షించవలసి ఉన్నది. కుటుంబ సంక్షేమ సేవా పద్ధతి, కుటుంబంలోగల వ్యక్తులకు సహాయంచేసి వారి శక్తి సామర్థ్యాలను అభివృద్ధి పరచుకోవడానికి సహాయపడవలసి ఉంది. కుటుంబంలోని వ్యక్తులు వ్యక్తిగతంగాను, సామాజికంగాను సంతృప్తిని పొంది సమాజానికి ఉపయోగకరమైన కుటుంబంగా రూపొందవలసి ఉంది.

కుటుంబంలో స్త్రీ పురుషులు వ్యక్తిగతంగా, సాంఘికంగా, మానసికంగా ఒకరినొకరు అర్థంచేసుకుని పరస్పర వ్యక్తిగత అవసరాలను తీర్చుకోవడం జరుగుతుంది. కుటుంబం సమాజంలో ముఖ్యమైన వ్యవస్థగా ప్రాచీనకాలం నుంచీ కూడా గుర్తించబడింది. ప్రాథమిక సమూహాలలో కుటుంబం అత్యంత ప్రముఖమైన స్థానాన్ని ఆక్రమించింది.

"భార్యాభర్తలు, వారిసంతానం కలసి సన్నిహితంగా నివసించడాన్ని కుటుంబం" అని కొంతమంది సమాజ శాస్త్రజ్ఞులు నిర్వచించారు. కుటుంబంలో వివిధ సభ్యులమధ్య అన్యోన్య సంబంధాలు, అనురాగం, సహకారం, మొదలైన భావాలుంటాయి. వివాహంవల్లగానీ, ప్రేమాభిమానాల వల్లగానీ, కుటుంబానికి ప్రాతిపదిక ఏర్పడుతుంది. సమాయోజనం, సహకారం, సౌభ్రాతృత్వం మొదలైన ఉన్నతభావాలకు ప్రధానమైన ప్రాతిపదిక. ఇటువంటి పరిస్థితి కుటుంబంలో సాగినంతకాలం కుటుంబాన్ని వ్యవస్థిత సమూహంగా భావించడం జరుగుతుంది. వ్యక్తులు సమాజంలో బాధ్యతాయుత పౌరులుగా తయారుకావడానికి కుటుంబం వారికి తగిన శిక్షణ ఇస్తుంది. కుటుంబంలో సభ్యులు వారి పెద్దలనుంచి ప్రధానమైన సామాజిక, సాంస్కృతిక విలువలను, ప్రమాణాలను, ఆచార వ్యవహారాలను గ్రహించి స్వీకరిస్తారు. ఈ విధంగా

సామాజిక జీవితానికి కుటుంబం పునాది వంటిది. సమాజంలో సమా యోజనత్వం పొందడానికి కుటుంబం తోడ్పడుతుంది.

శాంతియుత సహజీవనం, సర్వమానవ సౌభ్రాతృత్వం, జాతీయ సమైక్యత, మొదలైన ఉన్నత భావాలకు చెందిన శిక్షణ మొట్టమొదట కుటుంబంనుంచే సభ్యులు పొందుతారు. సామాజిక వ్యవస్థకు, కుటుంబ వ్యవస్థకు అతిసన్నిహిత సంబంధం ఉన్నది. కుటుంబంలో వ్యక్తుల విలువలు, నియమాలు, దృక్పథాలు, సమాజ సంస్కృతినిబట్టి ఏర్పడినవే. కుటుంబంలో భార్యాభర్తలు, ఇతరసభ్యులు, కుటుంబ సభ్యులుగా, సమాజ సభ్యులుగా తమ పాత్రలను అనేక రూపాలలో నిర్వహిస్తూ ఉంటారు. కుటుంబం మతసంబంధమైన విలువలను, పౌర జీవనానికి సంబంధించిన ఆచార వ్యవహారాలను సభ్యులకు అందించి, వారిని సంపూర్ణ వ్యక్తులుగా, బాధ్యతాయుత పౌరులుగా రూపొం దించడానికి దోహదం చేస్తుంది. వ్యక్తులు పరిశుద్ధమైన జీవనాన్ని గడపడానికి శిక్షణకూడా కుటుంబంలోనే లభిస్తుంది. వ్యక్తుల ప్రవర్తనను జీవితాన్ని నియబద్ధంగా చేస్తుంది. కాబట్టి కుటుంబం ఒక సామాజిక నియంత్రణా సాధనంగా కూడా పరిగణించబడింది. పిల్లల సాంఘీకరణం కుటుంబంలో ప్రపథమంగా జరుగుతుంది.

కుటుంబ సభ్యులు విచ్ఛిన్నమైన మనస్తత్వాలతో ఉన్నప్పటికీ వారిలో కొంత ఏకత్వంకూడా ఉంటుంది. భార్యాభర్తలు అనురాగ పూరితమైన సంబంధాలతో ఉంటారు. కానీ వారిమధ్య తీవ్రతరమయిన భేదాభిప్రాయాలు ఏర్పడితే ఈ ఏకత చెడుతుంది. దానివల్ల వారిమధ్య వైషమ్యాలు ఏర్పడి అవి తీవ్రమైతే ఎడబాటుకు, విడాకులకుకూడా దారితీస్తాయి. కుటుంబ వ్యవస్థా నిర్మాణానికి మానసిక, సామాజిక కారణాలతోబాటు ఇతర కారణాలు కూడా దోహదం చేస్తున్నాయి. మనదేశంలో వివాహబంధం అతిపవిత్రమైనది, శాశ్వతమయినది. కుటుంబ వ్యవస్థను వివాహ వ్యవస్థ సంరక్షిస్తుంది. కుటుంబంలోని సభ్యులమధ్య, భార్యాభర్తలమధ్య వ్యవస్థితమైన సంబంధాలను కలిగించే కొన్ని ప్రకార్యాలుంటాయి. వాటివల్ల కుటుంబం సంఘటితమౌతున్నది.

ఆ ప్రకార్యాలేవంటే—

## 1. సమష్టి ఉద్దేశాలు

కుటుంబ వ్యవస్థలో కొన్ని సమష్టి ఉద్దేశాలుంటాయి. భార్యాభర్తల మధ్య అనేక విషయాలలో ఏకాభిప్రాయం. ఇంట్లో శాంతియుత వాతావరణం ఏర్పడటానికి ఇవి ఎంతో దోహదంచేస్తాయి. గృహ నిర్వహణ, పిల్లల పెంపకం, విద్యాసౌకర్యాలు మొదలైనవిషయాలలో భార్యాభర్తల్ను కలసి సంప్రదించుకోవడం జరుగుతుంది. వాటిని ఏకాభిప్రాయంతో అమలుపరుస్తారు. సామరస్యం, సమన్వయం, సహకార భావాలు, భార్యాభర్తలమధ్య ఏర్పడినట్లయితే కుటుంబం వ్యవస్థిత మాతుంది. సమష్టి ఉద్దేశాలుకలిగి వాటి ఆచరణకు కృషిచేసినట్లయితే ఇది సఫలమాతుంది. అందువల్లనే శాంతియుత సహజీవనం సాగించడానికి, కుటుంబ ఏకతకు, భార్యాభర్తలిద్దరూ ఒకే సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అంతస్తుకు చెందినవారై ఉండాలి.

## 2. సామరస్యపూరితమైన వ్యక్తిత్వాలు

కుటుంబంలో స్త్రీ పురుషు లిద్దరికీ ఒక ప్రత్యేక వ్యక్తిత్వం ఉంటుంది. అయితే వారిద్దరూ ఒకరినొకరు బాగా అర్థం చేసుకోవాలి. స్వార్థపూరితమైన లాభాలు విస్మరించి కుటుంబ సభ్యుల సంక్షేమం దృష్టిలో ఉంచుకొని వారు కొన్ని సర్దుబాట్లు చేసుకోవడం అవసరం. ఒకరి వ్యక్తిత్వాన్ని ఇంకొకరు అవగాహన చేసుకొని పరస్పరం గౌరవం కలిగి ఉండాలి. నేటి సమాజంలో భార్యాభర్తలు అనేక పాత్రలను సమాజ సంక్షేమం దృష్ట్యా నిర్వహించవలసి ఉంది. పురుషుడు ఆర్జనపరుడుగా ఉండి, పిల్లల అభివృద్ధి, వారి విద్యా విషయాలలో శ్రద్ధ చూపుతూ ఉండటం అత్యంత అవసరం. అదే విధంగా పిల్లల పెంపకం ఇంటిబాధ్యతలు నిర్వహించే గృహిణిగాను, కుటుంబానికి సహాయంచేసే ఆర్జనాపరురాలుగాను ఉండి స్త్రీ భిన్న పాత్రలను నిర్వహించవలసి ఉంది.

## 3. సమష్టి అభిరుచులు

కుటుంబ వ్యవస్థను బలపరచడానికి సమష్టి అభిరుచులు ఎంతో ముఖ్యం. ప్రాచీన సాంప్రదాయ కుటుంబాలలో భార్యాభర్తలు సమష్టి అభిరుచులతో ఉండేవారు. వారి దినచర్యలైన పిల్లల పెంపకం, పితృ సేవా, గృహ నిర్వహణ మొదలైన కార్యక్రమాలలో అభిరుచులు చాలా వరకూ ఉమ్మడిగా ఉండేవి. కానీ ఆధునిక సమాజంలో భార్యాభర్తల అభిరుచులు ఇందుకు భిన్నంగా ఉంటున్నాయి. విద్యావంతులైన భార్యాభర్తల అభిరుచులలో కొంత వైషమ్యాలు కనిపిస్తున్నాయి. నేటి సమాజంలో నాగరికత ప్రబలి వృత్తి వైవిధ్యం ఏర్పడటంవల్ల వీరి అభిరుచులలోకూడా భిన్నత్వం గోచరిస్తుంది. భార్యాభర్తల అభిరుచులు కుటుంబ వ్యవస్థను సంఘటితం చేసేవిగా ఉండాలి. లేకపోతే వారిమధ్య వైషమ్యాలు, అభిప్రాయ భేదాలు ఏర్పడి ఎడబాటు, విడాకులు మొదలైన అవ్యవస్థతా ధోరణులకు దారితీయవచ్చు. చక్కని అభ్యాసాలు సుసంఘటిత పరుస్తాయి. దురభ్యాసాలు విఘటనకు దారితీస్తాయి. అందువల్ల భార్యాభర్తలిద్దరూ విశిష్టమైనఅభిరుచులను కలిగిఉండడం అవసరం.

## 4. ఉమ్మడి అవసరాలు

కుటుంబ వ్యవస్థ సభ్యులయొక్క, భార్యాభర్తలయొక్క అవసరాలను తీరుస్తుంది. భార్యాభర్తలు వారి పరస్పర అవసరాలను తీర్చుకునేటందుకు కుటుంబ వ్యవస్థ దోహదం చేస్తుంది. స్త్రీ భార్యగా, మాతృమూర్తి సంపూర్ణమైన ఆనందాన్ని కుటుంబ వ్యవస్థలో పొందుతుంది. అలాగే పురుషుడు కూడా కుటుంబంలో సభ్యుల అవసరాలు తీర్చడానికి కృషి చేస్తాడు. సాంప్రదాయకంగా కుటుంబం వృద్ధులకు, శారీరక, మానసిక వైకల్యం గలవారికీ, ఇతర సభ్యులకూ భద్రతా రక్షణలను ఏర్పరచి వారి అవసరాలను తీరుస్తుంటుంది. సంపూర్ణంగా వ్యవస్థితమై సామరస్యంతో విలసిల్లే కుటుంబాలు చాలా అరుదు. తరచుగా భార్యాభర్తల మధ్యగానీ, తదితర సభ్యుల మధ్యగానీ కలతలు

ఏర్పడి తరువాత సర్దుబాటువల్ల మామూలు పరిస్థితి ఏర్పడడం జరుగుతుంది.

పూర్వం మనదేశంలో గల్గ సమష్టి కుటుంబాలు కుటుంబ సభ్యులకు అన్ని విధాలా సాంఘిక భద్రతను కలుగజేసేది. కుటుంబంలో గల వితంతువులు, నిరుద్యోగులు, వృద్ధులు, వికలాంగులు మొదలైన సభ్యులకు సమష్టి కుటుంబాలు అనేక విధాలుగా సాంఘిక, ఆర్థిక, నైతిక భద్రతలను కలుగజేసేది. కానీ ఆధునిక యుగంలో పారిశ్రామికీకరణం, నగరీకరణం మొదలైన వాటి కారణంగా సమష్టి కుటుంబాలు విచ్ఛిన్నమై వ్యష్టి కుటుంబాలు ఏర్పడ్డాయి. దీనివల్ల సమష్టి కుటుంబాలచే సంరక్షింపబడు వారందరూ అనాథలుగా మిగిలిపోయినారు. అంతేకాక ఈ వ్యష్టి కుటుంబాలు కూడా తమ యొక్క బాధ్యతలన్నిటినీ సంతృప్తికరంగా నెరవేర్చలేకపోతున్నవి. కనుక పూర్వం కుటుంబం చేపట్టిన బాధ్యతలలో కొన్ని బాధ్యతలు ప్రభుత్వం, స్వచ్ఛంద సేవా సంస్థలు చేపట్టడం జరిగింది. అయినప్పటికి కుటుంబం వ్యక్తి, సమాజాల అభివృద్ధికి పునాదివంటిది. కనుక కుటుంబాన్ని సంరక్షించడానికి కొన్ని కుటుంబ సంక్షేమ కార్యక్రమాలను ప్రభుత్వం చేపట్టాలి.

## ఆధునిక కుటుంబం - సమస్యలు

ఆధునిక కుటుంబంలో సభ్యులు పురాతన కుటుంబంలోని సభ్యుల వలె ఐకమత్యంగా ఉండక భేదాభిప్రాయాలను కలిగిఉంటున్నారు. ఈ భేదాభిప్రాయాలు భార్యాభర్తల మధ్యగానీ, తలిదండ్రులు, పిల్లల మధ్యగానీ ఏర్పడడంవల్ల కుటుంబాలు అంత పటిష్టంగా ఉండటం లేదు. ఇటువంటి భేదాభిప్రాయాలు పూర్వం సమష్టి కుటుంబాలలో కూడా ఉన్నప్పటికీ సమష్టి కుటుంబాలవల్ల కుటుంబంలోని పిల్లలు సంరక్షింపబడేవారు. మతప్రభావం ప్రజలపైన ఎక్కువగా ఉండడం వలన విడాకులు ఎక్కువగా ఉండేవికావు. ఆధునికయుగంలో రాజకీయ, సాంఘిక మార్పులవల్ల ఈ భేదాభిప్రాయాలు అధికం కావడం జరిగింది.

కుటుంబంలో అనేక కారణాలవల్ల సమస్యలు ఉద్భవిస్తాయి. వాటిలో ముఖ్యమైనవి —

1. భార్యాభర్తల మధ్య అన్యోన్యత లేకపోవడం లేదా భార్యాభర్త లిరువురిలో ఎవరికో ఒకరికి ఉద్రేకపూరితమైన స్వభావం ఉండడం.
2. ఆర్థిక కారణాలు అంటే తక్కువ వేతనం, నిరుద్యోగం, అనారోగ్యం, ప్రమాదాలు లేదా ఆర్జనాపరుడు లేకపోవడం.
3. పిల్లల కారణంగా కలిగిన సమస్యలు ఉదాహరణకు పిల్లలను అశ్రద్ధ చేయడం, చెడు ప్రవర్తన కలిగి ఉండటం, లేదా అసమయోజనం.
4. భార్యాభర్త లిరువురూ ఉద్యోగస్థులైనప్పుడు తమ పిల్లలను ఎక్కడో ఎవరివద్దనైనా విడచిపెట్టడం.
5. గృహ వసతి సౌకర్యాలు సరిగా లేకపోవడం.

సాధారణంగా కుటుంబంలో వ్యక్తిగత సమస్యలుగానీ, కుటుంబ సమస్యలుగానీ కుటుంబంలోగల వివిధ సభ్యులు ఆర్థిక, సాంఘిక కారణాలవల్ల, ఉద్రేకపూరితమైన స్వభావంవల్ల ఏర్పడతాయి. కనుక అటువంటి సమస్యాపూరిత కుటుంబాలను మెరుగుపరచవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. ఆ కుటుంబాలలోని సభ్యులు తమ సమస్యలకు గల కారణాలను అవగాహన చేసుకొనేలాగ చేయవలసి ఉంది. వారు తమ ఉద్రేకపూరితమైన ప్రవర్తనలను మార్చుకొనేలాగా చేయాలి. కుటుంబం పరిసరాల పరిస్థితులను, ఆర్థిక పరిస్థితులను మార్చడంవల్ల కూడా కుటుంబ సభ్యులమధ్యగల సత్సంబంధాలను అభివృద్ధి పరచడానికి అవకాశం ఉంటుంది.

సుమారు 150 సంవత్సరాల నుంచి వ్యవస్థితమైన సమష్టి కుటుంబాలను విచ్ఛిన్నం చేయగల బలిష్టమయిన కారణాలు సమాజంలో ఉద్భవించాయి. కుటుంబ నిర్మితి, కార్యకలాపాలు, కుటుంబంలో సభ్యుల మధ్యగల సంబంధ బాంధవ్యాలు అనేక మార్పులకు గురి కావడం జరిగింది. కుటుంబం తాను నిర్వహించే బాధ్యతల నన్నిటినీ నిర్వహించలేకపోవడం జరిగింది. కనుక కుటుంబం నిర్వహించలేని అనేక కార్యక్రమాలను, సముదాయాలు, సంస్థలు కొనసాగిస్తున్నాయి.

ప్రజాస్వామిక జీవితం ప్రభావం కుటుంబాలపై ఎక్కువగా ఉన్నదని చెప్పవచ్చు. దీని ప్రభావంవల్ల కుటుంబంలోని సభ్యులు కొత్త పాత్రలను పోషించడం మొదలుపెట్టారు. వారు ఎక్కువ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోరుకోవడం జరిగింది. కుటుంబ యజమాని ఆధిక్యత ఏపాటి విలువ ఉండటంలేదు. పాశ్చాత్య నాగరికత, సాంకేతిక విద్యాప్రభావం ప్రజలను తప్పుదోవన నడపడం జరిగింది. ఈ మార్పు ఒక్క పట్టణ ప్రాంతాలలోనే కాక గ్రామీణ ప్రాంతాలలో కూడా వచ్చింది.

గత 150 సంవత్సరాలుగా మన దేశంలో స్త్రీ ప్రతిపత్తిలో కూడా మార్పు వచ్చింది. స్త్రీలుకూడా ఆధునిక యుగంలో ఉద్యోగాలు సంపాదించుకుని, ఉద్యోగరీత్యా కుటుంబాలను వదలి దూర ప్రాంతాల్లో తను విధి నిర్వహించడం జరుగుతుంది. దీనివలన కూడా ఆధునిక కుటుంబాలలో అనేక మార్పులు రావడం జరిగింది. కుటుంబంలో స్త్రీ ఉద్యోగ రీత్యా బయటికి వెళ్ళడంవల్ల కుటుంబంలో పిల్లల పెంపకంలో మార్పువచ్చింది. ఈనాటి బాలలే రేపటి పౌరులు అనే నానుడి ప్రకారం ఈనాటి బాలలు మంచి పౌరులుగా అభివృద్ధి చెందాలంటే కుటుంబానికి ఇతర సహాయక సంస్థల ఆవశ్యకత ఎంతైనా ఉంది. విద్య, ఆరోగ్యం, ఆహారం, ఉద్యోగం, వినోదం మొదలైన కార్యక్రమాలు ఎక్కువగా సమాజం నిర్వహించవలసిన బాధ్యతలుగానీ కుటుంబం నిర్వహించేవి కావు. కనుక ఈవిధమైన కార్యక్రమాల బాధ్యత కుటుంబాల కన్నా సమాజం చేపట్టినట్లైతే ప్రజలకు ఎంతైనా శ్రేయస్కరంగా ఉంటుంది.

## కుటుంబ అవ్యవస్థత

బాహ్యస్థితివల్ల గానీ, ఆంతరంగికమైన ఒత్తిడులవల్ల గానీ, భార్యాభర్తల మధ్యగల శాశ్వత సామాజిక సంబంధాలు పూర్తిగా తెగిపోయినా లేదా బలహీనమైనా కుటుంబంలో అవ్యవస్థత ఏర్పడుతుంది. ఈ అవ్యవస్థతా ప్రక్రియ తీవ్రంగా గానీ, తక్కువ స్థాయిలో

గానీ ఉండవచ్చు. కుటుంబంలో అవ్యవస్థిత పరిస్థితి ఏర్పడినపుడు సభ్యులలో మానసిక శాంతి లోపించి భార్యాభర్తల మధ్యగల సత్సంబంధాలు సన్నగిల్లి గృహ జీవితంలో అశాంతి ఏర్పడుతుంది. కుటుంబ సభ్యుల మధ్య సంబంధాలు విచ్ఛిన్నం చెందినపుడు కుటుంబంలో అవ్యవస్థత ఏర్పడుతుంది. కుటుంబంలో సభ్యులమధ్య సర్దుబాటు లేక పోయినపుడుగానీ, వివాహ సంబంధం పూర్తిగా తెగిపోయినపుడుగానీ, ఎడబాటు, విడాకులు జరిగినపుడుగానీ, కుటుంబంలో అవ్యవస్థత పరిస్థితి ఏర్పడుతుంది. సమాజంలో కుటుంబం కీలకమయినది కావడంవల్ల కుటుంబ అవ్యవస్థత మూలంగా సమాజంలో తీవ్ర పరిణామాలు ఏర్పడతాయి.

కుటుంబ సభ్యులు సమాజంలో ఇతర సంస్థలతో అనేక సంబంధాలు కలిగి ఉంటారు. అంతేకాక సభ్యులు సమాజంలో విభిన్న పాత్రలను నిర్వహిస్తూ ఉంటారు. సమాజం నిత్యనూతన చైతన్య స్రవంతి. ప్రతి జీవిత రంగంలో అనునిత్యం పరివర్తన జరుగుతూనే ఉంటుంది. ఈ పరివర్తనవలన కుటుంబంకూడా మార్పు చెందుతుంది. క్రొత్త మార్పుల వల్ల, ఒత్తిడులవల్ల సంస్థలు, సంఘాలు తీవ్రంగా మార్పుచెంది క్రొత్త రకం పాత్రలను సృష్టించడం జరిగింది. సాంకేతిక అభివృద్ధి చెందడంవల్ల, రవాణా సౌకర్యాల అభివృద్ధివల్ల ఈ మార్పులు వచ్చాయి. అంతేకాక తీవ్రమయిన పారిశ్రామికీకరణం, నగరీకరణం వలన విశ్వజనీనంగా ఆచరిస్తున్న కుటుంబ జీవన నమూనాలను విచ్ఛిన్నం చేయడానికి దోహదం చేశాయి. సామాజిక, ఆర్థిక, రాజకీయ, మనోవైజ్ఞానిక, తాత్విక, నైతిక కారణాలు సంక్లిష్టమైన అంతః సంబంధాలతో కూడి ఉండటం వల్ల అవి మార్పులకులోనై క్రొత్త విలువలు, అభిరుచులు, ప్రమాణాలు ఉత్పన్నమైనాయి. అందువల్ల కుటుంబ వ్యవస్థలో తీవ్రమైన మార్పులు వచ్చాయి.

## కుటుంబ అవ్యవస్థత - కారణాలు

(1) పారిశ్రామిక విప్లవానికి పూర్వం కుటుంబం స్వయం సమృద్ధిగల వ్యవస్థ. దైనందిన ఉపయోగానికి కావలసిన వస్తువులను కుటుంబ

వ్యవస్థలోనే ఉత్పత్తి చేసేవారు, కనుక కుటుంబం ఆర్థికంగా స్వయం సమృద్ధితో విలసిల్లేది. కానీ పారిశ్రామిక విప్లవ ప్రభావంవల్ల పట్టణాలలో భారీ పరిశ్రమలు అభివృద్ధిచెందాయి. పురుషులతోపాటు స్త్రీలకు కూడా ఉద్యోగావకాశాలు కల్పించడం జరిగింది. అందువల్ల పురుషులు, స్త్రీలు కూడా గ్రామీణ ప్రాంతాలనుంచి పారిశ్రామిక ప్రాంతాలకు ఉద్యోగరీత్యా తరలి రావడం జరిగింది. స్త్రీలు కూడా పురుషులతో పాటు ఉద్యోగాలలో నియమింపబడడంవల్ల పురుషులలో కొంతవరకు నిరుద్యోగ సమస్య ఏర్పడింది. కుటుంబ జీవనం ఆర్థిక కారణాలమీద ఆధారపడి ఉండడంవల్ల ఈ మార్పులు వ్యక్తి దైనందిన జీవితంపై ప్రభావాన్ని చూపాయి. అందువల్ల కుటుంబ వ్యవస్థ మార్పులకు లోనయింది.

(2) పారిశ్రామిక రంగం విస్తృతం చెందడంవల్ల వేతనాలు పెరుగుతున్నాయి. దానివల్ల సంపద పెరుగుతున్నది. కుటుంబ జీవన ప్రమాణస్థాయిలో మార్పువస్తున్నది. ఆధునిక యుగంలో సౌకర్యవంతమైన విలాస జీవితంపై మోజు పెరగడంవల్ల కోరికలు కూడా పెరుగుతున్నాయి. కుటుంబ రాబడి పెరిగినప్పటికీ అది వారి విలాస జీవితాలకే సరిపోవడంలేదు. అందువల్ల కుటుంబ సభ్యులలోను, భార్యాభర్తలమధ్య నిరాశ నిస్పృహలు పెరుగుతున్నాయి. సామాజిక అంతస్థును ఉన్నతంగా భావించడంవల్ల కుటుంబాన్ని పరిమితం చేస్తున్నారు. అందువల్ల కుటుంబ పరిమాణంలో మార్పు వస్తున్నది.

(3) మన దేశంలో ప్రజాస్వామ్య విలువలు అంతరించడంవల్ల, స్త్రీ విద్య అభివృద్ధి చెందడంవల్ల స్త్రీలకు అనేక నూతన ఉద్యోగావకాశాలు కల్పించడం జరిగింది. అందువల్ల స్త్రీలు కేవలం గృహనిర్వహణే కాకుండా ఉద్యోగాలు కూడా స్వీకరించడంవల్ల కుటుంబ ఆర్థిక ప్రకార్యాలలో మార్పు వచ్చింది. దీనివల్ల కుటుంబ నిర్మితి, ప్రకార్యాలలో మార్పు కలుగుతున్నది.

(4) అనేక పరిశ్రమలలో నియమితులవుతున్న స్త్రీలు కేవలం ఆర్థిక కారణాలవల్ల మాత్రమే ఉద్యోగం చేయవలసి వస్తున్నది. వారు

ఉద్యోగం తప్పనిసరై చేస్తున్నారు. స్త్రీలు ఎక్కువ కాలం కర్మాగారా లలో గడపవలసి వస్తున్నది. వారు కర్మాగారాలలో ఉన్న సమయంలో పిల్లలను ఇంట్లో ఉంచడంవల్ల ఆ పిల్లలు ఆప్యాయతకు, అనురాగానికి వాత్సల్యానికీ దూరమయి క్రమశిక్షణ లేక బాలనేరస్థులుగా కూడా మారే అవకాశం ఉన్నది. తలిదండ్రుల ప్రేమాభిమానాలు దూరం కావడంవల్ల పసివారి హృదయాలలో తల్లిదండ్రులు తమను విస్మరించి నట్లు భావించడంవల్ల మానసికంగా బాధపడి అనేక ఇతర సమస్యలకు దారితీయడం జరుగుతోంది. పర్యవేక్షణ, సంరక్షణ సరిగాలేని పేదవారి పిల్లలు బాలనేరాలకు లోనుకావడంవంటి కారణాలవల్ల కూడా కుటుంబ వ్యవస్థలో మార్పులు వస్తున్నాయి.

(5) స్త్రీల ఉన్నత విద్య అధికంగా అభివృద్ధి చెందడంవల్ల కుటుంబ వ్యవస్థ మార్పులకు లోనవుతుంది. భర్తతో సరిసమానంగా విద్యావంతురాలైన స్త్రీ కుటుంబ వ్యవహారాలలో ముఖ్యమైన నిర్ణ యాలు తీసుకోవడంలో ప్రముఖపాత్ర వహిస్తుంది. విద్యవల్ల, అంతస్తు వల్ల ఏర్పడిన స్త్రీ పాత్రలో మార్పులవల్ల కుటుంబ వ్యవస్థలో మార్పు వస్తుంది. స్త్రీలు తమకంటే తక్కువ విద్యావంతులైన పురుషులను వివాహమాడటానికి అంగీకరించరు. ఒకవేళ అంగీకరించి వివాహమాడినా వారిమధ్య తీవ్ర అసమయోజనం ఏర్పడి వారు అశాంతికి లోనుకా వచ్చు. విద్యావతి అయిన స్త్రీ పిల్లలను కనడం, పెంచటం మొదలైన వాటికంటే వ్యక్తిత్వానికి అధిక ప్రాధాన్యతనీయవచ్చు. వీరు విద్యా వంతులు కావడంవల్ల కుటుంబ నియంత్రణా సాధనాలను అవగాహన చేసుకుని ఆచరిస్తారు. అందువల్ల కుటుంబ పరిమాణంలో మార్పులు వస్తాయి. సమాజంలో బాధ్యతాయుతమైన మహిళగా, ఆదర్శ మూర్తిగా ఈమె భిన్నపాత్రలను నిర్వహించడంవల్ల కుటుంబ వ్యవస్థలో మార్పులు ఏర్పడతాయి.

(6) నగరీకరణంవల్ల సాంప్రదాయిక ఉమ్మడి కుటుంబాలు విచ్ఛి న్నంచెంది ఆధునికంగా చిన్న కుటుంబాలు రూపొందుతున్నాయి. సాంప్రదాయక కుటుంబాలు వ్యవసాయంమీద ఆధారపడ్డాయి. అందు

వల్లనే గ్రామీణ ప్రాంతాలు అధికంగా ఉన్నాయి. ఉమ్మడి కుటుంబంలో సభ్యులందరికీ భద్రతారక్షణలుండేవి. ఆర్థిక వనరులను అందరూ సమానంగా అనుభవించేవారు. వ్యవసాయ రంగంలో అందరూ సమానంగా అనుభవించేవారు. వ్యవసాయ రంగంలో అందరూ సమష్టిగా పనిచేసేవారు. కానీ నేడు నాగరికతా ప్రభావంవల్ల, రవాణా సౌకర్యాలు, విద్యా సౌకర్యాలు అభివృద్ధి చెందడంవల్ల, పరిశ్రమలు అభివృద్ధి చెందడంవల్ల ప్రజలు గ్రామీణ ప్రాంతాల నుంచి పట్టణ ప్రాంతాలకు తరలిపోతున్నారు. అందువల్ల పట్టణాలలో జనసమ్మర్ధమేర్పడి వసతి సౌకర్యాలు కష్టమౌతున్నాయి. అంతేకాక పురుషులు కుటుంబాలను విడచి దూరంగా నివసించడం వల్లకూడా కుటుంబ వ్యవస్థలో అనేక మార్పులు వస్తున్నాయి.

(7) సామాజిక నియంత్రణా సాధనాలైన మతం, సాంప్రదాయిక విలువలు మొదలైనవాటి ప్రభావం కుటుంబంపై సన్నగిల్లుతుంది. వివాహాన్ని నేడు సామాజిక ఒప్పందంగా భావిస్తున్నారు. కానీ పవిత్ర బంధంగా భావించడం లేదు. దీనివల్లనే విడాకులు, ఎడబాటు మొదలైన సమస్యలు ఉత్పన్నమౌతున్నాయి. సాంప్రదాయిక కుటుంబం అనేక ప్రకార్యాలను నిర్వహించేది. కానీ నేడు అధునాతన సమాజంలో ఈ ప్రకార్యాలలో చాలావరకు మార్పులు ఏర్పడ్డాయి. ఆర్థిక, భద్రత, మత, విద్య ప్రకార్యాలను వివిధ సమూహాలు, ప్రభుత్వం, సేవాసంస్థలు నిర్వహిస్తున్నాయి. లైంగిక, అనురాగ ప్రకార్యాలను మాత్రమే కుటుంబ వ్యవస్థ నిర్వహిస్తున్నది. లైంగిక ప్రకార్యంవల్ల సమాజంలో కుటుంబానికి స్థిరత్వమేర్పడుతున్నది. వివాహంవల్ల స్థిరత్వం సిద్ధిస్తుంది. వీటివల్ల భార్యాభర్తలమధ్య అన్యోన్య అనురాగం ఏర్పడుతుంది. పిల్లలు భవిష్యత్తులో బాధ్యతాయుత పౌరులుగా మెలగడానికి కావలసిన అనురాగం, ఆప్యాయతా తల్లిదండ్రుల శిక్షణలో లభిస్తాయి. కుటుంబ వ్యవస్థలో ఏర్పడిన మార్పులు తీవ్రతరమైతే కుటుంబం అవ్యవస్థకు దారితీయవచ్చు. ఆధునిక కుటుంబాలలో భార్యాభర్తలు అన్యోన్యంగా ఉండి సర్దుబాటు చేసుకోవాలి. అట్లాంటి సర్దుబాటు లేకపోతే వారిమధ్య

భేదాలు ఏర్పడి వైషమ్యాలకు దారితీయడంవల్ల కుటుంబంలో అవ్యవస్థత ఏర్పడుతుంది. ఇవి ఎడబాటు, విడాకులు, పరిత్యాగం మొదలైన రూపాలలో కనపడవచ్చు.

## కుటుంబ అవ్యవస్థత - నివారణోపాయాలు

పురుషులకు, స్త్రీలకు పిల్లల పెంపకాన్ని గురించి, కుటుంబ జీవితాన్ని గురించి ఇతోధికంగా శిక్షణా తరగతులు ఏర్పాటు చేయాలి. పత్రికలలో, ఉపన్యాసాలలో, రేడియోలలో వీటి గురించి విస్తృతంగా ప్రచారం చేయాలి. కుటుంబ సభ్యులమధ్య యాంత్రికమైన జీవనంకాక అనురాగ స్రవంతివలే ఉండే జీవితాన్ని కల్పించడానికి ప్రయత్నించాలి. వివాహం, కుటుంబ సంక్షేమం మొదలైన కార్యక్రమాలను గురించి సలహా సంఘాలను ఏర్పరచాలి. వివిధ సభ్యులకు వివాహావకాశాలను కల్పించడానికి ఇవి దోహదం చేస్తాయి. కుటుంబ సంక్షేమ కార్యక్రమాలకు అధిక ప్రాధాన్యత కల్పించాలి. శిశు సంరక్షణా సలహా సంఘాలు విస్తృతంగా ఏర్పాటుచేసి పిల్లల ప్రవర్తన, అలవాట్లు, పెంపకం మొదలైన విషయాలలో తల్లులకు శిక్షణ ఇవ్వాలి. దీనివల్ల పిల్లలు సక్రమమైన శిక్షణ పొంది భవిష్యత్తులో బాధ్యతాయుత పౌరులుగా మెలగుతారు. లేకపోతే వారు సామాజిక సమస్యలకు లోనయ్యే అవకాశముంటుంది.

భార్యాభర్తలకు విస్తృతమైన కుటుంబ నియంత్రణ గురించి విశదీకరించాలి. కుటుంబ నియంత్రణ శాంతియుతమైన సహజీవనాన్ని, అనురాగ పూరితమైన జీవనాన్ని గడపటానికి కావలసిన వైఖరిని, దృక్పథాలను, విజ్ఞానాన్ని సమకూర్చగలిగే సాధనంగా ఉపయోగపడాలి. కుటుంబ పరిమాణాన్ని తగ్గించడమేకాక కుటుంబ వ్యవస్థలను సుస్థిరంగా ఉంచడానికి జీవితం ఆనందభరితం కావడానికి కావలసిన విధంగా అభిరుచులను, ఆసక్తులను మలచుకోవడానికి దోహదంచేసే కార్యక్రమాన్ని విస్తృత పరిధిలో కుటుంబ నియంత్రణగా భావించవచ్చు. మొత్తంమీద కుటుంబం స్వర్గతుల్యంగాను, కుటుంబ సభ్యులకు సుఖశాంతులనిచ్చి మానసిక వికాసాన్ని కలిగించేదిగాను, తీర్చిదిద్దేదిగాను ఉండాలి.

## కుటుంబ సంక్షేమ సేవలు

కుటుంబ సభ్యుల మధ్య సత్సంబంధాలను అభివృద్ధి పరచడానికి సాంఘిక సంక్షేమ కార్యకర్త వ్యక్తిసేవా పద్ధతిలో మంచి పరిజ్ఞానాన్ని కలిగి ఉండాలి. అంతేకాక తత్వశాస్త్రం, మనోవిజ్ఞాన శాస్త్రం మొదలైన వాటిలో కూడా పరిజ్ఞానాన్ని కలిగి ఉన్నట్లయితే అతడు కుటుంబ సమస్యలను బాగా గుర్తించి వాటి పరిష్కరణకు మార్గం చూపగలడు. కేవలం సంఘ సంక్షేమ కృషియేకాక మిగిలిన వృత్తిరంగాలు కూడా అంటే మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞుడు, వైద్యుడు, మతబోధకుడు, నర్సులు కూడా ఈ సమస్యలను పరిష్కరించగలరు, అయితే వ్యక్తి సేవా పద్ధతి కుటుంబ సమస్యలను తీర్చడంలో అన్ని వృత్తులకంటే అత్యధికమైన ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకున్నదని చెప్పవచ్చు.

పాశ్చాత్య దేశాలలో ప్రభుత్వ సంస్థలు, ప్రైవేటు సంస్థలు కుటుంబ సంక్షేమ సేవలను అందజేస్తున్నవి. ఆధారపడిన తల్లులకు ప్రభుత్వం సహాయాన్ని చేయడానికి ఈ ప్రభుత్వ సంస్థలలోగల కుటుంబ సంక్షేమ సేవా పద్ధతి తోడ్పడుతుంది. కానీ ప్రైవేటు కుటుంబ సేవా సంస్థలు కుటుంబ సభ్యుల ఉద్రేకపూరిత కారణాలవల్ల ఏర్పడిన అసమయోజనాన్ని తొలగించడానికి, వ్యక్తిగత సమస్యలను పరిష్కరించడానికి కృషి చేస్తుంది. ఆరోగ్యకరమైన, ఆనందదాయకమైన కుటుంబ పరిస్థితులలో ఒడుదుడుకులు కలిగి కుటుంబంలో ఆరోగ్య, విద్య మొదలైన సమస్యలవల్ల, సర్దుబాటు చేసుకోలేక పోవడం మొదలైన సమస్యలు ఉత్పన్నమైనప్పుడు ఆ కుటుంబాలనుంచి అటువంటి సమస్యలను తొలగించడానికి కుటుంబ సేవా పద్ధతి ద్వారా సహాయం అందాలి. ఈ సహాయం కుటుంబ ఆర్థిక బడ్జెట్ గురించి సలహా నివ్వడం, కుటుంబాన్ని నిర్వహించడం, ఉద్యోగావకాశాల విషయమై సలహాలనివ్వడం మొదలైన కార్యక్రమాలను కలిగి ఉంటుంది. నూతన యువదంపతులుగానీ, వారి తలిదండ్రులుగానీ కుటుంబ సేవా కార్యకర్త వద్దకు వచ్చి సంప్రదించినట్లయితే అతడు వైవాహిక సమస్యలను కూడా పరిష్కరిస్తాడు. ఈ సేవా కార్యక్రమం వైవాహిక జీవిత ఒడుదుడుకులను పరిష్కరి

స్తుంది. దీనికై కుటుంబ సంక్షేమ కార్యకర్త దంపతులకు పరస్పర అవగాహన పొందటానికి, సంతృప్తి చెందటానికి సహాయం చేస్తాడు. అంతే కాక తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్య అసమయోజనం ఏర్పడితే వారి మధ్య సద్భావాలను కలుగజేసి సమస్యలను పరిష్కరిస్తాడు. ఈ ప్రైవేటు రంగాలు ఆర్థిక సహాయానికిగానీ, మరియే ఇతర సహాయానికిగానీ ప్రభుత్వ సంస్థలపై ఆధారపడి ఉంటాయి.

1954 వ సంవత్సరంలో అమెరికాలో "ఫేమిలీ సర్వీస్ అసోసియేషన్" (Family Service Association) 256 సంస్థలలో సభ్యత్వాన్ని పొందిఉన్నది. వీటిలో ఎక్కువ ప్రైవేటు సంస్థలు. ఇవి ఎక్కువ పట్టణ ప్రాంతాలలో ఉన్నాయి. కుటుంబ సేవాసంస్థల సిబ్బంది ఈ కిందివిధంగా ఉంటాయి.

1) ఎక్జిక్యూటివ్ డైరక్టర్ (Excutive Director).

2) ఒకరుగానీ లేదా అంతకంటే ఎక్కువగానీ పర్యవేక్షకులు.

3. కుటుంబ సేవా కార్యకర్తలు.

ఈ సంస్థలకు వ్యక్తులు స్వచ్ఛందంగా తమంతట తాముగానీ లేదా మరియే ఇతర సంస్థల సలహావల్లగానీ చేరుతారు. ఈ కుటుంబ సేవా సంస్థలలో అధిక సంఖ్యాక సంస్థలు తమ సేవార్థులకు ఉచితంగానే సేవచేస్తారు. ఇటువంటి సంస్థలు ఎక్కువగా ప్రజల విరాళాలమీద నడపడం జరుగుతుంది. మరికొన్ని కుటుంబ సేవా సంస్థలు తమ సేవార్థులనుంచి వారి ఆర్థిక స్తోమత ప్రకారం ఫీజులను సేకరిస్తారు. పెద్ద పెద్ద నగరాలలో కొందరు సాంఘిక సంక్షేమ కార్యకర్తలు "పెర్సనల్ రిలేషన్స్ కౌన్సిల్" (Personal Relations Council) అనే పేరుతో ఎటువంటి సంస్థలతోనూ సంబంధంలేకుండా తమంతట తాము వ్యక్తిగతంగా కుటుంబ సేవ చేస్తున్నారు. ఇటువంటి కుటుంబ సేవా సంస్థలే కాక ప్రత్యేక కుటుంబ సేవా సంస్థలు కూడా కొన్ని ఉన్నాయి. ఇవి సేవార్థుల ప్రత్యేక సమస్యలను దృష్టిలో పెట్టుకుని వారి ప్రత్యేక అవసరాలను తీర్చడానికి కృషిచేస్తాయి. ఉదాహరణకు

సాంఘిక సహాయం, సాంఘిక భీమా మొదలైనవి వృద్ధులకు ఆర్థిక సహాయాన్ని మాత్రమే చేస్తాయి. కానీ ఈ వృద్ధులలో చాలామంది అంటువ్యాధులతో బాధపడేవారు. వృద్ధాప్యంవల్ల దౌర్బల్యంచెందిన వారు, వారు ఉపయోగింలేని వారమనే భావనవలన విచారం, ఒంటరి తనం. నిరాశా నిస్పృహలు మొదలైన అనేక సమస్యలతో ఉంటారు. వృద్ధాప్యంలో వ్యక్తి తన పనులను తాను చేసుకునే శక్తి కోల్పోయి నప్పుడు తన కుటుంబ సభ్యులు కూడా అతని సంరక్షణా బాధ్యతను వహించరు. అటువంటి సమయంలో ఆ వ్యక్తిని సంరక్షించే పరిసరాల ఆవశ్యకత ఎంతైనా ఉంది. కుటుంబ సంక్షేమ సంస్థలు ఇటువంటివారికి ప్రత్యేక వసతి సౌకర్యాన్ని ఏర్పాటుచేసి వాటిలో వంటగదులు, లాండ్రీలు, నివసించే గదులు, గ్రంథాలయాలు, సంగీతం గదులు మొద లైనవి ఏర్పాటు చేయడం జరుగుతుంది. ఈ ప్రత్యేక సంస్థలు వైద్య, నర్సింగ్ పర్యవేక్షణ, ప్రత్యేక వినోద కేంద్రాలను కూడా ఏర్పాటు చేయడం జరుగుతున్నది.

## భారతదేశంలో కుటుంబ సంక్షేమ సేవలు

సనాతన లేదా పురాతన సాంప్రదాయ కుటుంబాలు, జాతివ్యవస్థ లోగల సౌహార్దతవల్ల కుటుంబ సమస్యలను పరిష్కరించడానికి ఇతరుల సలహా సంప్రదింపులు తీసుకోవలసిన అవసరంవస్తే వారు తమ స్నేహితు లను గానీ, లేదా సమాజంలోగల పెద్దమనుష్యులనుగానీ సంప్రదించేవారు. ఆధునిక యుగంలో సమష్టి కుటుంబాలు విచ్ఛిన్నమవడంవల్ల కుటుంబా లలో అశాంతి అలజడులు అభివృద్ధి చెందాయి. కనుక కుటుంబ సమ స్యలు పూర్వ పద్ధతులలో పరిష్కరించబడటం లేదు. ఈ సమస్యలు పరి ష్కరించడానికి కుటుంబ సేవా సంస్థలు ఆవశ్యకత ఎంతైనా ఉంది. కానీ మన దేశంలో ఈ కుటుంబ సేవా సంస్థల సంఖ్య చాలా తక్కువగా ఉన్నది.

1919 వ సంవత్సరంలో బొంబాయిలో గల "పార్సీ ఛారిటీ ఆర్గనైజేషన్ సొసైటీ" (Parsee Charity Organisation Society) సాంఘిక సంస్థలలో సాంఘిక సంక్షేమ కార్యకర్తలను

మొట్టమొదటిసారిగా నియమించింది. ఆరంభంలో ఈ సంస్థ ముఖ్యోద్దేశం పార్శీ దానధర్మాలను సమన్వయపరచడం. కానీ 1946 వ సంవత్సరంలో ఈ సంస్థ వ్యక్తి సేవా పద్ధతిని ఆచరించడం జరిగింది. వ్యక్తిసేవా పద్ధతిలో శిక్షణ పొందిన సిబ్బందిని నియమించింది. ఈ సంక్షేమ కార్యకర్తలు వ్యక్తుల యొక్క ఆర్థిక పరిస్థితిని కనుగొని వారికి ఎంతవరకూ ఆర్థిక సహాయం కావాలో కనుగొనడానికి వీరిని ఉపయోగించడం జరిగింది. క్రమక్రమంగా ఈ వ్యవస్థ పార్శీ కుటుంబాల సమస్యలను శాస్త్రీయ పద్ధతిలో వ్యక్తి సేవా పద్ధతిని ఉపయోగించి పరిష్కరించడం మొదలు పెట్టారు.

భారతదేశంలో మొట్టమొదటి కుటుంబ సంక్షేమ సంస్థ బొంబాయిలో 1950 వ సంవత్సరంలో స్థాపించబడింది. ఈ సంస్థకు ఆర్థిక సహాయం అనేక వ్యవస్థల ద్వారా లభించింది. వీటిలో ముఖ్యమైనది ఎన్. డి. వాడియా ఛారిటీస్, అమెరికన్ ఉమన్స్ క్లబ్, సర్ దొరాబ్జీ టాటా ట్రస్ట్, ఇండియన్, కాన్ఫరన్స ఆఫ్ సోషల్ వర్క్, కొంతమంది ధనికులు ఇచ్చిన బహుమానాలు మొదలైనవి. బొంబాయిలో గల "బొంబాయి మాతా శిశు సంక్షేమ సంఘం", ఈ కుటుంబ సంక్షేమ సంస్థ తన కార్యాలయాన్ని నడుపుకోవడానికి అనుమతి ఇచ్చింది. ఆరంభ దశలో ఈ సంస్థ ఒక సుశిక్షితుడైన సంక్షేమ కార్యకర్తను నియమించి అతని ద్వారా అన్ని సమస్యాపూరిత కుటుంబాలకు సహాయం అందజేసే లాగ ఏర్పాటు చేసింది. ఈ సంస్థ జాతిమత భేదాలులేక అందరినీ సరి సమానంగా పరిగణించడం జరిగింది.

ప్రభుత్వ వైద్యాలయాలు, బాలల న్యాయస్థానాలు, శిశు మార్గదర్శక కేంద్రాలు మొదలైన తదితర సంక్షేమ సంస్థలనుంచి ఈ కుటుంబ సంక్షేమ సంస్థకు సేవార్థులను రిఫర్ చేయుట కూడా జరుగుతున్నది. వైవాహిక జీవితంలో ఒడుదుడుకులు, వ్యక్తిగత సమస్యలు, అనారోగ్యం, నిరుద్యోగం, బాలనేరం మొదలైన సమస్యాపూరిత వ్యక్తులు తమ సమస్యలు పరిష్కరించుకొనడానికి ఈ సంస్థను చేరడం జరుగుతున్నది. సేవార్థుల సంఖ్య పెరగడంతో సంక్షేమ కార్యకర్తల

సంఖ్య కూడా పెరగడం జరిగింది. ఒక్క సంక్షేమ కార్యకర్త కృషివల్ల సేవార్థుల సమస్యలు పరిష్కారమవడం అసాధ్యం. అతనికి వైద్యులు, న్యాయవాదులు, మనో వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు, విద్యావంతులు, మత గురువులు మొదలైన వారందరి సహకారం కావాలి. ఈ పై చెప్పిన వారందరి సహాయ సహకారాలు తగు స్థాయిలో లభించనట్లైతే సంక్షేమ కార్యకర్త ఎంత సుశిక్షితుడైనప్పటికీ అతడు నిస్సహాయుడై పోతాడు. కొంతమంది సేవార్థులు తమ అమాయకతవల్ల, నిరక్షరాస్యత వల్ల, సంస్థ పరిధిని, ఆ సంస్థచేస్తున్న సహాయాన్ని గుర్తించలేరు. ఉదాహరణకు కొంతమంది సేవార్థులకు ఆర్థిక సహాయం అవసరం ఉంటుంది. కానీ ఈ సంస్థ సేవార్థికి ఆర్థికసహాయం చేయలేదు. కనుక ఈ సంస్థ సేవార్థికి ఆర్థికసహాయం చేయగలిగే సంస్థలకు రిఫర్ చేయడం జరుగుతుంది. అటువంటి సమయంలో సేవార్థిసంస్థ పరిధులను గ్రహించ లేక ఆ సంస్థ తన సమస్యను తీర్చలేకపోవడంవల్ల వేరొక సంస్థకు పంపుతున్నదనే దురభిప్రాయంతో ఆ సంస్థను తూలనాడటం జరుగుతున్నది. ఈవిధంగా సంస్థలు సమాజంలో వాటి పేరు ప్రతిష్టలను కోల్పోవడం కూడా జరుగుతున్నది.

ప్రస్తుతం కుటుంబ సంక్షేమ సంస్థ బొంబాయిలో డెలిసిల్ రోడ్డులో 10 బి. డి. డి. ఛాన్స్ వద్ద ఉన్నది. ఈ సంస్థ కుటుంబ సమస్యలను పరిష్కరించడమేకాక సంఘ సంక్షేమ కృషిలో అనేక విద్యార్థులకు శిక్షణను ఇవ్వమనికి క్షేత్ర కృషికి కూడా అవకాశాన్ని కలుగ జేస్తున్నది. బొంబాయిలోనేగాక ఢిల్లీలో కూడా ఇటువంటి సంస్థలున్నాయి. కాని ఇవి సంవత్సరానికి 5,000 సేవార్థులకన్నా ఎక్కువ మందికి సహాయం చేయలేకపోతున్నది. అధిక సంఖ్యాక కుటుంబాలకు ఇటువంటి సంస్థలున్నాయని కూడా తెలియదు. దేశం మొత్తంమీద కుటుంబ సంక్షేమ సేవలను చేస్తున్న సంస్థల సంఖ్య 9 మాత్రమే. అవి ఏవంటే —

1. లైజాన్ కమిటీ ఫర్ ఆర్గనైజేషన్ ఆఫ్ పార్శీ ఛారిటీస్ ఎ. ఎ. ఐ, ఇన్‌స్టిట్యూట్ బిల్డింగ్, బికాల్ వాడీ, బ్రేడియో, బొంబాయి-7.
2. ఫామిలీ ప్లానింగ్ ట్రెయినింగ్ అండ్ రిసెర్చి సెంటర్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, సర్దార్ వల్లభాయి పటేల్ రోడ్, బొంబాయి-4.
3. ఢిల్లీ కౌన్సిల్ ఫర్ సోషల్ వెల్‌ఫేర్, నేతాజీ సుభాష్ మార్గ్, ఢిల్లీ-6.
4. ఫ్యామిలీ వెల్‌ఫేర్ ఏజన్సీ, బి-డి.డి. ఛాల్, డెలిసిల్ రోడ్, బొంబాయి-11.
5. ఫామిలీ లైఫ్ ఇన్‌స్టిట్యూట్ అసోసియేషన్ ఆఫ్ సోషల్ అండ్ మోరల్ హైజీన్ ఇన్ ఇండియా, 4 రౌస్ ఎవెన్యూ, న్యూఢిల్లీ.
6. ఫామిలీ కౌన్సిలింగ్ బ్యూరో, బ్రహ్మణపుర్ కమిటీ, మహారాష్ట్ర స్టేట్ ఉమన్స్ కౌన్సిల్, 12 అనిబెసెంట్ రోడ్, వర్లీ, బొంబాయి - 18.
7. ఫామిలీ వెల్‌ఫేర్ ఏజన్సీ, నాగపాద నైబర్ హుడ్ హౌస్, బైకుల్లా, బొంబాయి - 8
8. ఫామిలీ కౌన్సిలింగ్ బ్యూరో, అసోసియేషన్ ఫర్ మోరల్ అండ్ సోషల్ హైజీన్, మహారాష్ట్ర స్టేట్ బ్రాంచ్, బొంబాయి - 1.
9. ఫామిలీ సర్వీస్ సెంటర్, 5 కాన్వెంట్ స్ట్రీట్ ఆఫ్ ఓల్డ్ హౌస్ రోడ్, బొంబాయి - 1.

ఈ పై చెప్పిన కుటుంబ సంక్షేమ సంస్థలు సాధారణంగా సత్సంబంధాలలో ఒడుదుడుకులు, అసమయోజనం మొదలైనసమస్యలు పరిష్కరించుకోడానికి సహాయంచేస్తాయి. ఆర్థిక సహాయం, వైద్య సహాయం మొదలైన సహాయాలను చేయడమే కాక వాటికి సాధ్యం కాని కేసులను ఇతర సంస్థలకు పంపుతారు. ఈ కార్యక్రమాలు జరప డానికి ఈ సంస్థలు సమాజంలోగల అన్ని వనరులను సాధ్యమయినంత వరకు ఉపయోగించుకొంటాయి. పట్టణ ప్రాంతాలలో కుటుంబ సమస్యలు అనేక కారణాలవల్ల ఉత్పన్నమవుతున్నాయి. వాటిలో ముఖ్యమైనవి—

1. చాలీ చాలని గృహవసతి సౌకర్యాలు.
2. ఉద్యోగం చేస్తున్న కుటుంబ స్త్రీలు.
3. వివాహాలు ఆలస్యంగా జరగడం.
4. స్త్రీ, పురుషుల సరిసమానమైన ప్రతిపత్తికోసం కృషిచేయడం.
5. కుటుంబ సభ్యుల బాధ్యతలలో మార్పు.

పట్టణాలలో కుటుంబ సమస్యలు ఎక్కువగా మధ్యతరగతి కుటుంబాలలో ఉత్పన్నమౌతున్నాయి. మన దేశ పరిస్థితులను పరిశీలించినట్లయితే ప్రస్తుతం గల కుటుంబ సంక్షేమ సంస్థలు సరిపోవు. పారిశ్రామికీకరణ, నగరీకరణ, విద్యాభివృద్ధి మొదలైన కారణాలవల్ల మన దేశంలో కుటుంబాలు ఆర్థిక, సాంఘిక, మానసిక నిర్మితిలో చాలా మార్పులు చెందినవి. ఇంకనూ త్వరితగతిని మార్పులు చెందటానికి అవకాశాలున్నాయి. నేడు భారతదేశంలో పేదరికం, అనారోగ్యం, అమాయకత, అవిద్య మొదలైన అనేక సమస్యలున్నాయి. ఇటువంటి సమస్యాపూరిత వ్యక్తులు కుటుంబ సంక్షేమ సేవా సంస్థలకు సహాయార్థమై వస్తారు. కానీ ఇటువంటి సమస్యలను పరిష్కరించే బాధ్యత కుటుంబ సంక్షేమ కార్యకర్తకు ఎంతమాత్రం వర్తించదు. అయినప్పటికీ కుటుంబ సంక్షేమ కార్యకర్త ఆ వ్యక్తుల సమస్యలను యథాతథంగా ఎదుర్కొనే శక్తి సామర్థ్యాలను పొందటానికి సహాయం చేస్తాడు. అంతేకాక సముదాయంలో లభ్యమయ్యే వనరులను ఉపయోగించుకుని వారు తమ అవసరాలను తీర్చుకోవడానికి తక్షణ సహాయంకూడా చేస్తాడు. ఆ సేవార్థుల అంతర్గతమైన శక్తి సామర్థ్యాలను బయటికి తీసుకొనివచ్చి వారి భావి జీవితంలో ఎదురుపడే సమస్యలను ధైర్యంగా ఎదుర్కొనే శక్తి సామర్థ్యాలను కలుగజేస్తాడు.

భారతదేశంలో కుటుంబాలు సాధారణంగా ఆర్థిక సమస్య, నిరుద్యోగ సమస్య, పేదరిక పరిస్థితులు, అనారోగ్యం, వైవాహిక, కుటుంబ సమస్యలు, మూర్తిమత్వ అసమయోజనం, కౌమార సమస్యలు, పిల్లల పెంపకంలో వచ్చే అనేక సమస్యలను ఎదుర్కొంటున్నాయి. ఇటువంటి వివిధ సమస్యలను పరిష్కరించడానిని కుటుంబ సంక్షేమ సంస్థల సంఖ్య

పెరగవలసి ఉంది. కుటుంబ సంక్షే సంస్థలతో బాటు ఉద్యోగ కేంద్రాలు, మనో వైజ్ఞానిక కేంద్రాలు, న్యాయసహాయక కేంద్రాలు. బాలల న్యాయస్థానాలు, ఫాస్టర్ గృహాలు (Foster Homes), వైద్యా లయాలు, మొదలైన సంస్థలనుకూడా తగుస్థాయిలో పెంపొందించాలి. ప్రభుత్వ సంస్థలేకాక మరికొన్ని ప్రైవేట్ కుటుంబ సంక్షేమ సంస్థలను కూడా స్థాపించవలసి ఉంది. ఈ సంస్థలలో ఉచితసేవకాక ఆర్థికంగా ఉన్నత స్థితిలో ఉన్నవారు ఫీజు చెల్లించి తమ సమస్యలను పరిష్కరించుకోగలరు. భారతదేశంలో కొంతమంది ఉచిత సేవలకన్నా డబ్బు చెల్లించి పొందే సేవలకు ఎక్కువ విలువనివ్వడం జరుగుతున్నది. అటువంటి సేవార్థులకు ఈ ప్రైవేట్ సంస్థలు మానసిక సంతృప్తిని కలుగజేయగలవు.

## కుటుంబ జీవిత సంబంధమైన విద్యాబోధనా కార్యక్రమాలు

ఇది అతి సరికొత్త కార్యక్రమం. ఇది మొట్టమొదట 1951 వ సంవత్సరంలో అమెరికాలో ఆరంభమైంది. ఈ పద్ధతి సాంఘిక వ్యక్తి సేవాపద్ధతివంటిది కాదు. ఇది కేవలం విద్యాబోధనవంటిది మాత్రమే. ఈ కార్యక్రమంలో విద్యాబోధనతోపాటు ప్రయోగాలు కూడా చేసి చూపించడం జరుగుతుంది. ఈ కార్యక్రమాలను కుటుంబాలలోగల అసంతృప్తికరమైన సంబంధాలను నిరోధించడానికి ఉద్దేశించి రూపొందించడం జరిగింది. అంతేకాక కుటుంబ జీవితాన్ని సమైక్యపరచి అభివృద్ధిచేయడం జరుగుతుంది. ఈ కార్యక్రమాలలో అనేక అంశాలున్నాయి. అవి ఏవంటే లైంగిక విద్య, వైవాహిక జీవితాన్నిగురించి తెలియజేయడం, తలిదండ్రుల బాధ్యతలను తెలియజేయడం మొదలైనవి.

ప్రొఫెసర్ ఫ్రెడ్‌లాండర్ కుటుంబ జీవిత విద్యా కార్యక్రమాన్ని ఈ కిందివిధంగా విశదీకరించాడు. "ఆధునిక యుగంలో కుటుంబ సభ్యుల మధ్యగల సంబంధ బాంధవ్యాలను బలపరచడానికి కుటుంబాలకు విద్యా విధాన కార్యక్రమాలను అభివృద్ధిపరచే ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఈ

కార్యక్రమాన్నే కుటుంబ జీవిత విద్యా కార్యక్రమ" మని తెలియ జేశాడు. దీనిని సుశిక్షితులైన సాంఘిక సంక్షేమ కార్యకర్తలు కుటుంబ సంక్షేమ సంస్థలలో కొనసాగిస్తారు. ఈ సంస్థలు కుటుంబాలు సమస్యలకు గురికాకుండా సంరక్షిస్తాయి. వయోజన విద్య, తలిదండ్రులు-ఉపాధ్యాయుల సమితులు, నవదంపతుల సామూహిక చర్చలు, మదర్ క్లబ్బులు, చర్చిలు మొదలైన వాటిద్వారా ఈ కార్యక్రమం చేపట్టడం జరుగుతుంది. సామూహిక చర్చల ద్వారా ప్రజలు కుటుంబ సంబంధాలను గురించి అర్థం చేసుకొనే అవగాశం లభిస్తుంది. వివాహ సహాయక సంస్థలు, కుటుంబ నియంత్రణా కేంద్రాలు ఈ కార్యక్రమానికి ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. కనుక ఈ సంస్థలు సుశిక్షితులైన సంక్షేమ కార్యకర్తలను నియమించి వారి ద్వారా కుటుంబ జీవిత విద్యా బోధన కార్యక్రమాలను కొనసాగించవలసి ఉంది. ఈ కుటుంబ జీవిత విద్యా బోధనా కార్యక్రమాలు కుటుంబ సమస్యలను అధిక శాతంలో పరిష్కరిస్తున్నాయి.

## ప్రభుత్వం కుటుంబ సంక్షేమ సేవలు

ప్రభుత్వం కుటుంబ సంక్షేమ సంస్థలకు సహాయం చేయవలసి ఉంది. కుటుంబ సంక్షేమ సంస్థలకు గ్రాంటులను మంజూరు చేయవలసి ఉంది. కుటుంబ నియంత్రణా కేంద్రాలలో కుటుంబ సేవాపద్ధతిలో శిక్షణపొందిన వ్యక్తి సేవా కార్యకర్తలను నియమించాలి. శాసనాల ద్వారా వివాహ వయస్సు పరిమితిని ఎక్కువచేయాలి. గ్రామీణ ప్రాంతాలకు కూడా సాంఘిక విద్యా కార్యక్రమాలను విస్తృతం చేయాలి. కుటుంబ సమస్యలను పరిష్కరించే తదితర సంస్థలను బలపరచాలి. అంతేకాక ప్రజలందరూ తమ కనీసావసరాలైన ఆహారం, వస్త్రాలు, వసతి సౌకర్యాలను పొందేలాగ ప్రయత్నించాలి. విద్య, ఆరోగ్య, వినోద సౌకర్యాలను కూడా ప్రజలందరికీ అందుబాటులో ఉండేలాగ ఏర్పాటుచేయాలి. గృహవసతి సౌకర్యాలను కూడా ఏర్పాటుచేయాలి.

ఈనాడు ప్రజలు తమ కనీసావసరాలను కూడా సంతృప్తిగా పొందలేకపోతున్నారు. విద్య, ఆరోగ్య, వినోద సౌకర్యాలు చాలా అసంతృప్తికరంగా ఉన్నాయి. ఉద్యోగావకాశాలు చాలా తక్కువగా ఉన్నాయి. ప్రభుత్వ, ప్రయివేటు రంగాలలో పనిచేసే ఉద్యోగస్తులకు సాంఘిక సేవలు, సాంఘిక సంక్షేమ సేవలను ఏర్పాటుచేసినప్పటికీ అవి మొత్తం జనాభాలో అతి తక్కువ మందికి మాత్రమే అందుతున్నాయి. స్కాలర్‌షిప్ పథకాలు, మహిళలకు, శిశువులకు, వెనుకబడిన తరగతులవారికి ఉద్దేశించిన సంక్షేమ కార్యక్రమాలన్నీ ప్రజల పేదరికాన్ని కొంతవరకూ తొలగించడానికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన కార్యక్రమాలు అధికశాతం కుటుంబ సమస్యలు తలసరి ఆదాయం తక్కువవడంవల్ల ఉద్భవించినవే. కనుక ప్రభుత్వం తలసరి ఆదాయాన్ని పెంచి, అసమాన ఆర్థిక పంపిణీని తొలగించి ప్రజలందరూ వస్తురూపకంగా గాని సంక్షేమసేవల రూపంలోగానీ సరిసమానంగా పొందేలాగ చేయాలి.

ఈ విధంగా ప్రభుత్వం ప్రవేశపెట్టే సంక్షేమ కార్యక్రమాలన్నీ కుటుంబాన్ని దృష్టిలో పెట్టుకొని ఏర్పాటుచేయడంవల్ల కుటుంబ సమస్యలు అధిక శాతం పరిష్కారమౌతాయి. పింఛను, ప్రావిడెంట్ ఫండ్ మొదలైన పథకాలు, వికలాంగులకు గ్రాంటులు మొదలైనవి కుటుంబానికీ, వ్యక్తికీ ఆర్థిక ఒత్తిడులను తగ్గిస్తాయి. ఆర్థికావసరంలో ఉన్న కుటుంబ స్త్రీలకు ఉద్యోగాలిప్పించి వారికి ఆర్థిక సహాయంచేసే కార్యక్రమాలను కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు, గృహకళ్యాణ కేంద్రాలు మొదలైనవి ఏర్పాటు చేయవలసి ఉంది.

## కుటుంబ నియంత్రణ

భారతదేశంలో 1961 వ సంవత్సరంలో 440 మిలియన్ల జనాభా 1964 వ సంవత్సరానికి 460 మిలియన్లకు పెరిగింది. అంటే సంవత్సరానికి 11.3 మిలియన్ల చొప్పున జనాభా పెరుగుతున్నది. 1970 నాటికి మన దేశం జనాభా 550 మిలియన్లకు చేరింది. 1980 వ సంవత్సరం

నాటికి 65.7 కోట్ల వరకు పెరిగింది. ప్రపంచ జనాభా 3.250 మిలియన్ల మన దేశ జనాభా 1/7 వ వంతుకు మించి ఉంది. ఆరోగ్య, వైద్య సౌకర్యాలు పెరగడంతో ఆయుర్దాయ ప్రమాణం 25 నుంచి షుమారు 50 కి పెరిగింది. ఒకపక్క జనాభా పెరిగి మరోకప్రక్క మరణాల సంఖ్య తరగడంతో మన దేశ జనాభా విపరీత వేగంతో పెరుగుతున్నది. ఇదే వేగంతో జనాభా పెరిగితే 1999 నాటికి మన దేశ జనాభా 100 కోట్లకు చేరుతుందని అంచనా వేయబడింది.

మన దేశంలో ఉత్పత్తి అయ్యే ఆహారధాన్యాలు మనిషికి రోజుకు 1400 కేలరీల లెక్కన 300 మిలియన్ల జనాభాకు మాత్రమే సరిపోతాయి. అంటే దేశ జనాభాలో దాదాపు సగం మంది ఆకలితో గానీ, అర్ధాకలితో గానీ ఉండటం జరుగుతుంది. 1964 వ సంవత్సరంలో తలసరి ఆదాయం సంవత్సరానికి 30 రూపాయలు మాత్రమే. అది 1970 లో 450 రూపాయలకు పెరిగింది. మన దేశంలో సగటు ఆదాయం జనాభాలో ప్రతి ముగ్గురిలోను, ఇద్దరికి మాత్రమే సరిపోతుంది. 1925-51 సంవత్సరాల మధ్య జనాభా పెరుగుదల 80 శాతం ఉంది. సాగులో ఉన్న భూమి 5 శాతం వరకూ పెరిగింది. నిరుద్యోగుల సంఖ్య 30 మిలియన్లకు చేరుకుంది.

ఎన్నో అభివృద్ధి ప్రణాళికలు, పథకాల అమలు జరుగుతున్నప్పటికీ అనుకొన్న విధంగా దేశం అభివృద్ధి పొందలేకపోవడానికి కారణం అంచనాలకుమించి జనాభా పెరగడమే. పెరుగుతున్న జనాభాతో పోల్చిచూస్తే సాధించిన అభివృద్ధి లెక్కలోనికి రావడం లేదు. మొదటి పంచవర్ష ప్రణాళికాంతానికి జనాభా 408 మిలియన్లు ఉంటుందని ప్రణాళికా సంఘం వారు ఊహించి పథకాలను రూపొందించారు. కానీ జనాభా 434 మిలియన్లు అయింది. భారత దేశం ఆర్థికంగాను, పారిశ్రామికంగాను వెనుకబడి ఉంది. దీనికి తోడు జనాభా పెరుగుదల, దారిద్ర్యం, ఆకలి మరణాలు, ఆత్మహత్యలు, నిరుద్యోగం, అవినీతి, నేరం, వ్యభిచారం, వంటి అనేక సాంఘిక సమస్యలు అంతకంతకు తీవ్రరూపం దాలుస్తున్నాయి. దేశంలో అభివృద్ధి ఆశించిన విధంగా లేక పోవడంతో

ప్రజలలో నిరాశా, నిస్పృహా, అశాంతి, అలజడులు, అసంతృప్తి మొద లైన మానసిక సమస్యలు పెరుగుతున్నాయి. ఈ పరిస్థితులు సమాజ సుస్థిరతకే ప్రమాదాన్ని తెచ్చిపెట్టేటట్టుగా పరిణమించవచ్చు. మన దేశంలో ప్రతీ రెండు సెకన్లకు ముగ్గురు చొప్పున పిల్లలు పుడుతు న్నారు. ఈ అత్యవసర పరిస్థితిని గుర్తించి దేశంలో కుటుంబ నియం త్రణా పథకాలను ప్రవేశపెట్టడం జరిగింది.

కుటుంబ నియంత్రణ గురించి, జనాభా సమస్యను గురించి మన దేశంలో ఒక శతాబ్దం కిందటనే ఆలోచించడం ఆరంభమయింది. 1932 లో జరిగిన అఖిలభారత మహిళా సమావేశంలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాల అవసరాన్ని గుర్తించి స్త్రీ, పురుషులు తగిన విధానాలను అవలంభించాలని సూచించడం జరిగింది.

1949 లో భారతీయ కుటుంబ నియంత్రణ సంఘం ఏర్పడింది. భారతీయ రెడ్‌క్రాస్ సంస్థ కూడా కుటుంబ నియంత్రణా పథకాలను ప్రవేశపెట్టింది. 1930 లో మైసూర్ ప్రభుత్వం భారత దేశంలో మొట్ట మొదటి కుటుంబ నియంత్రణా కేంద్రాన్ని ప్రారంభించింది. ఆ తరువాత కొన్ని ప్రాంతాలలో మరికొన్ని కేంద్రాలను ప్రారంభించారు. జిల్లా స్థాయిలో ఒక జిల్లా కుటుంబ నియంత్రణాధికారి, ఒక సమాచార విద్యాధికారి, జిల్లా విస్తరణాధికార్లు, ఇద్దరు (ఒక స్త్రీ, ఒక పురుషుడు) ఇతర ప్రచారకులు ఉంటారు. కింది స్థాయిలో ప్రతీ 20 వేల మంది జనాభాకు ఒక హెల్త్ ఇన్‌స్పెక్టర్, ప్రతి పదివేలమందికి ఒక మంత్రసాని, ప్రతీ నలభై వేలమందికి ఒక హెల్త్ విజిటర్, 60 వేల మందికి ఒక వైద్యుడు, ఇతర ఉద్యోగులు ఉంటారు. రాష్ట్రస్థాయిలో కుటుంబ నియంత్రణ శాఖకు ఒక అధికారి, ఇతర ఉద్యోగులు ఉన్నారు. కేంద్రస్థాయిలో ఒక మంత్రిత్వ శాఖను ఏర్పాటుచేయడం జరిగింది.

మన దేశంలో జనాభా ఇంత విపరీతంగా పెరగడానికి మతపర మైన, సంస్కృతిక పరమైన కారణాలు కూడా కొంతవరకు దోహదం చేస్తున్నాయి. పిల్లలను భగవంతుడిస్తాడనీ, కుటుంబ నియంత్రణ పాప మనీ, అది శిశు హత్యతో సమానమైందని కొందరి నమ్మకం.

గ్రామాలలో వ్యవసాయ కుటుంబాలలో సభ్యుల సంఖ్య పెరిగితే బరువుగా భావించరు. ప్రజలలోని అజ్ఞానం, అమాయకత, పాతుకుని పోయిన మూఢ విశ్వాసాలు, బాల్య వివాహాలు, ఇవన్నీ సమష్టిగా ఈనాటి జనాభాకు ముఖ్య కారణాలు. కుటుంబ నియంత్రణా భావాన్ని ప్రజల హృదయాలలో ప్రవేశపెట్టడం అంత సులభమైన పని కాదు. ప్రజలలో మానసిక చైతన్యాన్ని తీసుకుని రావాలి. తరచు కాన్పుల వల్ల తల్లుల ఆరోగ్యం ఏ విధంగా భంగమయ్యేది ప్రజలకు తెలియ జేయాలి. ప్రతి సంవత్సరం 900 మిలియన్ల పిల్లలు జన్మిస్తున్నారు. 2,50,000 మంది పిల్లలు ప్రసవ సమయంలో మరణిస్తున్నారు. సరైన ఆహారం, తగిన వైద్య సౌకర్యాలు లేకపోవడంతో ప్రసవ సమయంలో మరణాల సంఖ్య అధికమౌతున్నది.

ఒక్కొక్క కొత్త సభ్యుని ప్రవేశంతో కుటుంబానికి వచ్చే ఆర్థిక చిక్కులు, జనాభా పెరుగుదలవల్ల దేశం మొత్తానికి వచ్చే చిక్కులు, ఇవన్నీ సామాన్య ప్రజలకు అర్థమయ్యేలాగ వివరించి, బోధించి ప్రజ లను పరిమిత కుటుంబాలపట్ల సుముఖులుగా చేయాలి. వ్యక్తికీ, కుటుం బానికీ, దేశానికి అధిక జనాభావల్ల వచ్చే ప్రమాదాన్ని వివరించాలి. ప్రభుత్వంవారు చేస్తున్న నిర్విరామ కృషివల్ల జనాభా పెరుగుదలను కొంతవరకు నిరోధించడం జరిగింది. అయినా సాధించిన దానితో సంతృప్తి పడటానికి వీలులేదు. కుటుంబ నియంత్రణా పథకాలను పటి ష్టంగా అమలుజరిగేటట్లు చూడాలి. అంతేకాకుండా కుటుంబ నియం త్రణా కార్యక్రమానికై వెచ్చించిన ధనం దుర్వినియోగం కాకుండా ఉండేటట్లు చూడాలి. యువతీ యువకులకు లైంగిక విజ్ఞానాన్ని బోధిం చడం కుటుంబ నియంత్రణా పద్ధతులు మరింత విరివిగా ప్రచారం చేయ డం, నియంత్రణా పరికరాలను ఉచితంగా అందజేయడం అవసరం.

కుటుంబ నియంత్రణ కుటుంబ సంక్షేమానికి సంబంధించిన పథకం. కనుక ఈ కుటుంబ నియంత్రణా కార్యక్రమాలను కుటుంబ సంక్షేమ సంస్థలు చేపట్టడం ఎంతో సముచితం. కుటుంబ నియంత్రణ కుటుంబా లలో పిల్లల సంఖ్య తగ్గించడానికే కాక పిల్లలు లేనివారికి ఆ అవకాశం

కల్పించే పథకంకూడా ఉపయోగపడుతున్నది. కనుక ఈ పథకం జనాభా పెరుగుదలను అరికట్టుటమేకాక పిల్లలు లేక మానసిక వ్యథ ననుభవిస్తూ సమస్యాపూరితమైన కుటుంబాలలో భార్యాభర్తలకు వైద్య పద్ధతుల నుపయోగించి సంతానోత్పత్తి యోగ్యత కలుగజేసి వారి సమస్యలను పరిష్కరించే కుటుంబ సంక్షేమ పథకంగాకూడా పరిగణించబడుతున్నది.

## కుటుంబ సంక్షేమ కార్యకర్త పాత్ర

సాంఘిక వ్యవస్థలో కుటుంబం ప్రాముఖ్యత, కుటుంబ జీవితం వీటివల్ల కలిగే లాభాలను వ్యక్తులు గుర్తించడం అవసరం. వ్యక్తిగతాభిప్రాయాన్ని కొంతవరకూ అదుపులో పెట్టుకుని వ్యక్తి శ్రేయస్సుకంటే కుటుంబ శ్రేయస్సుకు ప్రాముఖ్యత నీయాలి. ఈ విధంగా కుటుంబ వ్యవస్థను పటిష్టం చేయాలి. బాహ్యపరిస్థితుల వల్లగానీ, వ్యక్తుల ఆంతరంగిక కారణాలవ వల్లగానీ, ఈ రెండు కారణాల కలయిక వల్లగానీ కుటుంబ జీవితంలో సమస్య లేర్పడతాయి.

కుటుంబ సంక్షేమ కార్యక్రమాలలో శిక్షణానుభవంగల సంక్షేమ కార్యకర్త లుంటారు. సహాయాన్ని కోరిన వ్యక్తుల వ్యక్తిగత, కుటుంబ సమస్యలను కూలంకషంగా అర్థం చేసుకొని ఆ సమస్యల పరిష్కారానికి సాయపడయరు. కుటుంబ సంక్షేమ కార్యకర్త తన శాస్త్ర పరిజ్ఞానంతో వ్యక్తిసేవా, సమూహసేవా పద్ధతులతో శాస్త్రీయంగాను, క్రమబద్ధంగాను కుటుంబ సంక్షేమ కృషి చేస్తాడు.

వ్యక్తిసేవా విధానంలో ముఖ్యమైనది ముఖాముఖి సంభాషణ, సహాయాన్ని అర్థించిన వ్యక్తితో తాను జరిపే ముఖాముఖి సంభాషణలలో సంక్షేమ కార్యకర్త వ్యక్తి సమస్య ఏమిటో, తననుంచి, తన సంస్థనుంచి ఆశించే సహాయ మెటువంటిదో, ఏప పరస్థితులు అతని సమస్యకు దోహదం చేస్తున్నాయో అర్థంచేసుకుంటాడు. ఆతరువాత సంభాషణలలో వ్యక్తి తన సమస్యను బాగా అర్థంచేసుకొనేటట్లు, సమాజంలో ఉన్న ఇతర వనరులను సద్వినియోగం చేసుకొనేటట్లు, ఏప మానసిక భావోద్వేగ పరిస్థితులవల్ల తన ఆశయం నెరవేర్చు

కోవడం కష్టమౌతుందో వ్యక్తి అర్థంచేసుకోవడానికి సంక్షేమ కార్యకర్త తోడ్పడతాడు. అంటే వ్యక్తిగత సమస్యను లేదా సమస్యగా భావించే పరిస్థితిని నిష్పాక్షికంగా ఆలోచించేటట్లు సంక్షేమ కార్యకర్త తోడ్పడతాడని తెలుసుకోవాలి.

కొన్ని సందర్భాలలో వ్యక్తిపైన బాహ్య పరిస్థితుల ఒత్తిడి తగ్గించడానికి కార్యకర్త వ్యక్తి పరిసరాలతో సంబంధాలు పెట్టుకుంటాడు. వ్యక్తి తనంతట తాను పొందలేకపోయిన, సమాజంలోని ఇతర వనరులను, సేవలను, సంక్షేమ కార్యకర్త అతనికి లభ్యమయ్యేలాగ సహాయంచేస్తాడు. ఈ ముఖాముఖీ సంభాషణలన్నీ ఆంతరంగిక సంభాషణలుగా రహస్యంగా ఉంచడం జరుగుతుంది. కుటుంబ సంక్షేమ సంస్థ సహాయాన్ని అర్థిస్తూ వచ్చిన వ్యక్తి ఒక్కడే అయినప్పటికీ, పరిష్కరించవలసిన సమస్యకూడా ఒక్కటే అయినప్పటికీ అది మొత్తం కుటుంబ సమస్యలో ఒక భాగంగా పరిగణించాలి. సమాజంలో కుటుంబ జీవితాన్ని పటిష్ఠంచేసే ప్రతి కార్యక్రమంలోను కుటుంబ సంక్షేమ కార్యకర్త పాల్గొంటూ ఉంటాడు.

కుటుంబం విచ్ఛిన్నమైన తరువాత సహాయపడటంకంటే కుటుంబాన్ని పటిష్టంచేయడానికి ముందు జాగ్రత్తలు తీసుకోవడం వాంఛనీయం. ఇదే కుటుంబ సంక్షేమం బాధ్యత, ఆశయం. శిశు సంరక్షణ, పోషణ, విషయాలలో తల్లులకు సలహా చెప్పడం, తద్వారా సమాజంలో కుటుంబ వ్యవస్థను బలపరచడం మంచిది. కానీ పిల్లలు ఒక సమస్యగా తయారైన తరువాత తలిదండ్రులకు సలహా చెప్పడంలో ఉపయోగం లేదు. కుటుంబ ఆర్థికావసరాలు చాలామటుకు ప్రభుత్వం ద్వారా తీరిన నప్పుడు కుటుంబ సంక్షేమ సంస్థలు తమ సేవలను కేవలం సలహాలమేరకు పరిమితం చేసుకుంటే మానసిక సమస్యలు పరిష్కారం సులభమౌతుంది. ఆర్థిక సమాయోజన సమస్యలు, ఆరోగ్య సమస్యలు, కుటుంబ జీవితం సాఫీగా నడవకుండా భంగం కలిగించే ఇతర సమస్యలు కుటుంబ సంక్షేమ సంస్థ సరిదిద్దగలదు.

కుటుంబ సంక్షేమ సంస్థ సేవ, సలహా సంప్రదింపులు అవసర మయ్యే ముఖ్యమైన పరిస్థితులు నాలుగు రకాలుగా ఉంటాయి.

## 1. వివాహానికి పూర్వ సమస్యలు

వివాహానికి పూర్వం విద్యా సమస్యలు. ఉద్యోగ సమస్యలు, భవిష్యత్తు నిర్ణయం, యౌవనావస్థలో ఏర్పడే శారీరక, మానసిక సమస్యలు, ప్రేమ సమస్యలు, పరిసరాలలో పరిచయస్తులతో వచ్చే సమస్యలు మొదలైనవి. ముఖ్యమైనవి. ఈ సమస్యల పరిష్కారానికి కార్యకర్త తోడ్పడతాడు. ఈ విధమైన సమస్యలను పరిష్కరించడానికి వ్యక్తి సేవా పద్ధతి ఉపయోగపడుతుంది.

## 2. భార్యాభర్తల సంఘర్షణలు

ఈ సమస్యలు ఎన్నో రకాలుగా ఉంటాయి. కాబట్టి వీటి పరిష్కారానికి వివిధ పద్ధతులు ఉపయోగించవలసి ఉంటుంది. కొన్ని సమస్యలు అతి సున్నితమైనవిగా ఉంటాయి. సులభంగా పరిష్కరించ గలిగినవిగా కూడా ఉంటాయి. కొన్ని సమస్యలు క్లిష్టంగా కూడా ఉంటాయి. కొన్ని సందర్భాలలో వీటి పరిష్కారం సంక్షేమ కార్యకర్తల పరిజ్ఞానానికీ, అనుభవానికీ, శక్తిసామర్థ్యాలకూ అందుబాటులో ఉంటుంది. మరికొన్ని పరిస్థితులలో వ్యక్తి సమస్యను అర్థంచేసుకోవడం కోసం సంక్షేమ కార్యకర్త, మనోవిజ్ఞాన శాస్త్రవేత్త సలహా తీసుకోవడం లేదా మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞునితో సంప్రదించి అతనికి అప్పజెప్పడం అవసరమౌతుంది.

భార్యాభర్తల మధ్య వచ్చే సమస్యలలో కొన్ని ఆర్థిక సంబంధమయినవి, దాంపత్య జీవితానికి సంబంధించినవి అయి ఉంటాయి. భార్యాభర్తలలో ఒకరు అమితంగా ఖర్చుచేసి మరొకరు అమితంగా పొదుపుచేసినవారయితే అది వారిమధ్య సమస్యగా పరిణమించి చివరకు సంఘర్షణకు దారితీయవచ్చు. ఒకరి అవసరాలను మరొకరు గుర్తించకుండా, ఒకరికొకరు కనీస మర్యాదలను చూపించకపోయినపుడు, భార్యాభర్తల విభిన్న మనస్తత్వాలు కలవారయినపుడు వారిమధ్య

సంఘర్షణలు రావచ్చు. సంక్షేమ కార్యకర్త భార్యాభర్తల మనస్తత్వాలను పరిశీలించి పరిస్థితిని నిష్పాక్షికంగా అర్థంచేసుకుని ముఖాముఖి సంభాషణల ద్వారా వారిమధ్య సత్సంబంధాలను తిరిగి ఏర్పరచవచ్చు.

## 3. తలిదండ్రుల - పిల్లల మధ్య సంబంధాలు

మానసిక కారణాలవల్ల కుటుంబ సాంఘిక, ఆర్థిక పరిస్థితుల వల్ల సభ్యులలో అసంతృప్తి ఏర్పడుతుంది. అనేక కారణాలవల్ల తలిదండ్రులకూ, పిల్లలకూ మధ్య సత్సంబంధాలు దిగజారిపోవచ్చు. అభిరుచులలోను, అభిలాషలలోను, స్పర్థలు రావచ్చు. సంక్షేమ కార్యకర్త ఈ సంబంధాలను మెరుగుపరచడానికి కృషిచేస్తాడు.

## 4. అవివాహిత స్థితిలో మాతృత్వం

అవివాహిత స్థితిలో మాతృత్వం పొందిన స్త్రీల మానసిక ఉద్వేగ సమస్యాపరిష్కారం సంక్షేమ కార్యకర్త ముఖ్యమైన బాధ్యత. ఈ సమస్యా పరిష్కారానికి కొన్ని సంస్థలు ఏర్పాటుచేయడం కూడా జరిగింది. గృహ వాతావరణం అనారోగ్యకరంగా, అవినీతికరంగా ఉండి తలిదండ్రులకు, పిల్లలకు సంతోషకరమైన సంబంధాలు లేనపుడు ఇటువంటి సమస్యలు వస్తాయి. అవివాహిత గర్భిణీ స్త్రీలను, మాతలను, వారి పరిస్థితిని సానుభూతితో అర్థంచేసుకొని సంక్షేమ కార్యకర్త సహాయపడతాడు.

ఈవిధంగా కుటుంబంలో అత్యవసర పరిస్థితులు ఏర్పడినపుడు శిశు సంక్షేమ సంస్థలు, సంరక్షణ, వాటి సేవలు, సంక్షేమ కార్యకర్త వివరించి శిశువు భవిష్యత్తును నిర్ణయించుకొనడంలో సహాయపడతాడు. పిల్లల వృత్తి, విద్య, ఉద్యోగ విషయాలలో కూడా సంక్షేమ కార్యకర్త సమాచారాన్ని అందించి సలహా చెబుతాడు. ఆర్థిక దుస్థితివల్ల కుటుంబ సుస్థిరతకే ప్రమాదం రావచ్చు. ఈ పరిస్థితులలో వివిధ కుటుంబ సంక్షేమ సంస్థలనుంచి, ఇతర మార్గాలద్వారా ఆర్థిక సహాయం లభించేటట్లుగా సంక్షేమ కార్యకర్త చేస్తాడు. సమాజంలో ఉన్న వివిధ సంస్థలు, లక్ష్యాలు, కార్యక్రమాలు ఇవన్నీ సంక్షేమ కార్యకర్త

ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉండాలి. వృద్ధులకు కూడా వారి ప్రత్యే కావసరాలను, సమస్యలను పరిష్కరించి వివిధ సంస్థల నుంచి సహాయం అందేటట్లు సంక్షేమ కార్యకర్త చేయవచ్చు. వార్ధక్య పింఛను మొదలైన సౌకర్యాలు కలిగించవచ్చు. చిక్కులలో ఉన్న కుటుంబాలకు న్యాయ సహాయాన్ని అందించవచ్చు.

కుటుంబ సంక్షేమ కార్యకర్త పాత్ర ఎంతో విలువైనది, క్లిష్టమయినది. బాధ్యతా నిర్వహణ సక్రమంగా ఉండాలంటే కార్యకర్తకు సంఘ సంక్షేమ శాస్త్రంలోను, సామాజిక శాస్త్రంలోను, మనోవిజ్ఞాన శాస్త్రంలోను, మానవ సంబంధాలలోను పరిజ్ఞానం ఉండాలి. ఎదుటి వ్యక్తిని సానుభూతితో అర్థం చేసుకొనే శక్తి కావాలి. పరిస్థితిని నిష్పాక్షికంగా పరిశీలించకలిగిన శక్తిసామర్థ్యాలు కావాలి. పనిలో నిజాయితీ అవసరం. బలమైన పరిణతిచెందిన వ్యక్తిత్వంకలిగి ఉండాలి. ఈ లక్షణాలున్న కార్యకర్త కుటుంబ సంక్షేమ కృషిని సఫలీకృతం చేయగలడు. సంక్షేమ కార్యకర్త పాత్ర అతడు ప్రాతినిధ్యం వహించే సంస్థ ఆర్థిక వనరులకు, విధానాలకు, లక్ష్యాలకు పరిమితమై ఉంటుంది. సహాయాన్ని కోరిన వ్యక్తి అవసరాన్ని బట్టికూడా ఉంటుంది. ప్రతి కుటుంబ సంక్షేమ సంస్థ తన పరిస్థితినిబట్టి కుటుంబ సంక్షేమ కార్యకర్తలను నియమించడం ఎంతైనా అవసరం.

## పంచవర్ష ప్రణాళికలు - కుటుంబ సంక్షేమం

మొదటి పంచవర్ష ప్రణాళికలో కుటుంబ నియంత్రణా కార్యక్రమాన్ని అమలుజరపడానికి 65 లక్షల రూపాయలు కేటాయించడం జరిగింది. 1951 – 56 మధ్య 147 కుటుంబ నియంత్రణ చికిత్సాలయాలను నెలకొల్పారు. కుటుంబ నియంత్రణకు చెందిన సాహిత్యాన్ని విరివిగా తయారుచేసి పంచిపెట్టారు. వివిధ ప్రచార సాధనాలతో విరివిగా ప్రచారంచేయడం జరిగింది. రెండో పంచవర్ష ప్రణాళికలో మూడుకోట్లరూపాయల ఖర్చుతో 1649 చికిత్సా కేంద్రాలను తెరవటం జరిగింది. ప్రచారం ఇంకా ఎక్కువగా చేశారు. కుటుంబనియంత్రణ

సాధనాలు ఉచితంగా పంచిపెట్టారు. 1956-60 మధ్య 1,08,042 మంది స్త్రీ, పురుషులకు కుటుంబ నియంత్రణా ఆపరేషన్లు చేశారు. 1840 లక్షల మందికి ఇతర విధాలైన కుటుంబనియంత్రణ పరికరాలను గురించి సలహా చెప్పడం జరిగింది. అనేక ప్రదర్శనలు, శిక్షణ తరగతులు ఏర్పాటుచేయడం జరిగింది. సినిమాల ద్వారాను, ఆకాశవాణి ద్వారాను ప్రచారం విరివిగా కొనసాగించారు. 5 లక్షల ప్రతుల కరపత్రాలను పంచిపెట్టారు.

మూడో పంచవర్ష ప్రణాళికలో ఈ కార్యక్రమాలకు 50 కోట్ల రూపాయలను కేటాయించడం జరిగింది. 1960-65 మధ్యకాలంలో కుటుంబనియంత్రణ చికిత్స కేంద్రాల సంఖ్య 8,200 కు మించి ఉంటుందని అంచనా. కుటుంబ నియంత్రణా పద్ధతులలో ట్యూబెక్టమీ (స్త్రీలకు చేసే ఆపరేషన్), వేసక్టమీ (పురుషులకు చేసే ఆపరేషన్)లు శాశ్వతమైనవి, నమ్మదగినవి. లూప్, నురుగు బిళ్ళలు, రబ్బరు పరికరాలు మొదలైనవి కుటుంబ నియంత్రణకు మరికొన్ని సాధనాలు. కానీ ఇవి తాత్కాలిక ఉపయోగానికే పనికివస్తాయి. అంతగా నమ్మదగినవి కూడా కాదు. మొదటి రెండు శస్త్రచికిత్సలు ముఖ్యంగా వేసక్టమీ ఎక్కువ ప్రజాదరణ పొందింది. ఇద్దరు లేదా ముగ్గురు పిల్లలు ఉంటే చాలనీ, ఆ పైన పరిమితం చేసుకోవాలనీ ప్రచారం చేయడం జరిగింది.

మొదటి పంచవర్ష ప్రణాళికలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ 592 బాలల సంక్షేమ సంస్థలకు, 667 స్త్రీ సంక్షేమ సంస్థలకు, 150 అశక్తుల సంక్షేమ సంస్థలకు, 765 సారస్వత సంక్షేమ కార్యక్రమాలకు మొత్తం 2,174 స్వచ్ఛంద సేవా సంస్థలకు సహాయం అందజేయబడింది. స్త్రీలు, బాలల సంక్షేమ విషయమై కేంద్ర సంస్థ గ్రామీణ ప్రాంతాలలో విస్తృత పథకాలను ప్రవేశపెట్టింది.

రెండో పంచవర్ష ప్రణాళికలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ స్త్రీల, బాలల, అశక్తుల సంక్షేమ సేవలో నిమగ్నమైన 3,214 స్వచ్ఛంద సేవా సంస్థలకు 2.95 కోట్ల రూపాయలు గ్రాంట్ల సహాయాన్ని అంద

జేయటం జరిగింది. పట్టణ ప్రాంతాలలోని మధ్యతరగతి కుటుంబాల స్త్రీలకు ఆదాయాన్ని సమకూర్చిపెట్టే అనేక కార్యక్రమాలను ప్రవేశపెట్టి వాటి కోసం 0.58 కోట్లు ఖర్చు పెట్టింది. అంతేకాకుండా ప్రభుత్వాం సామాజిక, నైతిక, ఆరోగ్య, ఆత్మసంరక్షణ, ఉద్యోగుల శిక్షణ, అశక్తులైన అంధుల సంక్షేమం, చెవిటి వారి సంక్షేమం, యువజన సంక్షేమం బాలనేరస్తుల, భిక్షుకుల సంక్షేమం మొదలైన అనేక పథకాలను నెలకొల్పి వివిధ కార్యక్రమాలను జయప్రదంగా నిర్వహించడం జరిగింది. ఈ విధంగా కుటుంబంలోగల సమస్యాపూరిత వ్యక్తులకు సంక్షేమ కార్యక్రమాలను ఏర్పరచి పరోక్షంగా కుటుంబ సంక్షేమ సేవలను అందజేయడం జరిగింది.

మూడో పంచవర్ష ప్రణాళిక పూర్తయ్యేనాటికి కేంద్ర, రాష్ట్ర, సాంఘిక సంక్షేమ సంస్థలు 6000 స్వచ్ఛంద సేవాసంస్థలకు ముఖ్యంగా స్త్రీల, బాలల, అశక్తుల సంక్షేమ కార్యక్రమాలకు గ్రాంట్‌ల సహాయాన్ని అందజేయడం జరిగింది.

మొదటి వార్షిక ప్రణాళికలో (1966-67) కుటుంబం, బాలల సంక్షేమ విషయాలలో ఒక మిశ్రమ కార్యక్రమాన్ని అప్పట్లో ఉన్న సంక్షేమ సేవలను పునర్‌వ్యవస్థీకరించిన కేంద్రాలలో ప్రవేశపెట్టడానికి తగినటువంటి మార్గాలను చేపట్టడం జరిగింది. రెండో వార్షిక ప్రణాళికలో (1967-68) కేంద్రం అత్యధికంగా కుటుంబం, బాలల సంక్షేమ ప్రాజక్టుల, తదితర సంక్షేమ విస్తరణ ప్రాజక్టుల కొనసాగింపుకు మొత్తం 61.80 లక్షల రూపాయలు ఖర్చుపెట్టడం జరిగింది. దీనివల్ల సాంఘిక సంక్షేమ రంగంలో కుటుంబ, బాలల సంక్షేమ ప్రాజెక్టుల విస్తరణ కార్యక్రమాలకింద ఏర్పడి గ్రామీణ ప్రాంతాల స్త్రీల, బాలల సంక్షేమ విస్తరణకు దారితీసింది. మూడో వార్షిక ప్రణాళికలో కుటుంబ, బాలల సంక్షేమ ప్రాజెక్టులు, తదితర సంక్షేమ విస్తరణ ప్రాజెక్టుల కొనసాగింపుకు 81 లక్షల రూపాయలు ఖర్చుచేయడం జరిగింది.

నాల్గో పంచవర్ష ప్రణాళికలో (1969–74) కుటుంబ బాలల సంక్షేమార్థమై 7 కోట్ల రూపాయలు కేటాయించారు. కేంద్రం గ్రామీణ ప్రాంతాల్లోని కుటుంబ, బాలల సంక్షేమాన్ని ప్రధానంగా భావించి వచ్చే ఐదు సంవత్సరాల కాలపరిమితిలో 181 బాలల సంక్షేమ ప్రాజక్టులను స్థాపించాలని సంకల్పించడం జరిగింది. కుటుంబ, శిశు సంక్షేమానికి 13 కోట్ల రూపాయలు వ్యయం చేయడం జరిగింది. 95 కోట్ల రూపాయలు కుటుంబ నియంత్రణా కార్యక్రమాలను వ్యయం చేయబడింది.

ఐదో పంచవర్ష ప్రణాళికలో (1974–79) కుటుంబ సంక్షేమ ప్రణాళికలకై 516 కోట్ల రూపాయలు కేటాయించడం జరిగింది. మొదటి మూడు సంవత్సరాలలో 237.65 కోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేశారు. 1977–79 సంవత్సరాల కాలంలో 259.71 కోట్ల రూపాయలు కుటుంబ సంక్షేమ కార్యక్రమాలకు కేటాయించడానికి సిఫారసు చేయడం జరిగింది. 288 నూతన గ్రామీణ కుటుంబ సంక్షేమ ప్రణాళికా కేంద్రాలు తెరువబడ్డాయి. అంతేకాక 65,827 కుటుంబాలు పునర్వ్యవస్థీకరించబడి, స్థిరపరచబడ్డాయి. దీనికోసం 47.62 కోట్ల రూపాయలు ఖర్చు చేయడం జరిగింది. అంతేకాక 35,767 కుటుంబాలు కొత్తగా స్థిరపరచబడ్డాయి.

ఆరో పంచవర్ష ప్రణాళికలో కుటుంబం, శిశు సంక్షేమానికి, శిశు గృహాలు, బాల్వాడీలు మొదలైనవి ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో ఏర్పాటు చేయడం జరిగింది.

## స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు

భారతదేశ సంస్కృతి అతి పురాతనమైంది. కొన్ని శతాబ్దాల నుంచి కూడా మన దేశ సంస్కృతి గొప్ప స్థానాన్ని పొందింది. అదే విధంగా భారతదేశ స్త్రీకి కూడా వేదకాలంలో భారతదేశ స్త్రీ గృహంలోను, సమాజంలోను కూడా అత్యంత ఉన్నతమైన హోదాను,

అంతస్తును పొందిఉండేది. చాలామంది స్త్రీలు కవయిత్రులు, గణిత శాస్త్రజ్ఞులు, మహావీరులుగా కూడా అంతర్జాతీయ ప్రఖ్యాతిని పొందారు. ఆ కాలంలో స్త్రీకి వివాహం యుక్తవయసు వచ్చాక మాత్రమే జరిగేది. అంతేకాక స్త్రీ తన వరుని తానే నిర్ణయించుకునే స్వేచ్ఛను కూడా పొందిఉండేది. "స్వయంవరం" అనే పద్ధతిలో స్త్రీ తనకు నచ్చిన వరుని తానే నిర్ణయించుకోవడం జరిగేది. మత, సాంఘిక సంబంధమైన ఉత్సవాలలో కూడా స్త్రీ చురుకుగా పాల్గొని ప్రధమ పాత్ర వహించడం జరిగేది. భార్య లేకుండా పురుషుడు ఏ మత సంబంధమైన కార్యాలను చేయడానికీ అనర్హుడు అని నిర్ణయించబడింది. ఈవిధంగా తరచిచూస్తే ఆకాలంలో స్త్రీ సమాజంలో అత్యున్నతమైన ప్రతిపత్తిని, అంతస్తును కలిగిఉండేదని తెలుస్తున్నది.

స్త్రీ మానవజాతి అభివృద్ధికి మూలాధారం, హిందూ సంస్కృతి స్త్రీకి అత్యున్నతమైన ప్రాముఖ్యత నిచ్చింది. స్త్రీ ఓర్మి శాంతం, ప్రేమాభిమానాలు, దయ, జాలి మొదలైన లక్షణాల కలయికగా పేర్కొనడం జరిగింది. భారతదేశంలో స్త్రీకి అంతటి విలువఉన్నది. కాబట్టే భారతదేశంలో స్త్రీని "భారతదేశ మాత" (Mother of India) అని అంటారు. స్త్రీని గురించి స్వర్గీయ పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఈవిధంగా అన్నారు. "ప్రజాబాహుళ్యాన్ని మేల్కొల్పాలంటే ముఖ్యంగా స్త్రీని మేల్కొల్పాలి, కుటుంబం, గ్రామం, దేశం అభివృద్ధి స్త్రీ అభివృద్ధిపై ఆధారపడిఉంది. దేశాన్ని విద్యావ్యాప్తం గల దేశంగా చేయాలంటే స్త్రీని విద్యాధికురాలిని చేయాలి.

## భారతదేశంలో స్త్రీ సమస్యలు

కుటుంబంలోను, సమాజంలోను స్త్రీలకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. భారతదేశంలో స్త్రీలు గత కాలంలో అనేక సాంఘిక, న్యాయ సమ్మతమైన అశక్తతలకులోనై ఎన్నో అగచాట్లకు గురైనారు. వైదిక కాలంనుంచి, బ్రిటిష్ పాలనవరకు భారత స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కరువై సమాజంలో పుట్టింది మొదలు యుక్తవయసు వచ్చేవరకు తల్లి

దండ్రులచేత, యౌవనదశలో భర్తచేత, వయసుమళ్ళిన తరువాత కుమారులచేత పరిరక్షితురాలై సమాజంలోని ఆచార వ్యవహారాలకు కట్టుబడి తన వ్యక్తిత్వాన్ని కోల్పోవడం జరిగింది. బ్రిటిష్ వారి పరిపాలనవల్ల సమాజంలో నూతన పరిస్థితులు ఆవిర్భవించాయి. క్రమక్రమంగా సమాజంలో కలిగిన సాంఘిక, ఆర్థిక, రాజకీయ మార్పుల వల్ల స్త్రీ తన ప్రతిపత్తిని కోల్పోవడం జరిగింది. పరదా పద్ధతి, సతీ సహగమనం, బాల్యవివాహాలు, బహుభార్యాత్వం మొదలైన సనాతన దురాచారాలవల్ల స్త్రీ తన గృహంలోను, సమాజంలోను కూడా అంతస్తును, గౌరవాన్ని కోల్పోయింది. రాజారామ్‌మోహనరాయ్, దయానంద సరస్వతి, వివేకానందస్వామి మొదలైన సంఘ సంస్కర్తలు సంఘ సంస్కరణోద్యమాన్ని ప్రారంభించి సతీ సహగమనము, వితంతు పునర్వివాహ నిషేధం, స్త్రీ విద్యా నిషేధం, మొదలైన సాంఘిక సమస్యలు నిర్మూలనానికి కృషి చేశారు.

భారతదేశం మొత్తం జనాభాలో స్త్రీల జనాభా 50 శాతం ఆక్రమించివుంది. స్త్రీ పాత్ర కుటుంబంలోను, సమాజంలోను కూడా చాలా కీలకమయినదయినప్పటికీ స్త్రీ అనేక సాంఘిక, న్యాయ సమ్మతమైన అశక్తతలకు లోనవుతున్నది. 10 కోట్ల స్త్రీ జనాభావున్న మన దేశంలో స్త్రీ అవసరాలను తీర్చడానికి, అశక్తతలను తొలగించడానికి ప్రయత్నించినట్లయితే ఎటువంటి సంక్షేమ కార్యక్రమాలు, ప్రణాళికలు అయినప్పటికీ అసంపూర్ణమైనవనే చెప్పవచ్చు. మొదటి రెండు పంచవర్ష ప్రణాళికలు కూడా స్త్రీ. బాలల సంక్షేమ సేవలపట్ల ప్రాముఖ్యత చూపటం జరిగింది. దేశంలో స్త్రీ విద్య, ఆరోగ్య, సాంఘిక, ఆర్థిక, అవకాశాలలో అభివృద్ధి చెందడంవల్ల ఈ నాడు స్త్రీ అత్యున్నతమైన పాత్రనుపొంది ఉన్నది. కనుక స్త్రీలను బలహీనవర్గాలకు చెందినవారిగా పరిగణించి అశ్రద్ధ చేయడం ఎంతమాత్రం సమంజసం కాదు. స్త్రీలు సమస్యలకు ముఖ్యమైన కారణాలు నిరక్షరాస్యత, ఆర్థికంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లేకపోవడం, సాంఘిక జీవనంలో కట్టుబాట్లు మొదలై

నవి. ఈ కారణాలవల్లనే స్త్రీ సమాజంలో పురుషునితోబాటు సరి సమానమైన ప్రతిపత్తిని పొందలేకపోతున్నది.

1917 వ సంవత్సరంలో మొట్టమొదటిసారిగా "మార్గరేట్ కజిన్స్ సతి" మద్రాసు నగరంలో అఖిలభారత మహిళా సంఘాన్ని నెల కొల్పడం జరిగింది. ఈ మహిళా సంఘానికి నాయకురాలు శ్రీమతి అనిబెసెంట్ గాంధీమహాత్మునికి కూడా భారతదేశ స్త్రీలపైన అత్యంత గౌరవం ఉండటంవల్ల ఈ అఖిలభారత మహిళా సంఘాన్ని బలపరచాడు. స్వాతంత్ర్యరంగంలో చాలామంది స్త్రీలు ప్రముఖపాత్ర వహించారు.

స్త్రీలకు సమాజంలో పురుషునితోపాటు సరిసమానమైన హక్కు లను, ప్రతిపత్తిని సంపాదించడానికి అనేకమంది మహానుభావులు అనేక విధాలుగా కృషిచేశారు. వీరిలో రాజారామ్ మోహన్‌రాయ్ ప్రప్రథముడు. స్త్రీ, పురుషులనే తారతమ్యం లేకుండా ప్రతీవ్యక్తి సమా జంలో సరిసమానమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కలిగిఉండాలని ఈయన అభిప్రాయం. ఈయన తన అన్నగారి భార్య సతీసహగమనం చేసినపుడు చూసి, చలించి అప్పటినుండి ఈ దురాచారాన్ని తొలగించడానికి తీవ్ర మైన కృషిచేశాడు. ఈ కృషి ఫలితంగా 1827 లో లార్డ్ విలియం బెంటింక్ కాలంలో సతీ సహగమనం న్యాయసమ్మతం కాదని నిర్ణ యించడం జరిగిది. ఈవిధంగా రాజారామ్ మోహనరాయ్ సతీ సహగమనాన్ని అరికట్టాడు.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ స్త్రీలు వితంతువులుగా జీవితాంతం మగ్గిపోకుండా వితంతు పునర్వివాహచట్టాన్ని ప్రవేశపెట్టి స్త్రీలను సంరక్షించాడు. అంతేకాక స్త్రీ విద్యకై తీవ్రమైన కృషి చేశాడు. విద్యవల్ల స్త్రీకి సాంఘిక, రాజకీయ, ఆర్థిక ప్రతిపత్తి పొందుతుందని ఈయన ప్రగాఢ విశ్వాసం. జస్టిస్ రానడే కూడా ఈశ్వరచంద్ర విద్యా సాగర్‌ను బలపరుస్తూ స్త్రీ విద్యాభివృద్ధికి కృషిచేశాడు. అంతేకాక బాల్య వివాహాలను అరికట్టడం వితంతు పునర్వివాహాన్ని ప్రోత్సా హించడానికి ప్రజలకు బోధనలు చేశాడు. 1887 వ సంవత్సరంలో

జాతీయ సాంఘిక సభను (National Social Conference) నెలకొల్పారు. దీనిలో రానడే పలుకుబడిగల సభ్యుడుగా గుర్తించబడటమే కాక అతడు చాలా చురుకుగా పాల్గొన్నాడు. ఈ సభలో ప్రత్యేకంగా స్త్రీలకు సంబంధించిన అనేక విషయాలను గురించి చర్చించారు. రానడే సతీమణి అయిన శ్రీమతి రమాబాయి కూడా స్త్రీ సంక్షేమానికి చాలా కృషి చేశారు. 1919 వ సంవత్సరంలో ఈమె స్త్రీ సంక్షేమానికి పూనాలో సేవాసదన్‌ను ఏర్పరచారు. ఈ సంస్థ ఇప్పటికీ కూడా సంక్షేమ కార్యక్రమాలను నిర్వహిస్తూ గణనీయమైన సేవ చేస్తున్నది. విద్య, సంస్కృతి, సాంఘిక సంక్షేమం, సాంఘిక, ఆర్థిక కార్యక్రమాలు మొదలైనవి స్త్రీలకు అందుబాటులోకి తేవడమే ఈ సదనం ముఖ్యోద్దేశం. క్రమక్రమంగా స్త్రీలలో కొంత అభివృద్ధి కనిపించ నారంభించింది. ఈవిధంగా అభివృద్ధిచెందిన భారతదేశ స్త్రీలలో మొట్టమొదటి మహిళ డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డి. ఈమె 1912 లో M.B.C.B. అనే పరీక్షలో కృతార్థురాలైనారు. ఈమె మద్రాస్‌లో మొట్టమొదటి స్త్రీ వైద్యురాలేకాక మొట్టమొదటి లెజిస్లేటివ్ మహిళా సభ్యురాలు, మహిళా స్పీకర్. అంతేకాక ఈమె మహిళల, బాలల ఆరోగ్యాభివృద్ధికోసం పాఠశాలలలోను, వైద్యాలయాలలోను, అనేక సౌకర్యాలను కూడా ఏర్పాటుచేశారు. ఈమె కృషిఫలితంగానే హిందూ దేవాలయాలలో దేవదాసీ పద్ధతి రద్దుఅయింది. ఈమె ఒక సంరక్షణా గృహాన్ని నెలకొల్పి అనేకవేల అనాథలకు, పతితంపుడులకు విద్యా సౌకర్యాలను, శిక్షణా కార్యక్రమాలను, పునరావాస సౌకర్యాలను ఏర్పాటుచేసింది.

1920 వ సంవత్సరంలో మహాత్మాగాంధీ రాజకీయ రంగంలోకి ప్రవేశించిన తరువాత స్త్రీలు అన్ని రంగాలలోను తమ శక్తి సామర్థ్యాలను ఉపయోగించుకోడానికి, అభివృద్ధి సాధించడానికి, ప్రయోజనకరమైన పౌరులుగా రూపొందడానికి వీరికి అనేక అవకాశాలను కలుగజేశారు. ఆ కాలంలో స్త్రీలు మొట్టమొదటిసారిగా తాముకూడా దేశం కోసం కృషి చేయగలరని గుర్తించడం జరిగింది. మహిళలకు సమాజంలో

ఒక విధమైన నైతిక విలువలు, పురుషుడికి మరొక విధమైన నైతిక విలువలు (Double standard of moratity) కాక అందరూ ఒకే విధమైన నైతిక విలువలకు కట్టుబడి ఉండాలని మహాత్మాగాంధీ వాదించాడు. ఆడపిల్లలను, మగపిల్లలను కూడా తలిదండ్రులు సరిసమానంగా పెంచాలని ఈయన భావన. స్వాతంత్ర్యానంతరం 1950 వ సంవత్సరం తరువాత భారత రాజ్యాంగంలో స్త్రీ, పురుషులకు సరిసమానమైన హక్కులు నిర్ణయించబడ్డాయి. 1950–55, 1956 సంవత్సరాలలో హిందూ కోడ్‌లో ప్రవేశపెట్టిన శాసనాలన్నీ సమాజంలో స్త్రీల ప్రతిపత్తిని బలపరచాయి. దీని ఫలితంగా స్త్రీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో అద్వితీయమైన పాత్ర వహించే అవకాశం లభించింది.

1929 వ సంవత్సరంలో బాల్యవివాహాల నిరోధక చట్టం ప్రవేశపెట్టబడింది. ఈ చట్టం ప్రకారం వివాహం నాటికి వరునికి 18 సంవత్సరాలు, వధువుకు 15 సంవత్సరాలలోపు వయసు ఉండరాదు. అంతేకాక 1954 లో ప్రత్యేక వివాహచట్టం, 1955 లో హిందూ వివాహ చట్టం, విడాకుల చట్టం. 1956 లో హిందూ వారసత్వ చట్టం, హిందూ సంరక్షక చట్టం, 1961 లో వరకట్న నిషేధ చట్టం మొదలైనవి ప్రవేశపెట్టడం జరిగింది. ఈ శాసనాలన్నీ కూడా సమాజంలో స్త్రీకి కూడా పురుషునితోపాటు సరిసమానమైన స్థానం కల్పించడానికి ఏర్పాటు చేసినవి.

స్త్రీ సంక్షేమ సేవలు, స్త్రీ సంక్షేమానికి కృషిచేసే సంస్థలు, సాంఘిక ఆర్థిక కార్యక్రమాలు :-

సంక్షేమ విస్తృత ప్రాజెక్టులు, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ, సాంఘిక, నైతిక, ఆరోగ్య కార్యక్రమాలు, ప్రసూతి, శిశు సంక్షేమ కార్యక్రమాలు మొదలైనవి స్త్రీ సంక్షేమ సేవలకు ఎక్కువ బాధ్యతను వహించాయి. పంచవర్ష ప్రణాళికలలో ప్రవేశపెట్టిన ఆర్థికాభివృద్ధి పథకాలవల్ల స్త్రీలకు కూడా ఉద్యోగావకాశాలు లభించడం జరిగింది. అయినా అనేక అశక్తతలవల్ల స్త్రీలు ఉద్యోగావకాశాలను పొందలేక పోతున్నారు. స్త్రీలలో ఈ అశక్తతలను తొలగించడంవల్ల చాలామంది

స్త్రీలను అభివృద్ధి పరచవచ్చు. ఈ అశక్తతలను తొలగించడానికి అనేక శిక్షణా కేంద్రాలు ఏర్పాటుచేసి పారిశ్రామిక, వ్యాపార, ఉద్యోగాలకు కావలసిన శిక్షణ నివ్వాలి. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ అనేకమంది స్త్రీలకు ఉద్యోగావకాశాలను కలుగజేస్తున్నది. స్వచ్ఛంద సేవా సంస్థలు నడిపే సాంఘిక సంక్షేమ సంస్థలలో గల స్త్రీలకు వారి ఆవశ్యకతను, ఆసక్తినిబట్టి వారికి శిక్షణనిచ్చి ఆర్థిక సంరక్షణను కలుగజేస్తున్నాయి.

## సంక్షిప్త విద్యాకోర్సులు

చాలామంది స్త్రీలు తమ జీవనోపాధిని తామే సంపాదించుకో వలసిన పరిస్థితులలో ఉంటారు. కానీ అటువంటి అవసరంగల ప్రతీ ఒక్కరూ ఉద్యోగార్హత పొందడంలేదు. అంతేకాక మహిళలకు, బాల బాలికలకు ఏర్పాటు చేసిన విద్య, ఆరోగ్య సంక్షేమ కార్యక్రమాలకు అనుభవంగల స్త్రీలను నియమించవలసిన ఆవశ్యకత ఏర్పడుతోంది. కానీ కనీస విద్యార్హతగల స్త్రీలు లభించడం లేదు. కనుక స్త్రీలకు కనీస విద్యార్హతను కలుగజేయడానికి కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ సంక్షిప్త విద్యా కోర్సులు, శిక్షణా కేంద్రాలు ఏర్పాటు చేసింది. ఈ అవ కాశం వల్ల స్త్రీలు రెండు లేదా మూడు సంవత్సరాలలో కనీస విద్యా ర్హతను పొందగలుగుతున్నారు. దీనిద్వారా వీరు ప్రాథమిక పాఠశాల లలో ఉపాధ్యాయులు, గ్రామసేవికలు, మంత్రసానులు, ఆయాలు మొదలైన ఉద్యోగార్హతలను పొందగలుగుతున్నారు.

ఈ పథకంవల్ల 20-35 సంవత్సరాల మధ్య వయస్సుగల అధిక సంఖ్యాక స్త్రీలు మాధ్యమిక లేదా ఉన్నత పాఠశాల పరీక్షలకు హాజరు కాగలుగుతున్నారు. ఈ సంక్షిప్త విద్యా కోర్సులో చేరాలంటే ఈ కింది అర్హతలను పొంది ఉండాలి.

1. సంక్షిప్త విద్యా కోర్సులను నడిపే యూనిట్లు ఒకే సమయంలో కనీసం 25 మంది విద్యార్థులకు వసతినీయగలిగిందిగా ఉండాలి. రెండు పూర్తి సంవత్సరాలలో కనీస విద్యార్హతను సంపాదించుకోగలిగేలా ఉండాలి.

2. ఈ కోర్సులో చేరడానికి 25-30 సంవత్సరాల మధ్య వయస్సు ఉండాలి.
3. ఉన్నత పాఠశాల పరీక్షకు హాజరుకావాలంటే 4 లేదా 5 వ తరగతి గానీ, మాధ్యమిక పాఠశాల పరీక్షకు హాజరుకావాలంటే 3 లేదా 4 వ తరగతిగానీ చదివి ఉండాలి.
4. ఆర్థిక అత్యవసర పరిస్థితులలో ఉన్నవారు, ఆర్థికంగా ఒకరిమీద ఆధారపడి జీవిస్తున్నవారు, వెంటనే ఉద్యోగాన్ని చేపట్టడానికి తయారుగా ఉన్నవారికి ఈ కోర్సులో చేరడానికి ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు.
5. గ్రామీణ ప్రాంతాలనుండి వచ్చే స్త్రీలకు ఎక్కువ ప్రాముఖ్యత నిస్తారు.

పంచవర్ష ప్రణాళికలలో స్త్రీ సంక్షేమ సేవల ప్రాముఖ్యతను గుర్తించి పెద్ద మొత్తాలలో గ్రాంటులను కేటాయించడం జరుగుతుంది. కేంద్ర ఆరోగ్య మంత్రిత్వశాఖ కుటుంబ నియంత్రణా పథకాలను దేశమంతటా ప్రవేశపెట్టి జనాభా పెరుగుదలను అరికట్టడమేకాక స్త్రీల ఆరోగ్యాన్ని సంరక్షించి ఆయుః ప్రమాణాలను, ఆరోగ్యాన్ని పెంచడానికి దోహదంచేస్తుంది. స్త్రీ సంక్షేమార్థమై స్త్రీలకు ఈ కింద పేర్కొన్న సేవలను ఏర్పాటుచేయడం జరుగుతుంది.

1. సాంఘిక, ఆర్థిక, సంక్షేమ కార్యక్రమాలు, వికలాంగులు, అశక్తత చెందిన స్త్రీలకు ప్రత్యేక సంక్షేమ సేవలు.
2. ఉద్యోగాలు చేస్తున్న మహిళలకు వసతి సౌకర్యాన్ని ఏర్పాటు చేయడం.
3. మహిళలందరూ ఒకచోట సమావేశమై మహిళా మండలులను ఏర్పాటుచేసుకుని వినోద, విజ్ఞాన, సాంస్కృతిక కార్యక్రమాలను జరుపుకోవడంలో సహాయంచేయడం.
4. వసతి, సంరక్షణ కలుగజేసే స్వచ్ఛంద సంక్షేమ సంస్థలు దిక్కులేని స్త్రీలకు వసతి సౌకర్యాలను కల్పించడం.

5. మహిళలకు వారసత్వ హక్కు, ఆస్తి హక్కు, విడాకులు మొదలైన వ్యవహారాలను చూడటానికి న్యాయసహాయం అందజేయడం.
6. మహిళలకు సాంఘిక విద్యా కేంద్రాలు ఏర్పరచడం, నిరక్షరాస్యులైన మహిళలకు కనీసం ఉత్తరాలు చదువుకోగలిగే స్థాయివరకూ విద్య నేర్పడం, పౌరసత్వానికి సంబంధించిన శిక్షణ ఇవ్వడం, సాంఘిక జీవనంలో సర్దుబాటు చేసుకోవడానికి సహాయంచేయడం.

కొన్ని శతాబ్దాలనుండి భారతదేశంలో ఆడపిల్లల విద్యపట్ల అశ్రద్ధవహించడం జరిగింది. 1959 వ సంవత్సరంలో 'నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఉమన్స్ ఎడ్యుకేషన్'ని (National Council of women's education) కేంద్ర ప్రభుత్వం స్థాపించింది. ఈ సంస్థ బాలికల, స్త్రీల విద్యాభివృద్ధికి అనేక పథకాలను తయారుచేయడం జరిగింది. అంతేకాక మహిళల, బాలల విద్యాపథకాలు సంతృప్తికరంగా ఆర్థిక సహాయాన్ని పొందే బాధ్యతను కూడా ఈ సంస్థ చేపట్టింది.

రెండు, మూడో పంచవర్ష ప్రణాళికలలో స్త్రీ విద్యాభివృద్ధికై ప్రత్యేక విద్యా పథకాలను ఏర్పాటు చేయడం జరిగింది. అంతేకాక అనేక రకాలైన స్కాలర్‌షిప్‌లను కూడా మంజూరు చేయడం జరిగింది. అనేక బాలికల పాఠశాలలను నిర్మించి ఆ పాఠశాలలకు గృహవసతి సౌకర్యాలను ఏర్పాటుచేయడమేకాక గ్రామీణ పాఠశాలలలో పనిచేసే మహిళా ఉపాధ్యాయులకు గృహవసతి సౌకర్యాలలకు ఏర్పరచడంకూడా జరిగింది. బాలికలకు, మహిళలకు ఉచిత విద్యా సౌకర్యాలను కూడా ప్రభుత్వం ప్రవేశపెట్టింది.

## స్త్రీ సంక్షేమ సేవా సంస్థలు

స్త్రీ సంక్షేమ సేవా సంస్థలు రెండు రకాలు.

1. చిన్నచిన్న ప్రాంతీయ సంస్థలు. ఇవి అనాథ గృహాలు, వితంతు గృహాలు మొదలైనవి. ఇవి ఆ ప్రత్యేక సమస్యలుగల స్త్రీలకు సంక్షేమ సేవా బాధ్యతను ప్రత్యక్షంగా వహిస్తాయి.
2. విస్తృత ప్రాంతాలలో కృషి చేసే సంస్థలు. ఇవి ముఖ్యంగా స్త్రీల అభివృద్ధి పథకాలను ప్రజలందరికీ తెలియజేస్తాయి. అంతేకాక అనేక

స్త్రీ సంక్షేమ సంస్థలను కూడా నిర్వహిస్తాయి. ప్రాంతీయ సంక్షేమ సేవా సంస్థలలో ఆర్థిక సహాయం కూడా చేస్తారు. ఇటువంటి సంస్థలలో ముఖ్యంగా చెప్పుకోదగినవి —

1. ఆల్ ఇండియా ఉమన్స్ కాన్ఫరెన్స
(All India Women's Conference)
2. నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఉమన్ ఇన్ ఇండియా
(National Council of Woman in India)
3. అసోసియేషన్ ఫర్ మోరల్ అండ్ సోషల్ హైజిన్ ఇన్ ఇండియా
(Association for Moral and Social Hygiene in India)
4. యంగ్ ఉమన్స్ క్రిస్టియన్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా
(Young Women's Christian Association of India)
5. కస్తూర్బా గాంధీ నేషనల్ మెమోరియల్ ట్రస్ట్
(Kasthurbha Gandhi National Memorial Trust)

మొదలైనవి.

## నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఉమన్స్ కాన్ఫరెన్స

1925 లో స్థాపించడం జరిగింది. దీని ముఖ్యోద్దేశ మేమంటే —

1. భారతదేశంలో గల అన్ని జాతుల, మతాలకు చెందిన స్త్రీలను సమన్వయ పరచడం.
2. భారతదేశ స్త్రీలను, శిశువులను, సాంఘిక, పౌర, నైతిక, విద్యా రంగాలలో అభివృద్ధి పరచడం.
3. దేశాలలోగల జాతీయ, ప్రాంతీయ వ్యవస్థల మధ్య సమన్వయాన్ని పెంపొందించడం.

1955 నాటికి ఈ కౌన్సిల్‌లో 12 విభాగాలున్నాయి. అసోసియేషన్ ఫర్ మోరల్ అండ్ సోషల్ హైజిన్ ఇన్ ఇండియా, భారత్ స్కౌట్ అండ్ గైడ్స్ ట్రైన్డ్ నర్సెస్ అసోసియేషన్ మొదలగు వాటితో ఈ నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఉమన్స్ కాన్ఫరెన్స చేరడం జరిగింది. దీని కేంద్ర కార్యాలయం ఢిల్లీలో ఉంది.

## ఆల్ ఇండియా ఉమన్స్ కాన్ఫరెన్స్

ఆల్ ఇండియా ఉమన్స్ కాన్ఫరెన్స్ 1929 లో స్థాపించబడింది. దీని ముఖ్యోద్దేశం స్త్రీల, శిశువుల సంక్షేమ సేవలను ఏర్పాటుచేయడం. ఇది సంవత్సరాని కొకసారి సమావేశ మవుతుంది. ఈ సంస్థ ప్రసూతి గృహాలు, నర్సరీ పాఠశాలలు, పాలకేంద్రాలు, సహకార సంఘాలు నిర్వహిస్తున్నది. 1955 నాటికి ఈ కాన్ఫరెన్స్ దేశం మొత్తంమీద 36 ప్రధాన శాఖలు, 200 సహాయక శాఖలు కలిగిఉన్నది.

## యంగ్ ఉమన్స్ క్రిష్టియన్ ఆసోసియేషన్

ఈ సంస్థ 1905 లో స్థాపించబడంది. ఇది స్త్రీలకు, బాలికలకు సంక్షేమ కార్యక్రమాలను ఏర్పరచడం, విద్యా సౌకర్యాలను కలుగ జేయడం మొదలైన కార్యక్రమాలను చేపట్టింది.

## కస్తూర్బా గాంధీ మెమోరియల్ ట్రస్ట్

ఈ సంస్థను 1945 లో స్థాపించడం జరిగింది. దీని ముఖ్యోద్దేశం—

1. భారతదేశంలో గల స్త్రీల, శిశువుల సంక్షేమార్థమై అనేక సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించడం.
2. వారికి అనేక సంక్షేమ సంస్థలను స్థాపించడం.
3. గ్రామీణ స్త్రీలకు శిక్షణా కార్యక్రమాలను ఏర్పరచడం.

ఈ సంస్థ తన ఆశయ సిద్ధికి గ్రామాలలో అనేక శిక్షణా కేంద్రాలను ఏర్పరచి స్త్రీలను గ్రామ సేవికలుగా తయారుచేస్తున్నది. అనేక గ్రామీణ సంక్షేమ కేంద్రాలను స్థాపించింది. శిశు గృహాలు, విద్యా కేంద్రాలు, ప్రసూతి గృహాలు మొదలైన సంస్థలను నడుపుచున్నది. ఈవిధంగా ఈ సంస్థలు స్త్రీ సంక్షేమానికి అనేక విధాలైన సేవలు అందించడం జరుగుతున్నది.

ఉద్యోగాలలో స్త్రీలకు ప్రత్యేక సంరక్షణా చర్యలు ప్రవేశ పెట్టడం కూడా జరిగింది. 1960 వ సంవత్సరంలో 3.7 లక్షల స్త్రీలు కర్మాగార ఉద్యోగాలల్లో నియమితులైనారు. 1948 కర్మాగార చట్టంలో స్త్రీ కార్మికుల పిల్లలకు శిశు గృహాలు తెరిచారు.

6 సంవత్సరాల లోపు వయసుగల పిల్లలను స్త్రీలు తమతోబాటు కర్మాగారానికి తీసుకుని వెళ్ళి ఈ శిశు గృహాలలో ఉంచవచ్చు. అంతేకాక ప్రసూతి సౌకర్యాలను కూడా ఏర్పాటుచేయడం జరిగింది. 1941 గనుల ప్రసూతి సౌకర్య చట్టం, 1948 కార్మిక భీమాచట్టం, 1951 ప్లాంటేషన్ కార్మిక చట్టం మొదలైన శాసనాలన్నీ కూడా స్త్రీ సంక్షేమానికై ప్రత్యేక అంశాలను కలిగిఉన్నవి. భారతదేశంలో సాంఘిక సేవలు, సాంఘిక సంక్షేమ సేవల అభివృద్ధికి స్వచ్ఛంద సంక్షేమ సంస్థలు తమవంతు సేవలను నిర్వహిస్తున్నవి. సంక్షేమ శాసనాలను ప్రవేశపెట్టడం, పాఠశాలలను స్థాపించడం, అనాథాశ్రమాలను, సేవా సదనాలను, వితంతు గృహాలను స్థాపించడం మొదలైన కార్యక్రమాలన్నీ అధికంగా స్వచ్ఛంద సేవా సంస్థలు, సంఘ సంక్షేమ సేవకుల ద్వారానే జరిగేవి.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారత దేశంలో స్త్రీ సంక్షేమానికై నలువైపుల నుంచి కృషి జరిగింది. భారత రాజ్యాంగం ప్రకారం భారతదేశం ప్రజాసామ్య ప్రభుత్వమని ప్రకటించారు. న్యాయం, సమానత, స్వేచ్ఛ, సౌభ్రాత్వం మొదలైన సూత్రాలపైన ప్రజాసామ్య ప్రభుత్వం ఆధారపడి ఉంటుందని తెలియజేశారు. రాజ్యాంగంలోగల 15 ప్రకరణ ప్రకారం స్త్రీ, పురుషులకు సరిసమానమైన హక్కులను, అవకాశాలను కలుగజేయడం జరిగింది. ప్రభుత్వం స్త్రీలకు అదనంగా మరికొన్ని ప్రత్యేక కార్యక్రమాలను ఏర్పరచింది. రాజ్యాంగంలో ప్రకటనలు 14, 15, 16 ప్రకారం స్త్రీ పురుష భేదాలు లేకుండా సమాజంలోగల ప్రతీ పౌరుడు, పౌరురాలు అన్ని హక్కులను, అవకాశాలను అనుభవించడానికి అర్హతనుపొంది ఉన్నాడు అని ఉన్నది. భారత రాజ్యాంగం ప్రకారం స్త్రీలకు పురుషులతో సరిసమానమైన అవకాశాలను ఏర్పరచారు. స్త్రీలు పురుషులతోపాటు అన్ని రంగాలలో అభివృద్ధి చెందడానికిగాను స్త్రీలకు అన్ని రంగాలలోకూడా ప్రత్యేకంగా అదనపు అవకాశాలను, సౌకర్యాలను కల్పించడం జరిగింది. అనేక సామాజిక శాసనాలను ప్రవేశపెట్టి సమాజంలో స్త్రీ యొక్క హక్కులను పెంపొందించి

తద్వారా ఆమె ప్రతిపత్తి అభివృద్ధిచేయడం జరిగింది. అంతేకాక విద్య, వైద్య సౌకర్యాలు, ఆర్థిక సహాయం మొదలైన కార్యక్రమాలను ఏర్పరచి అటు కుటుంబంలోనేకాక ఇటు సమాజంలో కూడా స్త్రీ స్థానాన్ని పెంపొందింపజేయడం జరిగింది. స్త్రీ సంక్షేమ సేవా కార్యక్రమాలన్ని ఒకదానితో ఒకటి అంతః సంబంధాలను కలిగి ఉండటమేకాక ఒక సేవా కార్యక్రమం ప్రభావం వేరొక కార్యక్రమంపై ప్రసరించడం కూడా కనిపిస్తుంది. ఉదాహరణకు స్త్రీలలో విద్యాభివృద్ధి కలుగజేసినట్లయితే సామాజికంగా వారి అంతస్తు పెరగడమేకాక వారికి ఆర్థిక స్వాతంత్ర్యం కూడా లభిస్తుంది. అంతేకాక వారి ఆరోగ్యాభివృద్ధి చెందటానికికూడా అవకాశం ఉంటుంది. దీనివలన స్త్రీ కుటుంబంలోను, సమాజంలోను చురుకుగా పాల్గొనగలిగే శక్తి సామర్థ్యాలను పొందుతుంది. ఈ విధంగా స్త్రీని ఒక రంగంలో అభివృద్ధి చేసినట్లయిన మిగతా రంగాలలో తనంతటతానే అభివృద్ధి చెందడానికి అవకాశాలు ఏర్పడతాయి.

1929 వ సంవత్సరంలో ఆల్ ఇండియా ఉమన్స్ ఎడ్యుకేషన్ ఫండ్ అసోసియేషన్ ఏర్పడింది. దీని సలహాప్రకారం ఢిల్లీలో "లేడీ ఇర్విన్ కాలేజ్" అనే పేరుతో గృహ విజ్ఞాన కళాశాల తెరువబడింది. ది యూనివర్సిటీ ఎడ్యుకేషన్ (1948)లో స్థాపించడం జరిగింది. ఈ కమిషన్ స్త్రీ విద్యావంతురాలవడంవల్ల గృహానికి, సమాజానికీ మేలు చేకూరుతుందని తెలిపింది. 1948 కార్మిక భీమా చట్టం ప్రకారం స్త్రీ కార్మికులకు పురుష కార్మికులతో సరిసమానమైన వేతనం నిర్ణయించారు.

కొంతమంది స్త్రీలు నిరక్షరాస్యులై ఉద్యోగాలు చేయడానికి ఎటువంటి శిక్షణను పొందిఉండటంలేదు. అటువంటి స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం కలుగజేయడానికి ప్రభుత్వం గ్రామీణ నగర ప్రాంతాలలో కూడా కొన్ని స్త్రీ వృత్తి శిక్షణా కేంద్రాలను ఏర్పాటుచేయడం జరిగింది.

పునరావాస కార్యక్రమాల మంత్రివర్గం, భారతప్రభుత్వం స్వాతంత్ర్యం వచ్చినతరువాత కొన్ని శిక్షణా కార్యక్రమాలను ప్రత్యే

కంగా స్త్రీలకు ఏర్పాటుచేయడం జరిగింది. అల్లికలు, అద్దకాలు, బుట్టలు అల్లడం, నూలు వడకటం, ఎంబ్రాయిడరీ, పళ్ళను నిలువ చేయడం మొదలైన వాటిలో స్త్రీలకు శిక్షణ ఇస్తున్నారు. 1949-50 నాటికి ఇటువంటి శిక్షణా కేంద్రాలు 98 ఉన్నాయి. అంతేకాక చేతి పనులలో శిక్షణ ఇచ్చే కేంద్రాలను ప్రారంభించారు. ఆల్ ఇండియా హాండీ క్రాఫ్ట్స్ బోర్డ్ (All India Handy Crafts Board), ఆల్ ఇండియా విలేజ్ ఇండస్ట్రీస్ బోర్డ్ (All India Village Industries Board) వివిధ పరిశ్రమలలో శిక్షణా కేంద్రాలను ఏర్పరచినవి. కుటీర పరిశ్రమలకు, చిన్నతరహా పరిశ్రమలకు, చేతిపనులకు ప్రోత్సాహాన్ని కలుగజేయడమే కాక ఆయా పరిశ్రమలలో స్త్రీలకు ఉద్యోగావకాశాలను ఏర్పాటుచేయడం కూడా జరిగింది.

1953 లో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ పట్టణ కుటుంబ సంక్షేమ పథకాన్ని ప్రవేశపెట్టింది. ఈ పథకం ప్రకారం తక్కువ ఆదాయంగల పట్టణ కుటుంబ స్త్రీలకు ఆర్థిక సహాయం చేయబడింది. పారిశ్రామిక వాడలు ఏర్పడి నగర ప్రాంతాలలో చిన్నతరహా పరిశ్రమలను నెలకొల్పారు. ఈ పరిశ్రమలలో సుమారు 500 మంది స్త్రీలను నియమించడం జరిగింది. ఈ పరిశ్రమలలో ప్రతీ కార్మికురాలు రోజుకు 150 పైసలు సంపాదించుకోగలదు. రెండో పంచవర్ష ప్రణాళిక నాటికి ఇటువంటివి 20 యూనిట్లను స్థాపించి 10,000 కుటుంబాలకు సౌకర్యం కలుగజేశారు. రెండో పంచవర్ష ప్రణాళికా కాలంలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ మహిళా సంక్షేమ కార్యక్రమాలను ఏర్పాటుచేయడానికి 66 పైలట్ సంక్షేమ విస్తృత ప్రాజక్టులను నెలకొల్పింది. ఇందులో ముఖ్యమైన కార్యక్రమాలు సాంఘిక విద్య, కుట్టు తరగతులు, సాంస్కృతిక, వినోద సౌకర్యాలు మొదలైనవి. బాల్వాడీలు, చేతిపనుల కేంద్రాలు అన్ని ప్రాజక్ట్ల ద్వారా నడుపబడుతున్నాయి. మూడో పంచవర్ష ప్రణాళిక నాటికి ఈ ప్రాజక్ట్ల సంఖ్య 65 కు పెరిగింది.

గ్రామీణ ప్రాంతాలలో స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు, అనేక ప్రభుత్వ స్త్రీ సంక్షేమ విభాగాలు, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ,

గ్రామీణాభివృద్ధి విభాగాలు, స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా ఏర్పరచ బడ్డాయి.

ఉత్తరప్రదేశ్ గ్రామీణ ప్రాంతాలలో స్త్రీ సంక్షేమ విభాగం 1937 లో కాంగ్రెస్ మంత్రివర్గం ద్వారా ఆరంభమైంది. ప్రతి జిల్లా లోను 15 మంది గ్రామసేవికలు నియమితులైవారు. ప్రతి గ్రామసేవికకు మూడు లేదా నాలుగు గ్రామాల స్త్రీ సంక్షేమ కార్యక్రమాలను పర్య వేక్షించే బాధ్యత కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ గ్రామీణ ప్రాంతా లలో కొన్ని స్త్రీ సంక్షేమ కార్యక్రమ విభాగాలను నెలకొల్పింది. అవి ఏవంటే —

1. స్వతస్సిద్ధమైన సంక్షేమ విస్తృత ప్రాజెక్ట్
2. సాముదాయికాభివృద్ధి - సంక్షేమ విస్తృత ప్రాజెక్ట్
3. మహిళామండలములు లేదా స్వచ్ఛంద సేవా సంస్థలద్వారా నడిపే సంక్షేమ కార్యక్రమాలు.
4. కుటుంబ, శిశు సంక్షేమ ప్రాజెక్టులు

1954 వ సంవత్సరం అక్టోబరు 2 వ తేదీన మొట్టమొదటి గ్రామీణ సంక్షేమ విస్తృత ప్రాజెక్టు నెలకొల్పబడింది. ఈ ప్రాజెక్టు ముఖ్యంగా స్త్రీలు, శిశువుల సంక్షేమంకోసం ఏర్పరచారు. శిశుగృహాలు, ప్రాథమిక పాఠశాలలను నడిపే బాల్వాడీలు, వయోజనవిద్య, సాంఘిక విద్య, ప్రాథమిక వైద్య సౌకర్యాలు, ప్రసూతి సౌకర్యాలు, కళలు, చేతి పనులు, సాంస్కృతిక, వినోద కార్యక్రమాలను ఈ ప్రాజెక్టులు ఏర్పాటు చేయడం జరిగింది. ప్రతీ కేంద్రంలోను ఒక గ్రామసేవిక, ఒక క్రాఫ్ట్ ఇన్‌స్ట్రక్టర్, దాయ మొదలైన వారితో ఒక సిబ్బందికూడా ఏర్పాటు చేయబడింది. ఈ సిబ్బంది ఒక ముఖ్య సేవిక పర్యవేక్షణలో ఉంటుంది.

మొదటి పంచవర్ష ప్రణాళికనాటికి ఇటువంటి ప్రాజెక్టులు 292 నెలకొల్పబడ్డాయి. ఈ ప్రాజెక్టులలో 1,150 కేంద్రాలను ఏర్పాటు

చేశారు. ఈ కేంద్రాలు మొత్తం 600 గ్రామాలకు సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమాలకు అయిన ఖర్చును 12 : 6 : 5 నిష్పత్తిలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ, ప్రభుత్వం, బ్లాక్ స్థాయి వరుసగా భరించడం జరుగుతున్నది. రెండో పంచవర్ష ప్రణాళిక నాటికి ఈ ప్రాజెక్టుల సంఖ్య 714 కు పెరిగింది. 1961 వ సంవత్సరంలో ఈ ప్రాజెక్టులు చేసే సంక్షేమ కార్యక్రమాలను మహిళా మండలులు, స్వచ్ఛంద సేవా సంస్థలకు ఇవ్వడమైంది. దీనికి అయ్యే ఖర్చు సంవత్సరానికి షుమారు 3,200 రూపాయలు. దీనిలో 75 శాతం కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ భరిస్తుంది. మిగిలినశాతం స్వచ్ఛంద సేవా సంస్థలు భరించడం జరిగింది. మహిళా మండలులు, స్వచ్ఛంద సేవా సంస్థలు అంత సంతృప్తికరంగా తమ బాధ్యతలను నెరవేర్చలేకపోయినవి. కనుక మరల ఈ బాధ్యతను ప్రాజెక్టులు వహించడం ఆరంభమయింది.

స్త్రీ సంక్షేమ కార్యక్రమాలలో సాధారణ స్త్రీలేకాక ప్రత్యేక సమస్యలు గల స్త్రీలకు కూడా ప్రత్యేక స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు ఏర్పాటుచేయడం జరిగింది. అనేకమంది స్త్రీలు, బాలికలు సమాజంలో మోసానికి గురిఅయి అనేక సామాజిక, నైతిక, ఆర్థిక సమస్యలకు లోనవడం జరుగుతున్నది. అటువంటి స్త్రీలు సాధారణంగా నైతిక ప్రమాదాలకు లొంగిపోయిన వారుగానీ, నేరస్తులుగా గానీ, ఆర్థికంగా ఇతరులపై ఆధారపడినవారుగా గానీ, వితంతువులుగానీ లేదా శారీరకంగా, మానసికంగా వికలత్వం పొందినవారు గానీ అయి ఉంటారు.

సాధారణంగా సాంఘిక, ఆర్థిక కారణాల ప్రోద్బలంవలన స్త్రీలు వ్యభిచారిణులుగా మారడం జరుగుతున్నది. స్త్రీలలో ఈ సాంఘిక, నైతిక పతనాన్ని తొలగించడానికి 1956 వ సంవత్సరంలో అవినీతి ప్రవర్తనా నిర్మూలన చట్టం (Suppression of Immoral traffic Act) ప్రవేశపెట్టబడింది. సమాజ దౌర్జన్యానికి బలైపోయిన స్త్రీలను సంరక్షించడానికి, దేశం నలుమూలలా స్త్రీ సంరక్షక గృహాలను

స్థాపించాలని నిర్ణయించడం జరిగింది. అసోసియేషన్ ఫర్ మోరల్ అండ్ సోషల్ హైజీన్ ఇన్ ఇండియా (Association for Moral and Social Hygiene in India) అనే సంస్థ సమాజంలో సాంఘిక, నైతిక ఆరోగ్యాన్ని భద్రపరచడానికి ఏర్పరచబడింది. ఈ సంస్థ ఢిల్లీలో ఒక సంరక్షణా గృహాన్ని స్థాపించింది. సామాజికంగా, నైతికంగా పతనం చెందిన స్త్రీలను ఈ గృహాలలో చేర్చి వారి పునరావాస బాధ్యతను స్వీకరించడం జరిగింది. ఈ గృహాలలో గృహవిజ్ఞానంలో శిక్షణ, ఉన్నత విద్య నేర్పడం జరుగుతుంది. ఈ గృహాలలో చేరిన స్త్రీలను తమ కుటుంబ సభ్యుల హామీ పత్రాలమీద వారిని తిరిగి తమ కుటుంబాలకు పంపడం జరుగుతుంది. లేదా ఉన్నత విద్య, వృత్తి శిక్షణ పొందిన తరువాత, తమ స్వశక్తిమీద తాము జీవించగలిగే శక్తిని పొందినపుడు లేదా వివాహంకాని స్త్రీలకు వివాహాలు చేసిన తరువాత వారిని ఈ గృహాలనుంచి విడుదల చేయడం జరుగుతుంది. ఆ తరువాత కొన్ని రోజులు వారిపై పర్యవేక్షణ జరుపుతారు.

దేశవ్యాప్తంగా గల రాష్ట్ర వేగ్రెంట్స్ (Vagraints Acts) చట్టాల ప్రకారం భిక్షాటనచేసే స్త్రీలను, బాలికలనుకూడా వేంగ్రెంట్స్ గృహాలలో చేర్పుతారు. స్త్రీలకు, బాలికలకు ప్రత్యేక గృహాలను ఏర్పరచి అందులో వారికి విద్య, వృత్తి శిక్షణ ఇస్తారు. ఈ గృహాలలో స్త్రీలు ఉండవలసిన కాలం నిర్ణయించలేదు. వారు విద్యగానీ, వృత్తి శిక్షణగానీ పూర్తి చేసుకున్న తరువాత నెలకు 50 రూపాయలు ఆర్జించగల శక్తి సామర్థ్యాన్ని పొందినపుడు వారిని ఈ గృహాలనుంచి విడుదల చేస్తారు. వివాహం కాని స్త్రీలకు, బాలికలకు సాధ్యమయినంతవరకూ వారికి తగిన యువకులు లభిస్తే వివాహంచేసి విడుదల చేయడం జరుగుతుంది. వివాహమైన స్త్రీలను భర్తలు హామీ పత్రం ఇస్తే వారిని విడుదల చేయడం జరుగుతుంది. అదే విధంగా కుటుంబంలో ఏ సభ్యులైనా వచ్చి ఆ గృహంలో గల స్త్రీల బాధ్యతను వహిస్తామని హామీ పత్రం

ఇస్తే ఆ స్త్రీలకు విడుదల చేస్తారు. ఈ విధంగా విడుదలచేసిన స్త్రీలపై కొంత కాలం పర్యవేక్షణ కూడా ఉంటుంది.

ఈవిధంగా సంరక్షణ గృహాలనుంచి, సంస్కరణా గృహాలనుండి విడుదల అయిన స్త్రీలకు సంస్థాగత సేవల ఆవశ్యకత కూడా ఉన్నది. ప్రభుత్వ సంస్థాగత సేవలు, స్వచ్ఛంద సంస్థాగత సేవలు అనేకం నెలకొల్పడం జరిగింది. స్త్రీలకు తాత్కాలిక వసతి గృహాలను ఏర్పరచడం అనేక తరహా ఉత్పత్తి వ్యవస్థలను నెలకొల్పడం, అవసరమైన స్త్రీలకు సహాయం చేయడానికి ప్రభుత్వం కొన్ని ప్రత్యేక ఏర్పాట్లను చేయడం మొదలైన అనేక కార్యక్రమాలు చేశారు. రెండో పంచవర్ష ప్రణాళిక పూర్తయ్యేనాటికి ఉత్పత్తి కేంద్రాలు, 330 జిల్లా వసతులు ఏర్పాటుచేయడం జరిగింది.

అనాథలు, వితంతువులు, వికలాంగులు, మానసిక అశక్తతకు లోనైన వారిని సంరక్షించడానికి ప్రత్యేకంగా స్త్రీలకు అనేక సౌకర్యాలు ఏర్పాటుచేశారు. కాని వాటి కార్యక్రమాలు అంత సంతృప్తికరంగా జరగడంలేదు. ఈ సంస్థలు సక్రమంగా పనిచేయాలంటే వీటికి ప్రభుత్వం, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ, స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా గుర్తింపును పొందాలి.

ఈనాడు ప్రభుత్వం, సాంఘిక సంక్షేమ విభాగాలు, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ, స్త్రీ సంక్షేమానికై కృషిచేసే వ్యవస్థలకు, సంస్థలకు ఆర్థిక సహాయం అందజేస్తున్నది.

## నైతిక పతనం - సాంఘిక సంరక్షణ

ప్రపంచంలో అనేక దేశాలలో వ్యభిచారాన్ని నిషేధిస్తూ చట్టాలను ప్రవేశపెట్టడం జరిగింది. మన దేశంలో కూడా స్వాతంత్ర్యానికి పూర్వం నుండి వేశ్యావృత్తిని అరికట్టడానికి వివిధ రాష్ట్రాలలో వివిధ చట్టాలను రూపొందించారు. అయినప్పటికీ ఈ సమస్య ఇప్పటికీ తీవ్రంగానే ఉన్నది. ది అసోసియేషన్ ఫర్ సోషల్ అండ్ మోరల్ హైజిన్ (The association for social and moral hygiene)

6 వ సంవత్సరంలో పార్లమెంట్ ది సప్రెషన్ ఆఫ్ ఇన్ ఉమన్ అండ్ గరల్స్ చట్టాన్ని (The Immoral traffic in women and girls Act) ఈ చట్టం బాలికలలోను, స్త్రీలలోను అవినీతి ప్రవర్త నికి ఏర్పరచబడింది. ఈ చట్టంవల్ల వేశ్యాగృహాల యడం నిషేధించబడినది. అంతేకాక వేశ్య, విటులు గా శిక్షార్హులని నిర్ణయించబడింది. ఈ చట్టంవల్ల తాలు కలిగినాయి. కానీ ప్రజల సహకారం లేకుండా రాలు సఫలీకృతం కాజాలవు. కనుక వేశ్యావృత్తి ను ప్రజలకు బోధించి వారిలో చైతన్యం తేవాలి. త్తివల్ల సుఖవ్యాధులు వ్యాపిస్తాయి. ఇవి అంటు వ్యాధులకు గురి అయిన స్త్రీ, పురుషులకు జన్మించిన మానసిక వికలత్వాన్ని పొందుతారు. కనుక ఈ ట్టాలి. ఈ వ్యాధులను అరికట్టాలంటే ప్రస్తుతం ఈ ధపడుతున్న రోగులకు చికిత్సా కార్యక్రమాలను ఈ వ్యాధులను నిరోధించాలంటే వేశ్యావృత్తిని శ్యలకు తరచు వైద్య పరీక్షలు చేయించవలె. వేశ్యా , గనేరియా మొదలైన సుఖవ్యాధులు వ్యాపిస్తున్నా లిగే నష్టాలను ప్రజలకు తెలియజేయాలి. పాఠశాల ద్యా తరగతులను, తదితర పాఠ్యభాగాలతోపాటు

ద్య, ఉద్యోగావకాశాలను కలుగజేయాలి. వరకట్న గాను కృషి జరపాలి. వితంతు పునర్వివాహాలను ప్రోత్స ుక సమస్యలపట్ల ప్రజల దృక్పథాన్ని మార్చాలి. స్త్రీల ర్థిక భద్రతను కలిగించవలసిన అవసరం ఎంతైనా పునరావాసం కల్పించడానికి, రక్షణ, సంరక్షణ, ఆర్త సటానికి సమాజ సంక్షేమ సంస్థలు ముఖ్యమైన పాత్రను ంటుంది. నైతిక ప్రమాదానికి గురైన స్త్రీలకు వెంటనే

వసతి సౌకర్యాలను కల్పించి, వేశ్యావృత్తిని చేపట్టే ప్రమాదం నుంచి తప్పించి వారికి ఆశ్రయ మివ్వడానికి రిసెప్షన్ గృహాలను నెలకొల్పడం జరిగినది. ఈవిధంగా సమస్యలకులోనైన స్త్రీల భవిష్యత్తును నిర్ణయించే వరకు ఆ స్త్రీలను ఈ కేంద్రాలలో తాత్కాలికంగా ఉంచుతారు. ఆ తరువాత వీరిని సంస్కరణ సంస్థలలోగానీ లేదా సంరక్షణా గృహాలలో గానీ ఉంచడం జరుగుతుంది. ఈ గృహాలలో స్త్రీలకు నైతిక బోధన, మత సంబంధమైన బోధనలను చేస్తారు. వారికి కొన్ని వృత్తులలో శిక్షణ ఇవ్వడంకూడా జరుగుతుంది. మనదేశంలో సేవాసదనాలు, స్త్రీ సదనాలు ఈ రంగంలో చాలా కృషి చేస్తున్నాయని చెప్పవచ్చు. ఈ విషయంలో సంక్షేమ కార్యకర్తలు కూడా కొంతవరకూ తోడ్పడు తున్నారు.

ఇంగ్లండ్ లోని నైతిక, సాంఘిక స్వాస్థ్య సంఘం అడుగుజాడలలో 1875 వ సంవత్సరంలో భారతదేశంలో భారత నైతక, సాంఘిక స్వాస్థ్య సంఘాన్ని ప్రారంభించారు. 1928 వ సంవత్సరంలో ఈ సంస్థ స్వతంత్ర సంస్థగా రూపొందింది. ఇదే భారత నైతిక, సాంఘిక స్వాస్థ సంస్థగా పేరు పొందింది. దీని ఉప సంఘాలు అనేక రాష్ట్రాల రాజధానులలో ఉన్నాయి. ఇది ప్రభుత్వ సంస్థ కాదు. స్వతంత్ర సంస్థ. ఈ సంస్థ ప్రతి సంవత్సరం సమావేశాలు జరిపి వేశ్యావృత్తి వలన ఉత్పన్నమయ్యే తీవ్ర దుష్ఫలితాలను గురించి ప్రజలకు తెలియబరుస్తూ ఉంటుంది. దీని కృషివల్ల అనేక రాష్ట్రాలలో వేశ్యావృత్తి నిషేధ చట్టాలు ప్రవేశ పెట్టడం జరిగింది. 1950 వ సంవత్సరం తరువాత ఈ సంఘం నిర్దిష్టమైన స్త్రీ సంక్షేమ కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. వ్యభిచార నిర్మూలనకు సంబంధించిన పరిశోధనలు జరపడం, వేశ్యా నిర్మూలనకుగానూ అనేక శాసనాలను రూపొందించడం, శాసనాలను ప్రవేశపెట్టడానికి, అమలు జరపడానికి ప్రభుత్వంతో సహకరించడం, ప్రజారోగ్య, వైద్య, కార్యక్రమాలను చేపట్టడం, పునరావాస సౌకర్యాలను కల్పించడం మొదలైన కార్యక్రమాలను ఈ సంస్థ చేపట్టింది.

## ్యగ స్త్రీలకు వసతి సౌకర్యాలు

నగరాలలోను, పారిశ్రామిక ప్రాంతాలలోను ఉద్యోగావ
ు ఎక్కువ సంఖ్యలో అభివృద్ధిచెందడంవల్ల అధిక సంఖ్యాక
తమ కుటుంబాలను, గృహాలను విడిచి ఉద్యోగం కోసం మార
ాలలో ఒంటరిగా నివసించవలసిన ఆవశ్యకత ఏర్పడుతున్నది.
ంటి పరిస్థితులలో వారికి సరైన సంరక్షణ కలుగజేయాలి. దీని
సాంఘిక, నైతిక సంరక్షణను కలుగజేసి, చౌకధరలో లభించే
ృహాలను ఉద్యోగ స్త్రీలకు ప్రత్యేకంగా ఏర్పాటుచేయాలి.
ప్రాంతాలలో వసతి గృహాల సౌకర్యాలు చాలా తక్కువగా
ాయి. అంతేకాక చాలా ఖరీదులో ఉంటాయి. ఆవిధంగా లభ్య
గృహాలలో సాంఘిక, నైతిక సంరక్షణ లభించడం కూడా కొన్ని
మాలలో కష్టమౌతుంది. ఈవిధంగా ఉద్యోగం చేసుకుంటున్న
ం పట్టణాలలోను, నగరాలలోను చాలా సమస్యలకు గురికావలసి
్నది. కుటుంబం నుంచి తరలి ఉద్యోగార్థమై ఒంటరిగా నివసించ
న అవసరం ఏర్పడ్డ స్త్రీ సాధారణంగా తక్కువ వ్యయంతో
క్షణ, సౌకర్యాలు గల వసతిని పొందాలని ఆశిస్తుంది. కనుక
ాలలోను, నగరాలలోను ఉద్యోగం చేసుకుంటూ ఒంటరిగా
ంచే స్త్రీలకు భద్రతాయుతమైన, తక్కువ వ్యయంతో కూడిన
ావసతులను ప్రభుత్వంగానీ, స్వచ్ఛంద సేవా సంస్థలుగానీ ఏర్పాటు
ాలి.

యంగ్ ఉమన్స్ క్రిస్టియన్స్ అసోసియేషన్ (Young Women's
ristian's Association), అఖిల భారత స్త్రీల సభ (All India
men's Conference) మొదలైన సంక్షేమ సంస్థలు ఉద్యోగం
ుకుంటూ వంటరిగావున్న స్త్రీలకు హాస్టళ్ళను నెలకొల్పి వాటిని
ుపు బాధ్యతను స్వీకరించాయి. కానీ ఈ హాస్టళ్ళు ఎక్కువ నెలసరి
ాయం గల స్త్రీలకు మాత్రమే అందుబాటులో ఉన్నవి. తక్కువ
ుసరి ఆదాయంగల స్త్రీలకు ఎటువంటి సౌకర్యాలు లభించడం లేదు.

కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ, సాంఘిక సంక్షేమ మంత్రివర్గం దేశవ్యాప్తంగా గల మహిళల హాస్టళ్ళు సక్రమంగా పనిచేయడానికి, ఆర్థిక సహాయాన్ని చేయడానికి ఒక పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. ఈ పథకం ప్రకారం యంగ్ ఉమన్స్ క్రిష్టియన్ అసోసియేషన్, అఖిల భారత స్త్రీల సభ, తదితర స్త్రీ సంక్షేమ సంస్థలు తక్కువ ఆదాయంగల స్త్రీలకు అందుబాటులో ఉండేలాగ ప్రత్యేకంగా హాస్టళ్ళను నెలకొల్పడం జరిగింది. కానీ ఈ హాస్టళ్ళు ఎక్కువగా అద్దె గృహాలలోనే నడుపుతున్నారు.

సాధారణంగా భారత దేశ సాంప్రదాయం ప్రకారం భారత దేశ స్త్రీ ఉద్యోగం చేసుకుంటున్నప్పటికీ, ఉన్నత విద్యాధికారురాలైనప్పటికీ కొన్ని సనాతన ధర్మాలకు, సనాతన జీవిత విధానానికీ అలవాటుపడి దానికే కట్టుబడి ఉంటుంది. అటువంటి జీవిత విధానంలో ఒడుదుడుకులు ఏర్పడినట్లయితే ఆమె సామాజిక సర్దుబాటులో లోపం వాటిల్లే ప్రమాదం ఉంది. ఎక్కువమంది స్త్రీలు సమష్టి కుటుంబాలనుంచి వచ్చినవారై కూడా ఉంటారు. కనుక ఈ హాస్టళ్ళను కుటుంబ వాతావరణాన్ని గుర్తింపు తెచ్చేదిగా ఉండాలి. అంతేకాక కుటుంబంలో లభ్యమయ్యే సంరక్షణా సౌకర్యాలను కలుగజేసేవిగా కూడా ఉండాలి. ఈ వసతి గృహాలను నిర్దిష్టమైన కట్టుదిట్టాలతో నడపాలి. కుటుంబంనుంచి వచ్చిన స్త్రీకిగానీ, బాలికకుగానీ కొత్తతరహా వ్యక్తులతో సర్దుబాటు చేసుకోవడంలో సమస్యలు రేకెత్తడానికి అవకాశం ఉంది. స్త్రీలు తమ కుటుంబాలలో గల పరిస్థితులనుంచి పూర్తిగా వేరుగా గల వాతావరణంలో అడుగుపెట్టడం జరుగుతుంది. కనుక ఉద్యోగం చేస్తున్న స్త్రీలకు ఏర్పరచే గృహవసతులు కేవలం నివాసయోగ్యంగానే కాక కుటుంబ వాతావరణానికి అనుగుణంగా ఏర్పాటు చేయాలి. లేకపోతే ఆమె సరికొత్త రకం వాతావరణానికి సర్దుబాటు చేసుకోలేక అనేక రకాలైన సమస్యలకు గురి అవుతుంది. కనుక ఉద్యోగ స్త్రీలకు వసతి గృహాలను ఏర్పాటు చేసేటపుడు ఈ కింది విషయాలను దృష్టిలో పెట్టుకోవడం చాలా అవసరం.

కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ, సాంఘిక సంక్షేమ మంత్రివర్గం దేశవ్యాప్తంగా గల మహిళల హాస్టళ్ళు సక్రమంగా పనిచేయడానికి, ఆర్థిక సహాయాన్ని చేయడానికి ఒక పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. ఈ పథకం ప్రకారం యంగ్ ఉమన్స్ క్రిస్టియన్ అసోసియేషన్, అఖిల భారత స్త్రీల సభ, తదితర స్త్రీ సంక్షేమ సంస్థలు తక్కువ ఆదాయంగల స్త్రీలకు అందుబాటులో ఉండేలాగ ప్రత్యేకంగా హాస్టళ్ళను నెలకొల్పడం జరిగింది. కానీ ఈ హాస్టళ్ళు ఎక్కువగా అద్దె గృహాలలోనే నడుపు తున్నారు.

సాధారణంగా భారత దేశ సాంప్రదాయం ప్రకారం భారత దేశ స్త్రీ ఉద్యోగం చేసుకుంటున్నప్పటికీ, ఉన్నత విద్యాధికారురాలైనప్పటికీ కొన్ని సనాతన ధర్మాలకు, సనాతన జీవిత విధానానికి అలవాటుపడి దానికే కట్టుబడి ఉంటుంది. అటువంటి జీవిత విధానంలో ఒడుదుడుకులు ఏర్పడినట్లయితే ఆమె సామాజిక సర్దుబాటులో లోపం వాటిల్లే ప్రమాదం ఉంది. ఎక్కువమంది స్త్రీలు సమష్టి కుటుంబాలనుంచి వచ్చినవారై కూడా ఉంటారు. కనుక ఈ హాస్టళ్ళను కుటుంబ వాతావరణాన్ని గుర్తింపు తెచ్చేదిగా ఉండాలి. అంతేకాక కుటుంబంలో లభ్యమయ్యే సంరక్షణా సౌకర్యాలను కలుగజేసేవిగా కూడా ఉండాలి. ఈ వసతి గృహాలను నిర్దిష్టమైన కట్టుదిట్టాలతో నడపాలి. కుటుంబంనుంచి వచ్చిన స్త్రీకిగానీ, బాలికకుగానీ కొత్తతరహా వ్యక్తులతో సర్దుబాటు చేసుకోవడంలో సమస్యలు రేకెత్తడానికి అవకాశం ఉంది. స్త్రీలు తమ కుటుంబాలలో గల పరిస్థితులనుంచి పూర్తిగా వేరుగా గల వాతావరణంలో అడుగుపెట్టడం జరుగుతుంది. కనుక ఉద్యోగం చేస్తున్న స్త్రీలకు ఏర్పరచే గృహవసతులు కేవలం నివాసయోగ్యంగానే కాక కుటుంబ వాతావరణానికి అనుగుణంగా ఏర్పాటు చేయాలి. లేకపోతే ఆమె సరికొత్త రకం వాతావరణానికి సర్దుబాటు చేసుకోలేక అనేక రకాలైన సమస్యలకు గురి అవుతుంది. కనుక ఉద్యోగ స్త్రీలకు వసతి గృహాలను ఏర్పాటు చేసేటప్పుడు ఈ కింది విషయాలను దృష్టిలో పెట్టుకోవడం చాలా అవసరం.

1. వ్యక్తిగత అవసరాలను కనుగొని వాటిని తీర్చడం, సామూహిక జీవితానికి అవకాశాన్ని కలుగజేయడం.
2. ఉద్యోగ స్త్రీల గృహావసతుల దైనందిన కార్యక్రమాలలో అక్కడి స్త్రీలే పాల్గొనేలాగ చేయడం.
3. హాస్టలు కార్యక్రమాలు స్త్రీల ఆసక్తి, అవసరాలనుబట్టి ఏర్పాటు చేయడం.
4. వ్యక్తిగత సమస్యలను పరిష్కరించడానికి సహాయం చేయడం మొదలైన లక్ష్యాలను కలిగి ఉండాలి.

ఉద్యోగ స్త్రీల హాస్టళ్ళు వారు నివసించే వాతావరణానికి, జీవన పరిస్థితులకు అనుగుణంగా భవనాలను నిర్మించాలి. ఆరోగ్యకరమైన, పరిశుభ్రమైన ప్రాంతాలలో నిర్మించి ఆటపాటలకు, తోటపనికి, సాయంత్రపు వేళలలో బయట కూర్చోవడానికి వీలుగా సౌకర్యాలు కలిగించాలి. రాకపోక సౌకర్యాలు సులభంగా లభించే కేంద్రాలకు సమీపంగా నిర్మించడం మంచిది. అంతేకాక వివిధ కార్యాలయాలకు, కర్మాగారాలకు కూడా అందుబాటులో ఉండేసదుపాయంగా ఉంటుంది. ప్రతీ సంవత్సరం ఆ భవనాన్ని అవసరాన్నిబట్టి బాగుచేయడం, సున్నాలు, పెయింటింగ్స్, వార్నిష్ వేయడం, కొత్తవస్తువులను చేర్చడం మొదలైనవి చేయాలి. ప్రతీ హాస్టల్‌లోను అధమపక్షం 25 మంది స్త్రీలు ఉండాలి. 100 మంది కంటే ఎక్కువమందికి ప్రవేశం ఈయరాదు. ఒక గదిలో నలుగురికంటే ఎక్కువమందిని చేర్చరాదు. ప్రతీ 8 మందికి ఒక స్నానాల గది చొప్పున ఏర్పాటుచేయాలి. ప్రతీ 25 మంది సభ్యులకు ఒక యోగ్యతను పొందిన మేట్రాన్‌ను నియమించాలి. 50 మంది కంటే ఎక్కువమంది సభ్యులుగల హాస్టల్‌లో ఒక పర్యవేక్షణాధికారిని నియమించాలి. మేట్రాన్ కనీస విద్యార్హత మెట్రిక్యులేషన్ అయి ఉండాలి. వయస్సు 25 సంవత్సరాలు పైబడి ఉండాలి.

ఈ హాస్టళ్ళలో నివసించే స్త్రీలకు పౌష్టిక ఆహారాన్ని ఇవ్వాలి. పరిశుభ్రతను కలిగిఉండాలి. వంటగదిలో పనిచేసే సిబ్బంది పరిశుభ్రంగా

ఉండేలాగ చూడాలి. కేటరింగ్‌లో శిక్షణపొందిన వారిని వంటగది పర్యవేక్షణాధికారిగా నియమించాలి.

ప్రతీ హాస్టలులోను ఒక గదిని వినోద కార్యక్రమాలు నిమిత్తం కేటాయించాలి. ఒక అతిథుల గదిని కూడా ఏర్పాటుచేసి, సభ్యుల బంధువులుగానీ, స్నేహితులుగానీ వచ్చినట్లయితే వారిని ఈ అతిథుల గృహంలో కలుసుకోవడానికి ఏర్పాటు చేయాలి. వినోద యాత్రలు, సాంస్కృతిక, వినోద కార్యక్రమాలు, జాతీయ దినోత్సవాలు మొదలైన కార్యక్రమాలను జరిపించాలి. వివిధ మతస్థులు దైవప్రార్థన జరుపుకోవడానికి సౌకర్యాలను కలుగజేయాలి.

హాస్టలులోగల ప్రతి ఒక్క సభ్యురాలి వ్యక్తిగత ఫైలును జాగ్రత్త పరచాలి. హాస్టలు కార్యక్రమాలలో కలిగే మార్పులను, చేర్పులను తెలియజేస్తూ రికార్డును నడపాలి.

ఈ విధమైన సౌకర్యాలు, కట్టుదిట్టాలుగల వసతి గృహాలను పట్టణాలలో ఉద్యోగాలు చేసుకొంటున్న స్త్రీలకు ఏర్పాటు చేయడం జరుగుతున్నది. ఈ పథకం మొట్టమొదట 1961 వ సంవత్సరంలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ ఆరంభించింది. సమాజంలోగల చెడు, హానికరమైన అంశాల నుండి స్త్రీలను సంరక్షించడమే ఈ హాస్టళ్ళ ముఖ్యోద్దేశం. అంతేకాక గృహావసతి, ఆహారం, వీటికి అయ్యే అత్యంత అధికమైన ఖర్చుల నుండి స్త్రీ ఉద్యోగులను సంరక్షించడంకూడా ఈ పథకం ముఖ్యోద్దేశం. ఈ పథకంద్వారా కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ 1969 నాటికి 167 గృహావసతి సౌకర్యాలను ఏర్పాటుచేసే స్వచ్ఛంద సేవా సంస్థలకు గ్రాంటులను మంజూరుచేసి ఆర్థిక సహాయంచేయడం జరిగింది.

1972 వ సంవత్సరంలో ఉద్యోగ స్త్రీలకు గృహావసతి సౌకర్యాలను ఏర్పాటు చేయడానికి, విస్తృతం చేయడానికీ అనేక స్వచ్ఛంద సేవా సంస్థలకు గ్రాంటులనివ్వడం జరిగింది. ఈ పథకం ప్రకారం నెలకు 800 రూపాయలు సంపాదించుకొంటున్న స్త్రీలకు ఈ గృహా వసతులు అందుబాటులోకి వచ్చాయి. రిజిష్టరుచేయబడిన స్త్రీ సంక్షేమ రంగంలో పనిచేసే స్వచ్ఛంద సేవా సంస్థలన్నిటికీ ఆర్థిక ఆహాయం చేయడం జరి

గింది. ఈ హాస్టళ్ళను నిర్మించడానికి అయ్యే మొత్తం ఖర్చులో 75 శాతం కేంద్ర ప్రభుత్వం భరిస్తుంది. మిగతా 25 శాతం రాష్ట్ర ప్రభుత్వాలు గానీ, సంస్థలుగానీ లేదా రాష్ట్ర ప్రభుత్వం, సంస్థలూ రెండూ గానీ భరిస్తాయి. 1972-73 నుంచి 1979-80 వరకు 196 హాస్టళ్ళను మంజూరు చేయడం జరిగింది. ఈ హాస్టళ్ళలో షుమారు 13,234 ఉద్యోగినులు వసతి సౌకర్యాన్ని పొందవచ్చు.

గ్రాంటులను మంజూరు చేయడానికి వసతి గృహాలు కొన్ని పద్ధతులను సంతృప్తిపరచాలి. అవి ఏవంటే —

1. జాతి, మత, భాష మొదలైన భేదాభిప్రాయాలు లేకుండా అందరికీ ఈ గృహ వసతులలో ప్రవేశం ఉండాలి.
2. షెడ్యూల్డ్ జాతులకు, తెగలకు, గిరిజన ప్రాంతాలకు చెందిన స్త్రీలకు ప్రత్యేక ప్రాముఖ్యత నివ్వాలి.
3. సభ్యుల నుండి చాలా తక్కువ అద్దెను అంటే వారి నెల జీతంలో 10 శాతం కంటే ఎక్కువ తీసుకోరాదు.

1956 వ సంవత్సరం నుండీ కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ ఈ వసతి గృహాలను నడిపే సంస్థలకు ఆర్థిక సహాయం చేస్తున్నది. 1977-78 నాటికి 46 స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా నడుపబడు హాస్టళ్ళకు ఆర్థిక సహాయం చేయడం జరిగింది.

## స్త్రీ ఉద్యోగినుల శిశు సంరక్షణ

ఉద్యోగం చేసుకుంటున్న స్త్రీలు తమ పిల్లలను అనాథలుగా గ్రామాలలోగానీ, పనివాళ్ళ వద్దగానీ విడచిపెట్టడంవల్ల ఆ పిల్లల శారీరక ఆరోగ్యం, తల్లుల మానసిక ఆరోగ్యం క్షీణిస్తుంది. కనుక అటువంటి పిల్లలను, తల్లులను సంరక్షించడానికి శిశు గృహాలను ఏర్పరచడం సమంజసం. సాధారణంగా మన దేశంలో ఉద్యోగం చేసుకొంటున్న స్త్రీలు తమ పిల్లలను అత్తమామల దగ్గరగానీ, తలిదండ్రుల దగ్గరగానీ సంరక్షణలో ఉంచుతారు. కానీ అధిక సంఖ్యాక స్త్రీలు ఇటువంటి పిల్లలను ఒంటరిగాగానీ, పనిపిల్లల వద్దగానీ విడచిపెట్టవలసి వస్తున్నది. ఆ పరిస్థి

తిలో తల్లి చాలా మానసిక సంక్షోభానికి, ఒత్తిడికి గురికావడం జరుగుతుంది. ఆ పిల్లలుకూడా సరైన పోషణలేక అనారోగ్యం పాలవుతారు. పిల్లల అనారోగ్యం కారణంగా తల్లి తన ఉద్యోగానికి ఎక్కువగా సెలవులను పెట్టడం, జీతం నష్టం పొందడం, ఉద్యోగాభివృద్ధి అవకాశాలను పోగొట్టుకోవడం చివరకు ఉద్యోగాన్ని పోగొట్టుకోవడం కూడా జరుగుతున్నది. కనుక ఉద్యోగం చేసుకుంటున్న స్త్రీల పిల్లలకు వారు పనిచేసే కార్యాలయాలు, కర్మాగారాలలోగానీ, ఇతర చోట్లగానీ శిశు గృహాలను ఏర్పాటు చేయాలి. ఈ బాధ్యతను కూడా ఉద్యోగం చేసే స్త్రీలకు వసతి గృహాలను ఏర్పాటుచేసే సంస్థలే స్వీకరించినట్లయితే చాలా శ్రేయస్కరంగా ఉంటుంది. 1948 కర్మాగార చట్టంలో శి గృహాలను ఏర్పరచాలని నిర్దేశితమైంది. ఈ చట్టం ప్రకారం కర్మాగారాలలో 50 మంది స్త్రీ కార్మికులకు నియమించినట్లయితే ఆ కర్మాగారాలలో తప్పనిసరిగా శిశు గృహాలను ఏర్పాటుచేయాలి. 1976 కర్మాగార చట్టం ప్రకారం 30 మంది స్త్రీ కార్మికులు పనిచేసే కర్మాగారాలలో శిశు గృహాలను నిర్మించాలని నిర్దేశించడం జరిగింది. అదేవిధంగా గనులలోను పంటతోటలలోను (plantations) పనిచేసే స్త్రీ కార్మికుల పిల్లలకు శిశు గృహాలను నిర్మించడం జరిగినది.

తల్లికి, పిల్లలకుమధ్య అవినాభావ, మానసిక, ఉద్రేకపూరితమైన సంబంధముంటుంది. ఈ సంబంధం విడదీయరానిది. కనుక తల్లి తన బిడ్డ క్షేమానికి అత్యంత ప్రాధాన్యత నిస్తుంది. తన బిడ్డ క్షేమంగా ఉన్నది అన్నభావన ఆమెకు మానసిక సంతృప్తిని కలుగజేసి, తన శారీరక మానసిక శక్తి సామర్థ్యాలను వృత్తిమీద కేంద్రీకరించ కలుగుతుంది లేకపోతే ఆమె దృష్టి అంతా తన బిడ్డలమీదే ఉండటంవల్ల తన పని మీద కేంద్రీకరణ తగ్గిపోతుంది. ఈ కారణంగా ప్రమాదాలు సంభవించడం, ఉత్పత్తి తగ్గిపోవడం జరుగుతుంది. అంతేకాక ఆమె మానసిక వ్యధకుగురై శారీరకంగా అనారోగ్యం పాలవుతుంది. ఈ ప్రమాదాల నుంచి ఉద్యోగస్తురాలిని సంరక్షించాలంటే శిశు గృహాల ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఈ శిశు గృహాలు కేవలం మాతా శిశు సంరక్షణా

కాక జాతీయ సంరక్షణకు కూడా పునాదివంటివి. ఎందుకంటే నేటి బాలలే రేపటి పౌరులు గనుక ఈ శిశు గృహాలు కాబోయే పౌరులకు సంరక్షణను కలుగజేసి జాతీయ సంరక్షణకు దోహదం చేస్తున్నాయి. స్త్రీ తన బిడ్డ క్షేమంగా సంరక్షణ ఉన్నది అనే నమ్మకంతో పిల్లలమీద బెంగలేకుండా తన నైపుణ్యాతను పూర్తిగా ఉపయోగించి పనిచేయ గలదు. దీనివలన జాతీయోత్పత్తి అధికమౌతుంది. ఈ విధంగా శిశు గృహాల ప్రాముఖ్యతను దృష్టిలో పెట్టుకొని శిశు గృహాలను కావలసిన సంఖ్యలో ఏర్పాటు చేయాలి.

## మహిళా మండలులు

స్త్రీలు సంక్షేమ సేవలను అనుభవించడమే కాక సంక్షేమ సేవలు జేయటానికి కూడా అవకాశం ఉంది. స్త్రీలందరూ ఒకచోట సమావేశమై మహిళా మండలులను ఏర్పరచుకొని వాటిద్వారా అనేక సంక్షేమ కార్యక్రమాలను కొనసాగించవచ్చు. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ ఈ మహిళా మండలులకు అయ్యే మొత్తం ఖర్చులో 75 శాతం భరిస్తు న్నది. స్త్రీలు తమంతట తాము స్వచ్ఛందంగా సంస్థలను ఏర్పరచుకొని వాటిద్వారా అనేక కార్యక్రమాలను చేపట్టవచ్చు. గ్రామీణ పట్టణ, ప్రాంతాలలోగల స్త్రీలు ఈ విధంగా మహిళా మండలులు ఏర్పరచు కోవడం జరిగింది. ఈ మహిళా మండలులు స్త్రీలకు వినోద కార్యక్రమా లను కూడా ఏర్పటుచేస్తున్నాయి. సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్ప రచి అధిక సంఖ్యాక స్త్రీలు ఒకచోట చేరి వారి సాధక బాధకాలను చర్చించుకునే అకాశాన్ని కలిగిస్తున్నాయి. సభ్యులందరూ ఒక కాల నిర్ణయం ప్రకారం సమావేశమై తమ సమస్యలను చర్చించుకొని ఆ ప్రాంతంలో లభ్యమయ్యే అనేక సంక్షేమ సేవలను ఉపయోగించుకో గలిగే శక్తి సామర్థ్యాలను పొందుతున్నారు. ఈ మహిళా మండలులు అనేక సాముదాయిక సంక్షేమ సేవలను కూడా వ్యవస్థీకరించడం జరుగు తున్నవి.

## స్త్రీ సంక్షేమం - వివిధ కార్యక్రమాలు

వివిధ కుటుంబ సంక్షేమ కార్యక్రమాలుకూడా స్త్రీ సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని సహాయం చేయడం జరుగుతున్నది. కుటుంబనియంత్రణ కార్యక్రమం ముఖ్యంగా స్త్రీ ఆరోగ్యాన్ని సంరక్షించడానికి ఏర్పాటు చేసిన సంక్షేమ కార్యక్రమంగా పేర్కొనవచ్చు. ఉద్యోగం చేసుకొనే స్త్రీలకు, కుటుంబ స్త్రీలకు కూడా అనేక రకాల ప్రసూతి సౌకర్యాలను ఏర్పాటుచేయడం జరిగింది. 1948 ప్రసూతి సౌకర్య చట్టం ప్రకారం గర్భం దాల్చిన ప్రతీ కార్మిక స్త్రీ 180 దినాల సర్వీసుకాలం పూర్తి చేసినట్లయితే ప్రసూతి సౌకర్యానికి అర్హురాలు. అంటే ఆమె 6 వారాలు ప్రసవానికి పూర్వం, 6 వారాలు ప్రసవానంతరం వేతనంతో సెలవు దినాలను పొందగలదు. ఈ సౌకర్యంవల్ల స్త్రీ గర్భధారణ కారణంగా వేతనాన్ని నష్టపోవడం, ఉద్యోగాన్ని పోగొట్టుకోవడం, మొదలైన ప్రమాదాలకు గురికాకుండా వృత్తి సంరక్షణ జరిగింది. ప్రసవ సమయంలో సెలవులలో ఉండి విశ్రాంతి తీసుకోవడంవల్ల ఆమె ఆరోగ్యం అభివృద్ధి చెంది సులభమైన ప్రసవం జరిగి తల్లీబిడ్డా ఆరోగ్యంగా ఉండటానికి ఈ పథకాన్ని ఏర్పాటుచేయడం జరిగింది. ఈ సెలవు దినాల్లో ఆమె పూర్తిగా జీతాన్ని పొందడమేకాక అదనంగా ఉచిత వైద్య సౌకర్యాన్నికూడా పొందగలదు. బలమైన ఆహారాన్ని, మందులను తీసుకోవడానికి అదనంగా నెలకు 25 రూపాయలుకూడా లభిస్తాయి.

ప్రసూతి, శిశుసంక్షేమ కేంద్రాలుకూడా స్త్రీ సంక్షేమానికై అనేక కార్యక్రమాలను చేపట్టాయి. స్త్రీ సంక్షేమానికై గ్రామీణ ప్రాంతాలలో అనేకమంది స్త్రీలను మంత్రసానులుగా తయారుచేయడానికి శిక్షణా కేంద్రాలను స్థాపించడం జరిగింది. దీనివల్ల ప్రసవవేదనను పొందుతున్న స్త్రీ వైద్యాలయాలకు గురికాకుండా ఈ మంత్రసానులు ద్వారా సంరక్షించబడుతున్నారు. మంత్రసానుల శిక్షణను ఇవ్వడంవల్ల అనేకమంది స్త్రీలు ఆ వృత్తివల్ల ఆర్థికంగా లాభం పొందుతున్నారు.

1975 వ సంవత్సరం అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా ప్రకటించబడింది. దీనిద్వారా అనేకమంది మహిళలకు అభివృద్ధి కార్య

క్రమాలను ప్రవేశపెట్టడం జరిగింది. సమాజంలో స్త్రీల ప్రతిపత్తి అభివృద్ధిపరచడానికి కృషిజరిగింది. స్త్రీల అభివృద్ధికి, సంక్షేమానికి అప్పటివరకు అమలుజరుపుతున్న సాంఘిక శాసనాలను సవరణచేయటం జరిగింది. స్త్రీలకు న్యాయశాస్త్రపరమైన సహాయం,సంరక్షణ లభిస్తున్నది. వేతనాలలోను, తదితరవృత్తి పరిస్థితులలోను పురుషులతో సరిసమానమైన స్థాయిని స్త్రీలుకూడా పొందుతున్నారు. స్త్రీలకు, పురుషులకు సరిసమాన వేతనాల చట్టం 1976 లో ప్రవేశపెట్టబడింది. స్త్రీల ఉద్యోగావకాశాలను అభివృద్ధిపరిచారు. స్త్రీల సామాజిక అంతస్తును పెంపొందించడానికి అనేక పథకాలు ప్రవేశపెట్టారు. "ది కమిటీ ఆన్ ది స్టేటస్ ఆఫ్ విమన్ ఇన్ ఇండియా" (The Committee on the status of women in India) అనే కమిటీ 1975 జనవరి 1 వ తేదీన నెలకొల్పబడింది. భారతదేశంలో స్త్రీల ప్రతిపత్తి, అంతస్తును పరిశీలించి రిపోర్టులను అందజేయడం ఈ కమిటీ కార్యక్రమం. యీ కమిటీ తన రిపోర్టులో స్త్రీ ప్రతిపత్తి, అంతస్తును అభివృద్ధిపరచడానికి కొన్ని సలహాలను కూడా ఇచ్చింది.

వరకట్న నిషేధ కార్యక్రమాలకై కూడా ప్రభుత్వం తీవ్రమైన కృషి చేసింది. 1961 వ సంవత్సరంలో వరకట్న నిషేధ చట్టం ప్రవేశపెట్టబడింది. యీ చట్టం ప్రకారం వరకట్నం ఇవ్వడం, తీసుకోవడం కూడా నేరమేననీ. వారిద్దరూ కూడా శిక్షార్హులేననీ నిర్ణయించారు. 1978 వ సంవత్సరంలో స్త్రీల వివాహ వయస్సు 18 సంవత్సరాలనుంచి 21 సంవత్సరాల వరకు పెంచబడింది. దేశవ్యాప్తంగా స్త్రీల కోసం ఒక జాతీయ కమిటీని నెలకొల్పడం జరిగింది. దీనికి భారతదేశ ప్రధానమంత్రి అధ్యక్షులుగాను, విద్య, సాంఘిక, సంక్షేమ మంత్రులు ఉపాధ్యక్షులుగాను ఉంటారు. వీరు స్త్రీ సంక్షేమానికి ఏర్పరచిన కార్యక్రమాలు సక్రమంగా నడవడానికి సలహాల నివ్వడమేకాక సహాయాన్ని కూడా అందిస్తారు. 1975 వ సంవత్సరంలో స్త్రీ సంక్షేమానికై కృషి చేసే స్వచ్ఛంద సేవా సంస్థలు అన్నిటికీ గ్రాంటులు ఇచ్చారు. అంతేకాక 81

ఉద్యోగ స్త్రీల హాస్టళ్ళ నిర్మాణానికి, అమలులోవున్న హాస్టళ్ళ అభివృద్ధికి ఆర్థిక సహాయం అందించడం జరిగింది.

యీ విధంగా అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో స్త్రీల అభివృద్ధికి నిరోధకమైన అనేక ఆటంకాలను తొలగించడానికి ప్రయత్నాలు జరిగాయి. స్త్రీలు అభివృద్ధిచెందాలంటే ప్రతీ వ్యక్తి సమాజాభివృద్ధికై స్త్రీ పాత్రను, ఆమె ప్రతిపత్తిని గుర్తించాలి. అంతేకాక స్త్రీల ప్రతిపత్తి పట్ల ప్రజలకు గల దురభిప్రాయాన్ని, మూఢ నమ్మకాలను తొలగించాలి. యీ ఫలితాన్ని పొందడానికి ప్రభుత్వం యీ కింది కార్యక్రమాలను చేపట్టడం జరిగింది.

1. గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో ప్రజలకు స్త్రీల ప్రత్యేక సమస్యల గురించి తెలియజేయాలి. రేడియో, దూరదర్శిని, సినిమాలు మొదలైన భావప్రసరణా సాధనాల ద్వారా ఈ కార్యక్రమాన్ని కొనసాగించడం జరిగింది.
2. 1975 వ సంవత్సరం ఫిబ్రవరి 16 వ తేదీన ప్రత్యేక స్టాంప్ బిళ్ళలను ప్రవేశపెట్టి ఆ రోజును భారత మహిళా దినంగా పరిగణించడం జరిగింది.
3. స్త్రీ సమస్యలను చర్చించే అవకాశాన్ని స్త్రీలందరకూ కలుగజేయడానికి అనేక పోటీలు నిర్వహించారు.
4. 1975 నవంబరులో స్త్రీల జాతీయ క్రీడోత్సవ దినంగా (A National Sports Festival for Women) పరిగణించడం జరిగింది. ఇది ముఖ్యంగా స్త్రీలలో ఉత్సాహాన్ని పెంపొందించి పురుషులతో సరిసమానంగా ఆటల పోటీలలో పాల్గొనడానికి ఏర్పరచిన పథకం.

అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ప్రారంభించిన "కమిటీ ఆన్ ది స్టేటస్ ఆఫ్ విమన్ ఇన్ ఇండియా" (Committee on the Status of the Women in India), "నేషనల్ కమిటీ ఆన్ విమన్" National Committee on Women), "నేషనల్ విమన్స్ బ్యూరో

ఇన్ మినిస్ట్రీ ఆఫ్ సోషల్ వెల్ ఫేర్" (National Women's B. aureo in the Ministry of Social Welfare) మొదలైన సంస్థలు నెలకొల్పారు.

వయోజన విద్యా పథకం ప్రవేశపెట్టిన నాటినుంచి 1977-78 వరకు 2,350 వయోజన విద్యా కేంద్రాలను నెలకొల్పడం జరిగింది. వీటిద్వారా 52,749 మంది స్త్రీలు విద్యావంతులైనారు. 1979-80 మధ్యకాలంలో వయోజన విద్యా కార్యక్రమానికై 10 మిలియన్ల రూపాయలు ఖర్చు చేయడమైంది. వయోజన స్త్రీలకు సాధారణ విద్యయేకాక వృత్తి విద్యను కూడా ఏర్పాటు చేయటం జరిగింది. 1975-76, 1978-79, 1979-80 సంవత్సరాలలో 33 ఐ. సి. డి. ఎస్. ప్రాజెక్ట్లు నెలకొల్పారు. వృత్తి విద్య, సాధారణ విద్య బోధనచేసే వారికి గౌరవ సూచకంగా నెలకు 50 రూపాయలు ఇవ్వడం జరిగింది. 1979 మే నాటికి 8,030 వృత్తి విద్యా కేంద్రాలు నెలకొల్పారు. వీటిలోగల స్త్రీ విద్యార్థుల సంఖ్య 46,902.

స్త్రీల సాంఘిక, ఆర్థిక అభివృద్ధికై కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ అనేక ఉత్పత్తి కేంద్రాలను ప్రవేశపెట్టింది. అవి ఏవంటే—

1. స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా నడిపే చిన్నతరహా పరిశ్రమలు.
2. భారీ పరిశ్రమలకు సహాయం చేసే చిన్నతరహా పరిశ్రమలు.
3. చేతిపనులు, చిన్నచిన్న స్వయం ఉపాధి కల్పనలను కలుగజేసే కార్యక్రమాలు మొదలైన వాటికి ఆర్థిక సహాయం చేయడం జరిగింది. ఈ సహాయం 1958 నుండి 1978 మార్చివరకు 34.3 మిలియన్ల రూపాయల వరకూ అయింది. ఈ ధనసహాయం 1,406 యూనిట్లకు చేయబడింది. దీనిద్వారా 19,430 మంది స్త్రీలు సహాయాన్ని పొందారు. 1978-79, 1979-80 సంవత్సరాల కాలంలో 15 మిలియన్ల రూపాయలు అదనంగా ఖర్చుచేయబడ్డాయి.

1977 వ సంవత్సరంలో కేంద్ర ప్రభుత్వం అనాథ స్త్రీలకు శిక్షణ కేంద్రాలను నెలకొల్పింది. 18-50 సంవత్సరాల మధ్యవయస్సు

గల అనాథ స్త్రీలకు శిక్షణ ఇచ్చి ఉద్యోగావకాశాలను పెంపొందించి వారికి ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఏర్పరచడానికి ఈ పథకం ప్రవేశపెట్టారు. ఈ శిక్షణ పొందుతున్న స్త్రీలకు పిల్లలుంటే వారి సంరక్షణార్థమై గృహ వసతులను ఏర్పరచడం కూడా జరిగింది. శిక్షణ పొందుతున్న స్త్రీలకు 6 సంవత్సరాల లోపు వయసుగల పిల్లలున్నట్లైతే వారు ఈ గృహాలలో సంరక్షణ పొందుతారు. ఈ కార్యక్రమాల బాధ్యత స్వచ్ఛంద సేవా సంస్థలు స్వీకరించడం జరిగింది. ఈ కార్యక్రమాలకు అయ్యే ఖర్చులో 90 శాతం ప్రభుత్వం ఆర్థిక సహాయం చేస్తున్నది. 1978-79 నాటికి 31 శిక్షణా కేంద్రాలు స్థాపించారు. వీటిద్వారా 1200 మంది అనాథ స్త్రీలు, 500 మంది వారిపై ఆధారపడిన పిల్లలు సంరక్షించబడటం జరిగింది.

## స్త్రీ సంక్షేమం - పంచవర్ష ప్రణాళికలు

మొదటి పంచవర్ష ప్రణాళికలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ 667 స్త్రీల సంక్షేమ సంస్థలకు ఆర్థిక సహాయాన్ని అందజేయడం జరిగింది. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ చేసిన కృషిని రాష్ట్ర సాంఘిక సంక్షేమ సంస్థలు బలపరచి అన్నివిధాలా సహాయపడ్డాయి. స్త్రీల సంక్షేమ విషయమై కేంద్ర సంస్థ గ్రామీణ ప్రాంతాలలో విస్తృత పథకాలను ప్రవేశపెట్టింది.

రెండో పంచవర్ష ప్రణాళికలో పట్టణ ప్రాంతాలలో నివసించే మధ్యతరగతి కుటుంబాలకు చెందిన స్త్రీలకు ఆదాయాన్ని సమకూర్చిపెట్టే అనేక కార్యక్రమాలను ప్రవేశపెట్టి వాటి కోసం 0.58 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టడం జరిగింది. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ స్త్రీల సంక్షేమం కోసం నిమగ్నమైన సంస్థలకు కొంత ధనాన్ని కేటాయించడం జరిగింది. రెండో పంచవర్ష ప్రణాళికలో సాంఘిక సంక్షేమానికై ఖర్చుపెట్టిన 19 కోట్ల రూపాయలలోను 9.2 కోట్ల రూపాయలు కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థకు అందజేశారు. ఇందులో కొంత ధనాన్ని స్త్రీల సాంఘిక, ఆర్థిక, అభివృద్ధి కార్యక్రమాలకు ఖర్చు

పెట్టడం జరిగింది. వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యా పథకాలను కూడా ప్రవేశపెట్టడమైంది. ఉద్యోగంచేస్తున్న స్త్రీలకు, వికలాంగులైన స్త్రీలకు వసతి సౌకర్యాలు ఏర్పరచారు. స్త్రీలకు ముఖ్యసేవిక, గ్రామసేవిక, మంత్రసానులు, దాయీలు, పర్యవేక్షక సిబ్బంది మొదలైన వృత్తి శిక్షణలనుకూడా ఏర్పరచి, ఈ వృత్తి శిక్షణపొందిన స్త్రీలను సాంఘిక, నైతిక, ఆరోగ్య సంస్థలలో నియమించడం జరిగింది. ఈ విధంగా నియమించిన స్త్రీలకు వేతనాలు ఇవ్వడం, తదితర సౌకర్యాలు ఏర్పరచడం మొదలైన బాధ్యతలను ప్రభుత్వం చేపట్టి ఆ యా సంబంధిత సంస్థలకు ధన సహాయం చేయడం జరిగింది. 0.61 కోట్ల రూపాయలను వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యా తరగతులను నడుపుతున్న సంస్థలకు సహాయానికి వినియోగించారు. ఈ పథకం ద్వారా 5,353 మంది స్త్రీలు లాభం పొందారు. ఉద్యోగం చేస్తున్న స్త్రీలకు వసతి సౌకర్యాలను ఏర్పాటు చేయడానికి 0.07 కోట్ల రూపాయలు ఖర్చుచేశారు. వీటివల్ల సౌకర్యం పొందే స్త్రీల సంఖ్య 1,228 కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ సాంఘిక, ఆర్థిక పథకాలవల్ల అనేకమంది స్త్రీలకు చిన్నతరహా పరిశ్రమలలోను, చేతి పనులలోను, నూలువడకటం మొదలైన వృత్తులలో శిక్షణా కార్యక్రమాలనుకూడా ఏర్పాటు చేయడం జరిగింది. ప్రతీ ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ఆధ్వర్యంలో నాలుగు ప్రసూతి సౌకర్య కేంద్రాలను ఏర్పాటు చేశారు. ఇవి బ్లాక్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్‌వారి పర్యవేక్షణలో పనిచేస్తున్నాయి. స్త్రీ ఖైదీలకు సంక్షేమ సేవలకై కూడా కొంత ధనాన్ని కేటాయించారు. ఉద్యోగంచేస్తున్న స్త్రీలకు 42 గృహవసతులను కల్పించడం జరిగింది.

మూడో పంచవర్ష ప్రణాళిక పూర్తయ్యేనాటికి కేంద్ర, రాష్ట్ర సాంఘిక సంక్షేమ సంస్థలు స్త్రీ సంక్షేమానికై కృషి చేస్తున్న కొన్ని స్వచ్ఛంద సేవా సంస్థలకు ధన సహాయం చేయడం జరిగింది. పట్టణ ప్రాంతాలలో స్త్రీ సంక్షేమ ప్రయోజన ఉత్పత్తి యూనిట్లు 75 స్థాపించారు. మహిళా సమాజాల నిర్మాణానికి, స్త్రీల సాంఘికాభివృద్ధి కార్య

క్రమాలకు సహితం గ్రాంటుల సహాయాన్ని అందజేసి వాటి అభివృద్ధికి తోడ్పడడం జరిగింది.

వార్షిక ప్రణాళిక 1966-67 లో స్త్రీలకు ప్రత్యేక సంక్షేమ కార్యక్రమాలను ప్రవేశపెట్టడం జరిగింది. వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యాకోర్సులకై 23.73 లక్షల రూపాయలు, సాంఘిక, ఆర్థిక కార్యక్రమాలకై 3.43 లక్షల రూపాయలు, దాయీలు, మహిళామండలి శిక్షణకై 0.23 లక్షల రూపాయలు ఖర్చుపెట్టారు.

రెండో వార్షిక ప్రణాళిక 1967-68 లో స్త్రీలకు వయోజన సంక్షిప్త విద్యాకోర్సులకై 19.50 లక్షల రూపాయలు, సాంఘిక, ఆర్థిక కార్యక్రమాలకు 3 లక్షల రూపాయలు వ్యయం చేయడం జరిగింది. గ్రామీణప్రాంతాల స్త్రీల సంక్షేమ కార్యక్రమాల విస్తరణకు ఏర్పాటు చేశారు.

మూడో వార్షిక ప్రణాళిక 1968-69 లో గ్రామీణ ప్రాంతాలకు చెందిన చాలామంది స్త్రీలకు ప్రత్యేక కార్యక్రమాలను అమలుజరిపి వారి సర్వతోముఖాభివృద్ధికి కృషి చేయడమైంది. వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యాకోర్సుల కోసం 19 లక్షలు, సాంఘిక, ఆర్థిక, నైతిక కార్యక్రమాలకై 4.50 లక్షల రూపాయలు, దాయీలు, మహిళా మండలి శిక్షణకు 0.65 లక్షల రూపాయలు ఖర్చు చేశారు.

నాల్గో పంచవర్ష ప్రణాళిక (1969-74) లో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థలకు, స్వచ్ఛంద సేవా సంస్థలకు, ప్రత్యేకంగా స్త్రీల సంక్షేమ కార్యక్రమాలకు సహాయాన్ని కొనసాగించడానికి సంకల్పించడమైంది. దిక్కులేని స్త్రీల సంక్షేమ కార్యక్రమాల నిమిత్తమై స్వచ్ఛంద సేవా సంస్థలకు ఒక కోటి రూపాయల మొత్తాన్ని పంపిణీ చేయాలని నిర్ణయించారు. ఈ ప్రణాళికలో స్త్రీ సంక్షేమానికై ప్రత్యేకంగా 6 కోట్ల రూపాయలు ఖర్చుచేయడం జరిగింది. స్త్రీలకు, యువతులకు చేతి పనులలోను, ఆరోగ్య, విద్య, పోషకాహారం, శిశుసంరక్షణ మొదలైన వాటిలో శిక్షణ ఇవ్వడానికి కార్యక్రమాలను ఏర్పరచడానికి ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. స్త్రీలకు సాంస్కృతిక, విద్య, వినోద కార్యక్రమాలను

అభివృద్ధి పరచడానికి కూడా కొంత ధనాన్ని కేటాయించడమైంది. గ్రామీణ ప్రాంతాలలో నివసించే స్త్రీలకు అనేక వృత్తులలో శిక్షణ నిచ్చి వారి ఆర్థిక పరిస్థితిని అభివృద్ధి పరచడానికి సహాయ కార్యక్రమాలను చేపట్టారు.

ఐదో పంచవర్ష ప్రణాళికలో (1974-79) మహిళా హాస్టళ్ళకోసం 3.77 కోట్ల రూపాయలు ఖర్చు చేశారు. స్త్రీ సంక్షేమ కార్యక్రమాలను 14.65 కోట్ల రూపాయలు ఖర్చు చేయడమైంది. సాంఘిక సంక్షేమ పథకాలలో స్త్రీ సంక్షేమం కోసం కేటాయించిన ధనం ఒక కోటి రూపాయలు.

ఆరో పంచవర్ష ప్రణాళిక (1979-83) లో సంక్షిప్త కోర్సుల పథకాన్ని అభివృద్ధిపరచి స్త్రీ విద్యావ్యాప్తికి కృషి చేయడం జరిగింది. సంక్షిప్త కోర్సులలో చేరిన వెనుకబడిన, గిరిజన, గ్రామీణ ప్రాంతాలలో నివసించే స్త్రీలకు అనేక బహుమతులను ఏర్పాటుచేసి వారిలో విద్యావ్యాప్తికై ప్రోత్సాహాన్ని కలుగజేయడం జరిగింది. సంక్షిప్త విద్యా కోర్సులలో ఉత్తీర్ణులైనవారికి అంగన్‌వాడీలలో ఉద్యోగినులుగాను, ఎ. ఎన్. ఎమ్. లు గాను నియమించడం జరిగింది. స్త్రీ సంక్షేమానికై కేంద్ర ప్రభుత్వం 150 కోట్లు, రాష్ట్ర ప్రభుత్వం 122 కోట్లు ఖర్చు చేశారు. స్త్రీలలో విద్యావ్యాప్తికై 7 కోట్ల రూపాయలు, సాంఘిక, ఆర్థిక కార్యక్రమాలకు 9.25 కోట్ల రూపాయలు, ఉద్యోగినులకు వసతి సౌకర్యాల నిర్మితికి 13.75 కోట్ల రూపాయలు ఖర్చు చేయడం జరిగింది. అంతేకాక అనాథలైన స్త్రీలకు, వారి పిల్లల సంక్షేమానికి 75 లక్షల రూపాయలు ఖర్చు చేశారు.

## శిశు సంక్షేమం

సాంఘిక సంక్షేమ కృషి భావనతోపాటు శిశు సంక్షేమం భావనలో కూడా మార్పు వచ్చింది. సనాతన కాలంలో మత సాంప్రదాయంగా నిస్సహాయులు, అనాథలు అయిన బాలలకు దానం చేసి సహాయం చేయడం సమాజం ముఖ్య లక్ష్యంగా ఉండేది. కానీ ఆధునిక

సమాజంలోగల నిస్సహాయులు, అనాథలు అయిన బాలలేకాక మొత్తం బాలబాలికలందరికీ ఏదో ఒక విధమైన సహాయం చేయాలనే భావన రూపొందింది. ఈ విధంగా ఆధునిక యుగంలో శిశు సంక్షేమం ప్రత్యేక సమస్యలతో కూడుకున్న బాలబాలికలకు మాత్రమే పరిమితంకాకుండా మొత్తం బాలబాలికలందరకూ విస్తృతంచేయబడింది. కేవలం అసమాయోజన సమస్యలు, బాలనేరస్తులు మొదలైన బాలబాలికలకు శిశు సంక్షేమం సంబంధించినదికాదనీ మొత్తం బాలబాలికల జనాభా శారీరక, మానసిక ఆరోగ్యాభివృద్ధికై ఏర్పరచిన సాంఘిక, ఆర్థిక, ఆరోగ్య కార్యక్రమాలకు కూడా వర్తిస్తుందని చెప్పబడింది. మానవ శాస్త్రం, జీవశాస్త్రం, వైద్యశాస్త్రం, మనోవిజ్ఞానశాస్త్రం, సాంఘిక పరిశోధన మొదలైనవాటిలో జరిగే శాస్త్రీయాభివృద్ధితోపాటు సమాజంలో బాలబాలికల సంక్షేమ కార్యక్రమాల పట్లగల అభిప్రాయంలో కూడా మార్పు వచ్చింది.

భారత దేశంలో సాధారణంగా 14 సంవత్సరాలలోపు వయసువారిని బాలబాలికలుగా పరిగణించడం జరిగింది. 14 సంవత్సరాల పైబడ్డ తరువాత కౌమార దశ ఆరంభమౌతుంది. కానీ 1959 నవంబరులో యునైటెడ్ నేషన్స్ (United Nations) చేసిన "బాలలహక్కుల" ప్రకటన ప్రకారం 16 సంవత్సరాలలోపు వయసుగల వారందరూ బాలలు అని నిర్వచించారు. శైశవదశ వివిధ అంశాలను ఈ కింది విధంగా విభజించవచ్చు.

1. జనన పూర్వదశ 2. జన్మోత్తర దశ 3. నవజాతదశ 4. పాఠశాల పూర్వ దశ 5. పాఠశాల దశ.

శిశు సంక్షేమం లక్ష్యం ప్రకారం శిశువును ఈ ఐదు దశలలోను అతి జాగ్రత్తగా సంరక్షించాలి. ఈ ఐదు దశలలోను సక్రమంగా సంరక్షింపబడిన శిశువులే శారీరక, మానసిక, సాంఘిక, నైతిక ఆరోగ్యాభివృద్ధిని పొంది సమాజానికి ఉపయోగకరమైన, ఆరోగ్యకరమైన పౌరులవుతారు. ఇది శిశు సంక్షేమ సేవల ధ్యేయం.

1968 వ సంవత్సరంలో ఏర్పరచిన బాలల సంక్షేమ కార్యక్రమా లను తయారుచేసే కమిటీ శిశువు అభివృద్ధిలో 5 దశలను వివరించింది. అవి ఏవంటే — 1. గర్భస్థ శిశువు 2. నవజాత శిశువు (0–1 సంవత్స రాల వరకు) 3. విద్యాభ్యాస పూర్వదశ (1–3 సంవత్సరాల వరకు) 4. విద్యాభ్యాస దశ (3–6 సంవత్సరాల వరకు) 5. ప్రాథమిక విద్యాభ్యాస దశ (6–16 సంవత్సరాలు). ఈ కమిటీ శిశు దశను 5 అంశాలుగా విభ జించి ఈ ఐదు అంశాలలోను ప్రతి శిశువుకు సంక్షేమ కార్యక్రమాల ఆవశ్యకత ఉన్నదని వివరించింది.

## శిశు సంక్షేమ సేవలు - ప్రాముఖ్యత

శిశు సంక్షేమ సేవా కార్యక్రమాల వల్ల కేవలం శిశువులకు మాత్రమే కాక కుటుంబానికీ, సమాజానికీ కూడా ప్రయోజనం కలుగుతుంది. శిశువులకు శిశు సంక్షేమ సేవా కార్యక్రమాలవల్ల వారి శారీరక, మానసిక ఆరోగ్యం అభివృద్ధి చెంది, దృఢమైన మూర్తిమత్వం ఏర్పడుతుంది. వారు తమ విధులను సక్రమంగా గుర్తించి నెరవేర్చుకో గలరు. శిశు సంక్షేమ సేవా కార్యక్రమాలు కుటుంబాలకు కూడా శ్రేయోదాయకం. శిశువు కుటుంబంలో ఒక ముఖ్యమైన భాగం. అతడు కుటుంబ సభ్యులలో అతి ముఖ్యమైన సభ్యుడిగా పరిగణించ బడడం జరుగుతుంది. ఆ శిశువు సంక్షేమ కార్యక్రమాలను విరివిగా పొందగలిగినట్లైతే మొత్తం కుటుంబంలోని సభ్యులందరూ మన శ్శాంతితో ఆనందదాయకంగా గడపగలరు. శిశు సంక్షేమం సమాజ సంక్షేమంగా పేర్కొనబడింది. ఎందువల్లనంటే ఈనాటి శిశువులు రేపటి పౌరులు. వారిలో కొందరు దేశాన్ని పాలించే నాయకులు, మరికొందరు శాస్త్రవేత్తలు, రచయితలు, కవులు అవుతారు. సమాజంలో భావికాలంలో కార్యక్రమాలన్నీ వారి ద్వారానే జరుగు తాయి. కనుక వారి ఆరోగ్యాభివృద్ధి దేశానికి ఎంతో ప్రయోజనకరం. రోజుకు ఉదయం ఎటువంటిదో వ్యక్తికి శిశుదశ అటువంటిది అని మిల్టన్ తెలిపాడు. "ది స్టడీ టీమ్ ఆన్ సోషల్ వెల్ఫేర్

(The study team on social welfare) సూచన ప్రకారం సమాజ సంక్షేమం శిశు సంక్షేమంపై ఆధారపడిఉంది. వ్యక్తి శారీరక, మానసిక అభివృద్ధి అతని శైశవ దశపై ఆధారపడిఉంటుంది. కనుక శిశు సంక్షేమం అత్యధిక ప్రాముఖ్యతను కలిగిఉన్నదని చెప్పవచ్చు. సమాజంలో ప్రతి అభివృద్ధీ కూడా వ్యక్తిపై ఆధారపడి ఉంది. వ్యక్తి శక్తి సమాజానికి మూలధనం వంటిది. ఈ మూలధనాన్ని సంరక్షించి అభివృద్ధి చేయాలంటే ఏ ఆర్థిక ప్రణాళికలలోనయినప్పటికీ బాల బాలికల సంక్షేమ కార్యక్రమాలను దృష్టిలోపెట్టుకుని ఆ కార్యక్రమాల అభివృద్ధికి కొంత ధనాన్ని పెట్టుబడిపెట్టాలి. సమాజం సంతృప్తి ఆ సమాజంలో అతిముఖ్యమైన బాలబాలికల సంతృప్తిపై ఆధారపడి ఉంటుంది. బాలబాలికలు తమ అవసరాల నన్నిటినీ సంతృప్తికరంగా పొందగలిగిన సమాజమే నిజమైన సమాజమని చెప్పవచ్చునని పండిత జవహర్‌లాల్ తెలిపాడు.

భారతదేశంలో మొత్తం జనాభాలో బాలబాలికల జనాభా అంటే 0-15 సంవత్సరాల మధ్య వయసుగలవారి జనాభా 42 శాతమని తెలుస్తున్నది. పరిశ్రమాభివృద్ధికి, వ్యవసాయాభివృద్ధికి, దేశ ఆర్థికాభివృద్ధికి ఎంత ప్రాముఖ్యత ఉందో శిశు సంక్షేమాభివృద్ధికి కూడా అంతే ప్రాముఖ్యత ఉంది. దేశంలో ఎటువంటి సంక్షేమ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టినప్పటికీ, శిశుసంక్షేమానికి ఎక్కువ ప్రాముఖ్యతనివ్వాలి. సాధారణ్యాగా బాలిబాలికలకు ఆరోగ్యకరమైన ఆహారం, దుస్తులు, వసతి సౌకర్యాలేకాక ప్రేమాభిమానాలు, మానసిక సంతృప్తికూడా లభించాలి. విద్యా సౌకర్యాలు, వైద్య సౌకర్యాలు, వినోద కార్యక్రమాలు మొదలైనవికూడా వారిపెరుగుదలకు అవసరం. సమాజంలో గల బాలబాలికలందరికీ ఈ సౌకర్యాలన్నీ కల్పించినట్లయితే బాల బాలికలు తమ అవసరాలన్నీ సంతృప్తికరంగా పొంది శారీరకంగా, మానసికంగా ఆరోగ్యవంతులుగా అభివృద్ధిచెందగలరు. ఈసౌకర్యాలన్నీ కలుగజేయాలంటే ఆర్థికవనరులు కావలసినంతగా సమకూర్చాలి.

బాలబాలికల అనారోగ్య నిరోధక కార్యక్రమాలపై అధికంగా వ్యయం చేయడం అవసరం. అంటే బాలబాలికలు అనేక కారణాలవల్ల అంధత్వం, చెవుడు, మూగ, శారీరక వికలత్వం, మానసిక రుగ్మతలు, సాంఘిక సమస్యలు, మొదలైన వాటికి గురి అవుతారు. ఈ వైకల్యాలను నిరోధించే కార్యక్రమాలను సమాజంలో విరివిగా ప్రవేశపెట్టడం ఎంతో శ్రేయస్కరం. కొంత మొత్తం ఈ కార్యక్రమాలకై ప్రతి సంవత్సరం కేటాయించినట్లయితే ప్రస్తుత కాలంలో ఆ సమస్యలకు గురైన వారి చికిత్సా కార్యక్రమాలకు జరుగుతున్న వ్యయం భావికాలంలో క్రమంగా తగ్గడానికి అవకాశముంటుంది. ఎందువల్లనంటే నిరోధక కార్యక్రమాలు విరివిగా ప్రవేశపెట్టడంవల్ల సమస్యాపూరిత బాలల సంఖ్య తగ్గిపోతుంది. తద్వారా వారి చికిత్సా కార్యక్రమాలకయ్యే ఖర్చుకూడా తగ్గిపోతుంది. అనారోగ్యానికి లోనయ్యే బాలల సంఖ్య తగ్గినట్లయితే బాలల అభివృద్ధి పథకాలకై ఎక్కువ ధనాన్ని కేటాయించడం సాధ్యమవుతుంది. సమాజంలో కేవలం నిరోధక, చికిత్సా కార్యక్రమాలను ప్రవేశపెట్టినంత మాత్రాన ఫలితం ఉండదు. అవి అత్యద్భుతంగా పని చేసే ఏర్పాట్లను కూడా చేసి బాలల సంపూర్ణ మూర్తిమత్వం అంటే శారీరక, మానసిక ఆరోగ్యాభివృద్ధి చెందేలాగ చేసినట్లయితే సత్ఫలితాలను తక్కువ కాలంలోనే పొందవచ్చు.

## శిశు సంక్షేమం - పూర్వచరిత్ర

భారతదేశంలో బాలలకు చాలా ఉన్నత స్థానం ఉంది. వివాహం అయిన తరువాత భార్యాభర్తలకు పిల్లలు కలగకపోతే వివాహం లక్ష్యం నెరవేరలేదనే ఉద్దేశ్యం భారత దేశంలోని పలువురి అభిప్రాయం. వివాహం ముఖ్యోద్దేశం సంతానోత్పత్తిఅనీ, దాని తరువాతనే వివాహం తదితర ధ్యేయాలకు ప్రాముఖ్యతనీయడం జరుగుతుందనీ మన సంస్కృతి నమ్మకం. పుత్ర సంతానం లేకపోతే మోక్షం లభించనిదే నమ్మకం మన సంస్కృతిలో ఉంది. బాలలకు ఇంత ప్రాముఖ్యత ఉన్నది. కనుక వారు జన్మించగానే, ఆరోజు నుండీ, ఆ కుటుంబాలలో ఏదో ఒక సందర్భంగా

ఉత్సవాలు చేసుకోవడం జరుగుతున్నది. ఈ ఉత్సవాల ద్వారా సంతోషోత్పత్తి కలిగినందువల్ల వారి ఆనందాన్ని వెల్లడిస్తారు. శిశువు నామకరణం మొదలు వివాహం వరకూ కూడా అనేక విధాలైన సాంప్రదాయ సిద్ధమైన ఉత్సవాలను జరిపి ఆ శిశువు అభివృద్ధికై కుటుంబంలోని సభ్యులందరూ కృషి చేస్తారు. దీనినిబట్టి పురాతన కాలం నుండీ కూడా మన దేశంలో బాలలకుగల ప్రాధాన్యత తెలుస్తున్నది. సమష్టి కుటుంబాలు, జాతివ్యవస్థ, గ్రామీణ సముదాయాలు మొదలైన సామాజిక సంస్థల ద్వారా బాలలు అతి జాగ్రత్తగా సంరక్షించబడుట జరుగుతున్నది,

భారతదేశంలో గల సమష్టి కుటుంబాలు అత్యంత అవసరమైన ప్రేమాభిమానాలను అందిస్తున్నాయి. సమష్టి కుటుంబాకులో వివిధ రకాలైన బాలలు అంటే తల్లిదండ్రులను కోల్పోయినవారు, ఆర్థికంగా వెనుకబడినవారు, వికలాంగులు మొదలైన వారందరూ సంరక్షించబడే వారు. అందువల్ల ఆకాలంలో బాలలు అనాథలుగా మారవలసిన అవసరం ఉండేదికాదు.

గ్రామీణ ప్రాంతాలలోగల కుటుంబాలు స్వయంసమృద్ధిని కలిగి ఉండేవి. ఆ కాలంలో పిల్లల కోరికలుకూడా చాలా స్వల్పంగానూ, సాధారణంగానూ ఉండేవి. వారి కోరికలను తీర్చడం కష్టసాధ్యంగా ఉండేదికాదు. కనుక బాలలు తమ అవసరాలను, కోర్కెలను తమ కుటుంబాలనుంచే పొందగలిగేవారు. అంతేకాక వ్యక్తి జన్మించింది మొదలు మరణించేవరకు కుటుంబంలోనే జీవించేవాడుగానీ ఏ కారణం వల్లనైనా తన కుటుంబాన్ని వదలిపెట్టడం జరిగేదికాదు. ఉద్యోగం, విద్య, తదితర కారణాలవల్ల చాలా తక్కువమంది మాత్రమే తమ గ్రామాలను, కుటుంబాలను విడిచి వెళ్ళడం జరిగేది.

## శిశు సంక్షేమం - బ్రిటిష్‌వారి ప్రభావం

బ్రిటిష్‌వారి పరిపాలనా కాలంలో గ్రామీణ ప్రాంతాల ప్రజల జీవనవిధానంలో తీవ్రమైనమార్పు సంభవించడం జరిగింది. ఇంగ్లండ్‌లో

జరిగిన పారిశ్రామిక విప్లవం భారత ఆర్థిక వ్యవస్థపై చాలా ప్రభావాన్ని చూపించింది. రవాణా సౌకర్యాల అభివృద్ధివలన గ్రామీణ స్వయం సమృద్ధికరమైన జీవనవిధానం కుంటువడింది. జనాభాకూడా విపరీతంగా పెరగడం జరిగింది. వీటన్నిటి ప్రభావంవలన గ్రామీణ ప్రాంతాలలో సమష్టి కుటుంబవ్యవస్థ కూడా అవ్యవస్థత చెందడం జరిగింది. చాలా మంది గ్రామీణప్రజలు, ఉద్యోగాన్వేషణార్థం పట్టణప్రాంతాలకు తరలి పోవడం మొదలుపెట్టారు. అటువంటి పరిస్థితులలో వారు తమ కుటుంబాలను గ్రామాలలోనే విడిచిపెట్టవలసివచ్చేది. ఈ విధంగా గ్రామాలలో కుటుంబాలు అవ్యవస్థత చెందడం జరిగింది. సమాజంలో కలిగిన ఆర్థిక వ్యవస్థ పరివర్తనవల్ల సమష్టి కుటుంబాలు, వ్యష్టి కుటుంబాలుగా రూపాంతరం చెందాయి. దీనివల్ల సమష్టి కుటుంబాల ద్వారా సంరక్షణ పొందే అనాథలు, బాలవితంతువులు, వికలాంగులు మొదలైన వారికి భద్రత లోపించడం జరిగింది, దీని ఫలితంగా చాలామంది బాలలు యాచకులు, నేరస్థులు, తిరుగుబోతులుగా తయారైనారు. ఇటువంటి వారినందరినీ సంరక్షించడానికి ప్రత్యేక శిశు సంక్షేమ కార్యక్రమాలను ప్రవేశపెట్టడం జరిగింది.

## స్వాతంత్ర్యానికి పూర్వం శిశు సంక్షేమ చర్యలు

స్వాతంత్ర్యానికి పూర్వం మన దేశంలో శిశు సంక్షేమ కార్యక్రమాలపై చాలా తక్కువ శ్రద్ధ చూపబడింది. కొంతమంది ప్రజా నాయకులు, మతగురువులు కలసి కొన్ని సంక్షేమ కార్యక్రమాలు ఆరంభించారు. మిషనరీ గృహాలు. అనాథాశ్రమాలు, పారిశ్రామిక పాఠశాలలను మొదలైనవి ఆ కాలంలో స్వచ్ఛంగా ఏర్పరచడం జరిగింది. కానీ ఈ సంస్థలు లోపభూయిష్టమైన ఆర్థిక వనరులు, సిబ్బంది, యాజమాన్యం కలిగి ఉండటంవల్ల, వాటిమధ్య సమన్వయం లేకపోవడంవల్ల, తమ కార్యక్రమాలను సక్రమంగా నెరవేర్చలేకపోవడం జరిగింది. ప్రభుత్వం బాలల సంక్షేమార్థమై ఎటువంటి ప్రత్యేక కార్యక్రమాలు ప్రవేశపెట్టలేకపోయినప్పటికీ వాటి సంరక్షణ, భద్రతల కొరకు కొన్ని శాసనా

లను ప్రవేశపెట్టడం జరిగింది. అవి ఏవంటే — 1. ది అప్రెంటిసెస్ ఆక్ట్ 1850 2. ది గార్డియన్స్ అండ్ వార్డ్స్ ఆక్ట్ 1800 3 ది రిఫార్మేటరీ స్కూల్స్ ఆక్ట్ 1897 మొదలైనవి. ఈ శాసనాలన్నీ స్వాతంత్ర్యానికి పూర్వం ప్రవేశపెట్టబడ్డాయి. ఇదేవిధంగా అనేక రాష్ట్ర వ్యాప్త బాలల చట్టాలు, బోర్‌స్టల్ స్కూల్ చట్టాలు ప్రవేశపెట్టబడ్డాయి.

## స్వాతంత్ర్యానంతరం జరిగిన శిశు సంక్షేమ కార్యక్రమాలు

బాలల సంక్షేమం స్వాతంత్ర్యానంతరం ఒక కొత్త పద్ధతిలో జరిగిందని చెప్పవచ్చు. భారత రాజ్యాంగం బాలల సంక్షేమార్థమై ఈ కింది నిబంధనలను ప్రాథమిక హక్కులలో ప్రవేశపెట్టారు.

1. 15 వ ప్రకరణం :- స్త్రీ, శిశు సంక్షేమాభివృద్ధికై ప్రత్యేక సౌకర్యాలను ఏర్పాటుచేయాలి. జాతి, మత, కుల విభేదాలు, స్త్రీ, పురుష బాల విచక్షణ, పుట్టినదేశం మొదలైనవాటి కారణంగా ఏ పౌరుని వేరుపరచకూడదు.
2. 24 వ ప్రకరణం :- 14 సంవత్సరాల లోపు వయసుగల బాలలను కర్మాగారాలలోగానీ. గనులలోగానీ, మరియే ఇతర ప్రమాదకరమైన వృత్తి పరిస్థితులలోగల పనులలో నియమించరాదు.
3. 45 వ ప్రకరణం :- రాజ్యాంగం అమలుపరచిన నాటినుండీ 10 సంవత్సరాలవరకు 14 సంవత్సరాలలోపు బాలలకు ఉచిత విద్యను ప్రవేశపెట్టి నిర్బంధం చేయాలి.
4. శ్రామికులైన స్త్రీ, పురుషుల వయస్సును దుర్వినియోగపరచడంగానీ, ఆర్థిక అవసరాలకోసం బాలల వయస్సుకు, శక్తికి మించిన వృత్తులలోకి వారిని నిర్బంధంగా ప్రవేశపెట్టడంగానీ చేయకూడదు.
5. ప్రజల జీవన ప్రమాణ స్థాయిని, ఆరోగ్యాన్ని అభివృద్ధి పరచడం ఆహారపోషణ మొదలైనవి రాజ్యాంగం ప్రధాన విధులు.

ఈ విధంగా రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు, ఆదేశక సూత్రాలు, బాలల సంక్షేమాన్ని గురించి ప్రస్తావిస్తున్నాయి.

## శిశు సంక్షేమం - ఆహార సౌకర్యాలు

భారతదేశంలో అధిక శాతం బాలబాలికలు అనారోగ్యంగా ఉండడానికి ముఖ్యకారణం సరైన పోషకాహారం లభించకపోవడం గ్రామీణ, నగర ప్రాంతాలలో నివసిస్తున్న తక్కువ సాంఘిక, ఆర్థిక, అంతస్తుగల పిల్లలలో సరైన పోషకాహారం లేకపోవడంవల్ల ఎక్కువ మంది అనారోగ్యం పొందుతున్నారు. పాఠశాలకు వెళ్ళు ప్రతీ నలుగురు విద్యార్థులలో ముగ్గురికి సరైన ఆహారం లభించడంలేదని ఘంటాపథంగా చెప్పవచ్చు. వారు తీసుకుంటున్న ఆహారంలో శరీర, మానసిక అభివృద్ధికి అతి ముఖ్యమైన మాంసకృత్తులు, ఎ. బి. మొదలైన విటమిన్లు, కేల్షియమ్ లోపిస్తున్నాయి.

సాధారణంగా బాలబాలికలు పాఠశాలకు వెళ్ళేముందు అంటే ఉదయం భోజనంగానీ, ఫలహారంగానీ తిని వెళతారు. వారు సాయంకాలం తిరిగి ఇంటికి చేరేవరకు ఎటువంటి ఆహారాన్ని తీసుకోరు. దీనికి కారణం అధిక శాతం పిల్లలు ఆర్థికంగా పేదవారవడం లేక పోషకాహారాలవల్ల కలిగే లాభాలు తెలియకపోవడంకానీ అయి ఉండవచ్చు. ఏది ఏమైనప్పటికీ మన దేశంలో పిల్లలు సరిపోయినంత పాళ్ళలో పోషక, బలవర్ధకమైని ఆహారాన్ని పొందలేక పోతున్నారని చెప్పవచ్చు. దీని ఫలితంగా చాలామంది విద్యార్థులు శారీరక, బలహీనతను చెందడంవల్ల మానసికంగా వారు చదువుపై శ్రద్ధ వహించలేకపోవడం, వారి ఆరోగ్యం కూడా క్షీణించడం జరుగుతున్నది.

6 నుండి 11 సంవత్సరాల మధ్య వయసుగల పిల్లలు మన దేశంలో 100 మిలియన్ల వరకూ ఉన్నట్లు అంచనా వేయబడింది. మూడో పంచవర్ష ప్రణాళిక పూర్తయ్యే నాటికి వీరిలో 50 శాతం మాత్రమే పాఠశాలకు వెళ్ళుట జరిగింది. నాల్గో పంచవర్ష ప్రణాళిక మొత్తం 6 నుండి 11 సంవత్సరాలమధ్య వయసుగల బాలబాలికలందరూ పాఠశాలకు వెళ్ళేలాగ చేయాలని నిర్ణయించబడింది. మాధ్యమిక, ఉన్నత పాఠశాలలకు వెళ్ళేవారి సంఖ్య 15 మిలియన్లుగా అంచనా

లను ప్రవేశపెట్టడం జరిగింది. అవి ఏవంటే — 1. ది అప్రంటిసెస్ ఆక్ట్ 1850 2. ది గార్డియన్స్ అండ్ వార్డ్స్ ఆక్ట్ 1800 3 ది రిఫార్మేటరీ స్కూల్స్ ఆక్ట్ 1897 మొదలైనవి. ఈ శాసనాలన్నీ స్వాతంత్ర్యానికి పూర్వం ప్రవేశపెట్టబడ్డాయి. ఇదేవిధంగా అనేక రాష్ట్ర వ్యాప్త బాలల చట్టాలు, బోర్‌స్టల్ స్కూల్ చట్టాలు ప్రవేశపెట్టబడ్డాయి.

## స్వాతంత్ర్యానంతరం జరిగిన శిశు సంక్షేమ కార్యక్రమాలు

బాలల సంక్షేమం స్వాతంత్ర్యానంతరం ఒక కొత్త పద్ధతిలో జరిగిందని చెప్పవచ్చు. భారత రాజ్యాంగం బాలల సంక్షేమార్థమై ఈ కింది నిబంధనలను ప్రాథమిక హక్కులలో ప్రవేశపెట్టారు.

1. 15 వ ప్రకరణం :- స్త్రీ, శిశు సంక్షేమాభివృద్ధికై ప్రత్యేక సౌకర్యాలను ఏర్పాటుచేయాలి. జాతి, మత, కుల విభేదాలు, స్త్రీ, పురుష బాల విచక్షణ, పుట్టినదేశం మొదలైనవాటి కారణంగా ఏ పౌరుని వేరుపరచకూడదు.

2. 24 వ ప్రకరణం :- 14 సంవత్సరాల లోపు వయసుగల బాలలను కర్మాగారాలలోగానీ. గనులలోగానీ, మరియే ఇతర ప్రమాదకర మైన వృత్తి పరిస్థితులలోగల పనులలో నియమించరాదు.

3. 45 వ ప్రకరణం :- రాజ్యాంగం అమలుపరచిన నాటినుండీ 10 సంవత్సరాలవరకు 14 సంవత్సరాలలోపు బాలలకు ఉచిత విద్యను ప్రవేశపెట్టి నిర్బంధం చేయాలి.

4. శ్రామికులైన స్త్రీ, పురుషుల వయస్సును దుర్వినియోగపరచడం గానీ, ఆర్థిక అవసరాలకోసం బాలల వయస్సుకు, శక్తికి మించిన వృత్తులలోకి వారిని నిర్బంధంగా ప్రవేశపెట్టడంగానీ చేయకూడదు.

5. ప్రజల జీవన ప్రమాణ స్థాయిని, ఆరోగ్యాన్ని అభివృద్ధి పరచడం ఆహారపోషణ మొదలైనవి రాజ్యాంగం ప్రధాన విధులు.

ఈ విధంగా రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు, ఆదేశక సూత్రాలు, బాలల సంక్షేమాన్ని గురించి ప్రస్తావిస్తున్నాయి.

## శిశు సంక్షేమం - ఆహార సౌకర్యాలు

భారత దేశంలో అధిక శాతం బాలబాలికలు అనారోగ్యంగా ఉండడానికి ముఖ్యకారణం సరైన పోషకాహారం లభించకపోవడం గ్రామీణ, నగర ప్రాంతాలలో నివసిస్తున్న తక్కువ సాంఘిక, ఆర్థిక, అంతస్తుగల పిల్లలలో సరైన పోషకాహారం లేకపోవడంవల్ల ఎక్కువ మంది అనారోగ్యం పొందుతున్నారు. పాఠశాలకు వెళ్ళు ప్రతీ నలుగురు విద్యార్థులలో ముగ్గురికి సరైన ఆహారం లభించడంలేదని ఘంటాపథంగా చెప్పవచ్చు. వారు తీసుకుంటున్న ఆహారంలో శరీర, మానసిక అభివృద్ధికి అతి ముఖ్యమైన మాంసకృత్తులు, ఎ. బి. మొదలైన విటమిన్లు, కేల్షియమ్ లోపిస్తున్నాయి.

సాధారణంగా బాలబాలికలు పాఠశాలకు వెళ్ళేముందు అంటే ఉదయం భోజనంగానీ, ఫలహారంగానీ తిని వెళతారు. వారు సాయం కాలం తిరిగి ఇంటికి చేరేవరకు ఎటువంటి ఆహారాన్ని తీసుకోరు. దీనికి కారణం అధిక శాతం పిల్లలు ఆర్థికంగా పేదవారవడం లేక పోషకాహారాలవల్ల కలిగే లాభాలు తెలియకపోవడంకానీ అయి ఉండవచ్చు. ఏది ఏమైనప్పటికీ మన దేశంలో పిల్లలు సరిపోయినంత పాళ్ళలో పోషక, బలవర్ధకమైని ఆహారాన్ని పొందలేక పోతున్నారని చెప్పవచ్చు. దీని ఫలితంగా చాలామంది విద్యార్థులు శారీరక, బలహీనతను చెందడంవల్ల మానసికంగా వారు చదువుపై శ్రద్ధ వహించలేకపోవడం, వారి ఆరోగ్యం కూడా క్షీణించడం జరుగుతున్నది.

6 నుండి 11 సంవత్సరాల మధ్య వయసుగల పిల్లలు మన దేశంలో 100 మిలియన్ల వరకూ ఉన్నట్లు అంచనా వేయబడింది. మూడో పంచవర్ష ప్రణాళిక పూర్తయ్యే నాటికి వీరిలో 50 శాతం మాత్రమే పాఠశాలకు వెళ్ళుట జరిగింది. నాల్గో పంచవర్ష ప్రణాళిక మొత్తం 6 నుండి 11 సంవత్సరాలమధ్య వయసుగల బాలబాలికలందరూ పాఠశాలకు వెళ్ళేలాగ చేయాలని నిర్ణయించబడింది. మాధ్యమిక, ఉన్నత పాఠశాలలకు వెళ్ళేవారి సంఖ్య 15 మిలియన్లుగా అంచనా

వేశారు. ఈ బాలబాలికలందరికి బలమైన పోషకాహారాన్ని, ఆరోగ్య మైన ఆహారాన్ని ఏర్పాటు చేయాలనే ఉద్దేశంతో 1976 వ సంవత్స రంలో మధ్యాహ్న భోజన పథకం ప్రవేశపెట్టడం జరిగింది.

బాలబాలికలను అన్నిరంగాలలో అభివృద్ధిపరచడానికి ప్రాథమిక విద్యను నిర్బంధంచేయడం జరిగింది. ఈ లక్ష్యాన్ని సాధించాలంటే బాలబాలికలు ఆరోగ్యమైన ఆహారాన్ని పొంది శారీరకంగాను, మాన సికంగానూ శక్తివంతులు కావాలి. ఆకలి కడుపులతో ఉన్న విద్యార్థు లకు పాఠాలు మనసుకి చేరడం కష్టం. బాలబాలికల మనోభావం, మనోవిజ్ఞానం, మానసిక ఆరోగ్యం, శారీరక ఆరోగ్యం అభివృద్ధికి పాఠశాల అతిముఖ్యమైన పాత్రవహిస్తుంది. పాఠశాలలో భోజన సదుపాయాన్ని ఏర్పాటు చేయడంవల్ల బాలబాలికలకు ఆరోగ్యం అభివృద్ధిచెందడమేకాక వారు మంచి ఆహార అలవాట్లను నేర్చుకోవడం జరుగుతుంది. ఈ విధంగా శిశువుల పూర్తి అభివృద్ధికి సహాయపడు తుంది. అభివృద్ధిచెందిన అన్నిదేశాలలోను, పాఠశాలలో మధ్యాహ్న భోజన పథకం సమాజ ఆరోగ్య కార్యక్రమాలలో ఒకటిగా గుర్తించ బడింది. శిశువుల పోషకాహారాన్ని అభివృద్ధిపరచడం, మధ్యాహ్న భోజన పథకం ప్రవేశపెట్టడం జరిగింది. ఈ పథకం మొట్టమొదట జర్మనీ, ఫ్రాన్స్, ఇంగ్లండ్ మొదలైన దేశాలలో ప్రారంభించబడింది. ఇంగ్లండ్‌లో ఈ పథకం 1905 వ సంవత్సరంలోనే ప్రారంభింపబడింది. రష్యాలో మధ్యాహ్న భోజన పథకం నిర్దిష్టమైన కార్యక్రమంగా జరుగు తున్నది. ఫ్రాన్స్‌లో 1936 వ సంవత్సరంలో మధ్యాహ్నభోజన పథకాన్ని ప్రవేశపెట్టడమేకాక ఫ్రాన్స్ ప్రభుత్వం ఈ విషయంపై శాసనాన్నికూడా ప్రవేశపెట్టినది. ఈ శాసనం ప్రకారం ఏదైనా పాఠ శాలను స్థాపించాలంటే తప్పనిసరిగా అందులో మధ్యాహ్నభోజన సౌకర్యాలకై స్థలాన్ని కేటాయించాలి. జపానులోకూడా ఇటీవల ఈ పథకం ప్రవేశపెట్టబడింది.

భారతదేశంలో పాఠశాలలలో మధ్యాహ్నభోజన పథకం మొట్ట మొదట 1925 వ సంవత్సరంలో మద్రాస్‌లో మద్రాస్ నగరపాలక

సంస్థ ద్వారా ప్రవేశపెట్టారు. ఈ పథకం త్వరితగతిని అభివృద్ధిచెందడం కూడా జరిగింది. 1929 వ సంవత్సరం నాటికి 3,000 సంఖ్యలో ఉండే భోజనాల సంఖ్య 1961 నాటికి 35,000 కు పెరిగింది. మద్రాసు తరువాత మైసూర్ రాష్ట్రంలో ఈ పథకం ప్రవేశపెట్టారు.

1946 వ సంవత్సరంలో భోర్ కమిటీ మధ్యాహ్న భోజన పథకానికి అధిక ప్రాముఖ్యత నివ్వడం జరిగింది. 1959 వ సంవత్సరంలో హెల్త్ సర్వే (Health Survey), ప్లానింగ్ కమిషన్ (Planning Commission) మధ్యాహ్నభోజన పథకాలను అమలు జరిపే పాఠశాలలన్నీ జాగ్రత్తతో పర్యవేక్షించాలనీ, ఈ పథకాన్ని అభివృద్ధిచేసి, విస్తృతం చేయాలనీ, చెప్పింది.

1960 వ సంవత్సరంలో భారత ప్రభుత్వం పాఠశాల ఆరోగ్య కమిటీని నియమించింది. పాఠశాల ఆరోగ్యం అంటే పాఠశాలలలో ఉన్న బాలబాలికల ఆరోగ్యం, వారి పోషకాహారాన్ని ఎప్పటికప్పుడు పరీక్షించడం, బాలబాలికలు సరైన స్థాయిలో ఈ ఆహారాన్ని పొందగలిగే ఏర్పాటుచేయడం మొదలైన కార్యక్రమాలు ఈ కమిటీ బాధ్యత. మధ్యాహ్నభోజన పథకాన్ని అభివృద్ధిచేయడానికి ఈ కమిటీ కొన్ని ముఖ్యమైన సలహాల నిచ్చింది. ఈ సలహాల ప్రకారం—

1. మధ్యాహ్నభోజన పథకం ముఖ్యంగా బాలల ఆరోగ్యాన్ని పెంపొందించడమే కాక బాలలలో మంచి ఆహారం అలవాట్లను కూడా పెంపొందింపచేయాలి.
2. బాలలకు కావలసిన పోషకాహారంలో కనీసం 1/3 వ వంతు భాగం మధ్యాహ్న భోజనం ద్వారా లభ్యమయ్యేలాగ చేయాలి.
3. మధ్యాహ్నభోజనాలు నిర్ణయించబడిన కొలతలలో అన్నిరకాల ఆహార పదార్థాలను బాలలకు అందించాలి.
4. మనదేశంలో పాలసరఫరా తక్కువకాబట్టి కేవలం పాలే ముఖ్య ఆహారంలో తీసుకొనే బాలబాలికలకు పాలను ప్రత్యేకంగా సరఫరా చేయాలి. ఆ తరువాత మిగతావారికి అందేలాగ చేయాలి.

5. ఆహారపదార్థాలు బాలబాలికల కందరికీ అందుబాటులో ఉండేట్లు చూడాలి.

6. మధ్యాహ్న భోజనానికి అయ్యే ఖర్చులో 50 శాతం ప్రభుత్వం భరించాలి.

7. బాలలు మానసికంగా, శారీరకంగా, సాంఘికంగా, సరిసమానంగా అభివృద్ధి చెందాలంటే వారందరికీ మధ్యాహ్నభోజన పథకంలో వివక్షత చూపరాదు.

8. పంచవర్ష ప్రణాళికలలో కూడా ఈ పథకానికి కొంత ధనాన్ని కేటాయించాలి. మూడో పంచవర్ష ప్రణాళిక నాటికి ప్రాథమిక పాఠశాలలలో ఏర్పరచిన పథకం నాల్గో పంచవర్ష ప్రణాళిక నాటికి మాధ్యమిక, ఉన్నత పాఠశాలలలో కూడా ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాలి.

జాతీయ పాఠశాల ఆరోగ్య కౌన్సిల్ 1964 వ సంవత్సరంలో ఆగష్టు 27 న బొంబాయిలో జరిగిన తన రెండో సమావేశంలో ప్రస్తుతం ఏర్పాటు చేస్తున్న మధ్యాహ్నభోజన పథకం సంతృప్తికరంగాలేదనీ, అందుచేత ఈ పథకానికి మరింత ఆర్థిక సహాయం అందజేయాలనీ తీర్మానించింది. కేవలం పాఠశాలలుద్వారానేకాక బాల్వాడీలు, సంక్షేమ విస్తృత ప్రాజెక్టులు కూడా ఈ పోషకాహార పథకాన్ని చేపట్టడం జరిగింది.

మూడో పంచవర్ష ప్రణాళిక ఆరంభం నాటికి మధ్యాహ్న భోజన పథకం అమలులోకి రాలేదు. ఆ కాలం మధ్యాహ్న బోజన పథకం అంటే పాఠశాలలకుపోయే పిల్లలకు పాలను పంచడం మాత్రమే. కాని ప్రస్తుతం కేర్ (CARE), యూనిసెఫ్ (UNICEF) మొదలైన అంతర్జాతీయ సంస్థల ద్వారా ఈ పథకం అభివృద్ధి చెందడం జరిగింది. అన్ని రకాల ఆహార పదార్థాలు ఉచితంగా సరఫరా చేయడమేకాక వాటి రవాణా కూడా ఉచితంగానే జరుగుతోంది. రాష్ట్ర ప్రభుత్వాలు వాటినీ విడుదల చేసుకోవడానికీ వాటిని పాఠశాలలకు పంపిణీ చేయడా

నికి అయ్యే ఖర్చును భరించాలి. 1963-64 సంవత్సరాల నాటికి 7 మిలియన్ల పిల్లలకు ఆహారం సరఫరా చేశారు. ఇందులో కేర్ (CARE) ద్వారా 6.3 మిలియన్ల పిల్లలకు, యూనిసెఫ్ ద్వారా 0.7 మిలియన్ల పిల్లలకు సహాయం లభించింది. ఆంధ్రప్రదేశ్, కేరళ, మద్రాస్, మైసూర్, పంజాబ్, రాజస్థాన్ మొదలైన రాష్ట్రాలు కేర్ (CARE) ద్వారా సహాయాన్ని పొందడం జరిగింది. 1962-63 లో భారత ప్రభుత్వం మధ్యాహ్న బోజన పథకానికి 40 లక్షల రూపాయలు ఖర్చు చేశారు. 1963-64 నాటికి ఈ వ్యయం 65 లక్షలకు పెరిగింది. 1964-65 నాటికి 80 లక్షలు, 1965-66 నాటికి 90 లక్షలకు పెరిగింది.

యూనిసెఫ్ ద్వారా ఉత్తరప్రదేశ్, ఒరిస్సా, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్, లక్షద్వీప్ మొదలైన రాష్ట్రాలు సహాయాన్ని పొందాయి. స్వచ్ఛంద చర్చి సంస్థలు, కేథలిక్ రిలీఫ్ సర్వీస్, చర్చివర్ల్డ్ సర్వీస్ మొదలైన సంస్థలు కూడా మధ్యాహ్నన భోజన పథకాలకు సహాయం చేశాయి.

1955 లో "మీల్స్ ఫర్ మిలియన్స్" అసోసియేషన్ ఆరంభమైంది. ఇది అన్ని పోషకాహారాలు, విటమినులు, కలిగివున్న ఆహార పదార్థం. ఇది ఏ రూపంలోనైనా తయారుచేసి బాలబాలికలకు అందుబాటులో ఉండేటట్లుచేస్తే అతిత్వరితగతిని ఆరోగ్యాభివృద్ధిని పొందగలరు. పాఠశాలల ఆరోగ్యం, బాలల ఆరోగ్యం కూడా ఆరోగ్యశాఖ కార్యక్రమాలు, కనుక ప్రతీ పాఠశాలకు ఆ ప్రాంతంలో గల ప్రభుత్వ వైద్యాధికారికి మధ్యాహ్నబోజన పర్యవేక్షణా కార్యక్రమం బాధ్యతను అప్పగించాలి. ఈ విధంగా మధ్యాహ్న బోజన పథకం పాఠశాలలలో చదువుకొంటున్న పిల్లలందరికీ కొంత వరకూ ఆరోగ్యకరమైన, బలమైన ఆహారం కనీసం రోజుకి ఒకసారి సరఫరా చేయడం జరుగుతున్నది. ముఖ్యంగా పేదరికంతో బాధపడుతున్న దేశాలలో గల బాలల ఆహారాన్ని మెరుగుపరచడానికి ఈ పథకంఎంతైనా తోడ్పడుతుంది. పాఠశాలలోగల విద్యార్థులకేకాక బాలబాలికలు ఉండే సంస్థలన్నిటికీ

కూడా పోషకాహారాన్ని సరఫరా చేయడానికి అనేక పద్ధతులను అవలంభించడం జరిగింది. దీనివల్ల దేశంలో తక్కువ పోషకాహారం పొందుతున్న పిల్లలందరూ బలమైన ఆహారాన్ని పొందడానికి అవకాశం ఏర్పడుతున్నది. రాష్ట్ర ప్రభుత్వం, ప్రాంతీయ సాముదాయిక వ్యవస్థ ప్రైవేట్ సంస్థలు మొదలైనవన్నీ దేశంలోగల పిల్లలకు పోషకాహారాన్ని సరఫరా చేయడానికి కృషి చేస్తున్నవి. ప్రస్తుతం పాలపొడి, తర బాలల ఆహారం, విటమిను బిళ్ళలు, చేపనూనె మొదలైన ఆహార పదార్థాలన్నీ అనేక వనరుల ద్వారా పిల్లలకు అందించే కృషి జరుగుతుంది. ప్రాంతీయ స్వయం పరిపాలనా ప్రభుత్వాలు ఈ శిశుపోషక ఆహార పదార్థ కేంద్రాలకు గ్రాంటులను ఇవ్వడంకూడా జరుగుతున్నది. రాష్ట్ర వ్యవస్థలు, రెడ్ క్రాస్, ఇండియన్ కౌన్సిల్ ఫర్ చైల్డ్ వెల్ఫేర్ (Indian Council for Child Welfare) ప్రాముఖ్యత పొందిన తర శిశు సంక్షేమం సంస్థలు సమన్వయంచెంది పిల్లల పోషకాహార పదార్థాల సేకరణ, పంపిణీ మొదలైన కార్యక్రమాలకు సహాయం చేయాలని మొదటి పంచవర్ష ప్రణాళికలో ప్రణాళిక కమీషన్ సలహా ఇవ్వడం జరిగింది.

నాల్గో పంచవర్ష ప్రణాళికలో పాఠశాలలకు వెళ్ళే వయసుగల పిల్లలకు పోషకాహారాన్ని సరఫరా చేయడానికి ప్రభుత్వం 6 కోట్ల రూపాయలను కేటాయించింది. కుటుంబ శిశు సంక్షేమ ప్రాజెక్టులు, స్త్రీ సంక్షేమ వ్యవస్థలు, బాల్వాడీలు మొదలైనవి ఈ కార్యక్రమ బాధ్యతను చేపట్టాయి.

యూనిసెఫ్ సహాయంతో మూడో పంచవర్ష ప్రణాళికలో నేషనల్ న్యూట్రిషన్ ప్రోగ్రామ్ (National Nutrition Programme) ను ఆరంభించి దానిద్వారా కొన్ని ప్రత్యేక సాముదాయిక అభివృద్ధి బ్లాకులలో సంపూర్ణాహార పథకాలను ప్రవేశపెట్టారు. గ్రామీణ ప్రాంతాల స్థాయిలో ఈ కార్యక్రమం బాగాలేవంటే—

1. గ్రుడ్లు, పాలు, చేపలు, పళ్ళు మొదలైన సంరక్షక పోషకాహారం ఉత్పత్తిచేయడం.

2. కొంతమంది గ్రామీణులను ఈ ఆహార పదార్థాల ఉత్పత్తికై నియమించడం.

3. ఆహార విద్యా పథకాలను వ్యవస్థీకరించడం.

కేంద్ర సాంఘిక సంక్షేమ మంత్రివర్గం పుష్టికరమైన ఆహార పదార్థాలు పంపిణీచేసే కార్యక్రమాన్ని చేపట్టింది. రాష్ట్రప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వంతో సత్సంబంధాన్ని ఏర్పరచుకొని పుష్టికరమైన ఆహార పదార్థ సరఫరా కార్యక్రమాలలో సమన్వయాన్ని ఏర్పరచుకోవడం జరుగుతున్నది. 1931 లో ఏర్పడిన యూనియన్ మినిస్ట్రీ ఆఫ్ సోషల్ వెల్ ఫేర్ ప్రత్యేక ఆహారపదార్థ కార్యక్రమాన్ని ఏర్పరచి దానిద్వారా జనసమ్మర్థం గల నగరాల్లోగల మురికివాడలు, వెనుకబడిన గ్రామీణ ప్రాంతాల్లోను, కొండ ప్రాంతాల్లోను నివసించే 3 సంవత్సరాల లోపు వయసుగల బాలలకు ఆహార పదార్థాల పంపిణీని ఏర్పాటుచేసింది. తరవాత ఈ కార్యక్రమం 3-6 సంవత్సరాల వయసుగల బాలబాలికలకు, గర్భిణీ స్త్రీలకు, బాలింతలకు విస్తృతం చేయబడింద. 1973-74 సంవత్సరం నాటికి 3.7 మిలియన్ల పిల్లలు ఈ సౌకర్యం పొందడం జరిగింది. ఐదో పంచవర్ష ప్రణాళికలో రాష్ట్ర ప్రభుత్వాలు ప్రవేశపెట్టిన కనీసావసరాల కార్యక్రమంలో ప్రత్యేక ఆహారపదార్థాల కార్యక్రమం ప్రవేశపెట్టడం జరిగింది. బాల్వాడీలు, పగటి సంరక్షణ కేంద్రాలు మొదలైనవాటిలో గల 3-5 సంవత్సరాల మధ్యగల బాలలకు ఆహార పదార్థాలు సరఫరా చేయడానికి 1970-71 సంవత్సరంలో సాంఘిక సంక్షేమ కేంద్ర మంత్రివర్గం అంతర్జాతీయ స్థాయిలో కృషిచేస్తున్న నాలుగు స్వచ్ఛంద సేవా సంస్థలకు గ్రాంటులను మంజూరుచేసింది. అవి ఏమంటే—

1. కేంద్ర సాంఘికసంక్షేమ సంస్థ
2. ఇండియన్ కౌన్సిల్ ఫర్ ఛైల్డ్ వెల్ ఫేర్
3. భారతీయ ఆదిమజాతి సేవాసంఘం
4. హరిజన సేవక సంఘం

గ్రామీణ ప్రాంతాలలోగల వెనుకబడిన తరగతులకు, కొండ ప్రాంతాలకు, నగరప్రాంతాలకు చెందిన 9 మిలియన్ల పిల్లలకు పోష కాహార పదార్థాల పంపిణీ జరిగింది.

1929 లో కరువుకాటలకు లోనయిన 16 రాష్ట్రాలలో ఈ కార్యక్రమం ప్రవేశపెట్టారు. సమాజంలో గల వెనుకబడిన తరగతులకు చెందిన బాలలు, పాఠశాల పూర్వ వయసుగల శిశువులు, గర్భిణీ స్త్రీలు, బాలింతలకు ఆహారపదార్థాలకై కేంద్రప్రభుత్వం కొంతధనాన్ని కేటాయించడం జరిగింది.

15 సంవత్సరాలలోపు వయసుగల పిల్లలు మనదేశంలో సుమారు 240 మిలియన్ల వరకూ ఉన్నారు. భారత ప్రభుత్వం జాతీయ బాలల పాలసీని ప్రవేశపెట్టింది. దేశంలోగల ప్రతీ ఒక్క బాలుడు, బాలిక వారి పెరుగుదలకు, అభివృద్ధికి అవసరమైన అవకాశాలన్నీ సరి సమానంగా అందజేయాలి అని ఈ పాలసీ నిశ్చయించింది.

ప్రయోగాత్మకంగా నిరూపించడానికి కొన్ని సంపూర్ణ శిశు అభి వృద్ధి పథకాలు ప్రవేశపెట్టారు. ఈ పథకం ముఖ్యోద్దేశ్యం —

1. 0–6 సంవత్సరాల వయసు మధ్యగల బాలల ఆహార ఆరోగ్య అంతస్తును పెంపొందింపజేయడం.
2. బాలల మానసిక, శారీరక, సాంఘిక, అభివృద్ధికి సరైన పునాది వేయడం.
3. బాలల మరణాల సంఖ్యను తగ్గించడం, అనారోగ్యానికి చికిత్సా కార్యక్రమాలను ప్రవేశపెట్టడం, చెడు ఆహారాన్ని సరఫరా చేయ కుండా చూడటం, అధిక సంఖ్యలో పిల్లలు పాఠశాలలకు వెళ్ళేలాగ చూడటం మొదలైనవి.
4. అన్ని శిశు సంక్షేమ విభాగాల మధ్య సత్సంబంధాలు ఏర్పరచి బాలల ఆరోగ్యాభివృద్ధి పథకాలను అమలుజరిగేలాగ చేయడం.
5. పసిపిల్లల తల్లులకు పోషకాహారం, ఆరోగ్యం, విద్య, మొదలైన వాటి గురించి బోధనలుచేసి తమ పిల్లలను తాము జాగ్రత్తగా,

ఆరోగ్యంగా పెంచుకోడానికి తగిన శిక్షణ కార్యక్రమాలను ఏర్పాటు చేయడం మొదలైనవి.

ఈ పథకం కింద 33 ప్రాజెక్టులు ఆరంభమైనాయి. వీటిలో 19 గ్రామీణ ప్రాజెక్టులు, 10 కొండప్రాంత ప్రాజెక్టులు, 4 నగర ప్రాజెక్టులు ఉన్నాయి.

ఈ విధంగా ఆహార పథక కార్యక్రమాలను ఈ కింది విధంగా వర్గీకరించడం జరిగింది.

1. అదనపు ఆహార కార్యక్రమాలు
2. ఉత్పత్తి, పంపిణీ పథకాలు
3. ఆహార, విద్య, విస్తృత కార్యక్రమాలు
4. ఆరోగ్యం కోసం కొనసాగించే ఆహార కార్యక్రమాలు

ఈ కార్యక్రమాలన్నీ భారత ప్రభుత్వంవారి వివిధ శాఖలద్వారా చేపట్టడం జరిగింది. సాంఘిక సంక్షేమ మంత్రివర్గం జాతీయ ఆహార కార్యక్రమాలనన్నిటినీ సమన్వయపరుస్తుంది. బాలల ఆహార, ఆరోగ్య పథకాలలో గల లోపాలను పరీక్షించడానికి, దాని అభివృద్ధికి సలహాల నివ్వడానికి సాంఘిక సంక్షేమ మంత్రివర్గం కేంద్ర కోఆర్డినేషన్ కమిటీని నెలకొల్పడం జరిగింది. ఈ కమిటీలలో ఆహార, వ్యవసాయ, విద్య, ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం, ప్రణాళిక కమీషన్, సామాజిక సంక్షేమ మంత్రివర్గం నుండి ప్రతినిధులు ఉంటారు.

ఈ పథకంవల్ల దేశంలోగల బాలలు ఈ కింది సౌకర్యాలను పొందడం జరిగింది. (1) ఆరోగ్యపరీక్ష (2) రోగనిరోధక కార్యక్రమాలు (3) అదనపు ఆహార సౌకర్యాలు (4) రిఫరాల్ సర్వీసులు (5) 6 సం వత్సరాల లోపు వయసుగల వారికికూడా విద్యా సౌకర్యాలు (6) ఆహార, ఆరోగ్య విద్యాకార్యక్రమాలు.

ఈ పై చెప్పిన సేవలన్నీ గ్రామాలలో అంగన్‌వాడీలద్వారా జరుగుతున్నాయి. అంగన్‌వాడీ కార్యకర్తలు, ముఖ్యసేవికలు ఈ కార్యక్రమాన్ని చేపడతారు.

## శిశు సంక్షేమం - ఆరోగ్య సౌకర్యాలు

దేశ అభివృద్ధి, భవిష్యత్ ఆ దేశంలోని బాలల అభివృద్ధి, భవిష్యత్తుపై ఆధారపడి ఉంటాయి. జనాభాకి ప్రాణాధారమైనటువంటి బాలల జనాభా ఆరోగ్య సౌకర్యాలను పెచ్చించడంవల్ల, అది మొత్తం జాతిని బలపరచడమేకాక అన్ని రంగాలలోను అభివృద్ధికి ఉపయోగ పడుతుంది. బాలల వయసు అభివృద్ధి చెందవలసిన వయసు కనుక ఆ వయసులో వారు ఆరోగ్యంగా పెరగడానికి కావలసిన సౌకర్యాలను వారికి కలుగజేసే ఆవశ్యకత ఎంతైనా ఉంది. భారత దేశంలో పాఠశాల ఆరోగ్య సంరక్షణకు ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చినట్లయితే బాలల ఆరోగ్యాన్ని సంరక్షించడం సులభమవుతుంట.

బాలల ఆరోగ్యాన్ని రెండు దశలలో కాపాడాలి. (1) పాఠశాల పూర్వదశ. (2) పాఠశాలకు వెళ్ళేటప్పుడు బాలలదశ. పాఠశాల పూర్వ దశలో బాలల ఆరోగ్యాన్ని కాపాడటం చాలా అవసరం. ఆ సమయంలో బాలలతోపాటు వారి తల్లుల ఆరోగ్యాన్ని కూడా సంరక్షించవలసి ఉన్నది. దీనివల్ల శిశు మరణాల సంఖ్య చాలా వరకు తగ్గించవచ్చు. విదేశాలతో పోల్చిచూస్తే భారతదేశంలో శిశు మరణాల సంఖ్య చాలా ఎక్కువగా ఉంది. శిశు సంక్షేమ కార్యక్రమాలవల్ల శిశు మరణాల సంఖ్య తగ్గించటమేగాక శిశువుల ఆరోగ్యం కూడా అభివృద్ధి పరచవచ్చు. మొదటి పంచవర్ష ప్రణాళిక ఆరంభం నాటికి ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలు చాలా తక్కువ సంఖ్యలో ఉండేవి. గ్రామీణ ప్రాంతాలలో ఇంకా తక్కువగా ఉండేవి. పంచవర్ష ప్రణాళికలో బాలల ఆరోగ్య సంరక్షణకు ప్రాధాన్యత ఇవ్వబడింది. మొదటి పంచవర్ష ప్రణాళికా కమిటీ నగర ఆరోగ్య సంస్థలన్నిటిలోను ప్రసూతి, శిశు ఆరోగ్య సౌకర్యాలను ఏర్పాటు చేయాలని సలహా ఇవ్వడం జరిగింది. ఈ ప్రసూతి శిశు ఆరోగ్య కేంద్రాలు సరిపోయినంత సంఖ్యలో ఏర్పరచడమేకాక, అన్ని సౌకర్యాలతో సంతృప్తికరమైన సిబ్బందిని కలిగి ఉండాలనికూడా సలహా ఇవ్వడం జరిగింది. ప్రతి కేంద్రంలో కనీసం ఒక హెల్త్ విజిటర్

(Health Visitor), ఇద్దరు మంత్రసానులు, ఒక ప్యూన్, ఒక స్వీపర్ ఉండాలని తెలియజేశారు. వీరు కనీసం 10,000 మందికి సేవచేసే బాధ్యతను కలిగిఉండాలి. ప్రసూతి, శిశు ఆరోగ్యంలో శిక్షణపొందిన ఒక డాక్టరును ఈ కేంద్రంలో నియమించాలి. ఈ కేంద్రాలలో గల మంచాల సంఖ్యనుకూడా పెంచి అధిక సంఖ్యాకులు ప్రసూతిసౌకర్యాన్ని పొందేలాగ చేయటమేకాక ప్రసవానంతరం ఎక్కువకాలం వైద్య సౌకర్యాలను పొందడానికి వీలుపడేలాగ చేయాలని సలహాఇచ్చారు. బాలలకు ప్రత్యేక వైద్యాలయాలు లేకపోతే ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలలోనే బాలలకు కనీసం 10 శాతం మంచాలను కేటాయించి ఉంచడం శ్రేయస్కరమని కూడా సలహాఇచ్చారు.

ప్రతి గ్రామీణ ప్రాంతాలలో ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలను, ప్రాథమిక, సెకండరీ ఆరోగ్య యూనిట్లు, గ్రామ సముదాయ అభివృద్ధి బ్లాకుల విభాగాలు ఈ కార్యక్రమాలను కొనసాగించాలని కూడా సలహా ఇచ్చారు. ఉపజిల్లా ఆరోగ్య కేంద్రాలలో కూడా ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలలోవలె సిబ్బందిని నియమించాలని తెలియజేయబడింది.

పాఠశాలలకు వెళ్ళే బాలలకు ఆరోగ్యసేవలు చాలాతక్కువగా ఉన్నాయి. నగరాలలోను, పట్టణాలలోను నగరపాలక సంస్థలు, పుర పాలక సంస్థలు సంవత్సరానికి ఒకసారి తమ పాఠశాలలలో బాలల ఆరోగ్యం పరీక్షించాలి. దీనివల్ల బాలల ఆరోగ్యపరిస్థితి తెలియగలదు. కానీ ఈ పరీక్షలు సక్రమంగా కొనసాగక పోవడంవల్ల బాలల ఆరోగ్య పరిస్థితి తెలియడంలేదు. అంతేకాక ఈ ఆరోగ్యపరీక్షలు కేవలం నగర పాలక, పురపాలక సంస్థల ఆధీనంలోగల పాఠశాలలలో మాత్రమే పరిమితం చేయడం జరిగింది.

గ్రామాలలో ఇటువంటి ఆరోగ్యపరీక్షలు అసలు జరగడంలేదనే చెప్పవచ్చు. ప్రతి గ్రామ సముదాయ అభివృద్ధి బ్లాకులోను బాలల ఆరోగ్యపరీక్ష కేంద్రాలను ఏర్పరచి ఆ బ్లాకుకు చెందిన పాఠశాలలలో బాలల ఆరోగ్య పరీక్ష జరిగేవిధంగా చేయాలి. దీనివలన గ్రామీణ

ప్రాంతాలలో కూడా కొంతవరకు బాలల ఆరోగ్యపరీక్ష చేయడానికి వీలవుతుంది.

1960 వ సంవత్సరంలో నియమించిన పాఠశాలల ఆరోగ్యకమిటీ పరిశీలన ప్రకారం అసంతృప్తికరమైన ఆహారం, సరైన రోగనిరోధక కార్యక్రమాలు లేకపోవడంవల్ల పాఠశాలకు వెళ్ళే బాలలలో అధిక సంఖ్యాకులు అస్వస్థత చెందడం లేదా రోగగ్రస్తులవడం జరుగుతున్నది.

మూడో పంచవర్ష ప్రణాళికలో పాఠశాలకు వెళ్ళే బాలల ఆరోగ్య సంరక్షణకై కొన్ని సేవలు అమలుపరచాలని నిర్ణయించబడింది. ఆ నిర్ణయం ప్రకారం ఏర్పరచబడిన ఆరోగ్య సౌకర్యాలేవంటే —

1. ప్రతీ పాఠశాలలో పరిశుభ్రమైన మంచినీటి సౌకర్యాల, ఆరోగ్య పరిరక్షణ సౌకర్యాలు ఏర్పాటు చేయడం.
2. వైద్య పరీక్ష సౌకర్యాలు.
3. గ్రామీణ ప్రాంతాలలోగల గ్రామీణాభివృద్ధిలో బ్లాకులతో చేర్చిన ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు సక్రమంగా పనిచేస్తున్నాయో లేదో ఎప్పటికప్పుడు పర్యవేక్షించుట.
4. పాఠశాలలలో పనిచేసే ఉపాధ్యాయులకు ఆరోగ్య పరిరక్షణ ప్రయోజనాలను బోధపరచడం మొదలైనవి ప్రవేశపెట్టడం జరిగింది.

## శిశు సంక్షేమం - విద్యా సౌకర్య కార్యక్రమాలు

బాలల విద్యా సౌకర్య కార్యక్రమాలు విద్యాశాఖకు చెందినవి గాని సంక్షేమశాఖకు చెందినవికావు. విద్యా సౌకర్యాలు బాలబాలికలకు తగినంతగా ఏర్పాటు చేసినట్లయితే విద్యాసంస్థల ద్వారా వారు ఇతర సంక్షేమ సేవలను పొందడానికి అవకాశం లభిస్తుంది. మనదేశంలో అధిక సంఖ్యాక బాలలుపాఠశాలలకు వెళ్ళడంలేదని చెప్పవచ్చు. అంటే వీరందరికి పాఠశాలల ద్వారా ఏర్పాటుచేస్తున్న సంక్షేమ సేవలు అందుబాటులోలేదనీ తెలుస్తున్నది.

బాలలకు విద్యా సౌకర్యాలతోపాటు వృత్తి శిక్షణా కార్యక్రమాలను కూడా ప్రవేశపెట్టడం మంచిది. భారత రాజ్యాంగం ప్రకారం

షెడ్యూల్డ్ జాతుల, గిరిజనుల బాలలకు విద్యా సౌకర్యాలు కలుగ జేయాలి. వారికి ఉచిత విద్యా సౌకర్యాలతోపాటు స్టైయిఫండ్, ఉచిత వసతి సౌకర్యాలను కూడా ప్రవేశపెట్టి వారిలో ప్రోత్సాహాన్ని కలుగ జేయడం జరిగింది.

పాఠశాల పూర్వవిద్య, చిన్నపిల్లల జాగ్రత్త (Nursery Care), విద్యా కార్యక్రమాలు, శిశు సంక్షేమ కార్యక్రమాలుగా పరిగణించ బడ్డాయి. స్వాతంత్ర్యానికి పూర్వం నుండీ కూడా ఈ పాఠశాల పూర్వ విద్యా పథకాలు ప్రవేశపెట్టారు. పాఠశాల పూర్వ దశలోగల శిశువును సంరక్షించడం బాలల సామాజికీకరణానికి ఉపయోగపడతాయి. అంతే కాక పోషకాహారాలు అందజేసే కేంద్రంగా కూడా పనిచేస్తుంది. శిశు సంరక్షణ గురించి తలిదండ్రులను బోధించడంకూడా ఈ కార్యక్రమంలో ప్రవేశపెట్టాం. ఈ పాఠశాల పూర్వ విద్య ముఖ్యంగా ఆర్థికంగా పేదరికంలో ఉన్న కుటుంబాలలోగల బాలలకు, ఉద్యోగం చేసుకుంటున్న పిల్లలకు అత్యంత ఆవశ్యకంగా గోచరిస్తున్నది. ఈ పథకంవల్ల అశ్రద్ధగా విడచిపెట్టబడ్డ పిల్లలు సంరక్షించబడి శారీరక, మానసిక ఆరోగ్యాభి వృద్ధిని పొందగలుగుతున్నారు.

మన దేశంలో పాఠశాల పూర్వవిద్య ఎక్కువగా స్వచ్ఛంద సంక్షేమ సంస్థల ద్వారా లేదా ప్రైవేటు రంగాల ద్వారా నడుపడం జరుగుతున్నది. సంక్షేమ విస్తృత ప్రాజెక్టులు బాల్వాడీలను ఆరంభించ టానికి కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ ప్రోత్సాహాన్ని కలుగజేసింది. కేంద్ర ప్రభుత్వ స్థాయిలో విద్య, కార్మిక విభాగాల మంత్రివర్గం నర్సరీ పాఠశాలలను నడిపించడానికి వివిధ రాష్ట్రాలకు సహాయాన్ని అందిస్తు న్నది. స్త్రీ కార్మికుల పిల్లలను కర్మాగారంలో ఉన్నత కాలం సంరక్షణ కలిగించడానికి శిశు గృహాలను ఏర్పరచడం జరిగింది.

పాఠశాల పూర్వ విద్యా పద్ధతి అంటే 0–6 సంవత్సరాల వయసు గల బాలలకు విద్యా సౌకర్యాలు, పగటి సంరక్షణ, నర్సరీ పాఠశాల, బాల్వాడీ, శిశు గృహాలు మొదలైన వాటిద్వారా జరుగుతున్నది.

## పగటి సంరక్షణ (Day Care)

ఇది ఉద్యోగం చేసుకుంటున్న తల్లుల పసిపిల్లలను పగటిపూట సంరక్షించే కేంద్రం. దీనిలో వివిధ వయసులకు చెందిన పిల్లలను చేర్చుకుంటారు. ఈ కేంద్రాలు తల్లుల పనివేళలో మాత్రమే పని చేస్తాయి. తల్లులు ఉద్యోగాలు చేసుకుంటున్న కారణంగా తమపిల్లలను తగినంత శ్రద్ధగాచూసి, తద్వారా అనేక సమస్యలకు లోనుకాకుండా సంరక్షించడానికి ఈ కేంద్రాలు నెలకొల్పారు.

## నర్సరీలు

ఇది 0–6 సంవత్సరాల వయసుగల బాలబాలికలకు సంరక్షణ కలుగజేసే కేంద్రం. ఈ నర్సరీ పాఠశాలలలో అనేకరకాలైన ఆట వస్తువులద్వారా నిర్మాణాత్మకమైన బోధనలుచేయడం జరుగుతుంది. ఈ నర్సరీలద్వారా పిల్లలు విద్య, వినోదం ఒకేసారి పొందడం జరుగుతున్నది.

## శిశు గృహాలు

పారిశ్రామికీకరణంవల్ల అధికసంఖ్యాక స్త్రీలు కర్మాగారాలలో పనిచేస్తున్నారు. వారిపిల్లల సంరక్షణార్థమై కార్మాగారాలలో శిశు గృహాలు ఏర్పరచారు. ఈ శిశుగృహాలలో 3 సంవత్సరాల లోపు వయసు పిల్లలను సంరక్షిస్తారు. ఈ శిశు గృహాలలో ప్రతిదినం బాలల ఆరోగ్యం పరిరక్షించడం, సక్రమ పద్ధతిలో ఆహారాన్ని ఇవ్వడం సరైన సమయంలో విశ్రాంతి, ఆటలు మొదలైనకార్యక్రమాలు నిర్వహిస్తారు. దీనివల్ల పిల్లలకు ఆ వయసునుంచికూడా క్రమశిక్షణ, మంచి అలవాట్లు, ప్రవర్తన మొదలైన లక్షణాలు అలవడతాయి.

## బాల్వాడీలు

గ్రామీణ ప్రాంతాలలోని స్త్రీలు తమ కుటుంబానికి ఆర్థిక సహాయం చేయడంకోసం ఇంటా, బయటా కూడా కష్టపడి పనిచేయ వలసి వస్తున్నది. తల్లి ఇంట్లో లేనపుడు పిల్లలు సంరక్షణలేక అశ్రద్ధకు లోనవుతున్నారు. గ్రామీణ ప్రాంతాలలో శిశుగృహాలు, నర్సరీలు

మొదలైన శిశు సంరక్షణా సంస్థలకు ఇంకా నెలకొల్పలేదు. కానీ కర్మాగారాలలోగల శిశు గృహాలు, నర్సరీ పాఠశాలల పద్ధతులను రెండింటిని కలిపి గ్రామీణ ప్రాంతాలలో బాల్వాడీలను ఏర్పరచడం జరిగింది. దీనికి కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ సంక్షేమ విస్తృత పథకం ద్వారా నడుపుతున్నారు. ఇవి ఎక్కువగా గ్రామీణ ప్రాంతాలలో కని పించవచ్చు. బాలల సంపూర్ణ అభివృద్ధికి ఈ బాల్వాడీలు కృషి చేస్తు న్నవి. పాఠశాల పూర్వ వయసుగల బాలలను, వారి అవసరాలను అర్థం చేసుకోగలిగి, వాటిని తీర్చడంలో శిక్షణ పొందినవారిని ఈ బాల్వాడీ లకు అధికారులుగా నియమించడం జరిగింది. బాల్వాడీలు ఆరోగ్యకర మైన పరిసరాలలో విశాలమైన స్థలాన్ని కలిగి ఉండాలి. పోషకాహా రాన్ని, ఆటవస్తువులను సరిపోయినన్ని సరఫరా చేయాలి. పిల్లల ఆరోగ్య పరీక్షకై సౌకర్యాన్ని కలుగజేయాలి.

ఈ విధంగా బాలల విద్యా సౌకర్యాల అభివృద్ధికి అనేక ప్రయ త్నాలు జరిగినప్పటికీ భారతరాజ్యాంగంలో నిర్ణయించబడిన ధ్యేయం అంటే "ప్రతీ ఒక్కరూ ప్రాథమికవిద్య నభ్యసించి తీరాలి" అనే లక్ష్య సాధన జరగడం లేదు.

1950–51 సంవత్సరం నాటికి పాఠశాల పూర్వ విద్యా తరగతు లకు హాజరైన బాలల సంఖ్య 28,000. 1955–56 నాటికి ఈ సంఖ్య 75,000 కు పెరిగింది. 1961 నాటికి ఇది 3,00,000 కు పెరిగింది. 1961 నాటికి 5,000 బాల్వాడీలు ఉండేవి. వీటిలో 50 శాతం కేంద్ర, రాష్ట్ర సాంఘిక సంక్షేమ సంస్థల ద్వారా సహాయాన్ని పొందడం జరిగింది. ఈ బాల్వాడీల సంఖ్య ఎక్కువ చేయాలి. వీటిలో శిక్షణ పొందిన శిశు సంక్షేమ కార్యకర్తలను (బాలసేవికలు) నియమించాలి. మూడో, నాలుగో, ఐదో పంచవర్ష ప్రణాళికలలో 6 బాలసేవికా శిక్షణా కేంద్రా లను నెలకొల్పడం జరిగింది. గ్రామీణ ప్రాంతాలలో బాల్వాడీలను ఏర్పరచే బాధ్యత శిశు సంక్షేమ విస్తృత ప్రాజెక్ట్, సాముదాయిక అభివృద్ధి సంస్థలు వహించాయి. 14 సంవత్సరాల వయసు వరకు ప్రతి ఒక్కరూ విద్య నభ్యసించడం నిర్దిష్టమని భారత రాజ్యాంగంలో నిర్ణ

యించారు. అంతేకాక 14 సంవత్సరాల వయసు వరకు ఉచిత విద్యా సౌకర్యాలు ప్రవేశపెట్టారు. రెండో పంచవర్ష ప్రణాళికలో 6-11 సంవత్సరాలు మధ్య వయసుగల బాలలకు విద్యా సౌకర్యాలు ఏర్పాటు చేయాలని నిర్ణయించబడింది. కానీ దీనివల్ల సరికొత్త సమస్యలు ఉద్భవించడం జరిగింది. అవి —

1. సంతృప్తికరమైన సంఖ్యలో బాలబాలికలను పాఠశాలలకు హాజరయ్యేట్లు చేయడం ఒక పెద్ద సమస్యగా పరిణమించింది.
2. కొన్ని ప్రత్యేక ప్రాంతాలలో నివసిస్తున్నవారు, ప్రత్యేక తరగతులకు చెందినవారు చాలా వెనుకబడి ఉండటంవల్ల వారు విద్య ప్రాముఖ్యతను గ్రహించలేకపోతున్నారు.
3. పిల్లలు నాల్గో తరగతికి వచ్చేసరికి తల్లిదండ్రులు వారిని ఆర్థిక సంపాదన కోసం వినియోగించుకోవడం జరుగుతున్నది.

ఈ కారణాలను దృష్టిలో పెట్టుకుని ప్రణాళికా కమిషన్ మొదటి మూడు పంచవర్ష ప్రణాళికలలో 6-11 సంవత్సరాల మధ్య వయసుగల పిల్లలకు విద్యాసౌకర్యాలను ఏర్పాటుచేసింది. నాలుగు, ఐదు పంచవర్ష ప్రణాళికలలో 11-14 సంవత్సరాల మధ్య వయసు గలవారికి కూడా విద్యా సౌకర్యాలను ఏర్పాటుచేయడం జరిగింది.

పిల్లలలో విద్యాభివృద్ధి కలగాలంటే ముఖ్యంగా తలిదండ్రులలో చైతన్యం రావాలి. తలిదండ్రులు తమ పిల్లలను పాఠశాలలకు పంపించేలాగ వారికి ప్రోత్సాహాన్ని ఇవ్వాలి. పాఠశాలలలో పనిచేసే ఉపాధ్యాయినులకు గృహవసతులను ఏర్పాటుచేయాలి. గ్రామీణ ప్రాంతాలలో గల పాఠశాలలలో పనిచేసే ఉపాధ్యాయినులకు ప్రత్యేకంగా అలవెన్సులు ఇవ్వాలి. ఉపాధ్యాయినులుగా శిక్షణపొందేవారికి ప్రత్యేక స్టయిఫండ్‌లను ఇవ్వాలి. ఈ విధంగా సౌకర్యాలను ఏర్పాటుచేస్తే బాలబాలికలలో విద్యాభివృద్ధి విస్తృతంగా జరిగే అవకాశం ఉంది. విద్యాభివృద్ధి ఏవిధంగాఅభివృద్ధిచెందిందో ఈకింది పట్టిక ద్వారా తెలుసుకోవచ్చు.

## బాలల విద్యాభివృద్ధి (1951 - 1974)

| సంవత్సరం | వయో పరిమితి | విద్యస్థాయి | బాల బాలికల శాతం | | |
|---|---|---|---|---|---|
| | | | మొత్తం | బాలురు | బాలికలు |
| 1951 | 6–11 | ప్రాథమిక విద్య | 42 | 39 | 25 |
| | 11–14 | మాధ్యమిక విద్య | 13 | 21 | 5 |
| 1961 | 6–11 | ప్రాథమిక విద్య | 61 | 80 | 40 |
| | 11–14 | మాధ్యమిక విద్య | 23 | 34 | 11 |
| 1974 | 6–11 | ప్రాథమిక విద్య | 85 | 99 | 70 |
| | 11–14 | మాధ్యమిక విద్య | 41 | 54 | 29 |

బాలల సక్రమ అభివృద్ధికి తలిదండ్రులు, ఉపాధ్యాయుల మధ్య సంబంధం ఏర్పరచుకోవడం చాలా అవసరం. తలిదండ్రులు, ఉపాధ్యాయులు శిశు సంక్షేమ కార్యక్రమాలకు మార్గదర్శకులేకాక వారి అభివృద్ధికి కూడా సోపానం వంటివారు. ప్రస్తుతం తలిదండ్రులు, ఉపాధ్యాయులమధ్య సంప్రదింపుల పద్ధతికి అంత ప్రాధాన్యం ఇవ్వడంలేదు. కానీ శిశువుల అభివృద్ధికి ఈ పద్ధతి చాలా ఉపయోగకరమైనదని గుర్తించడం జరిగింది.

## శిశు సంక్షేమం - వినోద కార్యక్రమాలు

వినోదం అనేది వ్యక్తిగత వినోదాన్ని సూచిస్తుంది. వినోదం అంటే విరామ సమయాన్ని నిర్మాణాత్మకంగా ఉపయోగించుకోవడం వంటిది. ఈ వినోదంవల్ల వ్యక్తికి విశ్రాంతి కలిగి, మానసిక ఆందోళన, ఒత్తిడులనుంచీ విముక్తిచెంది, స్వేచ్ఛ, మానసికసంతృప్తి పొందగలడు.

వినోద కార్యక్రమాల ద్వారా వ్యక్తి పూర్తిగా తనను తాను వ్యక్తం చేసుకోగలుగుతాడు. సిగ్గు, భయం, బిడియం, అయిష్టత మొదలైన మూర్తిమత్వ సమస్యలు వినోద కార్యక్రమాలద్వారా తొలగిపోతాయి. వినోద కార్యక్రమాల ద్వారా బాలలు సామాజికీకరణం పొందగలుగుతున్నారు. అంతేకాక బాలల శారీరక, మానసిక, నైతిక అభివృద్ధికూడా జరుగుతుంది. వినోద కార్యక్రమాలు బాలలకు అందుబాటులో లేనట్లయితే బాలలు తమ విరామసమయంలో కాలక్షేపం జరుగక తిరుగుబోతులుగాను, దెబ్బలాటకోరులుగాను, చెడు ప్రవర్తనలు కలిగి సామాజిక విద్రోహులుగా మారడానికి అవకాశాలున్నాయి. బాలలందరూ ఆరోగ్యకరమైన వినోద కార్యక్రమాలు పొంది ఉంటే వారు చెడు ప్రవర్తనకు లొంగిపోకుండా సత్కాలక్షేపంతో మంచి పౌరులుగా మారి దేశాభివృద్ధికి తోడ్పడగలరు. వినోద కార్యక్రమాలవల్ల బాలలు తమ నైపుణ్యాతను, కళలను, శక్తి సామర్థ్యాలను, తెలివితేటలను అభివృద్ధి చేసుకోగలరు. వినోద కార్యక్రమాల ద్వారా సమస్యాపూరిత బాలలను కూడా చేరదీసి వారి సమస్యలను పరిష్కరించడానికి వీలవుతుంది. వ్యవస్థితమైన వినోద కార్యక్రమాలు బాలలను ప్రజాస్వామ్య జీవితానికి కూడా ప్రోత్సహిస్తున్నాయి. సముదాయాల్లో వివిధ సంస్థలలో విడివిడిగావున్న బాలలనందరినీ ఒకచోట కలపడానికి ఈ వినోద కార్యక్రమాలు ఉపయోగపడతాయి. కొన్ని సంస్థలలోగల బాలలు అసమయోజత్వం చెందడానికి ఎక్కువ అవకాశాలున్నాయి. కుటుంబ జీవితం లేకపోవడం తల్లిదండ్రుల ప్రేమాభిమానాలకు నోచుకోలేకపోవడం మొదలైన పరిస్థితులు బాలలను మనశ్శాంతికి దూరం చేస్తున్నాయి. ఇటువంటి సమస్యల నుంచి బాలలను సంరక్షించాలంటే ఆయా సంస్థలలో సరిపడినంతగా వినోద కార్యక్రమాలను ఏర్పాటు చేయాలి. దీనివలన బాలలు వారి సమస్యలను మర్చిపోయి మామూలు బాలలుగా తయారవడానికి అవకాశం లభిస్తుంది. వినోద కార్యక్రమాల వల్ల జాతి, మత భేదాలు, సామూహిక దురభిప్రాయాలు, కొంతవరకు తొలగిపోతాయి.

ఆటలు బాలల జీవితంలో చాలా ప్రధానపాత్రను వహిస్తాయి. ఆటల కార్యక్రమాలను బాలల గృహాలలోగానీ, పాఠశాలలగానీ, లేదా సాముదాయిక వాతావరణంలోగానీ జరుపవచ్చు. ఈ కార్య క్రమాలు ఆటలకు కావలసిన పరికరాలు, స్నేహితులు, ఆటస్థలం మొదలైనవాటి కలయికవల్ల ఏర్పడుతున్నాయి. పట్టణాలలో పురపాలక సంఘాలు, గ్రామాలలో గ్రామపంచాయితీలు పట్టణాలలో, గ్రామా లలో కొన్ని ప్రదేశాలను ఆటస్థలాలుగా కేటాయించాలి. ప్రస్తుతం పట్టణ ప్రాంతాలలోను, గ్రామీణ ప్రాంతాలలోను సదుపాయకరమైన ఆటస్థలాలు కనిపించడంలేదు. ఆటస్థలాలు ప్రతీ బాలునికి అందు బాటులో ఉండేలాగ ఏర్పరచడం ఎంతో ముఖ్యం. సాధారణంగా ఈ ఆటస్థలాలను స్వచ్ఛంద సంక్షేమ సేవాసంస్థలుగానీ, యువజనసంఘాలు గానీ, విద్యాసంఘాలుగానీ ఏర్పాటుచేసినవి మాత్రమే కనిపిస్తాయి.

పాఠశాలలో అదనపు వినోద కార్యక్రమాలను ప్రవేశపెట్టడం శిశు సంక్షేమ రంగంలో మంచి అభివృద్ధి సాధించవచ్చు. కానీ అధిక సంఖ్యాక పాఠశాలలు కేవలం విద్యా కార్యక్రమాలకు మాత్రమే ప్రాధాన్యమిచ్చి వాటికి మాత్రమే పరిమితమైపోవడం జరుగుతున్నది. అధునాతనంగా పాఠశాలలలో వినోద కార్యక్రమాలనుకూడా ప్రవేశ పెట్టుట ఆరంభించడం జరిగింది. భారత స్కౌట్స్, గైడ్స్, బాల్‌కన్-జి-బారీ, కిషోర్ దాల్, బాఛంకీ బిరదారీ, తదితర బాలల కేంద్రాలు మొదలైన ఉద్యమాలు బాలలు తమ విరామ సమయాలను ఉపయో గించుకోవడానికి అనేక సౌకర్యాలను ఏర్పరచడానికి కృషిచేశాయి. ఈ కృషి ఫలితంగా సెలవు దినాలలో కేంప్‌లు, పిక్‌నిక్‌లు, విద్యా వినోద యాత్రలు, పాటలు, డ్రామాలు, నృత్యాలు, ఉత్సవాలు, ప్రత్యేక బాలల చలనచిత్రాలు చూపించడం, బాలల పాఠ్య గ్రంథా లయాలను ఏర్పరచడం, పాటలు, ఆటల ప్రదర్శనలు మొదలైన క్రమాలన్నీ కూడా వినోద కార్యక్రమాలలో చేర్చడం జ వీటిలో బాల్‌కన్-జి-బారీ అభివృద్ధి చెందుతున్న క్రీడా వినోద వ ఈ వ్యవస్థ ముఖ్యోద్దేశం భారతదేశంలో నలుమూలలా గల

బాలికలను చేరదీసి కేంపులు, ఉత్సవాలు మొదలైనవానిలో అందరూ కలిసేలాగ చేయడం బాలల కేంద్రాలు అనేక ఆటస్థలాలను ఏర్పరచినవి. అంతేకాక బాలల గ్రంథాలయాలు, డ్రామాహాల్స్, మొదలైన సౌకర్యాలను కూడా ఏర్పరచి అభివృద్ధి చెందుతున్న బాలలను అనేక కళలలోను, చేతిపనులలోను, ప్రోత్సాహాన్ని కలుగజేస్తున్నాయి. ఈ విధంగా బాలల శక్తిసామర్థ్యాలను, నైపుణ్యాతను అభివృద్ధిపరచడమే కాక వారి వినోద కార్యక్రమాలను కూడా విస్తృతం చేయడం జరిగింది.

భారతదేశంలో అధిక సంఖ్యాకులు, వినోద సౌకర్యాలను విలాసాలుగా భావించి వాటిమీద ఖర్చుచేయడం అనవసరమనీ, వాటివల్ల పిల్లలు చెడిపోతారనే దురభిప్రాయాన్ని కలిగిఉన్నారు. కనుక ఎక్కువ మంది బాలబాలికలు వినోద కార్యక్రమాలలో పాల్గొనడానికి తల్లిదండ్రుల ప్రోత్సాహం లేకపోవడంవల్ల ముందుకు రావడంలేదు. భారతదేశంలోగల విజ్ఞాన వినోద రంగాలను ఈ కింది విధంగా పేర్కొనవచ్చు.

1. భౌతికమైనవి :- ఆటలు, ఎథలెటిక్స్, పర్వతారోహణం.
2. సృజనాత్మకమైనవి :- సంగీత నాటక కళలు, చేతిపనులు.
3. మానసికమైనవి :- చర్చలు, డిబేట్ పోటీలు మొదలైనవి.
4. సాంఘికమైనవి :- విహారయాత్రలు
5. సాంస్కృతికమైనవి :- పండగలు, ఊరేగింపులు మొదలైనవి. ఇవేకాక సెలవురోజు కేంపుల ద్వారా బాలల వినోద కార్యక్రమాలను పెంపొందించవచ్చు.

1958 వ సంవత్సరంలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ సెలవు దిన కేంపులనే ప్రత్యేక పథకం ఆరంభించింది. 12 నుండి 16 సంవత్సరాల మధ్య వయసుగల బాలలకు సెలవుదిన కేంపులు నెలకొల్పారు. సెలవు దిన కేంపులకు హాజరయ్యే బాలల తలిదండ్రుల సంవత్సరాదాయం 3,000 రూపాయలుగానీ లేదా అంతకంటె తక్కువగానీ ఉండవచ్చు. 3,000 రూపాయలకంటే ఎక్కువ ఆదాయం గలవారి పిల్లలకు ఈ కేంపులలో ప్రవేశం ఉండదు. బాలల ఆరోగ్యకరమైన, పుష్టికరమైన

అభివృద్ధికి వ్యవస్థితమైన వినోద కార్యక్రమాలు చాలా అవసరం అని గుర్తించడంవల్ల ఈ కేంపులు నెలకొల్పారు. పాఠశాలలకు సెలవు రోజుల సమయంలో 15 రోజులు ఈ కేంప్ ఏర్పాటు చేయడం జరుగుతుంది. ఈ కేంపుల ముఖ్యోద్దేశం పేద బాలలు సెలవు దినాలలో ఎటువంటి మార్పు లేకుండా ఉండే బదులు వారు కొత్తరకమైన జీవితాన్ని సంతోషంగా కొన్ని రోజులైన గడపటానికి వీలుగా వినోద కార్యక్రమాలను ఏర్పరచడం, అంతేకాక వినోద కార్యక్రమాలలో పాల్గొనజేసి బాలలకు సామూహిక జీవితాన్ని రూపొందించి వారు నాయకత్వ లక్షణాలు అభివృద్ధి పరచుకొనేలాగ చేయడం.

1959–60 లో ఇటువంటి కేంపుల సంఖ్య 24. అవి 1968–69 నాటికి 250 కి పెరిగాయి. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ స్వచ్ఛంద సేవా సంస్థలకు గ్రాంటులను మంజూరుచేసి సెలవురోజుల కేంపులను ప్రోత్సాహపరచడం జరిగింది. 1977–78 నాటికి 372 కేంపులను ఏర్పరచడానికి గ్రాంటులను ఇచ్చారు.

తక్కువ ఆదాయంగల కుటుంబాలనుంచి వచ్చిన బాలలకు సెలవు దిన క్యాంపులతోపాటు ఇంకనూ అనేక వినోద కార్యక్రమాలను ప్రవేశపెట్టడం జరిగింది. అవి ఏవంటే —

1. రాష్ట్ర సాంఘికసంక్షేమ విభాగాలు శిశుగృహాలు ప్రారంభించాయి.
2. పగటి నర్సరీలు, అనేక పాఠశాల పూర్వవయసుగల బాలల కేంద్రాలుకూడా తెరువడం జరిగింది. ఇవి ఉద్యోగం చేసుకుంటున్న తల్లుల పిల్లలకు ఎక్కువగా ఉపయోగపడుతున్నాయి. కారాగారాలలో పనిచేసే స్త్రీల, పిల్లలకు కారాగారాలలో శిశుగృహాలను ప్రవేశపెట్టడం కారాగార చట్టంద్వారా నిర్బంధం చేయడం జరిగింది. అంతేకాక పాఠశాల పూర్వవయసుగల బాలల సంపూర్ణ అభివృద్ధి ప్రాజెక్టులను (Integrated pre school project) కూడా ప్రవేశపెట్టారు. ఈ ప్రాజెక్టులను 1964 వ సంవత్సరంలో కేంద్ర సాంఘికసంక్షేమ సంస్థ చేపట్టడం జరిగింది. ఈ ప్రాజెక్టుల ద్వారా మురికివాడలలో నివసించే బాలలకు, తక్కువ ఆదాయంగల

కుటుంబాలనుంచి వచ్చే పిల్లలకు శారీరక, మానసిక ఆరోగ్యాభి వృద్ధికోసం సౌకర్యాలను ఏర్పాటుచేయడం జరిగింది. 1969వ సంవత్సరం నాటికి ఇటువంటి ప్రాజెక్ట్‌లు 10 నెలకొల్పటం జరిగింది.

బాలలల వినోద కార్యక్రమాలను అభివృద్ధిపరచాలంటే ప్రజలకు వినోద కార్యక్రమాల ప్రాముఖ్యతను తెలియజేయాలి. అధిక సంఖ్యాకు లకు అందుబాటులో ఉండేలాగ వినోద కార్యక్రమాలను ఎక్కువ సంఖ్యలో నలుమూలలా ఏర్పాటుచేయాలి.

## బాలల సంక్షేమం - సంస్థాగత, అసంస్థాగత సేవలు

భారతదేశంలో ఆధునిక పద్ధతులలో బాలల సంక్షేమ సేవా కార్యక్రమాలను రెండు ప్రధాన భాగాలకు విభజించవచ్చు. అవి —

(1) సంస్థాగత సేవలు. (2) అసంస్థాగత సేవలు.

## 1. సంస్థాగత సేవలు

సంస్థాగత సేవలను ఈ కింది విధంగా పేర్కొనవచ్చు. **1.** పరిత్యక్తులైన పిల్లల గృహాలు. 2. దిక్కులేని బాలల గృహాలు. 3. పెంపుడు గృహాలు. 4. బాలాపచారుల గృహాలు. 5. నివాస పాఠశాలలు 6. రాత్రి వసతి గృహాలు.

బాలల శారీరక, మానసిక ఆరోగ్యాభివృద్ధికి ఆరోగ్యకరమైన గృహ వాతావరణం అవసరం. కానీ కొన్ని సందర్భాలలో పిల్లల పెరుగుదలకు అవసరమైన పరిస్థితులు కుటుంబంలో లభ్యం కాకపోవచ్చు. అటువంటి సమయాలలో బాలలను ప్రత్యేక సంస్థలలో చేర్చవలసిన అవసరం ఏర్పడుతుంది ముఖ్యంగా శారీరకంగాగానీ, మానసికంగాగానీ, సాంఘికంగాగానీ ఏదో ఒక లోపంవుండి ప్రత్యేక శ్రద్ధ, సేవ అవసరమైన బాలలను ఇట్లాంటి సంస్థలలో చేర్చడం అవసరమౌతుంది. బాలలలో అనాథలు, శారీరక, మానసిక లోపాలున్నవారు, ప్రవర్తనలో లోపం ఉన్నవారు సంస్థాగత సేవలకు అర్హులు. దీర్ఘ అనారోగ్యంవలన, నిరుద్యోగం వలన, జైలు శిక్షల వలన, విడాకుల వలన కుటుంబాలు విచ్ఛిన్నమై బాలలకు అనువైన వాతావరణం లేకపోతే వారు తిరుగు

బోతులుగాను, జేబుదొంగలుగాను తయారవడం జరుగుతుంది. ఈ విధంగా వారు సమాజానికి సమస్యగా తయారవుతున్నారు. ఇటువంటి కుటుంబాలనుంచి వచ్చిన బాలలను సంస్థలలో చేర్చి రక్షణ ఇవ్వడం ఎంతో శ్రేయస్కరం. సంస్థలలో వారుపొందే సేవ వారి వ్యక్తిగత సమస్యలపై ఆధారపడి ఉంటుంది. ఈ సంస్థలు కనీస ప్రమాణాలను నిర్ణయించుకుని ఆ ప్రమాణాలపై నడుస్తుంటాయి. సాధ్యమైనంతవరకు బాలలకు పునరావాసాన్ని కల్పించడమే ఈ సంస్థల ముఖ్యోద్దేశం. అంతేకాక శారీరకంగాను, మానసికంగాను అభివృద్ధి చెందుతున్న పిల్లలకు ప్రతీదేశంలోను వారికి సంతృప్తికరమైన అనుభవాలను కల్పించడానికి కృషిచేస్తాయి. ఈ అనుభవాలను కలిగించడానికి అవసరమైన కార్యక్రమాలను ఏర్పాటుచేయాలి. ఈ సంస్థలలో శిక్షణపొందిన వ్యక్తులను నియమిస్తారు. బాలల శారీరక, మానసిక, సాంస్కృతిక అభివృద్ధికి కృషిచేస్తాయి. బాలలకు ప్రత్యామ్నాయ గృహాలుగా ఈ సంస్థలు కనపడేటట్లు చేయడమే సంస్థాగత సేవల ఆశయం. సంస్థాగత సేవలను మరల రెండు రకాలుగా విభజించవచ్చు.

(1) సంస్కరణ సంస్థలు (2) సంస్కరణేతర సంస్థలు

## సంస్కరణా సంస్థలు

వక్రప్రవర్తన గల బాలలను నిర్బంధంలో ఉంచి వారిప్రవర్తనా విషయాల పరిశీలనలో శ్రద్ధవహించి వారికి శిక్షాకాలం పూర్తయిన తరువాత వారికి పునరావాసం కల్పించడం ఈ సంస్థల ముఖ్యలక్ష్యం. బాల న్యాయస్థానాల ద్వారా శిక్షనుపొందిన పిల్లలను ఈ సంస్థలు చేర్చుకుని వారి ప్రవర్తనను సంస్కరిస్తాయి. ముఖ్యంగా సంఘవ్యతిరేక చర్యలలోను, చట్టవిరుద్ధ చర్యలలోను పాల్గొనే పిల్లలను ఇటువంటి సంస్థలలో చేర్చడం జరుగుతుంది.

## బాలల న్యాయస్థానం

ప్రభుత్వం బాలల సంరక్షణా బాధ్యతను వహించి వారి సంక్షేమానికి తోడ్పడాలనే ఆశయంతో ఈ న్యాయస్థానాలను ఏర్పరచడం

జరిగింది. ఈ న్యాయస్థానంలో ఒక మేజిస్ట్రేట్‌ను నియమిస్తారు. సాధారణంగా మానసిక పరిణతి పొంది, విద్యాధికత కలిగి, న్యాయశాస్త్ర పరిజ్ఞానం కలిగి, బాలల సమస్యలను అర్థం చేసుకోగలిగి, బాలలపట్ల సానుభూతితో వ్యవహరించగలిగిన వ్యక్తిని మేజిస్ట్రేట్‌గా నియమించడం జరుగుతుంది. ఈ న్యాయస్థానాలు 7 నుంచి 18 సంవత్సరాల మధ్య వయసు గల అనారోగ్య, అవినీతి, పరిసరాల నుంచి వచ్చిన బాలల విషయంలోను, అనాథలు, నేరస్థులు, ఉపేక్షితులు అయిన బాలల విషయంలోను శ్రద్ధ వహిస్తాయి. ఈ న్యాయస్థానంలో సంకెళ్ళు వేయడం, న్యాయవాదులు వాదించడం మొదలైనవి జరగవు పోలీసు అధికారులు కూడా సివిల్ దుస్తులలోనే న్యాయస్థానానికి వెళతారు. ఈ బాలల బాధ్యత పర్యవేక్షణాధికారి వహిస్తాడు. ఈ న్యాయస్థానాలలో శిక్ష, నిర్బంధం వంటి పదజాలాలను ఉపయోగించరు. ఈ న్యాయస్థానాల ముఖ్యలక్ష్యం శిక్షించడం కాదు. సంస్కరించడం మాత్రమే దారిద్ర్యం, ఆకలి, అనారోగ్యం, అజ్ఞానం, బాలల నైతిక పతనానికి దారితీసే పరిసరాలు మొదలైన కారణాలవల్ల బాలలు ఈ న్యాయస్థానానికి హాజరుకావడం జరుగుతుంది. ఇటువంటి పరిస్థితులలో బాలల పట్ల శ్రద్ధ వహించేవారు లేకపోవడంవల్ల వారు భిక్షాటన, తిరుగుబోతుతనం, చిన్నచిన్న దొంగతనాలు చేయడం మొదలైన సంఘ వ్యతిరేక, చట్టవిరుద్ధ చర్యలు ఆరంభిస్తారు. ఈ రకమైన బాలలను బాలల న్యాయస్థానాలు విచారణచేసి సంస్కరణ సంస్థలకు పంపించడం జరుగుతుంది. ఈ సంస్థలలో బాలలకు ఉచితాహారం, వసతి సదుపాయాలు కల్పించి విద్యా, వృత్తి శిక్షణలను నేర్పి వారిని అత్యంత శ్రద్ధగా పరిశీలిస్తారు. ఆర్థికంగా, సాంఘికంగా పునరావాసాన్ని కూడా వారికి కల్పిస్తారు.

మొట్టమొదటి ప్రత్యేక బాలల న్యాయస్థానం 1915 లో కలకత్తాలో నెలకొల్పబడింది. ఈ న్యాయస్థానం 15 సంవత్సరాలలోపు పిల్లలకు సంస్కరణా కార్యక్రమాలను నిర్ణయించడానికి నెలకొల్పబడింది. ఇటువంటి బాలల న్యాయస్థానాలు మద్రాస్‌లో 1920 లోను, కలకత్తాలో 1922 లోను, బొంబాయిలో 1924 లోను నెలకొల్ప

బడ్డాయి. ఇవి ఆయా రాష్ట్ర బాలల చట్టాల నిర్దిష్టం ప్రకారం నెల కొల్పడం జరిగింది. 1950 వ సంవత్సరంలో కేంద్ర విద్యా శాఖాధికారి రిపోర్ట్ ప్రకారం మన దేశంలో 39 బాలల న్యాయస్థానాలను నెలకొల్పి నట్లు పేర్కొన్నారు. ఈ బాలల న్యాయస్థానాలలో నేరస్తుని నేరం నిర్ణయించిన తరువాత వారిని వివిధ సంస్కరణా సంస్థలకు తరలిస్తారు. వివిధ సంస్కరణా సంస్థలను ఈ కింది విధంగా పేర్కొనవచ్చు. —

(1) బందీగృహాలు (2) ధృవీకృత పాఠశాలలు
(3) పునర్నిర్మాణ గృహాలు (4) బోర్టస్టల్ పాఠశాలలు
(5) ఆశ్రలి గృహాలు (6) పెంపుడు గృహాలు మొదలైనవి.

## 1. బందీ గృహాలు (Remand homes)

నేరం చేసిన బాలలను 24 గంటలలో బాలల న్యాయాధికారి ఎదుట చేర్చడం జరుగుతుంది. ఆ బాలురు చేసిన నేర విచారణ న్యాయస్థానంలో జరిగేవరకు బాలలను బందీ గృహాలలో ఉంచడం జరుగుతుంది. నేరం పరిష్కారం అయ్యేవరకు బాలలను సురక్షితంగా ఉంచడం ఈ బందీ గృహాల ముఖ్యలక్ష్యం. ఈ సంస్థలలో బాలల శారీరక, మానసిక, నైతిక పరిస్థితిని సంరక్షిస్తూ పర్యవేక్షిస్తూ ఉంటారు. ఈ బందీగృహాలలో బాలలకు వినోద వికాస కార్యక్రమాలను ఏర్పాటు చేయడం జరుగుతుంది. ఈ బాలలను పరిశీలించి విషయసేకరణచేసి రికార్డులను భద్రపరచడం.

ఈ సంస్థలు బాలల న్యాయస్థాలు నిర్ణయించిన ప్రమాణాలను బట్టి పనిచేస్తాయి. నేరం పరిష్కారమైన తరువాత అవసరమయితే ఈ సంస్థనుంచి బాలలను సంస్కరణా సంస్థలకు పంపడం జరుగుతుంది. కొన్నిసమయాలలలో బాలలను బందీ గృహాలలోనే ఉచిత చికిత్స ఇవ్వడం కూడా జరుగుతుంది.

బాలలు బందీ గృహాలలోనే ఉన్నప్పుడు పర్యవేక్షణాధికారి ఈ బాలల గృహపరిశీలనలు జరిపి వారి సాంఘిక, మానసిక విషయాలను కూలంకషంగా సేకరించి కోర్టువారికి అందజేస్తారు. ఈ రిపోర్టునుబట్టి

బాలల నేరాన్ని నిర్ణయించి ఆ బాలలను తలిదండ్రులకుగానీ, సంరక్షకు లకుగానీ అందజేయడమో లేదా సంస్థల్లో చేర్చడమో చేస్తారు.

## 2. ధృవీకృత పాఠశాల (Certified School)

దీర్ఘకాల చికిత్స కోసం బాలలను ధృవీకృత పాఠశాలలకు పంపు తారు. ఈ సంస్థలు చాలామటుకు స్వచ్ఛందమైనవి. వీటికి ప్రభుత్వం ధన సహాయం చేస్తుంది. ఈ ధృవీకృత పాఠశాలలు రెండు రకాలుగా ఉంటాయి. (1) సీనియర్ ధృవీకృత పాఠశాల (2) జూనియర్ ధృవీ కృత పాఠశాల. 12 సంవత్సరాలలోపు బాలలను జూనియర్ ధృవీకృత పాఠశాలలోను, 16 సంవత్సరాలలోపు బాలలను సీనియర్ ధృవీకృత పాఠశాలలోను ఉంచుతారు. ఈ పాఠశాలలలో మామూలు విద్యతో పాటు సాంకేతిక విద్య కూడా నేర్పుతారు. ఈ పాఠశాలలలో సాధార ణంగా బాలలను రెండు లేదా మూడు సంవత్సరాలపాటు ఉంచుతారు. ఈలోపున వారి ప్రవర్తననుబట్టి, శిక్షనుబట్టి విడుదల చేయవచ్చు. లేదా మరియే సంస్కరణ సంస్థలకుగానీ పంపవచ్చు.

## 3. సంస్కరణ గృహాలు (Reformatory Houses)

నేరస్థులైన బాలలకు వృత్తి విద్యా శిక్షణ ఇస్తారు. ఈ వృత్తి విద్య బాలలు చేసిన నేరాలను దృష్టిలో పెట్టుకుని నిర్ణయిస్తారు. అనా రోగ్యకరమైన, అవినీతికరమైన వాతావరణంనుంచి బాలలను తొలగించి ఈ సంస్థలలో కొంతకాలంపాటు ఉంచుతారు. ఆ తరువాత ఈ సంస్థ లలో నేర్చుకొన్న వృత్తి శిక్షణా సహాయం ద్వారా జీవనోపాధిని సంపాదించుకోగలరు.

## 4. బోర్స్టల్ పాఠశాలలు (Borstal Schools)

15–21 సంవత్సరాల మధ్య వయసు గల బాలనేరస్థులను బోర్స్టల్ స్కూల్లో పెడతారు. వీరికి ప్రత్యేక చికిత్స చేస్తారు. ఇది కూడా బాలనేరస్థులను సంస్కరించడానికి ఉపయోగపడుతుంది. ఈ పాఠశాలలు రెండు రకాలుగా ఉంటాయి. (1) బందిత పాఠశాలలు (Closed Borstal Schools) (2) స్వేచ్ఛా పాఠశాలలు (Open

Borstal School) స్వేచ్ఛా పాఠశాలలలో రక్షణ కుడ్యాలు ఉండవు. బంధిత పాఠశాలలలో జైలులో వలె నేరస్తులు బంధించబడి ఉంటారు. ఇందులోగల నేరస్తులు పాఠశాల లోపలనే వారి కార్యక్రమాలన్నీ జరుపుకుంటారు. బాలల వయసునుబట్టి శిక్షణ నిర్ణయిస్తారు. ఈ పాఠశాలలలో శిక్షణ చాలా కష్టమైనదిగాను, క్లిష్టమైనదిగాను ఉంటుంది. బాలుర అభిరుచులనుబట్టి వారికి వేరువేరు వృత్తి విద్యలలో శిక్షణ ఇస్తారు. ఈ శిక్షణ బాలనేరస్తుల భావిజీవితానికి భద్రత ఏర్పరచి వారిని భాగ్యతాయుత, సుశిక్షిత వ్యక్తులుగా తీర్చిదిద్దడానికి దోహదం చేస్తాయి. సాధారణంగా ఈ పాఠశాలలలో నేరస్తులను రెండు, మూడు సంవత్సరాలపాటు ఉంచి వారి శీలాన్ని, ప్రవర్తనను, పరిశీలించి తరువాత విడుదల చేస్తారు. బాలురు ఈ పాఠశాలలలో శిక్షణపొందిన వృత్తిలో స్థిరపడేట్లు చూడటానికి పరివీక్షణాధికారులు (Probation Officers) ను నియమించి వారికి శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటు చేస్తారు. దేశంలో అనేక రాష్ట్రాలలో ఈ బోర్స్టల్ పాఠశాలలు పనిచేస్తున్నాయి. ఈ సంస్థలలో శిక్షణ పొందిన బాలలు విడుదల అయిన తరువాత తిరిగి నేరం చేయకుండా ఉండేలాగ చేయడం కోసం వారిచేత అతికష్టతరమైన పనులను చేయిస్తారు. బాలబాలికలకు శిక్షణ వేరువేరుగా ఉంటుంది. బాలల ప్రవర్తననుబట్టి వారి శిక్షా కాలాన్ని తగ్గించడం లేదా హెచ్చించడం జరుగుతుంది. ఈ పాఠశాల నుంచి నేరస్తులను విడుదల చేసిన తరువాతకూడా పరివీక్షణాధికారి ఆ బాలల ప్రవర్తనను పరిశీలిస్తూ ఉంటాడు.

## 5. ఆక్సలరీ గృహాలు (Auxiallary Homes)

ధృవీకృత పాఠశాలలలో చేరడానికి పూర్వం బాలనేరస్తులను ఆక్సలరీ గృహాలలో ఉంచడం జరుగుతుంది. బాలనేరస్తులను ఈ గృహాలలో కొంతకాలంపాటు ఉంచి పరిశీలించిన తరువాత వారి అభిరుచుల కనుకూలంగా శిక్షణ ఇవ్వడానికి ధృవీకృత పాఠశాలలకు పంపుతారు.

## 6. పెంపుడు గృహాలు (Foster Homes)

పది సంవత్సరాల లోపు బాలనేరస్తులను పెంపుడు గృహాలలో ఉంచడం జరుగుతుంది. ధృవీకృత పాఠశాలలకు పంపడానికి అవకాశం లేని వారిని పెంపుడు గృహాలలో ఉంచుతారు.

## సంస్కరణేతర సంస్థలు

శారీరకంగా, మానసికంగా, సాంఘికంగా అశక్తత కలిగివుండి ఆ అశక్తతమూలంగా తమను తాము చూచుకోలేక ప్రత్యేక సహాయం అవసరమున్న బాలల విషయంలో ఈ సంస్కరణేతర సంస్థలు శ్రద్ధ వహిస్తాయి. ఈ బాలలలో ప్రవర్తన లోపం ఉండదు. కనక సంస్కరణా ప్రమేయంలేదు. ఈ అశక్తతలు మూడు రకాలు. (1) శారీరక అశక్తత (2) మానసిక అశక్తత (3) సాంఘిక అశక్తత.

## 1. బాలల శారీరక అశక్తత - సంస్థాగత సేవలు

పుట్టుక నుంచి వికలత్వం పొందడంగానీ లేదా చిన్నతనంలోనే ఆ దురదృష్టాన్ని పొందినవారుగానీ ఆరోగ్యకరమైన బాలలవలే సాధారణ సౌకర్యాలను అనుభవించడానికి శారీరక అసమర్థత ఆటంకమవుతుంది. కనుక అటువంటివారికి ప్రత్యేక సౌకర్యాలను ఏర్పాటుచేయాలి. వారు ఒంటరితనాన్ని అనుభవించడంవలన సాంఘిక అసమయోజత్వాన్ని పొంది విచలిత ప్రవర్తనకు దారితీయడం జరుగుతుంది. వారిని తమ తల్లిదండ్రులు కూడా ఉపేక్షించడంవల్ల లేదా అతి గారాబం చేయడంవల్లకూడా వారిలో వికలాంగులం అనే తక్కువ భావం ఏర్పడిపోవడంవల్ల చికిత్సకుగానీ, పునరావాసానికిగానీ, అవకాశం కలుగజేయడం లేదు. ఇటువంటి వారికి ప్రత్యేక సంరక్షణ చాలా అవసరం. ఈ సంరక్షణవలన వారికి ప్రత్యేక శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. ఈ ప్రత్యేక శిక్షణద్వారా వారు వికలాంగులు అనే భావం లేకుండా తమంత తాము తమ పనులను చేసుకోడానికి ప్రయత్నిస్తారు. ఈ వృత్తి శిక్షణలకు సరిపోయిన ఉద్యోగావకాశాలను ఏర్పాటు చేయడం కూడా చాలా ముఖ్యం.

భారత దేశంలో 19 వ శతాబ్దం చివరిదశలో అంధత్వం, మూగ, చెముడు గల బాలలకు సంస్థాగత సేవలు స్వచ్ఛంద సంస్థల ద్వారా చేస్తున్నారు. 1958 వ సంవత్సరం నాటికి 1,500 అంధులకు సేవ చేయడానికి 55 సంస్థలు ఏర్పడ్డాయి. 2,000 అంధులకు 45 బ్రెయిలీ పాఠశాలలు స్థాపించారు. గుడ్డి, మూగ, చెవుడు, కుంటి మొదలైన అంగవైకల్యం గల బాలబాలికలకు సంస్థాగత సేవలు ఎక్కువగా స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా చేయడం జరుగుతోంది. కానీ వీటికి ప్రాంతీయ, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ గ్రాంటులను ఇస్తున్నాయి. పూర్తిగా ప్రభుత్వం నడిపే ఇటువంటి సంస్థలు మన దేశంలో చాలా తక్కువగా ఉన్నాయని చెప్పవచ్చు.

విద్యాశాఖ అధునాతనంగా గుడ్డి, చెముడు, మూగ బాలలకు వృత్తి శిక్షణ ఇవ్వడానికి, వారి అభివృద్ధికై పరిశోధనలు చేయడానికి సమావేశాలు జరుపుకోవడానికి ప్రత్యేక సంస్థలను ఏర్పరచడం జరిగింది.

చెముడు మూగ, గుడ్డి, అంగవైకల్యంవంటి శారీరక అశక్తతలు ఉన్న బాలలకు ప్రత్యేక సేవా సంస్థలు అవసరం. వీరికి శ్రద్ధతో తగిన విద్య, వృత్తి శిక్షణలను ఇచ్చి ఆర్థికంగా పునరావాసాన్ని కల్పించకపోతే వీరు సమాజానికి భారంగా తయారై పరాన్న జీవులుగా మిగిలిపోయే ప్రమాదముంది. కనుక వీరి సమస్యలను, మానసిక ఆందోళనలను అర్థంచేసుకొని ప్రోత్సహించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆ బాలలకు గల ప్రత్యేక అవసరాలను బట్టి వారికి చెందిన విద్యాబోధన, వృత్తి శిక్షణా పద్ధతులను ఏర్పాటుచేయాలి. అంధులు, చెవిటివారికి ప్రత్యేక విద్యా సంస్థలను కూడా ఏర్పాటుచేయడం జరిగింది. అంధులకు బ్రెయిలీ లిపి ద్వారాను, ఇతర పరికరాలద్వారాను విద్య నేర్పుతారు. చెవిటివారికి శ్రవణ సాధనాలను ఉపయోగిస్తారు. అంగవైకల్యంగల పిల్లలకు సంస్థలద్వారా కృత్రిమ అంగాలను సరఫరా చేస్తారు. దీనికి ఎముకల నిపుణుడైన వైద్యుని సంప్రదించి ఆయన సలహా ప్రకారం ఎవరికి ఏవిధమైన కృత్రిమ అంగాలు అవసరమో వారికి ఆ అంగాలను ఏర్పాటుచేయడం జరుగుతుంది.

శారీరక వికలాంగుల సంక్షేమానికి ముఖ్యంగా రెండు రకాలయిన చర్యలున్నాయి. —

1. నిరోధక చర్య అంటే కనీస సేవలవల్ల బాలలు సాధ్యమైనంతవరకూ అంగవైకల్యాన్ని పొందకుండా ఉండేలాగ సంరక్షించడం.
2. శారీరక వైకల్యం గలవారిని ప్రత్యేక పద్ధతిలో విద్యా, వృత్తిశిక్షణ ఏర్పాటుచేసి వారికి పునరావాసాన్ని కల్పించడం. దీనివల్ల అంగవైకల్యం గల బాలలు సమాజంపై పరాన్న జీవులుగా ఆధారపడకుండా తమంతట తాము జీవించగలిగేలాగ చేయడమే కాక దేశానికి ఉపయోగకరమైన పౌరులుగాకూడా తయారుచేసే వీలవుతుంది.

భారతదేశంలో సుమారు 0.5 మిలియన్ల చెవిటి బాలలు, 0.2 మిలియన్ల మానసిక మాంద్యంగల బాలలు ఉన్నారని తెలియజేయబడింది. దీనినిబట్టి మొత్తం జనాభాలో 5 శాతం వికలాంగులు ఉన్నారని తెలుస్తున్నది. అంధత్వాన్ని చాలవరకు నిరోధించవచ్చు. అంధులకు ఏర్పరచిన సంక్షేమ సేవలలో అంధత్వాన్ని తొలగించడానికి చికిత్స, సంస్కరణ సేవలు ఆరంభించడం జరిగింది. అశ్రద్ధ, లోపభూయిష్టమైన ఆహారపదార్థాలు తినడం మొదలైన వాటివల్ల ఏర్పడిన అంధత్వాన్ని నిర్మూలించవచ్చు. ఈ విషయంలో తలిదండ్రులకు బోధన చేయడం ద్వారా ఈ సమస్య కొంతవరకు నిరోధించవచ్చు.

వివిధ రకాల అంగవైకల్యం గలవారికి ప్రత్యేకంగా వివిధ జాతీయ వ్యవస్థలు నెలకొల్పబడ్డాయి. ఈ సంస్థలు అంగవైకల్యాల చికిత్స, పునరావాస కార్యక్రమాలు, పరిశోధనలు, అభివృద్ధికి కూడా ఏర్పరచబడ్డాయి. అవి — (1) ది నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ది విసుయల్లీ హేండీకేప్డ్ (The National Institute of the visually Handicapped) అనే సంస్థ ప్రస్తుతం పరిశీలన, వృత్తిశిక్షణ, అభివృద్ధి పథకాలలో నిమగ్నమయింది. దీని కార్యక్రమాలన్నీ జాతీయ స్థాయిలో జరుగుతాయి.

(2) డెహ్రాడూన్‌లోగల అంధులకు ది నేషనల్ సెంటర్ ఫర్ ది బ్లైండ్ (The National Centre for the Blind) అంధుల జాతీయ

సంస్థతో కలిసిపోయింది. ఇవి రెండూ కలిసి అంధ బాలలకు మాధ్యమిక పాఠశాలలు, వృత్తి శిక్షణా కేంద్రాలు ఏర్పాటు చేశాయి. పాక్షిక అంధత్వం గలవారికి పాఠశాలలు, బ్రెయిలీ లిపి, విద్యకై కావలసిన పరికరాలు తయారు చేయడానికి ఒక వర్క్ షాప్ కూడా ఉంది. బ్రెయిలీ జాతీయ గ్రంథాలయం కూడా ఈ సంస్థలలోవుంది. కలకత్తాలో కాళ్ళు, చేతులు లేనివారికి ఒక జాతీయ సంస్థ నెలకొల్పబడింది.

ది నేషనల్ పాలసీ రిజల్యూషన్ ఆన్ ఎడ్యుకేషన్ (The National Policy on Education) సూచన ప్రకారం అంగవైకల్యం పొందిన బాలలను కూడా సాధ్యమైనంతవరకూ సాధారణ పాఠశాలల లోనే ప్రవేశం కలుగజేయాలి.

ప్రభుత్వం గుడ్డి, మూగ, చెముడు, కుంటి మొదలైన వారికి స్కాలర్ షిప్‌లను కూడా మంజూరు చేసింది. సాధారణ, సాంకేతిక, వృత్తి విద్యలలో ప్రోత్సాహాన్ని కలుగజెయడానికి ఎంతో కృషి చేస్తున్నది. మొదటి పంచవర్ష ప్రణాళిక నాటికి సంవత్సరానికి 50 స్కాలర్ షిప్‌లు మాత్రమే ఉండేవి. 1975 వ సంవత్సరం నాటికి వీటి సంఖ్య 6,500 కు పెరిగింది. అంతేకాక పారిశ్రామిక, వాణిజ్య రంగాలలో శిక్షణ పొందుతున్న 14 నుండి 40 సంవత్సరాల మధ్య వయసుగల వికలాంగులకు ప్రత్యేక స్టైయిఫండ్‌లను ఇవ్వడంజరిగింది. ప్రత్యేక ఎంప్లాయిమెంట్ కేంద్రాల ద్వారా 14,000 శారీరక వైకల్యం గలవారు ఉద్యోగాలను పొందగలిగారు. అంగవైకల్యం గలవారికి స్వయం ఉపాధికల్పనకై ప్రభుత్వం బ్యాంకుల ద్వారా ఋణాలను కూడా మంజూరు చేయడం జరిగింది. 1975–76 నాటికి కేంద్ర ప్రభుత్వం 90 వ్యవస్థలకు గ్రాంటులను ఇచ్చింది. దీనికై 6.5 మిలియన్ల రూపాయలను ఖర్చు చేయడం జరిగింది.

1978–79 నాటికి 9 మిలియన్ల రూపాయలను 120 వ్యవస్థలకు అందజేయడమైంది.

దేశం నలుమూలలా గల అంధబాలలకు 156 పాఠశాలలు, శిక్షణా కేంద్రాలు నెలకొల్పారు. దేశం మొత్తంమీద బొంబాయి.

కలకత్తా, ఢిల్లీ, మద్రాసు నగరాలలో నాలుగు శిక్షణా కే
లున్నాయి. ఈ కేంద్రాలు సంవత్సరానికి 40 నుంచి 50 వరకు
విద్యార్థులకు ఉపాధ్యాయులను తయారు చేస్తున్నది. ఇటువంటి శి
కేంద్రాలు దేశం నలుమూలలా 17 నెలకొల్పారు. ఈ పథకం 195
ప్రవేశపెట్టబడింది. 1979 నాటికి 17,317 శారీరక వికలాంగ
ఉద్యోగాలు ఇచ్చారు. సారస్వత కేంద్రాలలో కూడా ప్ర
ఎంప్లాయిమెంట్ అధికార్లను నియమించి వికలాంగులకు ప్ర
ఉద్యోగావకాశాలను ఏర్పాటుచేయడం జరిగింది.

కాళ్ళు, చేతులు లేనివారికి సాధారణమైన, మన్నికగల తక
ఖరీదులో లభించేలాగ సాధనాలను సరఫరాచేసి వారుకూడా
పౌరులవలే సమాజంలో సర్దుబాటు చేసుకోవడానికి ప్రభుత్వం
అవకాశాలను కలుగజేస్తున్నది. కాన్పూర్ లోగల కృత్రిమ అవయ
ఉత్పత్తి కార్పొరేషన్ వివిధ రకాల కృత్రిమ అవయవాలను త
చేసి అందరికి అందుబాటులో ఉండేలాగ ఏర్పాటుచేస్తున్నది.
ప్రభుత్వం ప్రభుత్వ రంగాల ఉద్యోగావకాశాలలో 3 శాతం వికల
కేటాయించింది. రాష్ట్రప్రభుత్వాలు కూడా కొన్ని ప్రత్యేక ఉద్యో
కాశాలలో వికలాంగులకు కొంత శాతం కేటాయించడం జరి
వికలాంగులను ప్రోత్సాహపరచడానికి ప్రభుత్వం ప్రతిసంవత్సరం ప్రశ
చెందిన వికలాంగ ఉద్యోగులకు బహుమతులను ఏర్పరచింది. అంతే
వికలాంగులను ఉద్యోగాలలో నియమించుకొనే యాజమాన్యా
కూడా బహుమతులను, ప్రశంసా పత్రాలను ఇస్తున్నది. వికల
ఉద్యోగస్తులకు రాకపోక సౌకర్యాలను ఏర్పరచడానికి ప్రభుత్వం
50 శాతం పెట్రోలు ఖర్చును భరిస్తున్నది. ఈ సౌకర్యంవల్ల విక
గులు తమకు వీలుగాఉన్న వాహనాలను ఉపయోగించుకుని తక
వ్యయంతో ఉద్యోగ స్థలానికి, తదితర స్థలాలకు సులభంగా
రావడానికి అవకాశం కలుగజేయబడింది. అంతేగాక వంటగా
నూనె, నివాస గృహాలు తదితర అవసరాలన్నిటినీ వికలాంగ
భుత్వం తక్కువధరతో సరఫరాచేయడం జరుగుతుంది. ఈ వి

అనేకరకాలైన సౌకర్యాలను కలుగజేసి వారి అభివృద్ధికి తోడ్పడటం జరుగుతున్నది.

## బాలల మానసిక అశక్తత - సంస్థాగత సేవలు

మానసిక సమస్యలు, అశక్తతలు గల పిల్లలకు, ప్రవర్తన సమస్యలు గల పిల్లలకు ప్రత్యేక సేవలు అవసరం. బాలల మార్గనిర్దేశక కేంద్రాలద్వారా బాలలకు సహాయం అందుతుంది. బాలలలో గల ఈ వ్యాధి లక్షణాలు అంతర్గతంగా ఉన్న కొన్ని అలజడులకు చిహ్నాలు, బాలలు తమను తాము వ్యక్తంచేసుకొనే అవకాశం లేనపుడు లేదా ఉన్న అవకాశం క్షీణించినపుడు, వారి అంతరాంతరాలలోగల వాంఛలు తీరక వారిలో మానసికమైన సమస్యలు తలెత్తుతాయి. పరిసరాలతో సర్దుబాటు చేసుకోలేకపోవడంవల్ల కూడా కొంతమంది బాలల మానసిక అస్వస్థకు లోనవుతారు.

భారతదేశంలో మానసిక అశక్తత చెందిన బాలలకు సేవలు చాలా తక్కువగా ఏర్పరచారు. సరైన సమస్యా నిదాన సేవలుకూడా లేకపోవడంవలన మానసిక మాంద్యం గల బాలలను మానసిక వైద్యాలయాలలో చేర్చి వారికి మరింత అయోమయ పరిస్థితిని కలుగజేయడం కూడా కొన్నిచోట్ల జరుగుతున్నది. చాలామంది బాలలను పిచ్చివారని కుటుంబాలనుంచి తరిమివేయడంవల్ల అనాథాశ్రమాలలో చేరడంకూడా జరుగుతున్నది. మానసిక అస్వస్థత, అశక్తతగల బాలలకు విద్య, వృత్తిశిక్షణ ఇవ్వడానికి చాలా తక్కువ సంస్థలు ప్రభుత్వంచేత, స్వచ్ఛంద సేవాసంస్థలచేత నెలకొల్పబడ్డాయి.

విద్యాభ్యాసం చేయగల శక్తి, తెలివితేటలుగల మానసిక వికలాంగులకు కేంద్రప్రభుత్వం సంస్థలను స్థాపించడం జరిగింది. ఇటువంటి సంస్థలను మరింతగా అభివృద్ధి చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఇటువంటి సంస్థలలో నివాస సౌకర్యాలు, పగటి సంరక్షణా సౌకర్యాలను కూడా ఏర్పరచాలి. అంతేకాక సమస్యా నిదానం, చికిత్సా సౌకర్యాలను అభివృద్ధిచేయాలి. మానసిక అశక్తతగల బాలలను సంరక్షించ

డానికి ప్రత్యేక శిక్షణ పొందిన సిబ్బందిని తయారుచేయడానికి శిక్షణా కేంద్రాలను ఏర్పరచాలి. మానసిక మాంద్యం గలవారిని **మూడు** తరగతులుగా విభజించడం జరిగింది.

1. విద్యాభ్యాసం చేయగలిగిన శక్తిగల మానసిక మాంధ్యత
2. శిక్షణ పొందటానికి శక్తిగల మానసిక మాంద్యం
3. ఎట్లాంటి మానసిక శక్తి లేక పూర్తిగా ఇతరులపై ఆధారపడవలసిన మానసిక మాంద్యం

చదువుకోడానికి శక్తిగల మానసిక మాంద్యం గలవారి I.Q 50 మరియు 70 వరకు ఉంటుంది. వారు కొంత విద్య, ఏదో ఒక వృత్తి శిక్షణ నేర్చుకొని ఒక దశలో తమను తాము పోషించుకోగలిగిన స్థాయికి వస్తారు.

వృత్తి శిక్షణ మాత్రమే పొందగలిగినవారి I Q 25 మరియు 50 మాత్రమే ఉంటుంది. వారు తమ పనులను తాము చేసుకోగలిగేటట్లు శిక్షణ ఇచ్చినట్లయితే వారు ఇతరులపై ఆధారపడవలసిన అవసరం ఉండదు. అంతేకాక వారికి కొన్ని వసతి సౌకర్యాలను ఏర్పరచినట్లయితే తాము నేర్చుకున్న వృత్తి శిక్షణతో తమ జీవనోపాధిని తాము సంపాదించుకోగలుగుతాడు.

పూర్తిగా ఒకరిమీద ఆధారపడి జీవించాల్సిన వారి I.Q 25 లోపున ఉంటుంది. ఇట్లాంటి వారికి ఆహారం తీసుకొనేది మొదలుకొని అన్ని విషయాలలోను ఇతరుల సహాయం అవసరముంటుంది. అట్లాంటి బాలలు వారికి ఎదురుగావున్న ప్రమాదాలను కూడా గుర్తించలేరు. కనుక అట్లాంటివారు ప్రమాదాలకు గురికాకుండా ఉంటడంకోసం సంరక్షణ అవసరం. ఈ సంరక్షణకై వారిని సంస్థలలో చేర్చవలసిన ఆవశ్యకత ఏంతైనా ఉన్నది.

ఆధునిక యుగంలో బాలలుమానసిక అశక్తతలకు లోను కాకుండా ఉండటానికి అనేక నిరోధక కార్యక్రమాలను ప్రభుత్వం చేపట్టడం జరిగింది. బాలల మానసిక ఆరోగ్యాభివృద్ధి కోసం పాఠశాల పూర్వ విద్యా పథకాలను ఏర్పరచటం, తల్లులకు పిల్లల పెంపకంలో

తీసుకోవలసిన జాగ్రత్తలను తెలియజేయటంకోసం శిక్షణా కార్యక్రమా లను ఏర్పాటుచేయటం మొదలయిన కార్యక్రమాల బాధ్యత ప్రభుత్వం చేపట్టడం జరిగింది. అయిదో పంచవర్ష ప్రణాళికలో బాలల సంపూర్ణాభి వృద్ధికి సమైక్య బాలల అభివృద్ధి సేవలు (Integrated Child development services) కూడా ఏర్పరచటం జరిగింది.

మానసిక అశక్తతగల బాలలకు ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వం ఒక పాఠశాలను నడుపుతున్నది. ఈ పాఠశాలలో వృత్తిశిక్షణ, మానసిక అశక్తతకు ప్రత్యేక సేవలను ఏర్పాటుచేయడం జరుగుతుంది.

## బాలల సాంఘిక అశక్తత - సంస్థాగత సేవలు

ఆర్థిక, సాంఘిక కుటుంబ పరిస్థితులు సరిగా లేనపుడు కూడా బాలలకు సంస్థాగత సేవలు అవసరమౌతాయి. ఆర్థికంగా వెనుకబడిన దేశాలలో అనాధ బాలల సంఖ్య ఎక్కువగా ఉండటం సహజం. కొందరు బాలలు సంరక్షకులుగానీ, తలిదండ్రులుగానీ లేకపోవడంవల్ల అనాధలవుతున్నారు. ఒంటరితనం, తలిదండ్రులు లేకపోవటం, ఉపేక్ష చేయబడటం, పారిపోవటం, పేదరికం మొదలైన కారణాలవల్ల బాలల సాంఘిక అశక్తతలకు లోనవుతారు. వివిధ రాష్ట్రాలలో సాంఘిక అశక్తతలను పొందిన బాలలను సంరక్షించటానికి అనేక శాసనాలను ప్రవేశపెట్టడం జరిగింది. కానీ ఈ శాసనాలు సంతృప్తికరంగా పని చేయటంలేదు. మిషనరీలు, ఆశ్రమాలు మొదలైనవి అనాధ బాలలకు సంరక్షణ సంస్థలుగా పనిచేస్తున్నవి.

పేదరికంవల్ల అనాధలైన బాలలకు సంస్థాగత సేవల ఆవశ్యకత అంత ఎక్కువగా ఉండదు. పేద బాలలు అనాధలుగా కాకుండా ఉండటానికి వారి తలిదండ్రులకు, వారి పోషణార్థమై కొంత ధన సహాయం చేసినట్లయితే వారు తమపిల్లల అవసరాలు తీర్చడానికి అవకాశం ఉంటుంది. సంరక్షకులు లేని బాలలకు పెంపుడుగృహాలలో పునరావాసాన్ని కల్పించటం మంచిపద్ధతి. లేదా ఆ బాలల బంధువుల కుటుంబాలలో ఉంచి వారి పోషణకు కావలసిన ఆర్థిక సహాయం

చేయాలి. ఈ పద్ధతులద్వారా పునరావాసాన్ని కల్పించలేని బాలలకు ప్రత్యేక సంస్థలను ఏర్పరచి ఆ సంస్థలలో వారికి సంరక్షణ, వసతి సౌకర్యాలు, భద్రత, విద్యాసౌకర్యాలు, శిక్షణాసౌకర్యాలు ఏర్పాటు చేసి పునరావాసాన్ని కల్పించి వారిని మామూలు పౌరులుగా చేయవచ్చు. ప్రస్తుతమున్న స్వచ్ఛంద సేవా సంస్థలన్నిటినీ ఒక శాస్త్రీయమైన క్రమపద్ధతిలో నడిచేటట్లు చూడాలి. ఈ సంస్థలను శిక్షణ పొందిన సామాజిక సంక్షేమ కార్యకర్త సలహా సంప్రదింపులతో నడపాలి. ఈ సంస్థలకు పురపాలక సంస్థ, నగరపాలక సంస్థ, రాష్ట్ర ప్రభుత్వాలు సహాయాన్ని అందియ్యాలి. సక్రమంగా నడవని సంస్థలను తొలగించటం మంచిది. సాధారణంగా ఈ సంస్థలు ఈ కింది విధంగా ఉంటాయి.

## 1. అనాధ శరణాలయాలు

అనాధలైన బాలలను చేరదీసి వారికి వసతి, భోజనసౌకర్యాలు ఏర్పాటుచేసి విద్యాబుద్ధులను నేర్పుతారు. కొంత వయసు వచ్చిన తరువాత వృత్తివిద్యా శిక్షణ పొందిన బాలలకు ఉద్యోగావకాశాలు కల్పించి వారు ఆర్థికంగా స్వశక్తిపై ఆధారపడేటట్లు ఈ అనాధ శరణాలయాలు సహాయం చేస్తాయి. ఈ సంస్థలు బాలబాలికలకు ప్రత్యేకంగాను, విడివిడిగాను ఉంటాయి. బాలికలకు యుక్తవయసు వచ్చినతరవాత వివాహాలు జరిపించడానికి కూడా ఈ శరణాలయాలు బాధ్యత వహిస్తాయి.

## 2. పెంపుడు గృహాలు

బాలలకు గృహ వాతావరణం వారి పెరుగుదలకు అనుకూలంగా లేనపుడు ప్రత్యామ్నాయ గృహాలలో పిల్లలను చేర్చవలసిన అవసరమేర్పడుతుంది. అటువంటి సమయాలలో బాలల పెరుగుదలకు, అభివృద్ధికి తగిన వాతావరణం ఉన్న గృహాలను ఎంచుతారు. పెంపుడు తల్లిదండ్రులు పిల్లలను శ్రద్ధతోచూసి వారి అవసరాలను తీరుస్తారు. ఈ పెంపుడు తలిదండ్రులకు కొన్ని సమయాలలో వారి సేవలకు ప్రతిఫలంగా ధనసహాయం చేయడంకూడా జరుగుతుంది. ఈ ధనసహాయం సొంత

తలిదండ్రులుగానీ లేదా ఈ సంరక్షణా కార్యక్రమాన్ని చేపట్టిన తలిదండ్రులుగానీ ధనసహాయం చేస్తారు. బాలలను ఈ పెంపుడుగృహాలలో తాత్కాలికంగా మాత్రమే ఉంచుతారు. నిర్ణీతకాలం దాటినతరవాత వారు తమ గృహాలకు తిరిగి వెళ్ళేవరకుగానీ, మరియే ఇతరసంస్థలలో చేరేవరకుగానీ బాలలను పెంపుడు గృహాలలోనే ఉంచడం జరుగుతుంది. ఈ పెంపుడు గృహాలు నాలుగురకాలుగా ఉంటాయి.

## 1. ఉచిత గృహాలు

వీటిలో పెంపుడు తలిదండ్రులకు ధనం చెల్లించవలసిన అవసరం ఉండదు.

## 2. సేవా గృహాలు

సేవా గృహాలలో కల్పించిన వసతి, భోజన సౌకర్యాలకు బదులుగా అందులోవున్న బాలలు ఆ వసతికై కొంత సేవ చేయవలసి ఉంటుంది. అంటే ఆ సంస్థలలోని బాలలు వస్తురూపేణాగానీ, పని రూపేణగానీ ఆ సంస్థ కోసం కృషి చేయవలసిన అవసరం ఉంటుంది.

## 3. వసతి గృహాలు

ఈ గృహాలలో బాలల పెంపుడు తల్లిదండ్రులకు కొంత ధనం చెల్లించవలసి ఉంటుంది.

## 4. దత్తత గృహాలు

మొదట తాత్కాలికంగా ఏ కుటుంబంలో అయితే సంరక్షణార్థమై బాలుని ప్రవేశపెట్టడం జరుగుతుందో ఆ కుటుంబమే ఆ బాలుని దత్తత చేసుకోవడం జరుగుతుంది. దత్తత చేసుకున్న తరవాత ఆ బాలుడు పూర్తిగా ఆ కుటుంబ సభ్యునిగా హక్కులన్నిటినీ సంపాదించుకోగలడు. దత్తత తీసుకున్న తలిదండ్రులు కూడా ఆ బాలుని తమ స్వంత కుమారునివలె చూసుకొని, అతని బాధ్యతనంతటినీ స్వీకరించటం జరుగుతుంది.

బాలుని స్వభావం, అభిరుచులు, ఇష్టానిష్టాలు, స్వగృహ వాతావరణం వంటి ముఖ్యమైన అంశాలను అర్థం చేసుకుని అందుకు తగిన

వాతావరణం, వసతులు ఉన్న గృహాలలోనే పెంపుడు గృహాలుగా ఎన్నుకోవడం ముఖ్యం. ఎందువల్లనంటే ఆ పెంపుడు గృహాలపైనే బాలుని భావిజీవితమంతా ఆధారపడి ఉంటుంది. కనక పెంపుడు గృహ వాతావరణాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ ఉండాలి.

## సంస్థాగతం కాని సేవలు

సంస్థాగతంకాని సేవలు ఈ కింది విధంగా ఉంటాయి. —

1. శిశుపోషణ గృహాలు, ప్రాథమిక పాఠశాలలు. 2. పగటి కేంద్రాలు 3. వినోదం హాబీ క్లబ్బులు. 4. గ్రంథాలయ సౌకర్యాలు. 5. సెలవు గృహాలు 6. బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు 7. పాఠశాల సంక్షేమకృషి సేవలు 8. మానసిక మాంద్యంఉండే బాలల పాఠశాలలు 9. గుడ్డి, చెముడు, మూగ బాల వికలాంగులకు నర్సరీలు, పాఠశాలలు 10. శ్రవణేంద్రియ కేంద్రాలు 11. దిక్కులేని బాలలకు దిక్కుకల్పించే సేవలు 12. శిశు ఆరోగ్య కేంద్రాలు.

## 1. శిశుపోషణ గృహాలు, ప్రాథమిక పాఠశాలలు

పారిశ్రామికీకరణం, నగరీకరణం, విద్యాభివృద్ధి మొదలైన కారణాలవల్ల అధిక సంఖ్యాక స్త్రీలకు ఉద్యోగావకాశాలు లభిస్తున్నవి. దీనివల్ల పురుషులతోపాటు స్త్రీలుకూడా తమ పిల్లలను గృహాలలో విడచి ఉద్యోగాలకు వెళ్ళటం జరుగుతున్నది. పూర్వం సమష్టి కుటుంబాలు ఉండటంవల్ల స్త్రీలు వ్యవసాయం లేదా ఉద్యోగార్థమై గృహాలు విడచి వెళ్ళవలసిన పరిస్థితి కలిగినా తమ పిల్లలు సంరక్షణ గురించి వారు బాధపడవలసిన అవసరం ఉండేది కాదు. బాలలు సమష్టి కుటుంబాలలోగల ఇతర సభ్యులచేత సంరక్షింపబడేవారు. కానీ ఆధునిక యుగంలో సమష్టి కుటుంబాలు పోయి వ్యష్టి కుటుంబాలు నిలవటంవల్ల స్త్రీ పురుషులిద్దరు ఉద్యోగాలకై వెళితే తమ పిల్లలను వంటరిగా ఎట్లాంటి సంరక్షణ లేక విడచిపెట్టవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. ఈ పరిస్థితివల్ల ఇటు బాలల శారీరక, మానసిక అభివృద్ధికి భంగం కలగడమేకాక స్త్రీలు కూడా పిల్లల గురించి మానసిక ఆందోళన, వత్తిడులకు గురికావలసి వస్తున్నది.

ఇట్లాంటి బాలలకు వారి తల్లులకు ఆరోగ్య సంరక్షణార్థమై తల్లులు పనిచేసే స్థలాలవద్దనే తమ పిల్లలకు కూడా సంరక్షణ కలుగజేయటానికి చట్టం ప్రకారం స్త్రీ కార్మికులు పనిచేసే కర్మాగారాలలో శిశు గృహా ఏర్పాటుచేయడం నిర్దిష్టమైన కార్యక్రమంగా గుర్తించారు. 6 సంవత్సరాల లోపు వయసున్న బాలలకు ఈ శిశు గృహాలలో ప్రవేశం లభిస్తుంది. తల్లుల వృత్తి వేళలలో ఈ బాలలు శిశుగృహాల సంరక్షణలో ఉంటారు. అన్ని సౌకర్యాలతో, అన్ని పరికరాలతో అంటే ఆటబొమ్మలు, పుస్తకాలు, పలకలు, మంచాలు, పరుపులు, ఉయ్యాలలు మొదలయిన బాలలకు ఉపయోగపడే పరికరాలన్నిటితో కూడుకొని ఈ గృహాలు ఉంటాయి. ఈ శిశు గృహాలలో ప్రాథమిక విద్యాభ్యాసం కూడా జరుపుతారు. వీటిని ఎంతో ఆరోగ్యదాయకంగా నడుపుతారు. అంతేకాక ఈ గృహాలలో సుశిక్షితులైన ఆయాలను, నర్సులను, స్వీపర్లను, క్లీనర్లను నియమిస్తారు. కార్మాగార వైద్యాధికారి ఈ శిశు గృహాలను ఎప్పటికప్పుడు పర్యవేక్షిస్తూ ఉంటాడు. ఈ విధంగా పాఠశాల పూర్వవయసు బాలలను సంరక్షించటానికి ఈ శిశుగృహాలు ఏర్పడ్డాయి.

2. పగటికేంద్రాలు :- పగటి సంరక్షణ, నర్సరీ పాఠశాలలు, బాల్వాడీలు మొదలయినవి బాలల పగటి సంరక్షణా కేంద్రాలు.

3. వినోదం, హాబీ క్లబ్బులు :- ఇవి సాధారణంగా ఈ కింది విధంగా ఉంటాయి.

(a) భౌతిక వినోద కార్యక్రమాలు :- ఆటలు, ఎథలిటిక్స్. పర్వతారోహణం మొదలైనవి.

(b) సృజనాత్మకమైనవి :- చేతిపనులు, సంగీత నాటక కళలు.

(c) మానసికమైనవి :- చర్చలు, డిబేట్‌లు.

(d) సాంఘికమైనవి :- విహార యాత్రలు.

(e) సాంస్కృతికమైనవి :- పండగలు, ఊరేగింపులు మొదలైనవి.

## 3. గ్రంథాలయ సౌకర్యాలు

బాలలు తమ విరామ సమయాన్ని ఆరోగ్యకరంగాను, ఆనంద దాయకంగాను గడపటానికి వినోద కార్యక్రమాలు మాత్రమే సరిపోవు. గ్రంథాలయ సౌకర్యం బాలల అత్యవసర సౌకర్యాలలో ఒకటిగా పరిగణించవచ్చు. బాలల మానసిక శక్తిని పెంపొందించటానికి, నైతిక విలువలను అభివృద్ధి పరచటానికి, గ్రంథాలయం చాలా ఉపయోగ పడుతుంది. ఈ గ్రంథాలయాలలో బాలలకు ఉపయోగపడే సాహిత్య మున్న పుస్తకాలను, సేకరించి, బాలల కందరికీ అందుబాటులో ఉండే టట్లు చేయాలి. తక్కువ రాబడిగల కుటుంబాలనుంచి వచ్చిన పిల్లలను దృష్టిలో ఉంచుకుని వారికి ఈ గ్రంథాలయాలు ఎక్కువ అందుబాటులో ఉండేటట్లు ఏర్పాటుచేయాలి.

## 4. సెలవు గృహాలు

ప్రాథమిక, మాధ్యమిక ఉన్నత పాఠశాలలకు సెలవులు ఇచ్చిన పుడు సెలవు రోజులను ఏ విధంగా గడపాలో అర్థంగాక బాలలు చెడు అలవాట్లకు లోనుకావటానికి అవకాశం ఉంది. కనుక సెలవుదినాలలో బాలలకు కేంపులను ఏర్పాటుచేసి వారిని వినోద యాత్రలుగా కొన్ని స్థలాలకు తీసుకుని వెళ్ళి అక్కడ కొన్ని రోజులు బస చేయటం జరుగు తుంది. దీనివల్ల బాలలు సెలవు రోజుల్లో ఎక్కువగా తమ స్నేహితు లతో గడపటానికి అవకాశం కలుగుతుంది. ఇవి వినోద యాత్రలు మాత్రమేకాక, వీరి బస గృహవాతావరణాన్ని సృష్టించి ప్రత్యామ్నాయ గృహాలవలె ఏర్పాటు చేయటం జరుగుతుంది. దీనివల్ల వారు గృహాలకు దూరంగా ఉన్నప్పటికీ గృహవాతావరణానికి దూరమవటం జరగదు. వీరు ఈ సెలవుదిన కాలంలో దైనందిన జీవితాన్ని మరచి ఆనందంగా కొంతకాలం గడపటానికి అవకాశాన్ని పొందటంకూడా జరుగుతుంది. దీనివల్ల బాలలలో ఉత్సాహం కలిగి శారీరక ఆరోగ్యాన్ని అభివృద్ధి పరుచుకొని, మానసిక సంతృప్తిని పొందటానికి అవకాశం లభిస్తుంది.

## 5. పాఠశాల - సంక్షేమ కృషి సేవలు

బాలలు పెరిగి, పెద్దవాళ్ళు కావటానికి, వారి అవసరాలు తీరడానికి కుటుంబ వాతావరణం అతి ముఖ్యమైనది. కానీ కొంత వయసు వచ్చిన తరవాత బాలలు కుటుంబ వాతావరణంతోను, పరిసరాలతోను, సంస్థలతోను సంబంధం ఏర్పరచుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. వీటిలో ముఖ్యమైనది ఆటస్థలం, పాఠశాల, బాలలు పాఠశాల పరిసరాలకు అలవాటు పడేటట్లుగా, సర్దుబాటు చేసుకొనేటట్లుగా తగిన పరిస్థితులు కల్పించాలి. ఇట్లాంటి పరిస్థితులు కల్పించినపుడే పాఠశాలలోని విద్యా, వినోద సౌకర్యాలను బాలలు సద్వినియోగం చేసుకొని తద్వారా మానసిక వికాసాన్ని పొందగలుగుతారు. పాఠశాలలు కూడా బాలల శారీరక, మానసిక వికసానికి కృషి చేయాలి. కేవలం మానసిక వికాసం సరిపోదు. పాఠశాలలోని అనుభవాలకు కొంత సమన్వయంగా కూడా ఉండాలి. ఆధునిక విద్య ముఖ్యంగా ఈ లక్ష్యాన్ని కలిగి ఉండాలి.

విజ్ఞాన సముపార్జన అధిక భాగం పాఠశాలలోనే జరుగుతుంది. విద్యార్థులలో కొంతమంది చదువులోను, ఆటలలోను బాగా వెనకబడి ఉంటారు. వీరితో ఏవో కొన్ని మానసిక సమస్యలుంటాయి. కనక బాలల విద్యావసరాలే కాకుండా తదితర అవసరాలను కూడా చూడటానికి ప్రతీ పాఠశాలలోను, ఒక సంక్షేమ కార్యకర్త ఉండవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అభివృద్ధిచెందిన దేశాలలోని పాఠశాలలలో సంక్షేమ కార్యకర్తలను నియమించే పద్ధతి ఉంది. కానీ ఆ పద్ధతిని మనదేశంలో ఇంకా ప్రవేశపెట్టలేదు. కనుక ఉపాధ్యాయులలోనే ఒకరికి సంక్షేమ శాస్త్రంలో అవసరమైన శిక్షణనిచ్చి కొంత ప్రత్యేక వేతనాన్ని ఏర్పరచి ఈ సంక్షేమ బాధ్యతను అప్పగించడం జరిగింది.

పాఠశాలలో సంక్షేమ కార్యకర్త కొంతమంది విద్యార్థులలోగల ప్రవర్తన లోపం, విద్యా వ్యాసంగాలలో వెనుకబడడం, మానసిక ఆవేశాత్మక సమాయోజనం, మొదలయిన సమస్యలున్న బాలలను సక్రమ పద్ధతిలో పరీక్షించి వారి సమస్యలను పరిష్కరింప చేయటానికి

ఉపయోగపడతారు. సంక్షేమ కార్యకర్త ఇట్లాంటి సమస్యలున్న విద్యార్థుల తలిదండ్రులతోను, పరిసరాలతోను, పరిచితులతోను, ఉపాధ్యాయులతోను కలిసి, ఆలోచించి విద్యార్థి సమస్యకు కారణాలు కూలంకషంగా తెలుసుకుని పరిష్కారణకు కృషిచేస్తాడు. విద్యార్థికున్న సమస్యలు గుర్తించడానికీ, పరిష్కరించడానికీ అవసరమైన సమయాలలో సమాజంలోని వివిధ సంస్థల సహాయాన్ని, సలహాలను తీసుకుంటాడు. పాఠశాలలో విద్యార్థుల పరిరక్షణకు ఉపయోగించే పాఠశాల ఆరోగ్య కార్యక్రమాలు, విద్యార్థుల శారీరకారోగ్యానికి అవసరమైన వసతులను కల్పించడం మొదలైన కార్యక్రమాలలో సంక్షేమకార్యకర్త బాధ్యత వహిస్తాడు. మధ్యాహ్న భోజనాలు, వైద్యపరీక్షలు, ప్రథమ చికిత్స మొదలైన కార్యక్రమాలు కూడా సంక్షేమకార్యకర్త పర్యవేక్షించాలి. విద్యార్థులలో చెవుడు, అంధత్వం, అంగవైకల్యం మొదలైన వ్యాధి లక్షణాలు వైద్య పరిశీలనద్వారా ముందుగా తెలుసుకుని సరైన సమయంలో వారికి చికిత్స చేయించవలసిన బాధ్యతనుకూడా సంక్షేమాధికారే చేపడతాడు.

విద్యార్థులలో కొంతమంది పేదకుటుంబాలనుంచి వచ్చినవారుంటారు. వారు పుస్తకాలు, సరైన బట్టలు కొనుక్కోలేరు. అంతేకాక రుసుమును కూడా చెల్లించలేకపోవచ్చు. అట్లాంటప్పుడు సంక్షేమ కార్యకర్త పేదవిద్యార్థులకు ఆర్థిక సహాయంచేసే సంస్థల ద్వారా ఆర్థిక సహాయం లభించేటట్లు కృషిచేస్తాడు.

కొంతమంది విద్యార్థులు పాఠశాల వాతావరణానికి, పరిసరాలకు సర్దుబాటు చేసుకోలేనివారై ఉంటారు. అటువంటి విద్యార్థికి సహాయపడటానికి అతని గృహవాతావరణం గురించి తెలుసుకోవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది. ఈ విధమైన ప్రత్యేక కార్యక్రమాలనుకూడా సంక్షేమ కార్యకర్త ద్వారానే సాధ్యమౌతుంది. సంక్షేమ కార్యకర్త అటు కుటుంబ సభ్యులతోను, ఇటు ఉపాధ్యాయులతోను సన్నిహిత సంబంధాన్ని ఏర్పరచుకోవాలి.

విద్యార్థులకు వృత్తి విద్యల గురించి సలహాలు కూడా సంక్షేమ కార్యకర్త ఇస్తాడు. విద్యార్థుల అభిరుచులనుబట్టి, శక్తిసామర్థ్యాలను బట్టి అతడు ఏ వృత్తికి, ఏ విద్యకు తగునో సూచించి ఆ విద్యకు, ఆ వృత్తికి ఉన్న ఉద్యోగావకాశాలను వివరిస్తాడు. వారి తలిదండ్రులకు కూడా వృత్తి సమాచారాన్ని అందించి విద్యార్థి భవిష్యత్‌ను గురించి వారు ఒక నిర్ణయం తీసుకోడానికి సహాయపడతాడు. పాఠశాలలో సాంస్కృతిక కార్యక్రమాలు, వినోద కార్యక్రమాలు ఏర్పాటుచేసి విద్యార్థులు పాల్గొనేటట్లు చేయాలి. ఈ కార్యక్రమాలవల్ల విద్యార్థులకు సంఘంలో కలిసిమెలిసి ఉండటం, ప్రజాస్వామిక జీవనం అలవడటం జరుగుతుంది. ఈ సాంఘికానుభవం విద్యార్థులు పాఠశాలలోను, తరగతిలోను, సర్దుబాటు చేసుకోడానికి ఉపయోగపడుతుంది. ఈ విధమైన అనుభవంద్వారా విద్యార్థుల సాంఘిక, మానసిక సమస్యలను కూడా పరిష్కరించవచ్చు. విద్యాసంస్థలలో సంఘసేవా కార్యక్రమాలను నిర్వహించడం జరుగుతుంది. ఈ కార్యక్రమాలవల్ల విద్యార్థులలో వాస్తవిక జీవితాన్ని గురించిన సమస్యలు తెలుస్తాయి. వీటిని సంక్షేమ కార్యకర్త నిర్వహిస్తాడు. మనదేశంలో అంతకంతకూ తీవ్రరూపం దాలుస్తున్న విద్యార్థులలోని అశాంతిని దృష్టిలో పెట్టుకొని విద్యాసంస్థలలో సంక్షేమ శాఖలను ఏర్పరచిన అవసరం ఎంతైనా ఉన్నది.

## 6. మానసిక జడత్వం గల బాలలకు పాఠశాలలు

కొంతమంది బాలలు మానసిక జడత్వం కలిగి ఉన్నప్పటికీ పాఠశాలలో చదువుకోగలిగిన శక్తిసామర్థ్యాలు వారికి ఉంటాయి. కానీ వారు మామూలు బాలలవలె త్వరగా గ్రహించలేకపోవడం జరుగుతుంది. అటువంటివారికి ప్రత్యేక పాఠశాలలు నెలకొల్పి వారికి విద్యాబోధన చేయవలసి ఉంది. ఈ పాఠశాలలలో సుశిక్షితులైన సిబ్బందిని నియమించాలి. అంతేకాక సుశిక్షితుడు, అనుభవనీయుడు, అయిన సంక్షేమ కార్యకర్తనుకూడా నియమించాలి.

## 7. గుడ్డి, చెవుడు, మూగ బాలలకు నర్సరీలు, పాఠశాలలు

గుడ్డి, చెవుడు, మూగ, వికలాంగులు గృహ పరిసరాలలో పెరిగినట్లయితే వారి శారీరక, మానసిక శక్తులు అభివృద్ధి చెందడానికి అవకాశం ఉండదు. వారు పూర్తిగా వేరొకరిపై ఆధారపడటంగానీ లేదా వేరొకరిపై ఆధారపడి బతకడానికి అలవాటుపడడం గానీ జరుగుతుంది. ఇతరులచేత చులకనగాకూడా చూడబడతారు. అటువంటి పరిస్థితులలో ఆ బాలలు శారీరక వికలత్వమే గాక, మానసిక ఆందోళన, సాంఘిక అసమయోజత్వం పొందడానికి అవకాశం ఉంటుంది. వారిని ఆ వాతావరణం నుంచి తప్పించడానికి ప్రత్యేక పాఠశాలలను ఏర్పరచి, విద్య, వృత్తి శిక్షణలు ఇవ్వడం జరుగుతున్నది.

## 8. శ్రవణేంద్రియ కేంద్రాలు

చెవిటివారికి శ్రవణేంద్రియ పరికరాలను తయారుచేసి అందరికీ అందుబాటులో ఉండేలాగ ఉత్పత్తిచేసి తక్కువ ధరతో సరఫరాచేసే కేంద్రాలు స్థాపించాలి. మన్నికగల పరికలరాలను ఉత్పత్తి చేయడం కూడా వీటి ప్రధాన లక్ష్యం.

## 9. శిశు ఆరోగ్య కేంద్రాలు

ఆరోగ్య రంగంలో ప్రసూతి సేవలు, పాఠశాల ఆరోగ్య సేవ, మధ్యాహ్న భోజన సదుపాయాలు, పోషకాహార కార్యక్రమాలు, బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు మొదలైనవి.

## శిశు సంక్షేమం - సామాజిక శాసనాలు

నేటి బాలలే రేపటి పౌరులు. బాలలను తీర్చిదిద్దే విధానంమీద నే సమాజ యోగక్షేమాలు ఆధారపడి ఉంటాయి. ఈ దృష్టితోనే సమాజంలో బాలలపట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తులు కనబరచి వారిని దుష్టశక్తుల బారినుంచి, దురభ్యాసాల నుంచి కాపాడటానికి తగిన చర్యలను, 'సనాలను రూపొందించడం జరిగింది.

బాలల సంక్షేమానికై అనేక సంక్షేమ కార్యక్రమాలు, సంస్థాగత సేవలు మొదలైనవి నెలకొల్పటమేకాక అనేక శాసనాలనుకూడా ప్రవేశపెట్టడం జరిగింది. అవి —

## 1. బాలల ఉద్యోగం - శాసనాలు

ఉద్యోగం చేస్తున్న బాలలను సాంఘిక, ఆర్థిక అశక్తత గల వారుగా చెప్పబడింది. కానీ ఉద్యోగంచేస్తున్న బాలలందరూ సాంఘిక అశక్తతగల వారిలో చేరరు. యాజమాన్యంవల్లగానీ, తలిదండ్రులవల్లగానీ, సంరక్షకులవల్లగాని బాలల శ్రమ దోపిడీ జరిగితే ఆ బాలలను సాంఘిక అశక్తులుగా చెపుతారు. బాలలచే తమ శారీరక శక్తికి మించి అధికశ్రమను చేయించడం, ప్రమాదకరమైన, ఆరోగ్యానికి హానికరమైన పరిసరాలలో పనిచేయించడం, చాలాతక్కువ వేతనాలను నిర్ణయించడం మొదలయినవన్నీ దోపిడీ కింద పరిగణించబడతాయి. అంతేకాకుండా బాలల పనివేళల కారణంగా వారు తమ ఆరోగ్యమైన పెరుగుదలకు, మూర్తిమత్వ అభివృద్ధికి, విద్య, వినోద సౌకర్యాలను కోల్పోవడం జరుగుతున్నది.

19 వ శతాబ్దం ప్రారంభం వరకూ భూస్వాములు, పారిశ్రామికులు, వ్యాపారులు మొదలైనవారు తమ స్వలాభం కోసం కార్మిక వర్గాలను అణిచి ఉంచడమేకాక వారి శ్రమశక్తిని దోచుకునేవారు. ఈ పద్ధతి ఇంగ్లండ్‌లో కూడా అమలులో ఉండేది. భూకామందులకు పేదవారు తమ పిల్లలను అమ్మివేసే పద్ధతి అమలులో ఉండేది. 19 వ శతాబ్దంలో నూలు మిల్లులు అభివృద్ధిచెందాయి. ఈ మిల్లుల అభివృద్ధి వల్ల బాలల శ్రమను దోచుకోడానికి మిల్లు యజమానులకు అవకాశాలు ఎక్కువ అయినాయి. వస్త్రాల పారిశ్రామికవేత్తలు బాలల శ్రమను చాలాచౌకగా పొందడం జరిగింది. నూలు మిల్లులలోను, తదితర కర్మాగారాలలోను, బాలశ్రామికుల పరిస్థితి చాలా దుర్భరంగా ఉండేది. బాలల శ్రమను ఈ విధంగా దోచుకుంటున్న యజమానులను అదుపులో

పెట్టడానికి ఎటువంటి శాసనాలు ఉండేవికావు. బాలకార్మికుల గంటల పరిమితిని నిర్ణయించడానికి ఎటువంటి శాసనాలు లేవు.

1802 వ సంవత్సరంలో హెల్త్ అండ్ మోరల్స్ (Health and Morals Act) అనే చట్టాన్ని ప్రప్రథమంగా శ్రామికుల రక్షణకోసం ప్రవేశపెట్టడం జరిగింది. ఈ చట్టం ప్రకారం పారిశ్రామికుల పనికాలం రోజుకు 12 గంటలు మించరాదని నిర్ణయి బడింది. రాత్రులలో బాలలను మిల్లులలో నియమించడాన్ని కు నిషేధించడం జరిగింది. అయినప్పటికీ పారిశ్రామికవేత్తలు, సా మాన్యం ఈ చట్టంలోగల కొన్ని లోపాలను తమ కనుకూలంగా యోగించుకుంటూ బాలలను వారి తలిదండ్రుల నుంచి తప్పించి తిన పనిలో నియమించుకుని వారి శ్రమను దోపిడీ చేయడం కొనసాగి వారు. ఈ పరిస్థితిని అరికట్టడానికి 1833 వ సంవత్సరంలో కర్మాగ చట్టాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. ఈ చట్టం ప్రకారం 9 సంవత్స లోపు వయసుగల బాలలను కర్మాగారాలలో నియమించడం నిషే చారు. బాలశ్రామికుల పనిగంటలను కూడా పరిమితంచేసి స్పష్ట నిర్ణయించడం జరిగింది. ఎడ్విన్ చాడ్విన్ సలహా ననుసరించి చట్టంలో కర్మాగారాల ఇన్‌స్పెక్టర్ నియామకాన్నికూడా శాసన చేశారు. స్త్రీలచేత, బాలలచేత కర్మాగారాలలో 10 గంటలకు వి పని చేయించరాదని నిర్దేశించడం జరిగింది.

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత భారత రాజ్యాంగంలో కు బాలలను సంరక్షించడానికి అనేక నియమాలను ప్రకటించడం జరిగి భారత రాజ్యాంగంలోని ప్రకరణలు బాలల లేత హృదయాలను గా పరచకుండా ఉంచటమేకాక, వారి శారీరక, మానసిక వికాసానికికు ప్రయత్నించడం జరిగింది. యజమానులు, కర్మాగారాధిపతులు బా శ్రమను దోచుకోవడాన్ని అదుపులో పెట్టడానికై భారత ప్రభు అనేక శాసనాలను ప్రవేశపెట్టడం జరిగింది. ఈ విధంగా ప్రవేశపె శాసనాలలో అతి ముఖ్యమైనవి. —

చట్టం (Employment of Children Act)
చట్టం (Plantation Labour Act)
(Factories Act)
Mines Act) మొదలైనవి.
కూడా 12 సంవత్సరాలనుంచి 18 సంవత్సరాల
బాలలు ఉద్యోగ పరిస్థితులను క్రమబద్ధంచేసి అభి
ప్రవేశపెట్టారు. ఈ శాసనాలలో బాలల ఉద్యోగ
చడమేకాక, పనిగంటలను పరిమితం చేయడంకూడా
విశ్రాంతి వేళలను, వేతనాలతో సెలవుదినాలను
చేయడం జరిగింది. 1933 వ సంవత్సరంలో బాలల
ప్రవేశపెట్టారు. ఈ చట్టం ప్రకారం బాలల శ్రమను
ledging of Child labour) నిరోధించబడింది.
రంలో ది టీ ఎమిగ్రెంట్ లేబర్ ఆక్ట్ (The tea
ur Act) ప్రవేశపెట్టడం జరిగింది. దుకాణాలలోను,
ను, నియమించిన బాలలను సంరక్షించడానికి అనేక
లు ప్రవేశపెట్టారు. 1850 వ సంవత్సరంలో ప్రవేశ
టిసెస్ ఆక్ట్ (The Apprentices Act) ప్రకారం
ల మధ్య వయసుగల బాలలందరూ 7 సంవత్సరాల
ణాను పొందేలాగ చూడడం, తలిదండ్రుల లేదా
త. 1923 వ సంవత్సరంలో ప్రవేశపెట్టి ఇండియన్
ంగ్ ఆక్ట్ (Indian Merchants Shipping Act)
త్సరాలలోపు వయసుగల బాలలను షిప్‌లలో నియ
38 లో ప్రవేశపెట్టిన బాలల ఉద్యోగ నియామకం
బాలలను కొన్ని ప్రత్యేక కర్మాగారాలలో మాత్రమే
గింది. మరికొన్ని కర్మాగారాలలో వారి నియామకాన్ని
ంచడం జరిగింది. అంటే 14 సంవత్సరాలలో వయసు
ప్రమాదకరమైన పరిస్థితులుగల కర్మాగారాలలో నియ
ష్టాయించడం జరిగింది. 1948 కర్మాగార చట్టంలో

బాలల పరిరక్షణకు, బాలశ్రామికుల వృత్తి పరిస్థితుల
డానికి అనేక ప్రయత్నాలు జరిగాయి.

ఈ విధంగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనే
ప్రవేశపెట్టి బాలశ్రామికులను నియమించడాన్ని చాలా
వారి విద్యాభివృద్ధికి తోడ్పడటం జరిగింది. అంతేకాక ఉ
బాలలకు ఆర్థిక, సాంఘిక భద్రతలను కలుగజేసి వారి
ణను ఏర్పరచటం కూడా జరిగింది.

## బాల్య వివాహాలు - శాసనాలు

మనదేశంలో చాలాకాలంగా బాల్యవివాహ
ఉండడం జరిగింది. బాల్య వివాహాలకు పూర్వం కన్యా
అమలులో ఉండేది. బాల్యవివాహాలు, కన్యాశుల్క
లేప్రాయంలో గల బాలికలకు అరిష్టదాయకమైనవి.
ఈ పద్ధతులవల్ల హాయిగా ఆడుతూ, పాడుతూ తిరగవ
బాలికలు జీవితంలో అంతాకోల్పోయి జీవించవలసిన
మనదేశంలో సతీసహగమనం కూడా అమలులో
చితిపై భార్యనుకూడా సజీవదహనం చేయడమే సతీ
విధంగా సమాజంలో బాలికలను, స్త్రీలను అన్యాయ
అత్యాచారం చాలా ప్రబల రూపంలో ఉండేది. ఈ ప
సమాజంలో స్త్రీ ప్రతిపత్తిని తగ్గించడానికీ, స్త్రీ అధికా
సమాజంలో ప్రబలకుండా ఉండడానికీ, స్వలాభపరు
ఏర్పరచిన నియమాలు. ఈ విధంగా స్త్రీకి సమాజ
స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు లేకుండా చేయబడింది.

కానీ రాజారామమోహనరాయ్ అచంచల
అత్యాచారాలు కొంతవరకు తొలగించబడింది. ఈతని
1829 వ సంవత్సరంలో సతీసహగమనాన్ని నిషేధిస్తు
అమలులోకి వచ్చింది. ఈ నిబంధన ప్రకారం సతీసహగ
బలవంతంగా చేయించడం న్యాయవిరుద్ధమనీ, ఈ న

అవలంబించినవారు నేరస్తులనీ, ఆ నేరానికి తగిన శిక్షను
ంచాలనీ శాసించడం జరిగింది.

కానీ సతీసహగమనాన్ని నిషేధించడంవల్ల భారతదేశంలో బాల
ప్రల సంఖ్య పెరిగిపోవడం జరిగినది. వీరు జీవితంలో ఎటువంటి
, ఆనందాన్ని అనుభవించలేని అమాయకులు, బాల్య వయసు
కూడా జీవితాన్ని గడపాలంటే చాలా దుర్భరమైన పరిస్థితి.
చనిపోతే పురుషుడు తిరిగి వివాహం చేసుకోగలడు. ఈ విధంగా
తన జీవితకాలంలో ఎన్ని వివాహాలు చేసుకోవడానికయినా
అని సమాజం పేర్కొనడం జరిగింది. కానీ భర్త చనిపోతే
భార్య ఎంత చిన్నవయస్కురాలైనప్పటికీ తిరిగి వివాహం చేసు
నికి అనర్హురాలు. స్త్రీ పునర్వివాహాన్ని సమాజం అంగీకరించదు.
చదు సరికదా రెండో వివాహాన్ని చేసుకున్న స్త్రీని వెలివేయడం
జరుగుతున్నది. సమాజంలో స్త్రీ, పురుషులకు వేర్వేరు నీతి
గాలను నిర్దేశించడం కొంతమంది మహానుభావులు అంగీకరించలేక
నారు. వారు వితంతు పునర్వివాహానికి కృషి చేశారు.

బాలికలకు జరుగుతున్న ఈ అన్యాయం అసంబద్ధమయిందని
రు సంఘ సంస్కర్తలు భావించి బాల్య వితంతువుల పునర్వివాహా
మాజం అంగీకరించాలనీ, అనుమతించాలనీ ఉద్యమం చేపట్టారు.
ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ముఖ్యుడు. ఇతడు బాల్య వితంతు
పునర్వివాహ విషయమై ఒక శాసనాన్ని ఆమోదించవలసిందిగా
కదేశ పాలకులకు 1855 వ సంవత్సరంలో విజ్ఞప్తిని సమర్పించడం
ది. ప్రభుత్వం ఈ విజ్ఞప్తి ప్రకారం 1856 వ సంవత్సరంలో హిందూ
తు పునర్వివాహ చట్టాన్ని ప్రవేశపెట్టడం జరిగింది.

యుక్తవయసు రాకపూర్వమే బాలికలకు వివాహం చేయడం
తీయ సాంప్రదాయం. ఈ సాంప్రదాయం ఇతర దేశాలలో కూడా
లులో ఉన్నప్పటికి భారతదేశంలో వివాహాలు చాలా చిన్నతనం
నే చేయడం జరిగేది. బాలికలకు కనీసం మూడు, నాలుగు సంవత్స

రాల వయసు కూడా లేకుండా వివాహాలు చేయడం జరిగేది. ఇది చాలా అనుచితమైన పద్ధతి. కానీ వ్యక్తి స్వాతంత్ర్య ధోరణులు ప్రపంచంలో వ్యాప్తి చెందడం మొదలయిన నాటినుంచి వివాహ విషయంలో కూడా వ్యక్తి తనంతట తానే తన జీవిత సహభాగినిని ఎన్నుకొనే అవకాశం ఉండాలనే భావం క్రమంగా విస్తరించడం జరిగింది. దీని ఫలితంగా వివాహ వయసు పెరగడంకూడా జరిగింది. వివాహ వయసు పెంచాలనే ఉద్యమం గత శతాబ్ది ఆరంభం నుంచి ప్రారంభమయించి. 1927 వ సంవత్సరంలో హరవిలాస్ శారద బాల్యవివాహాల నివారణకు బిల్లును ప్రవేశపెట్టాడు. ఈ బిల్లుకు ప్రజల అండదండలున్నాయని గ్రహించి ప్రభుత్వం 1929 వ సంవత్సరంలో బాల్యవివాహ నిరోధక చట్టాన్ని (The Child Marraige Restraint Act) ప్రవేశపెట్టడం జరిగింది. దీనినే శారదా చట్టమని అంటారు. ఇది 1930 ఏప్రియల్ ఒకటవ తేదీ నాటికి దేశవ్యాప్తంగా అమలులోకి వచ్చింది. ఈ చట్టం ప్రకారం స్త్రీకి 15 సంవత్సరాలు,పురుషునికి 18 సంవత్సరాలు మించనిదే వివాహం తలపెట్టరాదు. ఎవరైన ఈ వయసు పరిమితిలోపున వివాహాలు జరిపించినట్లయితే వారు శిక్షార్హులు. 1955 వ సంవత్సరంలో హిందూ వివాహచట్టం ప్రవేశపెట్టబడింది. ఈ చట్టం ప్రకారం వివాహ వయః పరిమితి స్త్రీలకు 15 సంవత్సరాలు, పురుషులకు 18 సంవత్సరాలని నిర్ణయించబడింది. కొంత కాలం తరవాత ఈ చట్టంలో కొన్ని సవరణలు చేశారు. సవరణల అనంతరం ఈ చట్టం ప్రకారం స్త్రీలకు 18 సంవత్సరాలు, పురుషులకు 21 సంవత్సరాలు వివాహ వయః పరిమితిగా నిర్ణయించడం జరిగింది.

1872 లో ప్రత్యేక వివాహ చట్టం ప్రవేశపెట్టారు. ఈ చట్టం ప్రకారం కొన్ని ప్రత్యేక సందర్భాలలో ప్రత్యేక పద్ధతుల ద్వారా చేసుకొనే వివాహాలకు గుర్తింపును కలుగజేయడమైంది. ఈ చట్టం సవరణ పొంది 1954 లో తిరిగి నూతన ప్రత్యేక వివాహచట్టంగా రూపొందింది. ఈ చట్టం ప్రకారం వివాహాధికారి సమక్షంలో సాక్షుల ఆధారంతో వివాహం జరుగుతుంది. దీనినే రిజిష్టర్ వివాహ మంటారు. 1956 వ

సంవత్సరంలో ప్రవేశపెట్టిన వారసత్వం చట్టంవల్ల బాలురకే కాక బాలిక లకు కూడా ఆ స్త్రీహక్కు లభించింది.

ఈ విధంగా వివాహ విషయంలో కొన్ని నిబంధనలు ప్రవేశపెట్టి బాలికలను వివిధ వివాహ సమస్యలనుండి సంరక్షించడం, ఉద్యోగావ కాశాలను కలుగజేయడం, ఆర్థిక సంరక్షణను కలుగజేయడం మొద లయిన అనేక సౌకర్యాలను కలుగజేయడమైంది.

## విడాకులు - శాసనాలు

భార్యాభర్తల మధ్య విభేదాలు కలిగి కుటుంబ విచ్ఛిన్నత జరగడంవల్ల ఆ కుటుంబంలో ఉన్న పెద్దవాళ్ళకంటే పిల్లలు ఎక్కువ బాధలను అనుభవిస్తున్నారు. అందువల్ల అనేక శాసనాలను ప్రవేశపెట్టి విభేదాలవల్ల విచ్ఛిన్నమయ్యే ప్రమాదాలుగల కుటుంబాలను పరిరక్షించి. దాని ద్వారా పిల్లలను సంరక్షించడం జరుగుతున్నది.

హిందూ సమాజంలో వివాహబంధం విడదీయరాని శాశ్వతమైన పవిత్ర బంధంగా పరిగణించబడింది. కానీ మారుతున్న విలువలనుబట్టి ఈ అభిప్రాయాలలో మార్పులు రావటం జరిగింది. ఆధునిక నాగరిక సమాజంలో వలే హిందూ సమాజంలోకూడా వివాహం ఒకసామాజిక ఒప్పందంగా మారిపోయింది. దీనివల్ల మనదేశంలో కూడా విడాకులు చట్టబద్ధం చేయడం జరిగింది. భారతదేశంలో విడాకులను అనుమతించే చట్టాలు కొన్నికొన్ని రాష్ట్రాలలో అమలులోకి వచ్చాయి. కానీ ఏ ఒక్క చట్టంకూడా సమగ్రంగా ఏర్పరచలేదు. 1955 వ సంవత్సరంలో సమగ్రమైన చట్టాన్ని ప్రవేశపెట్టారు. దీనినే హిందూ వివాహచట్టం అంటారు. ఇది వివాహ చట్టమైనప్పటికీ దీనిలో విడాకుల విషయంలో సమగ్రమైన నిబంధనలను రూపొందించారు. ఈ చట్టం దేశవ్యాప్తంగా వర్తిస్తుంది. భార్యాభర్తలలో ఏ ఒక్కరయినా ఈ కింద తెల్పిన కారణాలలో ఏ ఒక్క కారణంవల్లనైనా విడాకులు విడాకులు మంజూరు చేయమని కోరితే న్యాయస్థానం విడాకులను అనుమతిస్తుంది.

1. భార్యాభర్తలిరువురిలో ఏ ఒక్కరయినా లైంగికఅవినీతికి అలవాటు పడినట్లయితే.
2. భార్యాభర్తలిరువురిలో ఏ ఒక్కరైనా వేరొక మతాన్ని స్వీకరించి హిందూమతాన్ని విడచిపెట్టడం
3. విడాకులకు విజ్ఞప్తి పెట్టుకొన్న నాటికి **మూడు** సంవత్సరాలుగా ఎప్పటికీ నయంగాని ఉన్మాదంతో ఉండడం.
4. కుష్ఠు, క్షయ, సుఖవ్యాధులను భార్యాభర్తలిద్దరిలో ఏ ఒక్కరయినా కలిగి ఉండడం.
5. సన్యాసం స్వీకరించడం.
6. ఏడు సంవత్సరాలుగా కనిపించకుండా చివరికి జీవించిఉన్నాడో లేదో కూడా తెలియకపోవడం.
7. విడిపోయిన భార్యాభర్తలకు కొన్ని కారణాల **మూలంగా** వివాహ సంబంధాన్ని పునరుద్ధరించుకోడానికి న్యాయస్థానం కోరినా, ఆ కోరికను రెండేళ్ళయినా ఖాతరుచేయడం మొదలైనవి.

ఈ చట్టం అమలులోకి రాకముందు వివాహమైనవారి విషయంలో పై చెప్పిన కారణాలేకాక ఇంకా **మరి** రెండు కారణాలవల్ల కూడా భార్య విడాకులను కోరవచ్చు.

విడాకులు కోరాలంటే వివాహమయిన తరువాత **మూడు** సంవత్సరాలు గడపాలి. కానీ కొన్ని ప్రత్యేక సందర్భాలలో ప్రతివాది వాదిని ఘోరంగా హింసించి బాధపెడ్తుంటే న్యాయస్థానం విడాకుల పరిశీలనకు **మూడు** సంవత్సరాలు నిండకముందే అనుమతించవచ్చు. విడాకులకు అనుమతి ఇచ్చిన ఒక సంవత్సరం తరువాత తిరిగి వివాహం చేసుకోవడానికి అభ్యంతరం ఉండదు. విడాకులిచ్చినా, వివాహం రద్దు చేసినా అప్పటికి గర్భం ధరించి ఉండడంగానీ, ఇంతకుముందు పిల్లలు కలిగితేగానీ అది వారిరువురి సంతానంగానే పరిగణించి తలిదండ్రుల ఆస్తిపై హక్కును పొంది ఉంటారు. విడాకులు పొందిన స్త్రీ పోషణా భారాన్ని ఆమెకు వ్యక్తిగతంగా గల ఆస్తిని జీవనోపాధినిబట్టి, భర్త ఆర్థిక శక్తినిబట్టి న్యాయస్థానం భరణం రూపంలో నిర్ణయిస్తుంది. ఈ

భరణం పొందిన స్త్రీ వేరొక పురుషునితో సంబంధం పెట్టుకున్నా లేదా ఆమె తిరిగి వివాహం చేసుకున్నా రద్దవుతుంది.

విడిపోయిన భార్యాభర్తల మైనరు సంతానం విషయంలో వారి భద్రతను గురించి న్యాయస్థానం వెంటనే తాత్కాలిక ఉత్తర్వును జారీ చేస్తుంది. వారికున్న ఆస్తిపాస్తులను పరిశీలించినమీదట చివరి ఉత్తర్వు తరువాత జారీ చేయబడుతుంది. చట్టం ప్రకారం న్యాయస్థానం కొన్ని జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుంది. ముందుగా సాధ్యమయితే భార్యాభర్త లిద్దరికీ రాజీ కుదర్చడం మంచిది. విడాకులు కోరేవారు చట్ట ప్రయోజనాలను దుర్బుద్ధితో వినియోగించుకో కూడదు. విడాకుల చట్టంవల్ల స్త్రీలకు, బాలబాలికలకు న్యాయస్థానం ద్వారా సంరక్షణ లభిస్తుంది.

## బాలనేరం - శాసనాలు

బాలల సమాజ వ్యతిరేక చర్యలను, తిరస్కార స్వభావంతో కూడిన ప్రవర్తనను అదుపులో పెట్టడానికి భారతదేశంలో చట్టబద్ధమైన ప్రయత్నాలు సుమారు 1850 వ సంవత్సరం ఆరంభమైనట్లు చెప్పవచ్చు. 1850 అప్రంటిసెస్ చట్టం బాలల కోసం ప్రవేశపెట్టబడిన చట్టం. 1897 లో భారతీయ సంస్కరణ పాఠశాలల చట్టం అమలులోకి వచ్చింది. దీని ప్రకారం 15 లేదా 16 సంవత్సరాలలోపు బాలనేరస్తులను సంస్కరణ పాఠశాలలకు పంపాలని నిర్ణయించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్, మద్రాస్, మైసూర్, కేరళ, మధ్యప్రదేశ్, బొంబాయి, పంజాబ్, బెంగాల్, ఉత్తరప్రదేశ్ మొదలైన రాష్ట్రాలలో బాలల చట్టాలు ప్రవేశపెట్టారు. ఈ చట్టాల ప్రకారం బాలనేరస్తుల విచారణ, శిక్షానిర్ణయం సాధారణ రీతిలో కాకుండా ప్రత్యేకంగా ఏర్పాటుచేయాలనీ, ఇతర బాలలుకూడా సాంఘిక దురభ్యాసాలకు లోనుకాకుండా హద్దుమీరే పరిస్థితికి వచ్చే ముందే వారిపై భద్రతాచర్యలు తీసుకోవాలనీ, ఈ చట్టాలముఖ్యోద్దేశం. 1911 నుండి 1929 సంవత్సరాల మధ్యకాలంలో బాలురు పొగతాగడాన్ని నిరోధించే చట్టాలు ప్రవేశపెట్టారు. 1926 నుంచి 1945 సంవత్స

రాల మధ్యకాలంలో బోర్టస్టల్ పాఠశాల చట్టాలు అమలులోనికి వచ్చాయి. 1958 వ సంవత్సరంలో బాలనేరస్తుల పరివీక్షణా చట్టం ప్రవేశపెట్టబడింది. ఈ శాసనాల ముఖ్యోద్దేశం 14 సంవత్సరాలు మించని బాలనేరస్తులను ఎటువంటి పరిస్థితులలోను జైలుకు పంపరాదు. వారు ఎక్కువగా హద్దుమీరి ప్రవర్తించినపుడు తదితర మార్గాలద్వారా సత్ప్రవర్తనులను చేయడం సాధ్యంకానపుడు, వారు సంస్కరణ పాఠశాల ప్రవేశానికి అర్హత లేని వారయినపుడు మాత్రమే వారిని జైలుకు పంపించాలి.

పదహారు సంవత్సరాలలోపు వయసుగల నేరస్తులందరికీ హామీ మీద బెయిలు ఇవ్వవచ్చు. బెయిలు ఇచ్చేటట్లయితే అరెస్టు అయిన వారికి ప్రమాదం జరుగుతుందని భావించినా లేదా న్యాయ లక్ష్యాలకు విరుద్ధమనుకున్నా బెయిలు నిరాకరించవచ్చు. అందుకు కారణాలు లిఖిత పూర్వకంగా పేర్కొనాలి.

హైదరాబాదు బాలల భద్రతా చట్టం 1933 లో హైదరాబాదు నగరంలోను, ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వం హైదరాబాద్ రాష్ట్రం లోని కొన్ని ప్రాంతాలలోను అమలుపరిచారు. ఈ ప్రాంతంలో గల బాలల దురలవాట్లను అదుపులో పెట్టడమే ఈ చట్టం ముఖ్యోద్దేశం. ఈ ప్రాంతంలో పేదరికంలో ఉన్న తలితండ్రులు తమ పిల్లలను అమ్ముకోవడం జరిగేది. కొన్నవారు ఆ పిల్లలను బానిసలుగాను, సేవకులుగాను తయారుచేసి నాకిషు హీనంగా చూసేవారు. ఈ చట్టం కల్పించిన అధికారాలతో పోలీసు అధికారులు ఏ ఇంటినైనా సోదాచేసి అట్లాంటి బాలబాలికలు ఉన్నట్లయితే ప్రభుత్వ దృష్టికి తీసుకొనిరావడానికి వీలుంది. వారికి విముక్తి కలిగించడం లేదా యజమాని – సేవకులమధ్య సంబంధాన్ని క్రమబద్ధం చేయడం ఆయా పరిస్థితులనుబట్టి జరుగుతుంది.

16 నుంచి 21 సంవత్సరాల మధ్య వయసుగల బాలలు నేరాలు చేస్తే జైలుకు పంపకుండా ప్రత్యేక పాఠశాలలలో చేర్చి సంస్కరించడానికి 1926 లో బోర్టస్టల్ పాఠశాలల చట్టం మొట్టమొదటిసారి ప్రవేశపెట్టడం జరిగింది. మద్రాస్, ఆంధ్రప్రదేశ్, పంజాబ్, బెంగాల్,

మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, బొంబాయి, మైసూర్, కేరళ మొదలైన రాష్ట్రాలలో ఇటువంటిచట్టాలు ప్రవేశపెట్టారు. బోర్స్టల్ పాఠశాలలలో విద్యాబోధన, నైతికబోధన, వృత్తిశిక్షణ ఇచ్చి నేరస్తులు తిరిగి జీవితంలో మరెప్పుడూ నేరం చేయకుండా సక్రమంగా ప్రవర్తించే విధంగా సంస్కరణ పొందేటట్లు చేస్తారు.

భారత రాజ్యాంగం కూడా బాలలకు ఈ కింది రక్షణలను కల్పించింది. తలిదండ్రుల ఆధారం లేకపోయినా కూడా బాలలు ఎటువంటి ఆటంకాలకు లోనుకాకుండా ఆరోగ్యం, బాధ్యతాయుతం, స్వయం పోషకత్వం గల పౌరులుగా పెరగడానికి కావలసిన ప్రోత్సాహాన్ని ప్రతీ బాలునికి కలుగచేయాలి. ఇదే విధంగా బాలల సంక్షేమం కోసంకూడా కొన్ని ప్రత్యేక నిబంధనలను రాజ్యాంగంలో పొందుపరచడమైంది. పన్నెండు సంవత్సరాలలోపు వయసుగల బాలలను టీ, పొగాకు, తేయాకు మొదలైన తోటలలోను, 14 సంవత్సరాలలోపు వయసుగల వారినికి కర్మాగారాలలోను, 15 సంవత్సరాల వయసుకు మించనివారిని గనులలోను, తదితర ప్రమాదకరమైన వృత్తి పరిస్థితులు గల ప్రాంతాల లోను చేర్చుకోకూడదని సూచించడం జరిగింది. 14 సంవత్సరాల వయసు వచ్చేవరకు నిర్బంధ విద్యాబోధన జరగాలనికూడా రాజ్యాంగం సూచించింది.

ఈ విధంగా సమాజంలో బాలల అవాంఛనీయ పరిస్థితులను నిరోధించడానికి, వాంఛనీయమైన పరిస్థితులు పెంపొందించడానికి శాసనాలను రూపొందించి, వాటిని సక్రమ పద్ధతిలో అమలుజరపడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

## బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు, వ్యవస్థాపన - వాటి పాత్ర

బాలల శారీరక ఆరోగ్య సంరక్షణకు ఆసుపత్రులు, చికిత్సా కేంద్రాలు, వైద్య సేవలు ఏ విధంగా ముఖ్యమైనవో అదే విధంగా

వారి మానసిక వ్యాసులను, వారి ప్రవర్తనకు సంబంధించిన సమస్యలకు కూడా చికిత్స, ప్రత్యేక సేవలు అవసరం. ఈ విధమైన సేవలను బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు కలుగజేస్తాయి. బాలబాలికలలో అంతర్గతంగావున్న కొన్ని కోరికలు తీరక వారిలో అవి అసంతృప్తిని, అశాంతిని కలుగజేస్తాయి. వారు తమ పరిసరాలతో సమన్వయాన్ని సాధించుకోలేక సంఘర్షణకు లోనవడం జరుగుతుంది. లేదా వారి శారీరక, మానసిక అభివృద్ధి లోపించవచ్చు. అనారోగ్య లక్షణాలు, సంఘ వ్యతిరేక ప్రవర్తన కూడా అలవడవచ్చు. అంతేకాక వారు సాంఘిక రంగంలోను, విద్యారంగంలోను కూడా వెనుకబడతారు. ఈ విధమైన సమస్యలున్న బాలబాలికలకు తగురీతిగా సహాయం చేయడం కోసమే బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు నెలకొల్పారు. సమాజంలో లభ్యమయ్యే వనరులను సమీకరించి కృషి చేయటం వీటి ప్రధాన లక్ష్యం. బాలలను అర్థంచేసుకుని వారు సంతృప్తికరంగా సమన్వయాన్ని సాధించుకోడానికి ఈ కేంద్రం తోడ్పడుతుంది. బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు, వైద్య-సాంఘిక సేవలో చేర్చడమైంది. మొట్ట మొదట బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు 46 సంవత్సరాల కిందట దొరాబ్జీ టాటా గ్రాడ్యుయేట్ స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్ (Dorabji Tata Graduate School of Social Work) చే స్థాపించబడింది. 1909 వ సంవత్సరంలో మార్గదర్శక కేంద్రాలు అమెరికాలో ప్రారంభించడం జరిగింది. భారతదేశంలో ఇటువంటి కేంద్రాలు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నాయి.

## బాలల మార్గదర్శక కేంద్రాలు - సూత్రాలు

బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు ఈ కింద పేర్కొన్న సూత్రాలమీద ఆధారపడి పనిచేస్తాయి.

1. ఏసమస్యతో అయితే బాలుడు ఈ కేంద్రానికి చేరుకుంటాడో ఆ సమస్యను తొలగించాలి.
2. ఆ బాలుని పూర్తి పరిస్థితులను అవగాహన చేసుకుని చికిత్స చేయాలి.

3. పరిస్థితులతో సర్దుబాటు చేసుకుని ఇతరులతో సర్దుబాటు చేసుకొనే లాగ చేయడానికి అతని పూర్తి మూర్తిమత్వాన్ని పరిశీలించి చికిత్స చేయాలి.
4. తల్లిదండ్రులతో ఆత్మీయత లేకపోవడంవల్ల సమస్యలకు లోనైన బాలల చెడు ప్రవర్తనను తొలగించడానికి వారికి తమ తలిదండ్రులతో ఆత్మీయతను ఏర్పరచాలి.
5. తలిదండ్రుల స్వభావంవల్ల బాలలు చెడుప్రవర్తనను పొందినట్లైతే వారి తలిదండ్రుల స్వభావాన్ని మార్చడం లేదా సవరించడం చేయాలి.
6. అవసరమైతే మానసిక రుగ్మతలతో బాధపడుతున్న తలిదండ్రులకూ కూడా చికిత్సచేయాలి.

మానసిక రుగ్మతలను నిరోధించడానికి బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు చాలా ముఖ్యమైన పాత్రను వహిస్తున్నాయి. బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు, మనో విజ్ఞానశాస్త్రం, మనో వైజ్ఞానిక, సాంఘిక సంక్షేమ కృషి రంగాలలో పోస్టుగ్రాడ్యుయేషన్ చేస్తున్న విద్యార్థులకు, నర్సులకు, హెల్త్ విజిటర్లకు శిక్షణ ఇచ్చే కేంద్రాలుగా ఉపయోగపడుతున్నాయి. అంతేకాక బాలల మానసిక ఆరోగ్య సూత్రాలను ఉపాధ్యాయులకు, తలిదండ్రులకు, వైద్యులకు, సంక్షేమ కార్యకర్తలకు, పరివీక్షణాధికారులకు తెలియజేయడానికి ప్రసారకేంద్రాలుగా కూడా పనిచేస్తున్నాయి.

బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలలో వ్యవస్థితమైన శాస్త్రీయ పద్ధతిలో బాలల మానసిక రుగ్మతలను చికిత్సచేయడం జరుగుతుంది. వీటిలో సుశిక్షితులైన సంక్షేమ కార్యకర్తలను, మానసిక రోగ చికిత్సా శాస్త్రవేత్తలను, ముఖ్యంగా నియమించాలి. వీరికి వృత్తికి సంబంధించిన శిక్షణ మాత్రమే కాకుండా ఆ ప్రాంతీయ సాంఘిక, ఆర్థిక సంస్కృతిక పరిస్థితులు కూడా తెలిసిఉండటం చాలా అవసరం. బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలకు చేరిన బాలుని

మొట్టమొదటి సారిగా సాంఘిక సంక్షేమ కార్యకర్త ఆహ్వానిస్తాడు. బాలుని తలిదండ్రులతోను, స్నేహితులతోను, ఉపాధ్యాయులతోను ముఖాముఖి సంభాషణలను జరిపి అతని సాంఘిక, ఆర్థిక, కుటుంబ పరిస్థితులను గురించి సమాచారమంతా సేకరిస్తాడు. కొన్ని సమయాలలో బాలుడు తన సమస్యను స్వయంగా చెప్పుకోగలిగే శక్తిని కలిగిఉండవచ్చు. సంక్షేమ కార్యకర్త బాలుని ఇంటికి, పాఠశాలకు, గృహ పరిసరాలకు వెళ్ళి విషయ సేకరణ చేస్తాడు. ఇదంతా సంక్షేమ కార్యకర్త జరిపే ప్రాథమిక పరీక్ష. ఈ స్థాయిలోనే బాలల చికిత్సలో ప్రాముఖ్యత పొందిన వైద్యాధికారి బాలుని శారీరక ఆరోగ్యాన్ని పరీక్షించడం జరుగుతుంది. మనోవిజ్ఞాన శాస్త్రవేత్తకూడా కొన్ని పరీక్షలను జరుపుతాడు. వీటివల్ల బాలుని బుద్ధివికాసం, అతని మానసిక అవసరాలు మొదలైనవి తెలుస్తాయి.

సంక్షేమ కార్యకర్త ముఖాముఖీ సంభాషణల ద్వారా బాలుని పరీక్షించడం జరుగుతుంది. ముఖాముఖి సంభాషణలు జరిపేటప్పుడు బాలునికి మానసికంగా ఏ అసౌకర్యమూ కలుగకుండా స్నేహపూర్వకంగా, దయార్ద్ర హృదయంతో ప్రశ్నలు వేయాలి. బాలునికి ఆత్మవిశ్వాసాన్ని కలిగించే పరిసరాలను, పరిస్థితులను కల్పించాలి. ఈ పరీక్షలు బాలుని మానసిక శక్తి సామర్థ్యాలను అందుబాటులో ఉండాలి. బాలుని ప్రవర్తనను. వ్యక్తిత్వాన్ని అభిరుచులను తెలుసుకోవాలి. వీటన్నిటినీ ఎప్పటికప్పుడు రాసుకుని బాలుని కేస్ రికార్డ్‌ను తయారు చేయాలి.

సంక్షేమ కార్యకర్త బాలుని కేస్ రికార్డ్ తయారు చేసిన తరువాత మనోరోగ చికిత్సా శాస్త్రవేత్త బాలునితో సంభాషణలు జరుపుతాడు. సంక్షేమ కార్యకర్త, వైద్యాధికారి, మనోవిజ్ఞాన శాస్త్రవేత్త జరిపిన పరీక్షల ఫలితాలు వ్రాసివుంచిన కేస్ వృత్తాంతం, మనోరోగ చికిత్సా శాస్త్రవేత్తకు రోగవిదానంలో ఉపయోగ పడుతుంది. ఈ శాస్త్రవేత్త బాలునితో స్నేహపూర్వక సంబంధాలు ఏర్పరచుకొని

ఆటల సమయాలలోను, ఇతర వ్యాపకాలలోను, ఆ బాలుని ప్రవర్తనను, అభిరుచులను గమనిస్తాము.

బాలునితో మనోరోగ చికిత్సా శాస్త్రవేత్త జరిపే ముఖాముఖీ సంభాషణలలో ఆ బాలుని గురించి, అతని తలిదండ్రుల గురించి అవసరమైన సమాచారాన్ని సేకరిస్తాడు. ఆ తరువాత సాంఘిక సంక్షేమ కార్యకర్త, మనోవైజ్ఞానిక శాస్త్రవేత్త, వైద్యాధికారి, మనోరోగ చికిత్సా శాస్త్రవేత్త సమావేశమై బాలుని పరిస్థితిని చర్చిస్తారు. ఆ బాలుని తలిదండ్రులతో కూడా చర్చిస్తారు. ఈ సమావేశం రోగ విదానానికి ఉపయోగపడుతుంది. ఆతరువాత చేసే చికిత్సావిధానంలో కూడా తరచు అనేక సమావేశాలు అవసరమౌతాయి. బాలుని మానసిక అస్వస్థత ఈ సమావేశంలో నిర్ణయిస్తారు.

బాలునికి గల సమస్యలను బట్టి, పరిస్థితులనుబట్టి, చికిత్సా విధానాలు ఆధారపడి ఉంటాయి. ముఖ్యంగా బాలల చికిత్సా విధానాలు నాలుగు పద్ధతులలో చేయవచ్చు.

1) వ్యక్తిగత చికిత్స 2) క్రీడా చికిత్స 3) సామూహిక చికిత్స 4) హితబోధలు.

## 1. వ్యక్తిగత చికిత్స

బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలలో బాలలకు అనేక రకాలైన ఆటవస్తువులను అందుబాటులో ఉంచాలి. వీటితో ఆడుకునే సమయంలో తన అభిరుచులను ఏవిధంగా వ్యక్తంచేస్తాడో గమనించవచ్చు. బాలునిచేత వివిధ రకాల కథలు చెప్పించడం, బాలుడు ఆ కథను చెప్పే తీరునుబట్టి అతని అభిప్రాయాలు పరోక్షంగా వ్యక్తమవుతాయి.

## 2. క్రీడా చికిత్స

క్రీడా చికిత్సలో బాలునికి ఉద్దేశపూర్వకంగా ఒక నిర్ణీతమైన ఆటనిచ్చి ఆ బాలుడు తన చేష్టలను వ్యక్తపరచే అవకాశాన్ని కల్పిస్తారు. ఈ విధానం చికిత్సకు ఎంతో ఉపయోగపడుతుంది.

బాలునితో అంతర్గతంగా అణిగిమణిగిన అభిప్రాయాలు, వాంఛలు, బయటపడేలాగ పరిస్థితులను కల్పిస్తారు. క్రీడా చికిత్సా విధానం సమన్వయాన్ని సాధించి బాలలు తమ సమస్యలను తామే పరిష్కరించుకొనేటట్లు చేస్తుంది.

## 3. సామూహిక చికిత్స

ఒక్కొక్కసారి బాలుడు సమూహంలోవుండగా తన అసహజమైన ప్రవర్తనను వ్యక్తపరుస్తాడు. బాలుని ప్రవర్తనను, అతని సమస్యను సమన్వయపరచి చికిత్స చేయడం జరుగుతుంది. బాలుడు తన పరిసరాలతో సమన్వయం పొందేటట్లు చేయడం చికిత్సా విధానంలో ముఖ్యమైన అంశం. కొన్ని పరిస్థితులలో, పరిసరాలలో మార్పు తేవలసి ఉంటుంది. ఈ పరిస్థితులు కుటుంబంలోగానీ, పాఠశాలలోగానీ అయి ఉండవచ్చు. సంక్షేమ కార్యకర్త ఈ పరిస్థితులను స్వయంగాచూసి మార్పులను సూచించవలసి ఉంటుంది.

## 4. హితబోధలు

అవసరమయితే బాలల సంరక్షణా స్థలంలో బాలుని చేర్చవలసి ఉంటుంది. ఈ బాధ్యత కూడా కార్యకర్తే వహిస్తాడు. చికిత్స పూర్తయిన తరువాత బాలుని విడిచిపెట్టివేయకుండా కొంతకాలంపాటు అతనిని గమనిస్తూ ఉండాలి. దీనివల్ల ఆ బాలునికి తిరిగి సమస్య ఏర్పడకుండా చూడవచ్చు. అంతేకాక అతడు ఇంతకు పూర్వం సర్దుబాటు చేసుకోలేని పరిస్థితులతో ఎంతవరకూ సర్దుబాటు చేసుకోగలుగుతున్నాడో కూడా తెలుసుకోవచ్చు. సోమరితనం, విద్యాభ్యాసంలో మందకొడితనం, దొంగతనం వంటి లక్షణాలు కనిపించినపుడు హితబోధల ద్వారా చికిత్సచేయవలసి ఉంటుంది. ఈ విషయంలో ఉపాధ్యాయుల సహకారం తీసుకోవడం చాలా ముఖ్యం.

బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలలో బాలల ఆదేశాత్మక సమస్యలను కూడా చికిత్స చేయడం జరుగుతున్నది. బాలల ఆదేశాత్మక సమస్యలను ఈ కింది విధంగా పేర్కొనవచ్చు. బొటనవేలు

చీకడం, గోళ్ళు కొరకడం, పక్కలు తడపడం (Bed Wetting), విపరీతమైన అలసటను పొందడం, నత్తి, ఆహార సమస్యలు, విపరీతమైన అలసటను పొందడం, సిగ్గు, అతిసున్నిత స్వభావం, అసూయ, మొండితనం, హింసించే స్వభావం, క్రూరత్వం, దొంగతనం మొదలైన అలవాట్లను, ప్రవర్తనను కూడా మార్చడం జరుగుతున్నది. ఈ అలవాట్లు పసితనంలో సూక్ష్మంగా అనిపించినప్పటికి బాలుడు పెద్దవాడైన తరువాత ఆ అలవాట్లే అతని జీవితాన్ని దుర్భరంచేయవచ్చు. "మొక్కయి వంగనిది మానై వంగునా" అనే నానుడి ప్రకారం ఈ అలవాట్లను చిన్నతనంలోనే పోగొట్టని పక్షంలో పెద్దవాడయాక మానుకోడం చాలా కష్టసాధ్యమయినపని. కనుక వీటిని చిన్నతనంలోనే తుంచి వేయడం ఎంతో శ్రేయస్కరం. ఈ అలవాట్లు సాధారణంగా తలిదండ్రులు చెప్పి మాన్పించవచ్చు. కానీ కొంతమంది బాలలలో అంత సులభంగా ఈ అలవాట్లు పోవు. అటువంటి పరిస్థితులలో తలిదండ్రులుగానీ, సంరక్షకులుగానీ, బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలకు తీసుకుని వెళ్ళి సంప్రదించడం చాలా ముఖ్యం.

1964 వ సంవత్సరంలో భారతదేశం మొత్తంమీద 25 బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు ఉన్నాయని అంచనా వేయబడింది. వీటిలో 6 మహారాష్ట్రలో ఉన్నాయి. మనదేశంలో కనీసం 1,00,000 బాలలకు ఒక బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రం నెలకొల్పడం చాలా అవసరం. 1980 వ సంవత్సరం నాటికి 80 బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలున్నాయని అంచనా. వీటిలో సహాయం పొందుతున్న బాలలు సుమారు 50 మిలియన్లనీ, వీరందరూ పట్టణప్రాంతం బాలలనీ, వీరి వయసు 14 సంవత్సరాల లోపనీ 1980 - డైరక్టరీ ఆఫ్ చైల్డ్ గైడెన్స్ సర్వీస్ ఇన్ ఇండియా (1980 - Directory of Child Guidance Services in India) లో తెలియజేయడమైంది. స్థాపితమయి ఉన్న చికిత్సా మార్గదర్శక కేంద్రాలన్నీ పూర్తిగా ఉపయోగించబడటం లేదు.

మారుతున్న సాంఘిక విలువలవల్ల అధిక సంఖ్యాకులలో సమన్వయ సమస్యలు ఏర్పడుతున్నవి. ఈ దృష్ట్యా బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు అవసరం ఎంతో ఉంది. బాలల మానసిక అస్వస్థను, అనారోగ్యాన్ని ప్రాథమిక దశలోనే గుర్తిస్తే వాటి నివారణకు కృషి చెయ్యడానికి సాధ్యమౌతుంది. ఈ బాలల చికిత్సా మార్గదర్శక కేంద్రాలు బాలనేరాన్ని నిరోధించడానికి, నేరాల తీవ్రతను తగ్గించడానికీ కూడా ఉపయోగపడుతున్నాయి.

## బాలల అంతర్జాతీయ సంవత్సరం - శిశు సంక్షేమ కార్యక్రమం

భారతదేశం 1979 వ సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా పరిగణించడం జరిగింది. బాలల అంతర్జాతీయ సంవత్సర సందర్భంగా భారతదేశం "యూనిసెఫ్"(UNICEF)కు 0.9 మిలియన్ల రూపాయలకు విరాళంగా ఇవ్వడం జరిగింది. ఈ విధంగా విరాళాలిచ్చిన దేశాలలో భారతదేశం ప్రథమస్థానాన్ని ఆక్రమించింది. జాతీయ బాలల సంస్థ జాతీయ అంతర్జాతీయ కమిషన్‌గా మార్పుపడింది. దీనికి ప్రధాన మంత్రి అధ్యక్షత వహిస్తారు. ఈ కమిషన్ భారతదేశం అంతర్జాతీయ బాలల సంవత్సరాన్ని సక్రమంగా నడపడానికి సలహానిస్తుంది. భారత ప్రభుత్వం 1978 వ సంవత్సరంలో అంతర్జాతీయ బాలల సంవత్సరాన్ని సక్రమంగా నడపడానికి జాతీయ ప్రణాళికను తయారుచేయడం జరిగింది. ఈ ప్రణాళికలో ఆరోగ్యం, పోషకాహారం, విద్య, సంక్షేమ శాసనాలు మొదలైన కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. అంతేకాక సముదాయం, ఇతర ప్రభుత్వేతర సంస్థలు బాలల అవసరాలని తీర్చాలని ఈ ప్రణాళికలో స్పష్టంచేసింది. అంతర్జాతీయ బాలల సంవత్సరం ముఖ్యోద్దేశమేమంటే—

1. ప్రసవ సమయంలో మరణాలు, శిశు మరణాలు తగ్గించడం.
2. ప్రాథమిక విద్య ప్రాముఖ్యతను అందరూ తెలుసుకునేలాగ చేయడం. పాఠశాల నుంచి తరలిపోవడం, చదువు మానివేయడం మొదలైన సమస్యలను తగ్గించి విద్యను ప్రోత్సహించడం.

3. పాఠశాల పూర్వవయసు బాలలకు మానసిక, సాంఘిక అభివృద్ధికి సౌకర్యాలను కలుగజేయడం.
4. బాలల కనీస హక్కులను సంరక్షించడం.
5. బాలలను అశ్రద్ధ, క్రూరత్వం, ప్రమాదం, దోపిడి మొదలైన అత్యాచారాలనుంచి సంరక్షించడం మొదలైనవి.

భారతదేశంలో అంతర్జాతీయ బాలల సంవత్సరం ముఖ్యోద్దేశం వెనుకబడిన బాలలను అభివృద్ధిలోకి తీసుకునిరావడం, సమాజంలో గ్రామీణ, వెనుకబడన ప్రాంతాలలో నివసించే బలహీనవర్గాలకు చెందిన బాలల అభివృద్ధికి కృషిచెయ్యడానికి సంవత్సర ప్రణాళికలు కృషిచేయడం జరిగింది. అదేవిధంగా గిరిజన ప్రాంతం బాలలకు, పేదరికాన్ని అనుభవిస్తున్న బాలలకు సౌకర్యాలను ఏర్పాటుచేయడం జరిగింది. బాలల అంతర్జాతీయ సంవత్సరంలోగల ఒక్కొక్క మాసం ఒక్కొక్క కార్యక్రమానికి కేటాయించారు. అవి వరుసగా పోషకాహారం, రోగనిరోధక కార్యక్రమాలు, పరిసరాల పరిశుభ్రత, పరిశుభ్రమైన మంచినీటి సౌకర్యాలు, బాలల సంరక్షణ మొక్కలను నాటడం మొదలైన కార్యక్రమాలను వరుసగా చేయడం జరిగింది.

బాలల అంతర్జాతీయ సంవత్సరంలో ప్రభుత్వం బాలల అభివృద్ధి కోసం కొత్త పథకాలను ప్రవేశపెట్టడమేకాక ముందుగా బాలల సంక్షేమం కోసం కృషి చేస్తున్న సంస్థలను బలపరచడంకూడా జరిగింది. అంతర్జాతీయ బాలల అభివృద్ధి సేవా పథకం 1975 వ సంవత్సరంలో 33 ప్రాజెక్టులతో ఆరంభమయింది. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో 150 ప్రాజెక్ట్లు విస్తృతమయినది. ఇంటిగ్రేటెడ్ డెవలప్‌మెంట్ ప్రోగ్రామ్ (Integrated Development Programme) కూడా ఈ సంవత్సరంలో 50 ప్రాజెక్ట్లకు విస్తృతం చెందింది. భారత ప్రభుత్వం వారు ఈ సంవత్సరంలోనే 1,53,000 గ్రామాలను మంచినీటి సౌకర్యాల సమస్యను కలిగిన గ్రామాలుగా గుర్తించారు. 1979-80 వ సంవత్సరంలో ఈ గ్రామాలకు మంచినీటి సౌకర్యాన్ని ఏర్పాటు చేయడానికి 600 మిలియన్ల రూపాయలను ఖర్చు చేశారు. ఈ సంవత్సరంలో

ఆరోగ్య సౌకర్యాలు కూడా అభివృద్ధి చెందాయి. 1978-79 సంవత్సరంలో ఆరోగ్య సౌకర్యాలకై 47 4 మిలియన్ల రూపాయలు ఖర్చయితే 1979-80 నాటికి 60.4 మిలియన్ల రూపాయలు ఖర్చుచేశారు. ప్రాథమిక విద్యా కార్యక్రమాలు కూడా అదే విధంగా అభివృద్ధి చెందాయి.

భారత దేశ ప్రధానమంత్రి, అధ్యక్షుడు కూడా జనవరి ఒకటవ తేదీ 1979 వ సంవత్సరంలో జరిగిన ర్యాలీలో అంతర్జాతీయ బాలల సంవత్సరాన్ని ప్రకటించడమైంది. ఈ సంవత్సర ప్రకటనకై తపాలా బిళ్ళలను, కాయిన్లను ప్రవేశపెట్టడం జరిగింది. డాక్యుమెంటరీ ఫిల్ములను కూడా విడుదల చేశారు. అవి ఏవంటే —

1. యువర్ ఛైల్డ్ (Your Child)
2. హాపీ ఛైల్డ్ నేషన్స్ ప్రైడ్ (Happy Child Nation's Pride)

ఇది ఒక సంవత్సరం కాలపరిమితి గల పథకం అయినప్పటికీ విజయాన్ని సాధించడం జరిగిందని చెప్పవచ్చు.

## శిశు సంక్షేమం - పంచవర్ష ప్రణాళికలు

మొదటి పంచవర్ష ప్రణాళికలో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ 592 బాలల సంక్షేమ సంస్థలకు సహాయాన్ని అందజేసింది. బాలల సంక్షేమాల విషయమై కేంద్ర సంస్థ గ్రామీణ ప్రాంతాలలో విస్తృత పథకాలను ప్రవేశపెట్టింది.

రెండో పంచవర్ష ప్రణాళికలో పేదకుటుంబాలకు చెందిన బాలలకు సెలవుదిన గృహాలను ఏర్పాటుచేశారు. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ బాలల సంక్షేమానికి కృషిచేసే సంస్థలకు ధనసహాయం చేసింది. 0.02 కోట్ల రూపాయల వ్యయంతో సెలవుదిన గృహాలను ఏర్పరచడంవల్ల 3.862 మంది బాలలు ఈ సౌకర్యాన్ని పొందారు.

మూడో పంచవర్ష ప్రణాళికలో విద్యారంగానికి 3 కోట్ల రూపాయలు కేటాయించారు. విద్యారంగంలో ఖర్చుపెట్టిన మొత్తం ప్రత్యేకించి బాలల సంక్షేమానికి సంబంధించింది. ఈ ప్రణాళికలో 'లల సంక్షేమ కార్యక్రమాలకు ప్రముఖస్థానం ఇచ్చారు. బాలల

సంక్షేమ కార్యక్రమాలద్వారా అనేక సేవలను అందజేశారు. పాఠశాల పూర్వ విద్య, మధ్యాహ్న భోజనాలు ఆరోగ్యసేవలు, సాంఘిక, నైతిక ప్రమాదాలకు గురైన బాలల సంరక్షణ సేవలు, శారీరక, మానసిక వికలాంగులకు చికిత్సా, సమస్యావిధానం, పునరావాస సేవలు మొదలైనవి చేయడమైంది. బాలలలో భిక్షాటన తొలగించడానికి కూడా ఈ ప్రణాళికా కాలంలో కొంత కృషిజరిపారు. బాలల విద్యా రంగంలో ఖర్చుపెట్టిన 3 కోట్ల రూపాయలలో 166.25 లక్షల రూపాయలు ఇంటిగ్రేటెడ్ ఛైల్డ్ వెల్‌ఫేర్ ప్రాజెక్టుకు, 3.75 లక్షల రూపాయలు బాలల సంక్షేమం కోసం కృషిచేసే స్వచ్ఛంద సేవా సంస్థలకు, 3 లక్షల రూపాయలు బాలల అభివృద్ధి పరిశీలనా పథకం కోసం, 125 లక్షల రూపాయలు పాఠశాల పూర్వ విద్యాపథకానికి ఖర్చుచేశారు.

1966–67 లో జరిగిన మొదటి వార్షిక ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వం 17.45 లక్షల మొత్తాన్ని బాలల వసతి గృహాలు, బాల భవనాలు, పెంపుడు సంరక్షక గృహాలు, అంధులు, చెవిటి, కుంటి వారు అయిన బాలల ప్రత్యేక సంస్థలు నడిపే నిమిత్తమై వివిధ రాష్ట్రాలలో ఖర్చుచేశారు. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ పూర్వ శిక్షణా కార్య క్రమాలను యూనిసెఫ్ (UNICEF), యూనెస్కో (UNESCO) మొదలైన అంతర్జాతీయ సంస్థల సహాయంతో ప్రవేశపెట్టి 11–14 సంవ త్సరాల మధ్యగల 3,346 మంది బాలలకు శిక్షణ ఇచ్చారు. దీనికోసం 19.87 లక్షల రూపాయలు ఖర్చుపెట్టారు. ఈవిధంగా 1966–67 వార్షిక ప్రణాళికలో బాలల సంక్షేమానికి ప్రాధాన్యత ఎక్కువగా ఇవ్వడం జరిగింది.

రెండో వార్షిక ప్రణాళికలో (1967–68) బాలల ప్రత్యేక కార్య క్రమాలకై 5 లక్షల రూపాయల ఖర్చు చేశారు. ఇందులో 2 లక్షల రూపాయలు బాలల సెలవు గృహాలకు, 3 లక్షల రూపాయలు బాలల సాహిత్యాభివృద్ధికి ఖర్చు అయింది. అంతేకాక ఈ ప్రణాళికలో

కుటుంబ, బాలల సంక్షేమ ప్రాజెక్టుల కొనసాగింపుకు మొత్తం 61 80 లక్షలు ఖర్చు అయింది.

మూడో వార్షిక ప్రణాళికలో 1968-69 లో బాలల సంక్షేమార్థమై 16 50 లక్షల రూపాయలు ఖర్చుచేశారు. అందులో 5 లక్షల రూపాయలు బాలల సెలవు గృహాలకు, 11 50 లక్షల రూపాయలు బాలల సాహిత్యాభివృద్ధికి ఖర్చు చేశారు.

నాల్గో పంచవర్ష ప్రణాళికలో (1969-74) కుటుంబ, బాలల సంక్షేమాలకు 7 కోట్ల రూపాయలు ఖర్చు అయింది అనాధ బాలల, స్త్రీల సంక్షేమానికి స్వచ్ఛంద సేవా సంస్థలకు సహాయ నిమిత్తమై 3 కోట్ల రూపాయలు ఖర్చు చేశారు. బాల్వాడీలలో ఆహార పదార్థాల కోసం 6 కోట్ల రూపాయలు ఖర్చు చేయడమైంది. ఈ ప్రణాళికలో బాలల సంక్షేమానికి చెందిన లక్ష్యాలను ఈ కింద పేర్కొన్నాము.

1. కేంద్ర ప్రభుత్వం గ్రామీణ ప్రాంతాలలోని కుటుంబ, బాలల సంక్షేమాన్ని ప్రధానంగా తలచి 5 సంవత్సరాల కాలపరిమితిలో 181 కుటుంబాల, బాలల సంక్షేమ ప్రాజెక్టులను స్థాపించాలని సంకల్పించింది.

2. పాఠశాలలో చేరడానికి తగిన వయసులేని బాలల పోషకాహారం కొరత అనేది ఒక సమస్యగా ప్రభుత్వం తలచి తక్షణ చర్యలను తీసుకోవడం అందుకోసం 6 కోట్ల రూపాయలు బాల్వాడీలకు కేటాయించడం.

3. దిక్కులేని బాలల సంక్షేమానికి అధిక ప్రాధాన్యమిచ్చి వారి సంస్థాగత, ఇతర సేవలకు ప్రత్యేకంగా 2 కోట్ల రూపాయలు కేటాయించడం.

4. కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థలకు, ప్రత్యేకంగా స్త్రీల, బాలల సంక్షేమ సేవా కార్యక్రమాలను చేపట్టిన స్వచ్ఛంద సేవా సంస్థలకు సహాయాన్ని కొనసాగించడానికి సంకల్పించడం.

5. దిక్కులేని స్త్రీల, బాలల సంక్షేమ కార్యక్రమాల నిమిత్తమై స్వచ్ఛంద సేవా సంస్థలకు 1 కోటి రూపాయలు పంపకం చేయాలని సూచించడం.
6. బాలనేరం, పరివీక్షణ, స్త్రీలు, బాలికల అవినీతి వ్యాపారాన్ని అణచివేయడం, సాముదాయిక, నైతిక ఆరోగ్యాన్ని కాపాడడం, బిచ్చాటన నిర్మూలించడం మొదలైన వాటికి సంబంధించిన కార్యక్రమాలను ఏర్పాటుచేయడం.

ఈ ప్రణాళికలో బాలల విద్యాభివృద్ధికి 565 కోట్ల రూపాయలు వెచ్చించారు. అందులో 322 కోట్ల రూపాయలు ప్రాథమిక విద్యకోసం, 247 కోట్ల రూపాయలు మాధ్యమిక విద్యకోసం వ్యయం చేయడం జరిగింది. బాలల ప్రత్యేక కార్యక్రమాల కోసం 8 కోట్ల రూపాయాలు ఖర్చు చేయడమైంది.

ఐదో పంచవర్ష ప్రణాళిక (1974 - 79) లో బాలల ప్రాథమిక విద్యకోసం అత్యధిక ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. బాలలలో విద్యను ప్రోత్సహించడానికి ప్రభుత్వం అనేక రకాల స్కాలర్‌షిప్‌లను కూడా ప్రవేశపెట్టింది. ఈ ప్రణాళికలో సాంఘిక సంక్షేమానికి కేంద్ర ప్రభుత్వం 63 . 53 కోట్ల రూపాయలు, రాష్ట్రప్రభుత్వం 22 . 60 కోట్ల రూపాయలు కేటాయించడం జరిగింది. ఇంటిగ్రేటెడ్ చైల్డ్ సర్వీసెస్, ఉద్యోగంచేస్తున్న బాలికల వసతి సౌకర్యాలు, బాలల సంక్షేమ కార్యక్రమాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. స్త్రీల, కుటుంబ, బాలల సంక్షేమ ప్రాజెక్టులకోసం 2 . 40 కోట్ల రూపాయలు ఖర్చుచేశారు. కేంద్ర ప్రభుత్వం బాలల సంక్షేమ పథకాలకు 22 . 09 కోట్ల రూపాయలు ఖర్చుచేసింది.

ఆరో పంచవర్ష ప్రణాళిక (1979-84) లో బాలల అభివృద్ధి పథకాలకు ఎక్కువ ప్రాధాన్యత నివ్వడం జరిగింది. అంగన్‌వాడీలను అభివృద్ధిపరచడానికి అనేక కార్యక్రమాలను చేపట్టింది. అంగన్‌వాడీలను అభివృద్ధిపరచడానికి శిక్షణా కార్యక్రమాలను బలపరచడం, పర్యవేక్షణా కార్యక్రమాలను అభివృద్ధిపరచడం, ఆరోగ్యం, ఆహారం,

తదితర సేవా కార్యక్రమాలను అభివృద్ధిపరచడం మొదలయిన కార్య క్రమాలను చేపట్టి బాలల అభివృద్ధికి కృషి చేశారు.

అత్యవసర పరిస్థితిలో గల బాలల పరిరక్షణ భద్రతా కార్య క్రమాలకోసం 5.75 కోట్ల రూపాయలు కేటాయించారు. ఇంటి గ్రేటెడ్ ఛైల్డ్ డెవలప్‌మెంట్ సర్వీసెస్‌కై 45 లక్షల రూపాయలు కేటాయించడమైంది.

# 4

# యువజన సంక్షేమ సేవలు

14 నుంచి 20 సంవత్సరాలమధ్య వయసుగలవారిని యువజనులని అంటారు. బాల్యవయసుగాక, వయోజనులుగాక మధ్యవయసులో ఉన్నవారిని యువజనులంటారు. 14 సంవత్సరాల లోపువారిని బాలలనీ, 25 సంవత్సరాల పైబడ్డవారిని వయోజనులనీ, 14 నుంచి 20 సంవత్స రాల మధ్యవయసు వారిని యువజనులనీ నిర్వచించటం జరిగింది. బాల్య దశనుంచి యౌవన దశలోకి అడుగుపెట్టే సమయంలో యువజనులలో అనేక రకాలైన మానసిక, శారీరక మార్పులు రావడం జరుగుతుంది. ఆ మార్పులవల్ల వారు అనేక మానసిక ఒత్తిడులకు లోనవుతారు.

యువజనులు మంచి గుణగణాలను కలిగి ఉంటారు. యువజనుల వలననే సమాజం శిథిలం కాకుండా ఎప్పటికప్పుడు నిత్యనూతనత్వాన్ని పుంజుకోవడం జరుగుతున్నది. అయితే యువకుల శక్తి సామర్థ్యాలు ఎప్పుడూ నిర్మాణాత్మకమైన పద్ధతిలోను, మంచి మార్గంలోనూ పయనిస్తాయని చెప్పటం అసాధ్యం. కొన్ని కొన్ని సందర్భాలలో యువకుల శక్తి సామర్థ్యాలు, తెలివితేటలు తప్పుదారి పట్టడానికి అవకాశంవుంది. అందువల్ల యౌవనదశలో వ్యక్తుల నడవడిని సంరక్షించడం సమాజానికి ఎంతో శ్రేయోదాయకం. యువజన సంక్షేమ కార్యక్రమాలు సమాజ సంక్షేమానికి ఉపయోగపడతాయి.

## యువజన సంక్షేమ సేవలు - ఆవశ్యకత

సాంఘిక సంక్షేమ సేవలలో యువజన సంక్షేమం ఒక భాగంగా మనదేశంలోనేకాక విదేశాలలోకూడా గుర్తించడం జరిగింది. యువజన సంక్షేమం అధునాతనంగా ఏర్పడిన కార్యక్రమం. భారత దేశంలో స్వాతంత్ర్యం వచ్చిన తరువాత యువజన సంక్షేమానికి ప్రాధాన్యత

ఇవ్వడం జరిగింది. మానవుని జీవితంలో ఏర్పడే దశలన్నిటిలో యౌవన దశకు అధిక ప్రాముఖ్యత ఉన్నది. ఈ దశకు ఎంత ప్రాముఖ్యతవుందో అంత క్లిష్టమైన దశ అని కూడా చెప్పవచ్చు. ఈ దశలో వ్యక్తిగత అభిరుచులు, అభిప్రాయాలు, ఆదర్శమైన ఆశయాలు జీవితాంతం గోచరించి ఒక స్థిరమైన మూర్తిమత్వాన్ని పొందడానికి దారి చూపుతాయనడంలో సందేహం లేదు. వ్యక్తిగత విజ్ఞానం కూడా ఈ దశలోనే సంపాదించుకోవడం జరుగుతుంది. ఈ దశలో వారి అభిరుచులను, సమస్యలను అర్థం చేసుకుని వాటికి అనుగుణంగా శిక్షణ ఇవ్వటం అవసరం.

పూర్వకాలానికీ, ఈనాటికీ సమాజంలో అనేక మార్పులు కనిపిస్తున్నాయి. పూర్వకాలంలో వర్ణ వ్యవస్థ, వర్ణాశ్రమ ధర్మాలు, సమిష్టి కుటుంబ వ్యవస్థ, మత సాంప్రదాయాలు మొదలైనవాటికి ఎక్కువ ప్రాధాన్యత ఉండేది. ఆధునిక యుగంలో పాత సాంప్రదాయాలకు, పద్ధతులకు, భావాలకు అంతగా ప్రాధాన్యత లేదు. పారిశ్రామికీకరణం, నగరీకరణం, పాశ్చాత్య విద్యా విధానంవల్ల యువజనులలో అధిక సంఖ్యాకులు పల్లె ప్రాంతాలనుంచి పట్టణ ప్రాంతాలకు ఉన్నత విద్య, ఉద్యోగావకాశాలు, విలాసాలు మొదలైనవాటికి తరలిపోవడం జరుగుతుంది. నూతన వాతావరణంలో వారు సర్దుబాటు చేసుకోలేకపోవడంవల్ల వారు అనేక సమస్యలకు గురి అవుతున్నారు. ఈ సమస్యలు పరిష్కరించడానికి యువజనులకు ప్రప్రథమంగా మంచి శిక్షణ నివ్వాలి.

విద్య, ఆరోగ్యం, వినోదం, వృత్తి రంగాలలో యువజనులకు ఆసక్తి హెచ్చు. శిశు దశలో వలె యౌవన దశలో వ్యక్తులు కేవలం సంక్షేమ సౌకర్యాలను పొందడమే కాక వారు కూడా సమాజానికి కొంత సంక్షేమాన్ని ఏర్పరచగల కార్యక్రమాలను చేపట్టగలరు. పౌరులుగా వారు ఆ బాధ్యతను స్వీకరించాలి. కనుక సమాజంలో యువకులు సామాజిక సంక్షేమ సేవలను ఇచ్చిపుచ్చుకుంటారని చెప్పవచ్చు.

యువజన సంక్షేమ కార్యక్రమాలు యువకుల మానసిక, శారీరక, నైతిక అవసరాలను తీర్చడానికి ఏర్పరచిన కార్యక్రమాలు. యువకుల సంపూర్ణ వికాసానికి ఈ కింది పద్ధతులద్వారా సంక్షేమ సేవలను అందించవచ్చు.

1. బాధ్యతాయుతమైన, సంతృప్తికరమైన, మూర్తిమత్వంగల వయోజనులుగా తయారుచేయడం.
2. మానసిక స్వాతంత్ర్యాన్ని కలుగజేసి వారి భావిజీవితాన్ని సంరక్షించడం.
3. యువతీయువకుల మధ్య స్నేహభావాన్ని అభివృద్ధిపరచి సర్దుబాటును కలుగజేయడం, స్నేహితులతో సత్సంబంధాలను ఏర్పరచుకొనేటట్లు చేయడం.
4. యువజనులకు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కలుగజేయడానికి వృత్తి శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటుచేయడం మొదలైనవి యువజనుల సంపూర్ణాభివృద్ధికి అవసరమైన కార్యక్రమాలు.

ఉద్యోగం చేస్తున్న యువకులు తమ వృత్తిలో సఫలీకృతులైనప్పటికీ, వృత్తి పరిస్థితులలో సర్దుబాటు చేసుకోగలుగుతున్నప్పటికీ, తలిదండ్రుల అదుపు ఆజ్ఞలనుంచి స్వేచ్ఛను పొందగలిగినప్పటికి, అతడు సంపూర్ణంగా అభివృద్ధిచెంది, పరిపక్వం చెందిన వ్యక్తి కాలేడు. అతడు సంపూర్ణ అభివృద్ధిని పొందాలంటే అతడు సామాజికంగా ఆమోదించబడిన ప్రవర్తనను కలిగిఉండాలి. తన ప్రవర్తన సమాజానికి మార్గదర్శకంగా ఉండాలంటే అతడు కొన్ని విలువలను, పద్ధతులను తప్పనిసరిగా పాటించాలి.

సాధారణంగా ప్రతి కుటుంబంలో యువకులకు, తమ తలిదండ్రులకు మధ్య భేదాభిప్రాయాలు ఏర్పడటం సహజం. కొంతమంది తలిదండ్రులు తమ పిల్లలను యుక్తవయసు వచ్చినతరువాత కూడా తమ జీవితం గురించి తాము ప్రణాళికలను వేసుకొనడానికి, ఆలోచించడానికి, పూర్తి స్వాతంత్ర్యాన్ని ఇవ్వడానికి వెనుకంజవేస్తారు. యౌవనదశలో

వ్యక్తి ఎక్కువగా కుటుంబ సభ్యులకు దూరంగా ఉండి స్నేహితులతో ఎక్కువకాలం గడపడానికి ఇష్టపడతాడు. అంతేకాక తన సంరక్షణను తానే ఏర్పరచుకోవాలనుకుంటాడు. అటువంటి సమయంలో అతనికి కొంత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఇవ్వడంవల్ల అతడు స్వయంశక్తిని పొంది స్వాతంత్ర్య జీవితాన్ని గడపడానికి అవకాశం లభిస్తుంది.

యువతీ యువకులకు అన్నిరంగాలలో స్వాతంత్ర్యం గల ఈ రోజుల్లో వారిమధ్య అవగాహన ఉండి సత్సంబంధాలను కలిగి స్నేహపూరితంగా ఉండేలాగ అభివృద్ధి చేయాలి. వారిమధ్య భిన్నాభిప్రాయాలు ఏర్పడటానికి అవకాశం ఈయరాదు.

వ్యక్తులు తమ జీవనోపాధికై ఏ వృత్తిని చేపడతారు - అనే ఉద్దేశాన్ని కౌమారదశలోనే ఆలోచించుకోగలిగే అవకాశాన్ని, శక్తిని వారికి కలుగజేయాలి. యువతీ యువకుల భవిష్యత్తు గురించి తల్లిదండ్రులు కూడా ముందుగా నిర్ణయించుకోవడం జరగలేదు సరికదా, తమ పిల్లలకు కూడా ఆ అవకాశాన్ని కలుగజేయడం లేదు. అందువల్ల మన దేశంలో గల యువకులు వారు ఊహించని వృత్తులను చేపట్ట వలసిన పరిస్థితులు ఏర్పడుతున్నవి. అటువంటి సమయంలో యువకులు ఆ వృత్తులతో సర్దుబాటు చేసుకోలేక అసమయోజత్వాన్ని పొందడం జరుగుతున్నది. అంతేకాక తమ శక్తిసామర్థ్యాలను పూర్తిగా వినియోగించుకోలేకపోతున్నారు. తత్ఫలితంగా తక్కువ వేతనాలు పొందడం, అనేక సమస్యలకు గురికావడం జరుగుతున్నది. కనుక యువకులకు తమ భావిజీవితంలో తాము చేపట్టే వృత్తులగురించి ముందుగానే ప్రణాళికలు వేసుకోవడం ఎంతో ముఖ్యం. ఈ ప్రణాళికలు కుటుంబ ఆర్థిక శక్తి సామర్థ్యాలకు లభ్యమయ్యే అవకాశాలు, వ్యక్తి తెలివితేటలపై ఆధారపడి ఉండాలి. కళాశాలలలోను, పాఠశాలలలోను, యువతీ యువకులకు వృత్తి సంబంధమైన శిక్షణ ఇవ్వడం కూడా ఎంతో శ్రేయస్కరం.

## యువజన సమస్యలు

దేశ భవిష్యత్తు యువజనులపై ఆధారపడి ఉంటుంది. కనుక వారి శారీరక, మానసిక, సాంఘిక అవసరాలను తీర్చవలసిన బాధ్యత

సమాజంమీద, ప్రభుత్వంమీద ఎంతైనావుంది. యువజనుల అవసరాలు సాధారణంగా సమూహ జీవనం ద్వారా నెరవేరతాయి. యువజనులు సహజసిద్ధంగా తమతోటి వారితో కలసి మెలసి పనిచేయాలనే కుతూహలంతో ఉంటారు. కాని నేటి సామాజిక పరిస్థితులవల్ల వారు తమ తమ అవసరాలను నెరవేర్చుకోడంలో అనేక సమస్యలను ఎదుర్కోవలసి ఉంటుంది. అనాదిగా వస్తున్న సాంఘిక వ్యవస్థలో మార్పు రావడం, ఉమ్మడి వ్యవస్థ క్షీణించడం, పారిశ్రామికీకరణం, నగరీకరణం, పాశ్చాత్య సంస్కృతి అనుకరణ మొదలైన పరిస్థితులు యువజనుల సమస్యలను మరింత ఉధృతం కావిస్తున్నాయి.

యువజనులలో చాలామందికి తమ గృహాలలో ప్రత్యేకమైన వసతి లేకపోవడం ఇబ్బందులకు దారితీస్తుంది. ఆర్థికమైన ఇబ్బందుల వల్ల అనేక కుటుంబాలు తమ కుటుంబ సభ్యులందరి అవసరాలకు తగిన గృహవసతిని కల్గించలేవు. ఇటువంటి పరిస్థితులలో యువజనులు శారీరకంగాను, మానసికంగాను అనేక బాధలను అనుభవించవలసి వస్తుంది. అందువల్ల వారి అభివృద్ధి కుంటుపడుతుంది. తలిదండ్రులు తమపిల్లలకు ముఖ్యంగా యువజనులకు అనుకూలమైన గృహవసతిని కల్పించవలసిన అవసరాన్ని గుర్తించవలసి ఉంది. యౌవనంలో అడుగుపెడుతున్న తమ పిల్లలకు ప్రత్యేకమైన గృహవసతిని కలిగించవలసిన వలసిన అవసర మున్నదని తలిదండ్రులు గుర్తించేటట్లు చేయాలి. వయోజనవిద్య, సాంఘిక విద్య, కుటుంబ జీవితానికి సంబంధించిన విద్య మొదలైన వాటి ద్వారా తలిదండ్రులకు ఈ విషయాలను బోధించవచ్చు.

యువజనులు శారీరక, మానసిక వికాసాన్ని పొందడానికి విరామ సమయాలలో, ఆటపాటలలో, విజ్ఞాన, వినోద కార్యక్రమాలలో పాల్గొనవలసిన అవసరం ఉంది. కానీ కొంతమంది తలిదండ్రులు అటువంటి కార్యక్రమాలలో పాల్గొనడంవల్ల తమ పిల్లలు పాడయి పోతారని భయపడతారు. పేదకుటుంబాలకు చెందినవారు వాటి అవసరాన్ని గుర్తించరు. విజ్ఞాన వినోద కార్యక్రమాలలో పాల్గొనడంద్వారా తమపిల్లలు అమూల్యమైన కాలాన్ని వృథా చేసుకుంటారనీ, చెడ్డవారితో

సహవాసం చేస్తారనీ సాధారణంగా తలిదండ్రులు భావిస్తారు. కనుక యువజన సంక్షేమానికి వారు విజ్ఞాన, వినోద కార్యక్రమాలలో పాల్గొన వలసిన అవసరం ఉందని తలిదండ్రులు గమనించేటట్లు చేయాలి.

సమాజంలోని యువతీ యువకులు వారి యౌవనంలో వచ్చే మార్పులను ఎదుర్కొనవలసి ఉంటుంది. సమాజంలో పెద్దలు యువ జనులు ఎదుర్కొనే సమస్యల పరిష్కారానికి తోడ్పడి, వారిని బాధ్యతా యుతులైన భావిపౌరులుగా తీర్చిదిద్దవలసిన అవసరం ఎంతైనా ఉంది. కొన్ని సందర్భాలలో యువజనులు సామాజిక విలువలతో, ఆశయాలతో, ఆచారాలతో, కట్టుబాట్లతో ఏకీభవించక వక్రమార్గలను అనుస రిస్తూ ఉంటారు. చట్టాన్ని ఉల్లంఘించడం, సమాజానికి ఆమోదంకాని ప్రవర్తనను అవలంబించడం చేస్తారు. మరికొంతమంది యువకులు తమ వ్యక్తిగత దౌర్బల్యంవల్ల నిస్సహాయస్థితిలో ఉండి వక్రమార్గాలలో వ్యవహరించడం కూడా జరుగుతుంది. మురికివాడలలో నివసించే యువకుల పురోభివృద్ధికి అవసరమైన పరిస్థితులు లేకపోవడం, వారిపై తలిదండ్రుల అధికారం సన్నగిల్లడం, వ్యామోహాలతో కూడిన అనేక ఆకర్షణలకు లొంగిపోవడం మొదలైన పరిస్థితులవల్లకూడా యువకులు వక్రప్రవర్తనను పొందడం జరుగుతున్నది. సంఘ వ్యతిరేక పద్ధతులను అనుసరిస్తున్న యువకులు నేరస్తులయ్యే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి.

పెరుగుతున్న వయసును, మారుతున్న భావాలనుబట్టి యువకులు స్వయంగా ఏ పనిచేసినా ఎంతోకొంత సంపాదిస్తూ ప్రయోజకులు కావాలని కుతూహలం కలిగి ఉంటారు. ఇతరులమీద ముఖ్యంగా తలిదండ్రులమీద ఆధారపడటానికి అయిష్టత వ్యక్తపరుస్తూంటారు. నేటి పరిస్థితులలో వారి ఆశయాలను నెరవేర్చుకొనే అవకాశాలు క్రమ క్రమంగా క్షీణించిపోతున్నాయి. అందువల్ల వారిలో వ్యాకులత, ఆవేశాలు, మానసిక ఒత్తిడి ఎక్కువ అవడం జరుగుతున్నది. నిరుద్యో గంతో బాధపడుతున్న యువజనులు అనేకమైన ఇతర సమస్యలను కూడా ఎదుర్కోవలసి ఉంటుంది. అటువంటి సమయంలో వారికి

్యోగావకాశాలు లభిస్తే వారు తమ శక్తిసామర్థ్యాలను వినియోగించగలుగుతారు.

ౕ దేశ సంస్కృతి, సాంప్రదాయాలదృష్ట్యా యువతీయువకులకు ధన జరగడంలేదు. యువజనులు తమ యౌవనదశకాలంలో బంధమైన ఆంతరంగిక సమస్యలకు లోనయి వ్యాకులతకు, గురై మానసిక ఒత్తిడిని అనుభవిస్తూ ఉంటారు. అటువంటి వారు చవకబారు అశ్లీల సాహిత్యాన్ని రహస్యంగా చదవడం వకులు లైంగిక విషయంలో తప్పుదారులు పట్టుట జరుగు దీనివల్ల యువకుల శారీరక, మానసిక, నైతిక ఆరోగ్యం తుంది. పది సంవత్సరాలు పైబడిన బాలబాలికలు తమ ోపాటు మార్పు చెందుతున్న అవయవాల గురించి, తద్వారా ంబంధం, సంతానోత్పత్తి మొదలైన నిగూఢమైన విషయా ుసుకోవాలనే ఆసక్తితో ఉంటారు. కనుక బాలబాలికలకు స్థలలో లైంగిక విద్యను తగురీతిలో బోధించి వారికవసరమైన జ్ఞానాన్ని కలుగజేయాలి. తలిదండ్రులుకూడా తమపిల్లలకు పరిజ్ఞానాన్ని అవసరమైనంతవరకు తెలియజేయాలి. లైంగిక రా యువజనులు తమకు కలిగే అనేక అనుమానాలకు సమా తెలుసుకోగలగడంవల్ల అభివృద్ధిచెందిన మానసికప్రవృత్తిని ోవడం జరుగుతుంది. దీనివల్ల యువకులు సన్మార్గులై నైతిక రెందకుండా జీవించడానికి అవకాశముంటుంది.

ావిపౌరులు, దేశానికి వెన్నెముక వంటివారు అయిన యువ నిరక్షరాస్యులుగా ఉన్నట్లయితే వారు దేశాభ్యుదయానికి ానూ ఉపయోగపడలేరు. మనదేశంలో గ్రామీణ, గిరిజన, ాంతాలల్లోను, మురికి వాడలలోను నివసించే యువకులు అధిక ిరక్షరాస్యులుగా ఉన్నారు. ఈ నిరక్షరాస్యతవల్ల వీరు అనేక మస్యలు అంటే ఆర్థిక, సాంఘిక, నైతిక పతనాలకు గురికావడం ఉన్నది

నగరీకరణం, పారిశ్రామికీకరణం మొదలైన అభివృద్ధి కార్యక్రమాలవల్ల గిరిజనుల సంస్కృతిలోను, ఆచార వ్యవహారాలలోను అనేక మార్పులు వస్తున్నవి. కానీ గిరిజన యువకులు ఈ మార్పులతో సర్దుబాటు చేసుకోలేకపోవడంవల్ల నిరాశా, నిస్పృహలకు లోనవుతున్నారు. అంతేగాక గిరిజన ప్రాంతాలలో యువజనుల అభివృద్ధికి ప్రవేశపెట్టిన సంక్షేమ కార్యక్రమాలను యువకులందరూ అంగీకరించక పోవడం ఎక్కువగా జరుగుతుంది. అటువంటి సమయంలో ఆ ప్రాంతం నాయకులు, సంక్షేమ కార్యకర్తలు మొదలైనవారి కృషిద్వారా వారి దృక్పథాలలో మార్పుతీసుకునిరావాలి. దీనివల్ల యువకులు తాము అభివృద్ధి చెందడమేకాక తమతోబాటు తమ ప్రాంతీయాభివృద్ధికి, సామాజికాభివృద్ధికి కూడా కృషి చేయగలుగుతారు.

కొంతమంది యువకులు నిరక్షరాస్యత, అజ్ఞానం, అమాయకత్వం మొదలైన కారణాలవల్ల మతం, దైవం, ఆచారం, సాంప్రదాయం మొదలైన విషయాలలో మూఢ విశ్వాసాలతో ఉండి మార్పును అంగీకరించరు. అంతేకాక వారిలో భేదాభిప్రాయాలు ఎక్కువగా ఉండడం వల్ల ఒకరు ఆమోదించిన కార్యక్రమాన్ని వేరొకరు వ్యతిరేకించడం జరుగుతున్నది. అందువల్ల ఒకే విధమైన కార్యక్రమాన్ని ప్రవేశపెట్టడానికి అవకాశం లేకపోవటంవల్ల గిరిజన యువకుల సమస్యలను తొలగించడం కష్టతరమౌతున్నది.

విజ్ఞాన, వినోద కార్యక్రమాలకు గ్రామాలలో తగిన వసతులుండవు. గ్రామీణ సమాజంలో యువకులు దీనిని ఒక సమస్యగా గుర్తించడం లేదు. కొన్ని గ్రామ పంచాయితీలు ఇటువంటి అవకాశాలను కల్పించలేకపోతున్నది. మరికొన్ని గ్రామ పంచాయితీలు ఈ విషయంలో కృషి చేస్తున్నప్పటికీ అంత ఎక్కువగా అభివృద్ధి చెందడం లేదు. సామాజిక కేంద్రాలు, గ్రంథాలయాలు, పార్కులు మొదలైనవి సమాజానికి చెందినవి. వాటిని సంరక్షించవలసిన బాధ్యత సమాజ పౌరులుగా తమకు ఉన్నదనీ యువజనులు గుర్తించడం లేదు.

పట్టణాలలోను, నగరాలలోను యువజనులు అధిక సంఖ్యలో ఉన్నారు. అవివాహితులైన యువతీ యువకులకు తగిన గృహవసతి సౌకర్యాలు లభించడం లేదు. దీనివల్ల వారు అనేక సమస్యలకు గురి కావలసి వస్తున్నది.

ఏనాడో ప్రజలలో అక్షరజ్ఞానం కలిగించడానికి ఏర్పాటుచేసిన విద్యావిధానం నేడు యువజనులకు వారి అవసరాలను తీర్చలేక పోతున్నది. అందువల్ల వారు ఈ విద్యావిధానంపై ఏహ్యభావాన్ని ఏర్పరచుకోవడం జరిగింది. తమ అవసరాలు తీరలేదన్న అసంతృప్తివల్ల అశాంతి, నిరాశ, నిస్పృహ మొదలైన ఉద్రేకపూరితమైన మనః ప్రవృత్తి కలిగి ఉండడంవల్ల సమాజంలో అలజడులను కూడా రేకెత్తిస్తున్నారు. యువకులలో ఈ అసంతృప్తిని తొలగించాలంటే ప్రస్తుతం అమలులోవున్న విద్యావిధానంలో మార్పు రావాలి.

విద్యావంతులుకాని యువజనులు కొందరు ఏదో ఒక వ్యాపకంలో నిమగ్నులవడం జరుగుతున్నది. కానీ మరికొందరు ఎటువంటి వ్యాపకంలేక, కాలం గడవక ముఠాలలోను, గుంపులలోను చేరడం జరుగుతున్నది. ఈ విధంగా విద్యావిహీనులైన యువజనులు ఎటువంటి వ్యాపకంలేక సంఘవిద్రోహులుగా మారకముందే వారికి ఏదో ఒక వృత్తిశిక్షణను కలుగజేసి ఉద్యోగావకాశాలను కల్పించాలి. ఈవిధంగా చేయడం సమాజానికి ఎంతో శ్రేయస్కరం.

భారతదేశంలో యువజనులు ఈ విధంగా అనేక సమస్యలతో సతమతమవుతున్నారు. కనుక వారి సమస్యలను పరిష్కరించి ఆనందకరమైన జీవితాన్ని అందించడానికి వారిపై ప్రత్యేక శ్రద్ధ తీసుకుని ప్రత్యేక యువజన సంక్షేమ కార్యక్రమాలను ఏర్పరచడంవల్ల యువజనులు, సమాజం కూడా అనేక విధాల అభివృద్ధి చెందటానికి అవకాశముంది.

## యువజన సంక్షేమం - ప్రభుత్వం స్వచ్ఛంద సేవా సంస్థలు

స్వాతంత్ర్యం తరువాత భారతదేశం యువజనుల సంక్షేమానికి ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. ప్రభుత్వం, స్వచ్ఛంద సేవాసంస్థలు.

అనేక యువజన సంక్షేమ కార్యక్రమాలు చేపట్టాయి. యువజనుల సమస్యలను తెలుసుకుని ఆ సమస్యలనుండి వారిని సంరక్షించుటకై శ్రద్ధ వహించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉందన్న విషయాన్ని భారత దేశమే కాక అన్ని దేశాలు కూడా గుర్తించడం జరిగింది. యువజనుల భావిజీవితంపై దేశాభివృద్ధి ఆధారపడి ఉంది. కనుక వారి శారీరక, మానసిక, సాంఘిక అవసరాలను తీర్చవలసిన బాధ్యత సమాజం, ప్రభుత్వం కూడా వహించాలి. యువజనులు సాధారణంగా అనేక ఆదర్శాలతోను, ఆశయాలతోను జీవించాలనే ఉద్దేశాన్ని కలిగి ఉంటారు. యువజనులు తమ అవసరాలను తీర్చుకోడానికి అనేక సమూహాలలో సభ్యులుగా చేరతారు. ఆయా సమూహాలద్వారా వారి ఆశయాలను తీర్చుకుంటారు. తమకు స్వయం నిర్ణయం తీసుకునే అధికారం, స్వాతంత్ర్యం ఉన్నాయని, తమ తలిదండ్రులపై ఆధారపడి నిర్ణయించుకోవలసిన అవసరం లేదనీ భావిస్తాడు. విశాల దృక్పథానికి ఉద్దేశాలకు, ఆశయసాధనకు పెనుగులాడుతూ ఉంటారు. తమకు తగిన వృత్తిని ఎన్నిక చేసుకోడానికి కృషిచేస్తారు. సమ వయస్కులైన యువతీ యువకుల మధ్య స్నేహ సంబంధాలు ఏర్పరచుకోవాలని ప్రయత్నిస్తూ ఉంటారు. జీవితంలో బాధ్యతాయుతమైన వ్యక్తిగా రూపొందడానికి కృషిచేయడం మొదలైన అవసరాలను, ఆశయాలను కలిగి ఉంటారు.

ప్రభుత్వ గృహనిర్మాణ సంస్థలద్వారా, గృహకాలనీల పథకం ద్వారా, స్వచ్ఛంద సేవాసంస్థలద్వారా గృహవసతి సౌకర్యాలకోసం తగినచర్య తీసుకుని యువకులు సరైన గృహవసతి సౌకర్యాలు లేక పోవడంవల్ల గురిఅయ్యే కొన్ని సమస్యలను తొలగించవచ్చు.

గ్రామాలలో, గిరిజన ప్రాంతాలలో పంచాయతీలు, పట్టణాలలో పురపాలకసంఘాలు, ప్రభుత్వం, యువజనమండలులు, నాట్యమండలులు, వ్యాయామ మండలులు, పార్కులు, రేడియో కేంద్రాలు మొదలైన వాటిని ఏర్పాటుచేసి అధికసంఖ్యాక యువకులకు అందుబాటులో ఉండేలాగ చేయాలి. యువజనులు విజ్ఞాన వినోద కార్యక్రమాలలో

పాల్గొనవలసిన ఆవశ్యకతను తలిదండ్రులకు తెలియజేసి విజ్ఞానవినోద కార్యక్రమాలపట్ల వారికి గల దురభిప్రాయాన్ని తొలగించాలి. యువకులందరూ ఉత్సాహంగా ఈ వినోద కార్యక్రమాలలో పాల్గొనేలాగ ప్రోత్సహించాలి.

కొన్నిచోట్ల ఇటువంటి సౌకర్యాలను ఏర్పాటుచేసినప్పటికీ అక్కడి యువజనులు వాటిని ఉపయోగించుకోలేకపోవడం కూడా జరుగుతుంది. అటువంటి సమయంలో ఆ ప్రాంతం యువకులకు అక్కడ ఏర్పరచిన వినోద కార్యక్రమాలన్నీ తమసౌకర్యం కోసమే అని వారు తెలుసుకునేలాగ చేయాలి. ఈ కార్యక్రమాన్ని ప్రభుత్వం, ప్రైవేటు రంగాలలో పనిచేస్తున్న సాంఘిక సంక్షేమ కార్యకర్తలు చేపట్టాలి.

యువజనుల అలజడులను, అశాంతిని సమాజంలో రేపడానికిగల కారణాలను బాగా అర్థం చేసుకుని వారి అవసరాలను తెలుసుకోవాలి. ప్రభుత్వం విద్యావిధానంలో అవసరమైన ఈ మార్పులను ప్రవేశపెట్టడం ద్వారా వారి విరామసమయం సద్వినియోగం కావడానికి తోడ్పడాలి. వారు విద్యావిధానంలో ఆశించే మార్పులను తెలుసుకోవాలి. యువకుల ఆకాంక్షలను నిర్లక్ష్యం చేయరాదు. యువజనులు నిర్మాణాత్మక కార్యక్రమాలలో పాల్గొనేటట్లు ప్రోత్సహించడానికి విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, ప్రభుత్వ, ప్రైవేట్ సంస్థలు, ఉన్నత పాఠశాలలు మొదలైనవి ప్రయోగాత్మకంగా జాతీయ సాంఘిక సేవ (N. S. S.), నేషనల్ కేడెట్ కోర్ (N. C. C.) మొదలైన పథకాలను నిర్వహించడం జరిగింది. యువకుల మానసిక పరిస్థితిని అవగాహన చేసుకుని వారికి ఆస్లోదాన్ని కలిగించేలాగ చేయడానికి యువజనసంక్షేమ కార్యకర్తలందరూ కృషి చేయవలసి ఉంటుంది. యువకుల సంఘ వ్యతిరేక ప్రవర్తనను సరిదిద్దడానికి విద్యా సంస్థలు, తలిదండ్రులు, స్వచ్ఛంద సేవాసంస్థలు, ప్రభుత్వం బాధ్యత వహించవలసి ఉంటుంది. ఉపన్యాసాలు, ప్రచురణలు, రేడియో ప్రసంగాలు, చర్చలు, చలనచిత్రాలు మొదలైన వాటిద్వారా యువకులకు బోధించవచ్చు. కొందరు యువకులు కొన్ని లోపాలవల్ల అక్రమప్రవర్తనకు అలవాటుపడడం జరుగుతుంది. అటువంటి లోపాలను

సంఘ సంక్షేమ కార్యకర్తల సహాయంతో తగిన చికిత్స చేయించాలి. ఈ విషయంలో మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు, మనోరోగ శాస్త్రజ్ఞుల, సహాయం తీసుకుని సంఘసంక్షేమ కార్యకర్త వారి వ్యక్తిత్వ లోపాలను సరిదిద్దవచ్చు.

సమూహా సేవా ప్రక్రియ ద్వారా నేరస్థులైన యువకులతో పనిచేసి వారి దృక్పథంలో మార్పును తీసుకురావాలి. తరువాత వారికి పునరావాస సౌకర్యాలను కల్పించడం ద్వారా వారికి సంక్షేమాన్ని కలుగజేయవచ్చు. విద్యార్థులకు విరామసమయాలలోను, సెలవుదినాల లోను పనిచేయడానికి కొన్ని ఉద్యోగావకాశాలను కలుగజేయ గలిగి నట్లయితే తాము సంపాదనాపరులమనే సంతృప్తిని పొందడమేకాక సంఘ వ్యతిరేక చర్యలలో పాల్గొనే అవకాశాన్నికూడా తగ్గించడం జరుగుతుంది. విద్యాభ్యాసంగం పూర్తయిన తరువాత వారికి అనుకూల మైన ఉద్యోగాలను సమకూర్చడానికి తగిన కృషిచేయాలి. వృత్తికి సంబంధించిన సలహాలనిచ్చే కేంద్రాలు, ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్ లు మొదలైనవాటిని ఏర్పాటుచేయాలి. ప్రభుత్వశాఖలు ఇందుకు తగిన సలహాలనిచ్చి సహాయపడాలి వివిధ ప్రాంతాలలోగల యువజన సంస్థలు ఇందుకు తగిన కృషి చేయవలసి ఉంటుంది.

యువజనులలో నిరక్షరాస్యత తొలగించి విద్యావంతులను చేయడానికి ఉచిత నిర్బంధ విద్యా కార్యక్రమాలను అమలుజరపాలి. కనీసం ప్రాథమిక విద్యా స్థాయిలో పిల్లలందరూ చదువుకొనేలాగ చూడాలి. ఇందుకు ప్రభుత్వం, ఇతర స్వచ్ఛంద సేవాసంస్థలు ఎంతో కృషిచేయవలసి ఉంటుంది. సంఘసంక్షేమ కార్యకర్తలు సాంఘిక విద్యాపథకం ద్వారా తలిదండ్రులకు ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యలో గల ప్రాముఖ్యతను భోదపరచాలి. నిరక్షరాస్యులైన యువతీయువకులకు వయోజన విద్య, సాంఘిక విద్య పథకాలద్వారా విద్యావంతులను చేయవచ్చు. ఇందుకు ప్రభుత్వం, సమాజాభివృద్ధి సంస్థలు, తగిన సహాయం చేయాలి. దీనివల్ల వారు తమ జీవితానికి అవసరమైన విద్యను పొంది తమ సంక్షేమానికి తాము కృషిచేయగలుగుతారు.

గిరిజన యువకులకు అవసరమైన పాఠశాలలు వసతిగృహాలు లభించకపోవడంవల్ల వారి విద్యాభ్యాసం కుంటుపడుతుంది. పంచాయితీ సమితి, తదితర సంస్థలు విద్యా ప్రాముఖ్యాన్ని గురించి ప్రచారం చేయాలి. ముఖ్యంగా ఉపన్యాసాలు, చర్చలు, విజ్ఞాన యాత్రలు మొదలైన వాటిద్వారా విద్యా ప్రాముఖ్యతను తలిదండ్రులు గమనించే లాగ కృషిచేయాలి. గిరిజనుల విద్యా సౌకర్యానికి, గిరిజన యువతీ యువకులకు వసతిసౌకర్యాలను ఏర్పాటుచేయాలి. పంచాయతీసమితులు, ఇతర స్వచ్ఛంద సేవాసంస్థలు, వివిధ ప్రాంతాల గిరిజనుల సంస్కృతిని, వారి స్థితిగతులను బాగా అర్థంచేసుకుని వారికి అనుకూలమైన కార్య క్రమాలను నిర్ణయించవలసి ఉంటుంది.

ముఖ్యంగా అవివాహితులైన యువతీ యువకులకు గృహ వసతి సౌకర్యాలను కల్పించాలి. వై.ఎమ్.సి.ఎ., వై.డబ్ల్యూ.సి.ఎ, ఎ.ఐ. డబ్ల్యూ.సి. (Y.M.C A., Y.W.C.A., A.I.W.C.) మొదలైన స్వచ్ఛంద సేవా సంస్థలు వీరి కోసం వసతి సౌకర్యాలను ఏర్పాటు చేయాలి. పారిశ్రామిక యాజమాన్య, తదితరులు తమ సంస్థలలో పని చేస్తున్న ఉద్యోగులకు గృహ సౌకర్యాలను ఏర్పాటు చేయాలి. పట్టణ పురపాలక సంస్థ కూడా యువతీ యువకులకు ప్రత్యేక గృహవసతులను ఏర్పాటు చేయాలి.

పట్టణాలలో ఆటస్థలాలను, గ్రంథాలయాలను, పఠనాలయాలను పార్కులను ఏర్పాటుచేసే బాధ్యతను పురపాలక సంస్థ వహించాలి. యువజనుల శారీరక, మానసిక, సాంస్కృతిక, నైతిక వికాసాన్ని కలుగ జేయాలంటే వారి తీరిక సమయాలను సద్వినియోగ పరచడానికి సామా జిక కేంద్రాలు, ఆటస్థలాలు, పార్కులు, గ్రంథాలయాలు, కళా కేంద్రాలు మొదలయినవాటిని నెలకొల్పాలి.

ముఖ్యంగా పట్టణాలలోగల మురికివాడలలో నివసించే యువతీ యువకులకు ప్రత్యేకమైన సంక్షేమ కార్యక్రమాలను ఏర్పరచాలి. మురికి వాడలలో విజ్ఞాన, వినోద సౌకర్యాలను ఏర్పాటుచేయాలి. అంతేకాక వారి విద్యాభివృద్ధికై వయోజనవిద్య, సాంఘిక విద్య కార్యక్రమాలను

నెలకొల్పాలి. యువమండలాలు, మహిళామండలులు స్థాపించి వారిలో స్వయం సహాయక భావాన్ని పెంపొందించాలి. వారు తమకై ఏర్పాటు చేసిన విజ్ఞాన, వినోద కార్యక్రమాలను తామే నిర్వహించుకోగలిగేట్లు చేయాలి. ఈ విధంగా మురికివాడలలో నివసించే యువతీ యువకులు పట్టణంలోగల తదితర ప్రాంతాలలోగల యువతీ యువకులతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకొని ఐకమత్యంగా అందరూ కలసి పనిచేసే అవకాశాలు అభివృద్ధి చెందుతాయి.

ప్రభుత్వం, పురపాలక సంస్థలు, స్వచ్ఛంద సేవా సంస్థలు ఉమ్మడిగాగానీ, విడివిడిగాగానీ, మురికివాడలలో నివసించే యువతీ యువకుల సంక్షేమార్థమై చిన్నచిన్న పరిశ్రమలను నెలకొల్పడం స్వయం ఉపాధిని కలిగించడం, మొదలైన కార్యక్రమాలను ప్రవేశపెట్టాలి.

ప్రస్తుత విద్యా విధానంలో మార్పుతీసుకునివచ్చి యువతీ యువకులలో అలజడులు, నిరాశ, నిస్పృహలు తొలగించడానికి ప్రభుత్వ, విశ్వవిద్యాలయాలు, ఇతర విద్యా సంస్థలు కృషి చేయాలి. యువతీ యువకులకు ఉద్యోగావకాశాలను అభివృద్ధి చేయాలి. సాంకేతిక నిపుణులైన విద్యావంతులకు ప్రభుత్వం ఆస్తులను ఇచ్చి వారు స్వయంగా జీవనోపాధిని కల్పించుకొనేట్లు చూడాలి. వృత్తిసంబంధమైన మార్గదర్శక కేంద్రాలను ప్రతి విశ్వవిద్యాలయం, జిల్లా, తాలూకా స్థాయిలలో ఏర్పాటు చేయాలి.

యువజనులలో నిరక్షరాస్యతను తొలగించాలంటే సాంఘిక సంక్షేమ కార్యకర్తలు, ప్రజాప్రతినిధులు, విద్యాసంస్థలు, ప్రభుత్వం బాధ్యతవహించవలసివుంది. వీటి ద్వారా వయోజన విద్య, సాంఘిక విద్య కార్యక్రమాలను తీవ్రస్థాయిలో పెంపొందించాలి.

వివిధ యువజన సంక్షేమ కార్యక్రమాలను ఈ కింది విధంగా పేర్కొనవచ్చు.

## 1. కేంపస్ సర్వీస్ (Campus service)

1955-56 సంవత్సరాల మధ్య విద్యామంత్రిత్వశాఖ "ది కేంపస్ వర్క్స్ ప్రాజెక్ట్" పథకాన్ని నెలకొల్పింది. ఈ పథకంద్వారా విద్యా

సంస్థలలో వినోద కార్యక్రమాలను మెరుగుపరచి, పెంపొందించడం జరిగింది. పాఠశాలలలోను కళాశాలలలోను, వినోదపు హాలు, ఆడిటోరియమ్, స్విమ్మింగ్ పూల్, జిమ్నేసియమ్, ఆటల స్టేడియమ్, ఓపెన్ ఎయిర్ థియేటర్, మంటపం మొదలైన సౌకర్యాల వరకు గ్రాంటు ఇచ్చే ఏర్పాటు ఈ పథకంలో ఉంది. ఇందులో మరొక ముఖ్యమైన అంశమేమంటే వివిధ వినోద సౌకర్యాలను ఏర్పరచిన సంస్థలు వాటి కయ్యే మొత్తం ఖర్చులో 25 శాతం ఈ పథకంద్వారా పొందుతాయి. అందులో 5 శాతం ఉపాధ్యాయుల - విద్యార్థుల శ్రమదానం నుంచి పొందడం జరుగుతుంది. ఈ పథకం కుంజ్రు కమిటీ మెప్పుదలనుకూడా పొందగలిగింది. ఈ పథకాన్ని విస్తృతం చేయడానికి కుంజ్రు కమిటీ కొన్ని సలహాలనుకూడా అందజేసింది. ఈ పథకం ముఖ్యోద్దేశం శ్రమకు విలువనివ్వడం. దానిద్వారా శ్రామికుల హోదాను పెంపొందించడం, ఉపాధ్యాయులు, విద్యార్థులు వినోద కార్యక్రమాల నిర్మాణంలో పాల్గొనడంవల్ల వారి సేవను గుర్తించడానికి వీలయింది. ఇప్పటివరకూ ఈ పథకంద్వారా 175 లక్షల రూపాయలు ఖర్చు చేయడం జరుగుతుంది.

## 2. యువజనుల సలహా కేంద్రాలు (Youth counselling)

వివిధ రకాలైన సమస్యలుగల యువజనులకు శాస్త్రీయ పద్ధతిలో సలహానివ్వడాన్ని యువకుల సలహా సేవలు అంటారు. ఈ సలహా సేవలు శాస్త్రీయ పద్ధతిలో లభిస్తాయి. ఈ సలహా సేవలను వ్యక్తిగతంగాగానీ, సామూహికంగాగానీ అందించవచ్చు. ఈ సలహా పద్ధతి సలహాదారుకు, సేవార్థికి మధ్య జరిగిన సంభాషణపై ఆధారపడి ఉంటుంది. ఈ సలహా పద్ధతి అన్నివిధాలా వ్యక్తి సేవా పద్ధతిని పోలిఉంటుంది. వ్యక్తి సేవా పద్ధతికిగల భేదమేమంటే సలహాపద్ధతిలో సలహాదారుడు సేవార్థితో మాత్రమే పనిచేస్తాడు. వ్యక్తి సేవా పద్ధతిలో వ్యక్తి సేవా కార్యకర్త సేవార్థితోపాటు అతనికి సంబంధించిన వ్యక్తులతో అవసరాన్నిబట్టి వ్యక్తిగతంగా కృషిచేయవలసి ఉంటుంది. ఈ సలహా సేవలు పాఠశాలలు, కళాశాలలలోనే కాక ఉద్యోగ కేంద్రాలు, పునరావాస

కేంద్రాలు, వైద్యాలయాలు, ఆరోగ్యాశ్రమాలు, కార సంక్షేమ సంస్థలు మొదలైన అనేక సంస్థలలో యువకులకి నిచ్చి వివిధ రకాలైన సమస్యలను పరిష్కరించడానికి పడతాయి. దీనివల్ల వ్యక్తుల సమస్యలను పరిష్కరించడమే సర్వతోముఖాభివృద్ధికి కూడా కృషి జరుగుతుంది. సలహా యువజనులు తమ ప్రస్తుత సమస్యలను తాము పరిష్కరించు శక్తిని పొందేటట్లు చేయడమేకాక భావిజీవితంలో మరి సమస్యలు ఎదురైనా ఇతరుల సలహా సంప్రదింపుల అవసరం తమంతట తామే పరిష్కరించుకొనేటట్లు చేయవచ్చు. అంతర్గతంగా దాగిఉన్న యువజనుల శక్తి సామర్థ్యాలను బహి వాటిని అభివృద్ధిపరచడానికి వీలవుతుంది. సమస్యాపూరితు సమస్యలను తొలగించడమేకాక వారిజీవితంలో సుఖశాంతుల పెంపొందింపజేయవచ్చు. యువజనులు తమ సర్వతోముఖ తమ వ్యక్తిగత వనరులు ఉపయోగించుకోగలిగే శక్తి సామ పొందుతారు. ఉదాహరణకు పాఠశాలలలో చదువుతున్న బిడియంగల బాలుడు సలహా సేవాకేంద్రానికి చేరినట్లయితే దారుడు కేవలం ఆ బాలునికి సిగ్గు, బిడియాన్ని తొలగించ అతడు దృఢమైన వ్యక్తిగా అభివృద్ధిచెందడానికి కూడా చేస్తాడు. ఈ విధంగా చేయడంవల్ల ఆ బాలుడు తన వ్య సామర్థ్యాలను ఉపయోగించుకుని ఇతరత్రా అభివృద్ధి వీలవుతుంది.

సాధారణంగా సలహా కేంద్రాలు అనగానే చాలా కార్యక్రమంలాగ అనిపిస్తుంది. కానీ ఇది కేవలం ఉచిత సల కేంద్రం మాత్రం కాదు. సమస్యాపూరితులైన యువతీ యువ స్యలకు కారణాలు తెలుసుకుని అనుభవంగల కార్యకర్త సలహా అందిస్తాడు. ఇందులో సలహాదారుకు, సేవార్థికిమధ్య వృత్తి మేర్పడాలి. ఈ సంబంధం అసలైన స్వభావాన్ని వర్ణించడం ఎందువల్లనంటే ఈ సంబంధం ఇద్దరు స్నేహితుల మధ్యగల

వంటిదిగానీ, ఉపాధ్యాయుడు - విద్యార్థుల మధ్యగల సంబంధం వంటిది గానీ కాదు. అదేవిధంగా ఉపకారం చేసేవాడు, ఉపకారం పొందేవాడు వీరిమధ్యగల సంబంధం వంటిదికూడా కాదు. కనుక ఈ సలహా సేవలో సేవార్థికి, సలహాదారుకు మధ్యగల సంబంధం ఒక అద్వితీయమైన సంబంధం. అంతేకాక ఈ పద్ధతిలో సలహాదారును సేవార్థి సమస్యను పరిష్కరించడు. సేవార్థి తన సమస్యను తాను పరిష్కరించుకొనేలాగ చేయడానికి సలహాలనిచ్చి సహాయం చేస్తాడు. ఈ పద్ధతిలో సాధ్యమైనంత వరకు సేవార్థి స్వయం నిర్ణయం చేసుకొనే శక్తిని సంపాదించుకొనడానికి ప్రయత్నం జరుగుతుంది. కానీ సేవార్థి శారీరకంగాగానీ, మానసికంగాగానీ, అశక్తుడైతే తనంతటతాను సమస్యా పరిష్కరణ స్థితిని నిర్ణయించుకోలేని పరిస్థితిలో కార్యకర్త సమస్యా నిర్ణయంచేసి పరిష్కరణ చేస్తాడు. ఈ సలహా పద్ధతిలో ప్రత్యేకమైన శాస్త్రీయ పద్ధతులు ఏమీ లేవు. సలహా పద్ధతి కేవలం సేవార్థికి ఏర్పాటుచేసిన పరిసర వాతావరణంపై ఆధారపడి ఉంటుంది. సేవార్థి సిగ్గు, బిడియం, జంకు, భయం, ఆందోళన లేకుండా తన సమస్యా కారణాలను, పరిస్థితులను, అన్నిటినీ స్వేచ్ఛగా చెప్పడానికి అనువైన వాతావరణాన్ని సలహాదారుడు సృష్టించడం ఈ సలహా పద్ధతిలో అత్యంత ప్రధానమైన విషయం.

వ్యక్తులు యౌవన దశలోగల తమ మూర్తిమత్వం కుటుంబ జీవితంలోను, పాఠశాలలోను, వృత్తి విషయంలోను, యువతీ యువకుల మధ్యగల లైంగిక విషయంలోను అజమాయిషీత్వం చెందకుండా ఉండడానికి వారికి యౌవన దశలో కొన్ని సలహా సహాయాల ఆవశ్యకత ఎంతైనా ఉంది. లేకపోతే వారు జీవితంలో పొరపాటు చేసుకోలేక అనేక సమస్యలకు గురి అవుతారు. ఈ సలహా సహాయాలను యువజనుల సలహా సహాయ సేవల ద్వారా పొందడానికి వీలవుతుంది.

ఈ కేంద్రాలలో సలహా పద్ధతి నాలుగు దశలలో పూర్తవుతుంది. మొదటి దశలో కార్యకర్త సేవార్థితో వృత్తి బాంధవ్యాన్ని ఏర్పరచుకుంటాడు. రెండో దశలో సేవార్థికి తన సమస్య గురించి, తాను

చేరిన సంస్థ గురించి అవగాహన చేయడం, మూడో దశలో సమస్యా పరిష్కరణకు ప్రణాళికలను తయారుచేయడం జరుగుతుంది. నాల్గో దశలో ఆ ప్రణాళిక ద్వారా సేవార్థి సమస్యను పరిష్కరించుకొనేట్లు చేయడం లేదా అవసరమైతే వేరొక సంస్థకు పంపడం జరుగుతుంది.

## యువజన సలహా సేవ - సూత్రాలు

1. వ్యక్తుల మానసిక సామర్థ్యాలు వేరువేరుగా ఉంటాయి. కనుక ఒకే విధమైన పరిస్థితులకు యువకులు భిన్నాభిప్రాయాలను కలిగి ఉంటారు. కనుక యువజనుల శక్తి సామర్థ్యాలనుబట్టి సహాయం చేయాలి.
2. యువజనులు నివసించే పరిసరాలు త్వరితంగా పరివర్తన చెందుతున్నాయి. త్వరితంగా పరివర్తన చెందుతున్న పరిసరాలు యువజనులపై అత్యంత ప్రభావాన్ని చూపడంవల్ల వారిసర్దుబాటు ప్రక్రియ మారుతున్న పరిసరాలకు అనుగుణంగా లేదు. కనుక వారిని మారుతున్న పరిసరాలతో సర్దుబాటు చేసుకొనేలాగ చేయాలి.
3. యువజనుల పరిస్థితులు కూలంకషంగా అవగాహన చేసుకుని వారు విజ్ఞానదాయకమైన నిర్ణయాలు తీసుకొనేటట్లు సలహాలివ్వడం అవసరం.
4. యువజనుల సమస్యను సలహాదారుడు నిర్ణయించి సేవార్థి తన చెప్పుచేతలలో ఉండేలాగ చేయకుండా, అతనికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనిచ్చి తన సమస్యను తానే నిర్ణయించుకొనేలాగ సహాయం చేయాలి. దీనికోసం సలహాదారుడు ప్రజాస్వామిక విలువలను దృష్టిలో పెట్టుకోవాలి.
5 సలహాదారుడు యువజనులతో అత్యంత సన్నిహిత సంబంధాలను నెలకొల్పుకోవాలి. ఈ సన్నిహిత సంబంధం ద్వారా సేవార్థులు సలహాదారునితో జంకుగొంకులు, సిగ్గు, బిడియం, భయం, ఆందోళన మొదలైన మానసిక ఒత్తిడులకు లోనుకాకుండా స్వేచ్ఛగా మాట్లాడగలుగుతాడు. సేవార్థికి సలహాదారుడు ఒక స్నేహితునిగాను, తత్వవేత్తగాను, మార్గదర్శకుడుగాను కనిపించాలి. సేవార్థికి సలహాదారునిపట్ల నమ్మకం ఏర్పడటం అవసరం.

6. సేవార్థి సమస్య గురించి తెలుసుకోడానికి సలహాదారుడు సేవార్థి తలిదండ్రుల వద్దనుంచి, పాఠశాలలోగల రికార్డుల సహాయంతోను, స్నేహితులద్వారా, ఇరుగుపొరుగు ద్వారా తెలుసుకోవాలి. సలహాదారుడు ఎక్కువ విషయాలను సేవార్థి నుంచి మాత్రమే సంగ్రహించగలడు. మొదట సేవార్థి వద్దనుంచి విషయాన్నంతటినీ సేకరించడానికి ప్రయత్నించాలి. గృహ పరిశీలనవల్ల యువకుని జీవిత చరిత్రను తెలుసుకోవచ్చు.

7. సలహాదారుడు సేవార్థితో కలసి కృషిచేసి సేవార్థి తనను, తన సమస్యలను అవగాహన చేసుకుని, స్వయం నిర్ణయం తీసుకుని తన సమస్యలను తానే పరిష్కరించుకొనేలాగ చేయాలి. కనుక సలహాదారుడు సేవార్థితో కలసి పనిచేయాలికానీ సేవార్థి కోసం పని చేయరాదు.

యువకులకు సలహా అందజేసే పద్ధతిలో ముఖ్యంగా గుర్తుంచుకోవలసిన విషయాలేవంటే —

1. సలహాదారుని పూర్తికాల ఉద్యోగిగా (Full Time Worker) నియమించాలి. అతడు యువజనులతో సక్రమంగా పనిచేయగలిగే వయసు, విద్య, అనుభవం కలిగినవాడై ఉండాలి. విద్యార్హతతో పాటు వ్యక్తుల సమస్యలను అవగాహన చేసుకోగలిగిన, యువకుల మానసిక ప్రవృత్తిని తెలుసుకోగలిగినవాడై ఉండాలి. మనోవైజ్ఞానిక శాస్త్రంలో ప్రావీణ్యతనుపొంది ఉండాలి. యువజనులు తమ సమస్యలను తాము పరిష్కరించుకోగలరనే విశ్వాసాన్ని సలహాదారుడు ఏర్పరచుకోవాలి. అంతేకాక యువకుల కవసరమైన సమాజంలోగల వనరుల గురించి సలహాదారుడు తెలుసుకుని ఉండాలి.

2. సలహా సంస్థలలో మనోవిజ్ఞాన శాస్త్రవేత్త మనోరోగ చికిత్సా శాస్త్రవేత్తలను కూడా నియమించాలి. వీరు యువకుల **మూర్తి** మత్వ పరీక్షలు, అభిరుచుల పరిక్షలు జరుపుతారు.

3. ఈ సలహా సంస్థ, ఇతర సహాయ సంస్థలు అంటే వృత్తి సలహా కేంద్రం ఉద్యోగ శిక్షణా అవకాశాలకు సలహాలనిచ్చే సంస్థలతో సంబంధం ఏర్పరచుకోవాలి.
4. ఈ సంస్థకు ఒక గ్రంథాలయం ఉండాలి. ఈ గ్రంథాలయంలో యువకులకు మార్గదర్శకంగా ఉపయోగపడే పుస్తకాలేకాక వినోదాన్ని, విజ్ఞానాన్ని కలిగించే పుస్తకాలు ఉండాలి.
5. ఈ సంస్థలలో భాగంగా వినోద కార్యక్రమాలు, హాబీలు ఏర్పాటు చేసే అంగాలుకూడా ఉండాలి. దీనివల్ల ఇందులోగల యువజనులు రోగులవలే సమస్యాపూరిత వ్యక్తులవలే నిరాశా నిస్పృహలతో వారి సమయాన్ని వృథాగా గడపకుండా వినోద కార్యక్రమాలలో పాల్గొని సంతోషంగా కాలాన్ని గడపగలరు అంతేకాక ఈ వినోద కార్యక్రమాలు, గ్రంథాలయాలు ఏర్పరచడంవల్ల యువకులు పాల్గొనే ఆటలబట్టి, వారు చదువుతున్న పుస్తకాలనుబట్టి, సాహిత్యాన్నిబట్టి సలహాదారుడు వారిని చక్కగా అవగాహన చేసుకొనే అతని సమస్యను త్వరగా పరిష్కరించడానికి వీలవుతుంది.

సలహాదారుడు యువకులపట్ల అధికమైన శ్రద్ధ కనబరచాలి. అంతేకాక సలహా సహాయక కృషిలో అభిరుచిని కలిగి ఉండాలి. అతడు మానసికంగా పరిపక్వతచెంది ఉండాలి. అతడు చక్కటి మూర్తిమత్వంతో యువజనులను ఆకర్షించుకొనే శక్తిని కలిగి ఉండాలి సలహాదారుడు దయ, జాలి, స్నేహభావం, చమత్కారశక్తి, ఓర్పు, స్వ, పరభేదం లేకపోవడం, చాకచక్యం, తెలివితేటలు మొదలైన శక్తియుక్తులు కలిగి ఉండాలి. ఇతరుల అవసరాలపట్ల అవగాహనతో ఉండాలి. ముఖ్యంగా సలహాదారుడు యువకుల మానసిక ప్రవృత్తిని అవగాహన చేసుకోగలిగినవాడై ఉండాలి.

సలహాదారుడు వ్యక్తిసేవా పద్ధతి, సామూహిక సేవాపద్ధతిపట్ల అవగాహన కలిగి, క్లబ్బుల్లో, ఆటస్థలాలలో, తరగతి గదులలో, యువకులతో పనిచేయగల శక్తి కలవాడుగా సమాజంలోగల పరిశ్రమలు వర్తక వ్యాపారసంస్థలు మొదలైనవాటి వృత్తి పరిస్థితులు పరిజ్ఞానాన్ని

పొంది ఉండాలి. వృత్తిసేవలు చేయడంలో అనుభవం మొదలైన లక్షణాలకు ఆలవాలం కావాలి.

## వృత్తి మార్గదర్శక కేంద్రాలు (Vocational Guidance Clinics)

వృత్తి మార్గదర్శక కేంద్రాలంటే వృత్తిలో ఎదురైన సమస్యలను పరిష్కరించుకోడానికి ఏర్పాటుచేసిన మార్గదర్శక సలహాలనిచ్చే కేంద్రాలు. ఈ వృత్తి మార్గదర్శక కృషి పాఠశాలలలోను, సాంఘిక సంక్షేమ సంస్థలలోను ఒక భాగంగా ఏర్పరచబడింది. పాఠశాల, కళాశాల విద్యార్థులకు, ఉద్యోగావకాశాలకు ఎదురుచూస్తున్న యువకులకు, ఉద్యోగాలున్న యువకులకు ఈ వృత్తి మార్గదర్శక కేంద్రాల ద్వారా వ్యక్తిగతంగా సహాయం లభిస్తుంది. విద్యా సంబంధ సమస్యలకు, వృత్తి సంబంధ సమస్యలకు సన్నిహిత సంబంధం ఉంది. కనుక ప్రతి వృత్తి మార్గదర్శక కేంద్రలలోను విద్య, వృత్తి సంబంధమైన సలహాలను సమన్వయ పరచవలసిన ఆవశ్యకత ఏర్పడుతున్నది. వృత్తి మార్గదర్శక కేంద్రాలు విద్య, వృత్తిసంబంధిత సమస్యలేకాక ఆరోగ్యం, మూర్తిమత్వ సర్దుబాటు, కుటుంబ సర్దుబాటు మొదలైనవాటికి సంబంధించిన సమస్యలను కూడా పరిష్కరించడానికి కృషి జరగాలి. ఆరోగ్య, మూర్తిమత్వ, కుటుంబ సంబంధిత సమస్యలవల్ల అధిక సంఖ్యాక యువజనుల వృత్తి సమస్యలు క్లిష్టమవుతున్నవి. మార్గదర్శక కేంద్రాల పరిధి సమాజాలనుబట్టి, దేశాలనుబట్టి మారుతుంది. మార్గదర్శక కేంద్రాల పరిధి ఆయా సమాజాల సాంఘిక, ఆర్థిక, ఉద్యోగ, విద్య, సంస్కృతి మొదలైనవాటి పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. మార్గదర్శక కేంద్రాలకు గల పరిమితులను బాహ్యాపరిమితులు, అంతః పరిమితులు అని రెండు భాగాలుగా విభజించడమైంది. బాహ్యాపరిమితులు సమాజానికి సంబంధించినవి. అంతఃపరిమితులు మార్గదర్శక కేంద్రాలకు సంబంధించినవి.

భారతదేశంవంటి నిరుద్యోగ సమస్యాపీడిత దేశాలలో మార్గదర్శక కేంద్రాలు తనువద్దకు సహాయార్థమై చేరిన యువజనులకు

ఉద్యోగావకాశాలను కల్పించే పరిధి చాలా తక్కువగా ఉంటుంది. ఆర్థికంగా వెనుకబడిన దేశాలు వృత్తిమార్గదర్శక కేంద్రాలను నడపటం వృధావ్యయంగా భావించి అటువంటి సౌకర్యాలను ఎక్కువగా ఏర్పాటు చేయడం లేదు. అటువంటి కేంద్రాలు కొన్నిటిని నెలకొల్పినప్పటికీ అవి సంతృప్తికరమైన, సంపూర్ణమైన, సిబ్బందినిగానీ, పరికరాలనుగానీ ఏర్పాటు చేయడం లేదు. అటువంటి సమయాలలో ఈ మార్గదర్శక కేంద్రాల పరిధి చాలా బలహీన పరిస్థితికి దిగజారే ప్రమాదం కూడా ఉంది.

ఉద్యోగాల నియామకం కూడా ఎక్కువ భాగం యువజనుల యోగ్యత, అర్హతనుబట్టిగాక, జాతి, మత, ప్రాంతీయ అంశాలపై ఆధారపడి ఉంటున్నది. అటువంటి పరిస్థితిలో వృత్తి మార్గదర్శక కేంద్రాలు యోగ్యతగల నిరుద్యోగులైన యువకులకు వేగంగా ఉద్యోగావకాశాలను చూపించలేకపోవడం సంభవిస్తున్నది.

సాంఘిక పరిస్థితులు, సాంస్కృతిక విలువలపై ఆధారపడిన అనేక మంది యువజనులుగానీ, వారి తలిదండ్రులుగానీ అన్ని రకాల ఉద్యోగావకాశాలను వినియోగించుకోలేకపోతున్నారు. విభిన్న వృత్తులపై విభిన్న అభిప్రాయాలను ఏర్పరచుకోవడం జరుగుతున్నది. కనుక వృత్తి మార్గదర్శక కేంద్రాలు యువజనులకు ఉద్యోగావకాశాలను అన్వేషించి అందజేసినప్పటికీ వాటికి యువజనులందరూ అంగీకరించడం లేదు.

మన దేశంలో గల విద్యా వినోదం వల్లకూడా అనేకమంది యువజనులు ఉద్యోగాలను పొందలేకపోతున్నారు. కొంతమంది యువజనులు విద్యా విషయంలోను, వృత్తి శిక్షణ విషయంలోను మంచి హోదాను, అర్హతలను సంపాదించగలిగినప్పటికీ ఆ హోదాకు సంబంధించిన విద్య, శిక్షణకు, ఉద్యోగావకాశాలు తక్కువగా ఉండడం సంభవిస్తున్నది. మన దేశంలో గల విద్యా విధానం వృత్తి కేంద్రీకృతమైందికాదు. కనుక విద్యా వ్యాసంగం పూర్తయిన వారందరికీ ఉద్యోగాలు లభించడం లేదు. దీనివల్లకూడా వృత్తి మార్గదర్శక కేంద్రాల పరిధి విస్తృతం కాలేకపోతున్నది.

వృత్తి మార్గదర్శక కేంద్రాల సంఖ్య మన దేశంలో చాలా తక్కువగా ఉన్నాయని చెప్పవచ్చు. ప్రస్తుతం అమలులోవున్న కొద్ది పాటి వృత్తి మార్గదర్శక కేంద్రాలు సంపూర్ణంగా నెలకొల్పబడ లేదు. అసంపూర్ణ వృత్తి మార్గదర్శక కేంద్రాలు సంతృప్తికరంగా తమ లక్ష్యాలను నెరవేర్చలేకపోతున్నాయి.

## వృత్తి మార్గదర్శక కేంద్రాలు - అవసరమైన పద్ధతులు

వృత్తి మార్గదర్శక కేంద్రాలు తమ లక్ష్యాలను సాధించుకోడానికి ముఖ్యమైన పద్ధతులు రెండువిధాలుగా చెప్పడమైంది. 1. మానసిక ప్రవృత్తి పరీక్షలు 2. వృత్తి సంబంధమైన విషయ సేకరణ

## వృత్తి మార్గదర్శక కేంద్రాలు - ముఖ్యమైన సూత్రాలు

1. వృత్తి మార్గదర్శక కేంద్రాలు యువజనుల స్వభావానికి, వృత్తి లేదా విద్య లేదా శిక్షణా స్వభావాల మధ్య సమన్వయాన్ని ఏర్పరచడానికి కృషి చేయాలి. ఉదాహరణకు సిగ్గు, బిడియం ఎక్కువగా ఉన్న యువకుడికి సేల్స్‌మేన్ ఉద్యోగంలభిస్తే, అతనిఆధికారి అతడి స్వభావం ఆ ఉద్యోగానికి సరిపోలేదని అతడిని కొద్ది కాలంలోనే ఉద్యోగంనుంచి తొలగించే ప్రమాదం ఉంది. కానీ అటువంటి సమస్య గల యువకుడు వృత్తి మార్గదర్శక కేంద్రాలను సందర్శిస్తే అతడు సహాయాన్ని పొందగలడు. వృత్తి మార్గదర్శక కేంద్రాలలో సంతృప్తికరమైన శాస్త్రీయ పద్ధతులను, పరిజ్ఞానాన్ని ఉపయోగించి ఆ యువకునిలోగల సిగ్గు, బిడియం మొదలైన మానసిక ప్రవృత్తులను తొలగించి అతడు కొద్ది కాలంలోనే తన వృత్తి స్వభావంతో సర్దుబాటు చేసుకొనేలాగ చేయవచ్చు.
2. యువజనులు తాము పనిచేసే వృత్తిలో జరిగే పోటీపరీక్షలలో ఉత్తీర్ణులవడానికి వీలుగా వారిని అభివృద్ధి చేయాలి.
3. యువకులు, తలిదండ్రులు, ఉపాధ్యాయులు, విద్య, శిక్షణా కేంద్రాల అధికారులు, ఉద్యోగాధికారులు, కార్యనిర్వాహకులు, కార్యకర్తలు, వైద్యాధికారులు తదితర స్వచ్ఛంద సేవా సంస్థలతో

సమన్వయం ఏర్పరచుకోవాలి. ఈ విధంగా వృత్తి మార్గదర్శక కేంద్రాలు అనేక ప్రాధాన్యత చెందిన రంగాలతోను, వ్యక్తులతోను సన్నిహిత సంబంధాన్ని ఏర్పరచుకోవడంవలన యువజనుల సమస్యలను సంతృప్తికరంగా పరిష్కరించడం జరుగుతుంది.

ఈ పై చెప్పిన మూడు సూత్రాలపైన ఆధారపడి కృషిచేసే మార్గదర్శక కేంద్రాలు నియమించిన సలహాదారుడు అనేకరకాల పద్ధతులను ఉపయోగించి కృషిచేసి ఫలితాన్ని పొందడం సాధ్యమవుతుంది. యువకుల విషయాలను సక్రమ పద్ధతిలో సేకరించడానికి ఈ సూత్రాలు ఉపయోగపడతాయి. మానసిక ప్రవృత్తుల పరీక్షలను సక్రమపద్ధతిలో ఉపయోగించుకోగలుగుతాడు. వృత్తిసంబంధమైన విషయాలను యువకులకు ఉపదేశించడం, పరిశ్రమలను సందర్శించడం, తలిదండ్రులతో చర్చలు మొదలైనవాటిద్వారా తన కార్యక్రమాన్ని సఫలీకృతం చేసుకోగలడు.

## భారతదేశంలో వృత్తి మార్గదర్శక కేంద్రాల అభివృద్ధి

1938 వ సంవత్సరంలో కలకత్తా విశ్వవిద్యాలయం మనోవైజ్ఞానిక విభాగం వారు విశ్వవిద్యాలయ విద్యార్థుల మానసిక శక్తి సామర్థ్యాలను తగినరీతిలో పరీక్షలు జరిపి వృత్తి సలహాల నివ్వడానికి వృత్తి మార్గదర్శక కేంద్రాలనుపోలిన సంస్థను నెలకొల్పారు. 1945 వ సంవత్సరంలో పాట్నా విశ్వవిద్యాలయంలో డిపార్ట్‌మెంట్ ఆఫ్ సైకలాజికల్ సర్వీసెస్ అండ్ రిసెర్చ్ (Department of Psychological Services and Research) అనే విభాగం నెలకొల్పబడింది. 1941 వ సంవత్సరంలో బొంబాయిలో బేటిల్‌బోయ్ (Batle boi) ఒక మనోవైజ్ఞానికుని సహాయంతో ఇలువంటి వృత్తి మార్గదర్శక కేంద్రాన్ని నెలకొల్పడం జరిగింది. 1947 వ సంవత్సరంలో పార్సీలో ట్రస్ట్ ఆఫ్ ది పార్సీ పంచాయత్ ఫండ్స్ అండ్ ప్రోపర్టీస్ అనే సాంఘిక సంక్షేమ సంస్థ ఒక వృత్తి మార్గదర్శక కేంద్రాన్ని నెలకొల్పడం జరిగింది. ఇది మొట్టమొదట పార్సీ యువజనులకు మాత్రమే సహాయాన్ని

పరిమితం చేసింది. కానీ క్రమంగా ఈ సంస్థ సహాయం అన్ని మతస్తుల వారికి విస్తృతం చేశారు. దీని తరువాత ఈ కేంద్రాన్ని అనుకరిస్తూ అనేక వృత్తి మార్గదర్శక కేంద్రాలు నెలకొల్పడం జరిగింది. వాటిలో ముఖ్యమైనవి కలకత్తాలోగల వృత్తిమార్గదర్శక సమాజం(Vocational Guidance Society), జలంధర్‌లోని యునైటెడ్ క్రిష్టియన్ మిషన్ ఆఫ్ నార్థర్న్ ఇండియా (United Christian Mission of Northern India), బొంబాయిలో గుజరాత్ పరిశోధనా సమాజం మొదలైనవి నెలకొల్పబడ్డాయి. బొంబాయిలో రోటరీక్లబ్, కలకత్తాలో వై. ఎమ్. సి. ఎ. (Y. M. C. A.) మొదలైన ప్రైవేట్ రంగాలు కూడా మార్గదర్శక సహాయ కేంద్రాలను నెలకొల్పడం జరిగింది.

## ప్రభుత్వం - వృత్తి మార్గదర్శక కేంద్రాలు

1947 లో ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం మార్గదర్శక కేంద్రాన్ని నెలకొల్పడం జరిగింది. ప్రభుత్వ వృత్తి మార్గదర్శక కేంద్రాలలో ఇది ప్రప్రథమమైంది. 1950 వ సంవత్సరంలో బొంబాయి ప్రభుత్వం వృత్తి మార్గదర్శక కేంద్రాన్ని ప్రవేశపెట్టింది. పాఠశాలలలో సలహా కేంద్రాలను ప్రవేశపెట్టాలని మొదలియార్ ఇచ్చిన సలహా ప్రకారం భారత ప్రభుత్వం వృత్తి మార్గదర్శక కేంద్రాల ప్రాముఖ్యతను గుర్తించడం జరిగింది. 1954 వ సంవత్సరంలో విద్యా మంత్రిత్వశాఖ సెంట్రల్ బ్యూరో ఆఫ్ ది ఎడ్యుకేషన్ అండ్ ఒకేషనల్ గైడెన్స్ (The Central Bureau of the Educational and Vocational Guidancc) ను నెలకొల్పింది. అంతేకాక కేంద్ర విద్యా మంత్రిత్వశాఖ రాష్ట్రాలన్నీ నూతన వృత్తి మార్గదర్శక కేంద్రాలను నెలకొల్పడానికి లేదా ప్రస్తుతం అమలులోవున్న కేంద్రాలను అభివృద్ధి పరచడానికి, ఆర్థిక సహాయాన్ని అందజేసింది. ఒరిస్సా, పశ్చిమ బెంగాల్, రాజస్థాన్, మధ్యప్రదేశ్ మొదలైన వివిధ రాష్ట్రాలలో 1956 వ సంవత్సరంలోను అస్సాం, ఆంధ్రప్రదేశ్‌లలో 1957 వ సంవత్సరంలోను వృత్తి మార్గదర్శక కేంద్రాలు స్థాపించబడ్డాయి. క్రమక్రమంగా ఎంప్లాయిమెంట్

ఎక్స్ఛేంజ్‌లలోకూడా ఈ వృత్తిమార్గదర్శక కేంద్రాలను స్థాపించారు. 1956 వ సంవత్సరంలో వృత్తి మార్గదర్శక కేంద్రం ఢిల్లీలో నేషనల్ ఎంప్లాయిమెంట్ సర్వీస్‌వద్ద నెలకొల్పబడింది.

1956 వ సంవత్సరంలో మార్గదర్శకోద్యమం ప్రారంభమైందని చెప్పవచ్చు. ఈ సంవత్సరంలోనే దేశం నలుమూలల నుంచీ వృత్తి మార్గదర్శక కార్యకర్తలు బరోడాలో ఆల్ ఇండియా ఎడ్యుకేషనల్ అండ్ ఒకేషనల్ గైడెన్స్ అసోసియేషన్‌గా ఏర్పడ్డారు. ఈ అసోసియేషన్ విద్య వృత్తి సంబంధమైన జర్నల్‌ను ప్రారంభించింది. అంతే కాక సంవత్సరానికి ఒకసారి ఈ అసోసియేషన్ సమావేశాలు జరపడం వల్ల దేశంలో నలుమూలలా పనిచేస్తున్న వృత్తి మార్గదర్శకులు ఒక చోట సమావేశమై వారి అనుభవాలు, అభిప్రాయాలను తెలియజేసుకోవడానికి అవకాశమేర్పడింది. 1958 వ సంవత్సరంనాటికి 20 విశ్వవిద్యాలయాలలో వృత్తి మార్గదర్శక కేంద్రాలు ఏర్పాటయినాయి.

వీటి ముఖ్య కార్యక్రమం విశ్వవిద్యాలయ విద్యార్థులకు ఉద్యోగ సమాచారాలను తెలపడం, వృత్తిమార్గదర్శక సహాయాన్ని అందించడం.

## వృత్తి మార్గదర్శక కేంద్రాలు - ప్రాముఖ్యత

వృత్తి మార్గదర్శక కేంద్రాల ప్రాముఖ్యతను గ్రహించి వాటిని అన్ని ప్రాంతాలలోను స్థాపించడం జరిగింది. యువకులు ప్రత్యేక వృత్తి సంబంధమైన సలహాలనివ్వడానికి ప్రత్యేక కేంద్రాలుండడం అవసరమని, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గుర్తించాయి. పాఠశాలస్థాయిలో వడ్రంగం, చేనేత, నూలువడకడం, తోటపని, కుమ్మరిపని మొదలైన వృత్తులను ఎన్నిక చేసుకోవడంలో విద్యార్థులకు తగిన సలహాలనివ్వడానికి మార్గదర్శక కేంద్రాలు అత్యంత అవసరం. యువకులు తమ శక్తి సామర్థ్యాలను, అశక్తతలను తెలుసుకొనేటట్లు చేయడానికి ఈ కేంద్రాలు ఉపయోగపడతాయి. వీటిద్వారా యువకులు వారి శక్తి సామర్థ్యాలనుబట్టి వారు చేయగలిగే వృత్తిని వారే ఎన్నుకుంటారు.

## యువజన వసతి గృహాలు

యువకులు శక్తి సామర్థ్యాలతో ఉంటారు. యువశక్తిని సక్రమంగా ఉపయోగించుకోడానికి అవకాశం కల్పించకపోతే యువకులు బాధ్యతారహితంగాను, నిరుపయోగంగా, విధ్వంసక శక్తులుగా మారే అవకాశం ఉంటుంది. యువకులు ప్రజాప్రభుత్వానికి మూలస్తంభాల వంటివారు. వారిలో ఓర్మి, అవగాహన, ఐకమత్యభావన మొదలైన సద్గుణాలను పెంపొందించాలి. విద్య యువకుల మొత్తం అవసరాలను తీర్చలేకపోతున్నది. యువజన వసతి గృహాలు, సమ్మర్ క్యాంపులు, సెలవుదిన గృహాలు మొదలైనవి ఏర్పరచడంవల్ల యువకులలో బాధ్యతారహిత ప్రవర్తనను తొలగించి ఐకమత్య స్వభావాన్ని, బాధ్యతాయుత లక్షణాలను పెంపొందించవచ్చు.

పారిశ్రామికీకరణం, నగరీకరణం త్వరితగతిని అభివృద్ధి చెందుతున్నటువంటి ఈ దేశంలో యువజనులకు వసతి గృహాలను ఏర్పాటు చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. వసతి గృహాలు విద్యార్థులు కాని యువజనులకు, విద్యార్థులకు కూడా ఉపయోగపడతాయి. వివిధ వర్గాలకు చెందిన యువజనులు ఒకరినొకరు అర్థం చేసుకోవడానికి, ఒకరి అనుభవాలు వేరొకరు తెలుసుకోడానికి, సంక్షేమ కార్యక్రమాలు నిర్వహించడానికి ఈ వసతి గృహాలు ఉపయోగపడతాయి. ఈ వసతి గృహాలు స్వయం సహాయక పథకాన్ని అనుసరించి పనిచేస్తాయి. గృహ నిర్వహణలోని అన్ని విషయాలలోను, యువకులు తమ బాధ్యతను గుర్తించి క్రమశిక్షణతో పనిచేయడానికి ఇవి శిక్షణ ఇస్తాయి. మొట్టమొదట రిచర్డ్ షిర్మేన్ (Richard Shirman) అనే జర్మన్ ఉపాధ్యాయుడు ఈ వసతి గృహాలను ప్రారంభించాడు. ఇతడు 1910 వ సంవత్సరంలో బర్గ్ అటెనా (Burg Atena) అనే వసతి గృహాన్ని జర్మనీలో స్థాపించాడు. మన దేశంలో 1919 వ సంవత్సరంలో మైసూర్‌లో మొట్టమొదటి వసతి గృహం స్థాపించబడింది. 1953 వ సంవత్సరంలో బొంబాయిలో మరొక వసతి గృహం స్థాపించబడింది.

వసతి గృహాలలో గడిపిన యువకులు బాధ్యతాయుతమైన పౌరులుగా తయారై తమ సంక్షేమ కార్యక్రమాలకు అవసరమైన సహాయంతో తామే నిర్వహించుకోగలుగుతున్నారు.

## సెలవుదిన శిబిరాలు

వివిధ ప్రాంతాలలో గల యువజనుల మధ్య పరిచయం ఏర్పడటానికి, సామూహిక జీవితంలో అనుభవం కలిగించడానికి, విరామ కాలాన్ని సద్వినియోగపరచడానికి సెలవుదిన శిబిరాలు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ శిబిరాలు రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో కూడా నెలకొల్పడం జరుగుతుంది. యువజన సంక్షేమ కృషిచేసే స్వచ్ఛంద సేవాసంస్థలు ఇటువంటి శిబిరాలను ఏర్పాటు చేస్తారు. శ్రమదానం చేయడానికి అనుకూలమైన స్థలాలలో ఈ శిబిరాలను ఏర్పాటుచేస్తారు. సుమారు ఒక పక్షంపాటు ఈ శిబిరాలు నిర్వహించడమవుతుంది. ఇటువంటి శిబిరాలను నిర్వహించడాని కేంద్రప్రభుత్వ యువజన సంక్షేమ విభాగం, కేంద్ర సాంఘికసంక్షేమ సంస్థ నిధులనుకూడా మంజూరుచేస్తున్నది. ఈ శిబిరాలలో సాంఘి సంక్షేమ కార్యకర్తకూడా ఉంటాడు. ఈ శిబిరాలలో విశ్రాంతి వినోదానికి, విజ్ఞానానికీ అత్యంత ప్రాధాన్యమిస్తారు. శిబిరాలు ఏర్పరచ కున్న ప్రదేశాల స్థానిక సంస్థలతోను, నాయకులతోను, సన్నిహి సంబంధాన్ని పెంపొందించుకోవడం ప్రధాన విషయంగా పరిగణించాలి

## యువజనులు - సంక్షేమ కార్యక్రమాలు

యువజనులు శక్తికి మారుపేరు. వారిలో ఉత్సాహం, విప్ల భావాలు ఎక్కువగా ఉంటాయి. వారిశక్తి, ఉత్సాహం నిర్మాణాత్మ ప్రక్రియలకు ఉపయోగించక పోయినట్లయితే, సరియైన సలహాల పొందలేని యువకులు సంఘ వ్యతిరేక చర్యలకు పూనుకొనే అవకా ఉంది. యువకులు తమశక్తి తమ ఒక్కరి సుక్షేమానికేకాక సమా సంక్షేమానికికూడా ఉపయోగించేటట్లు చేయడం సాధ్యపడుతుం విద్యార్థులను, విద్యార్థేతర యువకులను సమాజ సంక్షేమ సేవ

వినియోగించుకోడానికి ముందు వారి సమయం, వనరులు, అనుభవం. నీటి పరిమితులను దృష్టిలో పెట్టుకోవడం అవసరం. విద్యార్థులను సాంఘిక సంక్షేమ కృషికి వినియోగించుకొనేటప్పుడు చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. విద్యార్థుల శక్తిసామర్థ్యాలను, సామాజిక సంక్షేమ సేవలకు ఉపయోగించుకొనేముందు వారు చదువుకోడానికి సరిపోయినంత సహాయం ఉండేటట్లు ప్రణాళిక రూపొందించాలి.

యువకుల శక్తి సామర్థ్యాలను సాంఘిక సేవలకు వినియోగించడానికి వ్యవస్థితమైన ప్రణాళికలను తయారుచేయాలి. యువతీయువకులకు మార్గదర్శక సహాయాన్ని అందజేయడానికిగాను దృఢమైన, నిపుణతగల వ్యవస్థ ఆవశ్యకత ఎంతైనా ఉంది. దీనివల్ల నిపుణతగల యువక నాయకుల దర్శకత్వంలో సముదాయంలో సంక్షేమసేవలు చేయడానికి మూడురకాల వ్యవస్థలున్నాయి.

1. గ్రామీణాభివృద్ధిలో కృషిచేసే సంస్థలు, సాముదాయిక సంక్షేమ కేంద్రాలు, వయోజన విద్యాకేంద్రాలు, విరామకృషి, ఉపశమనం చేసే కృషి మొదలైన కార్యక్రమాలను నిర్వహించే వ్యవస్థలు.
2. యువక్ సేవాదళ్ అనే యువకుల వ్యవస్థలు తమ సంక్షేమానికి గానీ, సముదాయ సేవలకుగానీ లేదా రెండింటికీగానీ వినియోగించడం జరుగుతున్నది.
3. కళాశాలలలో సాంఘిక సేవా సంఘం (Social Service League అనేదికూడా ఏర్పడింది. ఈ సంఘం కళాశాల సిబ్బంది నుంచి అధ్యక్ష, ఉపాధ్యక్షులను, విద్యార్థుల నుంచి ఆఫీస్ బేరర్లను ఎన్నుకుంటుంది. వీరు సంఘ సంక్షేమానికై కృషి చేస్తారు. యువకులు చేసే కృషి వారి శక్తి సామర్థ్యాలమీద ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు వైద్య విద్యార్థి వైద్య సహాయం చేయగలడు. ఇంజనీరింగ్ విద్యార్థి విద్యార్థుల వృత్తి శిబిరాలను పర్యవేక్షించగలడు. అర్థశాస్త్రం చదివే విద్యార్థి ఆర్థిక సర్వేలను చేయగలడు. ఉపాధ్యాయ వృత్తికి శిక్షణ పొందే విద్యార్థి విద్యాబోధన చేయగలడు. ఈ విధంగా ఏ రంగంలో అనుభవం పొందిన విద్యార్థి ఆ

రంగంలో కృషి చేసి సంఘ సంక్షేమ సేవలను చేయగలడు. విద్యార్థి, విద్యార్థేతర యువకుల కలయికవల్ల అనేక రకాలైన సంక్షేమ సేవలను చేయడం సాధ్యపడుతుంది. కానీ ఈ కార్యక్రమాన్ని తయారు చేసే బాధ్యత సంస్థ మాత్రమే వహిస్తుంది. ఏ పనులు ఎవరికి అప్పగించాలి అనేది నిర్ణయించుకోడానికి, ఎన్నిక చేసుకోడానికి అత్యంత ప్రాధాన్యమీయాలి. యువకులకు ఆ సంస్థ కృషిని, ఏ ఏ ప్రదేశాలలో ఆ సంస్థ పనిచేస్తుంది అనే విషయాలను ముందుగానే యువకులకు తెలియజేయాలి. యువకులు సంక్షేమ సేవలు చేయడానికి బోధన చేయడమేకాక తమంతటతాము స్వతంత్రంగా సంక్షేమ కృషి చేయడానికి ప్రయత్నించేలాగ చేయాలి. అంటే మార్గదర్శకత్వం, పర్యవేక్షణ సహాయంతో వారితో సంక్షేమ సేవలు చేయించాలి.

యువకులు చేయగలిగే సంక్షేమ సేవలు సాధారణంగా రెండు రకాలుగా ఉంటాయి.

1. సంవత్సరంగా పొడుగునా ఉపయోగపడే శాశ్వతమైన స్వభావంగల కృషి.
2. తాత్కాలికమైన కృషి అంటే వృత్తి శిబిరాలు, ఉపశమన కృషి మొదలైనవాటిని చేపట్టి విద్యార్థులు వాలంటీర్లుగా వృత్తి సంస్థలలోను, సెలవుదినాలలోను, అత్యవసర సమయాలలోను చేసే సేవలు.

యువకులు చేసే సంక్షేమాన్ని నిరవధికంగా కొనసాగించాలి. ఏ సముదాయంలోనైనా అసంతృప్తికరమైనటువంటి సాంఘిక సేవలు ఎటువంటి ఫలితాన్ని ఇవ్వలేవు. విద్యార్థులు సంక్షేమ సేవలను సంవత్సరం పొడవునా చేయడానికి అవకాశం ఉండదు. కనుక విద్యార్థులకు వీలు కాని సమయాలలో విద్యార్థేతరులద్వారా చేయించాలి. ఈ పనిని కళాశాల ఉపాధ్యాయులుగానీ, సంక్షేమ కార్యకర్తలుగానీ, సంక్షేమ సంస్థలలో పనిచేసేవారెవరైనా చేయాలి.

సంక్షేమ కార్యక్రమాల వివిధ రంగాలలో విద్యార్థులు సహాయం చేయవచ్చు. అవి —(1) గ్రామీణ పునర్నిర్మాణం, పట్టణ సముదాయ

సేవలు, వయోజనవిద్య, కార్మిక సంక్షేమం, వైద్య సహాయం, రోడ్ల నిర్మాణం, పరిశుభ్రత, ఉపశమన కృషి మొదలైనవి.

## గ్రామీణ పునర్నిర్మాణ కృషి

గ్రామీణ పునర్నిర్మాణ కృషిని చేపట్టే సంస్థలకు సహాయంచేసే యువకులకు, గ్రామీణసమస్యలను,గ్రామీణప్రజలను అవగాహనచేసుకొనే శక్తిసామర్థ్యాలు కావాలి. కొన్ని సమయాలలో యువకులే తమంత తాము వ్యవస్థలను నెలకొల్పి దానిద్వారా దగ్గరలోఉన్న గ్రామాల సంక్షేమసేవలను వ్యవస్థీకరించవచ్చు. గ్రామీణ పునర్నిర్మాణంకోసం కృషిచేసే యువకులు కొన్నిసూత్రాలను పాటించాలి.

1. ఏ సంక్షేమసేవ చేసినా, సమాజంకోసం చేయకుండా సమాజంతో చేయాలి. అనేవిషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. సమాజం కోసం కృషిచేసినట్లయితే గ్రామీణ ప్రజలు యువకులపై ఆధార పడతారు. దీనివల్ల వారిలో ఎల్లప్పుడూ ఇతరులపై ఆధారపడే స్వభావం ఏర్పడుతుంది. దీనివల్ల ఆశించిన ఫలితాలు లభించవు. ఉదాహరణకు కొంతమంది కళాశాల విద్యార్థులు ఒక గ్రామంలో సాంఘిక సేవా శిబిరాన్ని ఏర్పాటుచేసుకుని ఆ గ్రామం వీధులన్నిటినీ పరిశుభ్రం చేశారు. మరికొన్నిరోజుల తరువాత ఆ గ్రామం మరల అపరిశుభ్రత చెందగానే గ్రామపెద్ద ఆ గ్రామీణులచే పరిశుభ్రం చేయించడానికి బదులుగా ఆ విద్యార్థుల కళాశాల ప్రిన్సిపాల్ కి తమ గ్రామం మరల అపరిశుభ్రం అయినందువల్ల పరిశుభ్రం చేయడానికి వారి విద్యార్థులను పంపించవలసిందిగా కోరుతూ ఉత్తరం వ్రాశాడు. అదే ఆ విద్యార్థులు తాము వీధులను శుభ్రం చేయకుండా ఆ గ్రామీణులచేతే చేయించినట్లయితే వారు తమ గ్రామాన్ని తామే ఎప్పటికప్పుడు పరిశుభ్రం చేసుకోవాలనే విషయాన్ని తెలుసు కొంటారు. గ్రామీణ ప్రజలతో పనిచేసేటప్పుడు అత్యంతజాగ్రత్తగా ఉండాలి. గ్రామాలను చేరగానే యువకులు గ్రామనాయకులను కలుసుకోవాలి. ఆ గ్రామానికి వచ్చిన ఉద్దేశాన్ని గ్రామపెద్దలకు

తెలియజేయాలి. వారితో ఆ గ్రామ సమస్యలనుగురించి చర్చించాలి. గ్రామీణులు తమ సమస్యలను పరిష్కరించుకోడానికి ఎంతవరకు కృషిచేస్తున్నారో పరిశీలించాలి. కొన్ని సమయాలలో ఇతర సంస్థలనుగానీ, ప్రభుత్వాన్నిగానీ కలుసుకుని వారి సలహా సంప్రదింపులనుకూడా పొందవచ్చు. విద్యార్థులు గ్రామాలలోగల బాలలసంక్షేమ సేవలతో కార్యక్రమాన్ని ఆరంభించాలి. వారికి వినోద కార్యక్రమాలను ఏర్పరచడం, మొదలైనవి చేయాలి. గ్రామీణ ప్రజల నమ్మకాలు, పద్ధతులు, సంస్కృతి మొదలైనవాటిని గౌరవించాలి. అప్పుడే వారితో కలసి పనిచేయడం సాధ్యపడుతుంది. యువకులు గ్రామీణుల విశ్వాసాన్ని చూరగొనాలి. లేకపోతే గ్రామీణులు వీరితో సహకరించరు. యువకులు, విద్యార్థులు కలసి పనిచేయగలిగే కార్యక్రమాలు ఈ క్రిందివిధంగా ఉంటాయి.

1. పరిశుభ్రం, ఆరోగ్యం 2. అంటువ్యాధుల నివారణ, నిరోధక కార్యక్రమాలు లేదా చికిత్స చేయడానికి శిబిరాలను ఏర్పరచడం 3. వయోజన విద్య, అక్షరాస్యత 4. జాతీయ భావాలను పెంపొందింపచేయడం 5. సాంస్కృతిక, వినోద కార్యక్రమాలను ఏర్పరచడం 6. గ్రామీణ పరిశ్రమలు నెలకొల్పడం 7. విద్యా సౌకర్యాలను అభివృద్ధిపరచడం 8 గ్రామీణ యువక సంస్థలను నెలకొల్పడం 9. భద్రతా కార్యక్రమాలు 10. అత్యవసర పరిస్థితులలో సాముదాయిక కృషి.

## పరిశుభ్రత

ఆవు, గేదె, మేక మొదలైన జంతువుల విసర్జనాలవల్ల గ్రామాలు తప్పనిసరిగా అపరిశుభ్రమవుతాయి. ఈ విసర్జనాలను తీసివేసి జనసమ్మర్దానికి దూరంగా పారబోసినట్లయితే, గ్రామం పరిశుభ్రంగా ఉండడమే కాక ఆ గ్రామాలలోగల భూములకు ఎరువులు కూడా తయారవుతాయనే విషయాన్ని ప్రజలకు తెలియచేయాలి. మరుగుదొడ్లను ఆధునిక పద్ధతిలో ఏర్పాటు చేయించాలి. వైద్య రంగంలో విద్యార్థులు వైద్య కృషి ద్వారా గ్రామీణ ప్రజలకు సహాయం చేయగలరు. ఈ వైద్య

సహాయం స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారాగానీ, ప్రభుత్వం ద్వారాగానీ ఏర్పాటుచేసినదై ఉండవచ్చు.

## వయోజన విద్య

వయోజన విద్య ద్వారా గ్రామాలలోని శ్రామికులకు, తదితర నిరక్షరాస్యులకు యువకులు విద్యాబోధనచేసి అక్షరాస్యుల సంఖ్యను పెంపొందించవచ్చు. పగలు ఉద్యోగాలు, వ్యవసాయం చేసుకొనేవారికి రాత్రి తరగతులు ఏర్పాటుచేసి, తద్వారా వారితో వార్తాపత్రికలు చదివించడం, సామాజిక సమస్యలు అంటే బాల్యవివాహాలు, ఖరీదైన సాంఘిక ఉత్సవాలు, జాతిమత భేదాలు మొదలైన వాటిపై చర్చలు జరపడం, వివిధ వ్యక్తుల దృక్పథాలను సేకరించి వారికి సలహాలనివ్వడం మొదలైనవి చేయవచ్చు.

విద్యార్థి యువకులు గ్రామీణ ప్రాంతాలలో పాఠశాలకుపోయే బాలల సంఖ్యను ఏడాదికేడాది పెంపొందింపచేయవచ్చు. దీనికై వారు తలిదండ్రుల వద్దకు వెళ్ళి విద్యా ప్రయోజనాలను తెలియజేస్తూ తమ పిల్లలను పాఠశాలకు పంపే ఉద్దేశాన్ని కలుగజేసి ప్రోత్సాహాన్ని కలిగించాలి. గ్రామీణ ప్రజలు తమ అవసరాలను, సమస్యలను అవగాహన చేసుకొనేలాగ చేయడమేకాక ఆధునిక జీవిత విధానాన్ని అలవరచుకొనే విధంగా చేయవచ్చు.

యువకులు సాముదాయిక సంక్షేమ కార్యక్రమాలను కూడా చేయవచ్చు. వాటిలో ముఖ్యమైనవి —

1. శిశు గృహాలనుగానీ, బాల్వాడీలనుగానీ నడపడం.
2. బాలలకు వినోద కార్యక్రమాలను ఏర్పరచడం.
3. సాంస్కృతిక కార్యక్రమాలు - అంటే సంగీతం, నాటకం, క్లబ్, హాబీ మొదలైనవి ఏర్పరచడం.
4. వైద్య సహాయం అందించడం.
5. చేతిపనులలో శిక్షణ ఇవ్వడం.

విద్యార్థులు, విద్యార్థులుకాని ఇతర యువకులు ఉపశమన కార్యక్రమాన్ని చేపట్టవచ్చు.

ధనం, ధాన్యం, ఆహార పదార్థాలు, వస్త్రాలు, ఔషధాలు మొదలైన వాటిని సేకరించి అవసరమైన వారికి పంపిణీచేసే కార్యక్రమాలను యువకులు చేపట్టవచ్చు. ఈ విధమైన సంక్షేమ కార్యక్రమాలను యువకులు చేపట్టడంవల్ల సమాజానికి సంక్షేమ సేవలు లభిస్తాయి. తమ భావిజీవితంలో మంచి మార్గదర్శకమైన జీవితాన్ని గడపడానికి ఇది తోడ్పరుతుంది. యువకులను బాధ్యతాయుతమైన పౌరులుగా తయారుచేయడానికి, సమాజానికి ఉపయోగకరమైక సహాయాన్ని చేయడానికి ఈ సంక్షేమ కార్యక్రమాలు ఉపయోగపడతాయి.

1969 వ సంవత్సరంలో విద్యామంత్రిత్వశాఖ జాతీయసేవా పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. ఈ జాతీయ సేవా పథకం వివిధ కళాశాలలలోను, విశ్వవిద్యాలయాలలోనుగల విద్యార్థులు తమ విరామ సమయాన్ని సద్వినియోగపరచి సామాజిక సంక్షేమ కార్యక్రమాలను చేపట్టడానికి సహాయంచేస్తున్నది. 1973 వ సంవత్సరంలో కరువు కాటకాలకు గురైన వారికి సహాయం చేయడానికి యువకులు సంఘాలుగా ఏర్పడి కృషి చేయడం జరిగింది. ఐదో పంచవర్ష ప్రణాళికలో నెహ్రూ యువక కేంద్రం అనే పథకాన్ని ప్రవేశపెట్టారు. ఈ పథకంలో విద్యార్థి యువకులనేకాక విద్యార్థేతర యువకులను కూడా చేర్చుకోవడం జరిగింది. దీని కార్యక్రమాలేవంటే విద్య, స్వయం ఉపాధికల్పనా అవకాశాలను ఏర్పాటుచేయడం, సంఘ సేవ, సాంస్కృతిక కార్యక్రమాలను అంటే వినోద సౌకర్యాలను ముఖ్యంగా ఆటల సౌకర్యాలను అభివృద్ధిపరచడం మొదలైనవి. గ్రామాలలో సాముదాయిక అభివృద్ధి కోసం ఏర్పడిన యువకమండలములను కూడా రిజిష్టరు చేయించి, గ్రాంటులను మంజూరు చేయించి, దాని కార్యాలయాలను నెలకొల్పి వాటిని విస్తృతంచేసి బలపరచడం జరిగింది. ఇటువంటి సంస్థలన్నీ నెహ్రూ యువక కేంద్రాలతో సమన్వయం ఏర్పరచుకోవడం కూడా జరిగింది.

ఈ విధంగా యువకులశక్తిని, ఉత్సాహాన్ని మంచిమార్గానికి త్రిప్పి సాముదాయిక అభివృద్ధికి ఉపయోగించే పథకాలను ప్రభుత్వం, స్వచ్ఛంద సేవాసంస్థలు ఏర్పాటుచేసినట్లయితే ఈ కార్యక్రమాలు

యువకుల అభివృద్ధికీ, సాముదాయిక అభివృద్ధికీ, సమాజ పునర్నిర్మాణానికీ, చివరకు జాతీయాభివృద్ధికీకూడా ఉపయోగపరచుకోవడం జరుగుతున్నది.

## విద్యార్థులు - జాతీయ పునర్నిర్మాణం

ప్రభుత్వం, స్వచ్ఛంద సేవాసంస్థలు పాఠశాలలలోను, కళాశాలలలోను అనేక కార్యక్రమాలను ఏర్పాటుచేయడమైంది. ఈ విధంగా విద్యార్థులు జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాల్లో పాల్గొనడానికి ఈ కింది కార్యక్రమాలను ఏర్పాటుచేశారు.

యూత్ కోర్ (Youth Corps) 1959 వ సంవత్సరంలో నియమించిన H. N. క్రుంజు కమిటీ సలహా ప్రకారం భారత ప్రభుత్వం దేశంలోగల అన్ని విద్యాలయాలలోను, శారీరకారోగ్య సంబంధమైన విద్యను ప్రవేశపెట్టడానికి నిర్ణయించారు. దీనిఫలితంగా ఆక్సలరీ కేడెట్ కోర్స్, నేషనల్ డిసిప్లిన్ స్కీమ్, వ్యాయామవిద్య మొదలైన పథకాలను ప్రవేశపెట్టారు. ఈ కార్యక్రమాలలో మొట్టమొదటి ప్రాధాన్యత వ్యాయామ, సాంస్కృతిక కార్యక్రమాలకు ఇవ్వబడింది. ఈ పథకంవల్ల విద్యార్థులందరూ లేదా అధిక సంఖ్యాక విద్యార్థులు శారీరకారోగ్యాన్ని పొందగలరు. అంతేకాక క్రమశిక్షణను అభివృద్ధిచేసే కార్యక్రమాలలో పాల్గొనడానికి అవకాశాలు కూడా లభిస్తాయి. విద్యార్థులలో దేశభక్తికూడా అభివృద్ధిచెందగలదు. విద్యార్థులు తమ ఆసక్తి కనుగుణంగా వివిధ రంగాలలో అభివృద్ధిచెందడానికి అవకాశాన్ని పొందగలుగుతారు. ఈ కార్యక్రమాలవలన విద్యార్థులు స్కౌటింగ్, పర్వతారోహణ, ఆటలు, నృత్యం, డ్రామాలు, పాటలు మొదలైన అనేక కళలలో పేరుప్రతిష్ఠలను సంపాదించుకోగలరు. "ది నేషనల్ ఫిట్ నెస్ కోర్ (The National fitness corps) బహుళార్థ సాధక కార్యక్రమాలలో ఉంది. ఈ పథకం మాధ్యమిక, ఉన్నతపాఠశాలల విద్యార్థులకు శారీరకాభివృద్ధి విద్యా కార్యక్రమాలను ప్రవేశపెట్టడానికి

నెలకొల్పబడింది. ఈ పథకాన్ని ప్రస్తుతం ప్రతీ రాష్ట్ర ప్రభుత్వంవారు అమలుజరుపుతున్నారు.

## నేషనల్ కేడెట్ కోర్ (N. C. C.)

ఈ పథకాన్ని భారతదేశ స్వాతంత్ర్యానంతరం ప్రవేశపెట్టారు. ఈ పథకం ముఖ్యోద్దేశం విద్యార్థి యువకులలో శీలాన్ని, సత్ప్రవర్తనను, సౌభ్రాతృత్వాన్ని, సేవాదృక్పథాన్ని, నాయకత్వ లక్షణాలను, శక్తి సామర్థ్యాన్ని పెంపొందింపజేయడం. అంతేకాక అత్యవసర పరిస్థితులలో సాయుధ రక్షణదళాలకు సహాయం చేయడానికి సిద్ధంగా ఉండడం, విద్యార్థులలో దేశరక్షణ, దేశ సమైక్యత, బాధ్యత మొదలయిన లక్షణాలను పెంపొందింపజేయడం మొదలైనవి. నేషనల్ కేడెట్ కోర్‌లో జూనియర్ విభాగం, సీనియర్ విభాగం ఉంటాయి. జూనియర్ విభాగంలో 13 సంవత్సరాలనుంచి 19 సంవత్సరాలవరకు, సీనియర్ విభాగంలో 19 సంవత్సరాలనుంచి 27 సంవత్సరాలవరకు వయసు ఉన్న వారిని చేర్చుకుంటారు. ఈ విభాగాలు యువతీయువకులకు ప్రత్యేకంగా ఉంటాయి.

విశ్వవిద్యాలయాలు, వాటి అనుబంధ కళాశాలలోగల విద్యార్థులు మొదటి రెండు సంవత్సరాలలో ఈ పథకంలో తప్పనిసరిగా శిక్షణ పొందాలి. ఈ పథకంలో విద్యాశిక్షణ, ఆయుధ శిక్షణ, క్షేత్రకృషి మొదలైన కార్యక్రమాలు ఉంటాయి. అంతేకాక విద్యార్థులు తమ వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసుకోడానికి అనేక క్యాంపులకు కూడా హాజరుకావాలి. జూనియర్ విభాగాలు, సీనియర్ విభాగాలు వాటిలో ఉన్న సభ్యులను, ఆర్మీ, నేవీ, ఎయిర్ వింగ్ మొదలైన మూడుభాగాలుగా విభజించి వేర్వేరు రంగాలలో శిక్షణ ఇస్తున్నారు.

## జాతీయ సేవా పథకం (N.S.S.)

విశ్వవిద్యాలయ, కళాశాల విద్యార్థులు తమ విద్యాభ్యాసంతో పాటు వివిధ జాతీయాభివృద్ధి కార్యక్రమాలలోను, సంఘసేవా కార్యక్రమాలలోను, పాల్గొనేటట్లు చేయడం ఈ పథకం ముఖ్యోద్దేశం.

సాముదాయిక కార్యక్రమాల ద్వారా విద్యాబోధన చేయాలనేది ఈ పథకం ప్రధానమైన నియమం. ప్రజా ప్రతినిధులు, నాయకులు మొదలైన వారితో కలిసిమెలిసి పనిచేయడానికి విద్యార్థి యువజనులకు అవకాశాలు కల్పించడం, విద్యార్థి యువజనుల అపారశక్తి సామర్థ్యాలను నిర్మాణాత్మకంగాను, సృజనాత్మకంగాను వినియోగించడం, దాని ద్వారా జాతీయాభివృద్ధి కార్యక్రమాలను అమలుజరపడం, విద్యార్థి యువజనులు తమ మేధాశక్తిని ఉపయోగించుకొని ప్రజల సమస్యలను అవగాహన చేసుకుని వాటిని పరిష్కరించుకోవడంలో ప్రజలకు సహాయపడేటట్లు విద్యార్థి యువజనులకు నాయకులుగా తయారుకావడానికి అవకాశాలు కల్పించడం మొదలైనవి ఈ పథకంలోగల వివిధ కార్యక్రమాలు. సంఘ సేవా కార్యక్రమాలలో పాల్గొనదలచిన విద్యార్థులు వారానికి కొన్ని గంటల కాలాన్ని ఈ కార్యక్రమాలకై వినియోగించవలసి ఉంటుంది. ఈ కార్యక్రమాలలో స్వచ్ఛందంగా విద్యార్థులే తమ పేర్లను నమోదు చేసుకోవలసి ఉంటుంది. అవసరాన్నిబట్టి, వాలంటీర్ల శక్తి సామర్థ్యాలనుబట్టి, ఈ విద్యార్థులను కొన్ని సమూహాలుగా విభజించటం జరుగుతుంది. వివిధ సమూహాలు తమకు కేటాయించిన ప్రదేశాలలో ఉపాధ్యాయుల సలహా సంప్రదింపుల సహాయంతో పనిచేస్తారు. విద్యార్థులు చేపట్టడానికి ఈ కార్యక్రమాలు చాలా అనుకూలమైనవిగా ఉన్నాయి.

విద్యార్థి యువకులు సంఘ సేవలో పాల్గొనాలనే ఆశయం స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారతదేశంలో ఉదయించిందని చెప్పవచ్చు. 1958 వ సంవత్సరంలో ప్రధానమంత్రి జవహర్ లాల్ నెహ్రూ రాష్ట్ర ముఖ్య మంత్రులకు విద్యార్థులు సంఘ సేవలో పాల్గొనే అవకాశాలు కల్పించవలసిందిగా సలహాలనిచ్చాడు. దీని ప్రకారం 19–22 సంవత్సరాల మధ్య వయసుగల స్త్రీ, పురుషులందరూ సంఘసేవా కార్యక్రమాలలో పాల్గొనడం జరిగింది. 1964 వ సంవత్సరంలో నేషనల్ సర్వీస్ కమిటీ సేవా పథకం ప్రవేశపెట్టడం జరిగింది. ఈ పథకం ప్రకారం

ప్రతి విశ్వవిద్యాలయంలోను, కళాశాలలోను, పాఠశాలలోను 9 లేదా 12 మాసాల కార్యక్రమాన్ని ప్రవేశపెట్టాలని సలహా ఇచ్చారు.

ఈ జాతీయ సేవా పథకం 1969-70 లో ప్రవేశపెట్టబడింది. 1970-71 నాటికి 41 విశ్వవిద్యాలయాల నుంచి 97,000 విద్యార్థులు పాల్గొన్నారు. నాల్గో పంచవర్ష ప్రణాళికలో జాతీయ సేవా పథకం అభివృద్ధికై 49 మిలియన్ల రూపాయల వ్యయం చేయడమైంది. ఈ కార్యక్రమాలు సక్రమంగా కొనసాగించడానికి అనేకమంది ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చారు. ఈ శిక్షణ పొందిన ఉపాధ్యాయులు సెలవు దినాలు, సెలవుకాని దినాలలో కూడా స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా ఈ పథకాన్ని అమలు జరిగేటట్లు చూస్తున్నారు.

## భారత్ సేవక్ సమాజ్

సాంఘిక సేవా శిబిరాలను ఏర్పాటుచేయడానికి ప్రజలలో సేవా దృక్పథాన్ని పెంపొందింపజేయడానికి, జవహర్‌లాల్ నెహ్రూ ప్రోత్సాహ ప్రోద్బలాలతో ఈ సంస్థను నెలకొల్పడం జరిగింది. ఇది రాజకీయాలతో నిమిత్తంలేని సేవాసంస్థ. యువజనోత్సవాలను, యువజనసంక్షేమ కార్యక్రమాలను ప్రత్యేకంగా నడపడానికిగాను, ఈ సంస్థను ఒక సహాయక శాఖగా భారతయువక సమాజాన్ని స్థాపించడం జరిగింది. సెలవుదినాలలో విద్యార్థులు తమ శ్రమదానంతో రోడ్లు, వంతెనలు, మొదలైన నిర్మాణ కార్యక్రమాలను నిర్వహించడం ఈ సంస్థ ఆశయం. ఈ సంస్థ గిరిజన, హరిజనోద్ధరణ, బలహీనవర్గాల పరిరక్షణ, మొదలైన కార్యక్రమాలుకూడా నిర్వహిస్తున్నది.

## ప్లానింగ్ ఫోరమ్స్ (Planning forums)

విద్యార్థి యువజనులను సంఘాలుగా ఏర్పరచి వారిని పట్టణ ప్రాంతాలలోను, గ్రామీణ ప్రాంతాలలోను నివసించే ప్రజలకు పంచవర్ష ప్రణాళికల ముఖ్యోద్దేశాలను తెలియజేయడం. అంతేకాక ప్రభుత్వం ఏర్పరచిన సౌకర్యాలను ఏవిధంగా ఉపయోగించుకోవాలో తెలియజేయడం జరుగుతుంది.

## జాతీయ అంతర్జాతీయ యువజన సంఘాలు

యువజన సంక్షేమం కేవలం ప్రభుత్వానికే పరిమితమైందిగా భావించరాదు. ప్రభుత్వ కార్యక్రమాలతో అనుబంధించడానికి ప్రజలు స్వచ్ఛంద సేవాసంస్థలద్వారా ఇతోధికమైన కృషిచేయవలసి ఉంటుంది. ముఖ్యంగా స్వచ్ఛంద సేవాసంస్థలు నూతన పథకాలను ప్రయోజనాత్మకంగా నిర్వహించి ఇతర సంస్థలకు, ప్రభుత్వానికీ కూడా మార్గదర్శకులుగా ఉండాలి. కేవలం పేరుకుమాత్రమే సంస్థలుగా ఏర్పడక పటిష్టంగా పనిచేసే సేవాసంస్థలుగా రూపొందించడంలోను, అవసరమైన సాంఘిక చర్యను పెంపొందించడంలోను, ఈ సంస్థలు కృషి చేయాలి. అన్నిసంస్థలు అన్నిరకాల కార్యక్రమాలను నిర్వహించలేవు. కొన్ని సంస్థలు కొన్ని ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహించడానికి ప్రావీణ్యతను పొంది ఉంటాయి. ఈ సంస్థలు ప్రభుత్వ సహాయాన్ని ఇతర స్వచ్ఛంద సేవాసంస్థల సహాయాన్నికూడా తీసుకుంటూ తమ కార్యక్రమాలను కొనసాగించవలసి ఉంటుంది. ఇటువంటి సంస్థలన్నీ "ఇండియన్ అసంబ్లీ ఆఫ్ యూత్" అనుబంధాన్ని పొంది వివిధ స్థాయిలలో సహకార సమన్వయాలతో పనిచేస్తే యువజనసంక్షేమాన్ని పెంపొందించవచ్చు. యువజన సంక్షేమ కార్యక్రమాలపై ప్రభుత్వానికి తగిన సలహాలనివ్వడానికి ఏర్పరచుకొన్న "నేషనల్ యూత్ బోర్డ్"తో "ఇండియన్ అసంబ్లీ ఆఫ్ యూత్" కలిసిమెలసి పనిచేయవలసి ఉంటుంది. ఈ విధంగా ఏర్పడిన స్వచ్ఛంద సేవాసంస్థలలో జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో ఉన్న యువజన సంక్షేమ సంస్థలు వై. ఎమ్. సి. ఎ., వై. డబ్ల్యూ. సి. ఎ. లు ముఖ్యమైనవి.

## వై. ఎమ్. సి. ఎ. (Y M C A)

(Young Men's Christians' Association) అన్ని తరగతులకు, అన్నిమతాలకు చెందిన యువజనులకు ఆధ్యాత్మిక, సాంఘిక, శారీరక వికాసాన్ని కలిగించడానికి ఈ సంస్థ కృషిచేస్తున్నది. ఇది అంతర్జాతీయ సేవాసంస్థ. ఇటువంటి సంస్థలు పట్టణాలలో ఎక్కువగా

నెలకొల్పబడతాయి. వసతి గృహాలను నిర్వహించడం, శ్రమదానాన్ని సాంఘిక సేవను, ప్రోత్సాహపరచడం, సారస్వత కార్యక్రమాలను నిర్వహించడం మొదలైనవి ఈ సంస్థ నిర్వహించే ముఖ్య కార్యక్రమాలు, ఈ సంస్థ జాతీయ, అంతర్జాతీయ సంస్థలతో అనుబంధాన్ని పొంది యువజన సంక్షేమ కార్యక్రమాలను అభివృద్ధిచేస్తుంది. ఈ సంస్థ చాలా కాలంనుంచీ సక్రమంగా పనిచేస్తూ ఉండడంవల్ల అంతర్జాతీయస్థాయిలో మంచి పేరుప్రతిష్టలను సంపాదించుకోవడంవల్ల ఈ సేవా సంస్థలను ఇతర సంస్థలకు మార్గదర్శకులుగా ఎన్నుకోవడం జరిగింది.

ఈ సంస్థ కొన్నిగ్రామాలను ఎన్నుకుని ఆ గ్రామాలలో సేవా కార్యక్రమాలను నిర్వహించి తద్వారా గ్రామాలలో నూతన చైతన్యం వెలసిల్లేటట్లుగా కృషిచేస్తున్నది. వివిధస్థాయిలలో యువజనోత్సవాలను జరిపి వారిలో నూతనోత్సాహాన్ని పెంపొందిస్తున్నది.

## వై. డబ్ల్యు. సి. ఎ. (Y W C A)

(Young Women's Christians Association)మహిళలు, బాలికలు కలిసిమెలిసి పనిచేసేటట్లుగాచేసి విశ్వవ్యాప్తమైన సౌభ్రాతృత్వాన్ని, సౌహార్ధాన్ని వారిలో పెంపొందింపజేయడం ఈ సంస్థ ప్రధానోద్దేశం. వారు తమ జీవితాలను సార్థకం చేసుకొనేటట్లు సహాయపడడం ఈ సంస్థ ఆదర్శాలలో అతిముఖ్యమైనవి. ఇది ఒక సేవాసంస్థ. ఈ సంస్థలు కూడా పట్టణ ప్రాంతాలలోనే ఎక్కువగా నెలకొల్పబడుతున్నాయి. పట్టణ ప్రాంతాలలో ఉద్యోగాలు చేసుకుంటూ ఒంటరిగా ఉన్న యువతులకు వసతి గృహాలను నడపడం వీరి ప్రధాన కార్యక్రమం. యువతులలో ఆటపాటలను ప్రోత్సహించడం, శ్రమదాన కార్యక్రమాలను నిర్వహించడం, వృత్తివిద్యా శిక్షణా కేంద్రాలను నిర్వహించడం, వృత్తి సంబంధమైన సలహా కేంద్రాలను నిర్వహించడం దీని ప్రధాన కార్యక్రమాలు, యువతులలో నూతనోత్సాహాన్ని పెంపొందించి, వారు దేశాభ్యుదయ కార్యక్రమాలలో పాల్గొనేలాగ చేయడానికి ఈ సంస్థ కృషి చేస్తున్నది.

# విద్యార్థేతర యువకులు - సంక్షేమ కార్యక్రమాలు

విద్యార్థులు కాని యువకులు కూడా తమ విరామ సమయాన్ని సముదాయాభివృద్ధి కార్యక్రమాలకు ఉపయోగించే అవకాశాన్ని కలిగించడానికి పథకాలను ఏర్పాటుచేయడం జరిగింది. ఈ పథకానికి నాలుగో పంచవర్ష ప్రణాళికలో 5 కోట్ల రూపాయలు కేటాయించారు. ఆమోద యోగ్యమైన యువజన సంక్షేమ పథకాలను నిర్వహించే స్వచ్ఛంద సేవా సంస్థలకు ప్రభుత్వం ధన సహాయం చేస్తుంది. ఈ పథకానికయ్యే ఖర్చులో కొంత భాగాన్ని ప్రభుత్వం మిగిలిన భాగాన్ని సంస్థ భరించవలసి ఉంటుంది. నాలుగో పంచవర్ష ప్రణాళికలో 10 లక్షల రూపాయలను ఈ స్వచ్ఛంధ సేవా సంస్థల కార్యక్రమానికి కేటాయించడం జరిగింది.

యువజన కర్షకుల అంతర్జాతీయ వినిమయ పథకం అమెరికా ప్రభుత్వ సహకారంతో 1953 వ సంవత్సరం నుంచి నిర్వహించడం జరుగుతున్నది. మన దేశంలోని యువజన కర్షకులు, అమెరికా దేశంలోని యువజన కర్షకులు జనసంక్షేమ కార్యక్రమాలను అర్థం చేసుకునే అవకాశం కల్పించడానికి ఉద్దేశించిన కార్యక్రమం. ఈ యువ కర్షకులు అమెరికాలో గ్రామీణ ప్రాంతాలలో కొన్ని కుటుంబాల వారికి అతిథులుగా ఉండి ఆరు మాసాలు గడుపుతారు. 20 నుంచి 30 సంవత్సరాల మధ్య వయసుగల యువతీ యువకులలో వ్యవసాయంలోను, గృహ విజ్ఞానంలోను అనుభవం కలిగినవారిని ఎన్నిక చేసుకోవడం జరుగుతుంది.

యువజనులు శారీరక, మానసిక, సాంఘిక, ఆర్థిక వికాసాలను పెంపొందింపచేయడానికి యువతీ యువకులను వేర్వేరు సమూహాలుగా చేయాలి. ఈ సమూహాలు కార్యక్రమాలను నడిపించడానికి, గ్రామీణ ప్రాంతాలలో గ్రామసేవకులు, విస్తరణాధికారులు, పట్టణ ప్రాంతాలలో సమాజాభివృద్ధి పథకాలను నిర్వహిస్తున్న సాముదాయిక వ్యవస్థాపకులు సహాయపడతారు. ఈ సమూహాల కార్యక్రమాలు సంతృప్తికరంగా

ఉండడంవల్ల ప్రభుత్వం నాలుగో పంచవర్ష ప్రణాళికలో ఒక కోటి రూపాయలను ఈ కార్యక్రమాలకు కేటాయించారు.

## యువజన సంక్షేమ కార్యక్రమాలు - సంక్షేమ కార్యకర్త పాత్ర

గిరిజన, గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో నివసించే యువజన వర్గానికి చెందిన విద్యావంతులు, నిరక్షరాస్యులు, ఉద్యోగులు, నిరుద్యోగులు మొదలైనవారి సంక్షేమం, అందుకు దోహదంచేసే కార్యక్రమాలు ఒకే మాదిరిగా ఉంటాయి. యువజన సంక్షేమం సాధించడంలో సంక్షేమ కార్యకర్త పాత్ర, విధులు బాధ్యతలు అనేకంగా ఉన్నాయి.

సంక్షేమ కార్యకర్త తాను పనిచేయ వలసిన సముదాయాన్ని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. దీనికి కార్యకర్త సాంఘిక సర్వేపద్ధతిని ఉపయోగించాలి. వ్యక్తిసేవా పద్ధతి, సమూహ సేవా పద్ధతి, సాముదాయిక వ్యవస్థాపన మొదలైన పద్ధతులను ఉపయోగించి సమాజంలోని వివిధ వర్గాలకుచెందిన యువజనులను సంక్షేమ కార్యక్రమాల్లో పాల్గొనేవిధంగా చేయాలి. తరువాత సమాజంలోని నాయకులను, ప్రజాప్రతినిధులను, అధికారులను కలుసుకొని వారి ద్వారా యువజన సంక్షేమ కార్యక్రమాలకు అవసరమైన వనరులను సమీకరించాలి. వనరులను దృష్టిలో ఉంచుకొని యువజనుల సమస్యలను పరిష్కరించేటట్లు సంక్షేమ కార్యక్రమ పథకాలను ఏర్పాటు చేయాలి.

యువజనులందరినీ ఆయత్తపరచి వారు బాధ్యతాయుతంగా పని చేయడం కోసం ప్రస్తుతం అమలులోవున్న యువకమండలులు, మహిళా మండలులు, వివిధ పద్ధతులతో, నియమాలతో పటిష్టంగా పనిచేసేటట్లు చూడాలి. అవసరమైతే యువజన సంస్థలను క్రమపద్ధతిపై ఏర్పాటుచేసి కార్యక్రమాలను చేపట్టేటట్లుగా చూడాలి. ఈ విషయంలో ప్రజాసంస్థలను స్థాపించి నడిపించడంలో తాను గడించిన విద్యను, పొందిన అనుభవాన్ని ఉపయోగించి కార్యకర్త పనిచేయాలి. ఈ సంస్థల ప్రతినిధులకు

నాయకులకు, ముఖ్య కార్యకర్తలకు శిక్షణ శిబిరాలను ఏర్పాటుచేసి కృషి చేయాలి. పటిష్టంగా పనిచేస్తున్న యువజన సంస్థల వారిచేత విజ్ఞాన యాత్రలు జరిపించాలి.

ఏఏ విషయాలలో ఏఏ సంస్థల మధ్య సహకార సమన్వయాలు పెంపొందించుకోవాలో సాంఘిక సంక్షేమ కార్యకర్త ముందుగా నిర్ణయించుకోవాలి. అటువంటి సహకార సమన్వయాలను పెంపొందించడంలో ఎదురయ్యే పరిస్థితులను ముందుగానే దూరదృష్టితో అవగాహన చేసుకోవాలి. అటువంటి పరిస్థితులను చాకచక్యంతో పరిష్కరించి తక్కిన పరిస్థితుల పరిష్కారానికి దోహదంచేయాలి. స్థానికంగా ఉన్న సంస్థలతో ఒక యువజన సంక్షేమ సంస్థల సమితిని ఏర్పాటుచేయాలి. స్థానికంగా గల సంస్థల ప్రతినిధులందరూ ఈ సమితిలో సభ్యులుగా చేరడంవల్ల వారిలో సహకార సమన్వయ సుహృద్భావాలు పెరుగుతాయి. అదేసంస్థ ఆధ్వర్యంలో సంక్షేమ కార్యక్రమాలను అమలు జరపవచ్చు.

యువజన సంక్షేమ కార్యక్రమాలను అమలుజరపడంలో యువజనేతరుల సహాయ సహకారాలు చాలా అవసరం. ఇందుకోసం వివిధ సంస్థలు ప్రజాసంబంధాలను పెంపొందించుకొనేటట్లు సహాయపడాలి. యువజన సంక్షేమం అభివృద్ధి చెందాలనే దృక్పథం ప్రజలలో కలిగేటట్లుగా కృషిచేయాలి. అప్పుడు ప్రజాసహకారం, ప్రజాసంబంధాలు అధికమవుతాయి.

యువజన సంక్షేమ క్షేత్రంలోను, ప్రజలతో పనిచేసే పద్ధతులలోను అభివృద్ధి చెందుతున్న విజ్ఞానాన్ని అంతర్జాతీయ, జాతీయ, రాష్ట్రీయ స్థాయిలను సేకరించి యువజన సంస్థలను అందించాలి. యువజన సంక్షేమ కార్యక్రమాల నిర్వహణలో ప్రతిదశలలోను సంక్షేమ కార్యకర్త ఎల్లప్పుడూ ప్రోత్సహిస్తూ ఉండాలి.

యువజన సంక్షేమ పథకాలను ప్రయోగాత్మకంగా అమలు జరిపించి ప్రయోజనకారి అయిన వాటిని సర్వత్రా అమలుజరిపేటందుకు

సిఫారసుచేయాలి. వివిధ కార్యక్రమాలను అమలుచేయడంలో యువజన ప్రతినిధులకు, నాయకులకు, కార్యకర్తలకు మార్గదర్శిగా పనిచేయాలి.

యువజన కార్యకర్తలు విద్యావంతులు, అనుభవజ్ఞులు, విజ్ఞానవంతులు అయిఉండాలి. వారు సాంఘిక సంక్షేమంకోసం సమాజంలో అవసరమైన మార్పులను తేవడానికి కృషిచేయాలి. ముఖ్యంగా తాను పనిచేసే సమూహాలలో చర్చలు, ఉపన్యాసాలు, గోష్ఠులు మొదలైన వాటిద్వారా యువజనులను విజ్ఞానవంతులనుచేసి వారు తమ కుటుంబంలోను, ఇతర సమూహాలలోను అనుకూలమైన మార్పులను ప్రవేశపెట్ట గలిగే విధంగా చేయాలి.

వ్యక్తిగత విలువలు, కట్టుబాట్లు, ఆచారాలు మొదలైన విషయాలలో తరతరాలలో అనేక మార్పులు వచ్చాయి. ఈ విధంగా తరాలమధ్య అంతరాలు ఏర్పడుతున్నాయి. రెండుతరాల మధ్యగల వ్యత్యాసాన్ని తగ్గించడానికి సాధ్యమైనంతవరకూ కృషిచేయాలి. ఈ విధంగా చేయడంవల్ల తరాలమధ్య అవగాహన ఏర్పడి సర్దుబాటు చేసుకోడానికి సాధ్యమవుతుంది. దీనివల్ల సమాజంలో వారి సంక్షేమానికి అవకాశాలు అధికమవుతాయి.

## పంచవర్ష ప్రణాళికలు - యువజన సంక్షేమం

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో 1470 యువజన శిబిరాలను నెలకొల్పడం జరిగింది. భారత సేవక్ సమాజ్, నేషనల్ కేడెట్ కోర్ మొదలైన యువజన శిబిరాలను రాష్ట్రప్రభుత్వాలు నిర్వహించడం జరిగింది. ఈ శిబిరాలలో రెండులక్షల విద్యార్థులు దేశం నలుమూలలనుంచి వచ్చి పాల్గొన్నారు. విద్యార్థులు వివిధ సంస్థలకు తమ స్వచ్ఛంద కృషిద్వారా బహిరంగ స్థలాలలో ఆడిటోరియమ్‌లు, స్టేడియమ్‌లు, గ్రంథాలయాలు నిర్మించి నిర్మాణాత్మకమైన కృషి జరిపారు.

రెండో పంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగులైన యువజనులకు ఉద్యోగాలిప్పించడానికి కొంత ధనాన్ని కేటాయించారు. శిక్షణా

పథకాలకు, ఆర్తసంరక్షణకు 41.54 లక్షల రూపాయలు వ్యయం చేశారు. సాముదాయిక, నైతిక, ఆరోగ్య, ఆర్తరక్షణ సేవలకై 77.58 లక్షల రూపాయలు ఖర్చుచేశారు. శిక్షణ పొందిన ఉద్యోగుల కొరతను భర్తీ చేయడానికి 0.44 కోట్ల రూపాయలను ఖర్చుపెట్టి శిక్షణా పథకాలను ప్రారంభించడం జరిగింది.

మూడో పంచవర్ష ప్రణాళికలో సాంఘిక సంక్షేమ ఉద్యోగుల కొరత హెచ్చుగా కనిపించడంవల్ల కేంద్ర, రాష్ట్ర సంక్షేమ సంస్థలు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కలసి అనేక శిక్షణా పథకాలను ఏర్పాటు చేసి అధిక సంఖ్యలో విద్యార్థులకు, సాంఘిక సంక్షేమ ఉద్యోగులకు, స్వచ్ఛంద సంక్షేమ కార్యకర్తలకు శిక్షణ ఇవ్వడం జరిగింది.

మొదటి వార్షిక ప్రణాళికలో వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యాకోర్సుల కోసం 23.73 లక్షల రూపాయలు ఖర్చు పెట్టారు. సామాజిక, నైతిక, ఆరోగ్య, ఆర్తుల సంరక్షణా కార్యక్రమాలకు 7.84 లక్షల రూపాయలు ఖర్చు చేశారు. భారతదేశంలోని నైతిక, సాముదాయిక, ఆరోగ్య సంఘానికి 0.77 లక్షల రూపాయలు ఖర్చు చేశారు.

రెండో వార్షిక ప్రణాళికలో వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యా కోర్సుల కోసం 19.50 లక్షల రూపాయలు వ్యయం చేయడమైంది. ఉద్యోగం చేసుకుంటున్న యువజనులకు రాత్రి వసతుల నిర్మితికై 0.10 లక్షల రూపాయలు ఖర్చు చేయడమైంది. విద్యార్థులు కాని యువజనుల సంక్షేమానికి 37.37 లక్షల రూపాయలు ఖర్చు చేయడమైంది. సాముదాయిక నైతిక, ఆరోగ్య, ఆర్తసంరక్షణా కార్యక్రమాలకు కేంద్ర ప్రభుత్వం వాటా 20.00 లక్షల రూపాయలు ఖర్చు చేశారు.

మూడో వార్షిక ప్రణాళికలో వయోజన స్త్రీలకు సంక్షిప్త విద్యా కోర్సుల కోసం 19 లక్షల రూపాయలు ఖర్చు చేశారు. రాత్రి వసతుల నిర్మితికై 0 10 లక్షల రూపాయలు, విద్యార్థులు కాని యువజనుల సంక్షేమానికై (వృత్తి పూర్వ శిక్షణతో సహా) 36.42 లక్షల రూపాయలు ఖర్చు చేయడమైంది.

నాల్గో పంచవర్ష ప్రణాళికలో కూడా యువజన సంక్షేమ కార్య కలాపాలకు ధనాన్ని కేటాయించడంజరిగింది. కానీ ప్రణాళిక ప్రారంభమై మూడు సంవత్సరాలు పూర్తి కాకుండానే దేశానికి అనుకోని అవాంతరాలు రావడంజరిగింది. బీహార్, ఉత్తరప్రదేశ్ మొదలైన రాష్ట్రాలలో నదులు, పాడిపంటలు పూర్తిగా దెబ్బతిని ప్రజలు భాకీఎత్తున నష్టపడ్డారు. ఒరిస్సా రాష్ట్రంలో మున్నెన్నడూ ఎరుగని ఉప్పెన, తుఫాన్ లువచ్చి విలయతాండవంచేసి రాష్ట్రం యావత్తూ తుడిచిపెట్టుకుని పోయింది. ఆ భీభత్స పరిస్థితులలో లక్షలాది ప్రజలు నిరాశ్రయులుకాగా, వేలమంది చనిపోయినారు. ఆంధ్రప్రదేశ్, తమిళనాడువంటి దక్షిణాదిరా ష్ట్రాలలో కూడా అతివృష్టి, అనావృష్టులు ఫలితంగా పంటలు పాడయినాయి. ఈ విధంగా ప్రకృతిసిద్ధమైన విపత్కర పరిస్థితులేకాకుండా పొరుగు దేశమైన పాకిస్తాన్, తూర్పుబెంగాల్ ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను రూపుమాపి, ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పాలనుకొనే ప్రజల దృఢ సంకల్పాన్ని కాలదన్ని పాకిస్తాన్ సైనిక నియంతలు తూర్పుబెంగాల్ ప్రజానాయకులను బంధించి అమాయక ప్రజల మాన, ప్రాణాలను, మానవత్వం విలువలను మంటకలిపి నిర్దాక్షిణ్యంగా మారణహోమం చేశారు. తత్ఫలితంగా మిగిలిన ప్రజలు ప్రాణ, మాన రక్షణార్థమై లక్షల సంఖ్యలో తండోపతండాలుగా శరణార్థులై భారతదేశంవచ్చి తలదాచుకొన్నారు. వారికి ఆశ్రయమిచ్చి, ఆదుకుని, వారి కనీసావసరాలను తీర్చడానికి భారత ప్రభుత్వం కోట్లకొద్ది ధనాన్ని ఖర్చుపెట్టింది. శరణాగత రక్షణకు మానవతా కారుణ్యవిలువలకు ఆలవాలమైన భారతదేశంమీద 1971వ సంవత్సరం డిసెంబరులో పాకిస్తాన్ యుద్ధ ప్రకటనచేసి భాకీఎత్తున ముందుకువచ్చింది. పాకిస్తాన్‌తో 14 రోజులపాటు భారతవీర జవానులు యుద్ధంచేసి ఘనవిజయాన్ని సాధించారు.

ఈ కారణాలవల్ల భారతదేశ ఆర్థిక, సాంఘిక, పరిస్థితులు కుంటుపడిచాలా అధ్వాన్నస్థితికి దిగజారిపోయినాయి. దీనికితోడు ఇతర దేశాలనుంచి వచ్చే ఆర్థికసహాయం కూడా బాగా సన్నగిల్లిపోయింది. బంగ్లాదేశ్ను సర్వస్వతంత్ర ప్రజాస్వామ్య దేశంగా ప్రపంచ దేశాలన్నీ

గుర్తించాయి. పాకిస్తాన్ సైనిక నియంతల కబంధహస్తాలలో నలిగి మారణహోమమైన బంగ్లాదేశ్ అన్నిరంగాలలోను కోలుకోవడానికి సర్వవిధాలా భారతదేశం భారీఎత్తున ఆర్థిక సహాయం చేయక తప్పలేదు. కాబట్టి నాలుగో పంచవర్ష ప్రణాళికకు అన్నివిధాలా, అన్నివైపుల నుంచీ అవరోధాలు కలిగినాయి. అందువల్ల నాల్గో పంచవర్ష ప్రణాళిక మధ్యంతర నిర్ణయం లేదా పరిశీలన 1971 డిసెంబరు 22 వ తేదీన పార్లమెంట్‌లో ప్రవేశపెట్టారు. గత మూడు సంవత్సరాల కాలంలోను దేశం సాధించిన ప్రగతిని చర్చించారు. మిగిలిన రెండు సంవత్సరాల కాలవ్యవధిలోను వార్షిక ప్రణాళికలను ప్రవేశపెట్టడానికి నిర్ణయించడం జరిగింది.

ఐదో పంచవర్ష ప్రణాళికలో సంక్షేమ కార్యక్రమాలకై కేంద్ర ప్రభుత్వం 63 . 53 కోట్లు, రాష్ట్ర ప్రభుత్వం 22 . 60 కోట్లు రూపాయలను ఖర్చుచేశాయి. ఈ ప్రణాళికలో యువజనుల విద్య, ఆరోగ్యాభివృద్ధి పథకాలకై కొంతధనాన్ని కేటాయించారు.

ఆరో పంచవర్ష ప్రణాళికలో యువజన సంక్షేమానికి కేంద్ర ప్రభుత్వం 69 కోట్లు, రాష్ట్ర ప్రభుత్వం 24 . 54 కోట్లు కేటాయించటం జరిగింది. ప్రణాళికా కాలంలో శారీరకారోగ్య, విద్యాకార్యక్రమాలు, ఆటలు, వినోదం మొదలైన కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. ఈ విధంగా పంచవర్ష ప్రణాళికల ద్వారా ప్రభుత్వం అనేక యువజన సంక్షేమ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

# 5
# వికలాంగుల సంక్షేమం

భారత రాజ్యాంగంలోని ఆదేశక సూత్రాల ననుసరించి భారత దేశం ఒక సంక్షేమ రాజ్యంగా చెప్పడమైంది. 39 వ ప్రకరణం ప్రకారం పౌరులకు కావలసినంతరీతిలో జీవనం గడపటానికి హక్కున్నది. దోపిడి (Exploitation) నుంచి పిల్లలను, యువకులను రక్షించాలి. 41 వ ప్రకరణం ప్రకారం తనకున్న ఆర్థికస్థోమతతో, ప్రగతితో పనిచేసే హక్కు, విద్యాహక్కులను కల్పిస్తూ నిరుద్యోగిత, వృద్ధాప్యం, రుగ్మత అశక్తత (Dirabality) వంటి సమయాలలో రాజ్యం తన సహాయం అందించవలసి ఉంది.

పై రెండు ఆదేశాల ననుసరించి భౌతికంగా వైకల్యం ఉన్నవారు కూడా పౌరులేకాబట్టి వారికి కూడా కావలసిన ప్రమాణంలో జీవించే హక్కున్నది. వారికున్న అశక్తతనుబట్టి తనకున్నలోపం నుంచి రక్షించ టానికి ఉద్యోగం పొందటానికి విద్యనర్థించటానికి తమకు హకుకున్నది. కాబట్టి వికలాంగులకు విద్యగరపడం, ఉద్యోగం కల్పించటం దోపిడి (Exploitation) నుంచి రక్షించటం – వంటి సంక్షేమ కార్యక్రమా లను రాజ్యం చేపట్టాలి.

దేశంలోని వికలాంగుల జనాభా గురించి సరైన లెక్కలు లేనందున సమస్యా పరిమాణం, చేపట్టవలసిన సేవా కార్యక్రమాలు గురించి అవగాహన సరిగాలేదు. దీనికి కారణం వైకల్యానికి సరైన నిర్వచనం లేకపోవడమే. అంధుల, చెవిటి, కుంటివారి పునరావాస చర్య లను తెలియచేసే పరిశోధనలు (Studies) ఇంకా సరిగా లేవు. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ వెల్ఫేర్ (Indian Council of Social Welfare) నిర్వహించిన పరిశోధనలో ఆల్ ఇండియా ఇన్స్టి ట్యూట్ ఆఫ్ ఫిజికల్లీ హేండికేప్డ్ (All India Institute of

Physically Handicapped) లో ఉన్న వికలాంగులు కృత్రిమ అవయవాలను ఎంతవరకు వినియోగిస్తున్నారని ధ్యేయంగా పెట్టుకున్నది.

ఉచితరీతిలో ఉపకారవేతనాలు వికలాంగులకు అందించినా, విద్యాభివృద్ధి తగినంతగా వారిలో కనిపించడంలేదు. ఏదిఏమైనా, ఒక వ్యక్తి విద్యాభివృద్ధి అతని కుటుంబ ఆర్థికపరిస్థితిమీద ఎక్కువగా ఆధారపడి ఉంది.

## అంగవైకల్యం - అర్థం - పునరావాసం

అంగవికలురపై సాంఘిక అభిప్రాయాలు. తత్త్వం ముఖ్యంగా నాలుగు ముఖ్యమైన దశలలో చారిత్రాత్మక దృష్టిలో అవగాహన అవుతాయి.

(అ) బయటపడటం వినాశనం(Exposure and destruction)

(ఆ) రక్షణ (Care and Protection)

(ఇ) శిక్షణ, విద్య (Training and Education)

(ఈ) సాంఘిక నిమగ్నత (Social Absorption)

## అ) బయటపడటం - వినాశనం

ప్రాథమిక సమాజంలో ప్రకృతి సిద్ధంగానే జీవనానికి యోగ్యత ఉన్న (Survival of the fittest) నియమాన్ని అనుసరించి వైకల్యమున్నవారిని తొలగించడం జరుగుతుండేది. ఆదిమజాతులు (Primitive Tribes) భౌతికంగా అశక్తులుగా ఉండే తమ సహచరులను వదిలివేయడం (Discarding Physically unit People) జరుగుతున్నది. ప్రాథమిక జాతులలో వారిని శత్రువులకు, క్రూరమృగాలకు వదిలివేయటం జరుగుతుండేది. ప్రాథమిక సమాజంలో, సమూహం మంచి కోసం అశక్తులు త్యాగం చేయబడుతుండేవారు. ఈ ప్రాథమిక సమాజంలో అలిఖిత చట్టం (unwritten Law) పూర్వీకులు లిఖిత చట్టంగా చాలా శతాబ్దాలవరకు ఉండేది.

## ఆ) రక్షణ (Care and Protection)

పాశ్చాత్య దేశాలలోని క్రైస్తవ నియమాలు (Christian ideals) తూర్పు దేశాలలోని బౌద్ధ సిద్ధాంతాలవల్ల (Buddhist doctrines) ఈ ఆచారం క్రమంగా విడిచిపెట్టడమైంది. ఈ రెండు మతాలు భౌతిక అంగవైకల్యం ఉన్నవారితో సహా సౌకర్యాలను అందుకోలేని ప్రజలందరకు, మానవ సౌభ్రాతృత్వంతోను, బలహీను లను రక్షించవలసిన బాధ్యత బలవంతులపై ఉన్నదని అందువల్ల వారికి రక్షణ కల్పించవలసి ఉన్నదని తెలుసుకోవటం జరిగింది.

మానసికంగాను, దృష్టిపరంగాను, భౌతికంగాను అంగవైకల్య మున్నవారికి రక్షణ కల్పించటంలో, క్రైస్తవ సముదాయం శ్రద్ధ వహించింది. అయినప్పటికిని వారు సమాజంలో సమాజ స్థానంలో ఎప్పుడూ ఆదరించబడలేదు.

## ఇ) శిక్షణ, విద్య (Training and Education)

13 వ శతాబ్ద ప్రవేశంతో, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వ భావాలకు ఎక్కువగా విలువఇవ్వడం జరిగింది. సామూహిక అవసరాన్ని (Collective interest) వ్యక్తి హక్కులు అధిగమించాయి. కొంత మంది విజ్ఞులైన ఆలోచనాపరులు (eminent thinkers) విషాద పూరిత వికలాంగులవైపు దృష్టిని మరల్చారు. పర్యవసానంగా అనేక సంస్థలు (Institutions) ఉద్భవించాయి. అదే సమయంలో అంగ వైకల్యాలకు సంబంధించిన వ్యాధులను నయం చేయటంలో వైద్య శాస్త్రం కూడా గణనీయమైన ప్రగతిని సాధించింది. ఆ విధంగా అంగ వైకల్యంపై సాంఘిక వైఖరి(Social Attitude)సాంఘిక బాధ్యతగా మారింది.

## ఈ) సాంఘిక నిమగ్నత (Social Absorption)

19 వ శతాబ్దాంతంలో వికలాంగుల వృత్తి సమస్యలు ప్రజల దృష్టిని ఆకర్షించటం ప్రారంభించింది. 20 వ శతాబ్దం ప్రారంభంలో

కొన్ని అభ్యుదయం పొందిన దేశాలలో (Progressive Countries) కొన్ని చట్టాలు చేయడంకూడా జరిగింది. అనేక ఇతర కారకాలుకూడా వికలాంగుల అవసరాలను ప్రజలు గుర్తించేటట్లు చేయటం జరిగింది. ఈ సమస్య పరిమాణంలో పెరుగుదల, పారిశ్రామిక సమాజాభివృద్ధి, విశ్వాంతర నిర్బంధ ప్రాథమిక విద్య (Universal Compulsory Elementary Education) ప్రజాస్వామిక సంస్థలు ఉద్భవించటం (Rise of Democratic Institutions) మొదలైన కారకాలవల్ల కూడా ప్రజలు వికలాంగుల అవసరాలను గుర్తించటం జరిగింది. ఒకటో ప్రపంచ యుద్ధం "పునరావాసం" అనే పదానికి సరియైన అర్థం చేకూర్చింది. తరవాత మానవ సమాజం ఆ సవాలును తీసుకున్నది. వారికి ఆహారం, ఆశ్రయం, వస్త్రాలు అందించడమే కాకుండా తదితర సదుపాయాలను కూడా అందించడానికి కృషి సల్పుతున్నది. రెండో ప్రపంచ యుద్ధానంతరం పునరావాసం అనేక తూర్పు, పశ్చిమ దేశాలలో మద్దతు సంపాదించింది. ఐక్యరాజ్యసమితి సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో దానిని కలపడంతో నిస్సందేహంగా, సంఘంలో దానికి సరియైన స్థానమిచ్చినట్లు అయింది.

## భౌతిక వైకల్యాలకు కారణాలు

(i) వంశపారంపర్యం :-

ఆనువంశిక జీనుల పనితీరులో వచ్చిన కలతలవల్ల, వంశపారంపర్య దోషం (Hereditary Defect) అనేది ఒక తరం నుంచి ఇంకొక తరానికి సంక్రమిస్తుంది.

(ii) పుట్టుకలో వచ్చిన లోపాలు (Congenital Defects)

పుట్టుక సమయంలో వచ్చిన లోపాలను (Congenital Defects) అంటారు. అన్ని పుట్టుకలోపాలు వంశపారంపర్యంగా రావు. పుట్టుకతో వచ్చే లోపాలకు మెటర్నల్ మాల్‌న్యూట్రిషన్ (Maternal Malnutrition) మెటర్నల్ ఇన్‌ఫెక్షన్ (Maternal Infection),

Rh కారకప్రవ్యాధి, X కిరణాలు, రసాయనిక కారకాలు (Chemical Agents), తల్లి గ్రాంధిక అవ్యవస్థిత (Mother's Glandular Disorganisation) గర్భంలో పిండం (Foetus) అసాధారణస్థానం వంటి యాంత్రిక కారకాలు – కారణాలుగా చెప్పుకోవచ్చు.

(iii) ఆర్జిత లోపాలు (Acquired Defects)

పుట్టుక గాయాలు (పుట్టుక కష్టమైనప్పుడు), వ్యాధిగ్రస్త పరిస్థితులు జబ్బులు అంటే కోరింతదగ్గు (Whooping Cough), తట్టమ్మవారు (Measles), సింధూర వర్ణ జ్వరం (Scarlet Fever), మెనింజైటిస్ (Meaningitis) ఎన్‌సఫలైటిస్ (Encephalitis) ఎముకలలో కీళ్ళలో క్షయ (Poliomyelitis) వంటి వ్యాధులవల్ల ఈ లోపాలు ఆర్జితమవుతాయి (సంక్రమిస్తాయి).

(iv) ప్రమాదాలు

చాలా పాశ్చాత్య దేశాలలో శాశ్వత అశక్తత పారిశ్రామిక రహదారి ప్రమాదాలవల్ల సంభవిస్తుంది. ఇవి యుద్ధ ప్రమాదాలకన్న మించి ఉంటాయి. ఇవి సాధారణంగా పారిశ్రామిక రద్దీ (Traffic) కింద పడటం, అగ్నిప్రమాదాలవల్ల సంభవిస్తాయి.

(v) పోషకాహార లోటుపాట్లు

పోషకాహార లోటుపాట్లవల్ల వ్యాధి నిరోధక శక్తి తగ్గుతుంది. ఇది అశక్తతకు దారి తీస్తుంది.

(vi) లోపభూయిష్ట ధోరణులు (Defective Postures)

చెడ్డధోరణి లేక స్థితి (Bad Pasture) అశక్తతకు కారణమని చాలా తక్కువమంది గుర్తిస్తారు. తక్కువతీరు (Poor Pasture)అనేది సామాన్య బలహీనతవల్ల, పోషకాహార లోటువల్ల, పని అలసటవల్ల (fatigue) పునరావృతమయ్యే దీర్ఘకాలిక వ్యాధులవల్ల (Repeated and prolonged Infection) వస్తుంది.

(vii) యుద్ధ పర్యవసానాలు (Consequences of War)

పాశ్చాత్య దేశాలలో యుద్ధమనేది, యుద్ధవీరులకే కాకుండా మాన్య పౌరులకుకూడా శాశ్వత అశక్తతకు ఏకైక కారణం.

iii) పేదరకం

అజ్ఞానం, వ్యాధి, పోషకాహారం లేకుండటంతో బాటు పేదరికం. శక్తతకు దారితీసే భయంకరమైన కారకం. అశక్తత మరల పేదరికానికి దారితీస్తుంది.

(ix) ఇతర కారణాలుగా నిరక్షరాస్యతవల్ల కలిగే అజ్ఞానం, వైద్యసిబ్బంది కొరత, ప్రారంభదశలోనే చికిత్స పొందటానికి సదుపాయాలు లేకపోవడం విధి (fate) ని నమ్ముకొని ఉండిపోవడం మొదలైనవాటిని పేర్కొనవచ్చు.

భౌతిక వైకల్యం ఉన్నవారిని ముఖ్యంగా రెండు భాగాలుగా విడదీయవచ్చు.

(i) జ్ఞానాంగ వైకల్యం (Sensorily Handicapped).

(ii) కుంటివారు (Orthopaedically Handicapped).

సవివరమైన వర్గీకరణాన్ని ఈ క్రింది విధంగా పొందుపరచవచ్చు.

(i) దృష్టివైకల్యం కలవారు లేదా గ్రుడ్డివారు.

(ii) వినికిడి వైకల్యం కలవారు లేదా చెవిటివారు.

(iii) భాష వైకల్యం కలవారు లేదా మూగవారు.

(iv) కుంటివారు (orthopaedically handicapped or crippled)

## అశక్తతను నిర్వచించడం (Defining Disability)

భౌతిక అశక్తత జైవిక పరిమితులను (biological limitations) విద్య, వృత్తి, సాంఘిక అంతఃక్రియలు (Social interaction) లతో పరిమితులను తెలియజేస్తుంది.

దీనిని ఈ క్రింది విధంగా నిర్వచించవచ్చు.

## అ) భౌతిక ప్రకార్యాలు (Physical functions)

వ్యాధి, గాయాలి లేదా అనువంశికత – కారణం ఏదైనా. భౌతిక అశక్తత. భౌతిక ప్రకార్యాలలో పరిమితులకు దారితీస్తుంది. ఇది నడిచే అంగాలపైగాని, జ్ఞానాంగాలపైగాని, లేక ప్రత్యేకఅంగాలపై గాని తన ప్రభావాన్ని కలగజేస్తుంది.

## ఆ) వృత్తిపరమైనది (Vocational)

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పునరావాస చట్టం 1954, ఒక భౌతిక అశక్తుణ్ణి ఈ క్రింది విధంగా నిర్వచిస్తుంది. ఉద్యోగితకు ఎంతో అవరోధం కలిగించే భౌతిక లేక మానసిక అశక్తతతో ఉన్న వాడు మరియు పునరావాస సౌకర్యాలద్వారా యోగ్యత గలవానిని-ఆదాయాన్నిచ్చే వృత్తిని చేపట్టడానికి "భౌతిక అశక్తుడుగా"గా నిర్వచించింది.

## ఇ) సాంఘికమైనది (Social)

Dr. Kessler ననుసరించి భౌతిక అశక్తత అనేది వైద్యశాస్త్ర, మానవశాస్త్ర సంబంధమైంది. (Anthropological) అనేకన్నా సాంఘికమైంది, ఆర్థికపరమైనది. ఇది సమాజంలో వృత్తి స్థితిగతులను నిర్వచిస్తుంది. భౌతిక లోపమున్నవారు బహిర్గతంగాగాని, అంతర్గతంగా గాని, పనిచేయటానికి, భౌతికశక్తి పరిమితమైపోతుంది. అనుకూల సాంఘిక వైఖరి కలుగజేస్తుంది.

## ఈ) విద్యాసంబంధమైనది

తన భౌతిక స్థితి సాంఘిక, వినోద (Recreational) విద్య వృత్తిపరమైన బాల్యదశ కార్యక్రమాలలో పూర్తిగా పాల్గొనకుండా చేసేటట్లు ఉంటే అట్లాంటి బాలుని వికలాంగుడిగా చెప్పవచ్చు.

## ఒక వ్యక్తిపైన, సమాజంపైన భౌతిక అశక్తత ప్రభావం

(1) ప్రభావిత క్షేత్రాలు (Areas Affected)

కుంటి వ్యాధులు, ప్రమాదాల ప్రభావం, రోగలక్షణ శాస్త్రానికి మాత్రమే పరిమితమైనవికావు. (The effects of Crippling diseare

or Accident are seldom, if ever Confined to the Pathological Condition alone) అనేకమందిలో ఇది వారి మానసిక విద్యా సాంఘిక వృత్తిపరమైన రంగాలలో కూడా తన ప్రభావాన్ని కలిగిస్తుంది.

(a) భౌతికమైనది

ప్రతీ కుంటి అశక్తత (Crippling Disability) చలన సామర్థ్య నష్టాన్నిగాని అందులో పరిమితినిగాని కలగజేస్తుంది. (Locomotor abilities lass) కొంతమంది విషయంలో ఇది కొంతవరకు తగ్గించబడినా లేక పూర్తిగా నయం చేయబడినా చాలామంది విషయంలో నిర్మాణాత్మక క్రియాత్మక లోపాలు శాశ్వతంగా ఉండిపోతున్నాయి. వైద్యశాస్త్రం ఎంత పురోగతిలోవున్నా ఇది తప్పటం లేదు. మిగిలిన వనరులను ఉపయోగించుకొని అభివృద్ధి చెందడమే ఏకైక ప్రత్యామ్నాయం.

(b) మానసికమైనది (Psychological)

కొద్దిగా సిమ్న భావం కలిగిఉండటం తప్పించుకొని తిరగటం (escapism) అత్యధిక మందత (extreme depression), అత్యధిక క్రోధం (over agression) లు. ఈ మానసిక కలతలు (Psychological disturbances) అంగవైకల్యంవల్ల ప్రత్యక్షంగా రావచ్చు లేదా సాంఘిక వైఖరుల (Social auitudes) వల్ల పరోక్షంగా రావచ్చు.

(c) సాంఘికమైనది (Social)

అశక్తత వ్యక్తిని సాంఘికంగాను అతని గృహాసంతోషాన్ని కూడా దోచివేస్తుంది. సామాజిక అంతఃక్రియలలో అతని పరిమితులు ఏర్పడతాయి. ఇంట్లో అతని అశక్తతను అశక్తతలా కాకుండా ఎక్కువగా రక్షణ కల్పించడంగాని, పూర్తిగా నిర్లక్ష్యం చేయటంగాని చేస్తుంటారు. పునరావాసంలో, ప్రజలకు, తల్లిదండ్రులకు సరియైన అవగాహన కలిగించటం చాలా అవసరం.

(d) విద్యాసంబంధమైనది (Educational)

వికలాంగులు విద్యలో వెనకబడటానికి కారణం మేధస్సు సంబంధమైనది. కాదుకాని అనుభవం లేకపోవడమే. ప్రస్తుతంఉన్న విద్యాసౌకర్యాలు, చాలామంది వికలాంగులు ఉపయోగించుకొనే స్థితిలో లేరు. వారికి ప్రత్యేక పరికరాలు బోధనా పద్ధతులు అందించాలి.

(e) వృత్తిపరమైనది (Vocational)

ప్రత్యేక సౌకర్యం కల్పిస్తే తప్ప వికలాంగులకు ఉద్యోగం సంపాదించటానికిగాని, నిర్వహించటానికిగాని కష్టమనేది మనకు అనుభవ పూర్వకంగా తెలుస్తున్నది. యజమానుల సహకార్మికుల సముదాయం, సహాయ నిరాకరణవైఖరి (unhelpful attitudes) వారి ఉద్యోగ అవకాశాలను పరిమితం చేస్తున్నాయి.

## పునరావాసం (Rehabilitation)

పునరావాసం అంటే వికలాంగులు భౌతికంగా, మానసికంగా, సాంఘికంగా, వృత్తిపరంగా, ఆర్థికంగా యధాసామర్థ్యాన్ని తిరిగి పొందటం. సంపూర్ణమైన కుటుంబ జీవితం, సంపూర్ణమైన ఉద్యోగి జీవితం గడపగలిగిన స్థితికి వికలాంగులు చేరుకొన్ననాడే వికలాంగుల పునరావాసం సంపూర్ణమైనట్టు పరిగణించబడుతుంది. పునరావాస ధ్యేయ మేమంటే వికలాంగులకు తన అశక్తత ఆటంకం కలిగించని సరియైన ఉద్యోగాన్ని కల్పించటమే పునరావాసంలో అశక్తతను వీలైనంత కనిష్ఠ స్థాయికి తగ్గించటం ఆ వ్యక్తి తన సంపూర్ణ సామర్థ్యం మేరకు పని చేసుకొనేటట్లు నివసించేటట్టు సౌకర్యాలు కల్పించటం అశక్తత నిరోధం అశక్త పరిస్థితులను ఆదిలోనే చక్కదిద్దటం మొదలైనవి చేపట్టవలసిన కార్యక్రమాయి.

పునరావాసాన్ని బట్టి వికలాంగులను ఈ కింది విధంగా విభజించ వచ్చు.

[i] శాశ్వత ఉద్యోగితను సంపాదించటానికిగాని, సామాన్య జీవితాన్ని గడపటానికిగాని ప్రత్యేక సహాయం అవసరంలేని అశక్తతలు ఉన్నవారు.

వైద్య, మనోవిజ్ఞాన చికిత్స (Medical andPsychia-
ient) వృత్తికి సంబంధించిన సలహాలు, వృత్తిని కల్పించే
ocational Counselling and Placement) మరియు
క్తి సేవా పద్ధతి, సమూహ సేవాపద్ధతి వంటి ప్రత్యేక సహా
యాన్యులతో లేదా సాధారణ ప్రజలతో ఉద్యోగానికి పోటీ
అశక్తులున్నవారు.

సాధారణ ప్రజలతో ఉద్యోగవిషయంలో ఎప్పుడూ పోటీ
తిలో ఉండి, ప్రత్యేకమైన ఆశ్రమముండే పనిస్థలాన్నిగాని
workshops) ప్రత్యేక సదుపాయాలను కల్పించవలసిన
న్నవారు.

యస్సులో ఉండే భౌతికంగా అశక్తులయిన వికలాంగులకు,
ర్మిక విపణిలో ఉన్న వేతనరేట్ల కనుగుణంగా, వారికున్న
బట్టి వారికి ఉద్యోగాలను కల్పించాలనటం – పునరావాస
ంటువంటి కార్యక్రమాలు, ఈ క్రింద పొందుపరచినవాటిలో
వి అన్నిటినిగాని కలిగి ఉండాలి.

వైద్యపరీక్ష
వైద్యపునరావాసం
ప్రోస్థరీక్స్ (Prostheries)
వృత్తిశిక్షణ (Vocational Training)
వృత్తికి సంబంధించిన సలహాలు (Vocational Coun-
selling)
తాత్కాలిక కాలపరిమితులలో ఆశ్రయమిచ్చే పని
స్థలాలలో (workshops) శిక్షణనిచ్చే సౌకర్యం.
] జీవితం గడపటానికి, ఇతర అవసరాలు తీర్చుకోవటానికి
ధనసహాయం చేయటం.
i] ఉద్యోగం కల్పించడం.
సాంఘిక వ్యక్తిసేవా కార్యక్రమాలు.

## వయోజనపాత్ర

ఉద్యోగం, పెళ్ళి, పితృత్వం - వయోజనుడుగా ప్రతీ వికలాంగుడు పోషించవలసిన పాత్రలు. అటువంటి అభివృద్ధి వికలాంగుని తన మీద తను ఆధారపడి ఉండటం మరియు ఆత్మప్రేరణ (Self actualisation) మీద ఆధారపడి ఉంటుంది. ఈ విషయంలో తల్లి దండ్రుల ప్రేరణ కూడా అవసరం.

వికలాంగుని స్వయం శక్తి అంటే వైకల్య పరిమాణం (extent of handicap) అతని మేధాశక్తి అతని భావన సాంఘిక పరిపూర్ణతలు పునరావాస ధ్యేయం సాధించటానికి చాలా ముఖ్యమైనవి.

అవకాశాలు లభించడం కూడా చాలా ముఖ్యమైన అంశమే. వికలాంగుడు సంపన్న కుటుంబంలో పుట్టినా లేదా వైద్య, విద్య పునరావాస సౌకర్యాలు అతని కుటుంబం నివసిస్తుండే ప్రాంతానికి అందుబాటులో ఉన్నా వికలాంగుడి పునరావాసం వీలుకలుగుతుంది.

## వికలాంగుల సంక్షేమంలో కేంద్ర సాంఘిక సంక్షేమ మండలి (C. S. W. B) యొక్క పాత్ర

20 వ శతాబ్దం ప్రారంభంలోనే సాంఘిక సంక్షేమ మండలి (C.S.W.B.) వికలాంగుల సంక్షేమ కార్యక్రమాలకు పునాది వేసింది. అంధులు, చెవిటివారు, మూగవారు, కుంటివారు, మానసిక వైకల్యమున్నవారు వీరంతా కూడా అప్పటివరకు నిర్లక్ష్యపరచబడ్డారు. C S.W.B. ఈ సంక్షేమ కార్యక్రమాలను చేపట్టేనాటికి బహుశా ఏ స్థాయిలోనూ ఏ రాష్ట్రశాఖగాని, కేంద్రశాఖగాని వీరి సంక్షేమం చేపట్టలేదని చెప్పవచ్చు. C.S.W.B. ఆ విధంగా చేపట్టడానికి పండిత జవహర్‌లాల్ మొట్టమొదటి ఛైర్‌మన్ శ్రీమతి దుర్గాభాయిదేశ్‌ముఖ్ కృషి, శ్రీమతి ఇందిరాగాంధీగారి సన్నిహితతత్వం మరియు జీవితాలను అంకితం చేసిన సంఘ సంక్షేమ కార్యకర్తలు కృషి సల్పడమే కారణం గడచిన 3 దశాబ్దాలలో C.S.W.B. వికలాంగులకు సహాయపడే అనేక స్వచ్ఛంద సేవా సంస్థలకు తమ సహాయ సహకారాలను అందించింది.

రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా మండలాల ద్వారాను
ా స్వచ్ఛంద సేవాసంస్థల దేశ, రాష్ట్ర, జిల్లా స్థాయిలలో
ాజానికి వికలాంగుల సమస్య గురించి అవగాహన కలిగిం
ర్జాతీయ వికలాంగుల సంవత్సరంలో (International
isabled Persons, 1981) C.S.W.B. ఇంకా అధిక
ంది.

ఐక్యరాజ్యసమితి సిద్ధాంతాన్ని నమ్మితే[U.N. Theory]
10 శాతం జనాభా వికలాంగులుగా ఉన్నారని మనకు
పథకాలు వేసేవారికి [Planners] పరిపాలకులకు, సంఘ
ార్యకర్తలకు, సాంఘిక శాస్త్రవేత్తలకు, వికలాంగులకు
వివరాలు సరిగా తెలియనందున, సమస్య పరిమాణాన్ని
యలేకపోతున్నారు.

## ంనం కల్పించటం

W B సాంఘిక, ఆర్థిక కార్యక్రమంలో స్థాపించబడిన
[1953] నుంచి వికలాంగులకోసం సాంఘిక, ఆర్థిక కేంద్రా
ల్పటంకోసం అనేక స్వచ్ఛంద సేవాసంస్థలకు ఎంతో
స్తూ వస్తుంది. ఈ కేంద్రాలన్నీ కూడా రెడీమేడ్ బట్టలు,
[gloves] నోట్సు, కాగితాలు మొదలైనవి. అప్పడాలు
యడం, వడ్రంగిపని, అచ్చువేసేపని, సబ్బులతయారీ. రైకీ
డపటం మొదలైన పనులను చేపడుతున్నాయి. 1965 నుంచి
వికలాంగులు ఈ కార్యక్రమాలవల్ల లాభం పొందుతున్నారు.
ఘిక ఆర్థిక కేంద్రాలలో వికలాంగులకు ఉద్యోగాలు కూడా
.

స్తుతానికి 3,000 కు పైగా సాంఘిక ఆర్థిక కేంద్రాలు మన
ముూలలా నెలకొల్పబడి ఉన్నవి. ఇవన్నీ కేంద్ర సాంఘిక
సండలి ఆధ్వర్యవంలో, వికలాంగులకు ఎంతో ఉపాధిని
్నయి.

## సామాజిక సమైక్యత (Social intigration)

సామాజిక సమైక్యతను ప్రోత్సహించటానికి, అనేక సెలవుదిన గృహ శిబిరాలను [Holiday-home-camps] నిర్వహించాలని నిశ్చయించింది. రోగం కుదిరిన తరవాతకూడా కుష్ఠువారిని సంఘం ఆమోదించటం లేదు. అందుకని వారికి ఆశ్రయ ఉపాధి స్థలం [Sheltered-workshops] నెలకొల్పటానికి బోర్డు నిశ్చయించింది.

కేంద్ర సాంఘిక సంక్షేమ మండలి, తన సిబ్బంది నియామకంలో 3 శాతం ఉద్యోగాలను వికలాంగులకు కేటాయించింది. అంతేకాకుండా రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా మండలిలోను కూడా ఆ విధంగా నియమించాలని ఆదేశాలు చేయటం జరిగింది.

1980 సెప్టెంబరు నెలలో జరిగిన రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా మండలుల సమావేశంలో చేసిన సిఫార్సులమేరకు C S W B కృత్రిమ అవయవాల కొనుగోలుకు వికలాంగులకు సబ్సిడీనికూడా ఇవ్వాలని నిశ్చయించింది.

మనదేశంలో మన సాంఘిక అనువంశికత [Social heritage] సంస్కృతుల ననుసరించి, అనేక దేశస్థాయి, రాష్ట్రస్థాయి స్వచ్ఛంద సేవా సంస్థలు అశక్తుల విద్య, వృత్తిశిక్షణ, ఆర్థిక పునరావాసం వంటి విషయాలలో గుర్తించదగ్గ రీతిలో సేవా కార్యక్రమాలను చేపడుతున్నాయి. అటువంటివాటిలో బొంబాయి నగరంలో ఉన్న [Fellowship for the Handicapped]సంస్థను, అదేనగరంలో ఉన్న నేషనల్ అసోసియేషన్ ఫర్ ది బ్లైండ్ [National Association for the Blind] సంస్థను అలహాబాదు నగరంలో ఉన్న రోటరీ స్పాన్సర్డ్ రిహాబిలిటేషన్ సెంటర్ ఫర్ ది క్రిపుల్డ్ [Rotary Sponsored Rehabilitation Centre for the Crippled], ఆలిండియా ఫెడరేషన్ ఆఫ్ ది డెఫ్ [All India Federation for the Deaf] నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ది మెంటల్లీ రిటార్డెడ్ [National Federation of the Mentally Retarded]అనే సంస్థలను చెప్పుకోవచ్చు.

1978-79 లో 120 స్వచ్ఛంద సేవాసంస్థలకు రూ. 9 మిలియన్లు. 1980-81 లో 114 స్వచ్ఛంద సేవా సంస్థలకు రూ. 112 లక్షలు కేంద్ర సహాయం వికలాంగుల సంక్షేమార్థం C.S.W.B. మంజూరు చేసింది.

వికలాంగుల కోసం ప్రభుత్వం కూడా ఎన్నో ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహిస్తుంది.

## 1. సంయుక్త విద్యా ప్రణాళిక

ప్రత్యేక పాఠశాలలలో అంగవికలురైన బాలురు విద్య నభ్యసించేటప్పుడు తాము మిగతా వారి నుంచి విడదీయబడ్డాం – అనే భావనకు లోనవడం, సమాజంలో ఇతరులతో కలిసిమెలిసి తిరగలేకపోవడం జరుగుతోంది. ఈ పద్ధతిమారిపోయి వారూ సమాజంలో ఒక భాగమని తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో సంయుక్త విద్యాప్రణాళికను ప్రవేశపెట్టడం జరిగింది. ఈ ప్రణాళిక ప్రకారం అంగవికలురు, అంగవైకల్యం లేనివారు ఒకేచోట కలసిమెలసి విద్య నభ్యసించటం, ఆటపాటలలో పాల్గొనటం జరుగుతుంది. దానివల్ల ఒకరిపట్ల మరొకరికి సదవగాహన పెరగడం అంగవికలురలో ఆత్మవిశ్వాసం పెంపొందడం, వారి శక్తి సామర్థ్యాలు వారికే అర్థంకావడం కనిపించింది. అంతమాత్రాన ప్రత్యేక విద్యాలయాలను తీసివేయరు. మామూలు పాఠశాలలలో ఇమడలేరనుకున్న వికలాంగులకు అక్కడే విద్యా సౌకర్యాలు కల్పిస్తారు. 1978 నాటికి ఈ ప్రణాళికను ఆంధ్రప్రదేశ్, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్, కేరళ, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్, తమిళనాడు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలోను కేంద్రపాలిత ప్రాంతం ఢిల్లీలోను అమలుపరుస్తున్నారు. ఇందుకై రాష్ట్రాలకయ్యే ఖర్చునంతటిని కేంద్రమే భరిస్తుంది. 1984 అంతర్జాతీయ వికలాంగుల సంవత్సరం (International Year of the Disabaled / Handicapped) లో 50 శాతానికి బదులు 100 శాతము కేంద్ర సహాయం రాష్ట్రాలకు కేంద్రపాలిత ప్రాంతాలకు అందివ్వబడుతుంది.

## సామాజిక సమైక్యత (Social intigration)

సామాజిక సమైక్యతను ప్రోత్సహించటానికి, అనేక సెలవుదిన గృహ శిబిరాలను [Holiday-home-camps] నిర్వహించాలని నిశ్చయించింది. రోగం కుదిరిన తరవాతకూడా కుష్ఠువారిని సంఘం ఆమోదించటం లేదు. అందుకని వారికి ఆశ్రయ ఉపాధి స్థలం [Sheltered-workshops] నెలకొల్పటానికి బోర్డు నిశ్చయించింది.

కేంద్ర సాంఘిక సంక్షేమ మండలి, తన సిబ్బంది నియామకంలో 3 శాతం ఉద్యోగాలను వికలాంగులకు కేటాయించింది. అంతేకాకుండా రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా మండలిలోను కూడా ఆ విధంగా నియమించాలని ఆదేశాలు చేయటం జరిగింది.

1980 సెప్టెంబరు నెలలో జరిగిన రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా మండలుల సమావేశంలో చేసిన సిఫార్సులమేరకు C S W B కృత్రిమ అవయవాల కొనుగోలుకు వికలాంగులకు సబ్సిడీనికూడా ఇవ్వాలని నిశ్చయించింది.

మనదేశంలో మన సాంఘిక ఆనువంశికత [Social heritage] సంస్కృతుల ననుసరించి, అనేక దేశస్థాయి, రాష్ట్రస్థాయి స్వచ్ఛంద సేవా సంస్థలు అశక్తుల విద్య, వృత్తిశిక్షణ, ఆర్థిక పునరావాసం వంటి విషయాలలో గుర్తించదగ్గ రీతిలో సేవా కార్యక్రమాలను చేపడుతున్నాయి. అటువంటివాటిలో బొంబాయి నగరంలో ఉన్న [Fellowship for the Handicapped]సంస్థను, అదేనగరంలో ఉన్న నేషనల్ అసోసియేషన్ ఫర్ ది బ్లైండ్ [National Association for the Blind] సంస్థను అలహాబాదు నగరంలో ఉన్న రోటరీ స్పాన్సర్డ్ రిహాబిలిటేషన్ సెంటర్ ఫర్ ది క్రిపుల్డ్ [Rotary Sponsored Rehabilitation Centre for the Crippled], ఆలిండియా ఫెడరేషన్ ఆఫ్ ది డెఫ్ [All India Federation for the Deaf] నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ది మెంటల్లీ రిటార్డెడ్ [National Federation of the Mentally Retarded]అనే సంస్థలను చెప్పుకోవచ్చు.

...6 120 స్వచ్ఛంద సేవాసంస్థలకు రూ॥ 9 మిలియన్లు,
4 స్వచ్ఛంద సేవా సంస్థలకు రూ॥ 112 లక్షలు ధన
...ల సంక్షేమార్థం C.S.W.B. మంజూరుచేసింది.

... కోసం ప్రభుత్వం కూడా ఎన్నో ప్రత్యేక కార్యక్ర
...స్తుంది.

## విద్యా ప్రణాళిక

...త శాలలలో అంగవికలురైన బాలురు విద్య నభ్య
...సం మిగతా వారి నుంచి విడదీయబడ్డాం - అనే భావ
...సమాజంలో ఇతరులతో కలిసిమెలిసి తిరగలేకపోవడం
పద్ధతిమారిపోయి వారూ సమాజంలో ఒక భాగమని
ఉద్దేశ్యంతో సంయుక్త విద్యాప్రణాళికను ప్రవేశ
ఈ ప్రణాళిక ప్రకారం అంగవికలురు, అంగవైకల్యం
...లు కలిసిమెలిసి విద్య నభ్యసించటం, ఆటపాటలలో
...తుంది. దానివల్ల ఒకరిపట్ల మరొకరికి సదవగాహన
...లురలో ఆత్మవిశ్వాసం పెంపొందడం, వారి శక్తి
...కే అర్థంకావడం కనిపించింది. అంతమాత్రాన ప్రత్యేక
...తేసివేయరు. మామూలు పాఠశాలలలో ఇమడలేరను
...ను అక్కడే విద్యా సౌకర్యాలు కల్పిస్తారు. 1978
...ను ఆంధ్రప్రదేశ్, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్,
9, ఒరిస్సా, రాజస్థాన్, తమిళనాడు, ఉత్తరప్రదేశ్
...ంద్రపాలిత ప్రాంతం ఢిల్లీలోను అమలుపరుస్తున్నారు.
...క వ్యయ ఖర్చునంతటిని కేంద్రమే భరిస్తుంది. 1984
...ంగుల సంవత్సరం (International Year of the
andicapped) లో 50 శాతానికి బదులు 100
సహాయం రాష్ట్రాలకు కేంద్రపాలిత ప్రాంతాలకు

## 2. ఉపకార వేతనాలు

విద్యారంగంలో సామాన్య, సాంకేతిక, వృత్తి విద్యలను అర్హత గల అంధ, చెవిటి, కుంటి బాలురకు ప్రభుత్వం ఉపకార వేతనాలు మంజూరు చేసింది. ఈ కార్యక్రమం మొదటి పంచవర్ష ప్రణాళికలో 50 ఉపకార వేతనాలతో ప్రారంభమయింది. ఇప్పుడు సంవత్సరానికి 6,500 ఉపకార వేతనాలను ఇస్తున్నారు.

1975 లో 14 నుంచి 40 సంవత్సరాల వయోపరిమితిలో ఉన్న భౌతిక వికలాంగులకు పారిశ్రామిక లేక వాణిజ్య సంస్థలలో శిక్షణకోసం నియమిస్తే, వారికి స్టైఫండు (Stipend) ఇవ్వడం కూడా ప్రారంభించారు. కరస్పాండెన్సు కోర్సులు చదివేవారికి కూడా ఉపకార వేతనాలు ఆమోదించటం జరిగింది. 1977-78 లో 4,400 వికలాంగుల ఉపకార వేతనాలు ప్రభుత్వం మంజూరు చేసింది. 1981 లో 8,900 ఉపకార వేతనాలను ఇవ్వడం జరిగింది.

## వికలాంగులకు ప్రత్యేక ఉపాధికల్పనా కేంద్రాలు

వీటిని 1959 లో ప్రారంభించారు. 1979 నాటికి 17 ప్రత్యేక ఉపాధికల్పనా కేంద్రాలు స్థాపించారు. 1979 నాటికి 17,317 మందికి ఉపాధి సౌకర్యాలు కల్పించడం జరిగింది. సాధారణ ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిలలో ప్రత్యేక ఎంప్లాయిమెంటు అధికారులను వికలాంగుల కోసం నియమిస్తున్నారు.

## రాష్ట్రాలలో వికలాంగులకు 3 శాతం ఉద్యోగాల రిజర్వేషన్లు

20 జనవరి 1981 వ తేదీన జరిగిన సాంఘిక సంక్షేమ మంత్రుల సమావేశంలో ప్రభుత్వోద్యోగాలలో 3 శాతం ఉద్యోగాలు వికలాంగులకు కేటాయించాలని, వికలాంగుల సంక్షేమ కార్యక్రమాలు చేపట్టటానికి సమన్వయపరచడానికి ప్రతీ రాష్ట్రంలోను వికలాంగుల కమిషన్‌ను నియమించాలని నిర్ణయించారు. ఆర్థికంగా వెనుకబడిన వికలాంగులకు,

వికలాంగులకు పనికివచ్చే పరికరాలను ఉచితంగా సరఫరా చేయాలని కూడా నిర్ణయించారు.

## వికలాంగులకు పూర్తిగా వేతనాలు

కార్మిక మంత్రి యన్. డి. తివారి, 4-5-1981 వ తేదీన కార్మిక మంత్రిత్వశాఖ కమిటీచే వికలాంగులైన శ్రామికులకు 100 శాతం (ఇదివరకటి 75 శాతానికి బదులు) వేతనాలివ్వడానికి నిర్ణయించడమైంది. అని తెలియజేశారు. గనుల పరిశ్రమ (mining Industry) లో 16 శాతం జీతాలు పెంచినట్లుకూడా తెలియజేశారు. ఇది 16 పరిశ్రమలకు వర్తిస్తుంది. 1981 అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో ఇండియన్ ఎయిర్ ఫోర్స్‌వారు మొత్తం 41 మంది వికలాంగులకు ఉద్యోగం ఇచ్చినట్టుగా తెలియజేసింది. అందులో 10 మంది అంధులు, 16 మంది కుంటివారు (orthopaedically handicapped) 15 మంది చెవిటి వారు.

## జాతీయ బహుమతులు

వికలాంగులకు ఉపాధిని ప్రోత్సహించడానికి ప్రతీ సంవత్సరం ప్రతిభావంతులైన వికలాంగులకు అధికంగా అవకాశాలిచ్చిన యజమానులకు భారత రాష్ట్రపతి జాతీయ బహుమతులుకూడా ఇస్తున్నారు.

## మోటారు వాహనాల ఇంధనం ఖర్చు

మోటారు వాహనాలను ఉపయోగించుకునే వికలాంగులకు 50 శాతం ఇంధనం ఖర్చును కూడా ప్రభుత్వంవారు ఇస్తున్నారు. ఇది వారి కదలికను ప్రోత్సహిస్తున్నది.

## అంతర్జాతీయ వికలాంగుల సంవత్సరం (1981) (International year of the Disabled (1981)

1981 న అంతర్జాతీయ వికలాంగుల సంవత్సరాన్ని పురస్కరించుకొని ఒక జాతీయ సంఘాన్ని కేంద్ర ప్రభుత్వం కేంద్ర సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో ఏర్పాటుచేసింది. ఇందుకు అనుబంధంలో కొన్ని కార్యనిర్వాహక సంఘాలుకూడా నెలకొల్పబడ్డాయి. కేంద్ర కార్మిక

శాఖకు సంబంధించిన ఇటువంటి ఒక సంఘం వికలాంగుల సంక్షేమాన్ని పురస్కరించుకొని కొన్ని సిఫార్సులను చేసింది. అందుకు అనుబంధంగా వారికోసం ప్రత్యేక ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిలను స్థాపించడం, ఫ్యాక్టరీలలోను, బయట ఉపాధి కల్పించే కార్యక్రమాలు ముమ్మరంగా చేపట్టడం జరుగుతున్నది.

## తదితర కార్యక్రమాలు

1. ప్రభుత్వ యంత్రాంగంలోని గ్రూపు "C" మరియు "D" ఉద్యోగాలలో 3 శాతం ఉద్యోగాలు ఖచ్చితంగా వికలాంగుల కోసం ప్రత్యేకించటం.
2. 18 రాష్ట్రాల ప్రభుత్వాలలో 1 నుంచి 4 శాతం ఉద్యోగాలు వీరి కోసం రిజర్వు చేయడం.
3. ప్రతీ మంత్రిత్వ శాఖలో ఒక సమన్వయ అధికారి ఈ విషయాన్ని పరిశీలించటం.
4. వృత్తి విద్యా సంస్థలలో వికలాంగులను ఎక్కువ సంఖ్యలో చేర్చుకోవడం.
5. ప్రత్యేక ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్‌లు తమ పనిని త్వరితగతిని చేపట్టడం.
6. గ్రూపు "ఎ", "బి" సర్వీసులలో కూడా పనిచేయగల స్థానాలను వికలాంగులకు కేటాయించటం.
7. వికలాంగులను ఏదో ఒక సాకుతో ఉద్యోగంలో చేరకుండా చేసే యత్నాలను రూపుమాపటం.
8. కుర్చీలకు, సోఫాలకు బెత్తం అల్లడం మొదలైన పనులు కేవలం వికలాంగుల ద్వారానే జరిగేటట్టు చూడటం.
9. గుడ్డివారుగా నమోదు అయిన ప్రతీ వ్యక్తికి 1981 ముగిసేలోగా ఉద్యోగం కల్పించడం.
10. వృత్తి విద్యలో నైపుణ్యాం కలిగించేటందుకు ప్రత్యేకంగా కృషి సలిపేందుకు అహమ్మదాబాదు, మద్రాసు, బెంగుళూరులలో వృత్తి విద్యా కేంద్రాలు తెరవడం.

ప్రభుత్వం స్వచ్ఛంద సేవా సంస్థలు, సంఘ సేవా కార్యకర్తలు అంగవికలుర సరియైన జనాభా వారి నిజ జీవన పరిస్థితులకు సంబంధించిన విషయాలను సరిగా సేకరించి, వారి సర్వతోముఖాభివృద్ధికి కృషి చేయవలసిన అవసరం ఇంకా చాలా ఉంది.

# వికలాంగుల సంక్షేమం

అంధుల సంక్షేమ కార్యక్రమం

మతాల ప్రభావంవల్లనే భారతదేశంలో సంక్షేమసేవా కార్యక్రమాలు మొదలైనవి. పూర్వం గ్రుడ్డివారికి, చెవిటివారికి ఆశ్రయం కల్పిస్తుండేవారు. అందులో వారికి నివాసం, భోజనం, బట్టలు వంటి సదుపాయాలు కల్పించేవారు. మొట్టమొదట అంధగృహాలు(Homes for the Blind) అశోకుని కాలంలో ఏర్పాటుచేయడం గమనార్హం. తరవాత భ్రాతృత్వ దృక్పథంతో వికలాంగులకు కూడా సామాన్య మానవునివలె జీవించేహక్కు ఉన్నదని గుర్తించేటంతవరకు ప్రజలు పరివర్తన చెందారు.

ప్రపంచంలోని అంధులలో మూడోవంతు మించి మనదేశంలోనే ఉన్నారు. దేశంలోని ప్రతి రెండు వందల మందిలో ముగ్గురు అంధులు ఉన్నారు. ప్రతీ 209 మందిలో 15 మందికి ఏదోరకమైన దృష్టిలోపం ఉంది. ఈ అంధులలో 60 . 80 శాతం మందిని చికిత్సద్వారా బాగు పరచవచ్చు. ఈ కళ్ళ వ్యాధులలో కేటరాక్ట్, ట్రాకోమా అన్నవి అతి విస్తృతంగా ఉన్న వ్యాధులు. పోషక ఆహారం లోపించడమే అనేక సందర్భాలలో అంధత్వానికి కారణం దేశంలో అంధులుగా ఉన్న పిల్లలలో 250 వేలమందికి పోషక ఆహారం లోపంవల్లనే అంధత్వం వచ్చింది. దృష్టి సక్రమంగా ఉండాలంటే విటమిన్ "ఎ" సమృద్ధిగా ఉండాలి. అంగబలం కావడానికి ఈ అంధత్వం ప్రధానకారణమవుతున్నది.

## అంధత్వం నిర్వచనం

1. సామాన్య జీవిత కార్యాలు చేయటానికిగాని, చదవడానికిగాని దృష్టికి క్రియాత్మక విలువ లేకపోతే, అటువంటి మనిషిని "గ్రుడ్డి వాడు"గా మనం వ్యవహరిస్తాం.

2. ఈ కింద పేర్కొన్న పరిస్థితులలో ఏదో ఒక స్థితినుంచి బాధపడే వారిని "అంధులు" అంటారు.

(i) దృష్టి పూర్తిగా లేకపోవటం.

(ii) దృష్టికార్యం (Visual Activity) సరిదిద్దే కటకంలో 6/60 లేదా 20/200 ఉత్తమమైన నేత్రంలో మించకుండటం.

1944 లో సమర్పించిన భారతదేశంలో ఉన్న గ్రుడ్డివారిపై నివేదికను(Report of Blindness in India) ననుసరించి గుడ్డివాడిని ఈ కింద విధంగా నిర్వచించారు.

"ఒక గజం దూరంలో విస్తరింపజేసిన హస్తం వ్రేళ్ళను లెక్క పెట్టలేని వాడు గ్రుడ్డివాడు" ("A person is blind who cannot count the fingures of an out stretched hand held at a yard's distance")

కాని ఈ నిర్వచనం చాలా సంకుచితమైంది. 1944 లో సమర్పించిన నివేదిక ప్రతి లక్షమందికి 5 వేలు మంది గ్రుడ్డివారు ఉన్నట్లు తెలియజేసింది.

## పాక్షిక అంధత్వం (Partial sight)

అత్యుత్తమైనాధమైన సరిదిద్దటం తరవాత ఒక మంచి నేత్రంలో దృష్టికార్యం (Visual Activity) 20/200 లకి 70/200 (Small) కి మధ్య ఉండటం.

## అంధత్వం - కారణాలు

1944 గ్రుడ్డివారిపైన నివేదిక ననుసరించి, అంధత్వానికి ఈ కింది పేర్కొన్న కారణాలు దారితీస్తాయి.

1. కార్నియా, కంజంటివేల అంటువ్యాధుల వల్ల.
2. కెటరాక్ట్ మరియు గ్లాకోమా.
3. సరియైన పోషకాహారం తీసుకోకపోవటం.
4. సుఖ వ్యాధులు.
5. భూత వైద్యుల లేదా నాటువైద్యుల హానికరమైన చర్యలు.
6. మశూచి.
7. సరియైన కాంతి లేకపోవడం, పుస్తకాల ముద్రణ సరిగా లేకపోవటం వల్ల వచ్చే దృష్టి పరిణామాలు.

## విద్య, శిక్షణ

1887 సంవత్సరంలో స్థాపించిన అమృత్‌సర్‌లోని అంధుల పాఠశాల (School for the Blind) తో మన దేశంలో అంధుల విద్య, శిక్షణ విషయంలో సమీకృత కృషి మొదలైనది. ఈ పాఠశాలను తరువాత రాజ్‌కపూర్, డెహరాడూన్‌లకు మార్చారు. అంధ బాలికలు ఉన్న తక్కువ పాఠశాలలలో ఇది ఒకటి. కిందటి శతాబ్దానికి ముందు తాలమ్-కోట్టా (Talam-Cottah) లో ఒక పాఠశాల కలకత్తా అంధ పాఠశాలలను స్థాపించారు. ఈ శతాబ్దం ప్రారంభంలో దాదర్ పాఠశాల (Dadar School for the Blind) మరియు విక్టోరియా మెమోరియల్ స్కూల్‌ను (Victoria Memorial School for the Blind) స్థాపించారు.

అంధుల కోసం దేశమంతటా శిక్షణ పాఠశాలలు 250 కి పైబడి ఉన్నాయి. డెహరాడూన్‌లో ఉన్న సంస్థ నేషనల్ ఇన్స్టిట్యూట్ ఫర్ ది విజువల్లీ హాండికాప్డ్ (National Institute for the Visully Handcapped) అనే పేరుతో జాతీయ సంస్థగా మార్చారు.

బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు నగరాలలో ఉన్న నాలుగు ఉపాధ్యాయ శిక్షణా కేంద్రాలు సంవత్సరానికి 40 నుండి 50 వరకు అంధ ఉపాధ్యాయులకు శిక్షణ ఇస్తుంది.

డెహరాడూన్‌లో ఉన్న అంధులకోసం జాతీయ కేంద్రం (National Centre for the Blind) సమగ్ర సేవా కార్యక్రమాలను అందిస్తున్నది. దీనిలో అంధ బాలురకోసం ఒక నమూనా ఉన్నత పాఠశాల, అంధులైన పెద్దవారికి ఒక శిక్షణా కేంద్రం, పాక్షికదృష్టి ఉన్న పిల్లలకు ఒక పాఠశాల, బ్రెయిలీ పరికరాలు (Braillie Appliances) తయారుచేయడానికి ఒక వర్కు-షాపు, బ్రెయిల్ అచ్చు కేంద్రాలు ఉన్నాయి. అంధుల జాతీయ గ్రంథాలయం (National library for the blind)కూడా అనుబంధమై ఉన్నది. ఇది దేశంలో బ్రెయిలీ లిటరేచరును అందిస్తున్నది.

## బ్రెయిలి - కోడ్ తయారీ

1949 సంవత్సరంలో భారత ప్రభుత్వాన్ని UNESCO అంతర్జాతీయ ఉపయోగానికై బ్రెయిల్ కోడ్‌ను తయారుచేయమని ప్రతిపాదించారు. UNESCO సమ్మతించి కృషిసల్పిన తరవాత అంతర్జాతీయ బ్రెయిల్ కోడ్ రూపొందింది.

భారతదేశంలో కూడా ఇండియన్ బ్రెయిల్ ఎక్స్‌పర్ట్ కమిటీ కృషిచేసి భారతీయ భాషలన్నింటికి సరిపడేలా ఒక ఉమ్మడి బ్రెయిల్ కోడ్‌ను యునెస్కో మార్గదర్శక సూత్రాలను అనుసరించి రూపొందించింది.

అంధ సంక్షేమం ముఖ్యోద్దేశం ఏమంటే ఆర్థిక స్వాతంత్ర్యం సముపార్జించుకొనేలా అంధులకు శిక్షణ ఇవ్వటమే సాధారణంగా అంధులు ఈ కింద పేర్కొన్న వృత్తులను చేపట్టగలరు.

1. వృత్తులు (Professions)

సంగీతం, సంపాదకత్వం, న్యాయవాదవృత్తి, వ్యాపార నిర్వహణ వంటి వృత్తులను అంధులు స్వయంగా చేపట్టగలరు.

౨. గృహ పరిశ్రమలు

బట్టల నేత (Weaving) కుర్చీల అల్లిక (Chair Caning) బుట్టలు తయారు చేయటం, అల్లిక (Knitting), కాగితాలతో సంచుల తయారీ వంటి వాటిలో వీరికి శిక్షణ ఇవ్వవచ్చు.

3. కర్మాగారాలలో ఉపాధి (Factory Employment)

పునరావృత కార్యాలు (Repetitive Operations) ఉండే పనులు కర్మాగారాలలో అంధులు చేపట్టగలరు.

4. అంధులు – కేంద్ర ఆరోగ్యమండలి సిఫార్సులు

దేశంలో సుమారు 2,50,000 మంది బాలలు అంధులు. దేశం మొత్తంమీద అమలు చేసేందుకు రూపొందించిన కార్యక్రమంలో కింది అంశాలకు విశేష ప్రాముఖ్యతని ఇవ్వాలని కేంద్ర ఆరోగ్యమండలి సిఫార్సు చేసింది.

[i] గ్రామీణ ప్రాంతాలన్నింటిలోను ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటం, సంచార కంటి, వైద్య విభాగాలను ఏర్పాటుచేసి తాలూకా, జిల్లా స్థాయిలలో ఉండే ప్రత్యేక కంటి వైద్య కేంద్రాలను నెలకొల్పడం.

[ii] అంధత్వ నివారణ గురించి కంటి జాగ్రత్తకు సంబంధించి సమాచారాన్ని పాఠశాలకు వెళ్ళే విద్యార్థులకు, వెళ్ళనున్న శాలలకు వీలైనంత ఎక్కువగా తెలియజేయడం.

[iii] కంటి రక్షణకు తీసుకొనే జాగ్రత్తలు, అందుకు అవసరమైన పోషక ఆహారం గురించి వీలైనంత ఎక్కువమంది ఉపాధ్యాయులు సంక్షేమ కార్యకర్తలు సంఘంలో నాయకులతో బోధన తరగతులు నిర్వహించడం.

[iv] కంటి రోగులకు వీలైనంత తక్కువ వ్యవధిలో చికిత్సచేసి వ్యాధులు నయం అయ్యేటట్లు చేయటానికి కంటి వైద్య సౌకర్యాలను మెరుగుపరచడం.

## ప్రపంచ సమస్య

ప్రపంచ దేశాల అంధుల మొట్టమొదటి సమావేశం 1978 సంవత్సరంలో నవంబరు 23 నుంచి 25 వరకు న్యూఢిల్లీలో జరిగింది.

ఈ సమావేశంలో 11 దేశాల నుంచి 20 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. అంధుల పురోభివృద్ధికి, బాగోగులకు సంబంధించిన అనేక విషయాలను ఈ ప్రతినిధులు చర్చించారు.

## చెవిటి - మూగవారి సంక్షేమం

పూర్వం భారత దేశంలో చెవిటివారిని శాపగ్రస్తులుగా భావిస్తుండే వారు. కాని నేడు భారతదేశంలో చెవిటివారిని శాపగ్రస్తులుగా భావిస్తుండేవారు. కాని నేడు వీరిగురించి ప్రజలలో ఎంతో అవగాహన పెరిగింది. ఈ క్రింద ప్రమాణీకృత నిర్వచనాన్ని (standard definition) అమెరికా సంయుక్త రాష్ట్రాలు (U. S. A) అంగీకరించడం జరిగింది.

1. "జీవితంలోని సామాన్య విషయాలను తెలుసుకోవటానికి వినికిడి జ్ఞానేంద్రియం పనిచేయకుండా ఉండే వ్యక్తులను చెవిటివారు అంటారు."

The deaf are those in whom the sense of learning is non-functional for the ordinary purposes of life.

2. జీవితంలో చెవిటితనం ఉన్నవారు విస్తరించిన భాష (Amplified speech)ను అన్ని సందర్భాలలోను వినలేరు. అవగాహన చేసుకోలేరు. ఈ తరగతిలో ఉన్నవారిలో మంచిచెవిలో 90 డెసీబుల్లు (90 Decibles) కంటే ఎక్కువగా వినికిడి నష్టాన్ని కలిగి ఉంటారు.

## పాక్షిక చెవిటితనం (Partial hearing)

పాక్షిక చెవిటితనం ఉన్నవారు ఈ కింది పరిస్థితులలో ఏదో ఒక దానిని కలిగిఉంటారు.

| తరగతి | వినికిడి కార్యం |
|---|---|
| 1. మైల్డ్ ఇంపేయిర్ మెంట్ | ఒక మంచి చెవిలో 80 ను మించి 45 కంటే తక్కువ డెసీబుల్స్ లోపించటం. |

| | |
|---|---|
| 2. సీరియస్ ఇంపేయిర్ మెంట్ | ఒక మంచి చెవిలో 45 కంటే ఎక్కువ 60 కంటే తక్కువ డెసిబుల్స్ ఉండటం. |
| 3. సివియర్ ఇంపేయిర్ మెంట్ | ఒక మంచిచెవిలో 60 కంటే ఎక్కువ 90 కంటే తక్కువ డెసిబుల్స్ ఉండటం. |

## మూగతనం నిర్వచనం (Speech impairment)

ప్రసంగం లోపభూయిష్టంగా ఉండి, ఇతరుల భాషనుండి ప్రక్కకు మళ్ళుతూ, భాషాప్రసారంలో ప్రమేయాన్ని కలిగిస్తూ అది కలిగిఉన్న వాడిని స్వభావాలు చేసుకోలేనివాడిగా తయారుచేస్తుంది.

ప్రపంచంలో 7 కోట్లమంది చెవిటివారు లేక మూగవారు ఉన్నారు. అందులో 3.3 కోట్లమంది మనదేశంలో ఉన్నట్లు అంచనాలు తెలుపుతున్నాయి.

## చెవిటితనానికి నిదర్శనాలు

1. ఒటైటిక్స్ మీడియా (Otitics Media)
2. సెప్టిక్ టాన్సిల్స్ (Septic tonsils)
3. తీవ్రమైన అంటువ్యాధులు (Acute infectious disease)
4. ఎడినాయిడ్స్ (Adenoids)
5. క్రోనిక్ సైనోసైటిస్ (Cronic Shinositics)
6. పోషకాహార లోపం (Malnurrition)
7. ఎరప్టివ్ ఫీవర్స్ (Eruptive feavers)
8. సెరిబ్రో స్పైనల్ మీనంజైటిస్ (Cerebro - Spinal Menimgitis)
9. మశూచి (Smalll Pox)
10. పుట్టుకతో వచ్చిన సిఫిలిస్ (Congenital Syphils)
11. మలేరియా (Maleria)
12. మంప్స్ (Mumps)

## విద్య, శిక్షణ

చెవిటివారి చరిత్ర మన దేశంలో 1884 సంవత్సరంలో బొంబాయి లోని మెజగాన్‌లోని బొంబే ఇన్‌స్టిట్యూట్ ఫర్ ది డెఫ్ అండ్ మ్యూట్ (Bombay Institute for the Deaf and Mute) సంస్థను స్థాపించడంతో మొదలైంది. అత్యుత్తమ పాఠశాలలో ఒకటైన అతి పెద్దదైన కలకత్తా డెఫ్ అండ్ డంబ్ పాఠశాలను (Calcutta Deaf and Dumb School) ను 1893 లో స్థాపించారు. తరువాత 1896 లో పలామ్ కొట్టా (Palam Kotta) లో చర్చ్ ఆఫ్ ఇంగ్లాండ్ (Church of England) జనానా మిషన్ స్కూల్ (Zenana Mission School) ను స్థాపించారు. 1904 కు 1918 కి మధ్యకాలంలో 7 పాఠశాలలను స్థాపించారు. ఇందులో 6 పాఠశాలలు కలకత్తా డఫ్ అండ్ డంబ్ స్కూల్ తాలూకా పాత విద్యార్థులు నెలకొల్పారు.

1985 లో చెవిటివారికి ఉపాధ్యాయుల సంఘం (Convention of the Teachers of the Deaf) భారత దేశంలో ఏర్పడడంకూడా గమనార్హం.

హైదరాబాద్ నగరంలో చెవిటివారు అయిన పెద్దవారికి ఒక శిక్షణా కేంద్రం (Training Centre for the Adult Deaf) ఉన్నది. ఈ శిక్షణ కేంద్రంలో కుట్టుపని, షీట్ మెటల్ పని, గ్యాస్ వెల్డింగ్‌లతో శిక్షణ, ఎలక్ట్రికల్ వైరింగ్ వడ్రంగిపనిలో శిక్షణ గడుపుతున్నారు. పాక్షికంగా చెవుడు ఉన్నవారికి ఒక పాఠశాలనుకూడా నెలకొల్పారు.

## చెవిటి బాలుర సమస్యలు

చెవిటి, మూగ బాలురకు ముఖ్యంగా రెండు సమస్యలు ఉంటాయి.

1. మాట్లాడే శక్తిని పొందటం
   (Acquisition of the power of speech)
2. మాట్లాడే భాషను గ్రహించగలిగేటట్లు అలవర్చుకోవటం
   (Adoption of a suitable under standing of the spoken Language)

వీరికి ప్రత్యేక రీతిలో శిక్షణ నివ్వటం ద్వారా వీరు మాట్లాడటం మాట్లాడే భాషను గ్రహించటం చేయగలరు. ఒక సగటు చెవిటి బాలుడు ప్రాథమికోన్నత స్థాయికి రావటానికి 8 నుంచి 10 సంవత్సరాల కాలం పడుతుంది. విద్యాప్రణాళిక మామూలు బాలురకు ఉన్నట్లు ఉంటుంది. అయితే శ్రామిక వృత్తులలో శిక్షణకూడా ఇవ్వడం జరుగుతుంది. కొంతమంది పిల్లలు వినికిడి యంత్రాలను (Hearing Aids) ధరించడం ద్వారా ఆ లోటును భర్తీ చేసుకోగలరు.

## చెవిటి లేదా మూగవారి పునరావాసం

సాధారణ ప్రజలు చేసే వృత్తులన్నీ చెవిటివారు లేదా మూగవారు చేపట్టగలరు. అయితే విశిష్టీకరణం చెందిన వృత్తులను చేపట్టడం వారికి కొంతవరకు కష్టం. పర్యవసానంగా చెవిటివారిలో అధిక సంఖ్యాకులు శారీరక వృత్తులను (Manual Occupation) చేపడుతుంటారు. చెవిటితనం రకరకాల వయసులో రావచ్చు. అయితే చాలామందికి 20-40 సంవత్సరాల మధ్య వస్తుంటుంది.

## కుంటివారి సంక్షేమం (Welfare of the crippled)

మనిషికి అంగవైకల్యం సంభవిస్తే ఇక ఆ వ్యక్తి విద్యకు అనర్హుడని అనుకోవడం ఒకనాటి మాట. కాని ఆధునిక శాస్త్రపరిజ్ఞానం ఆ నమ్మకాన్ని త్రోసి రాజంటుంది. పూర్వం భారతదేశంలో కుంటితనం గురించి కొంత సదవగాహన పెరిగింది.

## కుంటితనం - నిర్వచనం

అస్థుల, కండరాల, కీళ్ళ పనిచేసే ప్రక్రియలో ప్రతిబంధకం (Interference) కలుగజేసే భౌతిక లోపాన్నిగాని, వైకల్యాన్నిగాని (Physical defect or deformity) కుంటితనం అంటారు.

## కుంటితనానికి కారణాలు

1. పుట్టుకతోవచ్చే వైకల్యాలు (Congenital deformities)
2. రికెట్లు (Rickets)
3. సెరిబ్రల్ పాల్సీ (Cerebral Polsy)

4. పోలియో మైలిటిస్ (Polio Myelitis / other forms of a Paralysis)
5. పక్షవాతపు తదితర రూపాలు (other forms of a Paralysis)
6. కీళ్ళలోను, అస్తులలోను వచ్చే క్షయ (Tuberculosis in bones and Jaints)
7. అర్థ్రైటిస్ (Orthritis)
8. ప్రమాదాలు (Accidents)

చాలాకాలం క్రితంనుంచి కుంటివారు ప్రపంచంలో ఉంటున్నారు. అయితే కుంటివారి సమస్యల పరిష్కారానికి ఒక్కొ-దేశం ఒక్కొ రకంగా కృషిచేస్తున్నది. స్పార్టానులు (Spartans) కుంటివారిని కొండ అగ్రభాగానికి తీసుకొనిపోయి విసిరేస్తుండేవారు. అలాచేస్తే కుంటివారు ఉండరు. వారి సమస్యా ఉండదని వారి భావన. రోమనులు, ఎథేని యన్లు కుంటివారికి ఏదైనా వ్యాధి సోకేటట్లుచేసి అంతమొందిస్తుండే వారు. అయితే అహింసా సిద్ధాంతాన్ని నమ్మిన మనం ఆ విధంగా చేయలేం. అయితే ఇదివరకు "కుంటివారు దేశానికి నిరుపయోగులు" అనే భావన మాత్రం అన్ని దేశాలవారికి నమ్మికగా ఉండేది. కానీ నేడు శాస్త్రీయ పరిజ్ఞానం ఆ నమ్మికను మార్చివేసింది.

## కుంటివారి చికిత్స (Treatment of Crippled)

19 వ శతాబ్దం ప్రారంభం నుంచి వైద్యులు, దాతలు (Philathropists) కుంటివారికి జీవించే అవకాశమిద్దామని తలపోసి, సాధారణ ఆసుపత్రులలో అంతర్గత రోగులుగానో, బహిర్గత రోగులు గానో (In-Patients or out Patients) వారికి చికిత్సనిస్తుండేవారు. అయితే దీనివల్ల పెద్ద ఫలితంలేక పోయింది.

రెండు ప్రపంచ యుద్ధాల తరవాత గాయపడిన సైనికులకు చికిత్స: చేసిన అనుభవంతో పుట్టుకతోగాని, ప్రమాదాలవల్లగాని వైకల్యం ఏర్పడే సాధారణ ప్రజలను సైతం చికిత్స నందించటం ప్రారంభించారు.

ఇండియాలో 1914 కు ముందు అస్థిశాస్త్రం అంతగా వెలుగు లోకి రాలేదు. ఐరోపాలోవలె ఒకటవ ప్రపంచ యుద్ధ అనంతరం భారతదేశంలో ఇది బ్రిటిన్, అమెరికాల ఆర్థోపీడిక్ అసోసియేషన్ గుర్తింపును సంపాదించింది. డా॥ ఎమ్.కె. కిని (Dr. M.K. Kini) భారతదేశ అస్థిశాస్త్రపిత (Father of Orthopedics in India)గా గుర్తించవచ్చు.

1947 వరకు ప్రత్యేకంగాగాని, సామూహింగాగాని కుంటివారి విద్య విషయంలోను, చికిత్స విషయంలోను పునరావాస విషయంలోను ఏ ప్రభుత్వ సంస్థలుగాని, ప్రైవేటు సంస్థలుగాని తమ దృష్టిని సారింత లేదు. సామాన్య ఆసుపత్రులు, సామాన్య వైద్యులు ఆర్థోపీడిక్ సర్జన్లు వారికి వీలైనంతమేరకు చికిత్స చేపడుతుండేవారు. తీవ్రత ఎక్కువగా ఉన్న కేసులను వారి కర్మానికి వదిలిపెట్టేస్తుండేవారు.

"పునరావాసం" రెండవ ప్రపంచ యుద్ధానంతరమే మన దేశంలో చేపట్టారు. పునరావాస శాఖలగురించి ఆలోచన యుద్ధానంతరం ఎక్కువ మంది వికలాంగులవడంతో వచ్చింది. దానికై ఆంగ్ల ఫిజియోథెరపిస్టు లను తీసుకువచ్చారు. వీరు అత్యవసర పరిస్థితులను ఎదుర్కొని నర్సింగు ఆర్డర్లీలకు త్వరగా శిక్షణనిచ్చి అమెరికన్ ఫిజియోథెరపీ ఎయిడ్‌లను అమలులో పెట్టారు. రోచాంప్టన్ (Rochampton) శిక్షణ పొందిన నిపుణుల పర్యవేక్షణలో అక్యుపేషనల్ థెరపీ శాఖలను (Ocuapational therapy departments) పూనాలో ఒక కృత్రిమ అవయవా లను తయారుచేసే కేంద్రాన్ని నెలకొల్పారు. యుద్ధానంతరం రెండు సంవత్సరాల తరవాత సైనికదళం వాటినన్నిటిని మరల రద్దుచేసింది. కాని 1947 లో సొసైటీ ఫర్ ది హాబిలిటేషన్ ఆఫ్ క్రిపుల్డ్ చిల్డ్రెన్ (Society for the Rehabilitation of Crippled Children — S.R.C.C.) ని నెలకొల్పడంతో పునరుజ్జీవనం పొందింది.

S. R. C. C. దినదినాభివృద్ధిచెంది బొంబాయి నగరంలో ఒక మంచి ప్రాంతంలో 50 పడకల ఆసుపత్రిని స్థాపించి ప్రభుత్వానికి, ప్రజలకు కుంటివారి చికిత్స ప్రాముఖ్యతను తెలియజేసింది. దీనిప్రాబల్యం

వల్ల బొంబాయి మద్రాసు, కలకత్తా నగరాలలో ఉన్న పెద్ద పెద్ద ఆసుపత్రులలో ఫిజియో - థెరపీ డిపార్టుమెంటులను ప్రారంభించారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ (W. H. O.) ఆధ్వర్యంలో బొంబాయిలోని, కె.ఈ.ఎమ్. ఆసుపత్రి ఫిజియో-థెరపీ పాఠశాలను నడిపింది. ఇందులోని అక్యుపేషనల్ థెరపీని శ్రీమతి కమలా నింబకర్ నిర్వహించారు. హైదరాబాద్‌లో సాలార్‌జంగ్ ఆసుపత్రి ఆధ్వర్యంలో ఒక పోలియో క్లినిక్ ప్రారంభించారు. ఢిల్లీ, కలకత్తా నగరాలలో కుంటివారి సంక్షేమార్థం సంఘాలు (Societies for the welfare of Crippled) కూడా ఏర్పడినవి.

కాన్పూరులోని ఆర్టిఫిషియల్ లింబ్స్ మాన్యుఫాక్చరింగు కార్పొరేషన్, పూనాలోని ఆర్టిఫిషియల్ లింబ్స్ సెంటర్, దేశంలోని వివిధ ఆసుపత్రులలోని ఆర్థోపీడిక్ విభాగాలు అంగవికలురకోసం రకరకాల కృత్రిమ అవయవాలను తయారుచేసి వారి వారి పనిపాటలలోని అడ్డంకులను తొలగిస్తున్నారు. కాన్పూరులోని కృత్రియ అవయవాల సంస్థకు అనుగుణంగా, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్రోస్థెటిక్ అండ్ ఆర్థోటిక్ ట్రైనింగ్ (National Institute of Prosthotic and Orthotic Training) వారు పునరావాస పద్ధతులను మెరుగు పరుస్తున్నారు.

కుంటివారి పునరావాసం ముఖ్యంగా నాలుగురకాలుగా చేయాలి.

1. నిరోధకచర్యలు (Prevention & early Discovery)
2. చికిత్స (Treatment)
3. విద్య (Education)
4. సరియైన ఉపాధికల్పన (After care & Suitable Employment)

## మానసిక వికలాంగుల సంక్షేమం (Welfare of Mentally Handicapped)

మానసిక వైకల్యం లేదా బుద్ధిమాంద్యం (Mental Retardation) అనేది కొంతమంది పిల్లలకు పుట్టుకతోనే ఉంటుంది. మరి

కొంతమంది పిల్లలలో ఎదుగుతున్న వయసులో సంభవిస్తుంది. జబ్బుల వల్ల ఈ బుద్ధిమాంద్యం ఏర్పడుతుంది. బాల్యంనుంచి ఈరకం పిల్లలలో తెలివి తేటలు చాలాతక్కువగా ఉంటాయి. వీరిలో మానసిక పెరుగుదల చాలా నెమ్మదిగా, అసంపూర్తిగా ఉంటుంది. చదువు సంధ్యలు ఎక్కువగా నేర్చుకోలేరు. సాంఘిక జీవనంలో సర్దుబాట్లు అలవరచుకోలేరు. భారత దేశంలో సుమారు 10 మిలియన్ల మంది బుద్ధిమాంద్యం గలవారున్నారని అంచనా.

## బుద్ధిమాంద్యం నిర్వచనం (Definition of Mental Retardation)

అభివృద్ధి కాలంలో ఉద్భవించే అధమ సగటు సామాన్య మేధస్సు ప్రక్రితాను (Sub-average general intellectual functioning) బుద్ధిమాంద్యం (Mental Retardation) అంటారు. ఇది ఇది అలవర్చుకొనే ప్రవర్తనలో చెరచటంలో కలసి ఉంటుంది.

## బుద్ధిమాంద్యతలకు గల కారణాలు

1. మాతృగర్భంలో ఉన్న శిశువుకు సంభవించే కొన్ని దుష్టపరిణామాల వల్ల సున్నితమైన శిశువు మెదడు భాగాలు దెబ్బతిని తీవ్రమైన బుద్ధిమాంద్యం ఏర్పడుతుంది.

   గర్భిణీ స్త్రీలకు సంభవించే జర్మన్ మీజల్స్ టాక్సో ప్లాస్మోసిస్ (Jarman Mijals, Taxo Plasmosis) మొదలయిన అంటువ్యాధులు సిఫిలిస్ మొదలైన సుఖవ్యాధులు ఇందుకు ఉదాహరణ.

2. గర్భిణీ స్త్రీలు ఎక్కువగా ధూమపానం చేయటంవల్ల పుట్టబోయే బిడ్డలో బుద్ధిమాంద్యం ఏర్పడవచ్చు.
3. స్త్రీ గర్భందాల్చిన తరువాత X - రేలు ఎక్కువగా తీయడంవల్ల క్వైనైన్, సెలిసలెట్సు (Qunine, Selisalets) మొదలైన మందులు సేవించడంవల్ల పుట్టబోయేశిశువుకు బుద్ధిమాంద్యం సంభవించవచ్చు.

4. జన్మ సంబంధమైన జబ్బులు, క్రోమోజోమ్‌లలో దుష్పరిణామాలు గర్భిణీ స్త్రీలలో పోషకాహార లోపం - ఇతర ముఖ్యమైన కారణాలు.

5. కాన్పు సమయంలో సంభవించే కొన్ని దోషాలవల్లకూడా బిడ్డలు శాశ్వతంగా బుద్ధిమాంద్యులైపోయే అవకాశాలు ఉన్నాయి. నెలలు నిండకుండా శిశువు జన్మించినా, బిడ్డపుట్టాక బరువు 2,500 గ్రాముల కంటే ఎక్కువగా ఉన్నాకూడా బుద్ధిమాంద్యం సంభవించే అవకాశాలు ఉన్నాయి. ప్రసవ సమయంలో బిడ్డకు సరిగా శ్వాస అవకపోతే మెదడులో సున్నితమైన నరాలు తీవ్రంగా దెబ్బతినే అవకాశం ఉంది.

6. పుట్టిన బిడ్డకు గ్లూకోజ్ తగిన శాతం లేకపోతే మెదడు నరాలు (Hypoglycemia) దెబ్బతినవచ్చు.

7. బిడ్డకు త్వరగా పాలివ్వకపోనడంవల్ల దుష్పరిణామాలు సంభవిస్తాయి. మనదేశంలో చాలామంది తల్లులు బిడ్డలకు మూడోరోజు వచ్చేవరకు పాలు పట్టరు. ఇది చాలా తప్పు. ప్రసవమైన 12 గంటల లోపుగానే బిడ్డకు చనుపాలివ్వడం మంచిది.

8. కష్టమైన కాన్పు ఫార్‌సేప్స్ డెలివరీ, సిజేరియన్ సెక్షన్ ఆపరేషన్ (Forceps Delivery, Cizarian Section Operation) పుట్టిన బిడ్డకు మొదటి 3 రోజులలో మూర్ఛ మొదలైనవి ఇతర కారణాలు.

9. బాల్యంలో సంభవించే కొన్ని వ్యాధులవల్ల కూడా బిడ్డలో మానసిక పెరుగుదల సక్రమంగా లేకపోవచ్చు. మీజల్స్ వ్యాధితో పాటు వచ్చే మెదడువాపు వ్యాధి (Measles Encephalitis) క్షయ జబ్బుతోపాటు వచ్చే టి. బి. (T. B. Meningitis) ముఖ్యమైనవి. ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన అంశం ఒకటి ఉన్నది. బిడ్డకు మొదటి సంవత్సరం దాటేసరికి మెదడు పెరుగుదల దాదాపు 66 శాతం పూర్తి అవుతుంది. రెండో సంవత్సరం దాటేసరికి 80 శాతం పూర్తి అవుతుంది. శరీరంలో మిగతాభాగాలు నెమ్మదిగా

పెరుగుతాయి. అందువల్ల బిడ్డకు 2 సంవత్సరాలలోను ఏవిధమైన మెదడు రోగాలు వచ్చిన మానసిక పెరుగుదలకు తీవ్రమైన దుష్ట పరిణామాలు ఉంటాయి.

## మానసిక వికలాంగులు - పునరావాసం

ప్రపంచవ్యాప్తంగా ఇంటార్డ్, సెంగ్టిన్, డీనో, మాంటిసోరి (Itard, Sengtin, Deenow, Montissori) మొదలైన వైద్య నిపుణులు ఈ బుద్ధిమాంద్యానికి కారణాలు, వాటినివారణకు చాలా పరిశోధనలు జరిపారు.

ఈ బుద్ధిమాంద్యత గల పిల్లలలో సుమారు 85 నుంచి 90 శాతం తగిన ప్రత్యేక శిక్షణ ఇవ్వడం ద్వారా కొంత అభివృద్ధి సాధించగలం. ఈ విధంగా కొంతవరకు ఆర్థికంగా, సామాజికంగా ప్రయోజనకరమైన జీవితాన్ని గడపగలరు. తెలివితేటలు అంతగా అవసరంలేని రంగాలలో వీరిని ఉపయోగించవచ్చు. మిగిలిన 10-15 శాతం తీవ్రమైన శారీరక, మానసిక రుగ్మతలతో బాధపడుతుంటారు. ఎటువంటి ప్రత్యేకశిక్షణ వల్ల వీరికి ప్రయోజనం ఉండదు.

జీవిత భీమా సంస్థ ఈ బుద్ధిమాంద్యుల ప్రయోజనానికై గ్రూపు ఇన్సూరెన్సు పోలసీ ప్రవేశపెట్టింది. బుద్ధిమంతులైన ప్రజల రక్షణకు 1912 సంవత్సరం భారత ఉన్మాదచట్టం నిర్దేశించబడింది.

1979 వ సంవత్సరం నవంబరులో భారత ఆరోగ్య సర్వీసెస్ జనరల్ ఆధ్వర్యంలో ఒక ప్రత్యేక నిపుణుల సంఘం బుద్ధిమాంద్యుల సంరక్షణకు తీసుకోవలసిన జాగ్రత్తలను గూర్చి ప్రణాళికా సంఘానికి సిఫార్సు చేసింది. ఈ సిఫార్సులలో ముఖ్య అంశాలు ఇవి :

1. నిపుణులైన వైద్యశాస్త్రజ్ఞులు, సాంఘిక సంక్షేమ శాస్త్రజ్ఞులు మొదలైనవారి సలహాతో పార్లమెంటు ఒక చట్టాన్ని రూపొందించాలి. ఐక్యరాజ్యసమితి బుద్ధిమాంద్యుల గూర్చి చేసిన సిఫార్సులన్నింటిని ఈ చట్టంలో పొందుపరచాలి.

## ఐక్యరాజ్యసమితి సిఫార్సులు

1. ఇతర మానవులవలే జీవించే హక్కు బుద్ధిమాంద్యులైన ప్రజలకు కూడా ఉంది.

2. సరియైన వైద్య సదుపాయం విద్య, ప్రత్యేక శిక్షణ, ఉపాధిపథకాలు సంరక్షణ సంఘం నుండి కోరే హక్కు ఈ వర్గం ప్రజలకు కూడా ఉంది.

3. ఆర్థిక భద్రత, హుందాతనంతో జీవించే హక్కు, నిర్మాణాత్మక మైన పని గౌరవనీయమైన ఉద్యోగం సాధ్యమైనంతవరకు బుద్ధి మాంద్యులు తమ కుటుంబాలలోనే జీవించే హక్కు, సాంఘిక జీవనంలో పాలుపంచుకొనే హక్కు ఉంది.

4. ఈ వికలాంగులకు పోషించేందుకు కుటుంబానికి ఆర్థిక సహాయం కలగజేయాలి.

5. వికలాంగుల శిక్షణాలయాల స్థితిగతులు కుటుంబ జీవనానికి వీలైనంత సన్నిహితంగా ఉండాలి.

6. దుష్టశక్తుల సాంఘిక విద్రోహక శక్తులనుంచి కాపాడబడేహక్కు సంఘంలో ఇతరులనుంచి అవమానం, హేళనకు గురికాకుండా జీవించే హక్కు ఈ వర్గం ప్రజలకు ఉన్నాయి.

(2) బుద్ధిమాంద్యులు సమాజంలో బలహీనవర్గాలుగా గుర్తించి ఇతర బలహీనవర్గాలకు ఏర్పాటుచేసినట్లే విద్య, ఉద్యోగ రంగాలలో ప్రత్యేక రిజర్వేషన్ సౌకర్యాన్ని కల్పించాలి.

మానసికలోపం గల బాలురకు కొత్తఢిల్లీలో 1964 నుంచి ఒక ఆదర్శ పాఠశాల పనిచేస్తోంది. ప్రాథమిక విద్యతోపాటు ఇక్కడ బాలురకు దైనందిన జీవితం గడపటానికి శిక్షణకూడా లభిస్తోంది. సంగీతం, నాట్యం వంటివికూడా ఇక్కడ నేర్పుతారు.

పూనాలో కూడా గత 14 సంవత్సరాలుగా, ఒక విద్యాలయాన్ని స్థాపించి మానసిక లోపమున్న పిల్లలకు శిక్షణనిస్తున్నారు. బట్టలు తయారీ, దుప్పట్లు నేయటం, కుర్చీల అల్లిక, కొవ్వొత్తులు తయారు చేయడం, గ్రీటింగ్ కార్డుల తయారీ, కుట్లు అల్లికలు, నేతపని మొదలైన వృత్తి విద్యలను యిక్కడివారు నేర్చుంటున్నారు. వడ్రంగి పని చాలా మంది మానసిక స్థితిని చక్కబరచటానికి బాగా తోడ్పడుతుంది.

మానసిక లోపాలు గల పిల్లలకోసం అలాంటి కేంద్రాలను రాష్ట్రప్రభుత్వాలు, ఇంకా అనేక స్వచ్ఛంద సేవాసంస్థలు నడుపుతున్నాయి.

ఈనాడు వివిధ బాలుర సంక్షేమ కార్యకలాపాలను నిర్వహిస్తున్న అలాంటి సంస్థలు దేశమంతటా సుమారు 800 వరకు ఉన్నాయి.

# 6

# గృహవసతి

మానవుని మనుగడలో ఆహారం, వస్త్రాలు, ఆశ్రయం (Food, Clothing and Shelter) చాలా ప్రధానమైన అవసరాలుగా గుర్తించబడ్డాయి. మన దేశంలో చాలామంది ప్రజలు సరియైన ఆశ్రయం లేక బాధపడుతున్నారు. అందువల్ల మన ప్రభుత్వం అంచెలవారీగానైనా, దేశప్రజలందరికి గృహవసతి సౌకర్యాలు కల్పించాలనే ధ్యేయంతో కృషి చేస్తున్నది.

వాస్తవానికి భారతదేశంలో గృహవసతి సమస్య చాల క్లిష్టంగా ఉన్నది. దీనికి చాలా పెద్ద మొత్తంలో ఆర్థిక వనరులు అవసరం, సహకార సంఘాలు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ఆర్థిక స్తోమత ఉన్న ప్రజలు బాగా ఆలోచించి, ఈ సమస్యను పరిష్కరించవలసి ఉన్నది. పట్టణ ప్రాంతాలలోను, గ్రామీణ ప్రాంతాలలోను కూడా ఈ సమస్య తీవ్రత అధికంగా ఉంది.

1971 జనాభా లెక్కల ఆధారంగా భారతదేశ రిజిస్ట్రార్ జనరల్ 1931 వరకూ నేషనల్ బిల్డింగ్స్ ఆర్గనైజేషన్ 213 లక్షల గృహవసతి యూనిట్లు అవసరమని అందులో 165 లక్షలు గ్రామీణ ప్రాంతాలలోను, 48 లక్షలు పట్టణ ప్రాంతాలలోను అవసరమని అంచనా వేయడం జరిగిందని తెలియజేశారు.

ప్రభుత్వం పరిష్కరించవలసిన సమస్యలు ఎన్నో ఉన్నాయి. అన్ని సమస్యలతో సతమతమయ్యే ప్రభుత్వం కోట్ల రూపాయల ఖర్చుతో కూడుకొనిఉన్న గృహవసతి సౌకర్యాలను ప్రతీ కుటుంబానికి అందించడం కష్టతరమైనపని.

6 వ పంచవర్ష ప్రణాళికలో (1980-85) నిరాశ్రయులైన ప్రజలకు గృహవసతి సౌకర్యం కల్పించడానికి ఎక్కువ ప్రాధాన్యత

ఇచ్చారు. 6 వ పంచవర్ష ప్రణాళికలో రూ. 837.37 కోట్లు సాంఘిక గృహవసతి పథకాలకు, రూ. 353.50 కోట్లు గ్రామాలలో భూములు లేనివారికి, ఇళ్ళ స్థలాలతోపాటు ఇళ్ళు కట్టడానికి ఆర్థిక సహాయాన్ని కూడా ఇచ్చే (House Sites and Construction Assistance Scheme) పథకాలకు కేటాయించడం జరిగింది.

## ప్రభుత్వ పెట్టుబడి (Public Investment)

గడచిన 3 దశాబ్దాలలో పంచవర్ష ప్రణాళికలద్వారా ప్రభుత్వ పెట్టుబడి గృహవసతి కోసం రూ. 1,253 కోట్లు. అంతేకాకుండా, ప్రభుత్వరంగ సంస్థలు(Public Sector Enterprises), డిపార్ట్‌మెంటల్ అండర్ టేకింగ్స్ (Departmental undertakings) గ్రాంట్స్-ఇన్-ఎయిడ్ సంస్థలు రూ. 1,800/- కోట్లు పెట్టుబడిపెట్టడం జరిగింది. ప్రయివేటు సంస్థల పెట్టుబడి రూ. 12 , 740 కోట్లుగా అంచనావేశారు.

## ఆరవ పంచవర్ష ప్రణాళిక 1980 - 85 (Sixth Five Year Plan 1980 - 85)

## గృహవసతి సౌకర్యాలు

## 6వ పంచవర్ష ప్రణాళిక సమీక్ష

గడచిన 3 దశాబ్దాలలో ప్రభుత్వం గృహసౌకర్యాలకోసం రూ. 1,253 కోట్లు వెచ్చించింది. ఇంతేకాకుండా కేంద్రప్రభుత్వ సంస్థలు, వివిధ శాఖలు(Departmental undertakings) గ్రాంట్స్-ఇన్-ఎయిడ్ (Grants-in-aid) సంస్థలు సుమారు రూ. 1,800 కోట్లు వెచ్చించింది. ప్రైవేటు సంస్థల ఈ ఖర్చు రూ. 12,740 కోట్లుగా అంచనావేయడం జరిగింది. స్థానిక ప్రభుత్వాలు, రాష్ట్ర హౌసింగు బోర్డులు, రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రభుత్వరంగ సంస్థలు, కేంద్రప్రభుత్వం- అన్నిస్థాయిలలో గృహనిర్మాణ కార్యక్రమాలు చేపట్టాయి.

గృహనిర్మాణ ఖర్చులలో కొంతభాగం ఉచితంగా ఇచ్చే (Subsidised alwellings) గృహవసతి సౌకర్యాలు, కొన్ని ఎన్నిక చేయబడిన ఆర్థికంగా వెనుకబడిన తరగతులవారికి అందజేయడం జరుగుతోంది. 1950–51 నుంచి డిసెంబరు 1979 నాటికి 2.05 లక్షల గృహాలను ప్లాంటేషన్ కార్మికులకు, పారిశ్రామిక కార్మికులకు కట్టించి ఇవ్వబడినవి. అధిక రాబడి వర్గాలకు (Higher income groups) 1.42 లక్షల గృహాలు, తక్కువ రాబడి వర్గాలకు (Lower Income groups) 3 . 36 లక్షల గృహాలు కట్టించి ఇచ్చారు. గ్రామీణ ప్రాంతాలలో 77 లక్షల ఇళ్ళస్థలాలు పంచిపెట్టారు. 5 . 6 లక్షల గృహాలు గ్రామీణ ఇళ్ళస్థలం, గృహనిర్మాణ పథకం (Rural house Site - cum - House - Construction - Scheme) క్రింద కట్టించి ఇవ్వడం జరిగింది.

అయితే గృహవసతి సౌకర్యాలు కల్పించడంలో ప్రభుత్వం వహించిన పాత్ర చాలాతక్కువే. ఐదవ పంచవర్ష ప్రణాళికలోమాత్రం గ్రామీణ ప్రాంతాలలో స్థలంలేనివారికి ఇళ్ళస్థలాలనిచ్చే సౌకర్యం పట్టణ ప్రాంతాలలో ఉండే పథకాలతోపాటు కల్పించబడింది.

ఈ కార్యక్రమాలలో, రాష్ట్రప్రభుత్వాలు, తత్సంబంధిత సంస్థలు చేపట్టిన గృహవసతి పథకాల సమీక్షలో కొన్నిసమస్యలు బయట పడ్డాయి. ఈ పథకాలు రూ. 350/-ల నెలసరి ఆదాయంలోపున వచ్చే ఆర్థికంగా బలహీనమైన తరగతులకు రూ. 350/-, రూ. 600/- నెలసరి ఆదాయం ఉండే తరగతుల ప్రజలను "తక్కువ రాబడి వర్గాలు" (Lower Income groups) నిర్దేశించారు. వాయిదా చెల్లింపు ఎక్కువ ధనంతో కూడినపని అయినందువల్ల తక్కువరాబడి ప్రజలకు నిర్దేశించబడ్డ గృహాలు క్రమంగా ఎక్కువరాబడి తరగతులవారు ఆక్రమించారు. కేటాయించబడినవారు లేదా అద్దెకున్నవారు, బకాయిలు పెడుతున్నారు. కాబట్టి ఇది రాష్ట్ర ప్రభుత్వాలకు, హౌసింగు బోర్డులకు పెద్దసమస్యగా మారింది. అందువల్ల భావిలో గృహనిర్మాణ పథకాలను

లను దృష్టిలో పెట్టుకుని యోచించి చేయవలసిన అవసరం

గృహాగ్రహీతల, చెల్లించే శక్తిని దృష్టిలో ఉంచుకో

ఎంతైనాఉన్నది. పైన పేర్కొన్నవారిని మినహాయిస్తే

కర్యాలు పొందే తరగతి ప్రభుత్వాం, ప్రభుత్వరంగ సంస్థల

గతులకు చెందినవారు మాత్రమే.

షయాలన్నింటినీ పర్యావలోకనం చేస్తే, 6వ పంచవర్ష

గృహావసతి సమస్యను పూర్తిగా తీర్చడం సాధ్యంకాని

స్తున్నది. ఈ సమస్యను నిర్విరామ కృషితో వచ్చే 20

ించే అవకాశాలున్నాయి.

పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వ, ప్రయివేటు రంగాల కేటా

ుడి రూ॥ 12,900 కోట్లు. ఇందులో రూ॥ 3,500 కోట్లు

ృహావసతికి రూ॥ 9,400 కోట్లు నగర గృహ వసతికై

ంది. ఈ రకమైన కేటాయింపు గ్రామీణ ప్రాంతాలలో 13

వాస యూనిట్లు, 5.7 మిలియన్ల నివాస యూనిట్లు పట్టణా

నిర్మించబడతాయి. ప్రైవేటు సంస్థల గృహ నిర్మాణ

ంబంధించిన వివరాలు సరిగా తెలియవు. ఏదిఏమైనా కేంద్ర

(Central Statistical Organisation) 1976-77 లో

కోట్లుగా అంచనావేసింది. 1980-84 లో దీని లెక్క ఈ

॥ 11,500 కోట్లు ఉండవచ్చునని అంచనా వేయబడింది.

స్థల వ్యయం రూ॥ 1,302 కోట్లు నిర్ధారణ చేయబడింది.

ప్రభుత్వంలో సంస్థలు, వివిధ శాఖలు (Department

ing) గ్రాంట్స్-ఇన్-ఎయిడ్ సంస్థలు రూ॥ 250-300 కోట్లు

ుు

్రయులైన ప్రజలకు ఆశ్రయం కల్పించడం, గృహ ఆవర

దిద్దుకోవడం, మరికొన్ని పరిస్థితులు కల్పించడం ధ్యేయా

పొందించబడ్డాయి.

(i) గ్రామీణ నిరాశ్రయులకు గృహ స్థలాలను ఇస్తూ, ఆర్థిక సహాయాన్ని ఇళ్ళు నిర్మించుకోడానికి అందించడం.

(ii) చెల్లించే శక్తి ఉన్న ప్రజలకు అనుగుణంగా, ఆర్థికంగా వెనుకబడిన తరగతులకు గృహవసతి సౌకర్యాలు కలుగచేయడం.

(iii) గృహ నిర్మాణ ప్రయోగాలను పునఃపరిశీలించి నిర్మాణ సామాగ్రిని వ్యయం తగ్గేరీతిలో మార్చి, గృహ నిర్మాణ ఖర్చులను వీలైనంతమేరకు తగ్గించడానికి ప్రత్యేకమైన కృషిని చేయడం.

పై ధ్యేయాలను సాధించడానికి ఈ కింది కార్యక్రమాలను చేపట్టవలసి ఉంది.

(అ) ఇప్పటి వరకు నిర్లక్ష్యం చేసిన చిన్న, మధ్యతరగతి పట్టణాలలో గృహ నిర్మాణ కార్యక్రమం చేపట్టడం.

(ఆ) యూనిట్ ఖర్చులు తగ్గేరీతిలో స్థానిక పద్ధతులతో సహితం తక్కువ ధర గృహవసతి పద్ధతులను చేపట్టడం.

(ఇ) భవన నిబంధనలను (Bye-Laws) మార్చడం. స్థల ఉపయోగ నియంత్రణలు కనీస స్థల అవసరాలు (Minimum Plat Requirements) రోడ్ల కోసం స్థల అవసరాలు. ఇవి తరచుగా నివాస ఖర్చులను తగ్గించడానికి అవరోధాలు.

(ఈ) ప్రత్యక్ష సబ్సిడీ పద్ధతిని ఎత్తివేయడం మాధ్యమిక రాబడి సమూహాలకు (Middle Income groups) హెచ్చురాబడి సమూహాలకు (Higher Income groups) ఏకంగా సబ్సిడీ (Subsidy)ని తొలగించడం తక్కువరాబడి సమూహాలకు (Lower Income groups) తప్పనిసరైతే బిల్డింగ్ మెటీరియల్స్ (building meterials) రూపంలోనో, మరే ఇతర రూపంలోనో గృహ వసతికి ఉపకరించేరీతిలో అందించడం.

## గ్రామీణ గృహ సౌకర్యాలు

కనీస అవసరాల కార్యక్రమం గ్రామీణ నిరాశ్రయులైన కార్మికులకు ఇళ్ళస్థలాలకు, గృహనిర్మాణానికి అత్యధిక ప్రాధాన్యత

ఇచ్చింది. 1985 మార్చినాటికి గృహ అవసరం ఉండే కుటుంబాల సంఖ్య 14.5 మిలియన్లు ఉండవచ్చునని అంచనావేయబడింది. వీరిలో 7.7 మిలియన్ల నిరాశ్రయ కుటుంబాలకు అప్పుడే ఇళ్ళస్థలాలు పంచి పెట్టారు. ఈ ప్రణాళిక మిగిలిన అన్నికుటుంబాలకు ఇళ్ళస్థలాలను అందించడానికి ఉద్దేశించబడింది. ఇళ్ళస్థలాలు పొందిన కుటుంబాలలో 0.56 మిలియను కుటుంబాలు నిర్మాణ సహాయాన్ని కూడా పొందింది. ఇంకా 13.9 మిలియను కుటుంబాలు నిర్మాణాన్ని సహాయాన్ని అందుకో వలసి ఉన్నది. 1980-85 కాలంలో వీరిలో 25 శాతం అంటే 3.6 మిలియను కుటుంబాలకు నిర్మాణ సహాయాన్ని అందజేస్తారు. గొట్టం బావి, రోడ్లు (approach, roads) స్థలాల అభివృద్ధికోసం కుటుంబానికి రూ. 250/-లు చొప్పున ప్రతీ 30, 40 కుటుంబాలకు సదుపాయం కల్పించబడింది. ఒక్కొక్క కుటుంబానికి రూ. 500/- నిర్మాణ సహాయం అందించ ఉద్దేశించడమైంది. ఈ అవకాశాలు లేక సదుపాయాలు మొత్తం రూ. 354 కోట్లు కేటాయింపును కోరుతున్నది. అందులో రూ. 170 కోట్లు ఇళ్ళస్థలాలకు సుమారు రూ. 184 కోట్లు నిర్మాణాత్మక సహాయానికి ఖర్చుచేయడం జరుగుతుంది.

ఈ రకమైన సహాయంతో గృహాలు బురద గోడలతో, పెంకుల పైకప్పుతోను నిర్మించవలసి ఉన్నది. అయితే నిరాశ్రయ గ్రామీణు లందరికీ వచ్చే ఐదు సంవత్సరాలలో కనీసం భరించదగిన నివాసాలను కల్పించవలసి ఉంది. కాబట్టి ఈ కార్యక్రమాన్ని అమలుచేయడానికి ప్రతి జిల్లాలోను తాలూకా స్థాయిలోను, బ్లాకు స్థాయిలోను సంఘాలను స్థాపించి తగినన్ని కుటుంబాలన్నింటికి గృహవసతి రుసుము (Housing Subsidy) ను ఇవ్వడానికి ఉద్దేశించడమైంది. ఈ సంస్థలు లే అవుట్ (lay-out) లు, గృహనిర్మాణ ప్లానులు, డ్రైనేజ్ ఏర్పాట్లు చేయడానికి ఉపకరించాలి. సాధ్యమైనచోటల్లా, సాముదాయిక మరుగు దొడ్లు, స్నానపుగదులు కూడా నెలకొల్పాలి. గృహ నిర్మాణానికి కావలసిన పెంకులు తదితర పరికరాలు స్థానిక కుమ్మరులనుంచే వీలైనంత వరకు సంపాదించాలి. ఉన్న పరిధులలో ఉపయోగం పొందుతున్న

ప్రజలు తమ తమ గృహనిర్మాణాలలో మార్గదర్శకత్వం వహిస్తే సహాయకారిగా ఉంటుంది. జాతీయ భవనాల సంస్థ (National Buildings organisation) రాష్ట్రాల హౌసింగు బోర్డులు-హుడ్కో (HUDCO) లకు, గ్రామీణ ప్రాంతాలలో మెరుగైన డిజైన్సు ప్లానులను ప్రతిపాదించడానికి సిద్ధంగా ఉన్నాయి.

సాధారణంగా రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రణాళికల సూచనలమేరకు ఈ కార్యక్రమాలను కార్యరూపంలో పెట్టడం జరుగుతున్నది. అయితే కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఎక్కువగా సబ్సిడీలను, ఋణాలను మంజూరుచేసి, పెద్దఎత్తున ఈ కార్యక్రమాలను చేపడుతున్నది. వనరుల పరిమితుల ననుసరించి రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రణాళికలో సూచించిన మేరకు 3.6 మిలియన్ల గృహాలు కట్టించడానికి తప్పకుండా కృషి చేయాలి.

వనరుల కొరతవల్ల రాష్ట్రాల ప్రణాళికలతో గృహ సౌకర్యాలకు చాలా తక్కువ అవకాశం కల్పించడమైంది. హౌసింగు మరియు అర్బన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (HUDCO) జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్‌లు కూడా ఈ రంగంలోనూ కి గ్రామీణ ప్రాంతాలలో గృహ నిర్మాణాలకు ఋణాలనివ్వ ప్రారంభించాయి.

## పట్టణ ప్రాంతాలలో గృహవసతి సౌకర్యాలు

ప్రభుత్వ రంగం పట్టణ ప్రాంతాలలో గృహ వసతి సౌకర్యాల కోసం తక్కువగాచేసినా ప్రోత్సాహకరంగానేఉంది. ఎక్కువ సంఖ్యలో మంచి గృహ వసతి సౌకర్యాలు కల్పించవలసిన అవసరం పట్టణాలలో ఎంతైన ఉన్నది. ప్రభుత్వ ఆర్థిక వనరులు తక్కువగా ఉన్నందున, ఈ విషయంలో ప్రైవేటు సంస్థలే ఎక్కువగా కృషి చేయవలసి ఉంది. మురికివాడల మెరుగుదల, ప్రైవేటు హౌసింగును ప్రోత్సహించే హడ్కో (HUDCO) వంటి సంస్థలను ప్రోత్సహించడం వంటి విషయాలకే ప్రభుత్వం పరిమితమై ఉంది.

పట్టణ ప్రాంతాలలో మరల ఎక్కువ స్థాయిలో మురికివాడల నిర్మాణం భవిష్యత్తులో వదిలి పెట్టాలి. మురికివాడల ప్రాంతాల

మెరుగుదలకు కావలసినంతరీతిలో వ్యయం చేయాలి. మన నగరాల లోని మురికివాడల ప్రాంతాలలో (Low Cost Sanitation, Drainage) మరుగుదొడ్లు, మురికినీటి పారుదల సౌకర్యాల ఏర్పాటు చాలా అవసరం.

ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు గృహ నిర్మాణానికి ప్రత్యక్ష, ఆర్థిక సహాయాన్ని అందించడానికి ప్రభుత్వరంగ సంస్థలు ఉద్దేశిస్తున్నాయి. ఇళ్ళ స్థలాలు, గృహనిర్మాణ సేవలు (Sites and Services) పథకాలను అందించి, ఉపయోగం పొందేవారికి 3,000/- రూ॥ల వరకు ఋణాలనిచ్చి 20-25 సంవత్సరాల కాలంలో కొంతమేరకు రాయితీతో రుణాలు ఇవ్వసంకల్పించడమైనది. 16.2 లక్షల గృహాల నిర్మాణానికై రూ॥ 485 కోట్లు ఈ ప్రణాళికలో కేటాయించడమైంది.

## హౌసింగు అర్బన్ డవలప్‌మెంట్ కార్పొరేషన్ (HUDCO)

తక్కిన ప్రభుత్వరంగ సహాయమంతా హడ్కో (HUDCO) ద్వారానే ప్రజలకు అందించవలసి ఉంది. 41-7-1980 నాటికి హడ్కో (HUDCO) రూ॥ 600 కోట్లు ఋణ సహాయాన్ని 17 రాష్ట్రాలు, 4 కేంద్ర ప్రాంతాలలో 319 పట్టణాలకు, నగరాలకు 1,274 స్కీములను మంజూరు చేసింది. ఇది రూ॥ 337 కోట్లు పంచిపెట్టింది. పూర్తి అయ్యే నాటికి ఈ ప్రాజెక్టులు 6.8 లక్షల నివాస యూనిట్లను 62,000 మెరుగు పరచిన ప్లాట్లను (Development Plots) చాలా షాపులను వాణిజ్య సంస్థలను అందిస్తుంది. వీటిలో 86 శాతం ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు తక్కువ రాబడి వర్గాలకు (EWS) మరియు (Lower Income Group (LIG) కొరకే 1980-81 కాలంలో హడ్కో (HUDCO) రూ॥ 160 కోట్లు ఋణాలను ఇవ్వాల్సివుండగా రూ॥ 89 కోట్లు ఇచ్చివేయడం జరిగింది. ఇంతేకాకుండా, గ్రామీణ గృహ వసతికి అగ్రస్థాయిలో ఉన్న కో-ఆపరేటివ్ హౌసింగు సొసైటీలకు అర్బన్ డెవలప్‌మెంట్ స్కీములకు ధనసహాయాన్ని అందించే కొత్త స్కీములనుకూడా హడ్కో (HUDCO) చేపట్టింది.

ప్రజలు తమ తమ గృహనిర్మాణాలలో మార్గదర్శకత్వం వహిస్తే సహాయకారిగా ఉంటుంది. జాతీయ భవనాల సంస్థ (National Buildings organisation) రాష్ట్రాల హౌసింగు బోర్డులు-హుడ్‌కో (HUDCO) లకు, గ్రామీణ ప్రాంతాలలో మెరుగైన డిజైన్సు ప్లానులను ప్రతిపాదించడానికి సిద్ధంగా ఉన్నాయి.

సాధారణంగా రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రణాళికల సూచనలమేరకు ఈ కార్యక్రమాలను కార్యరూపంలో పెట్టడం జరుగుతున్నది. అయితే కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఎక్కువగా సబ్సిడీలను, ఋణాలను మంజూరుచేసి, పెద్దఎత్తున ఈ కార్యక్రమాలను చేపడుతున్నది. వనరుల పరిమితుల ననుసరించి రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రణాళికలో సూచించిన మేరకు 3.6 మిలియన్ల గృహాలు కట్టించడానికి తప్పకుండా కృషి చేయాలి.

వనరుల కొరతవల్ల రాష్ట్రాల ప్రణాళికలతో గృహ సౌకర్యాలకు చాలా తక్కువ అవకాశం కల్పించడమైంది. హౌసింగు మరియు అర్బన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (HUDCO) జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్‌లు కూడా ఈ రంగంలోనూ కి గ్రామీణ ప్రాంతాలలో గృహ నిర్మాణాలకు ఋణాలనివ్వ ప్రారంభించాయి.

## పట్టణ ప్రాంతాలలో గృహవసతి సౌకర్యాలు

ప్రభుత్వ రంగం పట్టణ ప్రాంతాలలో గృహ వసతి సౌకర్యాల కోసం తక్కువగాచేసినా ప్రోత్సాహకరంగా నేఉంది. ఎక్కువ సంఖ్యలో మంచి గృహ వసతి సౌకర్యాలు కల్పించవలసిన అవసరం పట్టణాలలో ఎంతైన ఉన్నది. ప్రభుత్వ ఆర్థిక వనరులు తక్కువగా ఉన్నందున, ఈ విషయంలో ప్రైవేటు సంస్థలే ఎక్కువగా కృషి చేయవలసి ఉంది. మురికివాడల మెరుగుదల, ప్రైవేటు హౌసింగును ప్రోత్సహించే హుడ్కో (HUDCO) వంటి సంస్థలను ప్రోత్సహించడం వంటి విషయాలకే ప్రభుత్వం పరిమితమై ఉంది.

పట్టణ ప్రాంతాలలో మరల ఎక్కువ స్థాయిలో మురికివాడల నిర్మాణం భవిష్యత్తులో వదిలి పెట్టాలి. మురికివాడల ప్రాంతాల

మెరుగుదలకు కావలసినంతరీతిలో వ్యయం చేయాలి. మన నగరాల లోని మురికివాడల ప్రాంతాలలో (Low Cost Sanitation, Drainage) మరుగుదొడ్లు, మురికినీటి పారుదల సౌకర్యాల ఏర్పాటు చాలా అవసరం.

ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు గృహ నిర్మాణానికి ప్రత్యక్ష, ఆర్థిక సహాయాన్ని అందించడానికి ప్రభుత్వరంగ సంస్థలు ఉద్దేశిస్తున్నాయి. ఇళ్ళ స్థలాలు, గృహనిర్మాణ సేవలు (Sites and Services) పథకాలను అందించి, ఉపయోగం పొందేవారికి 3,000/- రూ॥ల వరకు ఋణాలనిచ్చి 20-25 సంవత్సరాల కాలంలో కొంతమేరకు రాయితీతో ఋణాలు ఇవ్వసంకల్పించడమైనది. 16.2 లక్షల గృహాల నిర్మాణానికై రూ॥ 485 కోట్లు ఈ ప్రణాళికలో కేటాయించడమైంది.

## హౌసింగు అర్బన్ డవలప్‌మెంట్ కార్పొరేషన్ (HUDCO)

తక్కిన ప్రభుత్వరంగ సహాయమంతా హడ్కో (HUDCO) ద్వారానే ప్రజలకు అందించవలసి ఉంది. 41-7-1980 నాటికి హడ్కో (HUDCO) రూ॥ 600 కోట్లు ఋణ సహాయాన్ని 17 రాష్ట్రాలు, 4 కేంద్ర ప్రాంతాలలో 319 పట్టణాలకు, నగరాలకు 1,274 స్కీములను మంజూరు చేసింది. ఇది రూ॥ 337 కోట్లు పంచిపెట్టింది. పూర్తి అయ్యే నాటికి ఈ ప్రాజెక్టులు 6.8 లక్షల నివాస యూనిట్లను 62,000 మెరుగు పరచిన ప్లాట్లను (Development Plots) చాలా షాపులను వాణిజ్య సంస్థలను అందిస్తుంది. వీటిలో 86 శాతం ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు తక్కువ రాబడి వర్గాలకు (EWS) మరియు (Lower Income Group (LIG) కొరకే 1980-81 కాలంలో హడ్కో (HUDCO) రూ॥ 160 కోట్లు ఋణాలను ఇవ్వాల్సివుండగా రూ॥ 89 కోట్లు ఇచ్చివేయడం జరిగింది. ఇంతేకాకుండా, గ్రామీణ గృహ వసతికి అగ్రస్థాయిలో ఉన్న కో-ఆపరేటివ్ హౌసింగు సొసైటీలకు అర్బన్ డెవలప్‌మెంట్ స్కీములకు ధనసహాయాన్ని అందించే కొత్త స్కీములనుకూడా హడ్కో (HUDCO) చేపట్టింది.

ఈ ప్రణాళిక హడ్కో (HUDCO) ఈక్విటీ (Equity) ని రూ॥ 25 కోట్లు నుంచి రూ॥ 75 కోట్లు పెంచాలని ఉద్దేశించింది. ఋణాల తీర్మానాంతో హడ్కో (HUDCO) రానున్న 5 సంవత్సరాలలో సుమారు రూ॥ 600 కోట్లు రకరకాల గృహ కార్యకలాపాలకు ఖర్చుపెట్టగలస్థాయిలో ఉండగలదు. ప్రస్తుతం హడ్కో (HUDCO) యొక్క ఋణవివరాలు ఈ కింద పేర్కొన్నరీతిలో ఉన్నాయి.

| | | |
|---|---|---|
| ఆర్థికంగా వెనుకబడిన వర్గాలు | (EWS) | 30 శాతము |
| తక్కువ రాబడి ఉన్న వర్గాలు | (LIG) | 25 శాతము |
| మధ్యరాబడి ఉన్న వర్గాలు | (MIG) | 25 శాతము |
| అధిక రాబడి ఉన్న వర్గాలు | (HIG) | 20 శాతము |

ఇ. డబ్ల్యూ. యస్., యల్. ఐ. జి. (E.W.S., L.I.G.) ల హౌసింగును ఇంకా ఎక్కువ చేయడానికి హడ్కో (HUDCO) ను ప్రోత్సహించవలసి ఉంది.

## జీవిత భీమా సంస్థలు, ఇతర సంస్థల మద్దతు

గృహ నిర్మాణాలకు ఆర్థిక సహాయం అందించే సంస్థలలో జీవిత భీమా సంస్థ ఒకటి. 1977 మార్చినాటికి, ఋణాలలో రూ. 728.56 కోట్లు రకరకాల గృహవసతి కార్యక్రమాలకు జీవితభీమా సంస్థ ఖర్చు పెట్టింది. ఈ సంస్థ అనుభవాన్నిబట్టి గృహనిర్మాణాన్ని భీమా (Insurance) తో లింకు పెట్టడం అనేది మరీ అంత విజయవంతంగా ఉన్నట్లేమీ కన్పించలేదు. ఋణాలను ఇంతవరకు రూ. 53 కోట్లు మాత్రమే ముందుగా ఇవ్వడం జరిగింది. కాబట్టి ఈ పథకాన్ని ఇంకా మెరుగుపరచవలసి ఉంది. చట్టరీత్యా జీవితభీమా (LIC) తనవద్ద నిల్వ ఉంచిన సొమ్ములో 25 శాతం సాంఘిక కార్యక్రమాలకు ఖర్చుచేయవలసి ఉంది. అవి గృహనిర్మాణం, విద్యుచ్ఛక్తి సౌకర్యం, నీటిసరఫరా, మురికినీటి పారుదల పారిశ్రామిక ఎస్టేట్లు వంటివి. కాబట్టి LIC, LIC, EWS లకు ఎక్కువగా గృహసౌకర్యాలకు ధనసహాయం చేయ

వలసి ఉంది. అదే నియమాన్ని సామాన్య భీమా సంస్థ (General Insurance Corporation) కూడా పాటించవలసి ఉంది.

సహకార గృహనిర్మాణ కార్యక్రమాలు స్వయం సహాయకంగా ఉండటంవల్ల వాటికి తగు ప్రోత్సాహమివ్వాలి. వీటికి మెరుగైన లేదా పాక్షికంగాను మెరుగైన భూమిని ( Developed or partially developed) కేటాయించాలి.

## పట్టణాలలో ఇళ్ళస్థలాల విధానం (Urban Land Policy)

పట్టణ ప్రాంతాలలో భూమికి అర్బన్ లేండు సీలింగు అండ్ రెగ్యులేషన్ చట్టం (Urban Land Ceiling and Regulation Act) 1976 ప్రకారం ఇళ్ళస్థలాల విషయాలు స్పెక్యులేషన్ (Specu- lation) రాకుండా ఉండటానికి విభిన్న ఉపయోగదారులకు కావలసిన రీతిలో భూమి కేటాయింపు జరగడాన్ని సీలింగు (Ceiling), వ్యక్తుల భూయాజమాన్య పరిమితి పెట్టబడింది. ఈ చట్టం అమలు, రాష్ట్ర ప్రభుత్వాలకు చాలా ఇబ్బందులను గురిచేశాయి. ఈ చట్టాన్ని మెరుగు పరచడానికి కొన్ని సూచనలను, సలహాలను ఇవ్వడానికి రాష్ట్రప్రభుత్వాల ప్రతినిధులతో ఒక వర్కింగ్ గ్రూపును వర్క్స అండ్ హౌసింగ్ (Works and Housing) మంత్రివర్గం నియమించింది. దీని నివేదికను ఇంకా పరిశీలిస్తున్నారు. కాని ఈ మధ్యకాలంలో స్థలం ధర ప్రభుత్వం దయినా, ప్రైవేటుదయినా పెరిగిందని ప్రజలు అభిప్రాయపడుతున్నారు. ఫలితంగా పట్టణ ప్రాంతాలలో గృహవసతి చాలా వ్యయపూరితమైన దని భయాన్ని వెలిబుచ్చుతున్నారు. కాబట్టి ఈ విషయాలను పునః పరిశీలించవలసిన అవసరమున్నది.

## కేటాయింపులు

ప్రభుత్వరంగ కేటాయింపులు ఈ కింద పేర్కొన్నరీతిలో ఉంది.

### గృహవసతికై 6వ ప్రణాళిక కేటాయింపు

రూ॥ కోట్లలో

| స్కీము | ఐదవ ప్రణాళిక 1974–79 కేటాయింపు | ఆరవ ప్రణాళిక కేటాయింపు 1980–85 |
|---|---|---|
| (1) | (2) | (3) |
| **A. రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలు** | | |
| 1. గ్రామీణ ఇళ్ళ స్థలాలు ఇళ్ళు నిర్మాణ పథకం (M N P) | 55–00 | 353–50 |
| 2. సాంఘిక గృహ నిర్మాణ పథకాలు | 450–56 | 837–37 |
| 3. మొత్తం రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలు | 505–56 | 1,190–87 |
| **B. కేంద్ర రంగం** | | |
| 3. హౌసింగు, అర్బన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (HUDCO) | 14–00 | 50–00 |
| 4. జాతీయ భవనాల సంస్థ (National Buildings Organisation) | 1–68 | 2–00 |
| 5. హిందుస్థాన్ ప్రిఫాబ్ లిమిటెడ్ | 0–15 | 0–15 |
| 6. జనరల్ పూల్ ఆఫీసు నివాస వసతి ఏర్పాటు | 51–12 | 142–00 |
| 7. ప్లాంటేషన్ కార్మికులకు సబ్సిడైజైడ్ గృహనిర్మాణ పథకాలు | 5.00 | 10.00 |

| | | |
|---|---|---|
| 8. డాక్ లేబర్‌కు గృహనిర్మాణ పథకం | 0.26 | 0.20 |
| 9. ప్రభుత్వోద్యోగులకు గృహ నిర్మాణ రుణాలు | — | 93.25 |
| 10. సైన్సు, టెక్నాలజీ | — | 2.00 |
| 11. పోలీసు గృహనిర్మాణ పథకం | 23.00 | — |
| 12. నేషనల్ బిల్డింగ్ మెటీరియల్ కార్పొరేషన్ | 0.15 | — |
| 13. సి. పి. డబ్ల్యు. డి కోసం శిక్షణ సంస్థ | — | 0.50 |
| మొత్తం కేంద్ర రంగం | 95.36 | 300.00 |
| మొత్తం (grand total) రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలు కేంద్రరంగం | 600.92 | 1,490.87 |

డిపార్ట్‌మెంటల్ హౌసింగ్‌ను, హౌస్ బిల్డింగు అడ్వాన్సులకు కేటాయించే రూ. 200.02 కోట్లు కలుపుతూ 1-4-1979 నుంచి రాష్ట్ర రంగానికి బదిలీచేయడమైనది.

ప్రభుత్వరంగ కేటాయింపులలో అధిక భాగాలు సాంఘిక గృహ వసతి కార్యక్రమాలకు నిర్దేశించబడింది. ఇందులో సంస్థాపరమైన ధనం (Institutional finance) కూడా ఉంది. సరాసరి వ్యయాల భౌతిక టార్గెట్లు 23.2 పట్టికను అనుసరించి ఉంటాయి.

## నేషనల్ బిల్డింగు కనస్ట్రక్షన్ కార్పొరేషన్ (NBCC)

ఈ సంస్థను న్యూఢిల్లీలో 1960 వ సంవత్సరంలో స్థాపించారు. ఇది ప్రత్యేకమైన కట్టడంపనులను (Special Construction Works) భారత దేశంలోను, భారత దేశం బయట చేపడుతుంది. దీనికి భారత దేశంలోను, బయట చాలా ప్రతిష్ట ఉంది. ముఖ్యంగా లిబియా, ఇరాక్

వంటి దేశాలలో దీనికి చాలా పేరు ఉన్నది. వంతెనల నిర్మాణం, విమానాశ్రయాలు, పెద్ద పెద్ద గృహావసతి ప్రాజెక్టులు, ఆసుపత్రులు, వసతి గృహాలను, హోటళ్ళు, ట్యూబ్ రైలు మార్గాలు, నీటిసరఫరా, మురికినీటి పారుదల పథకాలు (Sewerage Schemes) సముద్రపు పనులు (Marine Works) చేపట్టడం జరుగుతున్నది. ఇది భారత ప్రభుత్వ సంస్థ.

## కేంద్ర పబ్లిక్ పనుల శాఖ

## Central Public Works Department (CPWD)

రైల్వేలు కమ్యూనికేషన్లు, అణుశక్తి, డిఫెన్సు సర్వీసులు, ఆలిండియా రేడియో వీటికి సంబంధించినవి తప్ప మిగతా అన్ని కేంద్ర ప్రభుత్వ శాఖల భవనాల డిజైనులు తయారుచేయడం, నిర్మాణం, మరమ్మతు పనులు వంటి పనులు చేపడతారు. ఈ సంస్థ ఢిల్లీలో ఉన్న జాతీయ రహదారులను నిర్వహిస్తూ కేంద్రపాలిత ప్రాంతాలు పబ్లిక్ పనుల శాఖలపై సాంకేతిక నియంత్రణ నిస్తుంది. తమ స్వంత సివిల్ ఇంజనీరింగు శాఖలులేని పబ్లిక్ అండర్ టేకింగ్ సంస్థలు - తమ కట్టడం పనులన్ని సి.పి.డబ్ల్యు.డి. (C.P.W.D.) కి లేదా ప్రభుత్వరంగ కట్టడాలు కన్సల్టెన్సు సంస్థ (Public Sector Construction and Consultancy Organisation) కు గాని తమ కట్టడం పనులను అప్పగించడం జరుగుతుంది. సొమ్ము డిపాజిట్ చేసినట్లయితే సెమి - గవర్నమెంటు సంస్థల పనులను కూడా చేపట్టడం జరుగుతుంది.

## రాష్ట్ర పరిధిలో పథకాలు (State Sector Schemes)

ఇంటిగ్రేటెడ్ సబ్సిడైజ్డ్ హౌసింగు స్కీము (Integrated Subsidized Housing Schemes) 1952 లో ప్రవేశపెట్టబడింది. ఈ పథకం తక్కువ సంపాదన ఉన్న పారిశ్రామిక కార్మికుల కోసం సమాజంలోని ఆర్థికంగా బలహీనమైన బలహీనవర్గాలకోసం ఉద్దేశించబడింది. రాబడి పరిమితి (Income Limit) రూ. 500/-లు ఉన్నవారు

ఈ పథకాలతో కట్టబడిన గృహాలను పొందడానికి అర్హులు. 31 డిశంబరు 1951 నాటికి, 1,88,871 గృహాలను కట్టించడం జరిగింది.

తక్కువ రాబడి వర్గాల గృహనిర్మాణ పథకాలు (Low Income group Housing Scheme)ను 1954 లో ప్రారంభించారు. ఈ పథకంలో సంవత్సరానికి రూ. 7,200/-లు ఆదాయం దాటని అభ్యర్థులు. ఇళ్ళు కట్టుకోవడానికి ఋణాలను పొందడానికి అర్హులు. 80 శాతం ఖర్చుకు సమమైన మొత్తాన్ని ఋణరూపంలో ఇస్తారు. గరిష్ఠ మొత్తం రూ. 14,500/- లు. 31 డిసెంబరు 1981 నాటికి 3,42,639 గృహాలను పూర్తి చేశారు.

మాధ్యమిక రాబడి సముదాయ గృహనిర్మాణ పథకాన్ని (Middle Income group Housing Scheme) 1959 లో ప్రారంభించారు. సాధారణంగా జీవిత భీమా సంస్థ నిధులనుంచి ఋణాలు రాష్ట్రప్రభుత్వాలకు అందజేయడం జరుగుతుంది. కేంద్రపాలిత ప్రాంతాలలో ఈ నిధులు కేంద్ర ప్రభుత్వం సమకూరుస్తుంది. సాంవత్సరిక ఆదాయం రూ. 7,201/- నుంచి రూ. 18,000/-లు కట్టి సిద్ధంగా ఉన్న ఇళ్ళను కొనుక్కోడానికి కూడా ఋణాలు ఇస్తారు. 31 డిసెంబరు, నాటికి 45,741 గృహాలను కట్టడం జరిగింది.

గ్రామ గృహావసతి పథకం (The Village Housing Project Scheme) ప్రకారం గ్రామీణ ప్రాంతాలలో ఇళ్ళు కట్టుకోవడానికి 80 శాతం ఋణాలు ఇవ్వడం జరుగుతుంది. అయితే గరిష్ఠ ఋణపరిమితి రూ॥ 5,000/- వీధులు, కాలువలు పరిసరాల పరిశుభ్రత (Emvironmental Hygiene) లకు కూడా ఇవ్వడమవుతుంది. 31, డిశంబరు, 1981 నాటికి 70,395 గృహాలను కట్టడం జరిగింది.

రెంటల్ హౌసింగ్ స్కీము (Rental Housing Scheme) లో 1959 నుంచి రాష్ట్ర ప్రభుత్వాలు ఇళ్ళను నిర్మించి ప్రభుత్వోద్యోగులకు అద్దెకు ఇస్తారు. 31, డిశంబరు, 1981 నాటికి 35,023 గృహాలను పూర్తి చేశారు.

ది లాండ్ ఎక్విజిషన్ అండ్ డెవలప్‌మెంట్ స్కీము (The Land Acquisition and Development Scheme) 1959 లో ప్రారంభమైంది. ఈ స్కీములో రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్రపాలిత ప్రాంతాల అధికారులు పట్టణప్రాంతాలలో భూములను సేకరించి ఇళ్ళు కట్టడానికి వీలుగా దీనిని చదునుచేసి, గృహాలు కట్టుకోవడానికి ఆ స్థలాలను అక్కడ అభ్యర్థులకు అమ్ముతారు. ఈ రకంగా చేయడంవల్ల ఇళ్ళస్థలాలకు ఒక క్రమమైన ధర నిర్ణయించడానికి, కాలనీలు ఏర్పాటు అవడానికీ వీలవుతోంది. 31, డిశంబరు, 1981 నాటికి 13,748 హెక్టారుల భూమిని సేకరించడం, 7,438 హెక్టారుల భూమిని అభివృద్ధి చేయడం జరిగింది.

## కేంద్ర రంగ పథకాలు (Central Sector Schemes)

సబ్సిడైజ్డ్ స్కీము ప్లాంటేషన్ కార్మికులకోసం 1956 నుంచి అమలులో పెట్టబడింది. ఈ స్కీము ప్రకారం 50 శాతం ఋణరూపంలోను 37 1/2 శాతం గ్రాంటు రూపంలోను ఇళ్ళు కట్టుకోవడానికి ప్లాంటేషన్ కార్మికులకు ఇస్తారు. వారు ఇళ్ళకు అద్దె చెల్లించనక్కరలేదు. ఈ పథకాన్ని అస్సామ్, కర్ణాటక, కేరళ, తమిళనాడు, త్రిపుర, పశ్చిమ బెంగాల్ లలో అమలుపెట్టారు. ప్లాంటేషన్ వర్కర్ కో ఆపరేటివ్‌లు ప్రాజెక్టు 90 శాతం ఖర్చును అంటే 65 శాతం ఋణరూపంలోను, శాతం సబ్సిడీగాను అందుకొంటారు.

## భూమిలేనివారికి ఇళ్ళస్థలాలు

గ్రామీణ ప్రాంతాలలో భూములు లేనివారికి ఇళ్ళస్థలాలనిచ్చే ఈ స్కీము, నేషనల్ మినిమమ్ నీడ్స్ ప్రోగ్రామ్ (National Minimum Needs Programe) లో ఒక భాగం. ఈ స్కీము కేంద్ర రంగం నుంచి రాష్ట్ర రంగానికి, అయిదవ ప్రణాళిక ప్రారంభంనుంచి అంటే 1 ఏప్రిల్ 1974 నుంచి బదిలీ చేయడమైంది.

30, డిసెంబరు, 1981 నాటికి 86.77 లక్షల కుటుంబాలకు ఈ ఇళ్ళస్థలాలను రకరకాల రాష్ట్రాలలోను, కేంద్రపాలిత ప్రాంతాలలోను

ఇవ్వడం జరిగింది. దీని పరిధిని విస్తృతపరచి, నిర్మాణానికి కూడా సహాయాన్ని (Construction assistance) అందించడం జరుగుతున్నది. ఇప్పటికి 15.50 లక్షల కుటుంబాలు 18 రాష్ట్రాలలోను, 6 కేంద్రపాలిత ప్రాంతాలలోను ఇళ్ళను నిర్మించుకోగలిగారు.

గృహవసతి సౌకర్యాలు 5 వ ప్రణాళికలో సంఘంలో ఉన్న వెనుకబడినవర్గాల స్థితిగతులను మెరుగుపరచడంపైన పు నిమగ్నం చేయడమైంది. రాష్ట్ర హౌసింగు బోర్డులద్వారా వారికి హౌసింగ్ కాలనీలు కట్టించి ఇవ్వడం, గ్రామీణ ప్రాంతాలలో భూమిలేనివారికి ఇళ్ళ స్థలాలను ఇవ్వడంవంటి కార్యక్రమాలను చేపట్ట నిశ్చయించడమైంది. ఈ కార్యక్రమాలలో ఎక్కువ భాగం రాష్ట్ర ప్రణాళికలలో ఉన్నప్పటికి దేశముయొక్క పెరుగుతున్న డిమాండ్‌ను (expanding demand) తీర్చడానికి కేంద్రరంగంలో హౌసింగు, అర్బన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (Housing Urban Development Corporation) వివిధ కార్యక్రమాలను చేపడుతున్నది. 5 వ ప్రణాళికలో హుడ్కో [HUDCO] లో ఈక్విటి పార్టిసిపేషన్ [Equity Participation] 150 కోట్ల రూ. ల ఆర్థిక వనరులు సముపార్జించేటట్టు చేయడానికి అవకాశం కల్పించడమైంది. ప్లాంటేషన్ కార్మికులకు డాక్ కార్మికులకు రుసుముతోకూడిన వసతి సౌకర్యాలు [Subsidised housing] కల్పించడానికి వేర్వేరుగా ఏర్పాటు చేయడమైంది. అన్వేషణ అభివృద్ధిల విషయంలో తక్కువ ఆర్థిక వనరులకు మంచి మంచి వసతి సౌకర్యాలు కలిగిఉండే డిజైన్లను పెంపొందించడంపై కూడా దృష్టిసారించడం జరిగింది. కేంద్ర రాష్ట్ర రంగాలలో అనేక కార్యక్రమాలకు ఈ కింద పొందుపరచిన రీతిలో కేటాయింపులు జరిగాయి.

గృహ వసతి (Housing)

## గృహ సౌకర్యాల కోసం 5 వ ప్రణాళిక కేటాయింపులు

(కోట్ల రూపాయలలో)

| స్కీము | 1974–77 అంచనా వేసిన ఖర్చు | 1977–79 కేటాయింపు | 1974–79 కేటాయింపుల మొత్తం |
|---|---|---|---|
| **రాష్ట్ర రంగం** | 260–09 | 245–47 | 505–56 |
| 1. రాష్ట్ర ప్రణాళికలు | 243–71 | 220–95 | 464–66 |
| 2. కేంద్రపాలిత ప్రాంతాలు | 16–38 | 24–52 | 40–90 |
| **కేంద్ర రంగం** | 40–09 | 55–27 | 99–36 |
| 1. సామాన్య పూల్ కార్యాలయ వసతి సౌకర్యాలు | 21–12 | 30–00 | 51–12 |
| 2. హౌసింగు, అర్బన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ | 5–00 | 9–00 | 14 00 |
| 3. ప్లాంటేషన్ కార్మికులకు రుసుముతో కూడిన పారిశ్రామిక వసతి (Subsidised Industrial Housing for Plantation Labour) | 2–40 | 2–60 | 5–00 |

| స్కీము | 1974-77 అంచనావేసిన ఖర్చు | 1977-79 కేటాయింపు | 1974-79 కేటాయింపుల మొత్తం |
|---|---|---|---|
| 4. నేషనల్ బిల్డింగ్స్ ఆర్గనైజేషన్ స్కీములు | 0-83 | 0-85 | 1-68 |
| 5. నేషనల్ బిల్డింగ్స్ మెటీరియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ | 0-05 | 0-10 | 0-15 |
| 6. హిందుస్థాన్ హౌసింగ్ ఫ్యాక్టరీ | 0-05 | 0-10 | 0-15 |
| 7. డాక్ (Dack) కార్మికులకు రుసుముతో పాటు కూడిన పారిశ్రామిక వసతి | 0-14 | 0-12 | 0-26 |
| మొత్తం (1 to 7) | 29-59 | 42-77 | 72-36 |
| 8. పోలీసు గృహావసతి | 10-50 | 12-50 | 23-00 |
| మొత్తం | 300-18 | 300-74 | 600-92 |

# సాంఘిక గృహ వసతికి పెట్టుబడి, భౌతిక టార్గెట్లు

## (INVETSMENT AND PHYSICAL TARGETS IN SOCIAL HOUSING (1980—85)

| స్కీము | యూనిట్ ఖర్చు రూ॥లు | Investment enviraged | | టార్గెట్లు లక్షలనివాసయూనిట్లు స్థలాలుకో॥ | | |
|---|---|---|---|---|---|---|
| | | PLAN ప్రణాళిక | HUDCO హడ్కో | ప్రణాళిక | HUDCO | మొత్తం |
| A సాంఘిక గృహ వసతి | | | | | | |
| 1. ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు గృహవసతి | 3,000 | 485.70 | 180.00 | 16.19 | 3.00 | 19.19 |
| (నెలకు రూ॥ 350/- ల వరకు) | 6,000 | | | | | |
| 2. తక్కువ ఆదాయ వర్గాల గృహ వసతి | 15,000 | 97.10 | 150 00 | 0.64 | 1.00 | 1.64 |
| (రూ॥ 351/-, 600/- లు వరకు నెలకు) | 15 000 | | | | | |
| 3. మధ్యతరగతి ఆదాయ వర్గాల గృహవసతి | 25,000 | 51 80 | 150 00 | 0._0 | 0.45 | 0.65 |
| (రూ॥ 601-1500 నెలకు) | 33,500 | | | | | |
| 4. ఉన్నత ఆదాయ వర్గాల గృహవసతి | 40,000 | 12 95 | 120.00 | 0 03 | 0.15 | 0.18 |
| (రూ॥ 1500/- కంటే ఎక్కువ నెలకు) | 80,000 | | | | | |
| 5. గ్రామీణ గృహవసతి | 500 | 183.50 | — | 36.70 | — | 36.70 |
| A మొత్తం | | 831 05 | 600 00 | 53.76 | 4.60 | 58.36 |
| B గ్రామీణ ఇళ్ళ స్థలాలు | 250 | 170.00 | — | 68 00 | — | 68 00 |
| C డిపార్ట్మెంటల్ హౌసింగు | 35,000 | 246.00 | — | 0.70 | — | 0.70 |

* గ్రామీణ గృహవసతి ఏర్పాటు (Provision) కూడా
@ రాష్ట్రాల రంగంలో రూ॥ 637.35 కోట్లు సాంఘిక గృహవసతికి కేంద్రంలోని ప్లాంటేషన్ (Plantation) మరియు డాక్ లేబర్ హౌసింగు రూ॥ 10.2 కోట్లు కూడా కలిసి ఉన్నాయి.

గమనిక : యూనిట్ ఖర్చులు బ్రాకెట్లలో ఉన్నవి. హడ్కో-(HUDCC) సగానికి సీలింగు ధరలు సూచిస్తున్నాయి.

## విద్య

విద్య అనేది రాష్ట్రాల సబ్జెక్టు. విద్యారంగంలో కేంద్రపాత్ర చాలా తక్కువ. ప్రాథమిక, ఉన్నత విద్యల విషయం పాత్ర కేంద్ర పాత్ర సలహాల నివ్వడం వరకే, విశ్వవిద్యాలయ స్థాయిలో కేంద్ర ప్రభుత్వం, విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘంద్వారా పరిశోధనాలయాల ద్వారా(UGC and Research organisation) విద్యారంగ ప్రవేశం చేస్తున్నది.

అందువల్ల, విద్యారంగంలో రకరకాలుగా ఉండటాన్ని ఆశ్చర్య పడనక్కరలేదు. విద్యారంగం అధ్వాన్నంగా ఉండటం గురించి రాష్ట్రాలను కూడా నిందించనక్కరలేదు. 1956 రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టం (States Reorganisation Act 1956) వెలుగులోకి వచ్చాకనే రాష్ట్రాలు తమ స్వయంవృద్ధికి బాగా పాటుపడటం జరుగుతున్నది. ఈ శాసనం తరువాతకూడా, గుజరాత్, మహారాష్ట్ర 1960 లోను, హర్యానా, పంజాబ్‌లు 1966 లోను, హిమాచల్ ప్రదేశ్ 1971 లోను, మణిపూర్, మేఘాలయాలు 1972 లోను, ఆవిర్భవించాయి. ఈ కొత్తగా ఆవిర్భవించిన రాష్ట్రాలు వాటివాటి లోటుపాట్లను సరిదిద్దుకోవడం ప్రథమకర్తవ్యంగా భావించడంతో విద్యారంగంపై దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించలేకపోతున్నవి.

కేరళ రాష్ట్రం ఆదర్శప్రాయంగా ఉన్నది. ట్రావన్కోర్, కొచ్చిన్ వంటి సంస్థానాలు (Princely States) సమ్మేళనంవల్ల కేరళ

రాష్ట్రం ఏర్పడింది. ఈ రెండు సంస్థానాలుకూడా విద్యారంగంలో కూడా చాలా ముందంజవేసినవే. అయితే బ్రిటిష్‌వారి పరిపాలనలో ఉన్న మలబారు ప్రాంతం మాత్రం అంతగా అభివృద్ధిచెందలేదు. అందు వల్ల మలబారు ప్రాంతాన్ని పై రెండింటి స్థాయివరకు తీసుకురావడంలో కేరళ రాష్ట్రం కృషిచేస్తుంది. (Manorama year book, 1983. Published by Manorama Publishing house [P.B. No. 26] Kottayam, Kerala)

## జాతీయ విద్యా విధానం (National Educational Policy)

1968 లో పార్లమెంటు రూపొందించిన దేశీయ విద్యాప్రణాళిక శ్రీ డా॥ డి. సి. కొఠారి విద్యా కమీషన్ సిఫార్సులపై ఆధారపడి ఉంది. ఈ ప్రణాళిక ఈ కింద పేర్కొన్న ధ్యేయాలను నిర్దేశిస్తున్నాయి.

(i) 14 సంవత్సరాల వయస్సువరకు ఉచిత నిర్బంధవిద్యను ప్రవేశపెట్టుట.

(ii) ఉపాధ్యాయుల అంతస్థును, జీతభత్యాలను చదువును, మెరుగుపరచడం.

(iii) 3-భాషల ఫార్ములా, ప్రాంతీయ భాషాభివృద్ధి.

(iv) శాస్త్రీయ, పరిశోధనల విద్యను సమానం చేయడం.

(v) వ్యవసాయం, పరిశ్రమలకోసం విద్యాభివృద్ధిచేయడం.

(vi) అంతగా ఖర్చుపెట్టనవసరంలేని అచ్చుపుస్తకాలు స్థాయిని విడుదలను మెరుగుపరచడం.

(vii) విద్యకోసం జాతీయాదాయంలో 6 శాతం వెచ్చించడం.

జాతీయ విద్యావిధానాన్ని అనుసరించి, కేంద్ర విద్యా సలహా మండలి (Central Advisory Board of Education) ఐదో పంచ వర్ష ప్రణాళికా కాలంలో 10+2+3 అనే సరికొత్త విధానాన్ని దేశ మంతటా ప్రవేశపెట్టాలంటూ, సిఫార్సుచేస్తూ ఒక ఏకగ్రీవ తీర్మానం చేసింది. 30 సెప్టెంబరు, 1975 లో జరిగిన వైస్‌చాన్సలర్‌ల సమా

శంలో 1979-80 నుంచి 10+2 పద్ధతి విశ్వవిద్యాలయ పూర్వస్థాయి
ోను 3 సంవత్సరాల డిగ్రీకోర్సును అమలుజరపాలని తీర్మానించింది.
న్ని రాష్ట్రాల ప్రభుత్వాలు, తదనుగుణంగా వారివారి ఉన్నతపాఠశాల
వ్యాలను రూపొందించుకోవలసిందిగా సిఫార్సుచేయ నిర్దేశించబడ్డాయి.

## ూతన విద్యా విధానం (New Patten of Education)

కొత్త విద్యా విధానంలో 15 సంవత్సరాల సమగ్ర విద్యా
ధానం మొదటి పట్టణమునకు దారితీసేటట్లు రూపొందించబడింది.

(i) 10 సంవత్సరాలు ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాల స్థాయిలలో విద్యనభ్యసించడం.

(ii) హయ్యర్ సెకండరీ పాఠశాలలలో ఇంటర్మీడియట్ లేదా ప్రీ యూనివర్సిటీ కళాశాలలలో 2 సంవత్సరాలు విద్య నభ్యసించడం.

(iii) 3 సంవత్సరాలు ఏదో ఒక కోర్సులో బేచలర్ డిగ్రీ పట్టభద్రుల డిగ్రీస్థాయి కళాశాలలలో చదవడం.

ఈ కొత్త విద్యావిధానాన్ని అప్పుడే 5 రాష్ట్రాలలోను, 8 కేంద్ర పాలిత ప్రాంతాలలోను కేంద్ర ఉన్నత విద్యామండలికి అనుబంధించి ఉన్న అన్ని పాఠశాలలలోను అమలుజరపడం జరిగింది. హర్యానా హిమాచల్ ప్రదేశ్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్‌లు దీనిని సూత్రప్రాయంగా అంగీకరించాయి. కాని ఇంకా అమలులో పెట్టవలసి ఉంది.

## సార్వజనక విద్య (Universal Education)

అన్నితరగతుల ప్రజలకు సమాన విద్యావకాశాలు ఉండేటట్లు ఒక విధానాన్ని రూపొందించడానికి 1980 ఆగష్టులో భారత ప్రభుత్వం ఒక వర్కింగు గ్రూపు (Working Group) ను నియమించింది. మానవ వనరుల అభివృద్ధికి విద్య అనేది ఒక ఉత్పాదకం (INPUT) కాబట్టి దేశీయ ప్రణాళికలో దీనికి సరియైన స్థానాన్నివ్వవలసి ఉంది. విద్యకోసం చేసే వ్యయం తప్పకుండా మంచి ఫలితాలను ఇస్తుంది.

విద్యారంగంలో అత్యంత ప్రాధాన్యత ఇవ్వవలసిన రెండు కార్య క్రమాలలో విశ్వాంతర విద్య ఒకటి. రెండవది జాతీయ వయోజన విద్యా కార్యక్రమం (National Adult Education Programme)

ప్రణాళికలు ప్రాథమిక విద్యను విశ్వాంతరం చేయడానికి, రక రకాల చర్యలను రూపొందించాయి. ప్రాథమిక స్థాయిలో అన్‌గ్రేడెడ్ స్కూలు వ్యవస్థ (Ungraded School System) VIII వ తరగతి వరకు ఎవరినీ ఏ తరగతిలోనూ విద్యార్థులను ఉంచివేయకుండా ఉత్తీర్ణు లను చేయడం (Non-Detention) ఫార్మల్ (Formal) పాఠశాలలో (Multiple point-entry) వివిధ దశలలో ప్రవేశం కల్పించడం సంచలనాత్మక విద్యాబోధనలో క్రీడాత్మక (Play way Methods) పద్ధతులను I, II తరగతుల నుంచి ప్రవేశపెట్టడం, వీరిలో ఉపాధ్యాయు లను మెరుగుపరచడం. ఇంతేకాకుండా ఈశ్వరీభాయి పటేల్ కమిటి సూచించిన రీతిలో, సాంఘికంగా ఉత్పాదక కృషికి ఉపయోగపడే రీతిలో ప్రాథమిక విద్యా (Curriculum) ను సంస్కరించడం ఈ చర్య లన్నీ కూడా ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల శక్తిని మెరుగు పరుస్తుంది.

## ఉచిత నిర్బంధ విద్య

మన రాజ్యాంగం 14 సంవత్సరాల వరకు బాల, బాలికలను ఉచిత నిర్బంధ విద్యను అందించాలని నిర్దేశిస్తున్నది. రాష్ట్రాలన్నీ తమ శక్తికొద్దీ, దీనికోసం కృషిచేస్తున్నాయి.

దేశంలోని అన్ని పాఠశాలలోని I-V తరగతులకు, అన్ని ఎయిడెడ్ పాఠశాలలలోనూ, స్థానిక సంస్థలలోనూ, ప్రభుత్వ పాఠశాల లలోనూ ఉచిత విద్య నందిస్తున్నది. ఒరిస్సా, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల లోని బాలురకు తప్ప అన్ని రాష్ట్రాలలోనూ, కేంద్రపాలిత ప్రాంతాల లోనూ బాలబాలికలు VI, VII తరగతులలోగూడా ఉచిత విద్య నందిస్తున్నారు. ఈ ప్రాథమికోన్నత స్థాయిలో కూడా బాలురకు ఉచిత విద్య నందించడానికి ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ప్రయత్నం చేస్తుంది.

నిర్బంధ ప్రాథమిక విద్యకోసం బీహార్, మణిపూర్, మేఘాలయ నాగాలాండ్, సిక్కిం, త్రిపుర రాష్ట్రాలలో తప్ప అన్ని రాష్ట్రాలలోనూ శాసనాలను రూపొందించారు. అండమాన్, నికోబార్ దీవులలోనూ, చండీఘర్, ఢిల్లీ – ఈ కేంద్రపాలిత ప్రాంతాలలోనూ ఈ శాసనం అమలులో ఉంది. హిమాచల్‌ప్రదేశ్‌లో ఈ శాసనంలో ప్రాథమిక స్థాయి మొత్తం (I - VIII) ఇమిడి ఉంది.

సార్వజనిక ప్రాథమిక (Eleme tary Stage) విద్య అనేది ఆంధ్రప్రదేశ్, అస్సామ్, బీహార్, జమ్ము, కాశ్మీర్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాల్‌లలో ఒక సమస్యగా ఉంది. ఈ 9 రాష్ట్రాలలోనూ 74 శాతం వరకు నమోదుకాని పిల్లలు Non-enrolled Children) ఉన్నారు.

## పాఠశాల పూర్వ విద్య (Pre-School Education)

అప్రయోజన వర్గాల నుంచి బాలికలను నమోదు చేసుకోని ఉండకపోయినా పాఠశాలలలోను చేర్చుకోని, నమోదు (డ్రాప్ అవుట్) సమస్యలను తొలగించడానికి తోడ్పడుతుంది. గ్రామీణ ప్రాంతాలలో ఈ పాఠశాలలు, ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలలకు అనుబంధిక పాఠశాలలు (Adjuncts) గా ఉపయోగపడుతాయి. ఈ రకమైన బాల్యదశ విద్యావస్థ (Early Children Education) ను ఆరవ పంచవర్ష ప్రణాళికలో ఉద్దేశించారు. ఇటువంటి పాఠశాల పూర్వవిద్యా కేంద్రాలను నడపడానికి ఇతోధిక సహాయాన్ని అందించడాన్ని కూడా ఆరవ పంచవర్ష ప్రణాళికలో ఉద్దేశించారు.

## ఉన్నత పాఠశాల విద్య

ఉన్నత పాఠశాల స్థాయి వరకు ఆంధ్రప్రదేశ్, కర్నాటక, కేరళ, తమిళనాడు, అండమాన్, నికోబార్ దీవులు, అరుణాచలప్రదేశ్, లక్ష దీవులలో ఉచిత విద్య నందిస్తున్నారు. ఉన్నత పాఠశాల స్థాయి వరకు ప్రభుత్వ పాఠశాలలలో జమ్ము, కాశ్మీర్, నాగాలాండ్, దాద్రా, నాగర్ హవేలీ, పాండిచ్చేరిలలో ఉచిత విద్య అందిస్తున్నారు. గుజరాత్,

మధ్యప్రదేశ్, మణిపూర్, ఒరిస్సా, రాజస్థాన్, త్రిపుర, ఉత్తరప్రదేశ్ లలో బాలికలకు ఉన్నత పాఠశాల విద్యను ఉచితంగా అందిస్తున్నారు. షెడ్యూల్డ్ కులాలు, జాతులకు చెందిన విద్యార్థులకు అన్ని రాష్ట్రాల లోనూ, కేంద్రపాలిత ప్రాంతాలలోనూ ఉచిత ఉన్నత పాఠశాల విద్య నందిస్తున్నారు. ఇంతే కాకుండా వారికి పుస్తకాలకు తదితర వస్తు సామాగ్రి కొనడానికి కూడా ధన సహాయం చేస్తున్నారు. కొన్ని రాష్ట్రాలలో ఉచిత వసతి సౌకర్యాలు కూడా వారికి కల్పిస్తున్నారు.

## స్త్రీ విద్య

స్వాతంత్ర్యం తరువాత అనేక సదుపాయాలు కల్పించినా విద్యా రంగంలో స్త్రీలు ఇంకా వెనుకబడే ఉన్నారు. అయితే గత 25 సంవత్సరాలలో స్త్రీల విద్యా విషయంలో గణనీయమైన అభివృద్ధి కన్పించింది.

## నమోదు

30 సెప్టెంబరు 1978 లో జరిపిన నాల్గవ ఎడ్యుకేషనల్ సర్వేలో 1978-79 వ సంవత్సరంలో 6-14 సంవత్సరంల ప్రాయంలో నమోదయిన బాలబాలికల సంఖ్య 865.61 లక్షలు. వీరు మొత్తం జనాభాలో 65.90 శాతం.

ప్రస్తుతం 450 లక్షలు సుమారుగా 6-14 ప్రాయం వారు పాఠశాలలో నమోదు కాకుండా ఉన్నారు. కాని 1984-85 నాటికి 315 లక్షలకు తగ్గవచ్చని అంచనా.

పాఠశాలలలో నమోదు కాని బాల బాలికలలో అధిక సంఖ్యాకులు షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులు, వ్యవసాయ కూలీలు, మురికివాడలలో నివసించే బలహీనవర్గాలకు చెందినవారు. నమోదు కానివారిలో 2/3 వ వంతు బాలికలు, వారిలో 3/4 వంతు విద్యా రంగంలో వెనుకబడి ఉన్న ఆంధ్రప్రదేశ్, అస్సామ్, బీహార్, జమ్మూ-కాశ్మీర్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్ - 9 రాష్ట్రాలకు చెందినవారు.

నాల్గవ విద్యా సర్వే (IV Educational Survey) ప్రకారం 6-14 సంవత్సరాల ప్రాయంలో I-VIII తరగతులలో 119.68 లక్షల మంది షెడ్యూల్డు కులాలకు, 49.54 లక్షలమంది షెడ్యూల్డు జాతులకు చెందినవారు. వారు వారి ప్రాంతం జనాభాలో షెడ్యూల్డు కులాలలో 60.10 శాతం షెడ్యూల్డు జాతులలో 49.99 శాతం ఉన్నారు.

## నమోదు వివరాల పట్టిక

| | 1950-51 | 1978-79 | తాత్కాలికంగా (Provisional) 1979-80 | టార్గెటు (Target) 1984-85 |
|---|---|---|---|---|
| | | | లక్షలలో | |
| 6-11 సంవత్సరాల ప్రాయం వారు నమోదు I-V తరగతులలో | 191.55 | 686.00 | 722 | 832 |
| ఆ ప్రాయం వారి దేశ జనాభాలో వారి శాతం | 42.6% | 81.65% | 83.4% | 95% |
| 11-14 సంవత్సరాల ప్రాయం వారు నమోదు VI-VIII తరగతులలో | 31.20 | 179.60 | 187 | 257 |
| ఆ ప్రాయం వారి దేశ జనాభాలో వారిశాతం | 12.7% | 37.94% | 33.4% | 50% |
| 6-14 ప్రాయం వారు నమోదు I-VIII తరగతులలో | 222.75 | 865.60 | 909 | 1089 |
| ఆ ప్రాయంవారి దేశ జనాభాలో వారిశాతం | 32.4% | 65.90% | 67.2 | 77 |

## N C E R T - నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషనల్ రిసెర్చి అండ్ ట్రైనింగ్

కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖయొక్క పాఠశాల విద్యకు సంబంధించిన విధానాలను రూపొందించడంలోనూ, అమలుజరపడంలోనూ, నేషనల్ కౌన్సిల్ ఆన్ ఎడ్యుకేషనల్ రిసెర్చి అండ్ ట్రైనింగ్ (National Council on Educational Research and Training) సహాయపడుతుంది. ఇది 1961 వ సంవత్సరంలో స్థాపించబడింది. పాఠశాల విద్యను ప్రోత్సహించడానికి ఈ కౌన్సిల్ రాష్ట్ర విద్యాశాఖలతోనూ, విశ్వవిద్యాలయాలతోను, తదితర విద్యా సంస్థలతోనూ సహకరిస్తూ కృషిచేస్తూంది. ఇది అంతర్జాతీయ సంస్థలతో కూడా, ఆర్థిక సంబంధాలను కలిగిఉంది. దీనియొక్క పరిశోధనల ఫలితాలు ప్రజలకు, పుస్తకాలద్వారా, పత్రికలద్వారా తదితరరీతులలో అందించబడుతుంది. ఈ సంస్థ మొత్తం నాలుగు ప్రాంతీయ కళాశాలలను అజ్మీర్ లోను, భోపాల్ లోను, భువనేశ్వర్ లోను, మైసూర్ లోను నడుపుతున్నది. కొత్త విద్యావిధానంలో (10+2+3) 1 నుంచి 15 తరగతులవరకు కొత్త పాఠ్య ప్రణాళికలను రూపొందిస్తుంది.

## సెంట్రల్ బోర్డ్ ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ (Central Board of Secondary Education)

సెంట్రల్ బోర్డ్ ఆఫ్ సెకండరి ఎడ్యుకేషన్ (C B S E) న్యూఢిల్లీలో ఉంది. ఇది 1975 వ సంవత్సరం నుంచి కొత్త విద్యావిధానాన్ని ప్రవేశపెట్టింది. 1977 లో 10 వ తరగతి 1979 లో 12 వ తరగతి పరీక్షలు మొట్టమొదట జరిగాయి. దేశమంతటా ఉన్న రెసిడెన్షియల్ పాఠశాలలలో బలహీనవర్గాల పిల్లలకు ప్రవేశంకోసం ప్రతిభ ఉపకార వేతన పరీక్షలను కూడా నిర్వహిస్తున్నది. 1981 లో ఈ పరీక్షలు దేశంలో 21 కేంద్రాలలో నిర్వహించారు.

## కేంద్రీయం విద్యాలయం సంఘటన

రక్షణదళాలలో పనిచేసే ఉద్యోగులతోసహా, బదిలీలు ఉండే అన్ని కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల పిల్లల సౌకర్యార్థం ఉన్నత పాఠశాలలలో ఒకేరకమైన పాఠ్య ప్రణాళికలు ఉండేటట్లు ఒకేరకమైన బోధనా భాష ఉండేటట్లు మరియు సామాన్య విద్యా సౌకర్యాలు అందించే నిమిత్తమై నవంబరు, 1962 లో జాతీయ విద్యాలయాల ప్రణాళికను అంగీకరించడమైంది. ఆ విధంగా మొదటి చర్యగా 20 రెజిమెంటల్ పాఠశాలలను (Regimental Schools) స్వాధీనపరచుకొని కేంద్రీయ పాఠశాలలు లేక కేంద్రీయ విద్యాలయాలుగా నామకరణం చేయడం జరిగింది. 1981-82 నాటికి వీటి సంఖ్య 366 కు చేరింది. 30-4-1981 నాటికి నమోదైన విద్యార్థుల సంఖ్య 251, 848 1980-81 లో ఈ సంఖ్య 224, 203 అంటే 1981-82 కి 9% పెరుగుదలను సూచిస్తున్నది. ఉపాధ్యాయ, ఉపాధ్యాయేతర సిబ్బంది మొత్తం సంఖ్య 15,478.

ఈ కేంద్రీయ విద్యాలయ సంఘటన (Kendriya Vidyalaya Sanghatana) ను 11 మండలాలుగా విభజించారు. భోపాల్, బొంబాయి, ఢిల్లీ, చండీఘర్, గాంధీనగర్, గౌహతి, లక్నో, మద్రాస్, పాట్నా, కలకత్తా, హైదరాబాద్‌లలో వాటి కార్యాలయాలున్నాయి. ఉపాధ్యాయ సిబ్బందికి, పర్యవేక్షకులకు ఉద్యోగాలు చేస్తుండగానే శిక్షణనిచ్చి (In-Service Training) వారి వృత్తి పరిజ్ఞానాన్ని పెంపొందించడానికి దోహదపడుతున్నారు. కేంద్రీయ విద్యాలయాలన్నీ ఆదర్శ విద్యాలయాలుగా పేరుతెచ్చుకోవడానికి నిత్యం కృషి చేస్తున్నది. ఈ ధ్యేయానికి అనుగుణంగా అనేక విద్యా సంస్కరణలు కూడా అమలులోకి తెచ్చి బోధనా పద్ధతులను మెరుగుపరచాయి.

## జాతీయ వయోజన విద్యా కార్యక్రమం (NAEP)

జాతీయ వయోజన విద్యా కార్యక్రమం గాంధీ జయంతి రోజున 2 వ తేదీ అక్టోబరు 1978 లో భారతదేశంలో నిరక్షరాస్యతను నిర్మూలించే సాధనంగా ప్రవేశపెట్టబడింది. 1980 వ సంవత్సరం అంచనాల

ప్రకారం, దేశంలో 15 సంవత్సరాల వయస్సు తరువాత నిరక్షరాస్యుల సంఖ్య 230 మిలియన్లకన్నా తక్కువేమీ కాదు. 1983-84 నాటికి అంటే 5 సంవత్సరాల వ్యవధిలో 15-35 సంవత్సరాల ప్రాయంవారిని కనీసం 65 మిలియన్ల నిరక్షరాస్యులకు అక్షరాస్యతను కలిగించాలనే ధ్యేయంలో NAEP ఉంది.

ఈ కార్యక్రమంలో స్వచ్ఛంద సేవా సంస్థలకు ప్రాథమిక బాధ్యతను అప్పగించవలసి ఉంది. అభివృద్ధి మండలాలు ముఖ్యమైన కేంద్రాలుగా ఈ కార్యక్రమానికి ఉంటాయి ప్రతీ కేంద్రంలోనూ ఒక శిక్షకుడు (Inustructor) ఉంటాడు. అతనికి రూ॥ 100/- లు నామమాత్ర జీతం ఇవ్వడం జరిగింది.

అక్షరజ్ఞానాన్ని నిరక్షరాస్యులలో కలిగించడమేకాకుండా దీనిని వారిలో సజీవంగా ఉండేటట్లు కూడా చేయవలసి ఉంది. ఈ ప్రమాదం వల్లనే నాలుగురకాల ధ్యేయాలను ఈ కార్యక్రమం కలిగి ఉంది.

## జాతీయ వయోజన విద్యా ధ్యేయాలు

(i) తరువాత అభివృద్ధిని కూడా చేపడుతూ అక్షర పరిజ్ఞానాన్ని అందించడం.

(ii) ప్రస్ఫుటమైన అభివృద్ధి కార్యక్రమానికి మద్దతునిస్తూ (Conventional Functional Literacy) ని అందించడం.

(iii) నేర్చుకొంటూ పనిచేసే సమూహాలకు అక్షరాస్యత కలిగించడం.

(iv) పేదసంఘాల (Organisation of the Poor) ఏర్పాటు కోసం అక్షరాస్యతను కలిగించడం.

స్వచ్ఛంద సేవాసంస్థల సంఖ్య 500 వరకు చేరేటట్లు, వీటి అజమాయిషీలో 20,000 కేంద్రాలు నడిచేటట్లు, సుమారుగా 6 లక్షల మంది ఈ కేంద్రాలలో నమోదయ్యేటట్లు, ప్రస్తుత సంవత్సరంలో ప్రత్యేక కృషి జరుగుతున్నది.

జాతీయ వయోజన విద్యా కార్యక్రమం 1980 మే లో జరిపిన సర్వేననుసరించి చూసినట్లయితే అనుకున్నంత మేరలో ఫలితాలను సాధించ లేక పోయింది. అయితే ఆ నాటికి సాధించిన ప్రగతి భావి కార్య క్రమాలకు ప్రోత్సాహకరంగానే ఉంది.

## ఉన్నత విద్య (Higher Education)

భారత దేశంలో ఉన్నత విద్య కళలలోను (Arts) విజ్ఞాన శాస్త్రాలలోనూ (Sciences) వైజ్ఞానిక రంగాలలోను, ఇంజనీరింగు, టెక్నాలజీ, లా, విద్య మొదలైన అన్ని విషయాలలోను కళాశాలలో అందించడం జరుగుతోంది.

## విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం (U.G.C.)

దీనిని 1953 లో ప్రవేశపెట్టారు. ఇది భారత దేశంలో విశ్వ విద్యాలయ విద్యను సమన్వయపరుస్తూ బోధనా పరీక్షల, పరిశోధనల ప్రమాణాలను పెంపొందేటట్లు ప్రోత్సహిస్తుంది.

ఈ గ్రాంట్ల సంఘం ముఖ్యంగా మూడు అంశాలను ప్రతిపాదించింది.

1. బాహ్యపరీక్షలను క్రమంగా తొలగిస్తూ, ఆంతరంగిక ప్రతిభా పరీక్షలను ప్రవేశపెట్టడం. నిరంతరం విద్యార్థులను పరీక్షిస్తూనే ఉండటం. (Continuous Evaluation).
2. ప్రశ్నా బ్యాంకులను (Question Bank) సృష్టించడం.
3. మార్కుల పద్ధతి స్థానంలో గ్రేడుల పద్ధతిని ప్రవేశపెట్టడం.

ప్రస్తుత పరీక్షా విధానంలో వ్యాసాలరీతిలో జవాబులను 3 గంటల వ్యవధిలో ఎకడమిక్ టర్మ్ అంతంలో విద్యార్థి వ్రాస్తాడు. ఈ మూడు గంటల వ్యవధి అతనికి చాలా క్లిష్టంగా ఉంటుంది. ఎందు వల్లనంటే అతని మొత్తం ప్రతిభనంతటినీ ఈ వ్యవధిలో నిర్ణయించడం జరుగుతుంది.

1964 వ సంవత్సరంలోనే, ఈ పద్ధతిని మార్చాలని గుర్తించడం జరిగింది. విద్యా కమిషన్ (Education Commission) తన ఆ

సంవత్సరం నివేదికలో, బాహ్యాపరీక్షా విధానానికి మద్దతుగా ఇంటర్నల్ ఎసెస్‌మెంటును కూడా ప్రవేశపెట్టాలని, విద్యార్థులను ఎప్పటికప్పుడు పరీక్షిస్తుండాలని, పొందుపరచడం జరిగింది. ఇంటర్నల్ ఎసెస్‌మెంటు ఫలితాలను విడిగా, బాహ్యాపరీక్షల మార్కులతో కలపకుండా సూచించాలి.

## భారతదేశంలో విశ్వవిద్యాలయాల ప్రగతి

1857 లో మొదటిసారిగా, ఆధునిక విశ్వవిద్యాలయాలను, బొంబాయి, కలకత్తా, మద్రాస్ ప్రెసిడెన్సీ పట్టణాలలో స్థాపించడం జరిగింది. 1948 నాటికి భారతదేశం మొత్తంలో 21 విశ్వవిద్యాలయాలు మాత్రమే ఉండేవి. 1977-78 నాటికి 105 విశ్వవిద్యాలయాలు, 10 విశ్వవిద్యాలయాలుగా పరిగణించబడిన విద్యాసంస్థలు ఉండేవి.

విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలలోను 1978 - 80 లో 26.5 లక్షలమంది నమోదుకాగా, 1980-81 లో 27.5 లక్షలమంది నమోదైనారు.

## విద్యకు, సంస్కృతికి 6 వ ప్రణాళికలో కేటాయింపులు

(కోట్ల రూపాయలలో)

| క్రమ సంఖ్య | సబ్-హెడ్ | రాష్ట్రాలు కేంద్రపాలిత ప్రాంతాలు | కేంద్రం | మొత్తం |
|---|---|---|---|---|
| (0) | (1) | (2) | (3) | (4) |
| 1. | (Early Childhood) బాల్యము మరియు ప్రాథమిక విద్య | 851.07 | 54.30 | 905.37 |
| 2. | ఉన్నతపాఠశాల విద్య | 370.00 | 28.01 | 398 01 |
| 3. | ఉపాధ్యాయ విద్య | 22.00 | * | 22.00 |

| క్రమ సంఖ్య | సబ్-హెడ్ | రాష్ట్రాలు కేంద్రపాలిత ప్రాంతాలు | కేంద్రం | మొత్తం |
|---|---|---|---|---|
| (0) | (1) | (2) | (3) | (4) |
| 4. | విశ్వవిద్యాలయము మరియు ఉన్నత విద్య | 197.00 | 288.75 | 485.75 |
| 5. | వయోజన విద్య | 68.00 | 60.00 | 128.00 |
| 6. | భౌతిక విద్య, క్రీడలు మరియు యువజన సంక్షేమం | 69.00 | 24.54 | 93.54 |
| 7. | తదితర కార్యక్రమాలు | 69.41 | 60.15 | 129.56 |
| | సామాన్య విద్య (General Education) మొత్తం | 1646.48 | 515.75 | 2162.23 |
| 8. | కళ (Art) మరియు సంస్కృతి | 32.90 | 51.00 | 83.90 |
| 9. | సాంకేతిక విద్య | 109.61 | 168.00 | 277.61 |
| | మొత్తం | 1788.99 | 734.75 | 2523.74 |

* ఉన్నతపాఠశాల విద్యలో కలుపబడింది.

# ఐదవ పంచవర్ష ప్రణాళిక వ్యయం (1974-79)

(Fifth Five Year Plan Outlay 1974—79)

కోట్ల రూపాయలలో (Rs. Crores)

| తిరిగి సమర్పించిన 5 వ ప్రణాళిక (Revised Fifth Plan) | |
|---|---|
| | 1974 — 79 |
| 1. విద్య<br>[1. Education] | 1,284-29 |
| 2. సాంఘిక, సాముదాయిక సేవా కార్యక్రమాలు, ఆర్థిక, సామాన్య సేవా కార్యక్రమాలతో సహా విద్యను మినహాయించి<br>[2. Social and Community Services [Including Economic and General Services But Excluding Education] | 4,766-77 |
| 3. పర్వత, కొండజాతి ప్రాంతాలు, NEC స్కీములు<br>[3. Hill and Tribal Areas and NEC Schemes] | 450-00 |

## విద్య (Education)

(కోట్ల రూపాయలలో)

| ఉపాంశం (Sub-Head) | కాగల వ్యయం 1974—77 | ఉద్దేశించింది 1977—79 | ఉద్దేశించిన ప్రణాళికా కేటాయింపు |
|---|---|---|---|
| 1. ప్రాథమిక విద్య | 180 | 230 | 410 |
| 2. ఉన్నత పాఠశాల విద్య | 111 | 139 | 250 |
| 3. విశ్వవిద్యాలయ విద్య | 140 | 152 | 292 |
| 4. ప్రత్యేక విద్య | 9 | 9 | 18 |
| 5. ఇతర కార్యక్రమాలు | 57 | 65 | 122 |
| 6. మొత్తం (సామాన్యవిద్య) | 497 | 595 | 1,092 |
| 7. సాంకేతిక విద్య | 75 | 81 | 156 |

| నమోదు వృద్ధి (Growth of Enrolment) | తరగతులు I-V Classes I-V (లక్షలలో) | | | తరగతులు VI-VIII (లక్షలలో) | | |
|---|---|---|---|---|---|---|
| | బాలురు | బాలికలు | మొత్తం | బాలురు | బాలికలు | మొత్తం |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| I. 1973-74 పరిస్థితి | 396 (100) | 245 (66) | 641 (84) | 107 (48) | 46 (22) | 153 (36) |
| II. 1974-77 (అదనపు సాధింపు) | 37 | 33 | 70 | 17 | 12 | 29 |
| III. 1977-79 (అనుకున్న అదనపు టార్గెట్) | 30 | 30 | 60 | 16 | 13 | 29 |
| II+III 1974-79 అదనపు సాధింపు | 67 | 63 | 130 | 33 | 25 | 58 |

21)

## వ్యయం

కోట్ల రూపాయలలో
(Rs. Crores)

| | కేంద్రం Centre | రాష్ట్రాలు కేంద్రపాలిత ప్రాంతాలు States & U.Ts. | మొత్తం Total |
|---|---|---|---|
| I. విద్య Education | 405.29 | 879.00 | 1284.29 |
| II. సాంఘిక మరియు సాముదాయిక సేవాకార్యక్రమాలు (ఆర్థిక, సామాన్య సేవాకార్యక్రమాలు విద్య మినహా) Social and Community Services - (including economic and general Services but excluding education) | 1904.69 | 2862.08 | 4766.77 |
| III. పర్వత మరియు కొండజాతుల ప్రాంతాలు మరియు NEC స్కీములు Hill and Trible areas and NEC Schemes.) | — | 450.00 | 450.00 |

## ఉద్దేశించిన ప్రణాళిక వ్యయాలు
## 1977 - 79 20 అంశాల ఆర్థిక కార్యక్రమాన్ననుసరించి
## Proposed Plan Outlays
## (Under the 20 Point Economic Programme 1977-79)

రూ. లక్షలలో
(Rs. Lakhs)

| | కేంద్రం Centre | రాష్ట్రాలు కేంద్రపాలిత ప్రాంతాలు States & U. Ts. |
|---|---|---|
| విద్య (Education) | | |
| (a) పుస్తక బ్యాంకు (a) Book Bank | 300 | 1,164 * |
| (b) విద్యార్థి సహాయనిధి (b) Student aid fund | 130 | — |
| (c) సాంకేతిక విద్య క్రింద అప్రెంటిస్ శిక్షణ (c) Appranticeship Training under Technical Education | 270 | 273 |

* ఇది పుస్తకాల ఉచిత సరఫరాను, పుస్తక సామగ్రిని కలుపుతూ
* (This includes free supply of books and stationary)

అయిదవ పంచవర్ష ప్రణాళికలో మొత్తం ఖర్చు 1974-75 లో, 1,450 కోట్ల రూ.ల నుంచి 1976-77 లో 2,287 కోట్ల రూ.ల వరకు అంచనా వేయబడింది.

1. ప్రాథమిక విద్యకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. అదనంగా నమోదు చేయడానికి ఎక్కువమంది ఉపాధ్యాయులను, ఎక్కువ తరగతులు నిర్వహించడానికి, ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలలో నిర్వహించడానికి అవకాశం కల్పించబడింది.

* ఈ కింద ఉదహరించిన పట్టిక V ప్రణాళికలో సాధించవలసిన ప్రగతిని సూచిస్తున్నది.

2. ఉన్నత పాఠశాల విద్య విషయంలో IX-X-XII క్లాసులలో నమోదయిన 14-17/18 వయస్సున్న పిల్లలు 1973-74 లో ఉన్న 20 శాతం నుంచి 1978-79 నాటికి 25 శాతానికి చేరవలసి ఉంది.

3. వెనుకబడిన ప్రాంతాల, బలహీనవర్గాల ప్రజలకు అదనపు విద్యా సౌకర్యాలు, విశ్వవిద్యాలయ విద్యలో కల్పించడమైంది. సాయంకాల కళాశాలలు, కరస్పాండెన్స్ కోర్సులు, ప్రైవేట్ స్టడీని విస్తృతపరుస్తారు. సమ్మర్ ఇన్స్టిట్యూట్, సెమినార్‌లు, శిక్షణ కోర్సులు (orientation courses) ద్వారా ఉపాధ్యాయుల అభివృద్ధి (Faculty development) చేయడము జరుగుతుంది.

4. అప్పటివరకు ఉన్న నాన్ ఫార్మల్ ఎడ్యుకేషన్ (Non-Formal Education) ను పటిష్ఠంచేస్తూ 16 లక్షల మందికి లాభంచేకూర్చడానికి ఉద్దేశించడమైంది.

5. 1974-75 ల నుంచి 12,000 (awards) నగదు బహుమతులను ప్రణాళికేతర బడ్జెటునుంచి ఇవ్వడం జరుగుతుంది. V వ ప్రణాళికలోని మొదటి 2 సంవత్సరాలలో జాతీయ ఉపకారవేతన స్కీము (National Scholarship Scheme) లో 3,000 నగదు బహుమతులను 1077-78 లో 7,000; 1978-79 లో 10,000 నగదు బహుమతులను ఇవ్వడానికి నిర్ణయించడమైంది. గ్రామీణ ప్రాంతాల నుంచి వచ్చే ప్రతిభావంతులైన పిల్లలకు 1974 నుంచి 77 వరకు ప్రతీ సంవత్సరంలో 10,000 ఉపకారవేతనాలు 1977 - 79 లో 15,000 పెంచడానికి నిశ్చయించడమైంది.

-77 లో నియమించే ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలు
మంది హిందీ ఉపాధ్యాయులకు అదనంగా 1977-79 లో
మందిని, హిందీ భాషేతర రాష్ట్రాలలో నియమించడానికి
యించడమైంది.

కార్యక్రమాలలో ఉన్న నెహ్రూ యువక కేంద్రాలను పటిష్టం
ం అదనంగా మరికొన్ని నెహ్రూ యువక కేంద్రాలను స్థాపించ
; ఉద్దేశించబడింది. కేంద్ర గ్రంథాలయాల అభివృద్ధి, జాతీయ
పథకాన్ని విస్తృతపరచ నిశ్చయించడమైంది.

సంస్కృతిక కార్యక్రమాలలో సాహిత్య, సంగీత, నాటక లలిత
ను జాతీయ అకాడమీలను మరింత విస్తృత పరచాలని అభిల
వడమైంది.

అంశాల ఆర్థిక కార్యక్రమం కింద విద్యార్థులకు అచ్చు, నోట్సు
స్తకాలు, చౌకధరలకు అందించడం, వసతి గృహాలలో నివసించే
ర్థులకు సరుకులను చౌకధరలకు అందించడం బుక్ బ్యాంకులను
పడానికి అవకాశం కల్పించడమైంది.

ఈ ప్రణాళికలో రకరకాల కార్యక్రమాలను నిర్వహించడానికి
వ పొందుపరచిన విధంగా కేటాయింపులు చేయడమైంది.

## ఏ ప్రణాళిక సాధారణ విద్యా పునర్విమర్శ
## eral Education — Review of IV Plan]

## సాయాల వ్యాప్తి

విద్యా సౌకర్యాల వ్యాప్తిలో చాలా ప్రగతి సాధించినా ప్రాథ
విద్య కోసం పెట్టుకున్న ఆశయాలు ( Target ) ను చేరలేక
కం జరిగింది. ఉన్నత పాఠశాలా విద్యలో కూడా అంతగా సాధించ
గాని ఉన్నత విద్యలో అనుకున్నదానికన్నా ఎక్కువగా సాధించడ
ని. ప్రాథమిక విద్యలో ముఖ్యంగా బాలికల విషయంలో ఈ ఆశ
లు బాగా తప్పినది.

## నాల్గవ ప్రణాళిక నమోదు టార్గెట్లు మరియు సాధించిన విజయాలు

(లక్షలలో)

| | 1968-69 | 1973-74 (టార్గెటు) | 1973-74 కాగలస్థితి |
|---|---|---|---|
| (0) | (1) | (2) | (3) |
| **6—11 / I—V** | | | |
| బాలురు | 342.10 (93) | 412.50 (105) | 393.53 (100) |
| బాలికలు | 201.79 (57) | 273.30 (73) | 244.01 (66) |
| మొత్తం | 543.89 (76) | 685.80 (90) | 637.54 (84) |
| **11—14 / VI — VIII** | | | |
| బాలురు | 87.11 (45) | 121.90 (56) | 104.92 (48) |
| బాలికలు | 33.40 (18) | 59.10 (29) | 45.37 (22) |
| మొత్తం | 120.51 (33) | 181 00 (45) | 150.29 (36) |
| **14—17 / 18 / IX—XI / XII** | | | |
| బాలురు | 50.90 (29) | 70.00 (35) | 61.60 (31) |
| బాలికలు | 17.40 (10) | 26.90 (14) | 23.40 (12) |
| మొత్తం | 68.30 (20) | 96.90 (25) | 85.00 (22) |
| **17—23 / విశ్వవిద్యాలయాల దశ** | | | |
| మొత్తం | 16.90 (2.9) | 26.60 (3.9) | 30.00 (4.4) |

# అక్షరాస్యతా రేట్లు
# మొత్తం జనాభాలో అక్షరాస్యుల శాతము

# Literacy Rates
# Literates as Per Cent to total Population

1981 జనాభా లెక్కల ప్రకారం
(1981 Census)

| రాష్ట్రము State | వ్యక్తులు Persons | పురుషులు Males | స్త్రీలు Females |
|---|---|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ Andhra Pradesh | 29.72 | 39.03 | 20.18 |
| 2. బీహారు Bihar | 26.01 | 37.78 | 13.58 |
| 3. గుజరాత్ Gujrat | 43.75 | 54.53 | 32.31 |
| 4. హర్యానా Haryana | 35.84 | 47.78 | 22.23 |
| 5. హిమాచల ప్రదేశ్ Himachala Pradesh | 41.94 | 52.36 | 31.39 |
| 6. కర్ణాటక Karnataka | 38.41 | 48.61 | 27.83 |
| 7. కేరళ Kerala | 69.17 | 74.03 | 64.48 |
| 8. మధ్యప్రదేశ్ Madhya Pradesh | 27.82 | 39.38 | 15.53 |
| 9. మహారాష్ట్ర Maharastra | 47.02 | 58.65 | 34.63 |
| 10. మణిపూర్ Manipur | 41.52 | 52.67 | 30.05 |

| రాష్ట్రము State | వ్యక్తులు Persons | పురుషులు Males | స్త్రీలు Females |
|---|---|---|---|
| 11. మేఘాలయ Meghalaya | 33.35 | 36.97 | 29.55 |
| 12. నాగాలాండ్ Nagaland | 41.99 | 49.16 | 33.72 |
| 13. ఒరిస్సా Orissa | 34.12 | 46.90 | 21.11 |
| 14. పంజాబ్ Punjab | 40.74 | 46.59 | 34.14 |
| 15. సిక్కిం Sikkim | 33.92 | 43.82 | 22.09 |
| 16. రాజస్థాన్ Rajasthan | 24.05 | 35.82 | 11.31 |
| 17. తమిళనాడు Tamilnadu | 45.78 | 57.19 | 34.12 |
| 18. త్రిపుర Tripura | 41.78 | 51.27 | 31.77 |
| 19. ఉత్తరప్రదేశ్ Uttar Pradesh | 27.40 | 38.90 | 14.42 |
| 20. పశ్చిమ బెంగాలు West Bengal | 40.88 | 50.49 | 30.33 |
| కేంద్రపాలిత ప్రాంతాలు Union Territories | | | |
| 1. అండమాన్ మరియు నికోబార్ దీవులు Andaman & Nikobar Islands | 51.27 | 58.44 | 41 85 |
| 2. అరుణాచల్ ప్రదేశ్ Arunachal Pradesh | 20.09 | 27.98 | 11.02 |

| రాష్ట్రము States | వ్యక్తులు Persons | పురుషులు Males | స్త్రీలు Females |
|---|---|---|---|
| ఘర్ ...ndigarh | 64.68 | 68.82 | 59.30 |
| ...ర్ మరియు ...ర్ హావేలీ ...dra & Nagar Haweli | 26.60 | 31.19 | 16.75 |
| ...lhi | 61.06 | 67.96 | 52.56 |
| ...గా, డామన్ మరియు ...య్యు ...a Daman & Diu | 55.86 | 64.77 | 46.78 |
| ...దీవులు ...kshadweep | 54.72 | 64.97 | 44.21 |
| ...జోరం ...izoram | 59.50 | 65.99 | 52.57 |
| ...ండిచ్చేరి ...ondicherry | 54.07 | 64.09 | 43.91 |

విద్య అనేది జీవితాంతం విజ్ఞానాన్ని అందించి శిక్షణ అన్ని ...లలో మానవ ప్రగతికి చాలా ముఖ్యమైంది. ఇది జీవితాంతం నేర్చుకొనేటట్లు దోహదం చేస్తుంది. విద్య అనేది మానవుని ...స్సును, జీవనరీతులను అభివృద్ధిపరచే సాధనంగా ఉండాలి. అంతే ...డా మానవుని మేధస్సును సాంఘిక ఉత్తేజాన్ని అభివృద్ధిచేసి ...oబంధమైన అభివృద్ధిని (Emotional Development) అందించే ... ఉండాలి. ఇది మానవునికి తన నిత్యజీవితంలో ప్రాథమికావసరా ...తీర్చుకోవడంలో ఎంతో సహాయపడుతుంది. ఫార్మల్ (Formal) ...-ఫార్మల్ (Non-Formal) విధానాలు సంఘటితపరుస్తూ విద్యా

కార్యక్రమాలను చేపట్టేటట్లు మన విద్యా ప్రణాళికలుండాలి. ప్రతీ మానవుడు తన స్థానిక ఆవరణను సరిగా అవగాహన చేసుకొనేటట్లు, అక్షర పరిజ్ఞానాన్ని, సాంఖ్యిక పరిజ్ఞానాన్ని తదితర నైపుణ్యాలను పెంపొందించేటట్లు, దోహదపరచేరీతిలో విద్య ఉండాలి.

మానవ వనరులు అభివృద్ధి (Human Resource Development) కార్యక్రమాలు ముఖ్యంగా 4 రకాలుగా (Four — Fold Perspective) రూపకల్పన చేయడం జరిగింది.

1. వ్యక్తులు మంచిపౌరులుగా తమ పాత్రలను పోషించేటట్లు చేయడం
2. శాస్త్రీయ దృక్పథం అలవడేవిధంగాను, తమ హక్కులను, బాధ్యతలను తెలుసుకొనేటట్లుగాను చేసి, అభివృద్ధి కార్యక్రమాలను అవగాహన చేసుకొనే సామర్థ్యాన్ని పెంపొందించడం.
3. సాంఘిక, సాంస్కృతిక, నైతిక విలువలను గుర్తించి ఒక చైతన్య జాతిగా [Enlightened Nation] తయారవ్వేలా చేయడం.
4. దేశాభివృద్ధిలో ఉత్పత్తి కార్యక్రమాల కొరకై పాటుపడేరీతిలో వారిలో విజ్ఞానాన్ని, నైపుణ్యతను, అభిలాషలను కలిగించడం.

## ఆరవ ప్రణాళిక

పై అంశాలను సాధించాలంటే ఈ కింద పేర్కొన్న ధ్యేయాలను 6 వ ప్రణాళిక ద్వారా సాధించవలసి ఉంది.

1. సంఘ సంక్షేమార్థం నిర్వహించే కార్యక్రమాలలో ప్రజలు బాగా పాల్గొనే విధంగా చేయడం ప్రజల జీవితంలో గుణాత్మక ఉన్నతి కోసం ప్రజలందరకు సమాన విద్యావకాశాలు తప్పకుండా అందేట్లు చేయడం.
2. యువకులకు, పెద్దవారికి వయసుతో నిమిత్తంలేకుండా వారి స్వయం సమృద్ధి కోసం అవకాశాలను కలుగజేయడం.
3. సాంఘిక మార్పులలో ఎప్పటికప్పుడు సర్దుబాటు చేసుకోవడానికి వారి [సామర్థ్యం] శక్తి యుక్తులను పెంపొందించేరీతిలో వారి

భౌతిక, మేధాసంబంధమైన, సాంస్కృతిక అభివృద్ధి కోసం వారికి జీవితాంతం నిరంతర విద్య నందించడం.

4. సముదాయం ఆర్థిక, సాంఘిక ధ్యేయాల ననుసరించి విద్య, ఉపాధి, అభివృద్ధులమధ్య ప్రయోజనాత్మకమైన సంబంధాలను నెలకొల్పడం.

5. జాతి సమగ్రత, లౌకిక (Seculaisum) ప్రజాస్వామ్యం, శ్రమపై గౌరవభావాల (Dignity of Labour) విలువలతో నమ్మకం పెంపొందించడం వాటిపై గౌరవాన్ని, ఆదరాన్ని ప్రోత్సహించడం.

6. విద్యావంతులలో పేదరికం, నిరక్షరాస్యత సమస్యల పరిష్కారానికి కార్యదీక్షను పెంపొందించడం ఆవరణను తక్కువగా చూడటం (Environmental Degradation) విషయంలో జ్ఞానోదయం (Sensitive) కలిగించడం.

7. జాతీయాభివృద్ధి కోసం యువకులను పాల్గొనేటట్లు చేసి వారినిఅభి వృద్ధి పరచడం, సమీకరించడం, వారిశక్తిని సరైనరీతిలోవినియోగించడం.

8. సంస్కృతి, విద్య, దేశ సమైక్యతల సాధనాలుగా కళలు సంగీతం, కవిత్వం, నృత్యం, జానపద కళల అభివృద్ధికి మద్దతునివ్వడం.

## సమీక్ష

6.5 లక్షల పాఠశాలలు, విద్యాలయాలు, కళాశాలలు 3 మిలియన్ల ఉపాధ్యాయులు, 3,000 కోట్ల రూపాయలు వెచ్చించినప్పటికి భారత రాజ్యాంగ ఆదేశిక సూత్రాల ననుసరించిన రీతిలో 14 సంవత్సరాలలోపు బాలలందరికీ విశ్వజనీన విద్య సాధించాలన ధ్యేయాన్ని సాధించటం జరుగలేదు. ప్రాథమికవిద్యలో 1950–51 నాటి 223 లక్షల నమోదయిన I—VIII తరగతుల విద్యార్థులు 1979–80 నాటికి 905 లక్షల మందికి చేరుకున్నారు. ఏదిఏమైనప్పటికి, ప్రాథమిక, ప్రాథమికోన్నత విద్యలలో నమోదైన ప్రతీ ముగ్గురు పిల్లలకు ఒక నమోదు కాని విద్యార్థిని వదిలివేయడం జరిగింది. ఒక డజను రాష్ట్రాలలో 80 శాతం కంటే అధికంగా నమోదుకాని విద్యార్థులు ఇప్పటికే ఉన్నారు. ఎందువల్లనంటే విశ్వజనీన విద్యకు కావలసిన వనరులను వారు సమకూర్చుకోలేకపోవడంవల్ల.

# గ్రామీణ / పట్టణ
# Rural Urban

| (1) | (2) | (3) | (4) | (5) |
|---|---|---|---|---|
| Sl. No. క్రమ సంఖ్య | | మొత్తం (Total) గ్రామీణ (Rural) పట్టణ (Urban) | విస్తీర్ణం [Area] చ॥కి॥మీ॥ km² | జనాభా [Population] మనుష్యులు [Persons] |
| 1. | భారతదేశం [India] | మొత్తం [Total] | 2986.4 | 658,140,676 |
| | | గ్రామీణ [Rural] | | 501,952,169 |
| | | పట్టణ [Urban] | | 156,188,507 |

## జనాభా - అక్షరాస్యులు

## Population and Literates

| (6) | (7) | (8) | (9) | (10) |
|---|---|---|---|---|
| పురుషులు [Males] | స్త్రీలు [Females] | చ॥ కి॥ మీ॥ నకు జనాభా సాంద్రత Density of Population per km² | 1000 మంది పురుషులకు స్త్రీలు (Females Per 1000 Males) | జనాభాలో పెరుగుదల రేటు శాతం [1971-81] Percentage growth rate of population [1971—81] |
| 339,895,757 | 318,244,919 | 220 | 936 | 24.43 |
| 256,836,180 | 245,115,989 | | 954 | 18.96 |
| 83,059,577 | 73,128,930 | | 880 | 46.02 |

| (11) | (12) | (13) |
|---|---|---|
| | అక్షరాస్యుల సంఖ్య (Literate Population) | |
| మనుష్యులు (Persons) | పురుషులు (Males) | స్త్రీలు (Females) |
| 237, 737, 800 | 158, 794, 887 | 78, 942, 913 |
| 148, 420, 025 | 104, 323, 813 | 44, 096, 212 |
| 89, 317, 775 | 54, 471, 074 | 34, 846, 701 |
| కేరళలో అత్యధిక అక్షరాస్యతా రేటు [Highest Literate Rate in Kerala] | 69.17% | 24.05% |
| కేరళలో పురుషులలో అత్యధిక అక్షరాస్యతా రేటు [Highest Literate Rate in Males] | 74.03% | 20.09% |
| కేరళలో స్త్రీలలో అత్యధిక అక్షరాస్యతా రేటు [Highest Literate Rate in Female] | 64.48% | 30.04% |

| (14) | (15) | (16) |
|---|---|---|
| మొత్తం జనాభాలో అక్షరాస్యుల శాతం [Literate as per Cent to Total Population] | | |
| మనుష్యులు [Persons] | పురుషులు [Males] | స్త్రీలు [Females] |
| 36.12 | 46 72 | 24.81 |
| 29.57 | 40 62 | 17.99 |
| 57.19 | 65.58 | 47.65 |

అతి తక్కువ అక్షరాస్యతా రేటు – రాజస్థాన్‌లో ఉన్నది.

[Rajastan Lowest Rate of Literacy]

కేంద్రపాలిత ప్రాంతాలలో అతి తక్కువ అక్షరాస్యతా రేటు — అరుణాచల్‌ప్రదేశ్‌లో ఉన్నది.

[Arunachal Pradesh — Union Teritory Lowest Rate of Literate]

అరుణాచల్‌ప్రదేశ్ కేంద్రపాలిత ప్రాంతాలలో స్త్రీలలో అతి తక్కువ అక్షరాస్యతా రేటు ఉన్నది.

[Arunachal Pradesh — Union Teritory Lowest Rate of Literate]

సాంఘికంగా వెనుకబడిపోయిన, ఆర్థికంగా
షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ జాతుల పిల్లలు
అంచులలోనే ఇంకాఉన్నారు. [Periphery of S
ఇంకా 48 శాతం షెడ్యూల్డ్ కులాల పిల్లలు [
20 శాతం బాలికలు) 56 శాతం షెడ్యూల్డ్ జాత
బాలురు, 70 శాతం బాలికలు) ఇంకా విద్య
ఈ విషయంలో, నాల్గవ విద్యాపరిశోధన [Fou
Scheme] ననుసరించి, పాఠశాలలు లేకపోవడ
[Constraint] లేక హేతువుకాదు. ఈ రకం
జరిగే అభివృద్ధి వారి సాంఘిక, ఆర్థిక పరిస్థితు
స బంధంలేని విద్యాప్రణాళికలు పాఠశాలలలో అతి
లోపించడం కొన్ని కారణాలుగా చెప్పుకోవచ్చు.
సదుపాయాలనుకూడా సరిగా వినియోగించుకో
నమోదయిన [విద్యార్థులలో] పిల్లలలో 20 శాత
ఉన్నవారు, తక్కువ వయస్సు ఉన్నవారు ఉన్నా
చేరిన విద్యార్థులు, 64 శాతం వరకు 5 వ తరగతి
మానివేస్తున్నారు. ఇది వనరుల సద్వినియోగంలో
సామర్థ్యం లేకపోవడం తక్కువ ఉత్పాదనలను సూ
విద్యాజీవితం సంపూర్ణంగా లేనందున, ఆ బాలుడికి
వాటిల్లే సాంఘిక నష్టాన్ని గురించి వేరే చెప్పనక్క

గత మూడు దశాబ్దాలలో ఉన్నత పాఠ
విద్యల విషయంలో, చాలా సౌకర్యాలు కల్పించడ
గుణాత్మక అభివృద్ధికోసం, సంస్కరణలు, విద్యా
కరణ 1968 నాటి జాతీయ విద్యావిధానం [Nat
Education] ప్రకారం ఇంకా జరగవలసి ఉంది.

## ణాళికలలో సంక్షేమ సేవలు

## es in Five Year Plan

త అంటే ఉద్యోగం చేయడానికి ఇష్టపడి, అర్హత కలిగి
కు ఉద్యోగావకాశాలు కల్పించడం ఉద్యోగం చేయ
అర్హత కలిగి ఉన్న అభ్యర్థులకు ఉద్యోగావకాశాలు
ని నిరుద్యోగిత (UnemPloyment) అంటారు.

అభివృద్ధిచెందుతున్న దేశం. మనకున్న వనరులకంటే మన
ఎక్కువ. కుటీర పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలను
డడం, పెట్టుబడిదారులు, పెట్టుబడి సంస్థలు తక్కువవడం,
ోధన లేదా శిక్షణ (Vocational Training) తక్కువైన
్య ఎక్కువయ్యే విద్యా విధాన లోపం, ఆధునీకరణా,
, సంబద్ధీకరణాల (Rationdisational వల్ల స్వయం
లను సరిగా అభ్యర్థులు అనుసరించకపోవడం, కుల వృత్తు
ం మొదలైన కారణాలు మన దేశంలో దోహదపడు

్యోగిత మూలంగా వ్యక్తిగత అవ్యవస్థత, కుటుంబ అవ్యవ
జిక అవ్యవస్థతలు సంభవిస్తాయి. ఇది మనిషి ఆర్థిక పత
స్తుంది. పేదరికాన్ని తీవ్రపరుస్తుంది.

త దేశంలో అందరికి ఉపాధికల్పనా ప్రణాళిక రూపొందిం
ాధ్యమైంది. భారతదేశంలో పట్టణ గ్రామీణ ప్రాంతాలలో
పొడుగునా నిరుద్యోగంతో బాధపడేవారున్నారు. లేదా
ో కొంత కాలపరిధిలో 4 నుంచి 6 నెలల వరకు నిరుద్యో
ధపడేవారున్నారు. వీరితోపాటు జనాభా రోజురోజుకీ విపరీ
గుతుండటంతో ఈ సమస్య తీవ్రత ఎక్కువవుతోంది.

## ఉద్యోగిత - ప్రథమ పంచవర్ష ప్రణాళిక

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఉద్యోగిత ప్రణాళిక, యుద్ధానంతర పరిస్థితులవల్ల చాలా అస్పష్టంగా తయారైంది. అందువల్ల లోతుగా నిరుద్యోగిత నివారణ చర్యలను చేపట్టడం జరగలేదు.

అనుబంధ ప్రాజెక్టులకు పెట్టుబడిపెట్టడానికి అదనపు ఉద్యోగావకాశాలు కల్పించడానికి, మొదటి పంచవర్ష ప్రణాళిక కేటాయించిన రూ. 2,069 కోట్లకు, రూ. 309 కోట్లు అదనంగా మంజూరుచేయడమైంది. 1953 ఆఖరు నాటికి, ప్రణాళికా సంఘం 11 అంశాల కార్యక్రమాన్ని ఎక్కువ ఉద్యోగావకాశాలు కల్పించడానికి రూపొందించింది. 11 అంశాల ముఖ్య అంశాలను కింద పొందుపరచడమైంది.

1. కట్టడాలున్నచోట్లలోను, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల సమీపంలో పని, శిక్షణ కేంద్రాలను నెలకొల్పడం.
2. చిన్నపరిశ్రమలు, వ్యాపారం చేసుకోవడానికి వ్యక్తులకు, చిన్న సమూహాలకు ప్రత్యేక సహాయం అందించడం.
3. మానవశక్తి [Man Power] తక్కువ ఉన్నచోట్ల, శిక్షణా కార్యక్రమాలను విస్తృతపరచడం.
4. కుటీర పరిశ్రమలు, చిన్నపరిశ్రమల ప్రోత్సాహానికి, వారు తయారు చేసిన వస్తువుల కొనుగోలును ప్రభుత్వ అధికారులు చేపట్టడం.
5. పట్టణాలలో వయోజన పాఠశాలలు, గ్రామాలలో ఒక ఉపాధ్యాయుడు ఉన్న పాఠశాలలను స్థాపించడం, ప్రోత్సాహించడం.
6. అధిక ఉపాధి అవకాశాలను కల్పించే జాతీయ విస్తరణ కార్యక్రమాలను బాగా విస్తృతపరచడం.
7. రోడ్డు రవాణాను పెంపొందించడం.
8. మురికివాడల నిర్మూలన కార్యక్రమాలను, తక్కువరాబడి వర్గాలకు గృహనిర్మాణాన్ని చేపట్టడం.
9. ప్రైవేటు బిల్డింగు కార్యకలాపాలను ప్రోత్సహించడం.
10. ప్రణాళికా బద్ధమైన సహాయాన్ని [Planned Assistance] శరణార్థులకు అందించడం.

11. ప్రథమ పంచవర్ష ప్రణాళికను, ఉపాధికల్పనావకాశాలను పెంచే రీతిలో సవరించడం.

## ఉద్యోగిత - రెండో పంచవర్ష ప్రణాళిక

రెండో పంచవర్ష ప్రణాళిక, మొదటి పంచవర్ష ప్రణాళికలో మిగిలిపోయిన 5.3 మిలియన్ల నిరుద్యోగులతో ప్రారంభమైంది. ఈ ప్రణాళిక కాలంలో మరో 10 మిలియన్ల మంది నిరుద్యోగులు కొత్తగా దీనికి కలుస్తారని అంచనావేయబడింది. అయితే ఈ పంచవర్ష ప్రణాళికలో 10 మిలియన్లమందికి ఉద్యోగావకాశాలు కల్పించి మిగతావారికి మూడో పంచవర్ష ప్రణాళికలో అవకాశం కల్పించాలని పథకంవేయడం జరిగింది. అయితే తరతరాల లెక్కల ప్రకారం 6.5 మిలియన్ల మందికి మాత్రమే రెండో పంచవర్ష ప్రణాళికా కాలంలో ఉద్యోగావకాశాలు కల్పించబడ్డాయి అంటే మొదట ఉండిపోయిన 5.3 మిలియన్లకు మరో 4 మిలియన్ల మంది సుమారు మరలా కలసి 9 మిలియన్ల మంది ఉద్యోగావకాశాలు లేక ఉండిపోవలసి వస్తుంది.

ఆ రకంగా భారతదేశంలో ఉద్యోగులు ఎంత ఎక్కువ అవుతున్నారో నిరుద్యోగులుకూడా అట్లాగే ఎక్కువ అవుతున్నారు.

## ఉద్యోగిత - మూడో పంచవర్ష ప్రణాళిక

ప్రణాళికా సంఘం లెక్కల ననుసరించి మరల క్రొత్త నిరుద్యోగులతో, నిరుద్యోగుల సంఖ్య మూడో ప్రణాళికా కాలంలో 17 మిలియన్లకు చేరుతుందని అంచనా వేయడం జరిగింది. మూడో ప్రణాళికలో 12 మిలియన్లమందికి ఉద్యోగావకాశాలను కల్పించాలని ఉద్దేశించారు.

## ఉద్యోగిత - నాల్గో పంచవర్ష ప్రణాళిక

భారత ప్రభుత్వ కార్మిక, ఉపాధి మంత్రిత్వశాఖనుబట్టి నాలుగో పంచవర్ష ప్రణాళిక, నిరుద్యోగుల సంఖ్య 40 మిలియన్లను దాటొచ్చని అంచనా వేయబడింది. వీరిలో 21 మిలియన్ల మంది కొత్తగా చేరిన నిరుద్యోగులయితే, 19 మిలియన్ల మంది కిందటి ప్రణాళికలలో మిగిలిన వారు. నాల్గో పంచవర్ష ప్రణాళికా కాలంలో 12 నుంచి 14 మిలియన్ల

నిరుద్యోగులకు ఉద్యోగావకాశాలు కల్పించాలని ధ్యేయంగా పెట్టడం జరిగింది. పారిశ్రామికఅభివృద్ధి నిర్మాణాత్మక విధానాన్నిబట్టి వ్యవసాయ కార్యకలాపాలకు పెట్టిన అధిక పెట్టుబడులనుబట్టి ఆశించిన టార్గెట్లుకంటే ఎక్కువగానే సాధించే అవకాశాలున్నాయని ఆశించడమైంది.

## ఆయిదో పంచవర్ష ప్రణాళిక - నిరుద్యోగిత

1974-86 కాలంలో 650 లక్షల మంది కొత్తగా కార్మికులు (Labour Force) నిరుద్యోగులుగా చేరతారని డ్రాఫ్టు ఐదవ పంచవర్ష ప్రణాళిక (Draft Fifth Plan) అంచనా వేసింది. ఏప్రిల్ 1977 లో జాతీయ గ్రామీణ ఉపాధి పథకం [National Rural Employment Programme] ప్రణాళికేతర స్కీముగా రూపొందించడం జరిగింది. స్వయం ఉపాధి కార్యక్రమాలను ప్రోత్సహించడం, ఇతర పథకాలద్వారా ఉద్యోగాలను కల్పించడం [Wage-Employment] ఈ ప్రణాళిక ధ్యేయం.

స్వయం ఉపాధి కార్యక్రమాలకు వృత్తిపరమైన శిక్షణ, ఉన్నత విద్యావంతులైన యువకులకు సంప్రదింపుల సహాయాలను అందించి [Consultancy Services] బ్యాంకుల నుంచి తదితర ఆర్థిక సంస్థల నుంచి వారికి కావలసిన ధనసహాయాన్ని ఋణరూపంలో అందించడం వంటి కార్యక్రమాలు ఉద్దేశించబడ్డాయి.

చిన్నరైతుల అభివృద్ధి సంస్థ [Small Farmers Development Agency S F D A], మార్జినల్ రైతులు, వ్యావసాయిక కార్మికులు [Marginal Farmers and Agricultural Labour] కరువు ప్రాంతాల కార్యక్రమం [Drought Prome Area Programme] వంటి కార్యక్రమాల ద్వారా గ్రామీణ అభివృద్ధికి అనేక ప్రత్యేక స్కీములనుకూడా రూపొందించడానికి ఉద్దేశించడమైంది.

# ఆరో పంచవర్ష ప్రణాళిక - నిరుద్యోగిత

6 వ పంచవర్ష ప్రణాళికా కాలంలో 1980-85 కాలంలో 340 లక్షలమంది అదనంగా కార్మికులు నిరుద్యోగులుగా కలుస్తారని అంచనా వేయబడింది. దేశంలో నేడు 567 ఉపాధి కల్పనా కేంద్రాలు, 71 యూనివర్సిటీ ఎంప్లాయిమెంట్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరోలు ఉన్నాయి. వీటిద్వారా 1980 లో 4.8 లక్షల మంది ఉద్యోగులుగా నియమితులైనారు.

1930 అక్టోబరు 2 న సమగ్ర గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాన్ని కొత్త 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమంలో గ్రామీణ ఉపాధి అంశం కింద ప్రారంభించడమైంది. ఆరో ప్రణాళికలో రూ॥ 2,000 కోట్లు (కేంద్రం 50 శాతం రాష్ట్రాలు, 50 శాతం జాతీయ గ్రామీణ ఉపాధి పథకం (National Rural Employment Programme) కింద కేటాయించడమైంది.

సమగ్ర గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలు (Integrated Rural Development Programme) కింద 15 మిలియన్ల కుటుంబాలకు ఆరో పంచవర్ష ప్రణాళిక కాలంలో సహాయం అందించడం జరుగుతుంది. డయిరీయింగు (Dairying), పౌల్ట్రీ, పందుల పెంపకం, పట్టుపురుగుల పెంపకం (Sericulture), చేపల పెంపకం, గ్రామీణ కుటీర పరిశ్రమలను ప్రోత్సహించడంవంటివి ఇందులోని కార్యక్రమాలు.

ఆరో పంచవర్ష ప్రణాళికా కాలంలో 300 నుండి 400 మిలియన్ల శ్రామిక రోజులు (Man days) సృష్టించాలనే ధ్యేయంతో జాతీయ గ్రామీణ ఉపాధి పథకాన్ని రూపొందించడమైంది. పనుల ఎన్నికలోను కార్యనిర్వహణలోను, స్థానిక ప్రజలు, పంచాయితీరాజ్ సంస్థలు కలసి కృషి చేయాలనే దృక్పథంతో దీనిని రూపొందించడమైంది.

## 1977 - 78, 1979 - 83 లలో చదువుకున్నవారిలో

| క్రమ సంఖ్య | వర్గము | 1978 (Stock) ఉన్నవారు | నిరుద్యోగిత (వేలలో) ఆర్థికంగా చురుకైనవారు | సంఖ్య |
|---|---|---|---|---|
| 1. | ఇంజనీర్లు(పట్టభద్రులు) | 244.6 | 243.0 | 18.1 |
| 2. | ఇంజనీర్లు(డిప్లమాహోల్డర్లు) | 350.8 | 248.5 | 70.5 |
| 3. | డాక్టర్లు (M.B.B.S) | 172.6 | 170.3 | 3.7 |
| 4. | దంతవైద్యులు (B.D.S.) | 10.9 | 10.8 | 0.1 |
| 5. | వ్యవసాయ పట్టభద్రులు | 92.9 | 91.8 | 10.1 |
| 6. | పశువుల డాక్టర్లు (Veterinary graduates) | 19.3 | 19.2 | 0.3 |
| 7. | ఆర్ట్సు పట్టభద్రులు | 1,601.3 | 1,462.4 | 229.6 |
| 8. | ఆర్ట్సు పోస్టుగ్రాడ్యుయేట్లు | 820.0 | 773.5 | 23.1 |
| 9. | సైన్సు గ్రాడ్యుయేట్లు | 838.0 | 791.5 | 125.1 |
| 10. | సైన్సు పోస్టుగ్రాడ్యుయేట్లు | 250.5 | 243.2 | 9.4 |
| 11. | కామర్సు పట్టభద్రులు | 676.5 | 664 6 | 79.0 |
| 12. | కామర్సు పోస్టుగ్రాడ్యుయేట్లు | 94.6 | 93.8 | 4.2 |
| 13. | ఎడ్యుకేషన్ గ్రాడ్యుయేట్లు | 733.8 | 675.9 | 131.0 |
| 14. | తదితర పట్టభద్రులు, సాంకేతిక డిప్లమా హోల్డర్సు | 956.9 | 905.2 | 114.1 |
| 15. | మొత్తం గ్రాడ్యుయేట్లు డిప్లమా హోల్డర్లు | 6,863.0 | 6,494.2 | 818.3 |
| 16. | మెట్రిక్ లేక హయ్యర్ సెకండరీ, నాన్ టెక్నికల్ డిప్లమా హోల్డర్లు | 23,572.2 | 14,803.2 | 1,761.6 |
| | చదువుకున్నవారి మొత్తం | 30,435.0 | 21,297.4 | 2,579.9 |

## ఉద్యోగ నిరుద్యోగాలు తెలిపే పట్టిక

| | | 1983 | | | |
|---|---|---|---|---|---|
| శాతం | ఉద్యోగిత | స్టాకు (Stock) | ఆర్థికంగా చురుకైనవారు | నిరుద్యోగిత | ఉద్యోగిత |
| 7.4 | 224.9 | 305.3 | 303.2 | 22.4 | 280.8 |
| 20.2 | 278.0 | 461.9 | 458.9 | 92.7 | 366.2 |
| 2.2 | 166.6 | 208.3 | 206.1 | 4.5 | 201.6 |
| 1.0 | 10 7 | 12.6 | 12.5 | 0.1 | 12.4 |
| 11.0 | 81.7 | 112.4 | 111.0 | 12.2 | 98.8 |
| 1.7 | 18.9 | 22.6 | 22.5 | 0.4 | 22.1 |
| 15 7 | 1232.8 | 2174.8 | 1986.3 | 311.8 | 1674.5 |
| 3.0 | 750.4 | 1158.0 | 1092.0 | 32.8 | 1059.2 |
| 15.8 | 666.4 | 1097.3 | 1036.4 | 163.8 | 872.6 |
| 3.9 | 233.8 | 324.2 | 314.7 | 12.3 | 302.4 |
| 11.9 | 585.6 | 988.8 | 971.4 | 115.6 | 855.8 |
| 4.5 | 89.6 | 131.8 | 130.5 | 5.9 | 124.6 |
| 19.4 | 544.9 | 1016.9 | 936.7 | 181.7 | 755.0 |
| 12.6 | 791.1 | 1298.2 | 1528.4 | 154.8 | 1073.6 |
| 12.6 | 5,675.9 | 9313.4 | 8804.4 | 1109.4 | 7695.9 |
| 11.9 | 13,041.6 | 28,903.6 | 18,151.5 | 2,160.0 | 15,991.5 |
| 12.1 | 18,717.5 | 38,217.0 | 26,956.2 | 3,269.4 | 23,686.6 |

# నిరుద్యోగిత (Employment)

# చదువుకున్నవారిలో నిరుద్యోగిత (Educated Employment)

విద్యాస్థాయిలు :

జైవిక రిజిష్టరులో నమోదైన చదువుకున్న నిరుద్యోగులు

| | 31-12-1979 నాటికి (లక్షలలో) | 31-12-1980 నాటికి |
|---|---|---|
| (1) | (2) | (3) |
| 1. మెట్రిక్ పాసయినవారు | 39.96 | 45.68 |
| 2. ఇంటర్మీడియట్, హయ్యర్ సెకండరీ పాసయినవారు | 18.82 | 20.71 |
| 3. గ్రాడ్యుయేట్లు, పోస్టు గ్రాడ్యుయేట్లు | 14.19 | 15.24 |
| మొత్తం | 72.97 | 81.64 |

సమీకృతరంగం (Organised Sector) లో మార్చి 1980 నాటి 223.16 లక్షల మంది ఉద్యోగులు మార్చి 1981 నాటికి 228.90 లక్షలకు చేరారు. అంటే 2.6% శాతం 1980-81 లో 2.6% శాతం పెరగగా 1979-80 లో 0.3% శాతం మాత్రమే పెరిగింది.

# 1981 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రాల, కేంద్రపాలిత ప్రాంతాల తాత్కాలిక జనాభా - సరిచేయబడిన సంఖ్యలు

**(Census - 1981) (Provisional Population of States and Union Territories - Revised Figures)**

| క్రమ సంఖ్య [Sl. No.] | మనుష్యులు [Persons] | పురుషులు [Males] | స్త్రీలు [Females] | మనుష్యులు [Persons] | పురుషులు [Males] | స్త్రీలు [Females] |
|---|---|---|---|---|---|---|
| | 1981 లో ముద్రించిన 1 వ పత్రం Published in Paper 1 of 1981 | | | 1981 లో ముద్రించిన 20 వ పత్రం Being Published in Paper 20 of 1981 | | |
| [1] | [2] | [3] | [4] | [5] | [6] | [7] |
| భారత దేశం | 657,925,625 | 339,812,337 | 318,113,288 | 658,140,676 | 339.895,757 | 318,244,919 |

దశాబ్ది పెరుగుదల రేట్లు (Decadal Growth Rates) 1971 – 81 పరిశీలించింది (Observed) 24.43 సరిచేసింది (Adjusted) 24.64

అస్సాం, జమ్మూ, కాశ్మీరు రాష్ట్రాలను మినహాయించి (excluding Assam, Jammu and Kashmir).

భారతదేశం (India)…………….658,140,676 { 501,952,169 గ్రామీణ జనాభా (Rural Population); 156,188,507 పట్టణ జనాభా (Urban Population) }

జమ్ము, అస్సాం, కాశ్మీర్ రాష్ట్రాలను మినహాయించి. (excluding Jammu, Assam and Kashmir)

(Census

# 1981 జనాభా లెక్కల ప్రకారం వ్యవసాయదారులు,

(Distribution of Main Workers by Cultivators,

**1961-**

| క్రమ సంఖ్య Sl. No. | మొత్తం (Total) గ్రామీణ (Rural) పట్టణ (Urban) | మనుష్యులు (Persons) పురుషులు (Males) స్త్రీలు (Females) | వ్యవసాయదారులు (Cultivators) | | |
|---|---|---|---|---|---|
| | | | 1961 | 1971 | 1981 |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| భారత దేశం (India) | మొత్తం (Total) | మనుష్యులు (Persons) | 52.34 | 42.91 | 41.53 |
| | | పురుషులు (Males) | 50.97 | 45.73 | 43.77 |
| | | స్త్రీలు (Females) | 55.32 | 29.73 | 33.03 |
| | గ్రామీణ (Rural) | మనుష్యులు (Persons) | 59.94 | 51.17 | 51.00 |
| | | పురుషులు (Males) | 60.67 | 55.55 | 52.26 |
| | | స్త్రీలు (Females) | 58.53 | 32.79 | 36.86 |
| | పట్టణ (Urban) | మనుష్యులు (Persons) | 6.54 | 5.10 | 5.25 |
| | | పురుషులు (Males) | 5.55 | 5.20 | 5.26 |
| | | స్త్రీలు (Females) | 12.02 | 4.17 | 5.11 |

1981)

## వ్యవసాయ కూలీలు, ఇతర కార్మికుల విస్తరణ

Agricultural Laboures and other Workers)

## 1981

| వ్యవసాయ కూలీలు (Agricultural Labourers) | | | ఇతర కూలీలు (Other Workers) | | |
|---|---|---|---|---|---|
| 1961 | 1971 | 1981 | 1961 | 1971 | 1981 |
| (7) | (8) | (9) | (10) | (11) | (12) |
| 17.17 | 26.88 | 25.16 | 30.49 | 30.21 | 33.31 |
| 13.73 | 21.71 | 19.77 | 35.30 | 32.56 | 36.46 |
| 24.61 | 50.99 | 45.57 | 20.07 | 19.28 | 21.40 |
| 19.42 | 31.42 | 30.12 | 20.64 | 17.41 | 18.88 |
| 16.19 | 25.81 | 24.26 | 23.14 | 18.64 | 20.48 |
| 25.64 | 54.98 | 49.57 | 15.83 | 12.23 | 13.57 |
| 3.53 | 6.08 | 6.15 | 89.83 | 88.82 | 88.60 |
| 2.24 | 4.72 | 4.74 | 92.21 | 90.08 | 90.00 |
| 10.67 | 17.65 | 16.32 | 77.31 | 78.18 | 78.57 |

# వివిధ రాష్ట్రాలలో ఉపాధికల్పనా కేంద్రాలలో నమోదైన ఉద్యోగాన్వేషకులు (వేలలో)

| క్రమ సంఖ్య | రాష్ట్రం | ఉపాధికల్పనా కేంద్రాల సంఖ్య 31-12-1979 నాటికి | జూన్ 30, 1978 నాటికి చదువుకున్నవారు: అండర్ గ్రాడ్యుయేట్లు మెట్రిక్ హయ్యర్ సెకండరీ పాస్ అయిన వారు | గ్రాడ్యుయేట్లు పోస్టుగ్రాడ్యుయేట్లు | మొత్తం | అన్‌స్కిల్డ్ మాన్యువల్ లేబర్స్ ఇతరులు | మొత్తం | ఏప్రిల్ 30 1980 నాటికి |
|---|---|---|---|---|---|---|---|---|
| | **రాష్ట్రాలు** | | | | | | | |
| 1. | ఆంధ్రప్రదేశ్ | 26 | 305.7 | 83.9 | 389.6 | 463.4 | 853.0 | 1,298 |
| 2. | అస్సామ్ | 31 | 89.5 | 17.3 | 106.8 | 156.2 | 263.0 | 327 |
| 3. | బీహార్ | 41 | 508.6 | 100.3 | 608.9 | 563 1 | 1,172.0 | 2,169 |
| 4. | గుజరాత్ | 21 | 184.6 | 43.4 | 228.0 | 167.0 | 395.0 | 436 |
| 5. | హర్యానా | 25 | 121.5 | 32.8 | 154.3 | 134.7 | 289.0 | 329 |
| 6. | హిమాచల్ ప్రదేశ్ | 14 | 43.9 | 7.3 | 51.2 | 50.8 | 102.0 | 126 |
| 7. | జమ్ము, కాశ్మీర్ | 8 | 14.0 | 7.9 | 21.9 | 25.1 | 47.0 | 54 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 8. కర్ణాటక | 30 | 245.6 | 68.5 | 314.1 | 205.9 | 520.0 | 560 |
| 9. కేరళ | 14 | 440.9 | 62.0 | 502.9 | 426.1 | 929.0 | 4,275 |
| 10. మధ్యప్రదేశ్ | 55 | 230.4 | 68.4 | 298.8 | 403.2 | 702.0 | 771 |
| 11. మహారాష్ట్ర | 33 | 431.1 | 91.6 | 522.7 | 447.3 | 970.0 | 1,123 |
| 12. మణిపూర్ | 6 | 28.1 | 5.9 | 34.0 | 34.0 | 68.0 | 88 |
| 13. మేఘాలయ | 5 | 3.5 | 1.1 | 4.6 | 5.4 | 10.0 | 10 |
| 14. నాగాలాండ్ | 3 | 1.4 | 0.2 | 1.6 | 1.4 | 3.0 | 4 |
| 15. ఒరిస్సా | 17 | 120.7 | 36.8 | 157.5 | 213.5 | 371.0 | 432 |
| 16. పంజాబ్ | 53 | 128.6 | 53.4 | 182.0 | 195.0 | 377.0 | 414 |
| 17. రాజస్థాన్ | 28 | 108,5 | 41.8 | 150.3 | 146.7 | 297.0 | 332 |
| 18. సిక్కిం | — | — | — | — | — | — | — |
| 19. తమిళనాడు | 20 | 429.2 | 85.1 | 514.3 | 460.7 | 975.0 | 1,010 |
| 20. త్రిపుర | 4 | 31.2 | 3.7 | 34.9 | 26.1 | 61.0 | 68 |
| 21. ఉత్తరప్రదేశ్ | 70 | 546.3 | 178.2 | 724.5 | 623.5 | 1,348.0 | 1,376 |
| 22. పశ్చిమబెంగాల్ | 41 | 630.2 | 155.2 | 785.4 | 727.6 | 1,513.0 | 2.199 |

## వివిధ రాష్ట్రాలలో ఉపాధికల్పనా కేంద్రాలలో నమోదైన ఉద్యోగాన్వేషకులు (వేలలో)

జూన్ 30 1978 నాటికి చదువుకున్న వారు

| క్రమ సంఖ్య | రాష్ట్రం | ఉపాధికల్పనా కేంద్రాల సంఖ్య 31-12-1979 నాటికి | అండర్ గ్రాడ్యుయేట్లు మెట్రిక్ హయ్యర్ సెకండరీ పాస్ వాయన వారు | గ్రాడ్యుయేట్లు పోస్టుగ్రాడ్యుయేట్లు | మొత్తం | అన్‌స్కిల్డ్ మాన్యువల్ లేబర్స్ ఇతరులు | మొత్తం | ఏప్రిల్ 30 1980 నాటికి |
|---|---|---|---|---|---|---|---|---|
| | **కేంద్రపాలిత ప్రాంతాలు** | | | | | | | |
| 1. | అండమాన్ మరియు నికోబార్ దీవులు | 1 | 0.5 | 0.1 | 0.6 | 5.4 | 6.0 | 8 |
| 2. | అరుణాచలప్రదేశ్ | — | — | — | — | — | — | — |
| 3. | చండీఘుర్ | 1 | 16.3 | 7.2 | 23.5 | 23.5 | 47.0 | 56 |
| 4. | దాద్రా, నాగర్ హవేలీ | — | — | — | — | — | — | — |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 5. ఢిల్లీ | 13 | 127.1 | 75.7 | 202.8 | 49.2 | 252.0 | 292 |
| 6. గోవా, డామన్ & డయ్యు | 1 | 14.6 | 2.8 | 17.4 | 11.6 | 29.0 | 27 |
| 7. లక్షదీవులు | 1 | 0.9 | 0.1 | 1.0 | 2.0 | 3.0 | 4 |
| 8. మిజోరమ్ | 3 | 2.1 | 0.1 | 2.2 | 4.8 | 7.0 | 17 |
| 9. పాండిచ్చేరి | 1 | 10.2 | 2.2 | 12.4 | 12.6 | 12.6 | 34 |
| మొత్తం | 546 | 4,815.2 | 1,233.0 | 6,048.2 | 5,585.8 | 11,634.0 | 14,839 |

గమనిక : సిక్కిం, అరుణాచలప్రదేశ్, దాద్రా, నాగర్ హవేలీలో ఉపాధికల్పనా కేంద్రాలు పనిచేయడంలేదు.

1981 – దీర్ఘ వర్గాలుగా ముఖ్య కార్మికుల విస్తరణ

**(Distribution of Main Workers by Board Categories, 1981)**

| క్రమసంఖ్య Sl. No. | మొత్తం (Total) గ్రామీణ (Rural) | మనుష్యులు (Persons) పట్టణ (Urban) | ముఖ్య కార్మికుల శాతం (Percentage of Main Workers) వ్యవసాయదారులు (Cultivaters) | వ్యవసాయకూలీలు (Agricultural Labourers) | గృహపరిశ్రమ (House hold Industry) | ఇతర కార్మికులు (other workers) |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| భారతదేశం India | మొత్తం Total | మనుష్యులు Persons | 41.53 | 25.16 | 3 99 | 29.32 |
| | | పురుషులు (Males) | 43.77 | 19.77 | 3.69 | 32.77 |
| | | స్త్రీలు (Females) | 33.03 | 45.57 | 5.16 | 16.24 |
| | గ్రామీణ Rural | మనుష్యులు Persons | 51.00 | 30.12 | 3.40 | 15.48 |
| | | పురుషులు (Males) | 55.26 | 24.26 | 3.16 | 17.32 |
| | | స్త్రీలు (Females) | 36.86 | 49.57 | 4.23 | 9.34 |
| | పట్టణ Urban | మనుష్యులు Persons | 5 25 | 6.15 | 6.25 | 82.45 |
| | | పురుషులు (Males) | 5.26 | 4.74 | 5.46 | 84.54 |
| | | స్త్రీలు (Females) | 5.11 | 16.32 | 11.98 | 66.59 |

## సాంఘిక భద్రత (Social Security)

ప్రతీ మానవుడు పుట్టిననాటినుంచి అనేక ఆపదలను తన జీవితంలో ఎదుర్కోవలసి ఉంది. ఉద్యోగ గాయాలు (Employment injurics) పారిశ్రామిక వ్యాధులు, అశక్తత, అనారోగ్యం, మాతృత్వం, వృద్ధాప్యం, నిరుద్యోగం, అనాథస్థితి[orphanhood]-ఇవన్నీ మానవుడు ఎదుర్కోవలసిన రకరకాల ఆపదలు. ఈ ఆపదల సమయంలో ఉద్యోగం చేయటానికిగాని, ఉద్యోగం సంపాదించడానికిగాని మానవుడికి చాలా కష్టమైనపని. ముఖ్యంగా ఉద్యోగంమీదనే ఆధారపడి బ్రతికే వారికి, ఈ రకమైన కష్టం చాలా ఇబ్బందికరంగా ఉంటుంది. అంతే కాకుండా చాలా ఆపదల్లో పనిచేసే దేహశక్తిలేక, వైద్యరక్షణ అవసరంకూడా ఎంతో ఉంటుంది. అందువల్ల ఎటువంటి రక్షణ అటు వంటి వారికి కల్పించాలంటే ముఖ్యంగా రాబడి, భద్రత (Income Security), వైద్యరక్షణ (Medical care) కల్పించాలి.

పూర్వం రోజులలో ఉమ్మడి కుటుంబవ్యవస్థ బాగా ఆదుకొనేది. ఏ ఒక్కరు ఆపదలో ఉన్నా, ఉమ్మడి కుటుంబం అతనికి అన్నివిధాలా రక్షణ కల్పిస్తుండేది. కాని నేడు ఈ ఉమ్మడి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమై పోయింది. పారిశ్రామికీకరణం నాగరికీకరణం, గ్రామాలలో నిరుద్యోగిత, కుటుంబ అంతఃకలహాలు మొదలైన రకరకాల కారణాలవల్ల ఈ ఉమ్మడికుటుంబవ్యవస్థ విచ్ఛిన్నమై చిన్నచిన్న కుటుంబాలు ఏర్పడ్డాయి. చిన్న కుటుంబంలో ఏ ఒక్కరికి, ఏ రకమైన ఆపద సంభవించినా మరి ఆదుకోవడానికి ఎవరూ ముందుకురారు. అందువల్ల వీరు సంఘంమీద ఆధారపడవలసి వస్తున్నది.

సాంఘిక భద్రతలో ముఖ్యంగా ఈ మూడు పద్ధతులు వెలుగులోకి వచ్చాయి.

## 1. సాంఘిక సహాయం (Social or Public Assistance)

ఇక్కడ భీమా (Insurance) ఉండదు. సహాయపడటానికి అయ్యే ఖర్చులో అధికభాగం ప్రభుత్వమే భరిస్తుంది.

## 2. నిర్బంధ సాంఘిక భీమా
## (Compulsory Social Insurance)

ఇందులో ప్రజలను నిర్బంధంగా భీమా పథకంలో చేర్చి, తద్వారా వారికి రక్షణ ఇవ్వడం జరుగుతుంది.

## 3. స్వచ్ఛంద సాంఘిక భీమా
## (Voluntary Social Insurance)

ఇందులో ప్రజలు తమంతటతామే భీమా పథకంలో చేరి రక్షణ పొందుతారు.




## 1. సాంఘిక సహాయం (Social Assistance)

ఈ పద్ధతిని ప్రభుత్వం, స్థానిక సంస్థలు అవలంభిస్తారు. దీనికి ప్రైవేటు సంస్థలుకూడా మద్దతునిస్తాయి. సామాన్యంగా బాగా వెనుకబడిన వర్గాలకు ఈ సహాయం అందజేయడం జరుగుతుంది. భారతదేశంలో లభించే విద్యాసౌకర్యాలు, ఆరోగ్య సౌకర్యాలు, వృద్ధాప్య పింఛను మొదలైనవి సాంఘిక సహాయానికి ఉదాహరణగా తీసుకోవచ్చు.

## 2. స్వచ్ఛంద సాంఘిక భీమా
## [Volutary Social Insurance]

మంచి ఆదాయం ఉన్నవారికి ఇది ఉపయోగపడుతుంది. వీరికి భవిష్యత్తులో రాబోయే ఆపదలలో రక్షణ ఇవ్వడం జరుగుతుంది. ఇది క్రాఫ్ట్ గిల్డ్స (Craft Guilds) రూపంలోనూ, ఫ్రెండ్లీ సొసైటీల రూపంలోనూ, పరస్పర కంపెనీలు (Mutual Companies) రూపం

లోనూ, సహకారసంఘాల రూపంలోనూ ఉంటాయి. ఇది తన సభ్యులు ఎవరు ఆపదలోవున్నా ఆదుకుంటుంది. ఇంతేకాక మనదేశంలో అనేక పరస్పర భీమా స్కీములు ఉన్నాయి. ఇవే పరస్పర సంక్షేమానికి ఉపయోగిస్తాయి. ఇందులో ఆర్థిక అంశమేకాకుండా నైతిక, సాంఘిక అంశాలుకూడా అంతర్గతంగా ఉన్నాయి.

## 3. నిర్బంధ జీవితభీమా (Compulsory Social Insurance)

ఇది ఇటీవలనే అభివృద్ధిచెంది బయల్పడిన పద్ధతి. ఇందులో లాభంపొందే అభ్యర్థులకు నిర్బంధంగా భీమా చేయించడం జరుగుతుంది. తరువాత భవిష్యత్తులో వారి ఆపదల కాలంలో వారికి రక్షణ కల్పించడం జరుగుతుంది. పారిశ్రామిక, కార్మికుల నిర్బంధ భీమాలో కొంత డబ్బు యజమాని, కొంత డబ్బు కార్మికుడు భీమా సంస్థకు చెల్లిస్తారు. తరువాత భీమా సంస్థ కార్మికుడికి రక్షణ కల్పిస్తుంది. కావలసిన పరిజ్ఞానం రిజర్వులో నిధులు కావలసినంతగా లేకపోవడం సరియైన పర్యవేక్షణ లేకపోవడం సభ్యులలో అభిప్రాయ భేదాలు, స్వచ్ఛంద భీమా పద్ధతిని బలహీనపరిచాయి. అందుకే నిర్బంధ భీమా పద్ధతి అమలులోకి వచ్చింది.

## భారతదేశంలో చేపడుతున్న సాంఘిక భద్రతా చర్యలు

భారతదేశంలో ఉన్న మొత్తం కార్మికులలో 70 శాతం వ్యవసాయ కార్మికులుగాను, 10 శాతం పరిశ్రమలలోనూ, 6 శాతం వాణిజ్య రంగంలోనూ (Trade and Commerce) 2 శాతం మత్స్య, గనుల శాఖలోనూ, 2 శాతం రవాణా, కమ్యూనికేషన్ల శాఖలోనూ, 1 శాతం కట్టడాలలోనూ, 9 శాతం ఇతర సర్వీసులలోనూ పనిచేస్తున్నారు.

### [i] కార్మిక నష్టపరిహార చట్టం 1923

ఈ చట్టాన్ని మార్చి 1923 లో రూపొందించారు. 1924 జూలై 1 వ తారీఖునుంచి అమలులోనికి వచ్చింది. ఈ చట్టం ప్రకారం ఉద్యోగికి విధినిర్వహణ కాలంలో, విధినిర్వహణవల్ల ఏమైనా గాయాలు

లేదా అపాయం సంభవిస్తే, దానివల్ల తాత్కాలిక లేదా శాశ్వత వైకల్యం సంభవిస్తే అతడికి ఒక నిర్ణీత స్కేలుప్రకారం నష్టపరిహారం చెల్లించడం జరుగుతుంది. ఈ నష్టపరిహారాన్ని యజమానియే పూర్తిగా భరించటం జరుగుతుంది. 1975 అక్టోబరు, 1 వ తేదీనుంచి ఉద్యోగి రాబడి పరిధిని 1,000 రూ.ల వరకు పెంచడం జరిగింది. వృత్తిరీత్యా వచ్చే వ్యాధులనుకూడా లెక్కలోకి తీసుకోవడం జరిగింది.

## [ii] ఉద్యోగుల రాష్ట్ర భీమా చట్టం 1948

దీనికి సంబంధించిన ఇంతకుముందున్న చట్టాలన్నింటిని సవరించి ఏప్రిల్, 1948 లో ఈ ఉద్యోగుల రాష్ట్రభీమా చట్టాన్ని రూపొందించటం జరిగింది. ఈ చట్టం ప్రకారం అర్హతగల కార్మికులకు శారీరక రుగ్మత (Sickness), మాతృత్వం (Maternity), విధినిర్వహణలో సంభవించే గాయాలు వంటి ఆపదలలో నగదు చెల్లిస్తారు.

ముఖ్యంగా ఈ భీమా చట్టం ద్వారా ఈ కింది సదుపాయాలు కల్పించబడ్డాయి.

1. రుగ్మతా ప్రయోజనం (Sickness Benefit)
2. మాతృత్వ ప్రయోజనం (Maternity Benefit)
3. అంగవైకల్య ప్రయోజనం (Disablement Benefit)
4. ఉద్యోగిపై ఆధారపడేవారికి ప్రయోజనం (Dependent's Benefit)
5. దహనసంస్కార ప్రయోజనం (Funeral Benefit)
6. వైద్య ప్రయోజనం (Medical Benefit)

1961 నాటికి ఆరోగ్యభీమా (Health Insurance) కింద 2.9 మిలియన్ల కర్మాగారాలలో పనిచేసే కార్మికులకు (Regular Factory Workers) నగదు బహుమానం, వైద్యసదుపాయాలు కల్పించడం జరుగుతోంది. 1979 నాటికి, 5.8 మిలియన్ల కార్మికులకు ఈ భీమా స్కీముద్వారా సదుపాయాలు అందించారు. రకరకాల దశలలో మరో 3.4 మిలియన్ల మందికి, 1984 నాటికి ఈ పథకంద్వారా సదుపాయాలు

కల్పించడానికి, ఇతర తరగతుల కర్మాగారాలను, సంస్థలనుకూడా దీని పరిధిలోకి తీసుకొనిరావడానికి కృషిజరుపుతున్నారు. ఈ రకంగా 9.2 మిలియన్ల మందికి రక్షణ కల్పించినా, మరో 10.8 మిలియన్ల మంది వ్యవసాయ కార్మికులు, స్వయం ఉపాధిలోఉన్న కార్మికులు పేదరికం, నిరక్షరత, సీజనల్ ఉపాధి (Seasonal employment), చాలీచాలని రాబడి-ఇంటి ఇబ్బందులలో ఉన్నవారు - ఇంకా మిగిలిపోతూనే ఉన్నారు.

## (iii) బొగ్గుగనుల ప్రావిడెంటు ఫండు, బోనస్ పథకాల చట్టం, 1948 (Coal Mines Provident Fund and Bonus Schemes Act 1948)

వృద్ధాప్యం, మరణంవంటి ఆపదలలో కార్మికులకు సహాయపడటానికి లేదా రక్షణ కల్పించడానికి ఈ చట్టం రూపొందించడం జరిగింది. ఈ చట్టం ప్రభుత్వ, ప్రైవేటు యాజమాన్యంలో ఉన్న అన్ని బొగ్గు గనులకు వర్తిస్తుంది. 1976 నాటికి 1,570 మంది ఈ చట్టపరిధిలో ఉన్నారు. 1976 లో మొత్తం ప్రావిడెంట్ డిపాజిట్ 5,349 లక్షల రూపాయలు.

## (iv) కార్మికుల ప్రావిడెంట్ ఫండ్ చట్టం 1952 (Employees Provident Fund Act 1952)

బొగ్గు గనుల ప్రావిడెంట్ ఫండ్, బోనస్ స్కీముల చట్టం, 1948 విజయవంతమవడంలో, అటువంటి ప్రయోజనాలను, ఇతర కర్మాగారాలకు, సంస్థలకు కూడా వర్తించేరీతిలో ఈ కార్మికుల ప్రావిడెంట్ ఫండ్ చట్టం, 1952 రూపొందింది. రూ. 1000/- నెలసరి ఆదాయం మించని కార్మికులు ఈ చట్టపరిధిలోకి వస్తారు. ప్రావిడెంట్ ఫండ్ మొత్తం డిపాజిట్లను కేంద్ర, రాష్ట్ర నిధులలో (Central and State Securities) నిల్వఉంచి దానిపై వచ్చేవడ్డీని కార్మికుల ఖాతాకు (account) జమచేస్తారు. మార్చి 1, 1971 లో మరణానంతరం కార్మికుని కుటుంబ సభ్యులకు ఉపయోగపడేరీతిలో కార్మికుల కుటుంబ పింఛను స్కీముగా ఈ 1952 చట్టాన్ని మార్చారు.

31 మార్చి, 1981 నాటికి 172 పరిశ్రమలు లేక తరగతుల సంస్థలు ఈ చట్టపరిధిలోకి వచ్చాయి. నెలసరి ఆదాయం రూ. 1600/- లకు మించకుండా ఉండే కార్మికులంతా ఈ స్కీములో సభ్యత్వాన్ని పొందాలి. వరుసగా 3 నెలలు సర్వీసు ఉన్నవారు లేక 60 పని దినాలు పనిచేసినవారు లేక శాశ్వత ఉద్యోగులుగా పరిగణించబడిన తారీఖు వీటిలో ఏది ముందైతే అప్పటినుంచి వీరు ప్రావిడెంట్ ఫండ్ సభ్యులుగా చేరవచ్చు. 11, మార్చి నాటికి, ఈ చట్టపరిధిలోకి 1,44,988 సంస్థలు 12.59 మిలియన్ల చందాదారులు (Subscribers) 31, మార్చి 1981 నాటికి 90,676.0 మిలియన్ల రూపాయలు ఈ స్కీములో వసూలయింది.

## ప్రత్యేక విముక్తి నిధి [Special Relief Fund]

వసూలు చేసిన కార్మికుల భాగంనుంచి, ప్రావిడెంట్ ఫండ్‌లో కలపకుండా ఉండే మిగులు సొమ్మును, చివరిలో లేదా అన్ని లెక్కలు తేల్చుకొనే సమయంలో ఆయా కార్మికులకు ఇచ్చివేయడం జరుగుతుంది.

## మరణ విముక్తి నిధి [Death Relief Fund]

మరణ సమయానికి కార్మికుని నెలసరి ఆదాయం లేక జీతం రూ. 1000/- లకు మించకుండా ఉన్నట్లయితే, అటువంటి కార్మికుని కుటుంబ సభ్యులకు లేక వారసులకు, దహన సంస్కరణ వ్యయంనిమిత్తం రూ. 1,250/-లు నగదు ఇవ్వబడుతుంది.

## [V] మాతృత్వ ప్రయోజన చట్టం 1961 (Maternity Benefit Act, 1961)

ఈ చట్టం ద్వారా, ఇంతకుముందున్న ఇటువంటి చట్టాలలోను, గనుల మాతృత్వ ప్రయోజన చట్టం 1941, కార్మికుల రాష్ట్ర భీమా చట్టం, 1948, ప్లాంటేషన్ లేబర్ యాక్టు 1951 ల కంటే ఎక్కువ ప్రయోజనాలను అందివ్వబడింది. దీని ప్రకారం కాన్పుకు పూర్వం 3 వారాలు కాన్పు తరవాత 3 వారాలు జీతంతోకూడిన సెలవును స్త్రీ ఉద్యోగినులకు మంజూరుచేయడం జరుగుతుంది.

## [vi] సముద్ర కార్మికుల ప్రావిడెంట్ ఫండ్ చట్టం 1966 (Seaman's Provident Fund Act, 1966)

ఇది 1952 ప్రావిడెంట్ ఫండ్ చట్టంవలె, సముద్రంలోని ఓడలలో పనిచేసేవారికి దీనిద్వారా రక్షణ కల్పించడం జరుగుతుంది. 1968 లో 50 వేలమందిని ఈ చట్ట పరిధిలోకి తీసుకువచ్చారు. మార్చి, 1968 నాటికి రూ. 1.48 కోట్లు వసూలయింది.

## [vii] ప్లాంటేషన్ లేబర్ ఏక్టు 1951 (Plantations Labour Act, 1951)

10.117 హెక్టారుల విస్తీర్ణంలో ఉండే ప్రతీ టీ, కాఫీ, రబ్బరు, సింకోనా ప్లాంటేషన్లలో కనీసం 10 మంది పనిచేసినా, ఈ చట్టం వర్తిస్తుంది. ముఖ్యంగా కార్మికులకు, వారి కుటుంబాలకు వైద్య సదుపాయం, కల్పిస్తారు. రుగ్మతా కాలంలోనూ, మాతృత్వంలోనూ వారికి నగదు ప్రయోజనాలను కూడా అందించడం జరుగుతుంది.

## [viii] పారిశ్రామిక వివాదాల చట్టం 1947 (Industrial Disputes Act, 1947)

లే - ఆఫ్ (Lay - off) వల్ల నిరుద్యోగితలో ఉండే కార్మికులకు రక్షణ కల్పించే చట్టం ఇదొక్కటే. ఒక నిర్ణీత స్కేలు ప్రకారం లే-ఆఫ్ కాలంలో కార్మికులకు నష్టపరిహారం యజమాని చెల్లిస్తాడు. రిట్రేంచ్ మెంట్ (Retrec'iment) సమయంలో, కార్మికునికి, అతడు పనిచేసిన ప్రతీ సంవత్సరానికి 15 రోజుల వేతనాన్ని నష్టపరిహారంగా చెల్లిస్తారు. అయితే యజమాని పరిధిలోగాని, ఆధీనంలోగాని పరిస్థితులు లేకుండా విషమించినప్పుడు, యజమాని పొరపాటు ఏరకంగానూ లేనప్పుడు రిట్రెంచ్ మెంట్‌లో 3 నెలల మొత్తం జీతాన్ని మాత్రమే కార్మికుడికి నష్టపరిహారంగా చెల్లించవలసి ఉంది.

## [ix] కార్మికుల కుటుంబ పింఛను 1971 (Employees Family Pension Scheme, 1971)

కుటుంబ పింఛను అంటే, కార్మికుని మరణానంతరం కార్మికుని కుటుంబానికి ప్రతీనెల కొంత మొత్తాన్ని చెల్లించడం. రూ. 60/- నుంచి రూ. 120/- ల వరకు చెల్లిస్తారు. ఉద్యోగి భర్తనుగాని, భార్యనుగాని లేదా మైనరు కుమారుడికిగాని పెళ్ళికాని కూతురుకుగాని ఈ డబ్బు చెల్లిస్తారు. దీనితోపాటు కొంత ఏక మొత్తాన్నికూడా చెల్లిస్తారు.

## కార్మికుల డిపాజిట్ - పరిమిత భీమా పథకం Employees Deposit - Limited Insurance Scheme

ప్రావిడెంట్ ఫండ్ చట్టం పరిధిలోఉన్న ఉద్యోగులందరికీ ఇది వర్తిస్తుంది. దీనికోసం కార్మికులు ప్రత్యేకంగా చెల్లించనక్కరలేదు. కేంద్ర ప్రభుత్వం, యజమాని 0.25 శాతం 0.50 శాతం ఈ భీమా చందాను చెల్లిస్తారు. మరణానంతరం ప్రావిడెంట్ ఫండ్ స్వీకరించే వ్యక్తికి హామీ ప్రయోజనాన్ని (Assurance Benefit)ను 10,000/- మించకుండా ఇస్తారు.

## [x] గ్రాట్యుయిటీ చెల్లింపు చట్టం 1972 (Payment of Gratuity Act, 1972)

ఈ చట్టం ప్రకారం వరుసగా 5 సంవత్సరాలు పనిచేసే కార్మికుని తొలగించినప్పుడుగాని (Superannuation) లో గాని పదవీవిరమణ (Retirement) లేక పదవీత్యాజము (Resignation) లోగాని, అతని మరణానంతరం లేక ప్రమాదంవల్ల లేక వ్యాధివల్ల వైకల్యం (disablement) సంభవించి నప్పుడుగాని గ్రాట్యుటీ (gratuity) చెల్లిస్తారు. 15 రోజుల వేతనం రేటులో 20 నెలలకు మించకుండా, గ్రాట్యుటీ కార్మికుడికి చెల్లించబడుతుంది.

## వృద్ధాప్యం పించను (Old Age Pension)

1881 సంవత్సరంలో 1.98 శాతం వృద్ధులు 65 సంవత్సరాలు పైబడినవారు ఉండగా 1971 జనాభా లెక్కల ప్రకారం వీరి శాతం 3.3% కు పెరిగింది. వృద్ధుల రక్షణ బాధ్యత పిల్లలపైన, వారి బంధువులపైనడున్నా, విచ్ఛిన్న పరిస్థితులు వారిని ఏ రకమైన రక్షణలేకుండా చేస్తున్నాయి. అందువల్ల 15 రాష్ట్ర ప్రభుత్వాలు, 3 కేంద్రపాలిత ప్రాంతాలు అటువంటి వృద్ధులకు పోషణార్థం ప్రతీ నెల కొంత మొత్తం పించనుగా చెల్లిస్తున్నారు. అంతేకాకుండా స్వచ్ఛంద సేవా సంస్థలు వారికి గృహాలను (Homes for the Aged) ఏర్పాటుచేస్తున్నారు.

## వితంతు పించను [Widow Pension]

ఆంధ్రప్రదేశ్ లో ఆధారంలేని వితంతువులకు వారి జీవనోపాధికై కొంత మొత్తాన్ని పించను రూపంలో ఇచ్చే స్కీము రూపొందించబడింది. సాంవత్సరిక ఆదాయం రూ॥ 6,000/- కు మించకుండా 18-60 సంవత్సరాలమధ్య వయస్సు ఉండే వితంతువులకు నెలకు రూ॥ 50/- ల చొప్పున ఇస్తారు.

## నిరుద్యోగ భృతి [Unemployment Allowance]

తమిళనాడు వంటి కొన్ని రాష్ట్రాలలో విద్యావంతులైన నిరుద్యోగులకు జీవనోపాధికై కొంత మొత్తాన్ని ప్రతీ నెల చెల్లిస్తున్నారు.

ఇన్ని సాంఘిక రక్షణ చర్యలు చేపట్టినా సంఘంలో ఇంకా అనేకమంది అంటే వ్యవసాయ కార్మికులు, చిన్న సంస్థల కార్మికులు, కుటీర పరిశ్రమల కార్మికులు, రోజువారీ పనివారు (Casual Labour) మొదలైన వారు ఏ రకమైన రక్షణ లేక ఇంకా బాధపడుతూనే ఉన్నారు. వీరికోసం ప్రభుత్వం స్వచ్ఛంద సేవా సంస్థలు సమిష్టిగా కృషి చేసి పురోగతిని సాధించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

# ఆరోగ్యం (Health)

ప్రజారోగ్యం (Public Health) అనేది రాష్ట్రానికి సంబంధించిన అంశమైనా, కేంద్ర ప్రభుత్వం కూడా ఆరోగ్య కార్యక్రమాలలో

కీలకమైన పాత్ర వహిస్తున్నది. కిందట దశాబ్దంలో ఆరోగ్య సేవా కార్యక్రమాల ధ్యేయమేమంటే అంటువ్యాధుల (Communicable diseares) ను అరికట్టి నిర్మూలించడం గ్రామీణ ప్రాంతాలలో నిరోధక రోగనివారణ (Preventive of curative) ఆరోగ్య కార్యక్రమాలను మెరుగుపరచడం.

## వైద్య విజ్ఞాన పద్ధతులు - వ్యవస్థలు

ముఖ్యంగా భారతదేశంలో రెండు రకాలైన వైద్యవిజ్ఞాన వ్యవస్థలున్నాయి.

1. ఎల్లోపతిక్ లేదా పాశ్చాత్య వైద్య వ్యవస్థ
2. ఆయుర్వేదిక్ లేదా భారతీయ వైద్య వ్యవస్థ

యునాని వ్యవస్థ హోమియోపతిక్ వ్యవస్థలు కూడా భారతదేశంలో ప్రజాదరణపొందిన మరో రెండు వైద్య వ్యవస్థలు ముస్లిమ్‌ల పరిపాలనా కాలంలో భారతదేశంలో ప్రవేశపెట్టి అరేబిక్ వైద్య వ్యవస్థయే యునాని వ్యవస్థ. ఇప్పుడు అది భారతీయ వైద్య వ్యవస్థ భాగంగా చెప్పబడుతోంది. హోమియోపతిక్ ఈ మధ్యనే ప్రభుత్వం హోమియోపతి సెంట్రల్ కౌన్సిల్ ఏక్టు 1973 ప్రకారం (Homeiopathi's Central Council Act, 1973) గుర్తించింది.

## వైద్య విజ్ఞాన సంస్థలు

## మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా

ఇది 1956 మెడికల్ కౌన్సిల్ ఏక్ట్ ప్రకారం దేశంలో ఒకే రకమైన అల్లోపతిక్ వైద్య విద్యాప్రమాణాలు ఉండేటట్లు చూడడానికి స్థాపించబడింది. ఇది ఒక రిజిష్టరును కూడా నిర్వహిస్తున్నది. 31-12-80 నాటికి అందులో నమోదైన అల్లోపతిక్ వైద్యుల సంఖ్య 2,61,323.

### డెంటల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా (Dental Council of India)

డెంటిస్ట్ ఏక్ట్ 1948 ప్రకారం ఈ సంఘం ఏర్పడింది. దంతవైద్య శాస్త్రాన్ని క్రమబద్ధం చేస్తూ, దంతవైద్యుల రిజిష్టరునుకూడా నిర్వహిస్తున్నది.

దీ ఫార్మసీ కౌన్సిల్ ఆఫ్ ఇండియా
(The Pharmacy Council of India)

1948 ఫార్మసీ చట్టం ప్రకారం స్థాపించబడింది. ఇది ఫార్మసిస్టుల విద్యా శిక్షకులను క్రమబద్ధం చేస్తుంది.

ది ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్
(The Indian Nursing Council)

ఇండియన్ నర్సింగ్ చట్టం, 1947 ననుసరించి ఏర్పడింది. నర్సులకు మంత్రసానులకు, ఆరోగ్య దర్శకులకు (Nurses, Midvives and Health Visitors)ఒకేరకమైన శిక్షణ ప్రమాణాలుండేటట్లుచూస్తుంది. ఇది ఇండియన్ నర్సింగ్ రిజిష్టరును నిర్వహిస్తున్నది. అందులో నర్సుల అందరిపేర్లు పొందుపరున్నారు.

ది సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్
(The Central Council of Indian Medicine)

సెప్టెంబరు 1971 లో ఏర్పరచడం జరిగింది. భారతీయ వైద్య విద్యను, చికిత్సా విధానాన్ని (Education and Practice) పర్య వేక్షిస్తుంది. భారతీయ వైద్యశాస్త్రంలో కనీస విద్యాప్రమాణాలను నిర్దేశిస్తూ, ఇండియన్ సిస్టమ్ ఆఫ్ మెడిసిన్‌ను అవలంబించే డాక్టర్లను నమోదుచేసే రిజిష్టరును నిర్వహిస్తున్నది.

ది సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ హోమియోపతి :
(The Central Council of Homeopathy)

దీనిని ఆగస్టు 1974 లో 1973 హోమియోపతిక్ సెంట్రల్ కౌన్సిల్ చట్ట (Homeopathy Central Council Act, 1973) ప్రకారం స్థాపించడం జరిగింది. ఈ సంఘం హోమియోపతిక్ మెడిసిన్ విద్యా ప్రమాణాలను నిర్ణయిస్తూ హోమియోపతిక్ వైద్యుల సంఖ్యను తెలిపే రిజిష్టరును కూడా నిర్వహిస్తున్నది.

## వైద్య పరిశోధన

భారతీయ వైద్య పరిశోధనా సంఘం (Indian Council for Medical Research) వైద్య పరిశోధనలు ప్రారంభించడం, మెరుగు పరచడం, సమన్వయ పరచడం వంటి కార్యాలను నిర్వర్తిస్తుంది. దీనిని ఆర్థికంగా భారత ప్రభుత్వం ఆదుకొంటున్నది. ఈ వైద్య పరిశోధన, దాని వెనుక 14 శాశ్వత కేంద్రాల ద్వారాను, వైద్య విశ్వవిద్యాలయాల, కళాశాలలో నిపుణుల ద్వారాను, తదితర సంస్థల ద్వారాను నిర్వహించడం జరుగుతున్నది.

## ఆరోగ్య పరిస్థితి

ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సైన్స్ రిసెర్చి (Indian Council of Social Science Research) ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చి (Indian Council Medical Research) ల నుంచి ఏర్పడిన ఒక సంయుక్త కమిటీ తన నివేదికలో ఆరోగ్య చిత్రమనేది వెలుగునీడల మిశ్రమంగా ఉంది. విజయం — పరాజయం రెండూ ఉన్నాయి అని పేర్కొన్నది.

1941–51 దశాబ్దంనాటి మరణ రేటు (Death Rate) 27.4 నుంచి 1971-81 దశాబ్దంలో 15.2 కి తగ్గిపోయింది. దీనిమూలంగా పుట్టుకలో జీవించే అవకాశాలు ఎక్కువగా కల్పిస్తున్నాయి. పుట్టుకలో అర్ధ శతాబ్దం కిందటి వరకు భారతీయులలో జీవితకాలం 26 సంవత్సరాలు. అది ఇప్పుడు 50 సంవత్సరాలకు పెరిగింది.

కాని మరణరేట్లు స్త్రీలలోనూ, పిల్లలలోనూ ఎక్కువగా కన్పిస్తున్నాయి. పిల్లల మరణరేటు ఇంకా ప్రతీ 1000 మందికి 120 వరకు ఉంది. ఇది స్వీడన్ (9), అమెరికా సంయుక్త రాష్ట్రాలు (16), ఇంగ్లాండు (17), థాయిలాండ్ (27), శ్రీలంక (45), ల కన్న చాలా ఎక్కువగా ఉంది. ప్రతీ 10,000 మందిలోనూ, 418 మాతృ మరణాలు (Maternity deaths) సంభవిస్తున్నాయి.

నేటి జీవన్మరణాల చిత్రం గతంకన్నా చాలా భిన్నత్వాన్ని కలిగి ఉంది. కరువుకాటకాలు ఇంతకు ముందున్నంతగా ప్రజల ప్రాణాలను బలితీసుకోవడంలేదు. మశూచి మూలంగా నివారించడం జరిగింది. కలరా, మలేరియాలు కూడా చాలావరకు నివారించారు. బాల్య వ్యవస్థలలో వచ్చే అనేకమైన జబ్బులు అంటే కోరింతదగ్గు(Whopping Cough), డిఫ్తీరియా (Diphtheria), టెటానస్, పోలియో వంటివి రాకుండా ఇమ్యునైజేషన్ పద్ధతుల నవలంబించి నిరోధిస్తున్నారు. ఏది ఏమైనా జీవిత పరిమాణాన్ని మరీ అంతగా పెంచలేకపోయాయి. పేదరికం, అజ్ఞానం, సరియైన పోషణ లేకపోవడం, సరియైన పారిశుధ్యం (Bad-Sanitation) సురక్షితమైన మంచినీరు లేకపోవడం, సరియైన వసతి సౌకర్యాలు లేకపోవడం చాలావరకు ఉన్నాయి. సరాసరి భారతీయునికి ఆయువు(longevity)పరిస్థితి బాగున్న అతని తాత తండ్రులతో పోల్చిచూస్తే తక్కువగానే ఉంది.

ఈ జీవన మరణ రేట్లు దేశంలోని రాష్ట్రానికి, రాష్ట్రానికి భిన్నంగా ఉంది. కేరళలో జనాభాకి 7.2 మరణరేటు అయితే ఉత్తర ప్రదేశ్‌లో 19.2 మరణరేటున్నది. ఒకే రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో కూడా తేడాలున్నాయి. పట్టణ ప్రాంతాలకు, పల్లె ప్రాంతాలకు కూడా ఈ వ్యత్యాసాలున్నాయి. పల్లె ప్రాంతాలలో ఆరోగ్యపరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉంది.

అంటు వ్యాధులు (Communicable Diseases)

కేంద్రప్రభుత్వం ప్రధాన అంటువ్యాధుల (Major Communicable diseases) విషయంలో ఎక్కువగా శ్రద్ధను కనబరుస్తున్నది. దీనికి సంబంధించి జాతీయ కార్యక్రమాలను కూడా చేపట్టింది.

మశూచి (Smallpox)

మశూచి నివారణ కార్యక్రమం 1962లో ప్రారంభించబడింది. 1977 నాటికి దీనిని సంపూర్తిగా నిర్మూలించారు. 1977 లో ఒక ఇంటర్నేషనల్ ఎసెస్‌మెంటు కమీషన్ ఇండియాలో మశూచి మరి లేదని ప్రకటించింది.

## మలేరియా

పూర్వకాలం నుంచి కూడా మలేరియా అనేది ఒక పెద్ద ప్రజారోగ్య సమస్యగా ఉంది. ఒక సాధారణ సంవత్సరంలో 7.5 మిలియన్ల ప్రజలు అంటువ్యాధులు (Epidemics) ప్రబలిన సంవత్సరంలో దానికి రెట్టింపుమంది మలేరియావల్ల బాధపడుతున్నారు. మలేరియావల్ల 0.8 మిలియన్లమంది ఒక సంవత్సరంలో మరణిస్తున్నారు.

ఈ మలేరియా వ్యాధిని ఎదుర్కోడానికి ఏప్రిల్ 1953 లో జాతీయ మలేరియా నియంత్రణ కార్యక్రమాన్ని ప్రారంభించారు. తరువాత దీనిని 1958 లో జాతీయ మలేరియా నివారణా కార్యక్రమం (National Maleria Eradication Programme) గా రూపొందించారు. 1958–1965 కాలంలో ఇది చెప్పుకోదగినంత విజయం సాధించింది. మలేరియా వ్యాధి ఒక లక్షకు మాత్రమే దిగిపోయింది. 1965 సంవత్సరంలో దీనివల్ల మరణాలు లేవు.

1965 నుంచి మరల ఈ వ్యాధి ప్రాబల్యం హెచ్చింది. సాధారణ విధానంలోనూ, ప్లాస్మోడియమ్ ఫాల్సిపేరమ్ రకంలోనూ ఈ వ్యాధి బయటపడింది. దీనికి అనేక రకాల కారణాలున్నాయి. కొన్ని రంగాలలో కొన్ని ఇన్సెక్టిసైడ్స్‌కు నిరోధక శక్తి హెచ్చడం దేశంలోని కొన్ని ప్రాంతాలలో మలేరియా పరాన్నజీవులకు క్లోరోక్విన్ (Ghloroquins) మందునుంచి నిరోధక శక్తి పెరగడం, కీటకసంహారక మందుల ధరలు పెరగడం, మలేరియా నివారణ కార్యక్రమాలకు రాష్ట్రాలు తక్కువ నిధులను సమకూర్చడం మొదలైనవి దీనికి కారణాలు. 1972 లో 6.47 మిలియన్లు మలేరియా కేసులు నమోదైనాయి. ఇందులో 742, 247 కేసులు ప్లాస్మోడియమ్ ఫాల్సిపేరమ్‌వల్ల (P. Falciperum) వచ్చినవి. 59 మరణాలు సంభవించాయి.

ఈ మలేరియా వ్యాధి ప్రాబల్యం అన్ని రాష్ట్రాలలోనూ ఒకే రకంగా లేదు. కొన్ని రాష్ట్రాలలో 1980 లోనే, 1979 కన్నా ఎక్కువ కేసులు నమోదైనాయి. అటువంటి రాష్ట్రాలలో గుజరాత్,

హిమాచల్‌ప్రదేశ్, మధ్యప్రదేశ్, నాగాలాండ్, అండమాన్ నికోబార్ దీవులు, చండీఘుర్, బొగ్గుగనుల ప్రాంతాలు, దాద్రా, నాగర్ హావేలీ, పాండిచ్చేరిలు చేరివున్నాయి. అలాగే ప్లాస్మోడియమ్ ఫాల్సిపేరమ్ (P. Falciperum) వల్ల మలేరియావ్యాధి కేసులు 1979 కన్నా 1980 లో ఎక్కువగావున్న రాష్ట్రాలు గుజరాత్, హర్యానా, కేరళ, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, నాగాలాండ్, పంజాబ్, రాజస్థాన్, త్రిపుర, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాల్, అండమాన్, నికోబార్ దీవులు, చండీఘుర్, దాద్రా, నాగర్ హావేలీ మరియు పాండిచ్చేరిలు.

## ఫైలేరియా (Filaria)

ఇది ఇండియాలో ఒక పెద్ద ప్రజారోగ్యసమస్య. జమ్ము-కాశ్మీర్, హర్యానా, చండీఘుర్, హిమాచల్‌ప్రదేశ్, పంజాబ్, ఢిల్లీ, రాజస్థాన్, మణిపూర్, త్రిపుర, నాగాలాండ్, అరుణాచల్‌ప్రదేశ్, సిక్కిం పూర్వోత్తరపు (North Esterun) ప్రాంతాలలో ఫైలేరియాసిస్ ప్రబలి ఉంది. ఇప్పటి అంచనాల ప్రకారం ఈ వ్యాధి ఉన్న ప్రాంతాలలో మొత్తం 236 మిలియన్ల ప్రజలు నివసిస్తున్నారు. వీరిలో పట్టణ ప్రాంతాలలో 62 మిలియన్లు, పల్లె ప్రాంతాలలో 174 మిలియన్లు నివసిస్తున్నారు.

ఈ ఫైలేరియాసిస్ కంట్రోలు చేయడానికి జాతీయ బోధకాలు నివారణ కార్యక్రమం (National Filaria Control Programme) 1955 సంవత్సరంలో మొదలుపెట్టడం జరిగింది. ఇది పట్టణ ప్రాంతాలలోను, పల్లె ప్రాంతాలలోనూ ఈ కార్యక్రమాలను వేర్వేరుగా నిర్వహిస్తున్నారు.

### 1. పట్టణాలు

ప్రస్తుతము ఫైలేరియాస్‌ను నివారణ చేయడానికి 171 ఫైలేరియా కంట్రోల్ కేంద్రాలు పట్టణాలలో పనిచేస్తున్నాయి. ఈ నివారణ కార్యక్రమాలు లార్వా వ్యతిరేక పనులు పలుమార్లు (Recurrent Antelarval Operation) కు పరిమితమై ఉంది. ఈ కేంద్రాలు 24

మిలియన్ల ప్రజలకు రక్షణ కల్పిస్తున్నది. 83 ఫైలేరియా చికిత్సా కేంద్రాలు కూడా మైక్రోఫైలేరియా ఉండే ప్రజలను చికిత్స చేయడానికి వ్యాధి వ్యాపించకుండా ఉండటానికి నడుపుతుండేవారు.

## 2. పల్లెటూర్లు

ఒక ప్రయోగాత్మక ప్రాజెక్టును 1977 నుంచి ఎన్నుకొన్న 3 గ్రామీణ ప్రాంతాలలో 3 జిల్లాలలో నడుపుతున్నారు. అందులో (1) ఆంధ్రప్రదేశ్‌లో శ్రీకాకుళం జిల్లాలోను (2) గుజరాత్‌లోని బల్‌సార్ (Balsar), ఉత్తరప్రదేశ్‌లో జాన్‌పూర్ (Janpur)ల లోను ఉన్నాయి. 1985 నాటికి ఈ ప్రాజెక్టు కార్యక్రమాలు పూర్తి అవ్వటంతో గ్రామీణ ప్రాంతాలలో బోధకాలు నివారణ చేయడానికి సరిఅయిన పద్ధతును రూపొందించే వీలుఅవుతుంది.

## కుష్టు వ్యాధి

భారతదేశంలో ప్రధాన ఆరోగ్య సమస్యలలో కుష్టువ్యాధి ఒకటి. ఈ వ్యాధికి ఉన్న రోగులతో, బాగా సన్నిహితత్వం పెంపొందించుకున్నట్లయితే ఈ వ్యాధి అటువంటివారికి సోకుతుంది. ఈ వ్యాధికి ఆలస్యంగా చికిత్స పొందితే ఈలోగా అనేకరకాల వికలత్వాలు (Deformities) సిద్ధిస్తాయి. రాష్ట్రప్రభుత్వాల సహకారంతో 1955 సంవత్సరంలో భారత ప్రభుత్వం జాతీయ కుష్టునివారణ కార్యక్రమాన్ని ప్రారంభించడం జరిగింది. కుష్టురోగులకు నవీన చికిత్స సౌకర్యములు ఈ కార్యక్రమం ఉద్దేశితమైంది. ఈ కార్యక్రమాన్ని కేంద్ర ప్రభుత్వం రూపొందంచగా వివిధ రాష్ట్ర ప్రభుత్వాల ఆరోగ్య డైరెక్టరేటులు పీటిని అమలులోపెట్టి బాధ్యతలను స్వీకరించారు.

1971 జనాభా లెక్కల ప్రకారం ఈ వ్యాధి సోకిఉన్న రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలలోను 379 మిలియన్లు ప్రజలు నివసిస్తున్నారు. వీరిలో 302 మిలియన్లు రోగులు భారతదేశంలో ఉన్నట్లు అంచనా వేయడమైంది. వీరిలో 25 వారికి వ్యాధి, ఇతరులకు సోకేదశలో (infections stage) ఉన్నాయి. 25 శాతం వికలత్వాలతో బాధపడు

తున్నారు. 4 లక్షలమంది రోగులు సాంఘికంగాను, ఆర్థికంగాను అస్తవ్యస్త స్థితిలో ఉన్నారు. వీరిలో 2 లక్షల రోగులు రోడ్లమీద యాచనచేస్తూ బ్రతుకుతున్నారు. కుష్టువ్యాధివున్న మొత్తం వ్యక్తులలో 15 శాతం 14 సంవత్సరాల వయసులోపు పిల్లలని అంచనావేయడం జరిగింది. నేడు భారతదేశంలో 4 మిలియన్లు మంది కుష్టురోగులు ఉన్నట్లు అంచనావేశారు. ప్రపంచంలో భారతదేశం జనాభాన్నిబట్టి చూసినట్లయితే భారతదేశంలో ఎక్కువమంది కుష్టురోగులు ఉన్నట్లుగా తెలుస్తోంది.

## కలరా (Cholerah)

1979 తో పోల్చి చూసినట్లయితే 1980 లో కలరావల్ల సంభవించిన మరణాలు తగ్గాయి. 1980 లో 5,963 మందికి ఈ వ్యాధి సోకగా 177 మరణాలు మాత్రమే సంభవించాయి. కాని 1979 లో 5,638 కలరా కేసులలో 312 మంది మరణించారు.

1980—81 లో ఈ కలరా నివారణ కార్యక్రమాల వ్యూహం (Strategy) లో మార్పువచ్చింది. ఓరల్ రిహైడ్రేషన్ (oral Rehydration) ఎక్కువగా ప్రవేశపెట్టబడింది. ఈ సంవత్సరం ఓరల్ రిహైడ్రేషన్ చికిత్సా విధానంపై భారతదేశంలోని అనేకప్రాంతాలలో ప్రపంచ ఆరోగ్య సంస్థ(W.H.O.) సహకారంతో తక్కువ కాలపరిమితి శిక్షణ కోర్సులను నిర్వహిస్తున్నారు.

కలరా, డయూరియిక్ (Diarrheak) వ్యాధుల నివారణకు ఈ ఓరల్ రీహైడ్రేషన్ చికిత్సావిధానం బాగా పనిచేస్తుందని ఋజువైంది. కావలసినంత పరిమాణంలో ఈ ఓరల్ రీహైడ్రేషన్ పొడిని మన భారతదేశంలో తయారుచేస్తున్నారు. మందులషాపులలో ఇవి తక్కువ ధరలలలో లభిస్తున్నాయి.

## ట్యూబర్ క్యూలోసిస్ (క్షయ వ్యాధి)

క్షయవ్యాధి అనేది భారతదేశంలో ఒకపెద్ద ప్రజారోగ్యసమస్య. దేశ జనాభాలో 1.5 శాతం ప్రజలు క్షయవ్యాధితో బాధపడుతున్నారని

పేరిలో 1/4 వ వంతు రోగుల రోగం సోకేకితిలో ఉన్నారని అంచనా వేశారు.

దేశంలో అన్ని జిల్లాలలోను క్షయవ్యాధి నివారణ కేంద్రాలను స్థాపించి, వ్యాధినిర్ణయం, వ్యాధినివారణ చర్యలను తీసుకోవడం జరుగుతున్నది. ఈ కేంద్రాలలో కావలసినంత సిబ్బంది, పరికరాలు ఉన్నాయి. ఇంతవరకు దేశంలో 353 జిల్లా క్షయనివారణ కేంద్రాలను స్థాపించారు. ఇంతేకాకుండా, 300 చికిత్సా కేంద్రాలలో ఈ క్షయరోగులకు చికిత్స నందిస్తున్నారు. మెడికల్, పేరామెడికల్ సిబ్బందికి శిక్షణ ఇవ్వడానికి గాను17 క్షయనివారణ శిక్షణా కేంద్రాలనుకూడా నెలకొల్పారు. వ్యాధి బాగా సోకిన క్షయరోగులకు, ఆసుపత్రులలో 44,000 క్షయరోగుల మంచాలను ఏర్పాటుచేశారు.

## సుఖవ్యాధులు (S. T. D.)

యస్. టి. డి. (Sexually Transmitted Diseases) ని నేడు వి. డి.(Veneiral Diseases)గా వ్యవహరిస్తున్నారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ చేసిన సర్వే ప్రకారం ప్రపంచంలో 200 మిలియన్ల ప్రజలు సుఖ రోగాలతో బాధపడుతున్నారు. అందులో 20 మిలియన్లు ఇంచుమించు రోగులు మన భారత దేశంలో ఉన్నారు. బాలబాలికలలో 13 నుంచి 19 సంవత్సరాల వయస్సులలో సుఖరోగాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఇది ప్రపంచంలోనే విశ్వవ్యాప్తమైన సమస్య. భారత దేశంలో చిరు ప్రాయంలో (teenagers) లో సుఖరోగుల జాబితాలో, రెండవ పెద్ద సమూహంగా ఉన్నారు. అందరికన్నా పెద్ద సమూహం 20 నుంచి 30 సంవత్సరాల వయస్సువారు.

కుటుంబ నియంత్రణ పద్ధతుల ప్రచారం గర్భం వచ్చి దానివల్ల కలిగే బాధలు, భయాలు, (Fear of Pregnancy) ఇంచుమించు లేకుండా చేస్తున్నాయి. అందువల్ల రతిస్వైరత (Sex Promiscuity) ఎక్కువగా ఉండటంవల్లనే సుఖవ్యాధులు ఎక్కువగా వస్తున్నాయి అని తార్కికంగా (Logical) తెలుస్తోంది.

డాక్టర్ రావు (Dr. Rao) చెప్పినదానినిబట్టి సుఖవ్యాధులు ఎవరివల్ల సోకుతాయో వారిని బాగుపరచినట్లయితే ఈ వ్యాధులను చాలామటుకు నివారించవచ్చు. కాని సుఖవ్యాధులు సోకిన వ్యక్తులు తమ లైంగిక భాగస్వాముల పేర్లను చెప్పడానికి నిరాకరిస్తున్నారు. అందువల్లనే ఇది ఒక చిక్కు సమస్యగా మిగిలిపోయింది. ఈ వ్యాధులను నివారించడానికి, ఎదుర్కోడానికి కావలసినంత పరిమాణంలో వైద్య సౌకర్యాలు అందాలి. కాని భారతదేశంలో చాలా తక్కువ సుఖవ్యాధుల నివారణ కేంద్రాలు ఉండటం చాలా విచారకరం. మన దేశంలో 250 సుఖరోగ నివారణ కేంద్రాలు మాత్రమే ఉన్నాయి. వీటిలో కొన్నిటిని అస్పత్రులైన డాక్టర్లు నిర్వహిస్తున్నారు.

## జాతీయ గోయిటర్ నివారణ కార్యక్రమం (National Goitre Control Programme)

ఆరోగ్య సర్వీసెస్ డైరెక్టరేట్ జనరల్ కార్యాలయంలో గోయిటర్ (Goitre) శాఖ వారు ఈ వ్యాధి ఉన్న మన దేశంలోని ప్రాంతాలను గుర్తించారు. ఈ వ్యాధి ఉన్న ప్రాంతాలకు అయోడైజిడ్ సాల్ట్ (Iodised Salt) ను తయారుచేసి పంపిణీ చేస్తారు. ప్రతీ 5 సంవత్సరాల తరువాత దీని తాలూకా ప్రభావాన్ని పరిశీలిస్తారు.

## అంధ నివారణ (Control of Blindness)

మన దేశంలో గుడ్డితనం, దృష్టిలోపం ఒక పెద్ద సామాజిక ఆరోగ్య సమస్య. ఈ సమస్యను పరిష్కరించడానికి 1976 లో ఒక జాతీయ కార్యక్రమం (National Programme for Prevention of Visual Impairment and Control of Blindness) ప్రారంభించారు. ఈ కార్యక్రమం ధ్యేయాలు ఏమంటే —

1. సముదాయంలో నేత్ర రక్షణ కోసం బాగా ప్రచారం చేయడం.
2. దూర గ్రామ ప్రాంతాలకు తాత్కాలికంగా నేత్ర చికిత్స సేవలను సంచార నేత్ర చికిత్స కేంద్రాలద్వారా అందించడం.

3. అన్ని స్థాయిలలోను నేత్ర ఆరోగ్య సేవా కార్యక్రమాలను పనికి వచ్చే సామాగ్రిని సరఫరా చేయడం.

## వైద్య సిబ్బంది వివరాలు

| | | |
|---|---|---|
| నమోదు చేసుకొన్న వైద్యుల సంఖ్య | 2,35,631 | (1978) |
| హోమియోపతిక్ వైద్యుల సంఖ్య | 1,51,137 | |

## భారతీయ వైద్యంలో వైద్యుల సంఖ్య

| | | |
|---|---|---|
| ఆయుర్వేదం | 2,25,063 | (1978) |
| యునానీ వైద్యం | 30,454 | (1978) |
| సిద్ధ | 18,128 | (1978) |
| నర్సులు | 1,20,401 | (1977) |
| మంత్రసానులు (Mid Wives) | 1,18,533 | |
| అక్సిలరి వర్కర్స్ (Auxiliary Workers) | 55,656 | |
| నమోదు చేసుకొన్న ఫార్మసిస్టుల సంఖ్య | 1,07,452 | |

## కమ్యూనికబుల్ వ్యాధుల నివారణకు చేపట్టే పెద్ద స్కీములు

| క్రమ సంఖ్య | స్కీము పేరు | సూచిక | నేటి స్థాయి | 1980-85 ప్రణాళికకు టార్గెటు |
|---|---|---|---|---|
| (0) | (1) | (2) | (3) | (4) |
| 1. | మలేరియా కంట్రోలు కార్యక్రమం | (a) సాంవత్సరిక పరాన్నజీవి సూచిక | 4.6 | 2.7 |
| | | (b) నమోదుచేసిన, తనిఖీచేసిన మరణాలు | 300 | — |
| 2. | జాతీయ కుష్ఠురోగం నివారణ కార్యక్రమం | (a) మొత్తం అంచనావేయబడిన కేసులలో కనుగొన్న కేసుల శాతం | 60% | 90% |
| | | (b) వ్యాధిని అరెస్టుచేసిన కేసులు[2 (a) లోనివి] | 20% | 40% |
| 3. | అంధత్వ నివారణ | (a) అంధత్వ శాతం | 1.4% | 1% |
| 4. | క్షయ నివారణ కార్యక్రమం | (a) మొత్తం అంచనావేయబడిన కేసులలో కనుగొన్న కేసుల శాతం | 30% | 50% |
| | | (b) వ్యాధిని అరెస్ట్ (Arrest) చేసిన కేసులు | 60% | 75% |
| 5. | బోదకాలు నివారణ కార్యక్రమం | మైక్రో ఫైలేరియాను మోస్తున్న వాహకులు (Micro Filaria Carriers) | 25 మిలియన్లు | 35 మిలియన్లు |

## ముఖ్యమైన ఆరోగ్య వైద్య సంస్థలు

(1) ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ న్యూఢిల్లీలో ఉంది. మెడిసిన్ (Medicine) లో మాస్టర్, డాక్టరేటు, కోర్సులను, పరిశోధనలను (Pure and Applied Research) నిర్వహిస్తున్నది.

(2) ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫిజికల్ మెడిసన్ అండ్ రేహాబిలిటేషన్ బొంబాయి నగరంలో ఉంది.

(3) ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్ అండ్ హియరింగ్ మైసూరులో ఉంది.

(4) ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైజీన్ అండ్ పబ్లిక్ హెల్త్ - కలకత్తాలో ఉంది.

(5) సెంట్రల్ డ్రగ్స్ లేబొరేటరీ - డ్రగ్స్, కాస్మెటిక్ చట్టం ప్రకారం స్థాపించిన సంస్థ.

(6) సెంట్రల్ ఇండియన్ ఫార్మకోపిక్ లేబొరేటరీ - గజియాబాద్ డ్రగ్స్, కాస్మెటిక్స్ చట్టం ప్రకారం స్థాపించబడింది.

(7) సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైకియాట్రీ - రాంచీలో ఉంది. పరిశోధన నిమిత్తం స్థాపించడం జరిగింది.

(8) సెంట్రల్ లెప్రసీ టీచింగ్ అండ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ - తమిళనాడులోని చెంగల్పట్టులో ఉంది.

(9) సెంట్రల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ - కసెయులిలో ఉంది. వాక్సిన్ (Vaccine) లను తయారుచేస్తుంది.

(10) సెంట్రల్ హెల్త్ ఎడ్యుకేషన్ బ్యూరో, న్యూఢిల్లీ - ఈ సంస్థ న్యూఢిల్లీలో ఉంది.

(11) సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రీసెర్చ్ ఇన్ ఆయుర్వేదిక్ అండ్ సిద్ధ - గజియాబాద్‌లో ఉంది.

(12) సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రీసెర్చ్ ఇన్ యునాని మెడిసన్-గజియాబాద్‌లో ఉంది.

13. సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రీసెర్చ్ ఇన్ హోమియోపతి గాజియాబాద్‌లో ఉంది.
14. సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రీసెర్చ్ ఇన్ యోగ అండ్ నాచురోపతి- గాజియాబాద్‌లో ఉంది.
15. సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రీసెర్చ్ ఇన్ హోమియోపతి ఫర్ టీచింగ్ అండ్ ప్రాక్టీస్ - న్యూఢిల్లీలో ఉంది.
16. డాక్టర్ రాంమోహన్ లోహియా వైద్యశాల - బోధన, చికిత్స ఆసుపత్రి - న్యూఢిల్లీ.
17. హోమియోపతిక్ ఫార్మకో సోసియల్ లేబరేటరీ-గాజియాబాద్
18. ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పాపులేషన్ స్టడీస్ ఫర్ రీసెర్చ్ ఇన్ బొంబాయి.
19. జవహర్‌లాల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పోస్టుగ్రాడ్యుయేట్ మెడికల్ ఎడ్యుకేషన్ అండ్ రీసెర్చ్. పాండిచ్చేరీ-మద్రాస్ యూనివర్సిటీకి అనుబంధితమైంది.
20. కళావతి సరన్ చిల్డ్రన్స్ ఆసుపత్రి - న్యూఢిల్లీ.
21. లేడి హార్డింగు మెడికల్ కాలేజ్ - న్యూఢిల్లీ.
22. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కమ్యూనికబుల్ డిసీజెస్ ఫర్ రీసెర్చ్ న్యూఢిల్లీ.
23. నేషనల్ టి. బి. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రీసెర్చ్-బెంగుళూరు.
24. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్త్ అండ్ న్యూరో సైన్సెస్ - బెంగుళూరు.
25. నేషనల్ మెడికల్ లైబ్రరీ - న్యూఢిల్లీ.
26. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హోమియోపతిక్-కలకత్తా టీచింగ్ అండ్ ట్రైనింగ్.
27. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ అండ్ ఫామిలీ వెల్‌ఫేర్ న్యూఢిల్లీ. ఢిల్లీ యూనివర్సిటీకి అనుబంధితమైంది. డిగ్రీస్ ఇన్ పబ్లిక్ హెల్త్ (Degrees in Public Health)
28. పబ్లిక్ హెల్త్ లేబరేటరీ - పూనే.

29. పోస్టు గ్రాడ్యుయేట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ ఎడ్యుకేషన్ అండ్ రీసెర్చ్ — చండీఘర్ — నెహ్రూ హాస్పిటల్ చేర్చబడింది.
30. లేస్టర్ ఆఫ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా, కోహినూర్, నీలగిరీస్ వేక్సిన్స్ (Vaccines)
31. ఫార్మకోపోసియల్ లేబరేటరీ ఫర్ ఇండియన్ మెడిసన్, గాజియాబాద్.

## రీజనల్ కేన్సర్ రీసెర్చ్ సెంటర్

1. కలకత్తా 2. మద్రాసు 3. న్యూఢిల్లీ 4. టాటా మెమోరియల్ హాస్పటల్, బొంబాయి.

1. రాజకుమారి అమృతకౌర్ కాలేజ్ ఆఫ్ నర్సింగ్ - న్యూఢిల్లీ. బేచలర్ అండ్ మాస్టర్ డిగ్రీస్ ఇన్ నర్సింగ్.
2. సఫ్దర్‌జంగ్ హాస్పిటల్ - న్యూఢిల్లీ - ఎ టీచింగ్ హాస్పిటల్ ఫర్ ది యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ ఢిల్లీ.
3. సుచేత కృపాలనీ హాస్పిటల్ [ఉమెన్స్ హాస్పిటల్] న్యూఢిల్లీ.
4. సెరోళాజిస్ట్ అండ్ కెమికల్ ఎగ్జామినర్ - కలకత్తా - అనలిసస్ ఎనలాజికల్ మెటీరియల్స్ లిలు బ్లడ్ అండ్ ఫిపెరక్స్ సీరమ్.

## సెంట్రల్ ఫుడ్ లేబరేటరీస్

1. సెంట్రల్ ఫుడ్ రీసెర్చ్ అండ్ స్టేండర్డైజేషన్ లేబరేటరీ, గాజియాబాద్.
2. సెంట్రల్ ఫుడ్, టెక్నాలజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్-మైసూర్
3. సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ - కలకత్తా.

## పోషకాహారం

మందులు, వైద్యులు, ఆసుపత్రులు ఉన్నంతమాత్రాన మనిషి ఆరోగ్యవంతంగా ఉండగలడు అని తలచడం భావ్యం కాదు. సరియైన హారం, సరియైన వస్త్రాలు ధరించడం, పరిశుభ్ర వాతావరణంలో

సరియైన వసతి సౌకర్యాలుకూడా ఉండవలసిన అవసరం ఉంది. ఇక్కడే సమస్య ఉత్పన్నం అవుతున్నది.

ఈ సమస్య పరిష్కారానికి ప్రభుత్వం కూడా ఎంతో శ్రద్ధ వహిస్తున్నది. కాని ఏ ఒక్క సంస్థ చేపట్టడానికి వీలులేనంత పెద్ద సమస్య ఇది. వ్యక్తుల పరంగాను సంస్థలపరంగాను దేశ ఆరోగ్యంతో సంబంధం ఉన్నవారందరు సహకారంతో చురుకుగా పని చేయవలసిన అవసరం ఉంది.

పోషకాహారం లేకపోవడం (Malhutrition) భారతదేశంలో అనేక మరణాలకు బాధ్యతవహించే ప్రధాన కారకం (Major Factor) హైదరాబాద్‌లోను నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ (National Institution of Nutrition) వారి నివేదికను అనుసరించి దేశంలో నూటికి 65 శాతం 1 నుంచి 5 సంవత్సరాల వయస్సుగల పిల్లలు తక్కువ రాబడి వచ్చే తరగతులకు చెందినవారు. వీరు ఒక మాదిరిగా పోషకాహారం లభించక బాధపడుతున్నారు. కాని 18 శాతం తీవ్రంగా బాధపడుతున్నారు. మార్చి 1973 లో లోక్ సభలో కేంద్ర ఆరోగ్యశాఖ మంత్రి 60 మిలియన్ల జనాభాగల పిల్లలు పోషకాహారం లేక లభించక బాధపడుతున్నారని తెలియజేశారు. అయితే వీళ్ళకు శక్తి తగినంత దొరకకపోవడం కారణం (Calories Starvation).

భారత దేశంలో ప్రతి సంవత్సరం ఒక మిలియను జనాభా గల బాలబాలికలు (1 నుంచి 5 సంవత్సరాలు) చనిపోతున్నారు. అయితే ఈ జనాభా మన దేశ జనాభాలో 16.5 శాతం ఉన్నారు. మనదేశంలో చనిపోయినవారి జనాభాలో వీరు 40 శాతం ఉంటున్నారు.

మన దేశంలో ఈ సమస్య పరిష్కారానికై డే కేర్ సెంటర్స్ (Day-Care-Centres) ను నెలకొల్పి పిల్లలకు సరిఅయిన

పోషకాహారాన్ని అందించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అంతే గాకుండా 5 సంవత్సరాలు దాటిన పిల్లలకు మధ్యాహ్న భోజనాలు కూడా అందజేస్తున్నారు. అటువంటి కార్యక్రమాలు మిలియన్లకొద్ది ఉన్న పిల్లలలో కొంతమందికి మాత్రమే అందించే వీలుఅవుతున్నది. అయితే ఈ సమస్య ఒక్క భారత దేశంలోనే కాదు ఆసియా, ఆఫ్రికా, సౌత్ అమెరికాలలో ఉన్న అభివృద్ధిచెందుతున్న దేశాలలోనూ ప్రబలి (వ్యాపించి) ఉంది. అయితే ఇక్కడ గుణాత్మకంగా గాని పరిమాణాత్మకంగా గాని ఆహారం లభించకపోవడం అనేది సమస్యకాదు. కొనుగోలుశక్తి తక్కువగా ఉండటంవల్ల ఈ సమస్య ఉత్పన్నం అవుతున్నది. ప్రపంచవ్యాప్తంగాఉన్న పేదరికమే కావలసినంత ఆహారం కొనుక్కోలేని పరిస్థితి కల్పిస్తున్నది. ఇది వైద్య సమస్య కాదు. ఆరోగ్యసమస్య కూడ కాదు, ఇది ఆర్థిక సంబంధమైన సమస్య.

## స్పెషల్ న్యూట్రిషన్ ప్రోగ్రామ్ (Special Nutrition Programme)

దీనిని 1970 లో 6 సంవత్సరాలలోపు పిల్లలకు అనుబంధ పోషకాహారం అందించడానికి ప్రారంభించడమైంది. పేదరికం ప్రబలిఉన్న ప్రదేశాలలో పిల్లల తల్లులకు కూడా అందించబడుతున్నది. నగరాలలో ఉండే మురికివాడలు, షెడ్యూల్డు తెగలు, వెనుకబడినవర్గాలుండే గ్రామీణ ప్రాంతాలను పేదరికం ఉన్న ప్రాంతాలుగా గుర్తించడమైంది. ఒక్క సంవత్సరంలో 300 రోజులలో 20.25 గ్రాముల ప్రోటీనులుండేటట్లు 500 కేలరిల శక్తి లభించేటట్లు ఒకో్క బిడ్డ తల్లికి, 1245 గ్రాములు ప్రోటీనులుండేటట్లు 200 – 300 గ్రాముల శక్తి ఉత్పన్నమయ్యేటట్టు, ఒక బాలుడికి పోషకాహారం అందించాలని సంకల్పించారు.

# కుటుంబ నియంత్రణ (Family Planning) [మిలియన్లలో]

| వరుస సంఖ్య | పద్ధతి [Method] | టార్గెట్ 1980-81 | సాధించినది 1980-81 | సాధించినది 1979-80 | 1979-80 కన్నా 1980-81 లో ప్రగతిలో మార్పు | సాంవత్సరిక ప్రగతి టార్గెట్ |
|---|---|---|---|---|---|---|
| [1] | [2] | [3] | [4] | [5] | [6] | [7] |
| 1. | స్టెరిలైజేషన్ | 2.90 | 2.03 | 1.78 | (+) 14.04 | 70.0 |
| (a) | వేసెక్టమీ (Vesectomy) | — | 0.44 | 0.47 | (−) 6.38 | — |
| (b) | ట్యూబెక్టమీ (Tubectomy) | — | 1.59 | 1.31 | (+) 21.37 | — |
| 2. | ఐ. యు. డి. | 0.79 | 0.62 | 0.63 | (−) 1.59 | 78.8 |
| 3. | తదితర పద్ధతులు | 5.54 | 3 79 | 3.07 | (+) 23.45 | 68.4 |
| 3. (1) | కన్వెన్షనల్ కాంట్రసెప్టిక్ యూజర్స్ | 5.04 | 3.70 | 2.99 | (+) 23.75 | 73.4 |
| (i) | ఉచిత పంపిణీ | 3.04 | 1.90 | 1.91 | (−) 0.52 | 62.5 |
| (ii) | వ్యాపారరీత్యా పంపిణీ | 2.00 | 1.80 | 1.80 | (+) 166.67 | 89.9 |
| 3. (2) | ఓరల్ పిల్ యుసెర్స్ | 0.50 | 0.09 | 0.08 | (+) 12.50 | 17.9 |
| | ( Oral Pill Users ) | | 6.44 | 5.48 | + 17.52 | |

# పోషకాహారం

6వ పంచవర్ష ప్రణాళిక కేటాయింపులు — కోట్ల రూపాయలలో

| కార్యక్రమం (1) | ప్లానవుట్ లే (Plan Outlay) (2) |
|---|---|
| కేంద్రప్రభుత్వం | 14.95 |
| రాష్ట్ర ప్రభుత్వం | 214.55 |
| కేంద్రపాలిత ప్రాంతాలు | 8.64 |
| మొత్తం | 238.14 |

పునఃపరిశీలించిన ఐదవ ప్రణాళికలో పోషకాహార కార్యక్రమాలకు కింద పొందుపరచిన రీతిలో కేటాయింపులు జరిగాయి.

కోట్ల రూపాయలలో

| స్కీము | రంగం | 1974–77 అంచనావేసిన వ్యయం | 1977–79 సిఫార్సుచేసిన కేటాయింపు | మొత్తం ప్రణాళిక కేటాయింపు |
|---|---|---|---|---|
| 1. కనీస అవసరాల కార్యక్రమం | రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలు | 44.24 | 43.94 | 88.18 |
| 2. ఆహార, పోషకాహార కార్యక్రమం (కేంద్ర) ఆహార శాఖయొక్క | కేంద్రం | 6.53 | 7.97 | 14.50 |
| 3. కేంద్ర గ్రామీణాభి వృద్ధి శాఖ పోషకాహార కార్యక్రమం | కేంద్రం సూచిపడింది Central Sponsored | 4.48 | 8.51 | 12.99 |
| మొత్తం | | 55.25 | 60.42 | 115.67 |

## ప్రపంచ ఆహార ప్రాజెక్టు
## (The World Food Programme Project)

భారతదేశంలో 1976 మధ్యనుంచి పనిచేస్తున్నది. 6 సంవత్సరాల లోపు పాఠశాల పూర్వపు బాలబాలికలకు, పేదవారైన గర్భిణీ స్త్రీలకు, పిల్లల తల్లులకు ప్రాజెక్టుద్వారా అనుబంధ పోషకాహారం ఇవ్వడం జరుగుతోంది. అస్సామ్, బీహార్, గుజరాత్, కేరళ, మధ్య ప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మధ్య ప్రదేశ్ లలో 20 లక్షల మంది ప్రయోజనం పొందేటట్లు చేయడానికి 1982 సంవత్సరంలో నిశ్చయించడమైంది.

## కేర్ CARE (A. R. E.) oprative for American Relief Everywhere)

పాఠశాలలో చదువుతున్న పిల్లలకు, పాఠశాల పూర్వపు పిల్లలకు, అనుబంధ పోషకాహార కార్యక్రమాలు నిర్వహించడానికిగాను, ఆహార పదార్థాలను అందిస్తున్నాయి. పాఠశాల పిల్లలకు 148 లక్షల టన్నులు, పాఠశాల పూర్వపు పిల్లలకు (Pre-School-Children) 138 లక్షల టన్నుల ఆహారాన్ని 1979-80 లలో అందించింది.

## వైవాహిక వయోపరిమితి [Age of Marriage]

1976 ఆగష్టు నెలలో, స్త్రీలకు 15 నుంచి 18 సంవత్సరాలు వయస్సు వరకు, పురుషులకు 18 నుంచి 21 సంవత్సరాల వయస్సును పెళ్ళివయస్సుగా నిర్ణయించడానికి లోక్‌సభలో బిల్లు ప్రవేశపెట్టడమైంది. "లెపర్ స్కోప్" అంటే ఒక ప్రత్యేకమైన దుర్భిణీ పరికరం సహాయంతో అంటే లెపర్‌స్కోప్‌తో కడుపులోని అవయవాలను పరీక్షించడం. ఈ పద్ధతి కడుపునొప్పి, వంధ్యత్వం, కడుపులో చిన్న గడ్డలున్నప్పుడు మామూలు పరీక్షలవల్ల కనుగొనలేని కొన్ని గర్భకోశ వ్యాధులను ఫలానా జబ్బు ఉన్నదని నిశితంగా చూసి చెప్పవచ్చు.

లెపరోస్కోప్ స్టెరిలైజేషన్ స్త్రీ గర్భిణిగా లేని సమయంలో అంటే ఇంటర్ వెల్ టైమ్‌లోగాని, ప్రసవించిన ఒక నెల తరవాతగాని చట్టబద్ధమైన గర్భస్రావంతో అంటే M. T. P. తోపాటుగాని లేక అబార్షన్ అయిన వెంటనేగాని చేసుకోవచ్చు.

## మాతృ, శిశు ఆరోగ్యం

సంఖ్యలు వేలలో

| కార్యక్రమం | 1930-81 కి టార్గెట్ | సాధించిన ప్రగతి 1980-81 ఏప్రిల్ 80 నుంచి మార్చి 81 వరకు | సాధించిన ప్రగతి 1979-80 సమయ కాలంలో | 1979-80 తో పోలిస్తే 1980-81 లో పెరుగుదల[+]తరుగుదల శాతాలు | సాధించిన ప్రగతి శాతం year of achieved target |
|---|---|---|---|---|---|
| A) ఇమ్యునైజేషన్ | | | | | |
| టెటానస్ ఇమ్యునైజేషన్ | | | | | |
| 1. కాబోయే తల్లులకు (Expectant Mothers) | | | | | |
| టెటానస్ ఇమ్యునైజేషన్ | 6.839 | 5.188 | 4.746 | (+) 9.3 | 76.0 |
| 2. D.P.T. ఇమ్యునైజేషన్ పిల్లల కొరకు | 13.550 | 7.044 | 6.829 | (+) 3.1 | 52.1 |
| 3. D.T. ఇమ్యునైజేషన్ పిల్లల కోసం | 11.370 | 10.062 | 10.731 | (– 6.2 | 88.7) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| B) న్యూట్రీషనల్ ఎనీమియా (Nutritional Anaemia) గురించి ప్రోఫైలాక్సిస్ (Prophylacsis) | | | | | |
| 1. మొత్తం స్త్రీలలో (కుటుంబనియంత్రణ చేసుకొన్నవారు, బిడ్డల తల్లులు, కాబోయే తల్లులు) | 11.910 | 10.884 | 11.484 | (—) 5.2 | 99.2 |
| 2. పిల్లలలో | 11.910 | 9.461 | 9.950 | (—) 4 9 | 86.5 |
| C) ప్రోఫైలాక్సిస్ (Prophylacsis) అంధత్వం రాకుండటం గురించి (విటమిన్ ఏ లోపంవల్ల) | | | | | |
| ఒకటవ డోసు | 24.200 | 16.307 | 16.963 | (—) 3.9 | 67.4 |

## 5 వ పంచవర్ష ప్రణాళికలో కుటుంబ సంక్షేమ కార్యక్రమాలకు జరిగిన కేటాయింపులు

కోట్ల రూపాయలలో

| క్రమ సంఖ్య | కార్యక్రమాలు | 1974-77 లో ఆశించిన వ్యయం Anticipated Expenditure | 1977-79 లో ఉద్దేశించిన వ్యయం Proposed outlay | 5 వ ప్రణాళిక మొత్తం అవుట్ లే outlay |
|---|---|---|---|---|
| | | (1) | (2) | (3) |
| 1. | సేవలు, సరఫరాలు | 197.74 | 221.67 | 419.41 |
| 2. | ప్రజావిద్య (Mass Education) | 6.45 | 6.68 | 13.13 |
| 3. | శిక్షణ (Training) | 6.17 | 5.90 | 12.07 |
| 4. | పరిశోధన, విలువకట్టుట (Research and Valuation) | 3.45 | 5.58 | 9.03 |
| 5. | ప్రపంచబ్యాంకు ప్రాజెక్టు | 15.68 | 9.06 | 24.74 |
| 6. | మాతా శిశు ఆరోగ్యం | 2.73 | 5.84 | 8.57 |
| 7. | సమీకరణ (organisation) | 5.43 | 3.98 | 9.41 |
| | మొత్తం | 237.65 | 259.71 | 497.36 |

# కుటుంబనియంత్రణ - సాంవత్సరిక కేటాయింపులు, ఖర్చులు 1974-80 లో

[కోట్ల రూపాయలలో]

| సంవత్సరం | | | కేటాయింపు | ఖర్చు |
|---|---|---|---|---|
| [1] | | | [2] | [3] |
| 1974-75 | .... | .... | 54.14 | 62.05 |
| 1975-76 | .... | .... | 63.20 | 80.61 |
| 1976-77 | .... | .... | 70.14 | 172.98 |
| 1977-78 | .... | .... | 98.61 | 93.94 |
| 1978-79 | .... | .... | 111.81 | 107.55 |
| 1979-80 | .... | .... | 116.19 | 118.51* |

* తాత్కాలికము (Provisional)

## SIXTH PLAN OUTLAYS -

ఆరవ ప్రణాళిక వ్యయం -

| క్రమ సంఖ్య | కార్యక్రమం |
|---|---|
| [1] | [2] |
| 1. | కనీస అవసరాల కార్యక్రమాలు, గ్రామారోగ్యంకోసం |
| | A) కేంద్రం స్పాన్సర్ (Spansar) చేసిన స్కీములు |
| | B) తదితర స్కీములు |
| | మొత్తం |
| 2. | కమ్యూనికబుల్ డిసీజెస్ నియంత్రణకు |
| 3. | ఆసుపత్రులు, డిస్పెన్సరీలు |
| 4. | వైద్యవిద్య, పరిశోధన |
| 5. | వైద్య ప్రాచీన పద్ధతులు (Traditional Systems of Medicine) హోమియోపతి. |
| 6. | తక్కిన వగైరా సర్వీసులు |
| | మొత్తం |

## HEALTH SECTOR

ఆరోగ్య సెక్టారు

కోట్ల రూపాయలలో

| 1974-79 | | | 1980-85 | | |
|---|---|---|---|---|---|
| రాష్ట్రాలు కేంద్రపాలిత ప్రాంతాలు | కేంద్రం | మొత్తం | రాష్ట్రాలు కేంద్రపాలిత ప్రాంతాలు | కేంద్రం | మొత్తం |
| [3] | [4] | [5] | [6] | [7] | [8] |
| — | — | — | 102.62 | 168 50 | 271.12 |
| 120.30 | — | 120.30 | 305.84 | — | 305.84 |
| 120.30 | — | 120.30 | 408.46 | 168.50 | 576.96 |
| — | 268.17 | 268.17 | 235.00* | 289.00 | 524.00 |
| 225.53 | 67.66 | 293.19 | 576.59 | 45.00<br>62.00<br>29.00<br>7.50 | 720.09 |
| 345.83 | 335.83 | 681.66 | 1220.05 | 601.00 | 1821.05 |

* ఈ మొత్తంలో రాష్ట్రాల 50% వాటా మలేరియానివారణ కార్యక్రమానికి కేటాయించిన 195.30 కోట్ల రూ॥లు కూడా ఉన్నవి.

# కుటుంబ నియంత్రణ

## ఆరవ పంచవర్ష ప్రణాళిక అవుట్‌లే (Outlay)

[కోట్ల రూపాయలలో]

| క్రమ సంఖ్య | ప్రధాన అయిటమ్‌లు [Major Items] | 6 వ ప్రణాళిక అవుట్ లే [Outlay] |
|---|---|---|
| [0] | [1] | [2] |
| 1. | సేవా కార్యక్రమాలు, సరఫరాలు | 687.70 |
| 2. | శిక్షణ | 8.08 |
| 3. | పరిశోధన, ఎవెల్యూయేషన్ [Evalution] | 11.50 |
| 4. | మాస్ మీడియా, విద్య [Mass Media and Education] | 32.00 |
| 5. | మాతా శిశు ఆరోగ్యం | 250.30 |
| 6. | నిర్వహణ [Organisation] | 19.50 |
| 7. | భారత జనాభా ప్రాజెక్టు | 0.20 |
| | మొత్తం | 1010.00 |

## కుటుంబ సంక్షేమ నియంత్రణా కార్యకలాపాలు

పునః పరిశీలిత పంచమ పంచవర్ష ప్రణాళికలో రూ॥ 497.36 కోట్లు కేటాయించడం జరిగింది. దాని వ్యయాన్ని ఈ కింద పొందుపరచిన విధంగా వివిధ కార్యక్రమాలకు కేటాయింపులు జరిగాయి.

## ఆరోగ్యరంగంలో 6 వ పంచవర్ష ప్రణాళికలో రాష్ట్రాల వారీగా కేంద్రపాలిత ప్రాంతాల వారీగా కేటాయింపులు

(కోట్ల రూపాయలలో)

| క్రమ సంఖ్య | రాష్ట్రాలు | మొత్తం | MNP/MPW CHV స్కీములను కలుపుతూ | తక్కిన కార్యక్రమాలు |
|---|---|---|---|---|
| (0) | (1) | (2) | (3) | (4) |
| 1. | ఆంధ్రప్రదేశ్ | 65.00 | 24.39 | 40.61 |
| 2. | అస్సామ్ | 32.00 | 12.00 | 20.00 |
| 3. | బీహార్ | 82.40 | 36.27 | 46.13 |
| 4. | గుజరాత్ | 70.00 | 20.09 | 49.91 |
| 5. | హర్యానా | 48.00 | 8.53 | 39.47 |
| 6. | హిమాచల్ప్రదేశ్ | 16.18 | 5.00 | 11.18 |
| 7. | జమ్ము, కాశ్మీర్ | 48.00 | 9.03 | 38.97 |
| 8. | కర్ణాటక | 65.53 | 20.03 | 45.50 |
| 9. | కేరళ | 36.55 | 9.54 | 27.01 |
| 10. | మధ్యప్రదేశ్ | 94.00 | 36.07 | 57.93 |
| 11. | మహారాష్ట్ర | 89.46 | 30.00 | 59.46 |
| 12. | మణిపూర్ | 9.70 | 5.27 | 4.43 |

| క్రమ సంఖ్య | రాష్ట్రాలు | మొత్తం | $\frac{MNP}{MPW}$ CHV స్కీములను కలుపుతూ | తక్కిన కార్యక్రమాలు |
|---|---|---|---|---|
| (0) | (1) | (2) | (3) | (4) |
| 13. | మేఘాలయ | 7.10 | 4.43 | 2.67 |
| 14. | నాగాలాండ్ | 8.00 | 2.97 | 5.03 |
| 15. | ఒరిస్సా | 29.60 | 16.00 | 13.60 |
| 16. | పంజాబ్ | 49.00 | 13.77 | 35.23 |
| 17. | రాజస్థాన్ | 40.98 | 17.43 | 23.55 |
| 18. | సిక్కిమ్ | 4.35 | 1.39 | 2.96 |
| 19. | తమిళనాడు | 67.80 | 21.82 | 45.98 |
| 20. | త్రిపుర | 8.56 | 3.36 | 5.20 |
| 21. | ఉత్తరప్రదేశ్ | 134 98 | 74.89 | 60.09 |
| 22. | పశ్చిమబెంగాల్ | 84.00 | 25.88 | 58.12 |
| | మొత్తం రాష్ట్రాలు | 1091.19 | 398.16 | 693.03 |

## కేంద్రపాలిత ప్రాంతాలు

| క్రమ సంఖ్య | కేంద్రపాలిత ప్రాంతాలు | మొత్తం | MNP ——CHV MPW స్కీములను కలుపుతూ | తక్కిన కార్య క్రమాలు |
|---|---|---|---|---|
| (0) | (1) | (2) | (3) | (4) |
| 23. | అండమాన్, నికోబార్ దీవులు | 1.85 | 0.44 | 1.41 |
| 24. | అరుణాచలప్రదేశ్ | 8.05 | 4.00 | 4.05 |
| 25. | చండీఘర్ | 6.10 | 0.85 | 5.25 |
| 26. | దాద్రా, నాగర్ హవేలీ | 0.65 | 0.37 | 0.28 |
| 27. | ఢిల్లీ | 87.66 | 0.12 | 87.54 |
| 28. | గోవా, డామన్, డయ్యూ దీవులు | 14.00 | 0.55 | 13.45 |
| 29. | లక్షద్వీపాలు | 0.55 | 0.22 | 0.33 |
| 30. | మిజోరమ్ | 7.00 | 3.26 | 3.74 |
| 31. | పాండిచ్చేరి | 3.03 | 0.49 | 2.51 |
| | మొత్తం కేంద్రపాలిత ప్రాంతాలు | 128.86* | 10.30* | 118.56* |
| | మొత్తం రాష్ట్రాలు కేంద్రపాలిత ప్రాంతాలు | 1220.05 | 408.46 | 811.59 |

* సెంట్రల్లీ స్పాన్సర్డ్ స్కీములకు కేటాయించిన వ్యయాన్ని (outlay) మినహాయించడమైంది.

## గ్రామీణ ఆరోగ్య స్కీములో భౌతిక

| క్రమ సంఖ్య Sl. No. | కార్యక్రమం [Programme] | ముచ్చు [Norm] |
|---|---|---|
| [0] | [1] | [2] |
| 1. | కమ్యూనిటీ ఆరోగ్య స్వచ్ఛంద కార్యకర్తలు | ప్రతీ 1,000 మంది గ్రామీణ ప్రజలకు ఒకరు |
| 2. | ఉపకేంద్రాలు | 1 : 5000 కింద భాగాలలో జనాభా [Plains] మరియు తెగలున్న కొండ ప్రాంతాలలో |
| 3. | ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు | 1 : 30,000 |
| 4. | అప్‌గ్రేడెడ్ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను కమ్యూనిటీ ఆరోగ్య కేంద్రాల స్థాయికి తీసుకురావడం | 1 : 1,00,000 లేదా ఒక సాముదాయిక మండలానికి ఒకటి |

## టార్గెట్లు, సాధించిన ప్రగతులు

| | | 1980—85 | |
|---|---|---|---|
| యూనిట్ [Unit] | 1-4-1980 నాటిస్థితి [Position Obtain- on 1—4—1980] | టార్గెటు [Target] అదనముగా [Additional] | 31-3-1985 కి కాగలస్థితి [Position by 31-3-1985] |
| [3] | [4] | [5] | [6] |
| లక్ష | 1.40 | 2.20 | 3.60 |
| అంకెలు [Nos ] | 50,000 | 40,000 | 90,000 |
| అంకెలు [Nos.] | 5,400 దీనితోపాటు 1,000 అదనపు [Sub Siduary] ఆరోగ్య కేంద్రాలను కూడా స్థాపించింది. | 600 అదనపు [Additional] ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు + 1,000 ఆస్పత్రులను [Sub-siduary Health Centres స్థాయికి తీసుకురావడం. | 6,000 |
| అంకెలు [Nos.] | 340 | 174 | 514 |

# 6 వ పంచవర్ష ప్రణాళిక - ఆరోగ్యం ధ్యేయం
# (6 th five year plan - Health Objective)

ఆరోగ్యంపై పెట్టిన పెట్టుబడి మనిషి గుణాత్మక మెరుగుదలకు దారితీస్తుంది. కనుక ఆరోగ్యమనే విషయాన్ని మనం మొత్తంగా యోచించవలసిన అవసరం ఉంది. రక్షిత మంచినీటి సరఫరా, ఆవరణ పారిశుద్ధ్యం, మాతా శిశుసంక్షేమం వంటి అవినాభావ సంబంధం ఉండే కార్యక్రమాలన్నింటిని, అన్నిరకాలుగా సంబంధాలను కల్పించాలి. (Establishment of Horigontal and vertical links) అటువంటి లింకేజిలు ఉన్నప్పుడే కావలసినంతకీతిలో ప్రయోజనాలను పొందగలం. వ్యాధులమీద మాత్రమే జరిపే పోరాటం విజయవంతం కాదు. ఎందు వల్లనంటే వ్యాధులకు అసలు కారణమైన పేదరికంమీద పోరాటం జరపాలి. అందువల్లనే, 6 వ పంచవర్ష ప్రణాళికలో ఉద్యోగావకాశాలు ఎక్కువగా కల్పించడం, పేదరిక నిర్మూలన, జనాభా నియంత్రణ, మానవుని జైవికావసరాలు తీర్చడానికి ఎక్కువగా ప్రాధాన్యాన్నిచ్చింది. ఇవన్నీ మానవ వనరుల అభివృద్ధి కార్యక్రమానికి కావలసినంత సమగ్ర వంతమైన అంశాలు. (Integrated components of the Human Resources Development Programme)

## కేంద్రరంగం

కేంద్రం సిఫార్సుచేసిన స్కీములలో (Central Sponsored Schemes) జాతీయ మలేరియా నివారణ కార్యక్రమం (National Malaria Fradication Programm )నికి 196.44 కోట్ల రూపాయ లను కేటాయించడం జరిగింది. జాతీయ కుష్ఠునివారణ కార్యక్రమాన్ని (National Leprosy Control Programme) నేషనల్ స్కీమ్ ఫర్ ప్రివెన్షన్ ఆఫ్ ఇంపెయిర్‌మెంట్ ఆఫ్ విజన్ అండ్ కంట్రోల్ ఆఫ్ బ్లైండ్‌నెస్ (National Scheme for Prevention of impairment vision and Control of Blindness) లు బాగా

ఆచరణలో పెట్టడానికి, గ్రామీణ ప్రాంతాలలో ఫైలేరియా నివారణకు కూడా పథకాలు అభివృద్ధిపరచడానికి అవకాశం కల్పించడమైంది.

## రాష్ట్రరంగం

5 వ పంచవర్ష ప్రణాళికలో మొదటి మూడు సంవత్సరాలలో ఖర్చు 159.92 కోట్ల రూపాయలని అంచనావేయడమైంది. మిగతా రెండు సంవత్సరాలకు అంటే 1977-79 లలో 185.91 కోట్ల రూపాయలను సిఫార్సు చేయడమైంది.

వీటిలో నడుస్తున్న కార్యక్రమాలకు కావలసివి చూడటానికి గ్రామీణ వైద్య సర్వీసులను విస్తృతపరచడానికి అవకాశం కల్పించడమైంది. సంవత్సరానికి ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి 12,000 రూపాయల మందులు, ఉప ఆరోగ్య కేంద్రానికి 2,000 రూపాయలు అందించడానికి నిర్ణయించడమైంది. వైద్య విద్యాభివృద్ధికి కూడా బాగా దోహదంచేశారు.

## సామాన్యరంగం

ఈ రకంగా పునఃపరిశీలించిన ఆరోగ్యరంగ పంచమ పంచవర్ష ప్రణాళికా వ్యయం 681.66 కోట్ల రూపాయలు కేటాయింపు జరిగింది.

సామాన్యరంగంలో పునఃపరిశీలించిన పంచమ పంచవర్ష ప్రణాళికా వ్యయం కోట్లరూపాయలలో

| స్కీము | 1974-79 ఆమోదించిన వ్యయం | 1977-79 ఆమోదించిన కేటాయింపు | పునఃపరిశీలించిన ఐదవ ప్రణాళిక వ్యయం |
|---|---|---|---|
| 1. కేంద్రం | 28.60 | 39.06 | 67.66 |
| 2. కేంద్రం సిఫార్సు చేసింది | 124.33 | 143.34 | 268.17 |
| 3. రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలు | 159.92 | 185.91 | 345.83 |
| మొత్తం | 312.85 | 368.31 | 681.66 |

# షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, వెనుకబడిన వర్గాల సంక్షేమం

మన దేశంలో షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, వెనుకబడిన వర్గాలు, బలహీన వర్గాలలో చాలా ముఖ్యమైనవి. మన దేశ జనాభాలో సుమారు 15 శాతం షెడ్యూల్డ్ కులాలు, సుమారు 7 శాతం షెడ్యూల్డ్ తెగలు ఉన్నారు. వీరంతా కూడా సాంఘిక, ఆర్థిక విద్యారంగంలో బాగా వెనుకబడి ఉన్నవారు. షెడ్యూల్డ్ కులాలు అనుభవించే ఒక ప్రత్యేక సమస్య "అంటరానితనం" అనే ఆచారంతో ఉన్నత వర్గాల లేక కులాల ప్రజలు వీరిని దూరంగా ఉంచి చులకనగా చూస్తారు. భారత రాజ్యాంగం కల్పించిన రాజ్యాంగ భద్రతలున్న అస్పృశ్యతా నిర్మూలనా చట్టం ఉన్నా అంటరానితనం అనే దురాచారం ఇంకా సజీవంగానే దేశం పలుప్రాంతాలలో ముఖ్యంగా పల్లె ప్రాంతాలలో ఉండడం చాలా విచారకరమైన, దురదృష్టకరమైన విషయం. షెడ్యూల్డ్ కులాల ప్రజలు, సంఘంలో తదితర జాతులతో నివసిస్తూ దేశమంతా వ్యాపించి ఉన్నారు. షెడ్యూల్డ్ కులాలకు ఉన్నత కులాలవారికిమధ్య ఎప్పుడూ సంఘర్షణ జరుగుతూనే ఉంది. షెడ్యూల్డ్ తెగలు, షెడ్యూల్డ్ కులాల ప్రజలవలెకాక మిగతా సంఘానికి బాగా దూరంగా అడవులలోనూ, కొండలలోనూ, లోయలలోనూ నివసించడంతో, స్వాభావికంగా షెడ్యూల్డ్ కులాల సమస్యలకు, షెడ్యూల్డ్ తెగల ప్రజల సమస్యలకు వ్యత్యాసం ఏర్పడుతున్నది.

## షెడ్యూల్డ్ కులాలు

1971 జనాభా లెక్కల ప్రకారం షెడ్యూల్డ్ కులాల జనాభా 8,24,80,251 మంది కాని 1981 జనాభా లెక్కల ప్రకారం వీరి జనాభా ఇంకా పూర్తిగా వెలువడలేదు. 1981 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో వీరి జనాభా 79,61,730. అస్సామ్, జమ్మూ, కాశ్మీర్, కర్ణాటక, మధ్యప్రదేశ్, మణిపూర్, నాగాలాండ్, ఉత్తర ప్రదేశ్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలు, అండమాన్, నికోబార్ దీవులు,

లక్షద్వీపాలను మినహాయిస్తే షెడ్యూల్డ్ కులాల మొత్తం జనాభా 5,58,11,514 మంది (1981 Cences) మన దేశంలో కుల వ్యవస్థ ముఖ్యం. వివిధ వర్గాల ప్రజలు చేపట్టే వృత్తుల ఆధారంగా ఏర్పడింది. కులవ్యవస్థలో స్థూలంగా నాలుగు వర్గాలున్నాయి.

## 1. బ్రాహ్మణ కులం

వీరు పరిపాలకులకు సలహాలిస్తూ పరిపాలనలో వారి మేధస్సును ఉపయోగించి పరిపాలకులకు సహకరించేవారు.

## 2. క్షత్రియ కులం

వీరు దృఢకాయులు, శౌర్యవంతులు. దేశరక్షణ, పరిపాలన వీరి కర్తవ్యం.

## 3. వైశ్య కులం

వీరు వాణిజ్యం చేసేవారు.

## 4. శూద్ర కులం

వీరు పై వృత్తులనుకాక తదితర కార్యక్రమాలన్నీ చేసేవారు. వివిధ రకాలైన వృత్తులను (Crafts) చేపట్టేవారు. అంటే మంగలి, చాకలి, కుమ్మరి వీరంతా ఈ వర్గానికి చెందినవారు.

ఈ శూద్ర కులంలో హేయమైన, అపరిశుభ్రమైన వృత్తులు చేపట్టేవారే షెడ్యూల్డ్ కులాలుగా రూపొందారు. కులాల హెచ్చు తగ్గులలో మొట్టమొదటి స్థానం బ్రాహ్మణులకు, తరువాత స్థానం క్షత్రియులకు, తరువాత స్థానం వైశ్యులకు, ఆ తరువాతి స్థానం శూద్రులకు ఇవ్వడం జరిగింది. కులవ్యవస్థలో అతినిమ్నస్థానం షెడ్యూల్డ్ కులాలకు ఇవ్వబడింది. వీరు చేపట్టిన హేయమైన, అపరిశుభ్రమైన వృత్తులవల్ల, వీరిని అస్పృశ్యులనీ, అంటరానివారనీ అగ్రకులాలవారు అసహ్యించుకున్నారు. రోడ్లను ఊడ్చేవాళ్ళు, మలమూత్రాలను ఊడ్చి, వాటి నెత్తిమీద ఉంచుకొని మోసుకువెళ్ళి పారవేసే వీరివృత్తి అతి హీనమైంది. నిజంగా వీరిచేత ఇటువంటి పని చేయించడం మన భారత సమాజానికే తీరని కళంకం.

## షెడ్యూల్డ్ తెగలు

షెడ్యూల్డ్ తెగలు సమాజానికి దూరంగా ఆటవిక ప్రాంతాల లోనూ, కొండలలోనూ, లోయలలోనూ నివసించడంతో వీరి ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందలేదు. షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, విద్యారంగంలోనూ, ఆర్థిక రంగంలోనూ, వెనుకబడ్డవారే. అయితే షెడ్యూల్డ్ కులాలవారు అస్పృశ్యత సమస్యవల్ల ప్రత్యేకంగా బాధ పడటం, సమాజం బహిష్కరించడంవల్ల వీరి అభివృద్ధికి అవకాశాలు లోపించాయి. షెడ్యూల్డ్ తెగలు సనాతనమైన వ్యవసాయ పద్ధతుల వల్లను, నీటివనరులు లేకపోవడంవల్లను, పెట్టుబడి లోపాలవల్లను ఆర్థికంగా బాగా వెనుకబడ్డారు.

సంచార తెగలు శాశ్వతంగా ఒకచోట ఉండక ఒక ప్రదేశం నుంచి వేరొక ప్రదేశానికి ఆహారం కోసం వృత్తికోసం సంచారం చేస్తుంటారు. విముక్త జాతుల నేరారోపణల కారణంగా బాధపడటం సహజంగా జరుగుతుంది.

1971 జనాభా లెక్కల ప్రకారం షెడ్యూల్డ్ తెగల మొత్తం జనాభా 4,11,47,922 మంది. 1981 జనాభా లెక్కలలో అస్సాం, హర్యానా, జమ్ము & కాశ్మీరు, కర్ణాటక, మధ్యప్రదేశ్, మణిపూర్, పంజాబ్, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలనుంచి, చండీఘర్, ఢిల్లీ, పాండిచ్చేరి కేంద్రపాలిత ప్రాంతాలనుంచి సమాచారం అందలేదు. ఈ రాష్ట్రాలను, కేంద్రపాలిత ప్రాంతాలను మినహాయిస్తే మిగతా రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలలో మొత్తం 3,41,15,050 మంది షెడ్యూల్డ్ తెగలు ఉన్నట్లు, 1981 జనాభా లెక్కలు తెలియజేస్తు న్నాయి. మనదేశంలో 427 ఆదిమజాతుల సముదాయాలు ఉన్నాయి. వీటిలో అత్యధికులు హిందూ మతానికి చెందినవారు. మిగతావారిలో క్రైస్తవ మతస్థులు, ఆదిమజాతులకు చెందిన మతస్థులు, బౌద్ధ మతస్థులు, మహమ్మదీయ మతస్థులుకూడా ఉన్నారు.

# షెడ్యూల్డు కులాల కోసం షెడ్యూల్డు తెగలకు భారత ప్రభుత్వం అందిస్తున్న వివిధ సేవా కార్యక్రమాలు

షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు 15 రాష్ట్రపతి ఉత్తరువుల ద్వారా 341, 342 ప్రకరణాలద్వారా షెడ్యూలులో పొందుపరచారు. షెడ్యూలులో ఇమడ్చిన రకరకాల షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగల ప్రజలకు ప్రభుత్వంవారు ఈ కింది సంక్షేమ కార్యక్రమాలను చేపడుతున్నారు.

## అస్పృశ్యతా నిర్మూలనా చట్టం

ఈ చట్టం పరిధిని శిక్షను మరింత కఠినంగాను అస్పృశ్యతా చట్టాన్ని 1955 (Untouchbility Offences Act 1955) అన్‌టచ్‌బులిటీ అఫెన్సెస్ ఎమెండ్‌మెంటు, మిసేల్లెనియస్ (Untouchbility Offences Amendment and Miscellanious Provisions Act 1976) ప్రోవిజన్స్ యాక్ట్ 1976 గా సవరించి 19 నవంబరు, 1976 నుంచి అమలులో పెట్టారు. ఈ సవరణలో ప్రధానమైన చట్టం పేరును పౌర హక్కుల రక్షణ చట్టం 1976 (Protection of Civil Rights Act 1976) గా మార్చడమైంది. ఈ చట్టం అస్పృశ్యతా నిర్మూలనా చట్టం ప్రకారంవల్ల కలిగే సదుపాయాలను వర్తించే ప్రజలకు అందకుండాచేస్తే అపరాధిగిలితే, అతడు చట్టరీత్యా శిక్షార్హుడు. అంతేకాక తదుపరి నేరాలకు శిక్షాకుసుమును ఎక్కువుగా చెల్లించవలసి ఉంది.

రిప్రజెంటేషన్ ఆఫ్ ది ప్యూపుల్ ఏక్ట్ 1951(Representation of the People Act, 1951) లో ఉన్న 8 వ సెక్షను ప్రకారం అటువంటి నేరం చేసినవానిని 6 సంవత్సరాల వరకు పార్లమెంటు ఎన్నికలలోనూ, రాష్ట్రాల శాసనసభల ఎన్నికలలోనూ, పోటీచేయడానికి అనర్హుడుగా పరిగణిస్తారు.

## పౌర హక్కుల రక్షణ చట్టం
## (Protection of Civil Rights Act, 1976)

ఈ చట్టంలోని 15A సెక్షన్ ప్రకారం, రాష్ట్ర ప్రభుత్వాలకు, కేంద్రపాలిత ప్రాంతాలకు, కేంద్ర సహాయం ఇవ్వడం జరుగుతుంది. ఈ చట్టం పరిధిలో బాధితులైన షెడ్యూల్డ్ కులాల ప్రజలకు 15 రాష్ట్రాల ప్రభుత్వాలు న్యాయసహాయం కూడా ఉచితంగా చేస్తున్నది. ఈ చట్టం అమలును సరిగా చూడటానికి ప్రత్యేక దళాలను 10 రాష్ట్రాలలోను, ప్రత్యేకాధికారులను 6 రాష్ట్రాలలోను నియమించడం జరిగింది. జూన్ 16, 1982 నాటికి ఈ చట్టం అమలును తీసుకున్న చర్యలను సింహావలోకనం ఎప్పటికప్పుడు సమీక్షచేస్తూ కమిటీలను కూడా ఏర్పాటు చేశారు. ఆంధ్రప్రదేశ్‌లోని పనిచేస్తున్న ప్రత్యేక సంచార కోర్టులతోపాటు, శ్రీకాకుళం, మెదక్ జిల్లాలలో మరో రెండు సంచారకోర్టులను ఏర్పాటుచేశారు. రాజస్థాన్‌లో-3, బీహార్‌లో-3, తమిళనాడులో-4 ప్రత్యేక కోర్టులను ఏర్పాటుచేశారు.

## లెజిస్లేటర్లలో ప్రాతినిధ్యం
## (Representation in Legislatures)

రాజ్యాంగంలోని 330, 332 ప్రకరణాల ప్రకారం షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూల్డ్ జాతులకు వారి జనాభా నిష్పత్తినిబట్టి లోక్‌సభ విధానసభలలో సీట్లు కేటాయించబడ్డాయి. ఈ రకంగా రాజ్యాంగం ప్రారంభమైనప్పటినుంచి 10 సంవత్సరాల వరకు ఇవ్వబడింది. దీనిని పొడిగిస్తూ 25 జనవరి 1990 వరకు ఈ అవకాశం కల్పించారు. ఈ రకమైన రిజర్వేషన్లు వర్తించేలా, కేంద్రపాలిత ప్రాంతాలలో కూడా పార్లమెంటుకీ చట్టాలలు రూపొందించారు. రాజ్యసభ, విధానపరిషత్తులలో మాత్రం అటువంటి రిజర్వేషన్లు అమలులేవు. పంచాయితీరాజ్ వ్యవస్థ మొదలుపెట్టాక అటువంటి ప్రాతినిధ్యం స్థానిక సంస్థలకు కూడా వర్తింపజేయడం జరిగింది.

| | | ఆంధ్రప్రదేశ్‌లో |
|---|---|---|
| దేశంలో ఉన్న మొత్తం లోక్‌సభ సీట్ల సంఖ్య 542 | | 42 |
| అందులో షెడ్యూల్డ్ కులాలకు రిజర్వు చేసిన సీట్ల సంఖ్య | 79 | 6 |
| అందులో షెడ్యూల్డ్ తెగలకు రిజర్వు చేసిన సీట్ల సంఖ్య | 40 | 2 |
| దేశంలోవున్న అన్ని రాష్ట్రాల కేంద్రపాలిత ప్రాంతాలలో విధానసభ సీట్ల సంఖ్య | 3,997 | 294 |
| అందులో షెడ్యూల్డ్ కులాలకు రిజర్వు చేసిన సీట్ల సంఖ్య | 557 | 29 |
| అందులో షెడ్యూల్డ్ తెగలకు రిజర్వు చేసిన సీట్ల సంఖ్య | 303 | 15 |

## సర్వీసులలో రిజర్వేషన్లు

రాజ్యాంగంలోని 335 వ ప్రకరణ ప్రకారం షెడ్యూల్డ్ కులాల, తరగతుల సభ్యులకు, పరిపాలనా సమర్థత చెడిపోకుండా ప్రభుత్వ సర్వీసు లలో రిజర్వేషన్లు ఇవ్వడానికి అవకాశం కల్పించబడింది. 16 (4) ప్రకరణం ప్రకారం ప్రభుత్వోద్యోగాలలో సరిగా ప్రాతినిధ్యంలేని వెనుకబడిన తరగతులకు, ఆయా సర్వీసులలో రిజర్వేషన్లు ఇచ్చారు. దీనిని ఆధారంగా చేసుకొని షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూలు తెగలకు రిజర్వేషను సౌకర్యాలు కల్పించడం జరిగింది.

అఖిల భారత స్థాయిలో, ఓపెన్ కాంపిటేషన్‌లో ఉద్యోగాలలో 15 శాతం షెడ్యూల్డ్ కులాలకు, 7 1/2 శాతం షెడ్యూల్డ్ తెగలకు రిజర్వు చేయబడ్డాయి. గ్రూపు "సి" గ్రూపు "డి" ఉద్యోగాలకు ప్రత్యక్ష రిక్రూట్‌మెంటులో షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూల్డ్ తెగలకు వారి ఆయా రాష్ట్రాలలో వారి భాగం లేక వంతునిబట్టి వారికి ఉద్యోగాలు రిజర్వు చేయవలసి ఉంది.

గ్రూపు "బి", "సి", "డి" సర్వీసులలో డిపార్టుమెంటల్ పరీక్షలలో ఉత్తీర్ణులైన షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తరగతులకు కూడా 15 శాతం, 7 1/2 శాతం రిజర్వేషన్ సౌకర్యాలు కల్పించడం జరిగింది.

కావలసినంత ప్రాతినిధ్యం షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూల్డ్ తెగలకు కల్పించడానికి వారి అర్హతలలోనూ, వయోపరిమితులలోను కూడా సడలింపులు చేయడం జరిగింది.

కేంద్ర సర్వీసులలో షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల ప్రాతినిధ్యం

| గ్రూపు (తరగతి) | మొత్తం ఉద్యోగస్థుల సంఖ్య | షెడ్యూల్డ్ కులాలు | శాతం | షెడ్యూల్డ్ తెగలు | శాతం |
|---|---|---|---|---|---|
| A (1వ తరగతి) | 47,937 | 2,375 | 4.95 | 506 | 1.06 |
| B (2వ తరగతి) | 59.161 | 5,055 | 8.54 | 763 | 1.29 |
| C (3వ తరగతి) | 17,52,230 | 2,35,555 | 13.44 | 55,334 | 3.16 |
| D (4వ తరగతి) | 12,72,397 | 2,47,607 | 19.46 | 68,401 | 5.38 |
| (స్వీపర్లు మినహాయించి మొత్తం) | 31,31,725 | 4,90,592 | 15.67 | 1,25,004 | 3.99 |
| అఖిలభారత సర్వీసులు (I.A S) | 4,009 | 397 | 9.9 | 215 | 5 3 |
| (All India Services) (I.P.S.) | 2,225 | 218 | 9.8 | 82 | 3.7 |

కేంద్రాలకి అనుగుణంగా రాష్ట్రాల సర్వీసులలో కూడా వీరికి ప్రాతినిధ్యం లేదా రిజర్వేషన్ల సౌకర్యాలు కల్పించబడ్డాయి.

షెడ్యూల్‌లో పొందుపరచిన ప్రాంతాల, షెడ్యూల్ తెగల ప్రాంతాల పరిపాలన :

ఆంధ్రప్రదేశ్, బీహార్, గుజరాత్, హిమాచల్‌ప్రదేశ్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్‌లలోని 244 వ ప్రకరణం ఐదవ షెడ్యూలు ప్రకారం కొన్ని ప్రాంతాలు షెడ్యూల్డ్ ప్రాంతాలుగా గుర్తించబడ్డాయి.

అస్సామ్, మేఘాలయా, మిజోరమ్ కేంద్రపాలిత ప్రాంతంలో ఉన్న ఆటవిక ప్రాంతాలు (Tribal Areas) రాజ్యాంగంలోని 6 వ షెడ్యూల్ ననుసరించి పాలించడం జరుగుతుంది. షెడ్యూలు ప్రకారం అవి స్వతంత్ర జిల్లాలుగా విభజించబడ్డాయి. అటువంటివి ఎనిమిది (8) జిల్లాలు ఉన్నాయి. అస్సామ్‌లో దక్షిణ కాచార్ కొండలు, మికిర్ కొండలు జిల్లాలు, మేఘాలయాలోని యునైటెడ్ - ఖాసి - జైన్షియా (United Khasi-Jainshia Hills) కొండలు, జోవై, గారో కొండల జిల్లాలు, మిజోరమ్‌లోని చక్మా, లాఖేర్, పావి జిల్లాలు, ప్రతీ స్వతంత్ర జిల్లాకు, ఒక కౌన్సిల్ ఉంటుంది. అందులో 30 కి మించకుండా సభ్యులు ఉంటారు. వీరిలో నలుగురు నామినేట్ చేయబడతారు. మిగతావారిని వయోజన ఓటింగుద్వారా ఎన్నుకుంటారు. ఈ కౌన్సిల్లకు పరిపాలన శాసన, న్యాయ సంబంధమైన అధికారాలు ఉంటాయి.

సంక్షేమ, సలహా సంస్థలు
(Welfare and Admisory Agencies)

కేంద్ర హోమ్ మంత్రిత్వశాఖ షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగల అభివృద్ధి కార్యక్రమాలు పోలసీ, ప్లానింగు, సమన్వయాలను చూసే సంధాన మంత్రిత్వశాఖ (Modal Ministry). ప్రతీ మంత్రిత్వ శాఖ, డిపార్టుమెంటు, దాని సంబంధిక రంగానికి సంధానకర్తగా ఉంటుంది. కేంద్ర హోమ్ మంత్రిత్వశాఖ, రాష్ట్రప్రభుత్వాలకు, కేంద్ర మంత్రిత్వశాఖలకు మధ్య లయేజన్ (Liaisan) గా పనిచేస్తున్నది.

ఆగష్టు 1978 లో రాజ్యాంగపరంగా 338 ప్రకరణం ప్రకారం షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల కమీషన్‌ను ఏర్పాటుచేయడం జరిగింది. ఇందులో నలుగురు సభ్యులుంటారు. అందులో ఒకరు ప్రత్యేకాధికారిగా షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల కమీషనరుగా నియమించబడతారు. పౌరహక్కుల రక్షణ చట్టం, 1976 (Protection of Civil Rights, 1976) ను అమలుపరచడం, అనేక సర్వీసులలో రిజర్వేషన్లు అమలుచేయడం, రాజ్యాంగ భద్రతలు షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల సాంఘిక, ఆర్థిక పరిస్థితులు తెలుసుకొని, తీసుకోవలసిన చర్యలను సిఫార్సుచేయడం ఈ కమీషన్ విధులు.

## పార్లమెంటరీ కమిటీలు

షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల రాజ్యాంగ భద్రతలను పరీక్షించేందుకు 1968, 1971, 1973 లలో భారత ప్రభుత్వం మూడు పార్లమెంటరీ కమిటీలను ఏర్పాటు చేసింది. ఈ కమిటి పార్లమెంటు స్టాండింగ్ కమిటీ (Standing Committee) గా ఏర్పడుతుంది. ఇందులో సభ్యుని పదవీకాలం 1 సంవత్సరం మాత్రమే. ఈ కమిటీలో 30 మంది సభ్యులుంటారు. లోక్‌సభ నుంచి 20 మంది, రాజ్యసభనుంచి 10 మంది ఉంటారు.

## రాష్ట్రాలలో ఉన్న సంక్షేమ శాఖలు (Welfare Department in State)

షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల, వెనకబడిన వర్గాలవారి సంక్షేమాన్ని చూడటానికి రాష్ట్రాలలోను, కేంద్రపాలిత ప్రాంతాలలోను ప్రత్యేకమైన శాఖలు నెలకొల్పారు. ఒక రాష్ట్రానికి, ఇంకో రాష్ట్రానికి ఈ పరిపాలనా యంత్రాంగంలో వ్యత్యాసం ఉంది. రాజ్యాంగంలోని 164 వ ప్రకరణం ప్రకారం బీహార్, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలలో గిరిజన సంక్షేమాన్ని చూడటానికి ప్రత్యేకమైన మంత్రులు నియమితులైనారు. మరికొన్ని రాష్ట్రాలలో, కేంద్రంలో ఉన్న పార్ల

మెంటరీ కమిటీలవలే రాష్ట్ర విధానసభ సభ్యులతో కమిటీలను ఏర్పాటు చేయడం జరిగింది.

రాజ్యాంగంలోని 5 వ షెడ్యూల్ ప్రకారం షెడ్యూల్ ప్రాంతాలు ఉన్న అన్ని రాష్ట్రాలలోను తమిళనాడు, పశ్చిమ బెంగాల్ లతోసహా గిరిజన సలహామండలులను (Tribes Advisory Council) ఏర్పాటుచేశారు. ఇవి రాష్ట్రాలలో గిరిజన సంక్షేమానికి, ప్రోత్సాహానికి సంబంధించిన విషయాలలో సలహాలను ఇస్తుంది.

## స్వచ్ఛంద సేవా సంస్థలు (Voluntary Organisations)

షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ జాతుల సంక్షేమాన్ని ప్రోత్సహిస్తూ అనేక స్వచ్ఛంద సేవాసంస్థలున్నాయి. అఖిలభారతస్థాయిలో ముఖ్యమైనవి : ఢిల్లీలో ఉన్న హరిజన సేవక్ సంఘ్, కొత్త ఢిల్లీలో ఉన్న భారతీయ డిప్రెస్ట్ క్లాస్ లీగ్, అలహాబాద్‌లోని ఈశ్వర్ – శరన్ ఆశ్రమం, కొత్త ఢిల్లీలో ఉన్న ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ, కొత్త ఢిల్లీలోఉన్న హింద్ స్వీపర్స్ సేవక్ సంఘ్, పశ్చిమ బెంగాల్‌లో నరేంద్రపూర్‌లో ఉన్న రామకృష్ణ మిషన్, న్యూఢిల్లీలో భారతీయ ఆదిమజాతి సేవక్ సంఘ్, నెల్లూరులోఉన్న ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవక్ సంఘ్, చిరపుంజి, రాంచీ, పూరీ, సిల్చార్, షిల్లాంగులలో ఉన్న రామకృష్ణ మిషన్, ఒరిస్సాలోని నిమఖండిలో ఉన్న ఠక్కర్ బాపా ఆశ్రమ, పూనాలోఉన్న సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీ, రాజస్థాన్‌లోని టిలోనియాలో సోషల్ వర్క్ అండ్ రిసెర్చ్‌సెంటర్ సంస్థలు.

భారత ప్రభుత్వం అనధికార స్వచ్ఛంద సేవాసంస్థలకు (Non-Official Voluntary Organisations) షెడ్యూల్డ్‌కులాల, షెడ్యూల్డ్ తెగల సంక్షేమానికి కృషిచేసేవాటికి గ్రాంట్లను కూడా ఇస్తున్నది. 1981–82 లో దీనికోసం రూ. 140 లక్షలు మంజూరుచేశారు.

## సంక్షేమ స్కీములు (Welfare Schemes)

షెడ్యూల్డు కులాల షెడ్యూల్డు తెగల సంక్షేమానికి రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వం రెండు ప్రత్యేక శ్రద్ధవహిస్తున్నాయి.

గడచిన ఐదు పంచవర్ష ప్రణాళికలలో వారి సంక్షేమానికి ప్రత్యేక కార్యక్రమాలను చేపట్టారు. దీనికయ్యే వ్యయంకూడా ప్రణాళిక, ప్రణాళికకు పెరుగుతున్నది.

## ప్రణాళికలో అయిన వ్యయం

(కోట్ల రూపాయలలో)

| | కాలము | ఖర్చు |
|---|---|---|
| ప్రథమ పంచవర్ష ప్రణాళిక | 1951-56 | 30 04 |
| రెండవ పంచవర్ష ప్రణాళిక | 1956-61 | 79.41 |
| మూడవ పంచవర్ష ప్రణాళిక | 1961-66 | 100.40 |
| సాంవత్సరిక ప్రణాళికలు | 1966-69 | 68.50 |
| నాల్గవ పంచవర్ష ప్రణాళిక | 1969-74 | 172.70 |
| ఐదవ పంచవర్ష ప్రణాళిక | 1974-78 | 296.19 |
| ఆరవ పంచవర్ష ప్రణాళిక (కేటాయింపు) | 1980-85 | 24.00 |
| ప్రత్యేక కేంద్ర సహాయం - షెడ్యూల్డ్ తెగల ఉపప్రణాళికలకు | | 470.00 |
| షెడ్యూల్డ్ కులాల అభివృద్ధికి కాంపోనెంట్ ప్రణాళికలలో ప్రత్యేక కేంద్ర సహాయం | | 600.00 |

ఇంతేకాకుండా రాష్ట్రప్రభుత్వాలు, వారి ప్రణాళికేతర బడ్జెట్‌ల నుంచి కూడా షెడ్యూల్ కులాల, షెడ్యూలు జాతుల సంక్షేమానికి ఖర్చుపెడుతున్నారు.

## ప్రణాళిక కార్యక్రమాలు (Plan Programmes)

కేంద్రం ప్రోత్సహించిన స్కీములలో (Central Sponsored Schemes) ముఖ్యమైన స్కీములను ఈ కింద పొందుపరుస్తున్నాము.

### 1. కోచింగు స్కీము (Coaching and Allied Scheme)

కేంద్ర రాష్ట్రప్రభుత్వాల సర్వీసులలోను, ప్రభుత్వ సంస్థలలోను (Public-Sector-Undertakings) బ్యాంకు సర్వీసులలోను, జీవిత

భీమా / సామాన్యభీమా సర్వీసులలోను షెడ్యూల్డు కులాల షెడ్యూల్డు తెగల ప్రాతినిధ్యాన్ని మెరుగుపరచడానికిగాను వివిధ ప్రాంతాలలో ప్రీ-ఎగ్జామినేషన్ ట్రైనింగ్ సెంటర్లను ఏర్పాటుచేశారు. ఈ ట్రైయినింగ్ సెంటర్లలో షెడ్యూల్డు కులాల, షెడ్యూల్డు తెగల అభ్యర్థులకు ఆయా సర్వీసుల వ్రాతపరీక్షలకు బాగా తయారయ్యేటట్లు శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. మార్చి 1982 నాటికి ఇటువంటి కేంద్రాల సంఖ్య 47 వరకు నెలకొల్పగలవని అంచనా చేశారు.

## 2. మెట్రిక్ అనంతర ఉపకార వేతనాలు [Post-Matric Scholarships]

షెడ్యూల్డు కులాలకు, షెడ్యూల్డు తెగలకు ఉపకార వేతనం ఇవ్వడమనేది 1944-45 లో ప్రారంభమైంది. ఈ అభ్యర్థులు వారి చదువు పూర్తి చేసుకోవడానికి మెట్రిక్ అనంతర తరగతులలో వారికి ధనసహాయం అందిస్తున్నారు. ప్రారంభంలో షెడ్యూల్డు కులాలకు 114, షెడ్యూల్డు తరగతులకు 89 రూ॥ ఉంటే ఈ ఉపకార వేతనాల సంఖ్య లక్షలను తాకుతున్నది.

| సంవత్సరం | షెడ్యూల్డ్ కులాల షెడ్యూల్డ్ తరగతుల ఉపకారవేతనాల సంఖ్య లక్షలలో |
|---|---|
| 1981-82 | 6.80 |
| 1980-81 | 5.65 |
| 1979-80 | 4.90 |

| ప్రారంభించిన సంవత్సరం | ఉపకార వేతనాల సంఖ్య |
|---|---|
| 1944-45 లో షెడ్యూల్డ్ కులాలకి ప్రారంభించిన సంవత్సరం | 114 |
| 1948-49 లో షెడ్యూల్డ్ తరగతులకు | 89 |

1980-81 నుంచి నెలసరి ఆదాయం రు. 750/- లు ఉన్నవారు కూడా ఉపకారవేతనం పొందడానికి అర్హులే.

## 3. బాలికా వసతి గృహాలు (Girls Hostels)

ఉన్న గృహసౌకర్యాలు విస్తృతపరచినా వసతి గృహాలను ఏర్పరచడానికి రాష్ట్రాలకు, కేంద్రపాలిత ప్రాంతాలకు కేంద్రం ఆర్థిక సహాయం అందిస్తున్నది. షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగల బాలికలకు ఉపయోగపడే ఈ కార్యక్రమానికి 6 వ పంచవర్ష ప్రణాళికలో 13 కోట్లు మంజూరుచేశారు. ఇందులో 1981-82 వ సంవత్సరానికి రూ. 2.75 కోట్లు కేటాయించడం జరిగింది.

## 4. పరిశోధన, శిక్షణ (Research and Training)

షెడ్యూల్డ్ కులాల ఆర్థిక, విద్యాభివృద్ధికి, వివిధ కార్యక్రమాలను రూపొందించడం, అమలుపరచడం అయిన కార్యక్రమాల అమలును పర్యావలోకనం చేయడం వంటి పరిశోధనలను (Studies) నిర్వహించే సంస్థలకు మొత్తం దానికి కావలసిన ధనసహాయాన్ని కేంద్రప్రభుత్వం అందిస్తున్నది. అయితే ఎక్కువగా ఈ స్టడీ వారి ఆర్థిక సమస్యలపై కేంద్రీకరించబడి ఉంటుంది. సంబంధితశాఖ రిసెర్చ్ ఎడ్వైజరీ కమిటీ అటువంటి పరిశోధనా కేంద్రాలకు గ్రాంట్లను ఇచ్చే విషయాన్ని నిర్ణయిస్తుంది. అటువంటి సంస్థలకు 1981-82 లో ఇవ్వ తలపెట్టిన రూ. 25 లక్షలలో రూ. 5,69,000 లు ఆర్థిక సహాయం అందించడం జరిగింది.

## 5. బుక్ బ్యాంకు స్కీము [Book Bank Scheme]

రాష్ట్రాలలో, రాష్ట్రం(State) మద్దతులేక బాధపడే షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల వైద్య, ఇంజనీరింగు విద్యార్థులకోసం అచ్చు పుస్తకాలను అందించే స్కీమును కేంద్రం ప్రవేశపెట్టింది.

## 6. మెట్రిక్ పూర్వ విద్యలలో ఉపకర వేతనాలు (Pre-Matric Scholarship)

1977-78 లో ప్రారంభమైన స్కీములో దుర్భర వృత్తులను (unclean occupation) చేపట్టే స్కావెంజర్లు వంటివారి పిల్లలకు 6 వ తరగతి నుంచి 10 వ తరగతి వరకు ఒక్క విద్యార్థికి ఒక్క నెలకు రు. 145 లు ఇవ్వడం జరుగుతున్నది. 1981 - 82 లో ఈ స్కీము అమలుకు, రాష్ట్ర ప్రభుత్వాలకు రూ. 48.79 లక్షలు మంజూరు చేయడం జరిగింది. 6 వ పంచవర్ష ప్రణాళికలో రూ. 8 కోట్లు మంజూరు చేశారు.

## షెడ్యూల్డ్ కులాల అభివృద్ధికి బృహత్తర ప్రణాళిక (Strategy for development of Scheduled Castes)

షెడ్యూల్డ్ కులాల త్వరిత అభివృద్ధికిగాను, 3 అంశాల ప్రణాళికను వేయడం జరిగింది.

i) రాష్ట్రాల కేంద్ర మంత్రిత్వశాఖల స్పెషల్ కాంపోనెంట్ ప్లానులు.

ii) రాష్ట్రాలలో షెడ్యూల్డ్ కులాల అభివృద్ధికి స్పెషల్ కాంపోనెంట్ ప్లానులకు ప్రత్యేక కేంద్ర సహాయం.

iii) రాష్ట్రాలలో షెడ్యూల్డ్ కులాల అభివృద్ధి కార్పొరేషన్లు ఏర్పరచడం.

ఈ స్పెషల్ కాంపోనెంట్ ప్లానులలో సామాన్య అభివృద్ధి రంగంలో స్కీములలో ఏది షెడ్యూల్డ్ కులాల అభివృద్ధికి ఎక్కువగా దోహదపడుతుందన్న దానిని గుర్తించడం, కొన్ని షెడ్యూల్డ్ కులాల కుటుంబాలను మెరుగుపరచడానికి టార్గెట్ పెట్టుకోవడం. ఇందులో ప్రధాన ధ్యేయమేమంటే వారి రాబడిని పెంచడం వారి అభివృద్ధికి సాంఘిక, విద్యారంగాలలో కూడా దోహదపరచడం.

కోట్ల రూపాయలు

6 వ పంచవర్ష ప్రణాళికలో మొత్తం కేటాయింపు 46,831.30

6 వ పంచవర్ష ప్రణాళికలో స్పెషల్ కాంపోజ్ నెంట్ ప్లాను కేటాయింపు ,481.91

## 2. ప్రత్యేక కేంద్ర సహాయం [Special Central Assistance]

స్పెషల్ కాంపోనెంట్ ప్లానులను, షెడ్యూల్డ్ కులాల సంక్షేమం కోసం చేపట్టిన రాష్ట్రాలకు ప్రత్యేక కేంద్ర సహాయం లభిస్తున్నది. షెడ్యూల్డ్ కులాల జనాభా, వెనుకబడినతనం, వారి సంక్షేమానికి రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్రపాలిత ప్రాంతాలు చేస్తున్న కృషిమీాద ఆధారపడి రాష్ట్రాలకు ప్రత్యేక కేంద్ర సహాయం అందజేయబడుతున్నది. ఈ సహాయాన్ని రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలు, షెడ్యూల్డ్ కులాల ఆర్థికాభ్యున్నతి పెంపొందేరీతిలో రకరకాల కార్యక్రమాలకై ఖర్చు పెట్టాలి.

(రూపాయలు కోట్లలో)

| సంవత్సరం | రాష్ట్రప్రణాళిక కేటాయింపు | S. C. P. కేటాయింపు | శాతం | ప్రత్యేక కేంద్ర సహాయం |
|---|---|---|---|---|
| 1979-80 | 5,967.03 | 240.54 | 4.03 | 5.00 |
| 1980-81 | 7,140.31 | 547.84 | 7.67 | 100.00 |
| 1981-82 | 8,229 31 | 632.76 | 7.69 | 110.00 |

## షెడ్యూల్డ్ కులాల అభివృద్ధి కార్పొరేషన్లు (Scheduled Castes Development Corporations)

షెడ్యూల్డ్ కులాల ఆర్థిక అభివృద్ధికిగాను, షెడ్యూల్డ్ కులాల అభివృద్ధి (కార్యక్రమం) కార్పొరేషన్లు. ఆర్థిక సంస్థలకు, షెడూల్డ్

కులాలకు మధ్య మధ్యవర్తిత్వం వహిస్తుంది. వీటిని దలకొల్పడానికిగాను 49 : 51 నిష్పత్తిలో కేంద్ర ప్రభుత్వం షేర్ క్యాపిటల్‌కుగాను రాష్ట్రాలకు గ్రాంట్లను ఇస్తున్నది. ఇవి 17 రాష్ట్రాలలో ఉన్నాయి. ఆయా కుటుంబాలకు మార్జినల్ మనీ ఋణసహాయం (Marginal Money Loars Assistance) కూడా కార్పోరేషన్ అందిస్తున్నది. ఈ కార్పోరేషన్లు ఇప్పుడు రూ॥ 12,000 కోట్లు వరకు మార్జినల్ మనీ రుణ సహాయం చేయగలరు.

## ఈ కార్పొరేషన్లకు గ్రాంట్లు

(రూపాయలు లక్షలలో)

| సంవత్సరం | రాష్ట్ర ప్రభుత్వ వాటా | కేంద్రం విడుదలచేసింది. |
|---|---|---|
| 1978–79 | 170.55 | 50.00 |
| 1979–80 | 703.16 | 1.224.00 |
| 1980–81 | 1,403.00 | 1,300.97 |
| 1981–82 | 1,367.56 | 1,332.87 |

## షెడ్యూల్డ్ తెగల అభివృద్ధి [Tribal Development]

5 వ పంచవర్ష ప్రణాళికలో షెడ్యూల్డ్ తెగల అభివృద్ధి ఒక కొత్త వ్యూహాన్ని (stategy) రూపొందించడం జరిగింది. ఈ వ్యూహం ప్రకారం 50 శాతం కంటే ఎక్కువమంది షెడ్యూల్డ్ తెగల జనాభా ఉన్న ప్రాంతాలను వేరుచేసి వాటి అభివృద్ధికి ఉప ప్రణాళికలను (Tribal Sub-Plans) వేయడం జరిగింది. షెడ్యూల్డ్ తెగల ఉపప్రణాళిక స్థూల ధ్యేయం.

1. తక్కిన ప్రాంతాల అభివృద్ధి స్థాయికి షెడ్యూల్డ్ తెగల ప్రాంతాల అభివృద్ధిని సాధించడం.
2. షెడ్యూల్డ్ తెగల సముదాయాల గుణాత్మక జీవితాన్ని మెరుగు పరచాలి.

5 వ పంచవర్ష ప్రణాళిక ప్రత్యేక కేంద్ర సహాయం రూ. 120 కోట్లు 6 వ పంచవర్ష ప్రణాళికలో ప్రత్యేక కేంద్ర సహాయం కేటాయింపు రూ. 470 కోట్లు.

ఈ ట్రైబల్ సబ్ ప్లానులను అమలుపరిచే 19 రాష్ట్రాలు కేంద్ర పాలిత ప్రాంతాలలోనూ 180 సమగ్ర షెడ్యూల్డ్ తెగల అభివృద్ధి ప్రాజెక్టులను (Integrated Tribal Development Projects) ఏర్పాటుచేశారు.

## ట్రైబల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ (Tribal Research Institutes)

షెడ్యూల్డ్ తెగల పరిశోధన, శిక్షణా సంస్థలను ఆంధ్రప్రదేశ్, అస్సామ్, బీహార్, గుజరాత్, కేరళ, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాల్ లలో ఉన్నాయి. సిబ్బంది శిక్షణ, ఉపప్రణాళికలను (Tribal Sub Plans) రూపొందించడం వాటి అమలుతీరు మొదలైన విషయాలపై అన్వేషణచేసి గిరిజనాభివృద్ధికి ఎంతో దోహదపరుస్తున్నాయి.

## వెనుకబడిన వర్గాలవారి సంక్షేమం

మన దేశంలో షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు మాత్రమే కాకుండా సాంఘిక, ఆర్థిక రంగాలలో వెనుకబడిన వర్గాలు అనేకం ఉన్నాయి. రాజ్యాంగంలోని 340 వ ప్రకరణం ప్రకారం 1958 వ సంవత్సరంలోనే కాకా సాహెబ్ కాలేకర్ (Kaka Saheb Kalekar) ఆధ్వర్యంలో వీరి లిస్టు తయారుచేయడానికి కమీషను ఏర్పాటు చేయడం జరిగింది. కాని పెద్ద ప్రయోజనం లేకపోయింది.

వెనుకబడిన వర్గాలుగా గుర్తించడానికి సాంఘిక, ఆర్థిక విద్యా రంగాలలో వెనుకబడినతనమే కాకుండా ఈ పరిస్థితి ఏకంగా ఒక సాంఘిక సమూహంలో వంశపారంపర్యంగా వెనుకబడి ఉండాలి.

1967 లో సాంఘిక సంక్షేమ శాఖలో వెనుకబడిన తరగతుల సంక్షేమానికై ఒక డైరెక్టర్ - జనరల్‌ను నియమించడం కూడా జరిగింది.

వెనుకబడిన తరగతులవారి సంక్షేమంకోసం సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీ, పూనా; ఆలిండియా బాక్‌వర్డ్ క్లాసెస్, ఢిల్లీ వంటి స్వచ్ఛంద సేవా సంస్థలుకూడా కృషిచేస్తున్నాయి.

కేంద్రీయ విద్యాలయాలలో విద్యనభ్యసించే తగిన తక్కువ రాబడివర్గాల వారిపిల్లలకు 17 1/2 ప్రతిభా ఉపకారవేతనాలు ఇవ్వడం జరుగుతోంది. కొన్ని పబ్లిక్ పాఠశాలలు తగిఉన్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు కూడా ఉపకారవేతనాలు ఇస్తున్నాయి.

మొదటి 18 సంవత్సరాల ప్రణాళికా కాలంలో రూ. 27 కోట్లు వెనుకబడిన వర్గాలపై వెచ్చించడం జరిగింది.

బి. పి. మండల్ ఆధ్వర్యంలో రెండవ, వెనుకబడిన వర్గాల కమీషను తన నివేదికను డిసెంబరు 31, 1980 లో కేంద్రప్రభుత్వానికి సమర్పించడం జరిగింది. కాని దానిపై ప్రభుత్వాలు ఏ రకమైన చర్య ఇంతవరకు తీసుకోలేదు.

కేంద్రప్రభుత్వం ఇంకా వెనుకబడిన తరగతులవారి సంక్షేమంపై చెప్పుకోదగినంతగా కేంద్రీకరణ చేయలేదు. దేశస్థాయిలో ఈ తరగతుల గుర్తింపునుకూడా కేంద్రం తెలియజేయలేదు.

ప్రస్తుతానికి ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం వెనుకబడినవారి సంక్షేమాన్ని చేపటుతున్నది.

ఆంధ్రప్రదేశ్ లో వీరి సంక్షేమానికి చేపట్టే కొన్ని కార్యక్రమాలను ఈ కింద పొందుపరచడం జరిగింది.

1. రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులలో 25 శాతం ఉద్యోగాలు వెనుకబడిన తరగతులకు కేటాయించడమైంది.
2. అన్ని రాష్ట్ర ప్రభుత్వ విద్యాలయాలలోను, శిక్షణా సంస్థలలోను, 25 శాతం సీట్లను వెనుకబడిన తరగతులకు కేటాయించడమైంది.

3. వెనుకబడినతరగతుల ఆర్థికాభివృద్ధికోసం అభివృద్ధి కార్పొరేషన్‌ను కూడా నెలకొల్పింది.
4. అర్హత కలిగిన విద్యార్థులకు విద్యాలయాలలో ఉచిత విద్యాబోధన ఉచిత భోజనవసతి సౌకర్యాలు కల్పించడం జరుగుతోంది.

## షెడ్యూల్ కులాలకు, షెడ్యూల్ జాతులకు భారత రాజ్యాంగం ఇచ్చిన భద్రతలు

1. రాజ్యాంగంలో 17 వ ఆర్టికల్ ప్రకారం అస్పృశ్యత రద్దుచేయడమైంది. అస్పృశ్యతను పాటించడం నిషేధించారు.
2. రాజ్యాంగంలో 46 వ ఆర్టికల్ ప్రకారం వారి ఆర్థిక విద్యాసంబంధమైన అవసరాలను ప్రోత్సహించాలి. అంతేకాకుండా వారికి సాంఘిక న్యాయం జరిగేటట్టు రక్షణ కల్పించడం జరిగింది.
3. రాజ్యాంగంలో 25 వ ఆర్టికల్ ప్రకారం హిందూ దేవాలయాలు అన్ని హిందూ దేవాలయాల చట్టం ప్రకారం హిందువులందరికి ప్రవేశం కల్పించాలి.
4. ఆర్టికల్ 15 ప్రకారం దుకాణాలలోను, హోటల్‌లోను, ఇతర రెస్టారెంట్‌లలోను ప్రజా వినోద స్థలాలలోను అందరికి నెలకొల్పే నూతుల వాడకం విషయాలను చెఱువుల వాడకం విషయంలోను స్నానఘట్టం వాడక విషయంలోను ప్రవేశించడానికి లేదా అనుభవించడానికి వారికి ఏ రకమైన అంతరాయం లేకుండా చేయడమైంది.
5. ఆర్టికల్‌లు 19 (5) ప్రకారం షెడ్యూల్ తెగలకు హక్కులు, ఆస్థిపాస్తులు రక్షిస్తూ శాసనం చేశారు.
6. ఆర్టికల్‌లు 16, 335 ప్రకారం ప్రభుత్వ సర్వీసులలో పైవారినుంచి తగినంత ప్రాతినిధ్యంలేనప్పుడు వారికి కొన్ని ఉద్యోగాలు రిజర్వు చేశారు.
7. ఆర్టికల్‌లు 29 ప్రకారం రాష్ట్రాల లేదా రాష్ట్ర నిధులతో నడిపిస్తున్న విద్యాసంస్థలలో ప్రవేశం తిరస్కరించడాన్ని నిషేధించడం జరిగింది.

8. ఆర్టికల్‌లు 330, 332 ల ప్రకారం లోక్‌సభలోని రాష్ట్ర విధాన సభలలోని 25 జనవరి 1980 వరకు ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించడమైంది.
9. ఆర్టికల్‌లు 164, 338 ల ప్రకారం 5 వ షెడ్యూల్ ప్రకారం షెడ్యూల్ తెగల సలహా మండలులను, ప్రత్యేక శాఖలను అన్ని రాష్ట్రాలలోను నెలకొల్పాలని చెప్పడమైంది. కేంద్రంలో వారి సంక్షేమాన్ని ప్రోత్సహించడానికి, వారి అవసరాలను తీర్చడానికి ఒక ప్రత్యేక అధికారిని నియమించడం జరిగింది.
10. ఆర్టికల్‌లు 24, 5వ, 6వ షెడ్యూల్ల ప్రకారం షెడ్యూల్డ్ కులాల షెడ్యూల్డ్ తెగలకు ప్రత్యేక ప్రాంతాలను నిర్ణయించారు.

## 1976, పౌరహక్కుల రక్షణ చట్టం (The Protection of Civil Rights Act 1976)

1955 అస్పృశ్యతా చట్టం (1955, Untouchbility Act) ను 1976 లో సవరించి 1976, పౌరహక్కుల రక్షణా చట్టం (The Protection of Civil Rights Act, 1976) గా తిరిగి నామకరణం చేయడమైంది. అస్పృశ్యతను ఇది పాటిస్తున్న వారిని కఠిన శిక్ష విధించడానికి ఈ చట్టం నవంబరు 1976 నుంచి అమలులోకి వచ్చింది.

రాజ్యాంగం (45వ సవరణ) బిల్లు, 1980 (Constitution (45 th Amendment) Bill 1980) 1980 జనవరి 25 లో పాస్ చేయడమైంది. 25-1-1980 నుంచి అమలులోనికి వస్తుంది. ఆర్టికల్ 334 ప్రకారం 30 సంవత్సరాలు అనే దానిని, 40 సంవత్సరాలుగా మార్చాలని సవరించడమైంది.

# 7
# భారతదేశంలో సంఘ సంక్షేమ సేవల నిర్వాహణ

మన దేశంలో సమస్యలు, సేవార్థులు పూర్వం నుంచి ఉన్నారు. అట్లాగే సంస్థలు కూడ ఉన్నాయి. అయితే పూర్వం ఉమ్మడి కుటుంబాలు, గ్రామ పంచాయితీలు, మతపరమైన సంస్థలు, కులవ్యవస్థ. ఈ సేవాకార్యాన్ని నిర్వాహణ చేస్తుండేవి. అయితే కాలక్రమేణా ఈ సంస్థలలో మార్పులువచ్చి బలహీనమైపోయాయి. అప్పుడు సేవార్థుల సమస్యలను, అవసరాలను తీర్చటానికి సంఘం ముందంజ వేయవలసి వచ్చింది.

మనము ఈ పాఠ్యాంశంలో ముఖ్యంగా మూడు పదాలను అవగాహన చేసుకోవలసి ఉంది.

1. సాంఘిక సేవా కార్యం (Social Service)
2. సాంఘిక సేవా కార్యాలు (Social Services)
3. సాంఘిక సంక్షేమ సేవా కార్యం (Social Welfare Services)

సాంఘిక సేవాకార్యం అంటే ఒక స్వచ్ఛంధసేవా కార్యకర్త ఆపదలోవున్న వ్యక్తిని జాలితో ఆదుకొంటే దానిని సాంఘికసేవా కార్యం (Social Service) అంటారు. అతడు సహాయం చేయటానికి అతనికి ఏ విధమైన వృత్తి పరిజ్ఞానం అవసరంలేదు. అతడుచేసిన సేవ క్షణికమైనది.

సాంఘిక సేవాకార్యం అంటే సంఘంలో బలహీనులైన వర్గాల వారికి ప్రత్యేకంగా అందించే సేవాకార్యం. ఈ సేవా కార్యక్రమాలు నిర్వర్తించటానికి అతనికి లేదా ఆ సంస్థకు కొంత సమస్యా పరిజ్ఞానం అవసరం. ఈ సేవా కార్యం క్షణికమైందికాదు. ఈ ప్రత్యేకమైన సేవా

కార్యం అందించడంవల్ల వెనుకబడిన వర్గాలు, బలహీనవర్గాలు, సంఘంలోఉన్న బలమైన వర్గాలతోను అభివృద్ధిచెందిన వర్గాల స్థాయికి చేరుకోవటానికి వీలుకలుగుతుంది.

మన భారత దేశంలో ముఖ్యంగా ఈ సాంఘిక సంక్షేమ సేవా కార్యక్రమాలను, ప్రభుత్వం. స్వచ్ఛంద సేవా సంస్థలు నిర్వహిస్తున్నవి. స్వచ్ఛంధ సేవాసంస్థలు చేపడుతున్న సంక్షేమ సేవా కార్యాలను గురించి తరువాత అధ్యాయంలో సవివరంగా ఇవ్వడమైంది.

ఈ అధ్యాయంలో ముఖ్యంగా ప్రభుత్వం చేపడుతున్న సంక్షేమ సేవా కార్యక్రమాలను గురించి చర్చిద్దాం.

భారత దేశం సంక్షేమ రాజ్యం. సంక్షేమ రాజ్యంలో ప్రజలందరూ కనీస ప్రమాణంలో జీవితాన్ని గడిపేటట్లు చూడటమే సంక్షేమరాజ్య భావన. అందువల్ల మన ప్రభుత్వం ప్రజలకు లాభదృష్టితో కాకుండా సేవా సంకల్పంతో అనేక సాంఘిక సేవా కార్యక్రమాలను, సాంఘిక సంక్షేమ సేవా కార్యాలను చేపట్టి తనకు సాధ్యమైనంతరీతిలో సహాయాన్ని అందిస్తున్నది.

## సాంఘిక సంక్షేమం - రాజ్యాంగ ధ్యేయాలు

38 వ ప్రకరణం (Article 38) రాజ్యాంగంలో దేశ ప్రజల జీవితంలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో న్యాయం అందేటట్లు ఒక సాంఘిక వ్యవస్థ (Social Order) ని ప్రజల సంక్షేమం కోసం సాధించాలని తెలియచేస్తున్నది.

Article 38 of the Constitution affirms that "The State shall strive to promote the Welfare of the people by securing and protecting effectively as it may provide a social order in which justice, social, economic, political shall inform all the Institutions of the national life."

సాంఘిక సంక్షేమానికి సంబంధించిన ఇతర ఏర్పాట్లు (Promisions) ఈ కింద ఇవ్వడం జరిగింది.

## I. సామాన్య సాంఘిక సంక్షేమానికి సంబంధించిన ఏర్పాట్లు

## [Provisions Relating to general Social Welfare]

(i) ప్రాథమిక హక్కులు (Fundamental Rights)

a. సమాన న్యాయం (Equality before Law)

b. అస్పృశ్యతా నిర్మూలనం (Abolition of Untouchability)

c. మనుష్యుల వ్యాపారం, నిర్బంధ శ్రమల నిషేధం. (Prohibition of traffic in human being and forced labour)

(ii) ఆదేశక సూత్రాలు (Directive Principles of the State Policy)

a. ప్రజల సంక్షేమాన్ని ప్రోత్సహించటానికి ప్రభుత్వం లేదా రాజ్యం ఒక సాంఘిక వ్యవస్థను సాధించటం.

b. షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల, ఇతర బలహీన వర్గాల విద్యా, ఆర్థిక అవసరాలను తీర్చటం.

c. పోషకాహారం, జీవనప్రమాణాల స్థాయిని పెంచి ప్రజారోగ్యాన్ని మెరుగుపరచటం రాజ్యం కర్తవ్యం.

## II. పిల్లలకోసం చేసిన ఏర్పాట్లు

## (Provisions relating to Children)

(i) కుల, మత భేదాలు, స్త్రీ పురుష భేదాలు, ప్రాంతీయ విభేదాల ప్రాతిపదికపై వ్యత్యాసాన్ని చూపటం నిషేధించటమైనది.

(ii) (a) ఆడ, మగ కార్మికుల ఆరోగ్యం బలం, పిల్లల చిరువయస్సులకు ఏరకమైన హాని కలుగకుండేటట్లు వారికి సరిపడని వృత్తులలో వారిని నియమించకూడదని రాజ్యం తన ఆదేశక సూత్రాలలో నిర్దేశిస్తున్నది.

(b) బాలురకు, యువకులకు, నైతికంగా ఎవరూ తమస్వార్థానికి ఉపయోగించుకోకుండా చూడటం.

(iii) బాలురకు, ఉచిత, నిర్బంధ విద్యా ఏర్పాట్లు చేయటం.

## III. స్త్రీల కోసం చేసిన ఏర్పాట్లు (Provisions Relating to Women)

(i) (a) మతం, కులం, లింగభేదం లేక పుట్టిన ప్రదేశాల ప్రాతిపదిక మీద వ్యత్యాసం చూపటాన్ని నిషేధించటం.

(b) ఉపాధికల్పనా విషయాలలో సమాన అవకాశాలు కల్పించటం.

(c) మనుష్యులతో వ్యాపారం, వెట్టిచాకిరీ నిషేధించటం.

(ii) (a) ఏ రకమైన జీవితాన్ని గడపటానికైనా పురుషులకు, స్త్రీలకు సమానహక్కు కల్పించటం.

(b) పనికితగ్గ వేతనాన్ని స్త్రీ పురుషులకు ఇవ్వటం.

(c) ఆర్థిక అవసరాలకు లొంగిపోయి తమకు సరిపడని పనులలో స్త్రీ, పురుషుల, తక్కువ వయస్సుగల బాలురు చేరటాన్ని నిషేధించటం.

(d) నైతికంగాగాని ఇంకోరకంగాని బాల్యాన్ని యవ్వనాన్ని ఎవరి స్వలాభానికి దుర్వినియోగం చేయకుండా కాపాడటం.

(iii) న్యాయమైన రీతిలో మానవతా దృష్టితో పని పరిస్థితులను కల్పించటం, మాతా శిశు సంక్షేమం (Maternity Relief)

## IV. సాంఘిక రక్షణకై చేసిన ఏర్పాట్లు (Provisions Relating to Socia Defence)

వెట్టిచాకిరీని, మనుష్యులతో వ్యాపారాన్ని నిషేధించటం.

## V. వికలాంగులకు సంబంధించిన ఏర్పాట్లు (Provisions Relating to Disabled)

పనిచేసే హక్కు, విద్యాహక్కు, కొన్ని కేసులలో ప్రభుత్వ సహాయం పొందే హక్కు (Right to Public Assistance)

## VI. నిషేధానికి సంబంధించిన ఏర్పాట్లు (Provisions Relating to Prohibition)

ఆరోగ్యానికి హాని కలిగించే మత్తు పానీయాలను, మందులను, వైద్య సలహామీదతప్ప, వాడటంపై నిషేధానికి రాజ్యం ప్రయత్నం చేయటం.

## VII. వృద్ధుల కోసం చేసిన ఏర్పాట్లు (Provisions Relating to Aged)

రాజ్యం తనకున్న ఆర్థిక శక్తి, వృద్ధి పరిమితులలో పని చేయటానికి, విద్య నభ్యసించటానికి ప్రజా సహాయం పొందటానికి హక్కులను కల్పించాలి.

## VIII. సాంఘిక సంక్షేమానికి సంబంధించి శాసనాధికారాల పంపిణీకి చేసిన ఏర్పాట్లు (Provisions relating to distribution legeislative powers on matters regarding Social Welfare)

3 జాబితాలలో అంటే కేంద్ర జాబితాలోను, రాష్ట్రాల జాబితాలలోను, ఉమ్మడి జాబితా (Concurrentlist) లలోను రకరకాల పొందుపరచబడ్డాయి.

రాజ్యాంగంలో కల్పించిన అన్నిఏర్పాట్లకు ఒకరూపం ఇవ్వటానికి జాతీయ ధ్యేయాలు సాధించటానికి పంచవర్ష ప్రణాళికలలో సాంఘిక ఆర్థిక అభివృద్ధికి ఒక కార్యక్రమాన్ని చేర్చడమైంది.

## సాంఘిక సంక్షేమ పరిధి (Scope of Social Welfare)

మన భారతదేశంలో సాంఘిక సంక్షేమం పరిధిలో ఈ క్రింది సంక్షేమ కార్యక్రమాలన్నీ చేర్చడమైంది.

1. బాలల సంక్షేమం
2. యువజన సంక్షేమం

3. స్త్రీల సంక్షేమం
4. వృద్ధుల సంక్షేమం
5. వికలాంగుల సంక్షేమం
6. సాంఘిక రక్షణ
7. సాముదాయిక సంక్షేమం
8. నిరాశ్రయుల పునరావాసం

1. బాలబాలికల సంక్షేమం

దేశభవిష్యత్తు రేపటిపౌరులైన నేటి బాలలమీదనే ఆధారపడి ఉన్నది. బాలబాలికలకు అన్నిరంగాలలోను అభివృద్ధిచెంది మంచి పౌరులుగా రూపొందాలంటే, వారికి అన్నిరకాల సదుపాయాలు చేకూర్చవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఎంతైనా వుంది.

మన దేశంలో చేపడుతున్న రకరకాల బాలల సంక్షేమ సేవా కార్యక్రమాలను ముఖ్యంగా రెండు వర్గాలుగా విభజించవచ్చు.

## I. సంస్థాపరమైన సేవా కార్యక్రమాలు

[Institutional Services]

( i ) ఫాండ్లింగ్ హోమ్స్ (Fondling Homes)

( ii ) నిర్భాగ్యులైన బాలురకు గృహాలు
[Homes for Destitute Children]

(iii ) టి. బి. రోగుల పిల్లలకు స్వల్పకాలిక వసతి గృహాలు
[Short Stay Homes for the Children of T. B. Patients Etc.,]

(iv ) ఫోస్టర్ గృహాలు (Foster Homes)

( v ) పెళ్ళికాని తల్లుల పిల్లలకై గృహాలు
[Homes for the Children of Unmarried Mothers]

(vi ) నిర్భాగ్యులైన పిల్లలకు గృహాల, రెసిడెన్షియల్ పాఠశాలలు
[Homes and Residential Schools for the Destitute Children]

(vii) తిరుగుబోతులైన పిల్లలకు గృహాలు లేదా రాత్రి ఆశ్రయాలు [Homes or Night Shelters for the Care of Vagrant Children]

(viii) భావోద్రేకాలలో కలతపొంది పిల్లలకు నివాస చికిత్సా కేంద్రాలు (Residential Treatment Centeres for Emotionally Disturbed Children)

## సంస్థేతర సేవా కార్యక్రమాలు
[Non-Institutional Scrvices]

(a) సాధారణ బాలుర కోసం

( i ) శిశు పాలనా గృహాలు (Creches), ప్రాథమిక పూర్వ పాఠశాలలు (Preprinary Schools)

( ii ) పగటి రక్షణ కేంద్రాలు (Day Care Centres)

(iii ) బాల్వాడీలు (Balwadies)

(iv ) అంగన్ వాడీల (Anganwadies)

( v ) రిక్రియేషన్ హాబీ క్లబ్బులు [Recreation and Hobby Clubs]

(vi ) గ్రంథాలయ సదుపాయాలు (Library Facilities)

(vii) సెలవుదిన గృహాలు (Holiday Homes)

(viii) పాఠశాల ఆరోగ్య సేవా కార్యక్రమాలు [School Health Service]

(ix) బాలల మార్గదర్శక చికిత్స కేంద్రాలు [Child guidance Clinics]

(b) ప్రత్యేక రక్షణ అవసరమున్న బాలురకోసం [Children in need of Special Care]

( i ) బుద్ధిమాంద్యం ఉన్న పిల్లలకు పాఠశాలలు [School for the Mentally Retarded Children]

( ii ) వికలాంగులైన (గుడ్డి, చెవిటి మొదలైన) పిల్లలకు నర్సరీలు, ప్రత్యేక పాఠశాలలు. [Nurseries and Schools for the Handicapped Children - the blind, the deaf etc..]

ఆడియోలజి కేంద్రాలు, వినికిడి యంత్రాల తరగతులు
[Audiology Centres and Hearieg Aid Class]
అనాథస్త్రీల పిల్లలకు, వారి స్వంత గృహాలలో ఉంటే, వారికి ప్రత్యేక అలవెన్సులు [Allowances to Children of destitute women who are maintained in their own Houses]
అనాథ బాలుర, ఎడాప్షన్ సేవా కార్యక్రమాలు.
[Adoption Services for destitute Children]
శిశువుల ఆరోగ్య కేంద్రాలు, బాలల ఆసుపత్రులు మొదలైనవి.
[Infact Health Centers and Children's Hospitals etc.,]

## యువజన సంక్షేమం (Youth Welfare)

యవ్వనం(Adolesence)బాల్యానికి, కౌమారానికి(Adulthood) ...స్థదశ. ఈ కాలంలో సరియైనరీతిలో అతనిని మలిచినట్లయితే ...ప మంచి వయోజనుడుగా రూపొందుతాడు.

మనదేశంలో వయోజనులకోసం ఈ కింది కార్యాలను చేపడు...న్నారు.

) గ్రామీణ ప్రాంతాలలో సాముదాయిక అభివృద్ధి కార్యక్రమాల కింద యువజన మండలాలను నెలకొల్పటం.
) కళాశాలలలోను, విశ్వవిద్యాలయాలలోను సాంఘిక సేవా పథకాన్ని అమలుపరచటం.
) విద్యార్థి యువకులకు, విద్యేతర యువకులకు (Non-student outh)జిల్లాస్థాయిలో నెహ్రూ యువక కేంద్రాలను స్థాపించటం.
) నేషనల్ గ్రాడ్యుయేట్ వాలంటరీ స్కీము
[National Graduate Volunteer Scheme]
) కళాశాలలలో ఎన్.సి.సి.
N.C.C. [National Cadet Corps in Colleges]
) వ్యవసాయ కళాశాలలలోను, విశ్వవిద్యాలయాలలోను యువజన క్లబ్బులు, సాముదాయిక అభివృద్ధికై శిక్షణా కేంద్రాలు

## 3. మహిళా సంక్షేమం [Women Welfare]

భారత దేశంలో స్త్రీల జనాభా కూడా చాలా ఎక్కువగా ఉన్నది. పూర్వంనుంచి వీరు సాంఘిక, ఆర్థిక రంగాలలో బాగా అణగ ద్రొక్కబడి ఉన్నారు. అందువల్ల వీరి అభివృద్ధిపై ప్రభుత్వం ఎంతైనా శ్రద్ధ తీసుకోవలసిన అవసరమున్నది.

మన దేశంలో మహిళా సంక్షేమం కోసం ఈ కింది సేవా కార్య క్రమాలు చేపడుతున్నారు.

1. శిక్షణా, ఉత్పత్తి కేంద్రాలను (Training—cum—Production Centers) ను నెలకొల్పటం.
2. గ్రామ సేవికలుగాను, బాల సేవికలుగాను, మంత్రసానులుగాను, ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులుగాను రూపొందేరీతిలో స్త్రీలకు సంక్షిప్త విద్యాసౌకర్యాలు (Condensed Courses) అందించటం
3. ఉద్యోగస్థులైన స్త్రీలకు వసతి గృహాలు.
4. మహిళా మండలాలను నెలకొల్పటం.
5. అనాథ స్త్రీలకు రెసిడెన్షియల్ సంస్థలు.
6. పేదస్త్రీలకు న్యాయ సహాయం.
7. స్త్రీలకు సాంఘిక విద్యా కేంద్రములు ఏర్పరచటం.
8. సాంఘిక సంక్షేమ సంస్థలను నెలకొల్పటం.

## 4. వృద్ధుల, బలహీనుల సంక్షేమం
(Services for the Aged and the Infirm)

సాధారణంగా మన దేశంలో వృద్ధుల సంక్షేమాన్ని వారివారి కుటుంబాలే చూసుకొంటారు. అయితే ఆర్థిక కారణాలవల్లనైతేనేమి లేక ఇతర సాంఘిక కారణాలవల్లనైతేనేమి వారుకూడ సమస్యలకు గురి అవుతున్నారు. వారికోసం ఈ కింది కార్యక్రమాలు చేపడుతున్నారు.

1. వృద్ధులకు ఆర్థిక సహాయం అందజేయటం.
2. వృద్ధుల గృహాలను నడిపే స్వచ్ఛంద సేవాసంస్థలకు ఆర్థిక సహాయం అందజేయటం.

## 5. వికలాంగుల సంక్షేమం

నిజానికి మనదేశంలో ఉన్న వికలాంగుల పరిస్థితులను, సమస్యలను సరిగా అవగాహన చేసుకోవటం జరగలేదు. వారికి అన్నిరకాల అవకాశాలు కల్పిస్తే, సామాన్య ప్రజలవలె వారుకూడ దేశానికి ఉపయోగపడగలరు.

మనదేశంలో ప్రభుత్వం వికలాంగులకు ఈ కింది సంక్షేమ సేవా కార్యక్రమాలను నిర్వర్తిస్తున్నది.

( i ) విద్యాసౌకర్యాలు కల్పించటం.
( ii ) సంస్థలు, వసతిగృహాలు నెలకొల్పటం.
(iii ) షెల్టర్డ్ వర్కుషాపులు (Sheltered workshops)
(iv ) శిక్షణ, పునరావాసం
( v ) రిక్రియేషన్
(vi ) ఆర్థిక సహాయం

## సాంఘిక రక్షణ (Social Defence)

బాలలనేరాలు, వ్యభిచారం (Immoral traffic among women) పెళ్ళికాని తల్లులు, భిక్షాటనం, వయోజన నేరస్థులు ఈ సాంఘిక సేవాకార్యక్రమాలు అందిస్తున్నారు.

వయోజన నేరస్థులకు అందిస్తున్న సేవాకార్యక్రమాలు :

( i ) సంక్షేమ కార్యక్రమాలు కర్మాగారంలో చేపట్టటం.
( ii ) ప్రొబేషన్, పెరోల్ సదుపాయాలు (Probation and Parole Service)
(iii ) శిక్షానంతర రక్షణ, పునరావాస సౌకర్యాలు మొదలయినవి. [After Care and rehabilitation services etc.,]

బాలనేరస్థులకు అందించబడుతున్న సేవా కార్యక్రమాలు :

( i ) బాలల కోర్టు [Juvemile Court]
( ii ) రిమాండ్ గృహాలు [Remand Homes]
(iii ) సర్టిఫైడ్ పాఠశాలలు [Certified Schools]
(iv ) ప్రొబేషన్ వసతి గృహాలు [Probation Hostels]

నైతికంగా పతనమైన స్త్రీలకు సేవా కార్యక్రమాలు :

( i ) సి. తా. [SITA] చట్టాన్ని అమలులో పెట్టటం
[Suppression of Immoral Traffic in Women and Girls Act, 1956]

## 7. సాముదాయిక సంక్షేమం (Community Welfare)

సాముదాయిక సంక్షేమంలో గిరిజనులకు, షెడ్యూల్డ్ కులాలకు, గ్రామీణులకు, పట్టణవాసులకు రకరకాల ప్రత్యేక కార్యక్రమాలను చేపడుతున్నారు.

సాముదాయిక మండలాల ఆధ్వర్యంలో వ్యవసాయం, పరిశ్రమలు, వార్తాప్రసారం [Communication], పశుసంవర్ధకశాఖ, విద్య ఆరోగ్యం, సాంఘిక అభివృద్ధి మొదలయిన అన్ని క్షేత్రాలలోను అభివృద్ధి కార్యక్రమాలను చేపడుతున్నారు.

## 8. పునరావాస సౌకర్యాలు కల్పించడం (Rehabilitation)

మన ఇరుగుపొరుగు దేశాలైన శ్రీలంక, బంగ్లాదేశ్, పాకిస్తాన్ వంటి దేశాల నుంచి వచ్చే శరణార్థులకు ఎన్నో రకాలుగా పునరావాస సౌకర్యాలు కల్పిస్తున్నారు.

సాంఘిక సంక్షేమం – ప్రభుత్వం

పాశ్చాత్యుల పరిపాలన నుంచి మనకు చాల కాలం తరవాత 1947 వ సంవత్సరంలో స్వాతంత్ర్యం వచ్చింది. ఇది 1950 లో ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యం [Sovereign Democratic Republic] గా రూపొందింది. దేశ పౌరులందరకూ సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయం చేకూర్చటానికి, ఆలోచన, భావప్రకటన, నమ్మకం, ఇష్టమొచ్చిన దేవుని కొలవడం వంటి అంశాలలో స్వాతంత్ర్యం ఇవ్వటానికి సమాన అవకాశాలు, ప్రతిపత్తి కల్పించటానికి పౌరులందరిలో సౌభ్రాతృత్వం పెంపొందింపచేయటానికి వాగ్దానం చేస్తూ, వ్యక్తి గౌరవాన్ని కాపాడటానికి దేశ ఐకమత్యాన్ని కాపాడటానికి హామీ ఇస్తూ ఒక సమగ్రమైన రాజ్యాంగాన్ని కూడ రూపొందించింది.

విభిన్న కులాలతో, మతాలతో, సంస్కృతులతో, ఆచారాలతో, భాషలతో ఉన్న మన హిందూ దేశంలో భిన్నత్వంలో ఏకత్వం ప్రతిబింబిస్తూ ఉంటుంది. భారత దేశపు 647 మిలియన్ల జనాభా [1979 నాటికి] ప్రజలు రకరకాల భాషలను మాట్లాడతారు. వారు ప్రపంచలోని ప్రముఖమైన మతాలన్నిటిని స్వీకరించిఉన్నారు. హిందూమతం [82.7 శాతము]. మహమ్మదీయ మతం [11.2 శాతము], క్రైస్తవ మతం [2.6 శాతము], సిక్కుమతం [1.9 శాతము], బౌద్ధమతం [0.7 శాతం] జైనమతం మొ॥. ఈ మతాల సుమారు 80 శాతం ప్రజలు 5 లక్షల గ్రామాలలో నివసిస్తున్నారు. మిగతావారు పట్టణాలలో నివసిస్తున్నారు. 33 శాతం మంది శ్రామికులు ఉన్నారు. వీరిలో 72 శాతం మంది వ్యవసాయ శ్రామికులే.

1981 జనాభా లెక్కల ప్రకారం దేశజనాభా 683,997,512 మంది. స్త్రీలు 33.0 కోట్లు ఉండగా, పురుషులు 35.4 కోట్లు ఉన్నారు. అంటే ప్రతీ 1000 మంది పురుషులకు 935 మంది స్త్రీలు ఉన్నారు. అంటే 1971—81 దశాబ్దంలో 24.78 శాతం జనాభా పెరుగుదల కనిపించింది.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు, యుద్ధానంతరం ఉండే విధంగా చాలా వెనుకబడిన ఆర్థికవ్యవస్థ ఏర్పడింది. కొన్నిలక్షల మంది భారత - పాకిస్తాన్ వల్ల నిరాశ్రయులయినారు. 1951 లో 16.7 శాతం మాత్రమే అక్షరాస్యులు. 42.6 శాతము మంది పిల్లలు ప్రాథమికస్థాయిలో తరగతులకు హాజరవుతుండేవారు. 1.2 మిలియన్లు అంటే 12 లక్షలమంది మాత్రమే ఉన్నత పాఠశాలలలో నమోదయినారు. బాలికల విద్య బాగా అధమస్థాయిలో ఉండేవి. 1950-51 లో 5.38 మిలియన్ల మంది మాత్రమే ప్రాథమిక స్థాయిలలోను, 0.53 మిలియన్ల మంది ప్రాథమికోన్నత స్థాయిలలోను, 0.17 మిలియన్ల మంది ఉన్నతపాఠశాల స్థాయిలోను ఉన్నారు. నిరుద్యోగిత అసంపూర్ణ ఉద్యోగిత [Under Employment], పోషకాహారం సరిగా లేకపోవటం [Mal-Nutrition] వ్యాధులు, పేదరికం, దేశజనాభాలో అధికభాగాన్ని

పీడిస్తూండేవి. వైద్య సదుపాయాలు చాల కనిష్టస్థాయిలో ఉండేవి. 6,445 మంది జనాభాకు ఒక డాక్టరు ఉండేవాడు. 1,13,000 హాస్పిటల్ పడకలు [Beds] మొత్తంలో ఉండేవి. అంటే ప్రతి లక్ష మందికి 31 పడకలుఉండేవి. దేశంలో 9,603 ఆసుపత్రులు, డిస్పెన్సరీలు, మాత్రమే ఉండేవి.

స్వాతంత్ర్యానంతరం, క్రమపద్ధతిలో దేశ ప్రణాళికలద్వారా ఆర్థికాభివృద్ధి, సాంఘిక న్యాయాలు సాధించడంపై కేంద్రీకరించటం జరిగింది.

మన ప్రభుత్వం రకరకాల సాంఘిక సంక్షేమ సేవా కార్యక్రమాలను రకరకాల మంత్రిత్వశాఖల యంత్రాంగంతో చేపడుతున్నది. ప్రభుత్వం చేపడుతున్న రకరకాల సాంఘిక సంక్షేమ సేవా కార్యక్రమాలను ముఖ్యంగా ఆరు ముఖ్యభాగాలకింద తెలుసుకోవచ్చు. అవి ఏవంటే స్త్రీల సంక్షేమ సేవా కార్యక్రమాలు, బాలబాలికల సంక్షేమ సేవా కార్యక్రమాలు, అవ్యవస్థిత సమూహాలకు (Maladjusted Groups) రకరకాల స్కీములు భౌతిక వైకల్యమున్న వారికి రకరకాల సేవా కార్యక్రమాలు, శాసనాలు.

## మహిళా సంక్షేమం

స్త్రీల సంక్షేమం కోసం నెలకొల్పిన ప్రభుత్వ యంత్రాంగంలో ముఖ్యంగా నాలుగు శాఖలున్నాయి.

( i ) స్త్రీలపై జాతీయ కమిటీ.

[ ii ] స్టీరింగ్ కమిటీ ఆఫ్ నేషనల్ కమిటీ
(Steering Committee of the Nationol Committee)

[ iii ] శాఖాంతర సమన్వయ కమిటీ
(Inter—Department Co—Ordination Committee)

[ iv ] స్త్రీ సంక్షేమం అభివృద్ధి బ్యూరో
(Women Welfare and Development Beauro)

## వరకట్న నిషేధం

1961, వరకట్న నిషేధ చట్టం ప్రకారం వరకట్నం సమ్మతించిన కేంద్ర ఉద్యోగులందరూ శిక్షార్హులు. కేరళ, హిమాచల్‌ప్రదేశ్, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లు కేంద్రం సలహాను పాటించగా బిహార్, పశ్చిమబెంగాల్, హర్యానా, పంజాబ్, హిమాచల్‌ప్రదేశ్ లలో దీనిని కాస్త సవరించి అనుసరిస్తున్నారు. శాఖాంతర సమన్వయ కమిటి దీని అమలులో తదితర అభివృద్ధికరమైన పనుల్లోను ఇతర శాఖలతో సంప్రదింపులు సమావేశాలు మొదలైనవిచేసి మహిళా సంక్షేమ సేవా కార్యక్రమాలు సరిగా అమలులో పెట్టేటట్టు చేస్తుంది.

## 2. వయోజన మహిళలకు ప్రకార్యసంబంధమైన అక్షరాస్యత

వయోజన మహిళలకు 1975-76 లో ఈ పథకాన్ని అమలులో పెట్టారు. ఆరోగ్యం, ఆహారం, పోషకాహారం, గృహనిర్వహణ, శిశు రక్షణ, పాఠశాల విద్య, వృత్తి నైపుణ్యాలపై అనియత విద్యను (Non-Formal) ఇందులో అందిస్తున్నారు.

## 3. వయోజనులైన స్త్రీలకు సంక్షిప్త విద్యా శిక్షణలు (Condensed Courses of Education and Vocational Training for Adult Women)

కేంద్ర సాంఘిక సంక్షేమ మండలి ఈ స్కీమును 1958 లో ప్రారంభించి 1981 డిశంబరు 31 వ తేదీ నాటికి 5,597 కోర్సులను 1,21,200 మంది స్త్రీలకు, ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులుగాను, బాలసేవికలుగాను, నర్సులుగాను, హెల్త్‌విజిటర్లుగాను, మంత్రసానులుగాను (Midwives) కుటుంబ నియంత్రణ కార్యకర్తలుగాను ఈ శిక్షణల ద్వారా రూపొందిస్తున్నారు.

## మహిళా మండలులు

మహిళామండలాల ద్వారా కొన్ని కార్యక్రమాలను నిర్వర్తించటంకోసం దీనిని కేంద్ర సాంఘికసంక్షేమ బోర్డు C.S.W B. ప్రోత్స

హిస్తున్నది. 75 శాతం సంక్షేమ బోర్డు (C.S.W.B.) 25 శాతము మహిళామండలాలు ఈ వ్యయాన్ని భరిస్తాయి. కేంద్ర సంక్షేమబోర్డు (C S.WB.) 31-12-8 నాటికి 1981-82 సంవత్సరంలో 1.028 కేంద్రాలను కలిగిఉన్న 375 మహిళామండలాలకు 35.42 లక్షల రూపాయలను మంజూరుచేసింది.

## పనిచేసే స్త్రీలకు వసతిగృహాలు

పట్టణాలలోను, నగరాలలోను పనిచేసే స్త్రీలకు, సరసమైన రేట్లకు వసతి సౌకర్యాలు కల్పించటానికి కేంద్ర సంక్షేమబోర్డు (C. S. W. B.) ఈ పథకాన్ని ప్రోత్సహించింది. ఈ రకమైన వసతి గృహాలను నడిపే స్వచ్ఛంద సేవాసంస్థలో(C.S.W.B.)బోర్డు గ్రాంట్లను మంజూరుచేస్తుంది. 1972-73 లో ప్రారంభమైన ఈ కార్యక్రమంలో 1980-81 చివరకు, 16,408 స్త్రీలకు సరిపడేవిధంగా 244 వసతిగృహాలు వెలిశాయి.

## సరిహద్దు ప్రాంత ప్రాజెక్టులు (Border Area Projects)

స్త్రీలకు, పిల్లలకు గ్రామీణ ప్రాంతాలలో (World Food Projects) ప్రపంచ ఆహార ప్రాజెక్టులు ద్వారా అందించబడనున్న సంక్షేమ సేవా కార్యక్రమాల రీతిలో సరిహద్దుప్రాంతాలలో కూడ ఈ కార్యక్రమం ప్రారంభించారు. 1981 – 82 లో 89 ప్రాజెక్టులు, 435 కేంద్రాలతో నిర్వహించడమైంది. 31-12-1991 నాటికి 3 క్రొత్త ప్రాజెక్టులనుకూడ ప్రారంభించారు. డిశంబరు 1981 నాటికి 36.42 లక్షల రూపాయలు మంజూరుచేశారు.

## సాంఘిక ఆర్థిక కార్యక్రమాలు

చిన్న ఉత్పాదన కేంద్రాలకు కేంద్ర సంక్షేమబోర్డు(C.S.W.B.) సహాయంచేస్తుంది. ఈ ఉత్పత్తి కేంద్రాలలో పనికావలసిఉన్న స్త్రీలకు శిక్షణనిచ్చి, తరవాత పనికల్పిస్తారు. డిసెంబరు 1981 వరకు, 2,063 మందికి లాభం చేకూరేటట్లు 1981—82 సం॥లో 234 కేంద్రాలకు సహాయం అందజేయడం జరిగింది.

## ఇతర మహిళా సంక్షేమ చర్యలు

స్త్రీలకు సంబంధించిన అనేక రకాల శాసనాపరమైన పరిపాలనా చర్యలను కూడ తీసుకోవడం జరిగింది. 1976 లో పాసు చేసిన సమాన ప్రతిఫల చట్టం [Equal Remuneration Act. 1976] ప్రకారం, స్త్రీ పురుషులకు వేతనాలు సమానంగాను ఇవ్వవలసి ఉంది. ఉద్యోగం విషయంలో స్త్రీ పురుషుల తేడా లేకుండా సమానంగా చూడాలి.

కర్మాగారాల చట్టం (సవరణ) 1976 ప్రకారం 30 మంది స్త్రీలు పనిచేసే కర్మాగారాలలో ఒక క్రెషి [Creche] కల్పించాలి.

మెటర్నిటీ బెనిఫిట్స్ యాక్ట్ 1961 [Maternity Benefits Act 1961] 1948 కార్మికుల రాష్ట్ర భీమా చట్టం పరిధిలోకిరాని స్త్రీలకు అవకాశముండేటట్లు ఏప్రిల్ 1976 లో సవరించడమైంది.

వైవాహిక నియమాల సవరణ చట్టం, 1976 (Marriage Laws Amendment Act 1976) హిందూ వివాహ చట్టం 1955, ప్రత్యేక వివాహ చట్టం 1954 ల ద్వారా తన చిన్ననాటి పెళ్ళిని కాదనటానికి బాలికకు హక్కు ఇవ్వడమైంది.

బాలల సంక్షేమం :

1970-71 లో పోషకాహార లోపాన్ని సరిదిద్దటానికి ప్రత్యేక పోషకాహార కార్యక్రమాన్ని ప్రభుత్వం చేపట్టింది. వెనుకబడిన గ్రామాలలోను, ఆటవిక ప్రాంతాలలోను, 1 లక్ష జనాభా ఉండే పట్టణ ప్రాంతాలలోని మురికివాడలలోను 0-6 సం॥ల మధ్య వయస్సుగల పిల్లలకు పాలిచ్చే తల్లులకు పోషకాహారం ఇవ్వడం అనుబంధంగా జరుగుతున్నది. దేశంలో 60,000 కేంద్రాలలో 80 లక్షలమంది దీనివల్ల లాభం పొందుతున్నారు.

అంతేకాకుండా, సాంఘిక సంక్షేమ మంత్రిత్వశాఖ 1970-71లో స్వచ్ఛంధ సేవా సంస్థలు నడుపుతున్న బాల్వాడీ [Balwadies] ల ద్వారా 3-6 సం॥ల మధ్య పిల్లలకు, గర్భిణీ స్త్రీలకు, పాలిచ్చే తల్లులకు

అనుబంధ పోషకాహారాన్ని అందిస్తున్నది. సుమారు 2.29 లక్షల పిల్లలు 6,000 బాల్వాడీల ద్వారా లాభం పొందుతున్నారు.

1976 మధ్యకాలంనుంచి ప్రపంచ ఆహార ప్రాజెక్టులు (World Food Project) 10 రాష్ట్రాలలో నిర్వహించబడుతున్నది. ఈ ప్రాజెక్టులో సరియైన రక్షణలేని తరగతులకు చెందిన పాఠశాలలు వెళ్ళే పిల్లలకు (6 సం॥ లోపు), గర్భిణీస్త్రీలకు, పాలిచ్చే తల్లులకు పోషకాహారం ఇస్తున్నారు. 1982 నాటికి 20 లక్షలమందికి ఈ సహాయం అందించాలన్నది దీని టార్గెట్.

కేర్ (Cooperation for American Relief Everywhere) సహాయం ఆహారరూపంలో 14 రాష్ట్రాలకు, 2 కేంద్రపాలిత ప్రాంతాలకు స్కూలుకి వెళ్ళే పిల్లలకు, స్కూలు వయస్సుకిరాని పిల్లలకు అందజేస్తున్నారు.

సమగ్ర బాలల అభ్యున్నతి కార్యక్రమాలు
(Integrated Child Development Programme)

ఈ స్కీములో 0–6 సం॥ల లోపు పిల్లలు, తల్లులు, కాబోయే తల్లులకు పోషకాహారం అందించటం, వ్యాధినిరోధక చర్యలు చేపట్టటం (Immunization) ఆరోగ్యతనిఖీ, ఆరోగ్య విద్య, అనియత విద్య (Non-formal Education) కార్యక్రమాలు చేపడుతున్నారు. 5 వ పంచవర్ష ప్రణాళికలో దీనికి అత్యధిక ప్రాధాన్యతనిచ్చారు.

పిల్లలకోసం చేపట్టిన ఇతర కార్యక్రమాలు

అనాథ బాలబాలికలకు ఆశ్రయం కల్పించే స్వచ్ఛందసేవా సంస్థలకు రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా సహాయం అందజేస్తున్నారు. 1974–75 లో కేంద్ర సాంఘిక సంక్షేమశాఖ ప్రారంభించిన ఈ కార్యక్రమానికి 1980–81 అంతానికి, 47,599 పిల్లలకు లాభముచేకూరేటట్లు 971.38 లక్షల రూపాయలను ఇవ్వడం జరిగింది.

శిశుపాలక గృహాలు (Creches) ను నిర్వహించే స్వచ్ఛంద సేవా సంస్థలకు కేంద్ర సంక్షేమబోర్డు (C.S.W.B.) గ్రాంట్లను ఇస్తున్నది.

1980-81 లో 1,09,950 మంది పిల్లలకు లాభం చేకూరేటట్లు 4,398 క్రెష్‌లను నెలకొల్పారు.

సెలవుదిన శిబిరాలు (Holiday Camps)

పిల్లలకోసం సెలవుదిన శిబిరాలను 1958 లో ప్రారంభించటం జరిగింది. తక్కువరాబడి ఉన్న కుటుంబాల పిల్లలకు అటువంటి శిబిరాలను నిర్వహించే స్వచ్ఛంధ సేవా సంస్థలకు 1981-82 లో లక్షల రూపాయలను కేంద్ర సంక్షేమబోర్డు (C.S.W.B.) మంజూరు చేసినది. దీనిని 1958లో ప్రారంభించారు.

ఫోస్టర్ కేర్ హోమ్స్ (Foster Care Homes)

విడాకులు, దీర్ఘకాలిక వ్యాధులు, వదలివేయటం (desertion) జైలుశిక్ష లేక చావు - కారణాలవల్ల తల్లిదండ్రులకు దూరమయిన పిల్లలకు ఈ గృహాలలో రక్షణకల్పిస్తారు. వీటిలో 1 మద్రాసులోను, 2 బొంబాయిలోను స్వచ్ఛంద సేవా సంస్థల ఆధ్వర్యంలో నడుపు తున్నారు.

నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ కో-ఆపరేషన్ అండ్ చైల్డ్ డెవలప్‌మెంట్ (National Institute of Public Cooperation and Child Development)

ఢిల్లీ నగరంలో ఉన్న ఈ ఇన్‌స్టిట్యూట్ పరిశోధన, కార్య క్రమాల పర్యాలోచనము, (Evaluation) శిక్షణ - స్వచ్ఛంద చర్య, శిశు అభివృద్ధి విషయములలో చేపడుతుంది.

శిక్షణా కార్యక్రమాలు

కేంద్ర ప్రభుత్వం, స్థానికంగా పనిచేసేవారికోసం అనేక శిక్షణా కార్యాలను చేపట్టాయి. 1961-62 లో "బాలసేవిక" శిక్షణా కార్య క్రమాల చేపట్టారు. 1980-81 లో అటువంటి శిక్షణా కేంద్రాలు 36 ఉన్నాయి. ఈ కేంద్రాలలో పాఠశాల పూర్వవిద్య (Pre-school Education), వినోద కార్యక్రమాలు (recreation), ఆరోగ్యం పోషకాహారం, సంఘసంక్షేమకృషి వంటి విషయాలపై శిక్షణనిస్తారు.

పిల్లలకోసం జాతీయ పథకం (National Policy for Children)

ఆగష్టు 1974 లో, భారత ప్రభుత్వం పిల్లలకోసం ఒక జాతీయ పథక తీర్మానాన్ని రూపొందించింది. ఈ తీర్మానం ప్రకారం పిల్లల కార్యక్రమాలను, ఏది ముందు చేపట్టాలి ఏది తరవాత చేపట్టాలనేది నిర్దేశిస్తుంది. ఆ తీర్మానం ప్రకారం డిసెంబరు 1974 లో జాతీయ బాలల మండలి (National Children's Board) ను నెలకొల్పారు. దానికి అధ్యక్షుడుగా ప్రధానమంత్రి ఉంటారు. దీనికి అనుగుణంగా, హిమాచల్ ప్రదేశ్, చండీఘర్ లలో తప్ప, మిగతా అన్ని ప్రాంతాల లోను రాష్ట్రబోర్డులను నెలకొల్పారు.

అంతర్జాతీయ బాలల సంవత్సరం
(International year of the Child)

1979 సంవత్సరాన్ని ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ బాలల సంవత్సరంగా ప్రకటించింది. ఈ సంవత్సరంలో అనేక కార్యక్రమాలు చేపట్టారు. సామూహిక రోగనిరోధక చర్యలను (Mass immunization) చేపట్టడం జరిగింది. జాతీయ బాలల నిధి (National Childrens Fund) ప్రవేశపెట్టి, బాలల సంక్షేమానికి పాటుపడే స్వచ్ఛంద సేవా సంస్థలకు సహాయపడటం జరుగుతున్నది.

బాలల సంక్షేమం – జాతీయ బహుమతులు

బాలల సంక్షేమానికి పాటుపడే వ్యక్తులకు సంస్థలకు 1970 నుంచి బహుమతులు ఇవ్వడం జరుగుతున్నది. వ్యక్తికి రూ. 20,000/- లు, సంస్థకు 1,00,000 లు బహుమతిగా లభిస్తుంది.

సాంఘిక రక్షణ (Social Defence)

సాంఘికంగా తప్పుదారిన నడిచేవారికోసం (Social Deviants) నిరోధక, సరిచేసే (Correctional), పునరావాస కార్యక్రమాలను చేపడుతున్నారు. ఇందులో జైలులో ఉన్నవారి సంక్షేమం, బాలల నేరనిరోధకం, నియంత్రణ, ప్రొబేషన్, భిక్షాటన నియంత్రణ, సాంఘిక, నైతిక ఆరోగ్య కార్యక్రమాలు చేపడుతున్నారు. 15 రాష్ట్రాలలోను,

2 కేంద్రపాలిత ప్రాంతాలలోను భిక్షాటన నిషేధ చట్టాలు (Anti Beggary Act) ఉన్నాయి.

నిషేధము (Prohibition)

రాజ్యాంగంలోని 47 వ ప్రకరణము ప్రకారం మత్తుపానీయాలను, మందులను, డాక్టర్ల సలహాలమీదతప్ప తీసుకోవడం నిషేధించడానికి ప్రభుత్వానికి అధికారముంది.

నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ డిఫెన్సు
(National Institute of Social Defence)

1961 లో స్థాపించిన సెంట్రల్ బ్యూరో ఆఫ్ కరెక్షనల్ సర్వీసెస్ సంస్థ 1-1-1975 లో నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ డిఫెన్సుగా పునః నామకరణం చేయడం జరిగింది. దేశంలో చేపడుతున్న సాంఘిక రక్షణ కార్యక్రమాల ప్రమాణాన్ని, వాటి అభివృద్ధిని సమన్వయాన్ని చేస్తుంది.

వృద్ధుల సంక్షేమం (Welfare Services for the Aged)

20 రాష్ట్రాలు, 7 కేంద్రపాలిత ప్రాంతాలు, ఏ ఆధారంలేని వృద్ధులకు ఆర్థిక సహాయం అందిస్తున్నవి. వృద్ధులకోసం ప్రత్యేక గృహాలు, వృద్ధులకు వారి స్వంత గృహాలలోనే సహాయం - ప్రభుత్వం స్వచ్ఛంద సేవా సంస్థలు రెండూ చేస్తున్నవి.

వికలాంగుల సంక్షేమం
(Welfare of the Physically Handicapped)

వికలాంగుల సంక్షేమానికి ప్రభుత్వం రకరకాల చర్యలు చేపడుతున్నది.

ఉద్యోగాలలో రిజర్వేషన్ :

గ్రూపు C, గ్రూపు D, కేంద్రప్రభుత్వ ఉద్యోగాలలో వికలాంగులకు 3 శాతం ఉద్యోగాలు రిజర్వు చేయడమైంది.

అంధపాఠశాలలు :

దేశంలో సుమారు 156 పాఠశాలలు, శిక్షణా సంస్థలు అంధుల కోసం నెలకొల్పి ఉన్నాయి. డెహ్రాడూన్‌లో ఉన్న నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ ది విజువల్లీ హాండికాప్‌డ్ (National Institute for the Visually Handicapped) సమగ్రమైన సేవా కార్యాలను నిర్వహిస్తున్నది. ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మద్రాసులలో ఉన్న ఉపాధ్యాయ శిక్షణా సంస్థలు సంవత్సరానికి 40 నుంచి 50 మంది టీచర్లను తయారుచేస్తున్నాయి.

చెవిటివారు :

హైదరాబాదు నగరంలో ఉన్న ట్రైనింగు సెంటర్ ఫర్ ది అడల్ట్ డెఫ్ సంస్థ కుట్టుపనిలోను, షీట్ మెటల్ పనిలోను, ఎలక్ట్రికల్ వైరింగు పనిలోను, వడ్రంగి పనిలోను, ఫిట్టింగు, గ్యాసు వెల్డింగు పనులలోను శిక్షణ నిస్తున్నది.

మెంటల్లీ రిటార్డెడ్ (Mentally Retarded)

ఢిల్లీ నగరంలో ఎ మోడల్ స్కూల్ ఫర్ ది మెంటల్లీ డెఫిషియెంట్ చిల్డ్రెన్ (A Model School for the Mentally Deficient Children) నెలకొల్పారు. 6-15 సం॥ల మధ్య పిల్లలకు ఈ పాఠశాల శిక్షణ నిస్తున్నది.

కుంటివారు (Orthopaedically Handicapped)

కలకత్తా నగరంలో నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ ది ఆర్థోపీడికల్లీ హాండీకాప్డ్ (National Institute for the Orthopaedically Handicapped) అనే సంస్థను నెలకొల్పారు. ఈ ఇన్‌స్టిట్యూట్‌లో పరిశోధన, శిక్షణలు ఇస్తుంటారు.

ఇవిగాక, 1981 లో 8,900 మందికి ఉపకారవేతనాలు 114 వికలాంగుల సంక్షేమాన్ని చూసే స్వచ్ఛంధ సంస్థలకు 112 లక్షల రూపాయల గ్రాంటు, 17 ప్రత్యేక ఉపాధికల్పనా కేంద్రాల ఏర్పాటు, 50 శాతం ఇంధనం ఖర్చు మోటారు వాహనాలు వాడే వికలాంగులకు,

బాగా పనిచేసిన వికలాంగులకు, మంచి యజమానులకు ప్రభుత్వ బహుమతులు ఇస్తున్నారు.

అంతర్జాతీయ వికలాంగుల సంవత్సరంలో 1981 అనేక కార్యక్రమాలు విస్తృతపరచడం, కొత్త కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. ఈ సందర్భంగా వికలాంగుల సమగ్ర విద్యకై కేంద్రప్రభుత్వం రాష్ట్రాలకిచ్చే 50 శాతం గ్రాంటును 100 శాతానికి మార్చింది.

షెడ్యూల్డ్ కులాల, తెగల సంక్షేమం :

1971 జనాభా లెక్కల ప్రకారం, 22 శాతం మంది షెడ్యూల్డ్ కులాలు, జాతులు మన దేశ జనాభాలో ఉన్నారు. వీరికి రాజ్యాంగ పరంగా అనేక భద్రతలు కల్పించారు.

అస్పృశ్యతా చట్టం :

రాజ్యాంగంలోని 17 వ ప్రకరణం ప్రకారం అస్పృశ్యతను నిషేధించడమైంది. దీనిని ఆధారంగా చేసుకుని అస్పృశ్యతా చట్టం 1955 [Untouchbility Act 1955] రూపొందింది. దీనిని 19 నవంబరు, 1976 లో సవరించి తిరిగి, ప్రొటెక్షన్ ఆఫ్ సివిల్ రైట్స్ ఏక్టు, 1976 [Protection of Civil Rights Act 1976] గా రూపొందించారు.

శాసనసభ, పార్లమెంటులలో ప్రాతినిధ్యం :

330, 332 ప్రకరణల ప్రకారం షెడ్యూల్డు కులాలు, తెగలకు పార్లమెంటులోను, రాష్ట్ర శాసనసభలలోను కొన్ని సీట్లు ప్రత్యేకించారు. స్థానిక సంస్థలలోకూడ అంటే గ్రామ పంచాయితీలలోను, మున్సిపాలిటీలలోనుకూడ ఈ సీట్ల ప్రత్యేకతను [Reservation of Seats] పాటిస్తున్నారు.

ఉద్యోగాలలో రిజర్వేషన్ :

335 ప్రకరణం ప్రకారం కేంద్ర ప్రభుత్వ, రాష్ట్ర ప్రభుత్వాలు ఉద్యోగాలలో 15 శాతం షెడ్యూల్డు కులాలకు 7 1/2 శాతం షెడ్యూల్డు తెగలకు కేటాయించడం జరిగింది.

పె.కు.ల, పె.తె.ల ప్రాంతాల పరిపాలన :

ఆంధ్రప్రదేశ్, బీహార్, గుజరాత్, హిమాచల్‌ప్రదేశ్, మధ్య ప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్‌లలోని కొన్ని ప్రాంతాల పె.షెడ్యూలులో పెట్టారు. ఈ పట్టికలో పొందుపరచిన ప్రాంతాల అభివృద్ధి కార్యకలాపాల నివేదికను, ఆయా రాష్ట్రాల గవర్నర్లు, 244 వ ప్రకరణ ప్రకారం రాష్ట్రపతికి సమర్పించవలసి ఉన్నది.

పె.కు.ల పె.తె.ల కమీషనరు నియామకం :

338 వ ప్రకరణం ప్రకారం 4 మంది సభ్యులతో కేంద్రస్థాయిలో పె.కు.ల పె.తె.ల కమీషను ఏర్పాటు చేయాలి. అందులో ఒక ప్రత్యేక అధికారిగా ఉంటారు. అతనినే కమీషనర్‌గా వ్యవహరిస్తారు. ఇతడు దేశంలో పె.కు.ల పె.తె.ల అత్యాచారాలపై నిఘా వేసి ఉంచుతూ, రిజర్వేషన్లు, రాజ్యాంగ భద్రతలు సరిగా అమలు చేస్తున్నారో లేదోనని పరిశోధిస్తుంటాడు.

పార్లమెంటరీ కమిటీలు

ఇప్పటికి భారతప్రభుత్వం, 1968, 1971, 1973, సంవత్సరాలలో మూడుసార్లు పార్లమెంటరీ కమిటీలను ఏర్పాటుచేసి పె.కు.ల పె.తె. రాజ్యాంగ భద్రతపై నిఘావేసి ఉంచుతున్నది.

రాష్ట్రాలలో సంక్షేమ శాఖలు

రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్రపాలిత ప్రాంతాలు, ప్రత్యేకంగా పె.కు.ల పె.తె.ల అభివృద్ధి మంత్రిత్వ శాఖలను ఏర్పరచి పె.కు. పె.తె.ల సంక్షేమ కార్యాలను చేపడుతున్నాయి.

కోచింగు సౌకర్యాలు

భారత భీమాసంస్థలలోను, కేంద్రప్రభుత్వ, రాష్ట్రప్రభుత్వాలలో ఉన్నతోద్యోగాలలోను వారికి ప్రాతినిధ్యం తప్పకుండా లభించేటట్లు వారికి ఆయా ప్రవేశ పరీక్షలలో ఉత్తీర్ణులయ్యే రీతులలో పరీక్షలముందు కొంత శిక్షణనిస్తారు. ఈ సంస్థలను పరీక్షాపూర్వ శిక్షణాకేంద్రాలు (Pre-Examinations Coaching Centers) అంటారు.

ఉపకార వేతనాలు

మెట్రిక్ అనంతర, మెట్రిక్ పూర్వ విద్యలలో షె.కు. ల షె. తె. ల విద్యార్థులకు ఉపకార వేతనాలు ఇస్తున్నారు. దీనిని 1944–45 లో ప్రారంభించారు.

బాలికా వసతిగృహాలు

రాష్ట్రప్రభుత్వాలు, కేంద్రపాలిత ప్రాంతాలు బాలికా వసతి గృహాలను కొత్తగా ఏర్పరచినా, ఉన్నవాటిని విస్తృతపరచినా, వాటికి ధనసహాయం కేంద్రంనుంచి లభిస్తుంది.

షె. కు. ల అభివృద్ధి కార్పొరేషన్లు

షె. కు. ల అభివృద్ధి కార్పొరేషన్లు షె. కు. ల కుటుంబాల అభివృద్ధికి, రాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పాటుచేశాయి. ఇవి ఆర్థికసంస్థలు (Financial Institutions) కు, ఇటు షె.కు. ల ప్రజలకు మధ్య వారధిగా ఉంటాయి.

షెడ్యూల్డు తెగల అభివృద్ధి

50 శాతంగాని అంతకంటె ఎక్కువగాని షె. తె. ల ప్రజలు ఉండే ప్రాంతాలలో అభివృద్ధికి 5 వ పంచవర్ష ప్రణాళిక ఒక క్రొత్తవ్యూహాన్ని (Strategy) పన్నారు. షె. తె. ల ఉపప్రణాళికల ద్వారా ఈ ప్రాంతాల అభివృద్ధికి కృషిచేస్తున్నారు.

షెడ్యూల్డు తెగల పరిశోధనా సంస్థలు
(Tribal Research Institutions)

ఆంధ్రప్రదేశ్, అస్సామ్, బీహార్, గుజరాత్, కేరళ, మధ్య ప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్‌లలో షె. తె. ల పరిశోధనా శిక్షణాసంస్థలను ఏర్పాటుచేశారు.

విముక్తి పునరావాసం (Relief and Rehabilitation)

1964, 1974 లలో జరిగిన ఇండియా – శ్రీలంక ఒడంబడికల ననుసరించి, భారత ప్రభుత్వం శ్రీలంకనుంచి భారతదేశానికి తరలివచ్చిన 6 లక్షల భారతీయ కాందిశీకులకు 17 సంవత్సరాలపాటు పునరావాస

సమాచారాలు కల్పిస్తున్నది. 1981 డిసెంబరు నాటికి 3.75 లక్షల మంది శ్రీలంకనుంచి ఇండియాకు వచ్చివేశారు.

ప్రధానమంత్రి జాతీయ విముక్తి నిధి

## (Prime Minister's National Relief Fund)

దీనిని 1947 లో ప్రారంభించారు. దీనికి ప్రజలనుంచి 47.56 కోట్ల రూపాయలు మార్చి 1982 నాటికి సమకూర్చగా, 25.08 కోట్ల రూపాయలు ఇంతవరకు వెచ్చించడం జరిగింది. భూకంపాలు, వరదలు, తుఫానులు, కరువులు మొదలైనవాటివల్ల ఇబ్బందులకు గురిఅయ్యే ప్రజలకు ఈ నిధినుంచి ధనసహాయాన్ని అందజేస్తారు.

మొట్టమొదటి ప్రణాళికనుంచి నేటివరకు వివిధ పంచవర్ష ప్రణాళికలలో ఈ కింద పొందుపరచిన విధంగా వ్యయం జరిగింది. రూ॥ కోట్లలో

| | కేంద్రం | రాష్ట్రాలు | కేంద్రపాలిత ప్రాంతాలు |
|---|---|---|---|
| మొదటి పంచవర్ష ప్రణాళిక | 1.60 | — | — |
| రెండో పంచవర్ష ప్రణాళిక | 8.49 | 4 95* | — |
| మూడో పంచవర్ష ప్రణాళిక | 12.84 | 5.63 | 0.93 |
| నాలుగో పంచవర్ష ప్రణాళిక | 65.71 | 9.36 | 1.43 |
| అయిదవ పంచవర్ష ప్రణాళిక | 43.52 | 13.60 | 1.72 |
| 1978-79 వార్షిక ప్రణాళిక | 19.06 | 9.38 | 0.97 |
| 1979-80 వార్షిక ప్రణాళిక | 17.82 | 12.23 | 0.84 |
| 1980-81 వార్షిక ప్రణాళిక | 33.32 | 16 45 | 1.62 |

* కేంద్రపాలిత ప్రాంతాలతో సహా.

6 వ పంచవర్ష ప్రణాళిక కేటాయింపులలో కేంద్రం తరఫున 150 కోట్ల రూపాయలు, రాష్ట్రప్రభుత్వాలు రూ. 109.78 కోట్లు, కేంద్రపాలిత ప్రాంతాల తరఫున రూ. 1.62 కోట్లరూపాయలు జరిగింది.

1981-82 వార్షిక ప్రణాళికలలో మొత్తం రూ. 31.57 కోట్లు కేటాయింపు జరిగింది.

## ప్రభుత్వ సంస్థల, స్వచ్ఛంధ సేవా సంస్థల మధ్య సమన్వయం [Co-ordination between Public and Private Agencies]

అభివృద్ధి చెందుతున్న దేశంలో సమన్వయం, సహకారం చాల అవసరం. ఎందువల్లనంటే వనరులు తక్కువగాను, అవసరాలు ఎక్కువగాను ఉంటాయి. కాబట్టి వనరుల దుర్వినియోగం లేక వృధాకాకుండా సేవా కార్యాలు డూప్లికేషన్ (Duplication) జరగకుండా ఉండాలంటే ఒకే రకమైన కార్యక్రమాలను చేపట్టే ప్రభుత్వ సేవా సంస్థలు స్వచ్ఛంధ సేవా సంస్థల మధ్య సమన్వయం సహకారం ఉండవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

సంఘ సంక్షేమ కృషిలో "సమన్వయం" అనే పదం "ఇంటర్ కమ్యూనికేషన్" లయోజన్ [Liaisan] అనే పదాలు పర్యాయ పదంగా అప్పుడప్పుడు వాడటం కద్దు. సాధారణంగా స్వచ్ఛంధ సేవా సంస్థల, స్థానిక స్థాయులలో ఉండటంతో వాటికి, అటువంటి సేవా కార్యక్రమాలను చేపట్టే ఇతర సంస్థలను గురించి అంతగా తెలియదు. అందువల్ల సమన్వయం వివిధ సేవా సంస్థల మధ్య ఉండటం ఎంతైనా అవసరం.

అయితే ఈ సమన్వయం ముఖ్యంగా రెండు రకాలు.

1. ఒక ఏజన్సీలో సమన్వయం [Co-ordination within the Agency]
2. ఒక సముదాయంలో ఉన్న వివిధ రకాల సేవా సంస్థల మధ్య సమన్వయం.

ఒకే ఏజన్సీలో ఉండే రకరకాల సిబ్బంది మధ్య జరిగే సమన్వయం ఒకటోరకానికి చెందినదైతే, ఒక ప్రాంతంలో ఉన్న రకరకాల సంస్థల మధ్య సమన్వయం ఉండాలి. ఉదాహరణకు ఒకే ప్రాంతంలో ఉండే లయన్సు, లియో, రోటరీ, రోటరాక్టు, ప్రభుత్వ సోషల్ వెల్‌ఫేర్ డిపార్టుమెంటులు కలిసి ఏదైనా సేవా కార్యానికి, ఒక బృహత్తర ప్రణాళికవేస్తే వాటిమధ్య ఉన్న సమన్వయం రెండోరకానికి చెందిందని చెప్పవచ్చు.

దేశస్థాయిలో ఉన్న సేవా సంస్థలు - ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ వర్క్, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ చైల్డ్ వెల్ఫేర్, "బాల్కన్‌జి బారి" [Balkanji Bari] ఆలిండియా ఉమెన్సు కాన్ఫరెన్సు, ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ, ఇండియన్ ఎడల్ట్ ఎడ్యుకేషన్ అసోసియేషన్, హరిజన సేవక్ సంఘ్, ఆదిమజాతి సేవక్ సంఘ్, కుష్ఠునివారణ సంఘ్, కస్తూర్బాగాంధీ నేషనల్ మెమోరియల్ ట్రస్టు, టి.బి. అసోసియేషన్, భారతీయ గ్రామీణ మహిళా సంఘ ముఖ్యమైనవి. వాటి శాఖల కార్యక్రమాలను సమన్వయ పరచడమేకాకుండా వారివారి ప్రత్యేక క్షేత్రాలలో కార్యక్రమాల అభివృద్ధికి ఎంతో దోహదపడుతున్నది.

అంతేకాకుండా ఈ అఖిల భారత సేవా సంస్థలు, ప్రభుత్వ సంస్థలతో కూడ సహకరించి సమన్వయాన్ని కలిగి ఉంటుంది. ఉదాహరణకు సెలవుదిన గృహాలను నిర్వహించటంలో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ చైల్డ్ వెల్‌ఫేర్, కేంద్ర సాంఘిక సంక్షేమ మండలి [C.S.W.B.] తో సహకరిస్తుంది. అట్లాగే భారత్ సేవక్ సమాజ్ - అర్బన్ కమ్యూనిటీ ప్రాజెక్టులను, నైట్ షెల్టర్లను [Night Shelters] కేంద్ర సాంఘిక సంక్షేమ మండలితోను, కేంద్ర సాంఘిక సంక్షేమ మండలి క్షేత్ర కర్తలకు [field Workers] శిక్షణ ఇవ్వటానికి కస్తూర్బా నేషనల్ మెమోరియల్ ట్రస్ట్ ఒకదానితో ఒకటి సమన్వయం, సహకారం కుదుర్చుకొని పనిచేస్తున్నాయి.

అందువల్ల స్వచ్ఛంధ సేవా సంస్థలకు, ప్రభుత్వ సంక్షేమ సంస్థలకు మధ్య సరియైన సమన్వయం, సహకారం ఉన్నట్లయితే సాముదాయిక కార్యక్రమాలు ఎంతో విజయవంతంగా అమలుజరుగుతాయి.

# 8

# సంఘ సంక్షేమ కార్యక్రమాలలో స్వచ్ఛంద సేవా సంస్థల పాత్ర

స్వచ్ఛంద సేవాసంస్థలు, ఆపదలలో చిక్కుకున్న ప్రజలకు, భూకంపాలు, వరదలు, అంటువ్యాధులు, కరువుకాటకాల వంటి అత్యవసర సమయాలలో, విముక్తి, ఇతర సహాయక చర్యలు అందించటంలో, అనాదిగా ప్రముఖపాత్ర వహిస్తున్నవి. శతాబ్ది కాలంనాటి సేవా సంస్థలు కూడా కొన్ని ఉన్నవి. స్వాతంత్ర్యానికి పూర్వం స్వచ్ఛంద సేవాసంస్థలు నిధులను సేకరిస్తూ సమాజ సంక్షేమానికి వాటికి ఉపయోగించటంలో ఎంతో కృషిచేశాయి. భారత ప్రభుత్వం స్వాతంత్ర్య సముపార్జనానంతరం సాంఘిక సంక్షేమ రంగంవైపు దృష్టి మరల్చింది. 1947 వ సంవత్సరం పూర్వార్థం వరకు ఈ రంగం స్వచ్ఛంద సంస్థల అజమాయిషి కిందనే ఉండేది. మనదేశం సంక్షేమ రాజ్యస్థాపనమే ప్రధానలక్ష్యంగా పెట్టుకొన్నది. ప్రజలను, జాతి, మత, కులాలలోని, భౌతిక, మానసిక, సాంస్కృతిక అశక్తతలతోను వేరుపరచకుండా అందరూ సమానమే అనే సమతాభావం ప్రజాప్రభుత్వాలలో ప్రపంచమంతటా ఏర్పడింది.

గతకాలంలో సాంఘిక సంక్షేమ కృషి నిమిత్తమై ప్రభుత్వం తోడ్పాటు ఉన్నా లేకపోయినా స్వచ్ఛంద సంస్థలు నామమాత్రంగా తమకృషిని కొనసాగించాయి. కాని ప్రస్తుత కాలంలో ప్రభుత్వం తనంతటతాను ప్రత్యేకంగా సంక్షేమరంగంలో కొన్ని క్రొత్త కార్యక్రమాలను చేపట్టడం, స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సహాయం చేయడం ఎక్కువగా కనిపిస్తున్నది.

భారత ప్రభుత్వం ప్రజాస్వామ్య, సామ్యవాద మార్గంలో పయనిస్తూ సంక్షేమరాజ్యాన్ని స్థాపించాలని మహా తీవ్రమైన ఆశయంతో ఉన్నది. అందువల్ల ప్రభుత్వపరమైన, స్వచ్ఛందసంస్థల పరమైన అన్ని రకాల సంక్షేమచర్యలు, ప్రయత్నాలు ఆ ఆశయం ఫలించడంకోసం నిరంతరం కృషిజరుపుతున్నాయి. ఈ బృహత్ లక్ష్యసాధనకోసం సాగించే పయనంలో అడ్డుగా నిలిచిన సాంఘిక సమస్యలు లెక్కలేనన్ని వాటిని ఎదుర్కొనటానికి మనకున్న అవకాశాలు, సాధనసంపత్తులు చాలాతక్కువ. కాబట్టి ఈ సమస్యల పరిష్కారానికి ప్రజాసహకారం లేనిదే ప్రభుత్వమొక్కటే లక్ష్యాన్ని సాధించలేదు. అతిముఖ్యమైన ఆహార, వస్త్ర, విద్య, వసతి, రవాణా మొదలయిన సమస్యలను కొన్నింటిని ప్రభుత్వమే చేపట్టి ప్రధానబాధ్యత వహిస్తున్నది. ఇవి కాకుండా ఇంకా ఇతర సమస్యలుకూడా వున్నాయి. ఆ సమస్యలను పరిష్కరించడానికి స్వచ్ఛందసంస్థల ఆవశ్యకత ఎంతైనాఉన్నది. అంతే గాకుండా స్వచ్ఛంద సేవా సంస్థలు మానవతా దృక్పథంతో కూడి వుండటంవల్ల సాంఘికసంక్షేమ కార్యక్రమాలను విజయవంతంగా చేపట్ట గలవు. ప్రస్తుతం మన దేశంలో స్వచ్ఛంద సేవా సంస్థలు 10,000 పైన ఉన్నాయని అంచనా.

మన దేశ చరిత్రలో సాంఘిక సేవ అనేది అనాదిగా ఏదోఒక రూపంలో కనిపిస్తూనే ఉంది. ఆదిమజాతులలో కూడా తమ స్వజాతీయతను కాపాడుకోవడానికి బలహీనులను రక్షించడంద్వారా స్వచ్ఛంద సేవా ప్రయత్నాలు గోచరిస్తున్నాయి.

పూర్వం గ్రామపంచాయతీలు, ఉమ్మడి కుటుంబాలు వృద్ధులకు, బలహీనులకు రక్షణ కల్పిస్తుండేవి. పేదప్రజలకు అన్నదానాలు చేయటం శరణార్థులను ఆదుకోవటానికి వసతి సౌకర్యాలను కల్పిస్తూ ధర్మశాలలను కట్టించడం మొదలయిన ప్రకార్యాలన్నీ అనాదిగా స్వచ్ఛంద సేవాసంస్థలు మనదేశంలో ఉన్నవని చెప్పటానికి నిదర్శనాలుగా పరిగణించవచ్చు.

ధాతృత్వ భావనయే గాకుండా సేవా సంకల్పానికి మతం కూడా ఎంతో దోహదపరచింది. అనేక మతాలతో మతస్థులు అవసరాల లోను. చిక్కులలోను ఉండేవారి సోదరులను ఆదుకొనేవారు. ముఖ్యంగా క్రైస్తవ మిషనరీలు ఈ సేవా ప్రకార్యాలలో మన దేశ సాంఘిక జీవనంలో ఒక ముఖ్యమైన పాత్ర వహించేవారు. అనాధ శరణాలయా లను, కుష్ఠు శరణాలయాలను పోషించడంలో హర్షించదగ్గ పాత్ర వహించారు. మానవ సేవయే మాధవసేవ అనే భావన వారిలో ఉండేది. 1905 లో ప్రారంభించబడిన సర్వెంట్స్ ఆఫ్ ఇండియన్ సొసైటీ (Servents of Indian Society) లో మతాతీత సాంఘిక సేవ మన దేశంలో ఉద్భవించింది. మరికొన్ని సంవత్సరాల తరువాత మన జాతిపిత మహాత్మాగాంధి మహత్తరమైన ఆశయాలతో కార్యశీల దృక్పథంతో సాంఘిక సంక్షేమ రంగప్రవేశం చేశారు. సంఘంలోవుండే అనేక దురాచారాలను రూపుమాపటానికి అనేక నిర్మాణాత్మకమైన సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను చేపట్టారు. క్రమేణా భారత దేశంలో సంక్షేమ కృషి మరింత వ్యవస్థీకృతమైంది. భారత దేశంలో పారిశ్రామికీ కరణాలను, నగరీకరణను, త్వరితరీతిలో పెంపొందటంవల్ల నేడు మనం అనేక సమస్యలకు గురి అవుతున్నాం. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ, కుల వ్యవస్థ, గ్రామపంచాయితి వ్యవస్థల వంటి సేవా సంస్థలన్నికూడా బల హీనమవుతున్నాయి. ఇటువంటి సమయాలలో పాశ్చాత్య దేశాల శాస్త్రీయ పరిజ్ఞానం, కృషి పద్ధతులను మనం అపారంగా వినియోగించు కొని సత్వరంగా మంచి ఫలితాలను సాధించుకోవలసి ఉన్నది.

స్వచ్ఛంద సేవా సంస్థ – నిర్వచనం

లార్డ్ బివరిజ్ [Lord Baveridge] స్వచ్ఛంధ చర్య [Voluntary Action] అనే రిపోర్టులో స్వచ్ఛంధ సేవా సంస్థ అంటే ఏమిటో ఇలా చెప్పాడు. "బయటవారి అధికారానికి లోబడకుండా తన సొంత సభ్యులచేత స్థాపితమై నడిచే దానిని స్వచ్ఛంధ సేవా సంస్థ అని వ్యవహరించవచ్చు.

అంటే ప్రభుత్వ సేవా సంస్థలకు, స్వచ్ఛంధ సేవా సంస్థలకు కొన్ని తేడాలున్నాయి. ప్రభుత్వ సేవా సంస్థలలో పై అధికారుల పర్యవేక్షణ, నియంత్రణ ఎక్కువగా ఉంటుంది. సేవా సంస్థ ద్వారా సేవా కార్యక్రమాలు నిర్వర్తించటంలో స్వచ్ఛంద సేవా సంస్థల సభ్యులవలె తగినంత స్వాతంత్రం ఉండదు. ప్రభుత్వ సేవా సంస్థలలో స్వచ్ఛంద సేవా సంస్థల కున్నంత మానవతా దృక్పథం ఉండదు. తక్షణ సదుపాయాలు కల్పించ టానికిగాని తక్షణ సేవా కార్యక్రమాలు చేపట్టటానికిగాని స్వచ్ఛంధ సేవా సంస్థలు చేయగలిగినంత ప్రతిభావంతంగా ప్రభుత్వ సేవా సంస్థలు చేయలేవు. అంతేగాకుండా సరికొత్త కార్యక్రమాలను చేపట్టటానికి అందులో ఉన్న లోటుపాట్లను తెలుసుకోవటానికి స్వచ్ఛంధ సేవా సంస్థయే అనువుగా ఉంటుంది.

స్వచ్ఛంధ సేవా సంస్థలలో సేవా సంకల్పమున్న వ్యక్తులందరూ కలుసుకొని ఆర్థిక వనరులను పెంపొందించుకొని, వీలైనంత వరకు తదితర సంస్థలపైగాని ప్రభుత్వంపైగాని ఆధారపడకుండా, సేవా కార్యక్రమాలను చేపట్టటం జరుగుతుంది. అందువల్ల ఇందులో ఉన్న సభ్యులు బయటవారి అధికారానికి లోబడవలసిన అవసరంలేదు. సేవా కార్యక్రమాలను నిర్వర్తించటంలో సభ్యులందరకు సంపూర్ణ స్వేచ్ఛ ఉంటుంది.

## స్వచ్ఛంధ సేవా సంస్థలు - ప్రయోజనాలు

1. స్వచ్ఛంధ సేవా సంస్థల ముఖ్యమైన ప్రకార్యమేమంటే మార్గదర్శకత్వాన్నివహించటం. స్వచ్ఛంధ సేవా సంస్థల బలవత్తరమైన అంశమేమంటే ఇవి ప్రయోగకీత్యా సేవా కార్యక్రమాలను నిర్వహిస్తాయి. స్వచ్ఛంధ చర్యకు కావలసినంత స్వతంత్రత ఉంటుంది. వివాదాస్పదమైన క్షేత్రంలలో కూడ కృషి జరపటానికి, ఏదైన కార్యం చేపట్టం తక్కిన సముదాయ ప్రజలందరూ వ్యతిరేకించినా సేవా సంకల్పమున్న చిన్న సమూహం కృషి జరపటానికి వీలవుతుంది. మన దేశంలో కూడ కొన్ని రకాల సేవా కార్యక్రమాలు, ప్రభుత్వ సంస్థలు చేపట్టేటంత వరకు స్వచ్ఛంధ సేవా సంస్థలే

చేపట్టంఎన్నో దృష్టాంతాలున్నాయి. ఆదిమవాసుల సంక్షేమం కోసం ఠక్కర్ బాబా కృషి, స్త్రీ విద్యకోసం కార్వే మహర్షి చేసిన కృషి ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు.

2. స్వచ్ఛంధ చర్చలో రాజకీయ వత్తిడుల ప్రభావం కూడా ఉండదు. తగినంత స్వతంత్రత ఉంటుంది. అయితే ప్రభుత్వ సేవా సంస్థలలో సేవా కార్యక్రమాలు – ప్రభుత్వం మారిన రాజకీయ పార్టీల మార్పిడులవల్ల ప్రోత్సాహానికిగాని, నిర్లక్ష్యానికిగాని గురిఅవుతాయి.

3. స్వచ్ఛంధ సంస్థలకు, తగినంత సడలింపు, స్వతంత్రత, ప్రజల మద్దతు సహకారం బాగా లభిస్తాయి. ప్రభుత్వ సంస్థలవలె పరిపాలనా కాఠిన్యత (Bereaucratic Rigidity) ఉండదు.

4. స్వచ్ఛంధ చర్చ అనేది అత్యవసర అవసరాలను తీర్చడానికి బాగా ఉపయోగపడుతుంది. ఈ స్వచ్ఛంధ చర్య ద్వారా, స్వయం సహాయంగాని, సహాయార్థులకు తోడ్పడే వ్యాయామాలుగాని, సహాయం చేయటం జరుగుతుంది.

## స్వచ్ఛంద సేవాసంస్థలు ఎదుర్కొంటున్న సమస్యలు

స్వచ్ఛంద సేవాసంస్థలు సేవాతత్పరతతో, సోదర మానవ సంక్షేమాన్ని దృష్టిలోపెట్టుకొని ముందుకురికినా విజయవంతంగా సేవా కార్యక్రమాలను తగురీతిలో అందించలేకపోతున్నాయి. ఎందువల్లనంటే అవి అనేక సమస్యలను ఎదుర్కొనవలసివస్తున్నది.

1. ఆర్థిక సమస్య :-

ఆధునిక కాలంలో స్వచ్ఛంద సంక్షేమసంస్థలను పోషించడానికి ధర్మనిధులు, లోకోపకార సంస్థలు, క్షీణించిపోయినాయి. అంతేకాక మరికొన్ని సంస్థలను స్థాపించి పోషించే ఉత్సాహవంతులయిన ధర్మపరులైన ధనికులు కరువైనారు. స్వచ్ఛంద సంస్థలకు ప్రత్యేకంగా ఆర్థికసహాయాన్ని చేయవలసిన భారం ప్రభుత్వమే వహించవలసి వస్తున్నది. అందుచేత ఈ సంస్థలు ఆర్థిక బలహీనతవల్ల సక్రమంగా సంఘసంక్షేమ సేవలనుచేసే ఆత్మబలాన్ని కోల్పోతున్నాయి.

2, శిక్షితులయిన సంక్షేమ కార్యకర్తల కొరత :-

స్వచ్ఛంద సంక్షేమ రంగంలో శిక్షితులయిన సంక్షేమ కార్యకర్తల కొరత హెచ్చుగావుంది. సంక్షేమ కార్యకర్తలకు, పరోపకార చింతన, త్యాగనిరతి, సహనం, సానుభూతి మొదలైన లక్షణాలున్నప్పటికి ఆధునిక సాంఘిక సంక్షేమ పద్ధతులలో శిక్షణపొందడం వారికి చాలా అవసరం. సమాజంలో ఉన్న సమస్యలను కూలంకషంగా అవగాహన చేసుకొని వాటికి తగిన చర్యలను తీసుకొని సమాజాన్ని క్రమబద్ధం చేయాలంటే సంక్షేమ కార్యకర్తలకు శిక్షణ ఎంతైనా అవసరం. అందు వల్ల ప్రభుత్వం బాధ్యతవహించి సంక్షేమ కార్యకర్తలకు శిక్షణ ఇప్పించాలి.

3. ఒకే ప్రాంతంలో ఒకేరకమైన సేవలను అందజేయటం :-

కొన్ని ప్రాంతాలలో రెండు సంస్థలు అంటే స్వచ్ఛందసంస్థ, మరొక ప్రభుత్వసంస్థ లేదా రెండూ స్వచ్ఛందసంస్థలే ఒకేరకమయిన సేవలను అందజేయటం జరుగుతుంది. కాబట్టి అట్లాంటి ఏకరూపమైన సేవలను రెండుసంస్థలు చేయడాన్ని అరికట్టి సంక్షేమసేవలకు వ్యాప్తి కలిగించడంలో స్వచ్ఛంద సేవాసంస్థలు, ప్రభుత్వం తగిన జాగ్రత్తలు తీసుకోవటం అవసరం.

4. పరిపాలనలో విలంబనం (Administrative Delays)

స్వచ్ఛంద సేవాసంస్థల పరిపాలన, విధినిర్వహణలో జాప్యం ఉండదు. కాని ప్రభుత్వ సంస్థలలో పరిపాలన చాలా ఆలస్యంగా జరుగుతుంది. అంతేకాకుండా ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలపైన విధించే నియమాలు, తనిఖీచేసే పద్ధతులుకూడా చాలా కఠినంగా ఉంటాయి.

5. సమన్వయ విధానంలో లోపం :-

సంక్షేమ సేవలను అందజేయడంలో స్వచ్ఛంద సంస్థలకు, ప్రభుత్వానికి మధ్య సరిఅయిన సమన్వయ విధానం లేదు. స్వచ్ఛంద సంస్థలమధ్య కూడా సమన్వతాభావం లోపించి, దేనికదే స్వతంత్రంగా తమ సేవలను అందజేస్తున్నాయి. స్వచ్ఛంద సంస్థలు సాంఘికసంక్షేమం

రంగంలో ప్రభుత్వ సంస్థలలో సమానమైన స్థాయిలో భాగస్వాములుగా పనిచేయవలసి ఉంటుంది. అందువల్ల సాంఘిక సంక్షేమ రంగంలో ప్రభుత్వానికి, స్వచ్ఛంద సంస్థలకు మాత్రమే కాకుండా స్వచ్ఛందసంస్థల మధ్యకూడా సమన్వయ సహకార భావాలు అభివృద్ధిచెందాలి.

6. నాయకత్వ లోపం :-

స్వచ్ఛంద సేవాసంస్థలు ఆరంభంలో చురుకైన, నిస్వార్థమైన నాయకుల సాహచర్యంలో హర్షించదగ్గరీతిలో పనిచేస్తున్నవి. కాని కొందరు స్వార్థపరులు, స్వచ్ఛందసేవా కార్యకర్త ముసుగులో, కీర్తి కాంక్షతో, స్వచ్ఛంద సేవాసంస్థలలో ప్రవేశిస్తున్నారు. ఇటువంటి స్వార్థపరశక్తుల మూలంగా, ఆయా సేవాసంస్థల అభ్యున్నతి కుంటుపడు తున్నది. కాబట్టి సేవాకార్యకర్తలు సరియైన నాయకుని నియమించు కొని, స్వార్థపరశక్తులను అడ్డు తొలగించుకొన్నట్లయితే, దినదిన ప్రవర్థ మానమై సేవార్థులకు అతిచేరువలో సేవలందించే అవకాశం కలుగు తుంది.

స్వచ్ఛంధ సేవా సంస్థల పాత్ర
(Role of Voluntary Organisations)

మహమ్మదీయులు తమ 5 వ వంతు ఆదాయాన్ని సమాజంలో దిక్కులేక ఇతరులపై ఆధారపడి జీవించే వ్యక్తుల నిమిత్తం ఖర్చు చేసి నారు. శిక్కు మతస్థులు "గురుద్వారా" ల ద్వారా సహాయం చేశారు. బ్రిటిషువారి వలస విధానంవల్ల క్రైస్తవ మిషనరీ వ్యవస్థలో కూడా ప్రపంచ ఆర్థిక దృక్పథంలో మార్పులు కలుగటంవల్ల మన దేశ సాంఘిక వ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు రావడం ప్రారంభ మయింది. దానితో సమాజంలో రాజరామమోహనరాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, దయానంద సరస్వతి, కందుకూరి వీరేశలింగం మొదలయిన సంఘ సంస్కర్తలు బయలుదేరి ఉద్యమాలను నడిపారు. తత్ఫలితంగా దేశంలోవున్న పెద్దపెద్ద పట్టణాలలో ఆర్యసమాజం, రామ

కృష్ణ మిషను, థియోసాఫికల్ సొసైటీల వంటి ప్రైవేటు ధర్మసంస్థలు, సేవా సంస్థలు అనేకం బయలుదేరాయి. ఈ సంస్థలు సమస్యాపూరిత మైన అన్ని రకాల రంగాలలోను, నిస్వార్థంగా ప్రజలకు సేవ చేస్తున్నాయి.

భవిష్యత్తులో స్వచ్ఛంధ సంస్థల కృషి

సంక్షేమ రాజ్యస్థాపనలో స్వచ్ఛంధ సంస్థల పాత్ర అద్వితీయ మైనది. ప్రపంచంలోని ప్రముఖ దేశాలన్ని స్వచ్ఛంధ సంస్థల ప్రాముఖ్యాన్ని గుర్తించి వాటి అభివృద్ధికి ఇతోధికంగా కృషి చేస్తున్నాయి. భారతదేశంలో కూడ ఈ అభివృద్ధికరధోరణి హెచ్చుగానే ఉంది.

సాంఘిక సంక్షేమం, వెనుకబడిన వర్గాల సంక్షేమం నాటికి చెందిన పరిశీలక బృందం రిపోర్టులలో ఈ స్వచ్ఛంధ సంస్థల అభివృద్ధిని గురించి కొన్ని సిఫారసులను చేసింది.

1. స్వచ్ఛంధ సంస్థలు మూలధనాన్ని సంపాదించే కార్యక్రమాలను పునః పరిశీలించాలి. కొందరు దాతల దానధర్మాలపైన ఆధారపడకుండా అధిక సంఖ్యాకులైన ప్రజల సహకారాన్ని సంపాదించాలి.
2. స్వచ్ఛంధ సంస్థలు సంక్షేమ సేవ అభివృద్ధి విషయంలో అధిక బాధ్యత వహిస్తున్నందువల్ల అధికార సంస్థలతోపాటు వీటికి సమానమైన హోదాను కలిగించాలి.
3. సంక్షేమ సేవా సంస్థల విషయంలో సమాజ సంక్షేమ సేవలకు వసతి సదుపాయాలులేని కుటుంబాన్ని ఆధార యూనిట్‌గా తీసుకోవటం జరగాలి.
4. సమన్వయ పరిషత్తులను జిల్లా, రాష్ట్ర, జాతీయ స్థాయిలలో స్థాపించడం జరగాలి. ముందుగా ఈ పరిషత్తులను రాష్ట్రస్థాయిలో రాష్ట్ర ప్రభుత్వాలు, రాష్ట్ర సాంఘిక సంక్షేమ సంస్థల సలహాలను అనుసరించి నడపాలి. ఈ పరిషత్తులు ఒకసారి స్థాపించిన తరువాత వాటంతట అవే కొన్ని నియమాలను ఏర్పరచుకొని వాటికి అనుగుణంగా పనిచేయాలి.

స్వచ్ఛంధ సేవా కార్యకర్తల లక్షణాలు :

1. స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ కార్యకర్తగా కార్యరంగంలో వినమ్రతగా ఉండి నిగర్విగా వ్యవహరించాలి.

2. స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ కార్యకర్త చిత్తశుద్ధి, నిస్వార్థపరాయణత, ఆత్మార్పణ బుద్ధి, త్యాగనిరతి మొదలైన సలక్షణాలలో ఉండాలి.

3. స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ కార్యకర్త క్షేత్రరంగంలో ప్రజలతో కలసి మెలసి వారిలో ఒక వ్యక్తిగా మసలుకొని వారి సమస్యలను పూర్తిగా అవగాహన చేసుకొని అనధికార స్థాయిలో వ్యవహరించాలి.

4. స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ కార్యకర్త అన్ని రకాల సమస్యలను, సహాన సానుభూతులతో స్వయంగా కనివిని తెలుసుకొని వృత్తి సామరస్యాన్ని (Rapport) స్థాపించి సమస్యను సమగ్రంగా పరిశీలించి పరిష్కారానికి తగిన తుది నిర్ణయాలను తీసుకొనే సమర్థతతో ఉండాలి.

5. స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ కార్యకర్త సమాజంలోని ప్రజలు ఉత్సాహపూరితంగా పాల్గొనడానికి అనుగుణమైన పథకాలను కార్యక్రమాలను ఏర్పాటుచేయాలి.

6. స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ కార్యకర్త సంక్షేమ రంగంలో ఆదర్శవాదిగాను ప్రజానాయకుని పాత్రను వహించి ఉద్యమాలను నడిపి సమాజంలో ఎవరి సమస్యలను వారే పరిష్కరించుకొనే విధంగా చేసి ప్రజలను ముందుకు నడిపే సామర్థ్యంతోను, వాక్చాతుర్యంతోను, ఉండాలి.

7. స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ కార్యకర్త అవసరమైనప్పుడు ప్రభుత్వ సంక్షేమ శాఖలతో సంబంధం పెట్టుకుంటూ అన్ని విధాలయిన సహకారాలను పొందుతూ సమన్వయ భావాన్ని ప్రజలలో పెంపొందించే విధంగా నడచుకోవాలి.

8. స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ కార్యకర్త సమాజ సంక్షేమ కార్య క్షేత్రంలో అభివృద్ధిని సాధించాలంటే ఆధునిక సంక్షేమ శాస్త్ర పద్ధతుల ద్వారా సుశిక్షితుడై ఉండాలి.

## ప్రభుత్వం - స్వచ్ఛంద సేవాసంస్థలు

స్వాతంత్ర్యానంతరం, ప్రభుత్వం సంక్షేమకార్యాల అభివృద్ధికోసం ఈ క్రింది చర్యలు తీసుకోవడం జరిగింది.

(i) కొన్ని సేవాసంస్థలకు గ్రాంట్లు ఇస్తూ, స్వచ్ఛంద సేవా చర్యల ప్రోత్సాహమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొని పూర్తికాలిక అధ్యక్షుని నియమిస్తూ 1953 లో (C.S.W.B.) కేంద్ర సంక్షేమ బోర్డుని స్థాపించటం, ఈ బోర్డులో దేశంలో ఉన్న స్వచ్ఛందసేవా కార్యకర్తలు ఉద్యోగేతరులు, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలతో ముడిపడిఉండే మంత్రివర్గాల ప్రతినిధులు, రాష్ట్ర ప్రతినిధులు, సాంఘిక శాస్త్రవేత్తలు, పరిపాలకులు సభ్యులుగా ఉంటారు. కేంద్రీయ సంస్థకు సహాయసహకారా లందిస్తూ వివిధ రాష్ట్రాలలో కేంద్రపాలిత ప్రాంతాలలో రాష్ట్రీయ సాంఘిక సంక్షేమ సలహా మండలులుకూడ ఉన్నవి.

(ii) నేడు నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ కో-ఆపరేషన్ అండ్ చైల్డ్ డెవలప్‌మెంట్ (National Institute of Public Cooperation and Child Development) గా గుర్తింపుపొందిన సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రిసెర్చి అండ్ ట్రైనింగ్ ఇన్ పబ్లిక్ కోపరేషన్ (Central Institute of Research and Training in Public Cooperation) సంస్థను, 1966 సం॥లో స్థాపించటం. ఇది ప్రణాళికా కార్యక్రమాలలో ప్రజలు పాల్గొనేటట్లు చేయటానికి, స్వచ్ఛంధ చర్యను ప్రోత్సహించటానికి స్వచ్ఛంద చర్యలో పాల్గొనే స్వచ్ఛంద కార్యకర్తలకు శిక్షణనివ్వటం, స్వచ్ఛందచర్య వివిధ అంశాల పరిశోధన పర్యాలోచన (evaluation) లను సాగించటానికి దోహద పరుస్తున్నది.

(iii) దేశస్థాయిలో ఉన్న స్వచ్ఛంద సంస్థలకు గ్రాంట్లను మంజూరు చేయటం.

(iv) విభిన్న కార్యక్రమాలు నిర్వర్తించటానికి స్వచ్ఛందసంస్థలకు నిధులను మంజూరుచేయటం.

(v) ఎప్పటికప్పుడు, ప్రభుత్వం నియమించిన వివిధ కమిటీలలోను, వర్కింగు గ్రూపులలోను, స్వచ్ఛంద సేవాసంస్థలకు తగినంత ప్రాతినిధ్యం కల్పించి, సంక్షేమ పథకాలను, (Welfare Schemes) రూపొందించటానికి విధానరచన (Policy formulation) లోను వారిని పాల్గొనేటట్లు చేయటం.

(vi) గ్రామాలలోఉన్న స్థానిక స్త్రీ సంక్షేమ సంస్థలను ప్రోత్సహిస్తూ అనేక అభివృద్ధికరమైన కార్యక్రమాలలో వారిని పాల్గొనేటట్లు చేయటం.

(vii) వరకట్నాలు, చిన్నవయస్సులో పెళ్ళిళ్ళు (Early marriages) వంటి సాంఘిక దురాచారాలను రూపుమాపడం, ప్రజాభిప్రాయాన్ని ఉత్తేజం చేయడంలో సేవాసంస్థలకు తమ సహాయ సహకారాన్ని అందించటం.

| | ప్రణాళిక | స్వచ్ఛంద సేవాసంస్థలకు కేటాయించిన గ్రాంట్ల మొత్తం రూ. లక్షలు |
|---|---|---|
| 1. | మొదటి పంచవర్ష ప్రణాళిక | 75.43 |
| 2. | రెండవ పంచవర్ష ప్రణాళిక | 250.00 |
| 3. | మూడవ పంచవర్ష ప్రణాళిక | 1200.00 |
| 4. | వార్షిక ప్రణాళిక (1966-67) | 71.00 |
| 5. | వార్షిక ప్రణాళిక (1967-68) | 60.00 |
| 6. | వార్షిక ప్రణాళిక (1968-69) | 72.00 |
| 7. | నాలుగో పంచవర్ష ప్రణాళిక | 600.00 |

## ఆర్య సమాజం

ఇది ఒక మతపరమైన స్వచ్ఛంద సేవా సంస్థ. దీనిని స్వామి దయానంద సరస్వతి అనే ఆయన 1875 వ సంవత్సరంలో బొంబాయి నగరంలో స్థాపించాడు.

స్వామి దయానంద సరస్వతి అసలు పేరు మూలశంకరుడు. ఇతడు 1824 వ సంవత్సరంలో గుజరాత్ లోని కఠియవారు ప్రాంతంలో "తంకారా" గ్రామంలో శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. శివాలయంలో శివరాత్రి రోజున ఒక ఎలుక శివుని విగ్రహం మీద పరుగెత్తుతూ ఆ విగ్రహాన్ని మలినపరచటం విషయమై తండ్రి నుంచి తనకు సరైన సమాధానం రాకపోవటం, తన కనిష్ఠ సోదరి, తనకు గురుతుల్యుడైన పెదతండ్రి చనిపోవటం మొదలైన సన్నివేశాలు అతని హృదయంలో చేరదని ముద్ర వేయడంతో, విగ్రహారాధన మోజుతగ్గి మానవ బాధా విమోచనామార్గాల నన్వేషించ సంకల్పించాడు. వివాహంపై మక్కువజూపక, ఇల్లు వదలిపెట్టి, 18 సంవత్సరాల పాటు సత్యాన్వేషణలో జీవితాన్ని గడిపాడు. అనేక ప్రదేశాలు సందర్శించాడు. సాధువులను, పండితులను చాలామందిని కలుసుకున్నాడు. చివరకు పరమానంద పరమహంస దగ్గరే వేదాంతం నేర్చుకున్నాడు. ఆ తరువాత దక్కన్ స్వామి పూర్ణానందుడు ఈ మూలశంకరునకు "దయానంద సరస్వతి" అనే నామకరణం చేశాడు. ఈ దయానంద సరస్వతి విరజానందుడనే స్వామికి శుశ్రూష చేసి సనాతన ధర్మాలను, సంస్కృత గ్రంథాల్లోని సారాంశాన్ని గ్రహించాడు. ఈ విధంగా స్వాములను, సన్యాసులను, పండితులను కలుసుకొని వేదవేదాంగాల సారాన్ని గ్రహించాడు.

ఆర్యధర్మం హిందూ ధర్మంగా, హిందువులు ఆర్యులుగా ప్రసిద్ధి కెక్కటంవల్ల స్వామి దయానంద సరస్వతి తన ఉద్యమానికి "ఆర్య సమాజం" అని పేరొకనడం అన్నివిధాల సమంజసంగా ఉన్నది. స్వామి దయానందుని కాలంలో సంఘం దురాచారాలతో, సమస్యలతో నిండి

ఉండేది. ప్రజలు అత్యధిక సంఖ్యలో పరమత బోధకుల ప్రభావానికి లోబడి హిందూ మతాన్ని వదులుకొని పరమతాలను స్వీకరించేవారు. అంతేకాక, ప్రజలు పరమతప్రాబల్యంతో కన్నుమిన్ను కానకుండా అనేక దురాగతాలకు పాల్పడేవారు. మత పునరుద్ధరణకు, భారతీయ ధర్మ రక్షణకు "స్వామి దయానంద" బద్ధకంకణుడై వివిధ స్థాయిలలో కృషి చేసి సంఘాన్ని సంస్కరించాడు.

## సంఘ సంస్కరణకై కృషి

స్వామి దయానంద సరస్వతి అనేక సంస్థలను స్థాపించి, తరువాత అనుయాయులకు మార్గదర్శకుడైనాడు. ప్రతీ మానవుడు విగ్రహారాధన చేయటం, మతంపట్ల భక్తిని చూపటం, చాలదనీ, మానవ సేవనే నిజ మైన మాధవ సేవగా భావించి ప్రజలకు సేవ చేయాలని బోధించాడు. అనేక సాంఘిక విముక్తి (Social Relief) సంస్థలను, సాంఘిక విద్యా సంస్థలను (Social Education Institutions) అనాథల సహాయక సంస్థలను స్థాపించి, ప్రజలకు అనేక విధాలుగా సహాయం చేశాడు. ఈ సంస్థలు పనిచేయడానికి చాలామంది స్వచ్ఛంద కార్యకర్తలు ముందుకు వచ్చి దయానంధునికి సహాయపడ్డారు. మహమ్మదీయులను, క్రైస్తవ, శిక్కు, ఫార్సీ, జైన, బౌద్ధ మతాలకు కూడలి అయిన అజ్మీరు పట్టణ ములో ఆర్య సమాజం ప్రసిద్ధి చెందింది. ఆర్య సమాజం అనాథ శరణా లయాలు, పారిశ్రామిక వర్క్ షాపులు, ఉపన్యాస భవనాలు, బాలికా పాఠశాలలు, అన్ని సదుపాయాలుగల ఒక వేదముద్రణాలయం మొదల యిన వాటిని నడుపుతున్నది. ఈ విధంగా దయానందుడు అనేక సంస్థ లను స్థాపించి వాటిద్వారా సంస్కరణోద్యమాన్ని నడిపి సంఘ సంస్క ర్తగా సుప్రసిద్ధుడైనాడు.

## విద్యా సంస్కరణకై కృషి

స్వామి దయానంద సరస్వతి నైతిక ఆధ్యాత్మిక మతపరమైన సంక్షేమ విద్యమాత్రమే భారతీయ యువతరానికి పటిష్ఠమయిన విద్య అని నమ్మాడు. యువతరం శీలం పటిష్ఠంగా ఉండి వారు అన్నివిధాలా

అభివృద్ధి చెందాలంటే భగవంతుని సేవమాత్రమే చాలదని, మానవసేవ అత్యంత ముఖ్యమని, తెలియజెప్పాడు. మానవునికి చతుర్విధ ఆశ్రమా లలో బ్రహ్మచర్యాశ్రమం చాలా ముఖ్యమైనదని దయానందుడు బోధించాడు. ప్రతిమానవుడు 7 మొదలు 25 సంవత్సరాల పర్యంతం తప్పనిసరిగా బ్రహ్మచర్యాన్ని అవలంబించి, విద్య నేర్చుకోవాలని చెప్పాడు. మానవుడు తనవ్యక్తిగత స్వేచ్ఛకు అధికప్రాముఖ్యాన్ని ఇచ్చి ధర్మాన్ని పాటించాలని, సమాజసేవ చేయాలని, సామాన్యసుఖాలను అనుభవించ వచ్చు కాని విశేషంగా భోగపరాయణులుగా ఉండరాదనీ, ధర్మాన్ని, సత్యాన్ని అవలంబించాలేకాని దైవత్వాన్ని పాటించరాదనీ విద్యార్థులకు తరచుగా బోధించేవాడు.

దయానందుడు తన విద్యాపథకంలో వ్యక్తిగత ఆరోగ్యానికి, ప్రాముఖ్యాన్ని ఇచ్చేవాడు. విద్యాబోధన విషయంలో ఉపాధ్యాయునికి, విద్యార్థికి అత్యంత సన్నిహిత సంబంధం ఉంటే, తండ్రికీ తనయులకు మధ్య వుండే సంబంధంవంటిది ఉండి, ప్రశాంత వాతావరణంలో విద్యా బోధన కొనసాగాలని చెప్పాడు. సంస్కృత, హిందీ భాషలకు ప్రాముఖ్యాన్ని ఇచ్చి బోధనాభాషలుగా వాటిని పెంపొందించాలని దయానందుడు తలచాడు. విజ్ఞాన సముపార్జనకు భారతీయులు ఇతర దేశాలకు స్వేచ్ఛగా పోవచ్చునని, జ్ఞానార్జనకు ప్రపంచంలో ఒక అవధి ఏర్పరచకూడదని నొక్కిచెప్పాడు. విద్యా విధానంలో ధనికుడు, పేదవాడు, ఉన్నకులంవాడు, అధమకులంవాడు అనే తరతమభేదాలను చూపకూడదనీ, అందరూ ఒకేవిధమైన విద్యను 18 సంవత్సరాలపాటు నేర్వాలనీ తెలియజెప్పాడు. విద్యను ప్రధానంగా రాజ్యాన్ని పాలించే ప్రభుత్వమే ప్రజలకు అందచేయవలెనని కూడ స్పష్టంగా చెప్పాడు.

## అస్పృశ్యతా నివారణకై కృషి

స్వామి దయానంద సరస్వతి ప్రజలలోని అస్పృశ్యతా భావనను తొలగించడానికి ఎక్కువగా పాటుపడ్డాడు. వేదకాలంలో అస్పృశ్యత, విగ్రహారాధన లేవని చెప్పాడు. మనిషి పుట్టుకనుబట్టి, వర్ణవ్యవస్థ

నిర్ణయం కాదనీ, వారి వారి గుణ, కర్మ స్వభావాలనుబట్టి నిర్ణయం జరగాలనీ తెలియజెప్పాడు. వ్యక్తి సంస్కారం, శిక్షణ, శీలం, ధర్మం - వీటిమీదనే వర్ణం ఆధారపడి ఉంటుందని వ్యక్తపరచాడు. శుభ్రత, సత్యం, త్యాగం, శాస్త్రవిజ్ఞానం, వేదాధ్యయనం మొదలయిన సద్గుణాలు శూద్రజాతిలో పుట్టినా అగ్రకులంలో ప్రవేశించడానికి అర్హుడే అని చెప్పాడు. ఈ సద్గుణాలు లోపిస్తే, అగ్రకులంలో పుట్టినా అధమ కులానికి చెందుతాడని తెలియజేశాడు. ప్రస్తుత కులవ్యవస్థ పుట్టుకను బట్టి ఏర్పడిందికాని వ్యక్తి గతగుణాలనుబట్టి విజ్ఞాన వివేకాలనుబట్టి ఏర్పడింది కాదని చెప్పాడు. వేదకాలంలో అస్పృశ్యత లేదని, దీనిని సమాజమే అవసరాన్నిబట్టి కల్పించిందనీ వేదాలు, శాస్త్రాలు, ఉపనిషత్తులు, మనుస్మృతి, భగవద్గీత మొదలయిన గ్రంథాలను ఆధారంగా చేసుకొని దయానందుడు పండిత పామరులకు నచ్చజెప్పి అస్పృశ్యతా నిర్మూలనకు తీవ్రంగా ప్రయత్నించాడు.

## స్త్రీ విద్యకై కృషి

స్వామి దయానంద సరస్వతి స్త్రీపట్ల అత్యంత గౌరవభావాన్ని ప్రదర్శించాడు. ఆర్యసమాజంలో చాలామంది స్త్రీలను చేర్చుకొని వారికి ఉన్నతస్థానాన్నిచ్చి వారిపట్ల పవిత్రభావాన్ని ప్రకటించాడు. స్త్రీల "పరదావ్యవస్థ"ను వదలిపెట్టాలని, ఆడపిల్లలకు మగపిల్లలకున్నట్లు సమాన విద్యావకాశాన్ని అందచేయాలని, 16 సంవత్సరాల లోపు వయస్సు ఉన్న ఆడపిల్లలకు వివాహం చేయరాదని, గృహం స్త్రీకి ఉన్నతస్థానాన్ని ఇచ్చి గౌరవించాలని ఉపన్యాసాలద్వారా తరచుగా బోధించేవాడు. స్త్రీలకు సంపూర్ణ దాస్యవిమోచనం కావాలని అన్ని రంగాలలోను స్త్రీలకు సమానావకాశాలు కల్పించాలని హెచ్చుగా ప్రబోధించాడు. వేదకాలంలో స్త్రీకి ఉన్నతస్థానం ఉండేదని, స్త్రీని పవిత్రమూర్తిగా ఆరాధించి గౌరవించేవారని స్త్రీలు పురుషులతో సమంగా యజ్ఞయాగాదులలో పాల్గొనేవారనీ, పురుషులతో సమంగా విద్యార్జన చేసేవారని, అందుకు తగిన ఆధారాలు వేదాలలోను, ఉపని

షత్తులలోను, స్మృతులలోను ఉన్నవనీ ప్రజలకు నచ్చజెప్పి స్త్రీల అభ్యున్నతికి పాటుపడ్డాడు.

## కులవ్యవస్థ నిర్మూలనకై కృషి

కులవ్యవస్థను అర్థం చేసుకోవటంలో మానవునికి విచక్షణా జ్ఞానాన్ని పెంపొందింపజేయుటంలో దయానంద సరస్వతి చాలా కృషి జరిపాడు. కులమనేది మానవుని పుట్టుకలో వచ్చేది కాదని, అది మనిషి వెనక అంతర్గత గుణాలు, ఆచరించే విధులు, చర్యలు, శీలం పెట్టినిబట్టి వచ్చేదనీ సంఘంలో కులవ్యవస్థ పూర్తిగా నిర్మూలనం కావాలని గట్టిగా వాదించేవాడు. కులవ్యవస్థను గురించి తన భావాలను వ్యాప్తి చేయడానికి దేశం నలుమూలల సంచరించి అనేక సభలు, సమావేశాలు జరిపి పండిత పామరులను ఒప్పించి కులం పేరిట సంఘంలో జరుగుతున్న అన్యాయాలను, అసమానతలను నిర్మూలించడానికి అధికంగా పాటుపడ్డాడు. దయానందుని సమూల సంస్కరణధోరణి కులవ్యవస్థా నిర్మూలన విషయంలో మనకు బాగా అవగాహనమవుతున్నది. ఈ విప్లవాత్మక భావాలవల్ల, అభిప్రాయాల భేదాలవల్ల, హిందూ సమాజంలో ఎన్నో కలతలు చెలరేగాయి. ఒక కొత్త సాంఘిక వ్యవస్థను సృజించే ధ్యేయంతోనే స్వామి దయానంద సరస్వతి ఆర్యసమాజాన్ని స్థాపించాడు.

## హిందూ మతోద్ధరణకై కృషి

హిందూమత రక్షణ కోసం ప్రముఖులైన ఆళ్వారులు, శంకర రామానుజ మధ్వాచార్యులు మొదలైనవారు హిందూమతంలోని విభిన్న తత్వాలను బోధించి ప్రజలను తమతమ మత బోధనలకు తిప్పు కొన్నారు.

దయానందుడు భారత దేశంలో క్రైస్తవ, మహమ్మదీయ, పార్సీ, బౌద్ధ, జైన మొదలైన మతాల ప్రాబల్యం అధికమైనా హిందువులు అధిక సంఖ్యలో ఇతర కులాలలో చేరడం, మతంపేరిట సమాజంలో అనేక దురాగతాలు సంభవించడం మొదలయిన విపత్కర పరిస్థితులను చూసి హిందూమతోద్ధరణకు కంకణం కట్టుకున్నాడు. దేశానికి ఉమ్మా

ల్యమైన సేవ చేశాడు. దయానందుని మత దృక్పథం అత్యంత అధు నాతనమై సర్వమానవజాతికి ఉపయోగకరమైనదిగా విశ్వజనీనతను పొందింది. భారతదేశంలో హిందూమతం పాశ్చాత్యుల ప్రాభవంలో క్షీణించిపోయేదశలో ఒక నూతన దృక్పథంతో హిందూజాతిని, మతాన్ని పరిరక్షించడానికి, అహోరాత్రులు పని చేశాడు. ఇతడు వేదా లను పవిత్ర గ్రంథాలుగా తలచి అవి ప్రపంచ మానవకోటిని సముద్ధ రించడానికి అవతరించినవనీ, ప్రజలు వాటిలోవుండే ఆదర్శ ధర్మాలను సత్యాలను తెలుసుకొని వాటికి అనుగుణంగా నడచుకుంటే మానవజాతి ఆనంద సౌభాగ్యాలను సాధించి మోక్షాన్ని పొందవచ్చునని గొంతెత్తి చాటాడు. ఇతడు వేద వాఙ్మయానికి, నూతన వ్యాఖ్య సమకూర్చాడు. వేదాలు, మత, సాంఘిక, ఆర్థిక రంగాలలో హెచ్చుగా ఉపయోగపడ తాయని దేశమంతా తిరిగి ప్రజలలో ప్రచారం సాగించినాడు. వేద సంస్కృతి హిందువులకు మాత్రమే పరిమితంకాదని, ప్రపంచ మానవాళి కంతటికీ సంబంధించినదని వసుధైక కుటుంబ స్థాపనకు మార్గాలను చూపగలదనీ ఉద్ఘాటించాడు. వేదసంస్కృతి, ప్రపంచ నాగరికతాభి వృద్ధికి హెచ్చుగా దోహదం చేస్తుందని చాటాడు. హిందూ సంస్కృ తికి, విశ్వఖ్యాతిని అందించి దానిని అంతర్జాతీయ మతంగా తయారు చేసిన మేధావిగా దయానందుని పరిగణించడం జరిగింది.

## ఆర్యసమాజ మిషన్

స్వామి దయానంద సరస్వతి ఆర్యసమాజాన్ని ఒక మిషన్‌గా నడిపి తన జీవితాంతం మతప్రచారానికి, సంఘ సంస్కరణకు కృషి చేశాడు. ఇతడు అంతర్జాతీయ మతబోధకుడు. సర్వమానవజాతి ఉద్ధరణకు ఆర్యసమాజ మిషన్ ఉద్భవించింది. వేదాలు ప్రపంచమానవ కోటిని సముద్ధరించడానికి అవతరించాయనీ, భారతీయ విజ్ఞానమంతా వాటిలోనే ఇమిడిఉందనీ దయానందుడు వివరించాడు. ఒక్క హిందూ జాతినికాని, మతాన్నికాని సముద్ధరించటం ఆర్యసమాజ ధ్యేయంకాదనీ ప్రపంచ మానవాళికంతటికీ ప్రబోధించి సౌభాగ్యం చేకూర్చడమే ఆర్య

సమాజం లక్ష్యమనీ చాటాడు. విగ్రహారాధనను పూర్తిగా నిషేధించాలని, కులవ్యవస్థను, అంటరానితనాన్ని నిర్మూలించాలనీ, బాల్య వివాహాలను, విధవా పునర్వివాహ నిర్బంధనలను అరికట్టాలనీ, మూఢాచారాలను ఎదుర్కోవాలనీ ఆర్యసమాజ మిషన్ ద్వారా దేశం నలుమూలలకూ ప్రచారం చేశాడు. ఇతడు తన "సత్యార్థ ప్రకాశ్" అనే గ్రంథంలో సర్వమానవజాతి సముద్ధరణ విషయంలో స్వదేశ ప్రజలు, పాశ్చాత్యులు తనకు సమానులేనని ప్రకటించాడు.

## ఆర్యసమాజ స్థాపకుని కృషిలో కొన్ని ప్రధాన లక్ష్యాలు

1. సత్యాన్ని ప్రేమించడం, అసత్యాన్ని తోసిపుచ్చడం.
2. మానవజాతి సేవకు జీవితాన్ని అంకితం చేయడం.
3. యావత్ప్రపంచ మానవకోటిని ప్రేమించడం మొదలయినవి.

దయానందుడు సంస్కృత హిందీభాషలలో అనేక గ్రంథాలను రచించాడు. వాటిలో ముఖ్యమైనవి సత్యార్థప్రకాశ్, ఋగ్వేద యజుర్వేదాల వ్యాఖ్యానం వేదాంగప్రకాశ్, సంస్కృతవాక్య ప్రబోధమ్ మొదలయినవి.

మానవజాతికి మరపురాని సందేశాలు అందించి వైదిక వాఙ్మయాన్ని కూలంకషంగా అవగాహన చేసుకోవటంలో అగ్రగణ్యుడైన దయానందుడు 1883, అక్టోబరు 30 వ తేదీన కీర్తి శేషుడైనాడు.

## క్రైస్తవ మిషనరీలు

ఇవికూడ మతపరమైన స్వచ్ఛంద సేవా సంస్థలు. భారత దేశంలో కేథలిక్ చర్చి, ప్రొటెస్టెంటు చర్చి, మెతడిస్ట్ చర్చి, తదితర క్రైస్తవ దేవాలయాలు వాటికి చెందిన మిషనరీలు, క్రైస్తవులకు, తదితరులకు సాంఘికసంక్షేమ సేవలు చేయటంలో ప్రసిద్ధమైనవి.

యేసుక్రీస్తు జీవితం అతని బోధనలు ఈ సేవాచర్యలకు ఊపిరి పోశాయి. ఏసుక్రీస్తు తన జీవితపర్యంతం మానవ సేవచేసి ప్రపంచానికి మార్గదర్శకుడైనాడు. అనేక శతాబ్దాల తరబడి సాంఘిక సంక్షేమానికి, మానవజాతి సముద్ధరణకు దుఃఖనివారణం, బానిసత్వ నివారణను,

అంటరానితనాన్ని ఎదుర్కొనడానికి మానవజాతిలో సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడానికి క్రైస్తవ మిషనరీలు ఎంతో దోహదం చేశాయి. మానవ విధులలో గౌరవం చూపడం, దరిద్రులు, దుఃఖితులు, పీడితులు, అయినవారిపై సానుభూతిని చూపి వారి దుఃఖాన్ని పోగొట్టడం మొదలైన అనేక విషయములలో క్రైస్తవ మిషనరీలు బహుముఖ సేవలను అందిస్తున్నాయి.

క్రైస్తవ మిషనరీలు భారతదేశంలో కొత్తగా ఆ మిషను స్థాపించిన వెనుకబడినవర్గాల ప్రాంతంలోను, పాదరీలు ఉండే పేటలలో ఒక పాఠశాల ఆరోగ్య కేంద్రం, అనాథ శరణాలయాలు నెలకొని ఉంటాయి. మరికొన్ని కేంద్రాలలో బలహీనులు, వికలాంగులు, కుష్టు రోగులు, వృద్ధులు ఉండటానికి గృహాలను ఏర్పరుస్తున్నాయి.

## క్రైస్తవ మిషనరీల పుట్టు పూర్వోత్తరాలు

భారతదేశంలో క్రైస్తవ దేవాలయంను క్రీస్తుశకం 5వ శతాబ్దంలో కేరళ రాష్ట్రంలో మొట్టమొదట స్థాపించారు. క్రైస్తవులు తక్కిన ప్రజలు మొత్తం ధనాన్ని పోగుచేసి సంఘ అవసరాలకు వినియోగించేవారు. ధనికులు కట్టించిన రహదారి గృహాలలో పేద ప్రయాణీకులకు ఉచితంగా ఆహారసౌకర్యాలు అందచేసేవారు.

ప్రస్తుతం ఉన్న కేతలిక్ సాంఘిక సంక్షేమ సంస్థలు 16వ శతాబ్దంలో ఆరంభమైనవి. పోర్చుగీసువారు క్రీ॥శ॥ 1516 సం॥లో "మిజరాకోర్డియో" అనే బహుళార్థ సాధక సంస్థను బీదలకు, రోగులకు, అనాథలకు, ఖైదీలకు సహాయం చేయటానికిగాను స్థాపించారు. ఈ సంస్థచేసే కృషి తక్కిన పోర్చుగీసు నివాస ప్రాంతాలకు ప్రాకింది. ఇప్పటికి గోవాలో ఈ సంస్థ కడు ఉత్సాహంతో పనిచేస్తోంది. గోవా "మిజరికోర్డియో" రెండు ప్రధాన వైద్యశాలలను, ఒక కుష్ఠురోగ కేంద్రాన్ని, మానసిక రోగుల వైద్యశాలలను 1526-1527 సం॥ల మధ్య కాలంలో స్థాపించి నడుపుతున్నది. బాలల సంక్షేమానికి కూడ ఈ సంస్థ ఎంతో కృషి చేస్తున్నది. ప్రజలుఇచ్చే విరాళాలు, పోర్చుగీసు

ప్రజలపై వేసే జరిమానాలు మొదలైన వాటిమీద ఆధారపడి "మిజరి క్రేడియో" నడుస్తున్నది.

మనదేశంలోని ఆంగ్లేయుల పరిపాలన కాలంలో మన ప్రజల సంక్షేమాన్ని నిర్లక్ష్యం చేశారు. అటువంటి సందర్భంలో క్రైస్తవ మిషనరీలు, వృద్ధులు, బలహీనులు, కుష్ఠురోగులు మొదలైన గ్రామీణ ప్రజలకు డిస్పెన్సరీలు స్థాపించి దేశమంతటా ఇంగ్లీషు విద్యను ప్రవేశ పెట్టారు. పాశ్చాత్య నాగరికతా ప్రభావంవల్ల అన్ని రంగాలలోను భారతదేశంలో పరిణామం బయలుదేరింది. సాంఘిక సంక్షేమ రంగంలో కూడ కొత్తపోకడలతో శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచుకోవటం జరిగింది. దీనికి క్రైస్తవ మిషనరీల కృషి ఎంతైనా ఉన్నది.

విద్య, వైద్యం, ధర్మసంస్థలు, సహాయక సేవ, సంఘ సంస్కరణ, సాంఘిక, ఆర్థిక కార్యక్రమాలు, సాంఘిక సంక్షేమ కృషిలో శిక్షణ మొదలైన రంగాలలో క్రైస్తవ మిషనరీలు ఎంతో కృషి చేస్తున్నాయి.

## విద్యారంగంలో కృషి

19 వ శతాబ్దినుంచి క్రైస్తవ మిషనరీలు విద్యారంగంలో ప్రవేశించి వివిధస్థాయిలలో విశేషకృషి చేస్తున్నారు. మిషనరీలు నడుపుతున్న పాఠశాలలు మనదేశంలో ఎంతో పేరొందాయి.

భారతదేశ కేతలిక్ డైరక్టరీ 1962 సం॥లో వెల్లడించిన సత్యాలను అనుసరించి 4,229 కేతలిక్ పాఠశాలలు అందులో 9,20,309 విద్యార్థులు ఉన్నట్లు తెలుస్తున్నది. ఈ విద్యార్థులు వేరువేరు కులాలకు, మతాలకు చెందినవారు, 5, 6, లక్షల ఆదిమజాతి ప్రజలను విద్యావంతులుగా చేయటం జరిగింది. "చోటా నాగపూర్" తదితర తూర్పు ప్రాంతాలలో ప్రాథమిక పాఠశాలలను స్థాపించారు. ప్రప్రథమంగా 1913 సం॥లో ఉన్నత పాఠశాలను, 1963–67 సం॥లో ఒక కళాశాలను కూడ స్థాపించారు. ఈ ప్రాంతంలో అత్యధిక విద్యార్థులు ఆదిమవాసులు. హైస్కూల్సు 32, మధ్యమిక పాఠశాలలు 132, ప్రాథమిక పాఠశాలలు 809 స్థాపించి మిషనరీలు తమ ఆధీనంలో ఉంచుకొని నడుపుతున్నారు.

మనదేశంలో ప్రొటెస్టెంటు చర్చికూడా, విద్యావ్యాప్తికోసం హెచ్చుగా కృషిచేస్తున్నాయి. "విలియంకారే" 1793 సం॥లో భారత దేశానికి రావటంతో క్రైస్తవ మిషనరీ జీవితంలో ఒక కొత్తమలుపు ప్రారంభమైంది. విద్యకు సంబంధించిన విషయాలతోపాటు "కారే" ఒక ముద్రణాలయంకూడ స్థాపించారు. ప్రొటెస్టెంటు క్రైస్తవమిషనరీలు, భారతదేశమంతటా అనేక కళాశాలలను, పాఠశాలలను స్థాపించి నడుపుతున్నారు. స్త్రీ విద్య విషయంలో "మిసస్ విల్సన్" పండిత రమాబాయి మొదలైనవారు సమాజంలో ప్రచారంచేసి స్త్రీలు విద్యాభ్యాసం చేయటానికి ప్రోత్సాహం కలిగించారు.

సాంకేతిక వృత్తిశిక్షణా విద్యలను అనేక సంస్థలద్వారా అందచేయటం జరుగుతున్నది. ప్రజలకు ఏ స్థాయికి ఆ స్థాయిలోనే శాస్త్రీయ పద్ధతులలో శిక్షణనిచ్చినట్లయితే మరి వారి సంప్రదాయ వృత్తులలో ప్రవేశం కలుగుతుంది. అని భావించారు. సాంకేతిక పాఠశాలలను దేశం నలుమూలల స్థాపించి పలురకాల కోర్సులను ప్రజలకు అందిజేస్తున్నారు. కొచ్చిన్, హైదరాబాద్, మైసూర్, తిరువేన్కూర్, తమిళనాడు, బెంగుళూరు, బొంబాయి, కలకత్తా, మొదలైన పెద్ద నగరాలలో పలురకాలైన యువకులకు శిక్షణ ఇస్తున్నారు.

## వైద్యరంగంలో కృషి

మనదేశంలో కేతలిక్ చర్చి చక్కని వైద్యసదుపాయాలను అందజేస్తున్నది. 1962 సం॥ లెక్కల ప్రకారం వైద్యశాలలు.

| | |
|---|---|
| వైద్యశాలలు | 6.151 |
| వైద్యశాలలో చేర్చుకొన్న రోగులు | 1,39,239 |
| బయటిరోగులు | 14,19,732 |
| పట్టభద్రులైన నర్సులు | 199 |
| మతానికి చెందిన డాక్టర్లు | 25 |
| మతసంబంధమయిన పట్టభద్రులైన నర్సులు | 395 |

వైద్యరంగంలో మంగుళూరులోని కేనన్ గుడిలోని ఫాదర్ ముల్లర్ ధర్మసంస్థ మార్గదర్శకమైందిగా పేరొందింది. ఈ సంస్థ కుష్ఠు రోగుల వైద్యశాల, బాలల సంక్షేమ వార్డు, హోమియోపతి పేదల డిస్పెన్సరీ, శస్త్రచికిత్స, సాధారణ వైద్యం, ప్రసూతి, టి.బి. వార్డులు మొదలైనవి నడుపుతున్నవి.

ప్రొటెస్టెంటు క్రైస్తవ మతస్థులు కూడ మంచి వైద్య సేవలను అందిస్తున్నారు. లండన మిషనరీ సంఘం చాల పేరొందింది. సూడార్ (Sudar) కుటుంబం 1819 నుంచి వైద్యసేవ చేస్తున్నది. మిషనరీ వ్యవస్థలు ప్రసిద్ధిచెందిన అనేక వైద్య కళాశాలలను స్థాపించి యువ డాక్టర్లను దేశసేవకు అందిస్తున్నాయి. కేతలిక్‌లు 1961 సం॥లో 807 మంది నర్సులకు శిక్షణ ఇచ్చినట్లు తెలుస్తున్నది. వీరు 15 కుష్ఠురోగాల చికిత్సాలయాలను, కొన్ని గృహాలను నడుపుతున్నారు. 1955 సం॥లో తమిళనాడులోని "మదురాంతకం" తాలూకాలోని "పోలంపక్కామ్" కుష్ఠురోగ నివారణా కేంద్రాన్ని స్థాపించారు. ఇది దేశమంతటిలోను ప్రసిద్ధికెక్కిన పెద్ద కేంద్రం. 5 సం॥లు గడువకుండానే 52 చికిత్సా కేంద్రాలను స్థాపించి 25 వేలమంది రోగులను పరీక్షించి 18 వేలమందికి చికిత్స చేయటం జరిగింది. ఈ కుష్ఠురోగ సహాయక విషయంలో అంత ర్జాతీయ కుష్ఠురోగ మిషన్ 1874 సం॥లో స్థాపించారు. ఈ అంతర్జాతీయ మిషన్ వివిధ దేశాలలో ఉన్న కుష్ఠురోగ కేంద్రాలకు ఆర్థిక సహాయం అందజేస్తూ ఉంటుంది. 1972 నాటికి మన దేశంలో 52 క్రైస్తవ కుష్ఠు రోగ నివారణ కేంద్రాలు ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో 8, తమిళ నాడులో 7, మధ్యప్రదేశ్‌లో 6, మహారాష్ట్రలో 5, బెంగుళూరులో 5, బీహార్‌లో 4, ఉత్తరప్రదేశ్‌లో 4, ఉత్తర పశ్చిమ ప్రాంతాలలో 4, అస్సాంలో 3, కేరళలో 2, మైసూర్‌లో 2, ఒరిస్సాలో 2 ఉన్నాయి.

క్రైస్తవ సంస్థలు ప్రజారోగ్యం కోసం పైలట్ ప్రాజెక్టులను ఎన్నింటినో స్థాపించినాయి. బాలల సంరక్షణ, ప్రసవ పూర్వ, ప్రసవా నంతర మాతృ సంరక్షణ, వైద్య నర్సింగ్ సేవలు చేస్తున్నాయి. మిష

నరీలు ప్రజారోగ్య విషయంలో అత్యంత శ్రద్ధ వహించి ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందించడానికి ప్రయత్నిస్తున్నాయి. మానసిక చికిత్సా శాస్త్రరంగాన్ని కూడ అభివృద్ధి పరచారు. మానసిక చికిత్సా వైద్యశాల ద్వారా మనిషి రోగాన్ని మాత్రమే నివారించడంగాక, మొత్తం వ్యక్తి మనస్సును, ఆత్మను కూడ పరిశీలించి అందుకు తగిన నివారణోపాయాలను కనిపెడుతున్నారు. లక్నోలోని నూర్ మంజిల్ వైద్యశాలలోని డాక్టరు ఇ. స్టాన్లీ జోన్స్ (Dr. E. Stanely Jones) మానసిక రోగాలను, నరాల జబ్బులను నివారించి పేరొందాడు.

## ధర్మసంస్థలపరంగా కృషి

కేథలిక్ ఛారిటీస్ ఇండియా సంస్థ దేశంలో ఉన్న సాంఘిక సంక్షేమ సంస్థలను సమన్వయపరచి అభివృద్ధి చేయడానికి కొన్ని కొత్త పథకాలను, ప్రాజెక్టులను అమలుపరచడానికి యత్నిస్తున్నవి. ఈ కేథలిక్ ఛారిటీస్ ఇండియా (Chathalic Charities India) అనే సంస్థను కేథలిక్స్ సహాయక సంస్థల తోడ్పాటుతో స్థాపించారు.

భారతదేశంలో క్రైస్తవ మిషనరీలు ప్రజావసరాలను తీర్చడానికి వైద్య కేంద్రాలను స్థాపించి నడపడం మాత్రమేకాక, 642 ధర్మ సంస్థలను స్థాపించారు.

480 అనాథాశ్రమాలు, 71 శిశు గృహాలు, వికలాంగులకు, అంధులకు, చెవిటివారికి మద్రాస్ అగస్టేనియన్ సిస్టర్స్ ఇనిస్టిట్యూట్, వికలాంగులకు రెండు గృహాలు, రక్షణ గృహాలు నాలుగు పేదవారయిన వృద్ధులకు 71 గృహాలు దిక్కులేని వారికి రెండు గృహాలు ఏర్పరచారు. కేథలిక్ సహాయక సేవలకు అమెరికా బిషప్పుల సహాయక సంస్థలు ప్రతినిధులుగా వ్యవహరిస్తున్నారు. ఈ సహాయక సంస్థలను 1951 వ సంవత్సరములోని, భారత – అమెరికా ఒడంబడిక క్రింద ఇండియాలో స్థాపించి నడుపుతున్నారు. సహాయక సేవలు హెచ్చుగా జాతి, మత, కులాల విభేదాలు పాటించకుండా పేదప్రజలకు, బాలలకు

ఆరోగ్యాన్ని మిషన్లల సహాయంతో అందజేస్తుంటారు. కేథలిక్కులు తమ సహాయక సేవలుగా 1962 వ సంవత్సరం "మే" నుంచి 1963 "ఏప్రిల్" వరకు గల మధ్య కాలంలో 200 లక్షల రూపాయల ఆహార పదార్థాలను, 70 లక్షల రూపాయల వైద్య సామాగ్రిని అందజేశారు.

## సాంఘిక ఆర్థిక కార్యక్రమాలు (Socio Economic Programme)

వ్యవసాయాభివృద్ధి పథకాలు, గ్రామీణ సేటిపారుదల పథకాలు, కోళ్ళ పెంపకం, పశుపోషణ, కుటీర పరిశ్రమలు, గృహ, సామాజికాభివృద్ధి పథకాలు, వృత్తివిద్యా శిక్షణ కార్యక్రమాలు, మొదలయిన వాటిని చేపట్టే మిషనరీలు ప్రజలకు అన్నివిధాల సహాయపడుతున్నారు. మన దేశంలో సుమారు 50 క్రైస్తవ సహకారసంఘాలు పనిచేస్తున్నాయి. ఈ సహకార సంఘాలు జాలరులకు, చిన్న రైతులకు, విద్యాధికులైన నిరుద్యోగులకు ఆర్థికసహాయాన్ని అందజేస్తున్నాయి. క్రైస్తవ సహకార పరపతి యూనియన్ కలకత్తాలో 1953 వ సంవత్సరంలో స్థాపితమయి ఈ మిషనరీ వ్యవస్థలో ఒక కొత్త ప్రయోగంగా రూపొందింది. ఈ సంస్థ మొట్టమొదట 40 మంది సభ్యులతో 2000 రూపాయల మూలధనంతో ప్రారంభమయి 1971 నాటికి 3000 మంది సభ్యులతో 10 లక్షల రూపాయల మూలధనంతో నడుపుతున్నది. ఈ సహకార సంఘం ఒక నర్సింగ్‌హోమ్‌ను, సహకార రొట్టెల తయారీ పరిశ్రమను, సహకార గృహాలసంఘాన్ని నడుపుతున్నది. కేతలిక్ సహకార పరపతి సంఘం 1909 వ సంవత్సరంలో రాంచిలో స్థాపితమై వ్యవసాయాభివృద్ధికి సహాయపడుతున్నది.

## సాంఘిక సంక్షేమ కృషిలో శిక్షణ

సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు విజయవంతంగా నిర్వహించాలంటే, శిక్షణపొందిన సిబ్బంది వాటిని చేపట్టడం చాలా అవసరం. క్రైస్తవ చర్చి సాంఘిక సంక్షేమ కార్యకర్తలకు వృత్తివిద్యా శిక్షణ

లివ్వటం ప్రధాన విషయమని భావిస్తున్నది. ప్రసిద్ధులైన అనేక మత బోధకులు, సమాజ సంక్షేమశాస్త్రంలో శిక్షణపొందారు. క్రైస్తవుల ఆధ్వర్యంలో సాంఘిక సంక్షేమ రంగంలో కృషిచేసే కార్యకర్తలను తయారుచేసే సంస్థలు ఈ కింద పొందుపరచిన విధంగా ఎన్నో స్థాపితమైనాయి.

1. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సర్వీస్, నిర్మల్ నికేతన్, బొంబాయి.
2. స్టెల్లా మేరీస్ స్కూల్ ఆఫ్ సర్వీస్, మద్రాసు.
3. ది గ్జేవియర్ లేబర్ రిలేషన్సు ఇన్‌స్టిట్యూట్, జెమ్‌షెడ్‌పూర్.
4. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్, మద్రాసు.
5. గ్జేవియర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సర్వీసెస్, రాంచి.
6. లయోలా కాలేజి ఆఫ్ సోషల్ సైన్సెస్, తిరువేంద్రం.
7. సెయింట్ ఫిలోమేనస్ కాలేజి (గ్రాడ్యుయేట్ కోర్సెస్ ఇన్ సోషల్ సర్వీసు) మంగుళూరు.
8. ఫాతిమా మాతా నేషనల్ కాలేజి (గ్రాడ్యుయేట్ కోర్సెస్ ఇన్ సోషల్ సర్వీసెస్) క్విలన్.
9. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సర్వీస్, సెయింట్ జోసెఫ్ కాలేజి, తిరుచునాపల్లి.
10. ఢిల్లీ స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్స్. అమెరికా వై. ఎమ్. సి. ఎ. సహాయంతో నెలకొల్పడం జరిగింది. భారతీయ (YMCA) 1947 సం॥లో (YMCA) వై. ఎమ్. సి. ఎ. గ్రామీణ పునర్నిర్మాణ కృషిని 1896 వ సం॥లో చేపట్టింది. యంగ్ క్రిష్టియన్ వర్కర్స్ మూవ్‌మెంట్ (YCWM) ట్రేడ్ యూనియన్‌ల కిందికి శ్రామికులను చేర్చి వారికి సేవచేస్తున్నది. ఇంతేకాక సిరియన్ చర్చికూడ మద్యపానంవల్ల మత్తుమందులవల్ల సంభవించే అపాయాలను ప్రజలకు బోధిస్తున్నది.

పండిత రమాబాయి, రెవరెన్స్ నారాయణ్ వామనతిలక్, సాధూ సుందరసింగ్, వేదనాయగం శామ్యూల్, అజిరియన్ బిపిన్

చంద్ర సర్కార్, జేనియన్ స్వామిదాస్, సురేంద్రకుమార్ దత్తా, బిషప్ జస్వంతరావ్ చితాంబర్, ఎ. ఎమ్. కార్కి మొదలయినవారు క్రైస్తవ మిషనరీ నాయకత్వ సారథ్యాన్ని వహించి అంతర్జాతీయఖ్యాతిని పొందిన భారతీయులు. మరి తమ పవిత్ర జీవితాలను క్రైస్తవ మిషనరీ సేవలకు అంకితంచేశారు.

## రెడ్ క్రాస్

ఇండియన్ రెడ్ క్రాస్ సంస్థ "బాధలను లేదా బాధపడే వారిని తగ్గించాలనే ధ్యేయంతో వెలిసింది. మానవతా దృక్పథంతో చూసిన ట్లయితే రెడ్ క్రాస్ పరిధి అవధులు లేనిది. కాని కొన్ని కారణాంత రాలవల్ల ఇది అంతగా సేవలనందించలేకపోతున్నది. ఈ సంస్థ ఇప్పుడు బాగా స్థిరపడింది. ప్రమాదాలలోను (Calamities) చిక్కులలోను చిక్కుకున్న ప్రజలకు ప్రభుత్వంవారు అందించే సేవలకు (మద్దతునిస్తూ) చేయూతనిస్తూ, ఒక దాతృత్వ సంస్థగా ఇది తన కృషిని సాగిస్తున్నది. భారతదేశానికున్న ప్రత్యేక పరిస్థితులవల్ల రెడ్ క్రాస్ సంస్థ ప్రకృతి వైపరీత్యాలలోను, కరువు కాటకాలు, పేదరికంవంటి విపత్కర పరిస్థితు లలో చిక్కుకున్న ప్రజలకు, సేవల నందించడమవుతున్నది.

భారత రెడ్ క్రాస్ సంఘాన్ని 1920 సంవత్సరంలో స్థాపించడం జరిగింది. ఈ రెడ్ క్రాస్ సంఘానికి భారత రాష్ట్రపతి అధ్యక్షత వహిస్తు న్నారు. 1953 వ సంవత్సరంలో 25 రాష్ట్రాలలోను 312 జిల్లాలలోను ఈ సంఘం శాఖలను నెలకొల్పటం జరిగింది. రాష్ట్ర, జిల్లా శాఖలకు గౌరవ కార్యదర్శులు, కార్యకర్తలు ఉంటారు.

## రెడ్ క్రాస్ సాంప్రదాయాలు (Red Cross - Cenventions)

జెనీవాలో 1949 అగస్టులో అంతర్జాతీయ రాయబారుల సమా వేశం జరిగింది. ఆ సమావేశానికి 63 రాజ్యాల ప్రతినిధులు హాజరయి నారు. యుద్ధానికి బలి అయిన కుటుంబాల సంక్షేమం కోసం నాలుగు పటిష్ఠమయిన సంప్రదాయాలను (Conventions) ఏర్పాటు చేసుకోవ డము జరిగింది. ఈ సంప్రదాయాలు మానవతా సూత్రాల యదార్థ

స్వరూపాన్ని, ప్రాముఖ్యాన్ని ప్రకటిస్తున్నాయి. ఆధునిక యుద్ధ న్యాయ శాస్త్రం విస్తారంగా అభివృద్ధిచెందటానికి ఈ సంప్రదాయాలు దోహదం చేస్తున్నాయి. 427 నిబంధనలతో ఉన్న ఈ నాలుగు సంప్రదాయాలకు 1971 నాటికి 71 రాజ్యాలు కట్టుబడి ఉన్నాయి. భవిష్యత్తులో ప్రతీ నాగరిక రాజ్యం కూడా ఈ సంప్రదాయాలకు కట్టుబడి ఉంటుందని ఆశించవచ్చు. ఈ నాలుగు సంప్రదాయాలను ఈ కింద పొందుపరచటం జరిగింది.

1. "యుద్ధరంగంలో క్షతగాత్రులు, వ్యాధిగ్రస్తులు అయిన సైనికుల బాధానివారణకు"
2. "సముద్రంలో ఓడ బద్దలయినా, ఆయుధ దళాల సభ్యులు క్షతగాత్రులయినా, వ్యాధిగ్రస్తులయినా వారిని ఆ పరిస్థితులనుంచి వారి బాధలను నివారణ చేయటం కోసం"
3. "యుద్ధ ఖైదీలకు సాపేక్షమైన ఆదరణ చూపటం కోసం"
4. "యుద్ధకాలంలో పౌరులకు సాపేక్షమైన రక్షణ కల్పించడంకోసం".

ఈ నాలుగు సంప్రదాయాలు 1950 వ సంవత్సరం అక్టోబరు నెలలో అమలులోకి వచ్చాయి. ప్రస్తుతం ఈ సంప్రదాయాలను యుద్ధ న్యాయశాస్త్రంలో ప్రధాన భాగంగా పరిగణిస్తున్నారు. అంతే కాకుండా, మానవతా సూత్రాలయిన న్యాయం, కరుణ, ప్రతీ మానవుడు తనతోటి మానవునిపట్ల చూపవలసిన ఆదరణ మొదలయినవి పాటించినట్లయితే మానవ నాగరికతకు సార్థకత ఉంటుంది.

## రెడ్‌క్రాస్ సంఘం సేవలు

ఈ సంస్థ 1931 వ సంవత్సరంలో విపత్తి సహాయక ప్రణాళిక (Disaster Relief Plan) ప్రవేశపెట్టి అత్యావసర సహాయనిధిని (Emergency Relief Fund) స్థాపించినది. బీహార్, క్వెట్టా భూకంపాల సందర్భంలో ఈ సంస్థలోని కార్యకర్తలు అద్భుతమైన సేవలు చేశారు. 1943 వ సంవత్సరంలో సంభవించిన బెంగాల్ క్షామంలోను, 1947 లో దేశ విభజన జరిగిన సందర్భంలోను, పంజాబ్‌లో జరిగిన

అటజనుల సందర్భంలోను, అధిక ప్రమాణంలో ఆపత్సహాయక చర్యలను ఈ సంస్థ అమలుజరిపింది. 1950 వ సంవత్సరంలో అస్సాంలో సంభవించిన భూకంపం సందర్భంలోను, వరదలలోను రెడ్‌క్రాస్ సంస్థ మందులు, పాలపొడి, ఆహార పదార్థాలు, దుప్పట్లు మొదలయినవాటిని అందజేసి అనేక సహాయక చర్యలను చేపట్టడం జరిగింది. అంతేకాక 1957 వ సంవత్సరంలో మళ్ళీ వివిధ రాష్ట్రాలలో వరదలు, క్షామాలు, కలగడంవల్ల ఈ సంస్థ 3.7 మిలియన్‌ల రూపాయలను సహాయం అందజేసింది. బాలల, మహిళల సంక్షేమ విషయంలో 700 సంక్షేమ ప్రసూతి కేంద్రాలు పనిచేస్తున్నాయి. భారత రెడ్‌క్రాస్ సంఘం బాధలలో క్రుంగినవారికి చక్కని ఉపశమన సేవలు అందజేస్తున్నది. ఈ సంస్థ కుష్ఠురోగులకు, క్షయరోగులకు, వికలాంగులకు వైద్యసదుపాయాలను సమకూర్చి చక్కనిసేవ నందిస్తున్నది. ఈ విధంగా భారత దేశ రెడ్‌క్రాస్ సంఘం బహువిధమైన సేవలను చేస్తోంది.

## కాందిశీకుల సంక్షేమ కృషి

బ్రిటిషు పరిపాలననుంచి బంధవిముక్తి జరిగినపిదప, భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినపుడు, 1947 వ సంవత్సరంలో పాకిస్థాన్ నుంచి కాందిశీకులు పెద్దఎత్తున ఇండియాకు తరలిరావటం జరిగింది. సరిహద్దు ప్రాంతాలలో అల్లర్లు చెలరేగటంవల్ల దేశంలో సంక్షోభమేర్పడింది. ఈ సందర్భంలో రెడ్‌క్రాస్ సంస్థ కాందిశీకుల సహాయకచర్యలు చేయటంలో ప్రధానపాత్ర వహించింది. శిక్షణపొందిన సెయింట్ జాన్ సిబ్బంది కాందిశీకుల క్యాంపులలో వైద్యసహాయాలను అందజేసింది. అంతేకాక కాందిశీకులకు పోషకాహార పదార్థాలను, వస్త్రాలను, అందజేసి వారికి తాత్కాలిక వసతిసౌకర్యాలను సమకూర్చింది. అప్పట్లో ప్రభుత్వం నెలకొల్పిన క్యాంప్‌లలో కురుక్షేత్ర క్యాంప్ ప్రధానంగా పేర్కొనదగింది. ఈ క్యాంప్‌లో మూడులక్షలకుపైగా ఉన్న కాందిశీకులకు విరామంలేకుండా సహాయకసేవలను చేశారు. ఈ క్యాంప్‌లలో, ఈ రెడ్‌క్రాస్ సంఘం ప్రసూతి, బాలల వృద్ధుల సంక్షేమ సౌకర్యాలను

సమకూర్చడానికి నర్సులను, హెల్త్ విజిటర్లను, ఆయాలను నియమించి అనేకవిధాల వారి సంక్షేమానికి పాటుపడ్డారు.

తూర్పు పాకిస్తాన్ నుంచి 1964 మార్చిలో అల్పసంఖ్యాక సముదాయాలకు చెందిన ప్రజలు భారతదేశానికి కాందిశీకులుగా వచ్చారు. వారి సంక్షేమార్థం భారత రెడ్‌క్రాస్ సంఘం ప్రత్యేక వైద్య నిపుణుల బృందాన్ని మధ్యప్రదేశ్‌లోని రాయపూర్ క్యాంపులకు పంపి వారికి చక్కని సహాయాన్ని అందజేసింది.

1971 వ సంవత్సరంలో పశ్చిమ పాకిస్తాన్ సైనిక నియంతల బాధలకు తాళలేక బంగ్లాదేశ ప్రజలు సుమారు ఒక కోటి మంది కాందిశీకులుగా వచ్చి భారతదేశంలో తలదాచుకొన్నారు. అంతేకాకుండా పాకిస్తాన్ ఇండియా మీద యుద్ధ ప్రకటనచేసి భారీ ఎత్తున తలపడిన సందర్భంలో రెండు వైపుల పోరాటం యుద్ధ సైనికులు బాగా నష్టపడ్డారు. చాలామంది క్షతగాత్రు లయినారు. భారత రెడ్‌క్రాస్ సంస్థ నెలల తరబడి ఇండియాలో ఉండిపోయిన కాందిశీకులకు, క్షతగాత్రు లయిన సైనికులకు అత్యద్భుతమైన సహాయక చర్యలను జరిపింది. ఇట్లాంటి కాందిశీకుల సంఖ్యను భారతదేశం ఎన్నడూ ఊహించి ఎరగదు. ఇంతటి విపత్కర పరిస్థితిని ఎదుర్కోవడానికి రెడ్‌క్రాస్ సంఘం వహించిన పాత్ర భారతదేశ చరిత్రలో మరువరానిది.

## విపత్తి సహాయక కార్యాలు (Disaster Relief Works)

వరదలు, క్షామాలు, అగ్నిప్రమాదాలు మొదలయిన ప్రకృతి వైపరీత్యాలకు గురి అయిన ప్రజలకు మాత్రమే కాకుండా భారతీయ రెడ్‌క్రాస్ సంఘం వికలాంగులకు, అనాథలకు, పోషణలేని పేదప్రజలకు కూడా తగిన సంక్షేమ సేవలనందిస్తుంది. అనేక బాలల సంక్షేమ కేంద్రాలు, వైద్యశాలలద్వారా, పాఠశాలలు మొదలయిన వాటి ద్వారా బాలల సంక్షేమానికి పాలపొడిని అందజేస్తున్నాయి. (గత) 20 సంవత్సరాల కాలంలోను ఈ సంఘం 30,000 టన్నుల పాలపొడిని అందజేసింది. సరాసరిని ప్రతి సంవత్సరం 300 వైద్యశాలలు, డిస్పెన్సరీలు,

పాఠశాలలు, అనాథ శరణాలయాలు మొదలయిన వాటిద్వారా మందులను, ఆహార పదార్థాలను ఆపదలో ఉన్నవారికి అందజేయటం జరుగుతున్నది. క్షతగాత్రుల, రోగగ్రస్తుల సంరక్షణను ప్రధాన బాధ్యతగా ఈ సంఘం గుర్తిస్తున్నది.

## అంబులెన్సు విభాగం

సెయింట్ జాన్ అంబులెన్స్ సమితి (St. John Ambulance Association) రెడ్‌క్రాస్‌లోని అంబులెన్స్ విభాగంగా పనిచేస్తూ మానవతా దృక్పథంతో చక్కని కృషి చేస్తున్నది. ఈ సమితి లక్షలాది వ్యక్తులకు ప్రథమ చికిత్స చేస్తున్నది. నర్సింగ్ వృత్తిలో చాలా మందికి శిక్షణ ఇస్తున్నది. అంబులెన్సు దళంలోని సభ్యులందరికీ ఒకే రకమైన శిక్షణ ఇవ్వటం జరుగుతుంది. వారు ప్రజలకు యాత్రాస్థలాలలోను, సంతలలోను, బహిరంగసమావేశాలలోను, క్రీడా కేంద్రాలలోను అవసరమైనప్పుడు ప్రథమ చికిత్స చేస్తారు. క్షయ, కేన్సర్ మొదలయిన ప్రమాదకర రోగాలకు ఉచిత వైద్య సదుపాయాలను కలిగించడం జరుగుతుంది.

రెడ్‌క్రాస్ ఉద్యమం విశ్వజనీన దృక్పథంలో దేశం చైతన్యవంతమై వర్ధిల్లడానికి ఎప్పుడూ కృషి చేస్తూనే ఉంటుంది. అందువల్ల భారత రెడ్‌క్రాస్ సంఘం దేశంలో అనేక సహాయక కార్యక్రమాలు చేపట్టినప్పటికి ఇతర దేశాలు ఆపదలో ఉన్నప్పుడు సహాయపడటానికి ముందంజ వేస్తుంది. 1947 వ సంవత్సరంలో మొదలుపెట్టి ఇప్పటికి మొత్తం 6 లక్షల రూపాయల వరకు ఇతర దేశాలవారికి సహాయం చేయడం జరిగింది.

మానవ సమాజంలో సహాయక కార్యక్రమాలను చేపట్టి నిర్వర్తించడానికి అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంస్థలయిన "లీగ్ ఆఫ్ రెడ్‌క్రాస్ సొసైటీస్" (League of Redcross Societies) ఇంటర్నేషనల్ కమిటీ ఆఫ్ ది రెడ్‌క్రాస్ (International Committee of the Redcross), నేషనల్ రెడ్‌క్రాస్ సొసైటీస్ (National

Redcross Societies), స్వచ్ఛంద సంస్థలు, ప్రజా ప్రభుత్వాలు మొదయినవాటి సహకారం ఎంతైనా అవసరం.

సమాజసంక్షేమ కృషిలో రెడ్‌క్రాస్ సంఘం పాత్ర అద్వితీయమైంది, ప్రశంసించదగింది. ఈ సంఘం చేసే సంక్షేమసేవా కార్యక్రమాలు విశ్వవిఖ్యాతిచెంది, విశ్వమానవ కళ్యాణానికి, సర్వమానవ సౌభాగ్యానికి తోడ్పడుతున్నాయని చెప్పడంలో అతిశయోక్తిలేదు.

## సర్వోదయం

సర్వోదయమనే పదాన్ని మొట్టమొదట మహాత్మాగాంధి ఉపయోగించాడు. జాన్ రస్కిన్ వ్రాసిన "అన్ టు ది లాస్ట్ (un to the last) అనే పుస్తకాన్ని "సర్వోదయం" అని వ్యవహరించాడు.

సర్వోదయం అనే పదం సర్వ ఉదయ అనే రెండు సంస్కృత పదాల నుంచి ఉద్భవించింది. "సర్వ" అంటే అందరు (సమస్తము) "ఉదయ" అంటే ఉదయించటం అని అర్థం. కాబట్టి సర్వోదయం అనే పదానికి అందరి ఉదయం లేదా అందరి సంక్షేమమని అర్థం. "సర్వేజనాః సుఖినోభవంతు" అనే సంస్కృత మంగళవాచకం కూడ సర్వోదయం మూలభావాన్ని సూచిస్తున్నది.

మహాత్ముని తరువాత సర్వోదయ సిద్ధాంతాన్ని వ్యవహారంలో పెట్టడానికి హెచ్చుగా తోడ్పడినవాడు ఆచార్య వినోభాభావే. భూదాన ఉద్యమంతోపాటు ఈ సర్వోదయాన్ని దేశం నలుమూలల ప్రచారం చేసి వ్యాప్తికి తీసుకొనిరావటం జరిగింది. నేడు సర్వోదయమంటే ఒక సాంఘిక జీవితతత్త్వంగా మానవహృదయాంతరాలలో మెలగుచున్నది. ఈ సర్వోదయ కార్యక్రమాలు సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలను పూర్తిగా ఆవరించాయి. సర్వోదయం నేటి సాంఘిక నిర్మాణంలో విప్లవాత్మకమైన మార్పును తీసుకురావాలనే ఆశయంతో ఉంది. విప్లవాత్మకమైన మార్పును తీసుకురావాలనే ఆశయంతో ఉంది. ఒక కొత్త సాంఘిక వ్యవస్థను (Social Order) గ్రామీణ స్థాయిలో ఒక కొత్త సాంఘిక వ్యవస్థను స్థాపించడానికి, ప్రత్యేకించి సంఘకృషిద్వారా అహింసాత్మక విప్లవాన్ని తీసుకొనిరావడానికి ఇది తోడ్పడుతుంది.

సర్వోదయాన్ని చారిత్రాత్మక దృష్టితో చూసినట్లయితే అది భారతీయ ఆధ్యాత్మిక సంప్రదాయంతో ముడిపడి చాలా సన్నిహితత్వాన్ని కలిగి ఉన్నట్లు గోచరిస్తుంది. సత్యం అనే పదానికి ప్రతిరూపంగా హరిశ్చంద్రుడు, అహింస అనే పదానికి మారురూపంగా వసిష్ఠుడు ఆదర్శ పురుషులుగా గోచరించడంవల్ల గాంధీమహాత్ముడు వారిని ఆదర్శంగా చేసుకొని సత్యం - అహింస అనే పదాలను ఆయుధాలుగా ఉపయోగించి భారత రాజకీయ, ఆర్థిక, సాంఘిక, స్వాతంత్ర్యాల కోసం పాటుపడ్డాడు. బౌద్ధమత స్థాపకుడైన గౌతమ బుద్ధుడు. జైన మతస్థాపకుడైన మహావీరుడు అహింస - ప్రతి మానవుని దైనందిన జీవితాలను క్రమబద్ధము చేసేది అని, కారుణ్యం సాంఘిక ధర్మాన్ని పాలించేది అని ప్రపంచమంతటా ప్రబోధించారు. భారతదేశ చరిత్రలో మధ్య యుగంలోని ముస్లిమ్ మతస్థులు దైవభక్తి దాతృత్వం, అధ్యాత్మికం, సోదరభావం మొదలైన వాటికి ప్రాముఖ్యమిచ్చారు. క్రైస్తవ మతం కూడా అహింసకు, ప్రేమకు, పేదల సేవకు, దీనజనుల సేవకు అధిక ప్రాముఖ్యానిస్తుంది.

సర్వోదయం అటు సనాతన సర్వమత సంప్రదాయాలను ఇటు ఆధునాతన జాతీయ మతరహిత మానవ సిద్ధాంతాలను ఆధారంగా చేసుకొని స్థాపితమైనటువంటిది. సాంఘిక సేవయే దాని ప్రధానాశయం. అందువల్ల సర్వోదయమంటే సాంఘిక సంక్షేమ సేవ లేదా సాంఘిక సంక్షేమ కృషి అని కూడా చెప్పవచ్చు. ఈ సర్వోదయమనే పదం గాంధీ మహాత్ముడు కొత్తగా సృష్టించిందికాదు. దీనిని ఆచార్య "సమంతభద్రుడు" అనే జైనమత బోధకుడు క్రీస్తు తరువాత 2 వ శతాబ్దిలో వ్రాసిన రచనల నుంచి తీసుకొనడం జరిగింది. అంతేకాక—ఈ సర్వోదయ తత్వాన్ని "ఈశావాస్యోపనిషత్" (Ishavasyo Panishad), భగవద్గీత మొదలయిన భారతీయ మత గ్రంథాలు చిరకాలం నుంచి ప్రబోధిస్తున్నాయి.

గాంధీ మహాత్ముడు దక్షిణాఫ్రికాలో జాతి కలహాలను, ఆర్థిక వ్యత్యాసాలను, భేదాభిప్రాయాలను నిర్మూలించడానికి గాంధీ

హెచ్చుగా కృషి చేశాడు. గాంధీ దక్షిణాఫ్రికాలో ఉండగా 1904 వ
సంవత్సరంలో రస్కిన్ పండితుడు వ్రాసిన "అన్ టుది వాస్ట్" పుస్త
కాన్ని చదవటం, తటస్థించింది. ఆ పుస్తకం గాంధీ హృదయానికి
గాఢంగా హత్తుకున్నది. తన జీవితాన్ని పుస్తకంలో ఉన్నత ఆదర్శా
లకు అనుగుణంగా మార్చుకోవాలని దృఢ సంకల్పం కలిగింది. ఆ పుస్త
కంలోని బోధనలను గాంధీ చక్కగా అవగాహన చేసుకున్నాడు.
మొట్టమొదట తనను బాగా ఆకర్షించిన ప్రబోధమేమిటంటే "ఒక
వ్యక్తి మంచి అనేది అందరి మంచితనం మీద ఆధారపడి ఉంటుంది."
అందువల్లనే గాంధీ "అన్ టు ది వాస్ట్" అనే పుస్తకాన్ని గుజరాత్ లో
వ్రాసి సర్వోదయమనే నామకరణం చేయటం జరిగింది.

రెండో ప్రబోధమేమిటంటే - "ఒక న్యాయవాది చేసే కృషి
ఎంత విలువైందో ఒక క్షురకుడు చేసే కృషి కూడ అంతే విలువైనది.
వారిద్దరికి ఒకే రకమైన జీవితాదర్శంతో తమ కృషి మీద తాము
జీవించే హక్కు ఉంటుంది.

మూడో ప్రబోధం - భూమిదున్నే రైతు, చేతివృత్తులపై
ఆధారపడేవాడుకూడా ఒకేరకమైన శ్రమజీవులకిందికి వస్తారు. అందరూ
సంతోషంగా ఉండాలని భగవంతుని ప్రార్థించడం మాత్రమే కాదని,
న్యాయ, సమానతలమీద, ఆధారపడి స్థాపించిన సంఘాన్ని సృష్టించడం
ప్రతిఒక్కరి కర్తవ్యం కావాలనీ ప్రబోధించాడు.

మహాత్మాగాంధీ దక్షిణాఫ్రికాలోని "ఫోనిక్సు" (Phoenix)
స్థావరంలో అన్ టు ది వాస్ట్ పుస్తకంలో ఉన్న భావాలను ఆచరణ
లోనికి తీసుకొనిరావటం జరిగింది. గాంధీజీ దక్షిణాఫ్రికాలో ఉండగానే
సర్వోదయ తత్వానికొక రూపాన్ని సృష్టించాడు.

## గాంధీ శకంతో సర్వోదయం

దక్షిణాఫ్రికానుంచి 1915 వ సంవత్సరంలో భారత దేశానికి వచ్చిన
తరువాత సాంఘిక సంక్షేమకృషికి హెచ్చుకాలాన్ని వెచ్చించేవాడు.
కొంతకాలం "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ"లో చేరి కొద్దికాలం

లోనే ఆ సంఘంనుంచి బయటకువచ్చి, 1920 సం॥లో సత్యా అహింసలు సత్యాగ్రహం అనే ఆయుధాలతో భారత స్వాతంత్ర్య రంగంలోనికి దుమికాడు. సామూహిక, సమాజ సమైక్యతలకు అధిక ప్రాధాన్యత ఇచ్చి. జాతి, మత, కుల, విభేదాలుకాని, స్త్రీ, పురుష విచక్షణగాని లేకుండా అందరూ సంఘంలో సమానమనే సమరసభావాన్ని పెంపొం దింపచేశాడు. అస్పృశ్యత నివారణ, మద్యపాన నిషేధం, మొదలైన సాంఘిక సమస్యల నిర్మూలనానికి హెచ్చుగా కృషిచేశాడు. గ్రామీణ పరిశ్రమలు, గ్రామపారిశుద్ధ్యం, బేసిక్ విద్య స్త్రీ విద్య, స్త్రీ స్వాతంత్ర్యం మొదలైన విషయాలకు అధికప్రాధాన్యంఇచ్చి పాటుపడ్డాడు. పారిశ్రామిక కూలీల సంక్షేమానికి, కుష్టు, గుడ్డి, వికలాంగుల గిరిజనుల మొదలైన వారి సంక్షేమానికి అధికమైన కృషిచేశాడు. ఈ విధంగా సంఘసంక్షేమ కృషి నిమిత్తమై గాంధి మహాత్ముడు "ఆల్ ఇండియా స్పిన్నర్స్ అసోసియేషన్" "అఖిలభారత హరిజనసేవా సంఘం", "హిందుస్థాని ప్రచారసభ", "అఖిలభారత గో సేవాసంఘం" మొదలైన సంస్థలను స్థాపించి ఎన్నో స్వచ్ఛంద సంక్షేమ కార్యకర్తలను తయారుచేశాడు. సమాజ సంక్షేమ కృషికి నిస్వార్థ స్వచ్ఛంద సంక్షేమ కార్యకర్తల అవసరం ఎంతఅయినా ఉందని ప్రబోధించాడు. దేశంలో అట్టడుగున ఉన్న వెనుకబడిన జాతుల పునర్నిర్మాణం జరిగిననాడే భారతదేశం స్వతంత్ర స్వరాజ్యం సాధించగలుగుతుందని ఉద్బోధించాడు.

## వినోబాభావే శకంలో సర్వోదయం

భూదాన, గ్రామదాన ఉద్యమాలు :-

గాంధీమహాత్ముని అస్తమయ అనంతరం 1948 వ సంవత్సరంలో మహాత్ముని మహదాశయాలపై ప్రగాఢ విశ్వాసం గలవారందరూ కలిసి రాజకీయాలతో సంబంధం లేకుండా "సర్వోదయ సమాజం" అనే ఒక సంస్థను స్థాపించడం జరిగింది. అఖిలభారత సర్వసేవాసంఘం (Akkil Bharat Sarva Seva Sangh)అనే మరొక సంస్థను స్థాపించి, గాంధీజీ

స్థాపించిన సంస్థలన్నింటిని ఈ సంస్థలో కలిపి దానిని ఏకైక సమాజ సంక్షేమ సేవా సంస్థగా ఏర్పరిచారు.

చారిత్రాత్మకమైన ఈ భూదాన ఉద్యమాన్ని ఆచార్య వినోభా భావే తే 15-4-1951 న ఆంధ్రప్రదేశ్ లోఉన్న శివరాంపల్లిలో ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్ లోని నల్గొండ జిల్లాలలోని పోచంపల్లి గ్రామం ఈ ఉద్యమానికి పుట్టినిల్లు.

## భూదానోద్యమంవల్ల సేకరించిన భూముల వివరాలు (31 మార్చి, 1964 వరకు)

| రాష్ట్రం | సేకరించిన పరిమాణం (ఎకరాలు) | పంచిపెట్టిన భూమి పరిమాణం (ఎకరాలు) | ఉపయోగించే ప్రమాణం (unit for use) (ఎకరాలు) | పంచవలసిన భూమి (ఎకరాలు) |
|---|---|---|---|---|
| అస్సాం | 11,935 | 265 | — | 11,670 |
| ఆంధ్రప్రదేశ్ | 2,51,951 | 82,111 | 84,310 | 85,530 |
| ఉత్కల్‌రాష్ట్రం | 1,57,460 | 51,102 | 11,221 | 95,137 |
| కేరళ | 26,293 | 5,774 | 7,999 | 12,520 |
| తమిళనాడు | 80,433 | 21,519 | — | 58,914 |
| ఢిల్లీ | 300 | 180 | 120 | — |
| పంజాబ్ | 14,739 | 3,601 | 3,380 | 7,758 |
| గుజరాత్ | 1,03,530 | 50,984 | 27,994 | 24,552 |
| మహారాష్ట్ర | 1,50,394 | 1,02,212 | 34,797 | 13,885 |
| మధ్యప్రదేశ్ | 4,04,662 | 1,39,988 | 1,46,087 | 1,18,587 |
| కర్ణాటక | 20,086 | 3,123 | 53 | 16,910 |
| బెంగాల్ | 12,887 | 3,825 | 8,246 | 636 |

| రాష్ట్రం | సేకరించిన పరిమాణం (ఎకరాలు) | పంచిపెట్టిన భూమి పరిమాణం (ఎకరాలు) | ఉపయోగించే ప్రమాణం (unit for use) (ఎకరాలు) | పంచవలసిన భూమి (ఎకరాలు) |
|---|---|---|---|---|
| బీహార్ | 21,32,772 | 2,77,660 | 10,46,332 | 8,08,780 |
| రాజస్థాన్ | 4,30,437 | 97,774 | 91,374 | 2.41,289 |
| హిమాచల్ ప్రదేశ్ | 5,240 | 2,531 | — | 3,709 |
| జమ్ము మరియు కాశ్మీర్ | 5 | 5 | — | — |
| | 42,97,475 | 10,50,240 | 14,87,736 | 17,90,315 |

1952-58 సంవత్సర మధ్య కాలములో భూదానోద్యమ ప్రాబల్యం గ్రామ దాన ఉద్యమం (Gramadan Movement) కూడ ఆవిర్భవించింది. గాంధీ ప్రబోధించిన భూమి ఆస్తి కూడ ధర్మకర్తృత్వ సిద్ధాంతానికి (Theroy of Trusteeship) భూదాన, గ్రామదాన ఉద్యమాలను గ్రామీణ సమాజంలో విప్లవాత్మక చర్యలుగా పరిగణించడం జరిగింది. గ్రామదాన ఉద్యమానికి 1965 సంవత్సరం నాటికి 8,000 గ్రామాలను దానంగా ఇచ్చినట్లు తెలుస్తుంది. భూదాన, గ్రామదాన ఉద్యమాలతో సేకరించిన భూములను వ్యక్తిగత ఆధీనం నుంచి గ్రామసభకు అందజేయటం జరుగుతున్నది. గ్రామదాన ఉద్యమంతో గ్రామాలలో సంపూర్ణ స్వయం పరిపాలన అంటే గ్రామ స్వరాజ్యాన్ని స్థాపించడం జరుగుతున్నది. గ్రామస్థులందరూ స్వయం పోషకంగా ఉంటూ – విద్య, ఆరోగ్యం, పారిశుద్ధ్యం, వైద్యం న్యాయ సంరక్షణ మొదలైన సమస్యలను తమంతట తామే పరిష్కరించుకుంటూ, గ్రామీణ పరిశ్రమలను, ఖాదీ ఉద్యమాన్ని ప్రోత్సహించి గ్రామంలో నిరుద్యోగ సమస్యను లేకుండా చేస్తారు.

సర్వోదయ ఉద్యమం ప్రారంభంలో భూ సమస్యను చేపట్టడం జరిగింది. హృదయ పరివర్తనపై ఈ సమస్యా పరిష్కారం ఆధారపడి ఉంది. భూదానం ఇందుకు మార్గం. ఇది సాధించడానికే "శాంతిసేన" ప్రారంభించారు. కుల, మత, వర్గ పార్టీలకు ఇందులో స్థానం లేదు. ఇందులో కార్యకర్తలుగా చేరదలచిన భారతీయ, ప్రపంచ ఆలోచన తీరుతెన్నులు తెలిసి ఉండాలి. వివిధ సేవలలో వారికి శిక్షణ ఇవ్వాలి. ప్రతీ అయిదు వేల మంది ఒక కార్యకర్త ఉండాలని సర్వోదయమండలి అభిలాష. శాంతిసైనికులు తాము ఉండే ప్రాంతాలలో బాధానివారణకు తోడ్పడాలి. రోగులకు సేవ చేయాలి. సర్వోదయ సాహిత్యం పంపిణీ చేయాలి. ఈ విధంగా చేయడం ద్వారా వారు ప్రజల హృదయాలలో చోటుచేసుకోగలుగుతారు. వారి కుటుంబాలలో వ్యక్తులుగా వ్యవహరించగలుగుతారు. ఇటువంటి సేవలను కమ్యూనిస్టులైనా, సోషలిస్టులైనా హిందువులైనా, క్రైస్తవులు, మహమ్మదీయులైనా సర్వజనులు హర్షిస్తారు.

మొత్తం మీద భూదాన, గ్రామదాన ఉద్యమాలు ఒక అపూర్వ శాంతియుత సాంఘిక వ్యవస్థను (Peaceful Social Order) స్థాపించడానికి దారితీస్తాయని చెప్పడంలో సందేహం లేదు.

## పునర్నిర్మాణ కృషి

భూదాన, గ్రామదాన ఉద్యమాలు మొత్తం దేశమంతటా వ్యాపిస్తున్నాయి. ఉత్తరప్రదేశ్, హమీర్‌పూర్ జిల్లాలోని ఒక గ్రామం. మహారాష్ట్రలో "లోని" అనే గ్రామం, తమిళనాడులోని "బాట్లగుండు" అనే గ్రామం, ఒరిస్సా రాష్ట్రంలోని కోరాపుట్ జిల్లాలోని కొన్ని గ్రామాలు, గుజరాత్, రంగుపూర్ ప్రాంతంలోని కొన్ని గ్రామాలు - ఆదర్శ గ్రామ స్వరాజ్, గ్రామ సంఘాలుగా రిజిష్టరు అయినాయి. ఈ పునర్నిర్మాణ కృషి రంగంలో ప్రవేశించి ఏగ్రామానికాగ్రామం స్వయం పోషకత్వాన్ని సంపాదించుకొని పనిచేస్తున్నాయి.

దేశంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కొన్ని రాజకీయ పార్టీలు, భూ దాన, గ్రామదాన ఉద్యమాలకు ప్రోత్సాహమిస్తున్నాయి.

మొదటి పంచవర్ష ప్రణాళిక రిపోర్ట్‌తో భూదాన ఉద్యమ ప్రాముఖ్యాన్ని, భూమిలేని వ్యవసాయ కూలీలకు ఈ ఉద్యమం కలిగించే సదవకాశాలను పేర్కొనటం జరిగింది. మైసూరు రాష్ట్రంలో 1957 వ సంవత్సరంలో "యల్‌వల్" (Yelwal) గ్రామ దాన సమావేశంతో స్వర్గీయులైన డా॥ రాజేంద్రప్రసాద్, పండిత నెహ్రూ తదితర దేశ నాయకులు పాల్గొని గ్రామదాన, భూదాన ఉద్యమాల ప్రాశస్త్యాన్ని వాటి ఆశయాలను కొనియాడారు. అదే సమావేశంలో జాతీయ సమాజ వికాస ఉద్యమం, భూదాన గ్రామదాన ఉద్యమాలు సన్నిహిత సహకారంతో పనిచేయటం చాల అవసరమని పేర్కొనటం జరిగింది.

భూదాన మండలాలను (Bhoodan Boards) రాష్ట్ర ప్రభుత్వాలు స్థాపించి భూదాన ఉద్యమంతో పోగుచేసిన భూములను పేద ప్రజలకు పంచిపెట్టడం మొదలయిన పనులను రికార్డుల రూపంలో భద్రపరుస్తున్నారు. అస్సామ్, బెంగాల్, రాజస్థాన్, మహారాష్ట్ర, ఒరిస్సా, తమిళనాడు మొదలయిన రాష్ట్ర ప్రభుత్వాలు భూదాన ఉద్యమంలో దానం చేసిన భూముల యాజమాన్య హక్కుల మార్పిడిని గురించి శాసనాలను కూడ చేశాయి, గ్రామ దాన ఉద్యమ గ్రామాల పునర్నిర్మాణాభివృద్ధికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు గ్రాంట్లను, అప్పులకు మంజూరు చేస్తున్నాయి.

## సర్వోదయ పాత్ర

వినోబాభావే 1958 వ సంవత్సరంలో సమాజంలో అన్ని విధాల వెనుకబడినవారి సంక్షేమంకోసం ఒక కొత్తపద్ధతిని ప్రవేశపెట్టాడు. దానినే "సర్వోదయపాత్ర పద్ధతి" అని అంటారు. ఒక్కొక్క పాత్రను ప్రతీ ఇంటిలోను ఉంచుతారు. ఈ పాత్రను "సర్వోదయ పాత్ర"గా వ్యవహరిస్తారు.

ఈ సర్వోదయ పాత్రలో ప్రతీ కుటుంబ సభ్యుడు తనకుతోచిన దానాన్ని వస్తురూపంలోగాని, ధనరూపంలోగాని, అందులో ఉంచుతారు. ప్రతీ నెలగాని, ప్రతీ వారంగాని శాంతి సైనికులు ఆ సర్వోదయ పాత్రలను పోగుచేసి ఆ వచ్చిన ఆదాయాన్ని సర్వోదయ కృషికి వినియోగిస్తారు. ఈ పద్ధతిని గ్రామీణ ప్రాంతాలలోనేగాక, పెద్దపెద్ద నగరాలలో కూడ అవలంబిస్తున్నారు. అమెరికాలో నడుస్తున్న కమ్యూనిటీ ఛెస్టు ఉద్యమం (Community Chest Movement) కూడ ఈ సర్వోదయ ఉద్యమంవలె నడుస్తున్నది.

## సాంఘిక నైతిక మార్పులకై సర్వోదయం కృషి

ఆచార్య వినోబాభావే కాలినడకన భారతదేశమంతటా పర్యటించి సర్వోదయ తత్వాన్ని ప్రబోధించి ప్రజలలో సాంఘిక నైతిక మార్పులను తీసుకొనివచ్చాడు. సర్వోదయ సూత్రాలననుసరించి ప్రజలలో వ్యక్తిగత సమూహ, సాముదాయిక సమస్యలను నిర్మూలించవచ్చునని భావే ఉద్బోధించాడు. 1960 వ సంవత్సరంలో మధ్యప్రదేశ్‌లో వినోభా పాదచారియై భూదాన ఉద్యమాన్ని సర్వోదయ సిద్ధాంతాలను ప్రచారం చేశాడు. మధ్యప్రదేశ్‌లోని చంబల్ లోయ బందిపోటు దొంగలకు ప్రసిద్ధి. ప్రభుత్వం పోలీసుదళ సహాయంతో నిర్మూలించలేని ఈ బందిపోటు దొంగల సమస్యను నిర్మూలించడంలో వినోబా ఒక సరికొత్త అహింసాత్మక సర్వోదయ మార్గాన్ని అవలంబించి 20 మంది బందిపోటు దొంగల మనస్సులను మార్చి వారిని సంఘానికి సహాయపడేటట్లు ఉత్తమ పౌరులుగా తయారుచేశాడు. వీరికి చక్కని పునరావాస సౌకర్యాలను కల్పించి, వృత్తివిద్యలలో శిక్షణఇచ్చి వీరిని చక్కనిపౌరులుగా మార్చి సంక్షేమ కార్యకర్తలకు, ప్రభుత్వానికి, ప్రజలకు కనువిప్పు కలిగించి ఒక కొత్త మార్గాన్ని సృష్టించి మార్గదర్శకుడైనాడు.

## జయప్రకాశ్ నారాయణ కృషి

ప్రముఖ సర్వోదయ నాయకుడైన జయప్రకాశ్ నారాయణ్ 1972 సం॥ ఏప్రియల్ నెలలో మధ్యప్రదేశ్‌లోని ప్రముఖ బందిపోటు

దొంగల నాయకులను, వారి అనుచరులను మొత్తం 200 మందిని సర్వోదయ తత్త్వ ఆశయమార్గాలను అవలంబించటం ద్వారా మార్చివేసి ఆధునిక భారతదేశ చరిత్రకొక నూతన శకాన్ని సృష్టించిన ఘన విజయాన్ని సాధించాడు. ప్రజలు, ప్రభుత్వం సాధించలేని మహాకార్యాన్ని సర్వోదయ నాయకుడైన జయప్రకాశ్ నారాయణ సాధించి చరితార్థుడయినాడు.

ఈ విధంగా సర్వోదయ సిద్ధాంతాలు ఎంతో ప్రాశస్త్యాన్ని కలిగి, సాంఘిక సంస్కరణోద్యమంలో కూడ మార్గదర్శకమైన పాత్రను వహిస్తాయనడంలో సందేహంలేదు.

## అంతర్జాతీయ స్థాయిలో సర్వోదయం

సర్వోదయ తత్త్వం భారతీయులనుంచేకాక ఇంగ్లాండ్, రష్యా, అమెరికావంటి ప్రముఖదేశాల తత్త్వవేత్తలనుంచి కూడ గ్రహించడం వల్ల దానికి అంతర్జాతీయమైన ప్రపంచ కీర్తి సముపార్జించింది. ఎందువల్లనంటే గాంధీజీ సర్వోదయ సిదాంతాలకు భారతీయ గ్రంథాలకే కాకుండా రస్కిన్, టాల్‌స్టాయ్, తోరూ మొదలైన విదేశీమహాశయుల రచనలను కూడ ఆధారంగా జేసుకొని, రూపొందించటం జరిగింది.

అమెరికాలో స్వర్గీయ మార్టిన్ లూథర్ కింగ్ అనే ప్రసిద్ధ నీగ్రో నాయకుడు అమెరికా నీగ్రోజాతి ప్రజల పౌరసత్త్వ హక్కులకోసం పాటుపడ్డాడు. ఇతడు గాంధీమహాత్ముని అహింస, సత్యాగ్రహ, సర్వోదయ బోధనలను ఆధారంగా చేసుకొని నీగ్రోజాతి విమోచనోద్యమాన్ని బ్రహ్మాండమైన స్థాయిలో నడిపాడు. ఈ విధంగా సర్వోదయ సిద్ధాంతాలు అంతర్జాతీయరంగంలోకూడ ప్రముఖపాత్ర వహిస్తున్నాయి.

1951-64 సంవత్సరాల మధ్య కాలంలో ఎంతోమంది పాశ్చాత్యులను ఆకర్షించాయి. పాశ్చాత్య రాయబారులు, రాజనీతి ధురంధరులు, ఉన్నతాధికారులు మొదలయినవారే కాకుండా బౌద్ధులు, జైనులు, అహింసా తత్వాన్ని నమ్మిన ప్రజలందరూ ఈ ఉద్యమములో పాల్గొన్నారు. ఈ ఉద్యమ ప్రాశస్త్యాన్ని గురించి, వినోభాభావేను గురించి లెన్‌జాడెల్ వాస్టో (**Lenzadel Vasto**) మెనార్డ్ గ్రూమ్

(Donald Groom) హాలమ్ టెన్నిసన్ (Hallam Tennyson) డేనియల్ (Daniel) వంటి ఫ్రెంచి, ఇంగ్లాండ్, అమెరికా దేశస్థులయిన ప్రముఖ యాత్రీలకు పుస్తకాలను వ్రాశాడు.

నేడు పాశ్చాత్య దేశాలవారు విజ్ఞాన శాస్త్రాలలోను, రోదసీ యాత్రలలోను, పారిశ్రామిక, సాంకేతిక రంగాలలోను అత్యంత అభివృద్ధిని సాధించారు. అయినప్పటికిని, నేటి మానవుడు శాంతి సౌకర్యాలకేకాక మానసిక సంతృప్తి ఆనందాలకుకూడ దూరమైపోతున్నాడు. అందువల్ల ప్రపంచ దేశాలు సర్వోదయ, సత్యాహింసా సిద్ధాంతాలలోని విశ్వజనీన దృక్పథాన్ని ఉత్కృష్టతను అనతికాలంలోనే గుర్తించి సర్వోదయ మార్గాన్ని అనుసరిస్తాయనటంలో సందేహం లేదు.

## సర్వోదయం - సంఘ సంక్షేమ కృషి

సర్వోదయం ప్రజల చొరవను స్వచ్ఛందంగా పాల్గొనే విధానాన్ని ప్రోత్సహిస్తుంది. సర్వోదయంతో ఉపకార పరాయణత్వాన్ని విశ్వజనీనంచేసి సంపద కొందరి వ్యక్తుల చేతులలోనే కేంద్రీకృతం కావటం సాంఘికమైన నేరమనిచెబుతుంది. సర్వోదయం సత్యాహింసలు, నైతిక ఆధ్యాత్మిక విలువలకు ప్రాధాన్యమిస్తూ, రాజకీయ రహిత మార్గాన్ని అవలంబిస్తూ సాంఘిక సంక్షేమ సేవలవల్లనే సామాజిక మార్పును తీసుకొనివచ్చి సమాజ ఆర్థిక, సాంఘిక పరిస్థితులను పూర్తిగా మార్చివేసి ఒక నూతన సమాజాన్ని నెలకొల్పాలని ఆశిస్తుంది.

ఏదిఏమైనా సర్వోదయ ఉద్యమంలో శాస్త్రీయ సంఘసంక్షేమ కృషితత్త్వాన్ని, శాస్త్రీయ సంఘసంక్షేమకృషిలో సర్వోదయతత్త్వాన్ని, సరియైన సందర్భాలలో, రీతులలో చొప్పిస్తే రెండు క్షేత్రాలలోను మనం కార్యక్రమాలను చేపట్టగలం.

"నేను మీ కుమారుణ్ణి, మీ కుటుంబంలో ఒక సభ్యుడను, మీకు నలుగురు సంతానం ఉంటే నన్ను అయిదవవాణ్ణిగా భావించి భాగం ఇవ్వండి"—అని కొడుకు తండ్రిని అడుగుతున్నట్లు భూదాతలను వినోబాభావే మనస్సు స్పందించేరీతిలో భూదానాన్ని అర్థించేవాడు.

# BIBLIOGRAPHY


Asswy Publication — Social work Education and Development of Weaker Sections.

Gore, M.S. — Social Work and Social Work Education.

Govt. of India — Census India, 1981.

" — Date India, 1981.

" — Draft Five Year Plans.

" — Encyclopaedia of Social Work in India.

" — India, 1983.

" — Social Welfare in India.

" — Social Welfare Statistics.

Madan, G. R. — Indian Social Problems, Vol. 2.

Paul Choudhury, D. — A Hand Book of Social Welfare.

" — Child Welfare Manual.

Telugu Akademi — సంఘసంక్షేమ శాస్త్రం - కార్యక్షేత్రాలు.

" — చరిత్ర, తత్వం.

Wadia, A. R. — Handicapped Child.

" — History, Philosophy and Fields of Social Work.

**Journals**

1. Govt. of India — Social Welfare.

" — Yojana.

1. History and Philosophy of Social work in India
—A. R. wadia.

2. Indian Social Problems Volume I & II
—G. R. Madan.

3. Concepts and methods of Social work
—W. A. Fried lander.

4. Social work an Introduction to the field
—H. H. Stroup.

5. Social welfare in India
—Govt. of India Publications.

6. Excyclopaedea of Social work India - Volume I, II & III — Govt of India Publications.

7. Methods and fields of Social work in India
—K. K. Jacob.

8. Social work and Social work education
—M. S. Gore.

9. Govt. of India planning Commission
—Annual Plan Progress report - 1966-67
1967-68
1968-69

10. Social welfare in India — A. M. Majumdar.

11. A century of Social reform in India
—S. Natarajan.

12. A hand book of social welfare
—D. Paul choudary.

13. Child welfare mannual —D. Paul choudary.

14. Social work in India —S. K. Kinduka.

15. Voluntary Social welfare in India
—D. Paul choudary.

16. Scheme for the integrated education for handicapped children — Dept. of Social welfare, Ministry of education & Social welfare Govt. of India.

17. Social welfare in India —18th International conference on social welfare.

18. Directory of child guidance services in India —Child guidance clinic, Dept. of social work, Delhi school of social work.

19. Programme Planning in National Service Scheme —A manual.

20. Indian journal of youth affairs —Viswa yuvaka kendra.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 26 | సమాజిక శాస్త్ర | సమాజశాస్త్ర |
| 6 | 23 | సమూహాలు | సమూహాలు |
| 7 | 3 | వ్యకులందరిని | వ్యక్తులందరిని |
| 8 | 21 | అలవాటుచేరి | అలవాటుచేసి |
| 10 | 8 | బాలల | బాలలు |
| | 24 | తీసును | తీసుకు |
| 12 | 22 | ఆచార్య | ఆచార |
| | 23 | బావన | భావన |
| | 27 | పరిసితులే | పరిస్థితులే |
| 15 | 3 | వత్తి పరమైన | వృత్తి పరమైన |
| 17 | 15 | శాస్త్రీ | శాస్త్రీయ |
| | | ప్రయోకశాల | ప్రయోగశాల |
| 22 | 28 | చీరము | చరమ |
| 37 | 18 | 1898 | 1898 లో |
| | 26 | ఎక్కువ చేసింది | ఎక్కువగా కృషి చేసింది |
| 43 | 26 | 45 | 54 |
| 44 | 18 | బాంగాల్ | బెంగాల్ |
| 47 | 23 | రామశృష్ణ | రామకృష్ణ |
| 53 | 22 | గ్రామాంలో | గ్రామంలో |
| | 26 | పరుగు త్తుతూ | పరుగెత్తుతూ |
| 56 | 22 | కలశారు | కలవారు |
| 57 | 17 | ఉన్నాయి. నీ | ఉన్నాయి అనీ |
| 62 | 27 | 925 | 1925 |
| 74 | 18 | తోనుకావచ్చు | లోనుకావచ్చు |
| 81 | 20 | ఇవ్వమనికి | ఇవ్వడానికి |
| 83 | 5 | మారు | మార్పు |
| 85 | 8 | అవగాశం | అవకాశం |
| 86 | 7 | సాకులర్ షిప్ | స్కాలర్ షిప్ |
| | 17 | సాతం | శాతం |
| 95 | 13 | రూప్ | లూప్ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 102 | 2 | Moratity | Morality |
| 108 | 15 | ప్రజాసౌమ్య | ప్రజాస్వామ్య |
| 115 | 15 | Vagraints | Vagrants |
| 236 | 15 | సంవత్సరంగా | సంవత్సరం |
| 240 | 22 | మండలములను | మండలులను |
| 241 | 13 | ఆక్జిలరీ క్రెడిట్ కోర్సు | ఆక్జిలరీ క్రెడిట్ కోర్స్ |
| 248 | 26 | గడింలిన | గడించిన |
| 254 | 8 | (Dirabality) | (Disability) |
| 255 | 13 | హాకుకున్నది | హాక్కున్నది |
| | 21 | Unit | unfit |
| 260 | 26 | Diseare | Disease |
| 261 | 8 | Lass | Loss |
| 265 | 26 | ఆధ్వర్యవంలో | ఆధ్వర్యంలో |
| 266 | 1 | Intigration | Integration |
| 270 | 20 | ఉద్యగం | ఉద్యోగం |
| 271 | 19 | ట్రాక్ మిా | ట్రకోమా |
| | 24 | అంగబలం | వికలాంగులు |
| 272 | 15 | Fingures | Fingers |
| | 21 | అత్యుత్తమైనాధన మైన సరిదిద్దటం తరవాత | ఆధునిక వైద్య విధానం ద్వారా చూపును సరిదిద్దిన తరవాత |
| 273 | 2 | గ్లాక్ మా | గ్లాకోమా |
| | 22 | Visullv | Visually |
| 274 | 12 | బ్రెయిల్ | బ్రెయిలీ |
| | 14 | బ్రెయిల్ | బ్రెయిలీ |
| | 15 | బ్రెయిల్ | బ్రెయిలీ |
| 277 | 19 | Cronic Shinositics | Chronic Sinusitis |
| | 20 | Malnurition | Malnutrition |
| | 22 | మేనంజైటిస్ (Menimgitis) | మెనింజైటిస్ (Meningitis) |
| | 24 | Smalll Pox | Small Pox |
| | 25 | Syphils | Syphilis |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 26 | Maleria | Malaria |
| 279 | 27 | Polsy | Palsy |
| 280 | 5 | Jaints | Joints |
| | 20 | Philathropists | Philanthropists |
| 281 | 5 | Orthopedics | Orthopaedics |
| | 7 | సామూహింగా | సామూహికంగా |
| | 10 | సామానం | సామాన్య |
| | 19 | థెదపీ | థెరపీ |
| | 23 | హాబిలిటేషన్ | రిహాబిలిటేషన్ |
| 283 | 11 | ప్రక్రితాను | ప్రక్రియను |
| | 13 | ఇది ఇది అల వస్చుకొనే ప్రవర్తనలో చెరటంలో కలసి ఉంటుంది | ఈ వాక్యం తొలగింపబడినది |
| | 19 | Jarman Mijals | German Measles |
| 284 | 8 | అవకపోతే | ఆడకపోతే |
| | 9 | దెబ్బతినే | దెబ్బతినే |
| | 18 | Cizarian | Caesarean |
| 285 | 6 | Montissori | Montessori |
| 290 | 2 | Alwellings | Dwellings |
| 292 | 15 | Plat | Plot |
| 301 | 21 | Emvironmental | Environmental |
| 302 | 23 | Programe | Programme |
| 306 | 2 | Invetsment | Investment |
| 309 | 5 | Patten | Pattern |
| | 20 | సార్వజనక | సార్వజనిక |
| 311 | 7 | Elemetary | Elementary |
| 316 | 9 | Inustructor | Instructor |
| 322 | 22 | Trible | Tribal |
| 323 | | Apprantice-ship | Apprenticeship |
| 330 | 7 | Perspectie | Perspective |
| | 13 | Enlighteneal | Enlightened |
| 331 | 5 | Seculaism | Secularism |
| 335 | 12 | Teritory | Territory |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 335 | 16 | Teritory | Territory |
| 337 | 12 | Rationdisa-tional | Rationalisation |
| 340 | 22 | Prome | Prone |
| 362 | 3 | Diseares | Diseases |
| | 16 | Homeio | Homoeo |
| 363 | 8 | Midvive | Midwives |
| | 23 | మెడిసిల్ | మెడిసిన్ |
| 366 | 23 | ప్లాసోడియమ్ | ప్లాస్మోడియమ్ |
| 367 | 13 | Esterun | Eastern |
| 370 | 1 | రోగుల | రోగులు |
| | 14 | Veneiral | Venereal |
| 371 | 22 | Impairment | Impairement |
| 377 | 8 | Malhutri-tion | Malnutrition |
| 386 | 6 | Spansar | Sponsor |
| 393 | 10 | Subsiduary | Subsidiary |
| 394 | 8 | Horigontal | Horizontal |
| | 21 | Fradication | Eradication |
| | 26 | Impairment | Impairement |
| 397 | 2 | Cences | Census |
| 403 | 22 | Admisory | Advisory |
| | 28 | Liaisan | Liaison |
| 405 | 12 | డిప్రెస్ట్ | డిప్రెస్డు |
| 411 | 4 | యూర్జినల్ | మార్జినల్ |
| | 17 | Stategy | Strategy |
| 417 | 27 | Promisions | Provisions |
| 423 | 10 | Infact | Infant |
| | 23 | Outh | Youth |
| 424 | 14 | మండలాలను | మండలులను |
| 425 | 25 | Juvemile | Juvenile |
| 437 | 14 | Untouchbility | Untouchability |
| 465 | 13 | Chathalic | Catholic |
| 467 | 12 | వోర్స్ | కోర్స్ |